## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ 64 కళలు వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) 64 కళలు వెబ్ సైట్: http://www.64kalalu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

# 64 కళలు వెబ్ సైట్

## http://www.64kalalu.com



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :2 సంచిక :3 జనవరి 2012

కాల'గతి'లో ప్రతీ మనిషికి
తాను సాధించిన ప్రగతికి ప్రతీకగా నిలిచిన ప్రతీక్షణం
తనకు ఓ న్యూ'తన' సంవత్సరం

HAPPY NEW YEAR
2012

ముఖచిత్రం చిత్రకారుడు : ఆత్మకూరు రామకృష్ణ



ఆనందాన్ని పంచే పండుగ - సంక్రాంతి

బాలీవుడ్ దిగ్గజం
దేవానంద్



ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన
భావాలు వారి సొంత భావాలు మాత్రమే

సంస్కృతి

# ఆనందాన్ని పంచే పండుగ - సంక్రాంతి

భారతీయ సంస్కృతి-సాంప్రదాయాలకు ఆనవాళ్లు మన పండుగలు. మనం జరుపుకొనే ప్రతి పండుగకి ఒక్కొక్క విశిష్టత ఉంది. మన పండుగలు మన భారతీయ జీవనశైలిని, మనసంస్కృతిని, విశిష్టతను తెలయజేస్తాయి. మన పండుగలకు ఒక అర్థం-పరమార్థంతో పాటు ప్రకృతి, వైద్యం, ఆరోగ్యానికి సంబంధించిన అనేక అంశాలు వీటిలో ఇమిడి ఉన్నాయి. ఇన్ని విశిష్టతలు ఇమిడి ఉండటం వల్లనే ఈ నాటికి మన పండుగలు ప్రత్యేకతలను సంతరించుకొంటున్నాయి.



- విష్ణుభొట్ల రామకృష్ణ

తెలుగువారికి నూతన సంవత్సరం అంటే ఉగాదితో ప్రారంభమవుతుంది. కాని నేడు పరభాష, పరసంస్కృతి పట్ల మక్కువ ఎక్కువ వాటినే మనం ఆచరిస్తున్నాం. అలా ఆచరించే వాటిలో నూతన ఆంగ్ల సంవత్సరం జనవరి 1 . ఈ నెలను మన తెలుగు నెలల ప్రకారం 'పుష్యమాసం' అంటారు. ఈమాసంలో వచ్చే పండుగ 'సంక్రాంతి.

పుష్యమీ నక్షత్రం పౌర్ణమినాడు వచ్చే మాసం పుష్యమాసం. ఈ మాసంలో వచ్చే పండుగను పెద్ద పండుగ అంటాం. అంటే



భోగి, సంక్రాంతి, కనుమ అని మూడు రోజులుగా జరుపుకొనే పండుగు పుష్యమాసం నాటికి పంట ఫలం ఇంటికి వస్తుంది. గాదెలు ధాన్యంతో నిండి వుంటాయి. ఇంటిలో ధాన్యం నిల్వ ఉండటం అంటే సిరిసంపదలనిచ్చే లక్ష్మీదేవి వచ్చినట్లేకదా! ఆ లక్ష్మీదేవిని మన ఇంటికి ఆహ్వానించి మేళతాళాలలో ఆట-పాటలతో పిండివంటలతో ఆహ్వానిస్తాం. సంబరాలు జరుపుకొంటాం.

ఈ ధనుర్మాసం మొదలైనప్పటి నుండి ముప్పైరోజులు నియమ, నిష్టతో గోదాదేవి పాశురాలు పాడుతూ శ్రీరంగనాధుని అర్చించింది. ఆమె వ్రతం ఫలించి శ్రీరంగనాధుని భోగినాడు కళ్యాణమాడింది. ఆమె సాక్షాత్తూ భూదేవి అవతారమైన ఆండాల్ (గోదాదేవి) భోగమందిన శుభధినమే భోగి. అందుకే ధనుర్మాసం మొదలైనప్పటి నుండి పండుగనెల ప్రారంభం అయినది అంటారు. ఇంటిముందు రకరకాల ముగ్గులు వేసి రంగవల్లులు దిద్ది, ఆవుపేడతో గొబ్బెమ్మలు చేసి వాటిని గుమ్మడిపూలతో అలంకరించి రంగవల్లుల మధ్య పెట్టి గొబ్బిపాటలు పాడతారు. ఆ గొబ్బెమ్మను గోదాదేవిగా భావించి "సుబ్బీగొబ్బెమ్మ, శుభము లీయవే, చేమంతి పూవంటి చెల్లెల్నివ్వవే, తమ్మిపువ్వంటి తమ్ముణ్ణివ్వవే, మొగలిపువ్వంటి మొగుణ్ణివ్వవే అంటూ పాటలు పాడుతారు. ఇవేకాక హరిదాసు, హరికర్తీనలు, గంగిరెద్దులనాడించే వాళ్ళు,

చెంచులు, పగటి వేషగాళ్లు, వీధిబాగవతార్లు బుడబుక్కలవాళ్లు, జముకుల వాళ్లు, జంగమదేవర్లు ఇంటింటికి వచ్చి తమ విద్యలను ప్రదర్శించి, ఆశీర్వాచనాలు పలుకుతారు. ఈ సంక్రాంతి మన సంస్కృతిని ప్రతిబింబించే పండుగ.

భోగినాడు తెల్లవారు జామున లేచి ఇంటిలోని పాతసామాను, పేరుకుపోయిన చెత్త, చెదారం భోగిమంటల్లో వేస్తారు. చలికాలం కావటం వల్ల అందరూ చలిమంటలు కాచుకొంటారు. భోగినాడు నువ్వుల నూనెతో స్నానంచేస్తారు. నువ్వులతో చేసిన బెల్లం అరిశలను తింటారు. కారణం నువ్వులు చెల్లం వంట్లో వేడిని కలిగిస్తాయి. సాయంత్రం పిల్లలకు భోగిపళ్లుపోసి చుట్టు పక్కల ముత్తైదువులకు తాంబూలాదులిస్తారు. ఈ పండుగ పుణ్యామా అని ఆడవారంతా ఒక్కచోట కలుస్తారు. పూర్వం రోజులలో పండుగకు పదిరోజుల ముందే ఆడవారంతా కలిసి పిండివంటలు తయారు చేసేవారు. కాని నేడు ఉమ్మడికుటుంబ వ్యవస్థ నశించిపోవటం. ఉద్యోగ వ్యాపారరీత్యా వేరొక






నగరాలకు, దేశాలకు వలసపోవటంతో హెూమ్‌ఫుడ్స్ వంటకాలతో సరిపెట్టుకోవలసి వస్తోంది.

సంక్రాంతి పండుగ అంటే కొత్త అల్లుళ్ల పండుగ. కొత్తగా పెళ్లయిన జంటలు సరదాలు, మరదళ్ల కేరింతలు, చిలిపిపనులతో పట్టుపావళ్లు, పట్టుచీరలు, మట్టిగాజులు, కాలిమువ్వల సవ్వడిలతో ఎటుచూసిన సందడి వాతావరణం కనబడుతుంది. మూడవ రోజైన కనుమ ఈ రోజు మనం జరిపే వేడుకల్లో పశువులను కూడ చేరుస్తాం. ఈరోజు పశువులను అందంగా అలంకరించటం గోమాతలను పూజించటం వంటివి చేస్తాం. ఆనాడు పశువులను పనిలోకి రానివ్వరు. కనుమనాడు మాంసాహారం తినేవారు ఖచ్చితంగా వండుకుతింటారు. ఈ పండుగరోజు ధాన్యం, కంకులు వాకిట్లో కట్టి పిట్టలకు ధాన్యం అందేట్లు చేస్తారు. కనుమనాడు వాకిట్లో రథం ముగ్గు వేస్తారు. పూర్యగమనానికి ఇది సంకేతం. ఇలా అనేక అర్థాలు-పరమార్థాలు దాగివున్నాయి మన సంక్రాంతి పండుగలో

ఎన్నో విశిష్టతలు, మరెన్నో ఆరోగ్య, వైజ్ఞానిక సంపదలు దాగిఉన్న ఈ సంక్రాంతి పండుగను మనందరం ఆనందోత్సాహాలతో, ఉల్లాసంగా జరుపుకుందాం, ఆ దైవ అనుగ్రహం పొందుదాం.



# 'చిత్ర' మైన జీవితం

Part-9

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...**





email: balisankar@gmail.com

నార్ల వెంకటేశ్వరరావు గారు చెప్పినట్టే ఆంధ్రజ్యోతి ఆఫీసు (విజయవాడ)లో నేను చేరిన నెల తరువాత అనుకుంటాను, ఆయన విజయవాడ ఆఫీసుకు వచ్చారు. కావడానికి ఆయన ఈ పత్రిక ఎడిటర్ గారనీ హైద్రాబాద్‌లో ఉండేవారు. ప్రతి రోజూ దినపత్రిక ఎడిటోరియల్ అక్కడ్నించే రాసేవారు. ఆయన దస్తూరి బ్రహ్మ లిపి అని, ఎవరికీ అర్థంకాదని ఇద్దరే ఇద్దరు కంపోజిటర్లకు మాత్రమే అర్థంఅవుతుందని ఆఫీస్‌లో చెప్పుకునేవారు. విజయవాడలో రెసిడెంట్ ఎడిటర్‌గా నండూరి రామమోహనరావుగారు పనిచేసేవారు.



నార్ల వారు విజయవాడ ఆఫీస్‌కి వచ్చి ఎంతసేపయ్యిందో తెలీదు. నాకు 'బోయ్'తో కబురుచేశారు. ఆయనకు అందులోనే పర్సనల్ రూం ఉండేది. ఏదో బొమ్మకు స్కెచ్ వేసుకుంటున్నాను. ఆ బోయ్ వెనకే చేతిలోని ఎరైజర్, పెన్సిల్‌తో వెళ్ళాను ఆయన రూమ్‌లోకి.

'ఎలా ఉందీ ఆఫీసు? నీకేమైనా ఇబ్బందిగా ఉందా??" అన్నారు.

"అంతా బాగుంది!" అన్నాను నవ్వుతూ

నా చేతిలోని ఎరైజర్, పెన్సిల్ చూశారు. సరదాగా అన్నారు. జర్నలిస్ట్ అన్నవాడు నోట్ బుక్, పెన్నునూ ఎలా వదలకూడదో, ఆర్టిస్ట్ పెన్సిల్, ఎరైజర్ ఎప్పుడూ వదలకూడదు. ఎప్పుడూ అది నీ చేతిలోనే ఉండాలి అన్నారు.

నవ్వుకున్నాను. ఆ పెద్దాయన ఆశీర్వాదమే నాకు గుండెనిండా బలం. సంతోషంగానే నా సీట్లోకి వచ్చేశాను.

విషయం తెలుసుకొని పురాణంగారూ సంతోషించారు.

విజయవాడ మొగల్రాజపురంలో నిమ్మతోట దగ్గరున్న ఎర్రమేడలో ఒకే కాంపౌండ్‌లో ఉన్న శర్మగారి పక్క పోర్షన్‌లో దిగామని చెప్పాను కదా! నాకు విజయవాడ ఎండలు కొత్త. ఏదో కొంచెం తెలుసుగానీ మొత్తం మకాం ఇక్కడే పెట్టడం వల్ల దీని తడాఖా ఏమిటో తెలుస్తోంది. ఇంత దారుణమైన ఎండలు విశాఖపట్నంలో గానీ, పుట్టి పెరిగిన అనకాపల్లిలో గానీ ఎరుగను!. ఇప్పుడు మేమున్న



బొమ్మ గీయించి, దానికీ పబ్లిసిటీ స్టంట్ ఇచ్చేవారు. ఇక ఆ తరువాత సీరియల్ సాగినన్నాళ్లు బొమ్మలు నావే అంటే "ఘోష గోవిందరాజులదీ– ముదుపు వెంకటరమణమూర్తివీ" అన్నట్లుండేది. ఆ విషయమే పురాణంగారికి ఒకసారి అడిగాను. నీకప్పుడే పేరు మహా ఇదిగా ఉందే అన్నారు. ఊరుకున్నాను– దీనికి సమాప్తే ఆ తరువాత రోజుల్లో ఒకసారి జరిగింది. అది ఆ తరువాత చెప్పుకుందాం!

ఒకరోజు రాత్రి రెండు గంటలకు శర్మగారు– రచయిత ఆదివిష్ణుగారు పీకలమొయ్యి తాగి రిక్షా దిగారు. ఇక గోల మొదలు. పోతాను అని ఆ రిక్షావాడు. డబ్బులు ఇమ్మంటాడు. నేను రిక్షా ఎక్కుతానుగా... అక్కడిస్తానంటాడు ఆదివిష్ణు. "చూడు ఆదివిష్ణూ అంత అడ్వాన్స్ యద్దనపూడికి ఇచ్చామయ్యా. ఒక్క కాపీ అంటే ఒక్క కాపీ అన్నా పెరగలేదు. బూడిదలో పోసిన పన్నీరయ్యిందనుకో... నువ్వు మొదలపెట్టు. మంచి సీరియల్. ఒకే. ఓకే అంటారు శర్మగారు

"రేపు మాట్లాడుకుందాం లెండి. వెళ్లి పడుకోండి" అంటాడు ఆదివిష్ణు. ఆదివిష్ణుకి ఎంత కుంభాభిషేకం జరిగినా తొణకుదు, బెణకుదూ అని విన్నాను.

"ఇపుడే మాట్లాడుకుందాం– చచ్చిపోతున్నానయ్యా– ఒక్క కాపీ అంటే ఒక్క కాపీ అన్నా పెరగలేదంటాడు శర్మ".

"బాబూ! బయలుదేరండి అంటాడు రిక్షావాలా!"

పోయిపడుకోండి అంటాడు ఆదివిష్ణు. ఇద్దరూ రిక్షా చుట్టూ తిరుగుతున్నారు. శర్మగారు ఆదివిష్ణు చేయి వదలడంలేదు. కాళు

ఇంటికి అన్ని పక్కలా ఎండ పొడ తగులుతుంది. గోడలు కాలిపోతుండేవి. ఆ ఎండలకు ఆ మేడ మీద పడుకోవాలంటే నాలుగైదు బకెట్లు నీళ్లు పోయాలి. అలా పోసినా చల్లబడుతుందన్న గ్యారంటీ లేదు. ఏ తెల్లవారు ఝామునో నిద్రపట్టేది. ఇంతలో తెల్లవారిపోయేది.

ఇవన్నీ ఒక ఎత్తయితే శర్మగారు తెల్లవారుఝామున ఏ మూడింటికో రిక్షా దిగేవాడు మత్తులో తూలుతూ... ఇక కేకలు ఈయన తాగుతారని తెలుసుగానీ ఇంత దరిద్రమని తెలీదు. ఈ ఎడిటర్లకు ఏది బలహీనతో తెలిసికొని అందులో తలమునకలుగా దింపడం ఈ రచయితలకు అలవాటేగా!

యద్దనపూడి సులోచనారాణి సీరియల్ నవల (పేరుగుర్తులేదు) వీక్లీలో మొదలయ్యింది. ఆరువారాల ముందు నుండీ పబ్లిసిటీ ఇస్తారు కాబట్టీ అదీ అయ్యింది. అయితే ఇప్పటికి మూడువారాల నుండి సీరియల్ నడుస్తున్నా జనానికి పట్టినట్టుగానీ, సర్క్యులేషన్ పెరిగినట్టుగానీ జాడేంలేదు. ఇలాంటి సందర్భంలో బాపుగారి చేత మొదటి వారం

నొప్పిపెట్టి రిక్షావాలా ఆ రోడు మీద కూచున్నాడు. నాకూ మా ఆవిడకూ నిద్రలు లేవు. పిట్టగోడకు చేరబడి ఈ నాటకానికి తెరఎప్పుడు పడుతుందా అని చూస్తున్నాం. ఆ తరువాతెప్పుడో శర్మగారు మెట్లెక్కారు. ఆరిక్షా వెళ్లిపోయింది. కొంచెం కునుకతీసామో లేదో తెల్లవారిపోయింది.

మరోసారి ఇలాగే తాగివచ్చారు. మళ్లీ మామూలే. అయితే ఈ ట్రిప్‌లో డోస్ తక్కువగా ఉన్నట్లుంది. రిక్షాలో ఉన్నవారెవరో "అటు మెట్లున్నాయి– జాగ్రత్తగా వెళ్లండి శర్మగారూ మరి మేం వెళతాం గుడ్‌నైట్ అంటున్నారు". ఆ రిక్షా వెళ్లిపోయింది. మెట్ల పక్క లైట్లున్నాయి. అయితే ఆయనిది తాగిన మైకం. కాలు ఎత్తి పై మెట్టుమీద పెట్టలేకపోతున్నారు. చిరాకు వస్తోంది కాబోలు. "మెట్టుకీ మెట్టుకీ మధ్య మెట్టెందుకండీ! వీడి శ్రాద్ధంలా కట్టేడు కొంప"న్నాడు.

నేనూ, మా ఆవిడా నవ్వుకున్నాం.

రావిశాస్త్రిగారు విజయవాడ వచ్చినట్టు తెలిస్తే పురాణంగారి సతీమణి సీతగారు 'గయ్'మనేది. ఆయనవచ్చేరని తెలిసి (వారి ఫ్రెండ్స్)

మరో నలుగురు చేరేవారు. వారి వారి పేర్లేమిటో ఇక్కడ వద్దనుకొండి. రాత్రికి సీసాల పండగ. ఆ సాయంకాలం శర్మగారు ఇక ఇంటికి రారు. ఆఫీస్ నుండి తిన్నగా హొటల్ రూంకే. "శర్మగారు లుంగీ ఇమ్మన్నారమ్మా" అని ఆఫీస్‌బోయ్ సాంబశివరావు సీతగారిని అడిగితే చాలు, ఆమె పసిగట్టేసేది. "రావిశాస్త్రి వచ్చాడా! మూడురోజుల తరువాతే ఈ పెద్దమనిషి ఇంటికి రావడం" అని గొణుక్కొనేది. మిగిలిన అందరికీ లుంగీలంటే సరేసరి. లేకపోతే ఏదన్నా బట్టలషాపులో చవక రకంవి–తడిపితే మోకాళ్లవరకూ పోయేవీ తెప్పించుకొనేవారు. రాత్రి మధుపానసేవలో ఎవడి లుంగీలు ఎవరి మొలమీదా ఉండవు. అంతా సాహితీ చర్చే. చివరకి మిగిలేది ఏమంటే! తెల్లారే సరికి దుప్పట్లు లేని మంచాలు... మంచం క్రింద సీసాలూ... లుంగీలు లేని దిశమొలలూ.

ముందుగా ఎవడికి తెలివివస్తే... వాడు పక్కవాడికిందనున్న (మొలకున్న) లుంగీలాగి వాడి మొలకు చుట్టుకుంటాడు. అందరికీ తెలివి వచ్చిన తరువాత ఒకటే నవ్వులు– అ లుంగీ నాది – ఈ లుంగీ నీది. భలేగా తారుమారు అయ్యాయే అని.

మందు దిగిన తరువాత 'మూడ్' సరిగ్గా ఉంటే ఆఫీస్‌లో శర్మగారు. చెప్పే సంగతులివి. మూడురోజుల తరువాత ఆఫీసుకి చేరడం, ఏదో గొప్ప విషయం ఈ మిత్రులతో చర్చించినట్టు తాగుబోతు ముఖంపెట్టి చెప్పడం. మేం వినడ ం మామూలే! అయితే శర్మగారికి తాగుడు పెద్దగా సహించదు (హెల్త్ పర్మిట్ చెయ్యదు) కాబట్టి గొంతు పగిలేట్టు తన కేబిన్‌లో దగ్గడం– అది రీసౌండ్ ఇవ్వడం. ఆయన ముఖం ఎఱ్ఱబారి, గొంతు పగులుతుందా అన్నంత బాధ. హేంగోవర్‌లో తలనొప్పి. తలనొప్పిగా ఉందని మాకు 'కహానీలు' వినిపించి. విక్స్‌బామ్‌తో నుదురు రుద్దుకోవడం, దగ్గుకి గ్లైకోడిన్ తాగడం ఇదే పెద్ద ఫార్స్. దగ్గడం వల్ల కేబిన్ అంతా కంపు. ఆయన దగ్గు ఆఫీస్ కింద వరకూ వినిపించడం వల్ల ఆఫీస్ వర్కర్స్ మమ్మల్ని పిలిచి "ఆక్షేషియన్ కుక్కేమిటో తెగ అరుస్తోందీ– రాత్రి మందు ఎక్కువయ్యిందా" అని వెటకారాలు ఆడడం.

ఆయనకు ముందు ఎక్కువయి ఇంటికి చేరి ఇంట్లోనే గుమ్మం ముందు కక్కిన రోజులున్నాయి. అది మా వాకిటికీ పక్కనుండి మెట్ల మీదుగా కిందకు వెళుతూ దరిద్రపు వాసన. సీతగారికీ విసుగు. ఆయనకు వారంరోజుల్నుంచీ వంట్లో బాగాలేదని విషయాన్ని కప్పిపెట్టడం. సీతగారూ మా ఆవిడా స్నేహితులు. కానీ ఒక సంవత్సరమంతా ఎలాగో ఓపిక పట్టాం. శర్మగారి రెండో అమ్మాయి శారదా, మా అమ్మాయి స్నేహితులు. వారి ఇంట్లో అటూ ఇటూ ఆటలుగా పరుగులెత్తుతూ శర్మగారు కూచున్న బల్లతన్నేయడం బల్లమీదున్న మంచినీళ్ల గ్లాసూ, వారు తినబోయే ఉప్మా ప్లేటూ దూరంగా జరిగిపోవడం, 'నెమ్మదర్రా' అని ఆయన వాటిని దగ్గరిగా లాక్కోవడం. ఇవన్నీ తమాషా విషయాలు– మా అమ్మాయి చిన్ననాటి ముచ్చట్లు. ఆ మధ్య మా అమ్మాయి అమెరికా నుండి ఫోన్ చేసి, ఏదో నెట్ మాగజైన్‌లో శర్మగారు మందుకొట్టి మాంసం తినేవారని చదివేనని చెబుతూ "శర్మగారు తాగితే తాగారుగానీ ఆయన ఏనాడూ మాంసం తినిన సూచనలు లేవు". అని బాధపడుతూ చెప్పింది. ఈ మాటతో నేనూ ఏకీభవిస్తాను. ఆయనకింద ఎన్నో సంవత్సరాలు పనిచేశాను. ఆ సంగతి తెలియదా!

మేం ఇల్లు మారి లబ్బీపేట వెళ్లిపోయాం. నా ఆఫీస్‌కీ, పిల్లల స్కూలుకీ దగ్గరగా ఉంటుందని ఆ పని చేశాను. ఆఫీస్ టైమంతా ఆఫీస్‌లోనే గడిపి ఇంటికి రాగానే ఏదన్నా ప్రయివేట్ వర్క్ ఉంటే చేసేవాడిని. ఒక్కోమారు ఆఫీస్‌లోని వర్కు పెరిగిపోతే (కామిక్ స్ట్రిప్స్ వంటివి) ఆ కాయితాలు (డ్రాయింగ్‌షీట్లు) ఇంటికి తెచ్చుకొని, ఇంట్లోనే నా పర్సనల్ రిఫరెన్స్‌లు తిరిగేసుకుంటూ వాటి ఆధారంగా బొమ్మలు గీసి శర్మగారికి సకాలంలో ఇచ్చేవాడిని. ఎంతో కష్టపడి దాచుకున్న నా రిఫరెన్స్ బుక్స్ ఆఫీస్ సొరుగులో పెడితే పోతాయన్న భయం. అలా నేను ఒకమారు ఓ షీట్‌ను (అర తావుపేపర్) ఇంటికి తెస్తున్నాను. అది మేనేజర్ చూశాడు. నేను ఆఫీస్ కాయితాలు ఇంటికి ఎత్తుకుపోతున్నానని శర్మగారికి రిపోర్ట్ చేశాడు.

ఈ సంగతి ముందుగా నాకు తెలియదు. నేను బొమ్మ పూర్తి చేసి మరసటి రోజు శర్మగారి కివ్వబోతుంటే ఆయన చెప్పారు. విషయం



వివరించాను. ఆయన సిగ్గుపడ్డాడు. అసలు అప్పటికే ఆ ఆఫీస్‌లో మాకేం స్టేషనరీ కొనలేదు. అంతా మా పర్సనల్‌వి ఉపయోగించాం. ఒక పెన్సిల్‌కీ, రబ్బర్‌కీ గతిలేదు. తరువాత ఈయన మేనేజర్ని కలుసుకొని విషయం చెప్పడం చెత్తరకం పేపర్ ఆయనకొనడం అన్నీ జరిగేయనుకోండి. కానీ అవి ఆర్టిస్ట్‌లకు ఉపయోగపడాలి కదా! అదేంలేదు. ఇక్కడొక విషయం చెప్పాలి.

ఒకరోజు ఆఫీస్‌లో నా సీట్లో కూర్చొని వర్క్ చేసుకొంటున్నాను. కింద బైండింగ్ సెక్షన్‌లోని కుర్రాడు. పేరు తెలియదు, మెల్లకన్ను, నుదుట ఎప్పుడూ బొట్టుతో ఉండేవాడు .నాదగ్గరకు వచ్చాడు. ఏదో చెప్పాలని ఉంది. చెప్పడు. అలా నా వేపు చూస్తాడు. విషయమేమిటని అడిగాను. "సార్ మా ఫ్రెండ్ ఒకాయనకు కటింగ్ మిషన్ ఉంది. ఎవరో డ్రాయింగ్ షీట్లు వంటివి తెచ్చి ఆయనతో కటింగ్ చేయించారు. పేపరు తీసికెళ్లలేదు. డబ్బు ఇవ్వలేదు– ఆ పేపరు ఆయనకు పనికిరాదు. అలా వదిలి సంవత్సరం పైగానే అయ్యింది. మీరు కొంటారా? అనడిగాడు. నాకు డ్రాయింగ్ పేపర్ అవసరమే. కానీ నాకు అది ఉపయోగపడాలి కదా! చిన్న ముక్క చూపించమన్నాను. జేబులో దాచిన పేపర్ ముక్క బయటకు తీసి చూపించాడు. ఇంక్‌తో టెస్ట్ చేశాను. బాగుంది. మా ఇంటికి సాయంత్రం తెమ్మనమని చెప్పాను. అలాగే నాలుగు పెద్ద పెద్ద కట్టలు తెచ్చాడు– డబ్బులు ఇచ్చేశాను. కేవలం రెండు వందల రూపాయిలు – ఎక్కీ తొక్కీ ఆ పేపర్ ఐదు సంవత్సరాలు వాడాను–బ్రష్, కలం ఎలా వాడినా పేపర్ భలేగా పనిచేసింది. ఆఫీస్ వారిచ్చిన దరిద్రపు పేపర్ పక్కన పడేసి, వారికి ఈ పేపర్ వాడేను ఆ మేనేజరే దొంగ! నేను కాదు...

నేను సాయంకాలం పూట ప్రయివేట్ వర్క్లు చేస్తున్నానని చెప్పాను కదా! అలా ఆ వర్క్లు పూర్తయితే ఏలూరురోడ్‌కు పోయి ఆయా పబ్లిషర్స్‌కు ఆ వర్క్లు ఇచ్చేసేవాడిని. లేకపోతే వారే సాయంకాలానికి మా ఇంటికి వచ్చేవారు. ఇది నా దినచర్య. అవసరం బట్టి రెండు రోజులకొకమారన్నా ఏలూరురోడ్ వెళ్లేవాడిని. ఆ పబ్లిషర్లకు ఈ విషయం ఎంత అలవాటయ్యిందీ అంటే నా కోసం ఎదురుచూసేవారు. అలా ఏదో ఒక బుక్‌షాపులో నేను కనపడ్డం వల్ల చాలమందితో పరిచయం కలిగింది. బొమ్మలు నాతో గీయించడం, రచనలు గురించి చర్చిండం చేసేవారు. పామర్రు నుంచి అనుకుంటాను, ఒక రిటైర్డ్ టీచర్ వచ్చారు. ఆయన పిల్లలను దృష్టిలో పెట్టుకొని భాష గురించి, పూలు పలకడం గురించి చక్కటి పుస్తకం తయారుచేసి తెచ్చారు. ఒక పబ్లిషర్‌కి అది నచ్చలేదు. తిరగకొడుతున్నాడు. ఆ సమయంలో అనుకోకుండా నేను వెళ్లాను. ఆ టీచర్‌గారు పేరు కస్తూరి నరసింహమూర్తిగారనుకుంటాను. ఆయన ముఖం వాడిపోయి ఉంది. స్క్రిప్టును చేతిలోకి తీసుకొని తిరగేశాను. బాగుంది కదా! అన్నాను. పబ్లిషర్ బుర్రలో ట్యూబ్‌లైట్ వెలిగింది. "మీరు బొమ్మలు వెయ్యండి చూదాం" అన్నాడు. రచయిత ముఖం వెలిగింది. నేను లోన బొమ్మలూ, కవర్ డిజైనూ వేసి ఇచ్చాను. అది ఆ తరువాత ఎన్నో ప్రింట్‌లకు నోచుకుంది. ఆ పబ్లిషర్‌గారే కావాలని మరొక పుస్తకం రాయించారు ఆయనతో.

నవోదయ, మరో రెండు సంస్థలు నాతో బొమ్మలు గీయించుకోలేదుగానీ, అన్ని సంస్థలూ ఇంచుమించు నాతో బొమ్మలు వేయించుకొన్నారు. సకాలంలో బొమ్మలు గీసి ఇవ్వడం, సీనియర్ ఆర్టిస్ట్ కన్నా ఏదో పాతికో తగ్గించడం, చేశాను. వర్క్ తెగవచ్చేది. చాలమంది పబ్లిషర్‌లు, పబ్లిషింగ్ నిమిత్తము డబ్బు వడ్డీకి తెచ్చేవారు. మద్రాస్‌నుండి కవర్ డిజైన్‌లు రావాలంటే బాగా ఆలస్యమయిపోయేది. బాపుగారు సినీమాల్లో 'బిజీ' లోకల్‌గా నేనున్నాను. టైం కలిసొచ్చేది. మార్కెట్‌లో టైమ్‌కి పుస్తకం రిలీజ్ అయ్యేది. అది వారికెంతో హాయి.

ఆదివారమయితే కొందరు ఇంటికే వచ్చేవారు. వారంతా చిన్న, చిన్న పబ్లిషర్స్ ఎక్కువ డబ్బు ఇవ్వలేరు. వన్‌టౌన్ నుండి ఓ ముసలాయన, సత్యన్నారాయణపురం నుండి ఓ కుర్రాడు వచ్చేవారు. వీళ్ల పుస్తకం పూర్తయిన ఎలా అమ్మతారో నాకు అంతు పట్టేది కాదు. ఏవోషాపులకు



వేస్తాం. వాళ్లే అమ్ముతారనేవారు. దీనివల్ల బీద పబ్లిషర్లకు కొంతరాయితీ అన్నట్టుండేవి నా పని.

**జయంతీ పబ్లిషర్ ఓనర్ పెరుమాళ్లు** గారి గురించి చెప్పుకోవాలి. ఈయన ఎక్కడా కాంప్రమైజ్ కారు. మంచి మంచి పుస్తకాలే వేశారు. వ్యక్తిగతంగా కమ్యూనిజం అభిమాని. అందులో మాటలే కాదు చేతలు చేసి చూపించారు. అందులో భాగమే కులతిరస్కారం. ఈయన దగ్గరనుండి నాకో రోజు పిలుపు వచ్చింది. దానికి ముందు ఆయన కొన్ని పుస్తకాలకు కవర్ డిజైన్‌లు వేయించబోయి తీరా ఆ విషయమయి ఆయన షాపుకి వెళితే ఎవరికో ఇచ్చాను. ఆయన కాదంటే నీకు ఇస్తానన్నారు. సరే-నేను ఆయన షాపు మెట్టు దిగుతూ ఎప్పటికయినా ఈ షాపులో నా వర్క్ ఉండకపోవు అనుకున్నాను. మరోవారంలో అలాగే జరిగింది. పిలుపు వస్తే వెళ్లాను. మరో సంవత్సరానికల్లా ఆ షాపులో ఆ చివరనుండి ఈ చివర వరకూ నేను వేసిన డిజైన్‌లు, అడివి బాపిరాజుగారివి, లతవి, చలం ఇంకా ఎవరెవరివో నిండిపోయాయి. దటీజ్ 'బాలి' అనుకున్నాను మనసులో ఆయనకు నా మీద అభిమానమూ కుదిరింది.

ఎప్పుడయినా ఆయన ముందు కూచుంటే ఒకప్పటి విజయవాడ గురించి, అప్పటిలో ఈ వూల్లో ప్రసిద్ధ వ్యక్తులు, కాశీనాథుని నాగేశ్వరరావుగారూ, గోరాగారు, నటి జి.వరలక్ష్మి గురించి చెబుతుండేవారు. కొన్ని విషయాలు ఆసక్తి దాయికంగా ఉండేవి. ఒక రోజు ఆయన మాటల్లో రచయిత 'లల్లాదేవి' (నారాయణాచార్యులు) శ్వేతనాగు, మిన్నాగు అని చాల నవలలు రాసి ప్రసిద్ధి చెందిన వ్యక్తి, ఆయన నవలలు ఓ పది సంవత్సరాలు జనంలో ఆసక్తిదాయకంగా మెదిలాయి. పత్రికలలో సీరియల్‌గా వచ్చాయి. కొన్నిటికి బొమ్మలూ వేశాను. ఒకటి రెండు సినీమాలుగా తీయబోయారని విన్నాను. చేతిలో మడత పెట్టిన సంచిని, నుదుట చూర్ణంతో సన్నగా పొడవుగా ఉండేవాడాయన. గుంటూరు జిల్లా కృష్ణానది అవతలనుండి తరుచూ వచ్చి విజయవాడలో ఏలూర్‌రోడ్‌లో సాయంకాలంపూట కనపడేవాడు. ఆయనను వెంట పెట్టుకొని లత వచ్చిందని. ఆయనదో నవల ఆమె రికమండేషన్ వల్ల వేశానని, ఇప్పుడు లల్లాదేవికి మంచి పేరు రాగానే తనకు నవలలు ఇవ్వడం లేదనీ, అసలు ఈ షాపు వైపే చూడ్డం లేదని (లోపల కోపం కూడ) గట్టిగానే చెప్పారు నాతో విని ఊరుకున్నాను.

ఇక లతకీ, లల్లాదేవి విషయంలో ఎలా ఉందంటే "నా ఇంటికి 'మీ అభిమానినని' వచ్చేవాడు బాలీ. గంట గంటలు ఈ బల్లమీదే కూర్చుని (ఆ బల్ల మురికిగా ఉంటుంది), నేనిచ్చిన కాఫీ తాగి (ఆ కాఫీకన్నా ఆముదం నయం) నన్ను పొగడ్తల్తో ముంచెత్తేవాడు- ఇదిగో ఇప్పుడీ నల్లనాగూ, తెల్లనాగూ అని రాస్తున్నాడు కదా! జనానికి పట్టేశాయి. ఎందులో చూసినా ఈయన సీరియల్సే. డబ్బు బాగా సంపాదిస్తున్నాడట.



ఇతన్ని ముందు నేనే పెరుమాళ్లు గారికి పరిచయం చేసి నవల వేయించింది. ఇపుడు ఆయన ముఖము చూడ్డం లేదట. ఎంత అన్యాయమో చూడూ, ఓనవల ఆయన ముఖాన్న పడేస్తే కేష్‌చేసుకోడూ! పైగా ఆమధ్య ఏవో రెండు, మూడు ఇంటర్వ్యూలు ఇచ్చాడు. నాపేరు కనీసం చెప్పనన్నా లేదు" ఇది లతగారి గోల (కోపంకూడ)

ఈ 'లల్లాదేవి' పత్రికల్లో ఇక్ష్వాకులూ, పాములుతో ముడిపెట్టి సస్పెన్స్ థ్రిల్లర్‌లు రాసి, పత్రికల సర్క్యులేషన్ పెంచే వ్యక్తిగా మారిపోయి ఎవరికీ అందని వ్యక్తిగా అయిపోయాడు. లత, పెరుమాళ్లుగారూ సమయంకోసం చూస్తున్నారు.

భక్తురాలైన లతదీ-కమ్యూనిస్ట్ అయిన పెరుమార్ల గార్ల మొర భగవంతుడు త్వరగానే విన్నాడు.

అదీఎలాగంటే...

**ఆ రోజుల్లో 'లల్లాదేవి'కి చాల కావలసిన మిత్రుడు 'ఓంకార్'** ఈయన మా ఆంధ్రజ్యోతిలో మా వీక్లీ సెక్షన్‌లో పనిచేసి, తరువాత సినిమాల్లోకి పోయి, ఆ రంగాన్ని ఒక ఊపు ఊపి ఏవో కొన్నిటిలో నటించి, కొన్నిటికి దర్శకత్వమూ వహించి ఆ తరువాత టీవి రంగంలో కాలుపెట్టి బూతులు-రెండర్థాల మాటలలో బతికిన జీవి.

ఆంధ్రజ్యోతి వీక్లీలో సబ్ ఎడిటర్, నా పక్క సీటే. చాల కలుపుగోలు మనిషి. చక్కగా చదువుకున్నాడు. శర్మగారు దేనిమీదన్నా విషయం సేకరణ చేసి ఆర్టికల్ ఇమ్మంటే అరగంటలో రాసి ఇచ్చేసేవాడు. అయితే

ఇతను మాట్లాడితే వెనకో ముందో బూతు మాట ఉండవలసిందే! నాలుకను కంట్రోల్‌లో పెట్టుకుంటాడని, కనీస సభ్యత పాటిస్తాడని శర్మగారు అతని సీటు పక్కనే లేడీ సబ్‌ఎడిటర్ల సీట్లు వేయించాడు. ఇతడు ఇంకా రెచ్చిపోయాడు. వారు ఈ మాటలు విననట్టు నటిస్తూ తలలు దించుకొనేవారు. అయితే ఈ ఓంకార్ ఓ నవల రాశాడు. అదీ డిటో బూతుల బుంగే. అక్కడక్కడా వేళాకోళాలు, వెక్కిరింపులూ–లల్లాదేవి పేర్న రీలీజ్ అయ్యింది. అట్టమీద లల్లాదేవి పేరు ఉంటుంది. ఆయన పేరున ఓ నాలుగు కాపీలు ఎక్కువగా పోతాయి. పబ్లిషరూ కొంచెం రెమ్యూనరేషన్ ఎక్కువ ఇస్తాడు. అలా లల్లాదేవి ఓంకార్‌కి సాయంచేశాడు. ఆ పుస్తకం మార్కెట్‌కి వెళ్లింది.

అలా అది పెరుమాళ్లగారి షాపుకి అమ్మకానికి చేరింది. కొత్త పుస్తకం వస్తే కౌంటర్‌లో కూచుని తీరిగ్గా చదివే అలవాటు ఉంది. అందులోనూ లల్లాదేవి పేర్న వచ్చిందాయె. (ఆ నవల పేరు నాకు గుర్తులేదు) ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. దీన్నిండా వ్యంగ్యోక్తులూ, బూతలూ–పేజీకి పదిలైన్లు మాత్రమే వేసి ఎక్కువ పేజీల్లా చూపించి రేటు ఎక్కువ పెట్టారు. కథా లేదు కాకరకాయా లేదు. లల్లాదేవి పేర్న రావడం–ఆయన మీదున్న కోపం వల్ల ఇందులో అబ్జెక్షన్స్ ఎక్కువ కనపడ్డాయి. కొన్నింటిని తనకే అన్వయించుకున్నారు. అవన్నీ పెన్సిల్‌తో అండర్‌లైను చేశారు పెరుమాళ్లగారు.

పెరుమాళ్లగారు పూర్వాశ్రమంలో వైశ్యులట. కమ్యూనిస్ట్ నాయకులయిన సుందరయ్యగారి సాన్నిహిత్యంతో, కమ్యూనిస్ట్ భావాలు వంటపట్టించుకొని కలం, గిలం పక్కన పెట్టి కులాంతర వివాహం చేసుకున్న వ్యక్తి. ఆయన షాపులో కూడ అటువంటి నాయకుల ఫొటోలే అలంకరించి ఉండేవి గోడలకు. ఆ పుస్తకంలో ఇలా ఉంది. (అంటే పురుమాళ్లగారు అండర్ లైన్ చేసిన వాక్యాలు చదివితే) లక్ష్మీదేవి ధనానికి అదిపత్యం వహిస్తుందని నమ్మకం.. లక్ష్మీదేవి ఎక్కడుంటుంది. నీళ్లలో ... తామరపూల మధ్యలో అభయహస్తం ఇస్తూ– మరో చేత్తో ధనం ఉన్న పాత్రని వంపుతూ, వెనక ఉన్న రెండు చేతులతో తామరపూలను పట్టుకొని.. చిర్నవ్వు నవ్వుతూ. ఇప్పుడు డబ్బున్న వారెవరూ (లక్ష్మీపుత్రులు) జననానుడిలో అంటే వైశ్యులు. వారే వ్యాపార పోషకులు, అంటే వారి దగ్గర లక్ష్మీదేవితో పాటు తామర ఉంటుంది. వివరంగా చెప్పాలంటే డబ్బుతో పాటు తామరగజ్జి ఉంటుంది. దాన్ని గోక్కుంటే హాయిగా ఉంటుంది. దాని మీద వేడినీళ్లు పోసుకుంటే హాయిగా, ఇంకా సమ్మగా ఉంటుంది. ఇలాగే సాగుతుంది ఆ నవలంతా ఇది ఒక ఉదాహరణ మాత్రమే!

ఇలాంటివి ఆ పుస్తకంలో పదో, పదిహేనో ఉన్నాయి. ప్రస్తుతం పెరుమాళ్లగారికి ఆ విషయం ఎక్కడో తగిలింది. బుసలు కొదుతున్నారు. ఇంతలో కర్మ కాలిపోయి 'లల్లాదేవి' సంచి చేతిలో మడిచి ఏలూరు రోడ్‌లో ఆ షాపు ముందు నుండే వెళ్తున్నాడు. పెరుమాళ్లగార్ని పిలిచారు. పెద్దవారు పిలిచారని 'లల్లాదేవి' షాపులోనికి వచ్చాడు.

చేతిలోని పుస్తకాన్ని ఆయన ముందుకి తోసి చదవమన్నారు. లల్లాదేవి అండర్‌లైన్ చేసిన పేరా చదివి ఇది నేను రాయలేదన్నాడు. ''పుస్తకం మీద నీ రచన అని ఉంది కదా! ఇది నీవు రాయకపోవడమేమిటి?" పాయింట్ లేవ తీశారు పెరుమాళ్లగారు. లల్లాదేవి కంగారు పడ్డాడు. "ఓంకార్ రాశాడు– నాపేర్న అచ్చయ్యింది" ఆ సంజాయిషీ పెరుమాళ్లగార్ని తృప్తిపరచలేదు. "అంటే అతడేం రాస్తే దాన్ని నువ్వు ప్రింట్‌కి ఇచ్చెయ్యడమేనా? అయినా కులంగురించా!! పెరుమాళ్లగారు రెచ్చిపోయారు. చేతిలో ఏదో ఆయుధం ఉంది. చేయిపైకెత్తారు. దాంతో..

ఇంతలో నాటకంలో పాత్రలా లతగారు వచ్చారు. ఆ సన్నివేశం, ఆ కేకలూ, ఆవిడకు ఆనందం కలిగించాయి. విషయమేమిటో ఆమె కర్థమయిపోయింది. మరికొంత మంట ఏగదోసింది. "పెరుమాళ్లగారూ –ఎత్తిన చేయి దించకూడదు. గీతలో పరమాత్మ ఏం చెప్పాడు. దుష్టసంహారం చెయ్యమన్నాడు. ఆ ఆయుధం ఫలితాన్ని కోరుతోంది– చేయి దింపకండి చేయిని



విసరండి పేరొస్తే మాత్రం ప్రతీ చెత్తా రాసెయ్యడమేనా?" లల్లాదేవి స్వయం రక్షణార్థం షాపులో నలుమూలలూ పరుగెత్తి చివరకు బతుకు జీవుడా అని బయట పడ్డాడు.

లత చేతిలో పుస్తకంతో ఆనందంగా ఉంది.

పెరుమాళ్ల గారి కోపం కొంచె కొంచెం చల్లారుతోంది- ఆ క్షణంలో నేను వచ్చాను.

లత విరగబడి నువ్వుతూ నాకో కుర్చీ చూపించి "ఎంతపనిచేశావు బాలీ. ఓ పావుగంట ముందు రావలసింది. ఇప్పుడే 'లల్లదు' బయటకు పరుగెత్తాడు. అంతా టిక్కెట్ లేని డ్రామా జరిగిందనుకో, ఈ పుస్తకం- ఇందులో అండర్‌లైనున్న వాక్యాలు చదువు, అంతా తెలుస్తుంది అంది చదివాను.

పెరుమాళ్లుగారూ మొత్తం జరిగిన సన్నివేశమంతా చెప్పారు. ఆయనకూ ఆనందంగానే ఉంది.

ఆ తరువాతిరోజుల్లో అంతపేరు తెచ్చుకున్న 'లల్లాదేవి' రచనలు, చేసినట్టులేదు.

ఇక లతగారు గురించి చెప్పుకుందాం ఇవన్నీ ఉబుసుపోకకాదు. నా చిత్రకళానికి డెవలప్‌మెంట్సూ వీటితో ముడిపడి ఉన్నాయి. రకరకాల మనుషులు ఎదురవుతారు, అనుభవాలు పెరుగుతాయి.

లత-నా హైస్కూలు రోజుల్లో ఆంధ్రప్రభ వారపత్రికలో 'లత'గారి'ఊహాగానం' వచ్చేది. చక్కటి శైలి. ఏ ఆడంబరం లేకుండా విషయాన్ని సూటిగా, మనోహరంగా చెప్పేది. అలాగే సినిమా విషయాలు, బొంబాయి సినీమా రంగంలోని విశేషాలూ, చమక్కులన్నీ ఒకపేజీ మించకుండా, సంక్షిప్తంగా ఎవరో రాసేవారు. క్రింద 'స్క్రీన్'నుండి అని ఉండేది. ఈ స్క్రీన్ పత్రిక ఆంధ్రప్రభ సంస్థదే. (గోయంకా). ఈ రెండు శీర్షికలనూ తప్పక చదివే వాడిని.

లత ఊహాగానం చదివి, చదివి ఆమె రచనలపై మక్కువ ఏర్పడింది. ఆ వరుసలో ఆమె రాసిన రచనలూ మార్కెట్‌లో కనపడ్డాయి. ఇంట్రస్టుగా అవీ చదివాను. మా బావకు కూడా ఆమె రచనలపై సరదా ఏర్పడి ఎక్కడన్నా కొత్తవి దొరికితే తెచ్చేవాడు. ఆమె విజయవాడలో ఉంటారని తెలిసింది. విజయవాడ నేను ఎలాగూ వెళ్లలేను, అందువల్ల ఆమెను చూడ్డం అన్నది జరగని పని. ఈ మధ్యలో ఎన్నో సంవత్సరాలు గడిచిపోయాయి.

ఆరోజు ఆదివారం-పురాణం గారి మూడవ కుమారుదు 'రాము' నేను పిట్టగోడ దగ్గరున్న కొబ్బరి చెట్టునీడలో పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్నాం. అది ఉదయం పదకొండు గంటల ప్రాంతమయ్యింటుంది. ఒకామె రిక్షాలో వచ్చి ఇటువేపు చూస్తూ "ఒరేయ్, మీనాన్న ఉన్నాడరా!" అని కేకపెట్టింది.

రామూ అటు తిరిగి "లేరని-పని మీద రాజమండ్రి వెళ్లారని" చెప్పాడు.

రిక్షా వెను తిరిగింది.

ఆమె ఎవరని అడిగితే "లత"గారని చెప్పాడు. అదే అలా మొదటిగా ఆమెను చూడ్డం. ఆ తరువాత చాలసార్లు ఆమె ఆంధ్రజ్యోతి ఆఫీసుకి వచ్చింది. ఆమె ఎవర్నీ గౌరవించి మాట్లాడ్డం నేను చూడలేదు. అంతా ఏకవచన ప్రయోగమే. ఆమెతో ఎప్పుడయినా నేను మాటాడవలసివస్తే 'ఊహాగానం' లతగారనే గౌరవంతో మాటాడేవాడ్ని. కానీ నాకు టీనేజ్ మగపిల్లాడితో మాటాడిన ఫీలింగ్ కలిగేది. మాటల్లో వెటకారం, ద్వంద్వార్థం ఆమె మాటల్లో ఎక్కువ. అయితే నేనంటే బాగా అభిమానం కనపరచేది. ఆమె ఇంటికి బయలుదేరుతోంది ఆంధ్రజ్యోతి ఆఫీసునుండీ అంటే, ఆ పక్కనగాని నేనుంటే ఇంటికేనా అని అడిగి ఆ రిక్షా వాడికి డబ్బులు నేనే ఇచ్చేసేవాడిని, ఒకవేళ ఆమె నా ముందే రిక్షా దిగితే, రిక్షావాడికి ఎంతయితే అంత డబ్బులు ఇచ్చేసేవాడిని -వద్దు వద్దు అనేదేగానీ అలా ఇవ్వడం నాకిష్టం. అది ఆమె పట్లగల గౌరవం. ఆమె బాగా పరిచయమైన తరువాత వారింటికి రెండు పర్యాయాలు వెళ్లవలసి వచ్చింది. అదీ ఆమె ఎన్నో పర్యాయాలు అడిగితేనే. 'ఆంధ్రప్రభలో ఎన్నో సంవత్సరాలు స్టాఫ్ ఆర్టిస్ట్‌గా పనిచేసిన ఎం.ఎస్ మూర్తిగారి పెయింటింగ్ ఆమె దగ్గరుంది. దాన్ని చూదువుగాని రా పిలిస్తే వెళ్లాను. ఆద్రపత్రిక ఆఫీస్ దగ్గరలో, హనుమాన్‌పేట మెయిన్‌రోడ్‌లో చివర వారి ఇల్లు, ఆ వీధంతా హోల్‌సేల్ చెప్పుల షాపులే!. కిందపోర్షన్ ఏదో చెప్పుల కంపెనీకి అద్దెకు ఇచ్చి మేడపై వాళ్లు కాపురం. 'ఆ అద్దెమీదే బతకాలి' అన్నది ఎన్నోసార్లు. పైకి వెళ్లాలంటే సన్నటి మెట్లు. పిట్టగోడమీద ఎక్కడ్నించో పట్టుకొచ్చి, ఎలాగో సిమ్మెంట్ అద్ది నిలబెట్టిన పెద్ద రాతి నంది, ఖర్మవశాత్తు అది జారిపడితే మెట్లెక్కే వారికి స్వర్గప్రాప్తి తప్పదు. అదేంపడదు... ఆ కుక్కేం కరవదు అన్నట్టు ఆమె హామీ ఇచ్చినా పడుతుందనే బెంగ. సరిగ్గా దాని పక్కనే మూర్తిగారి పెయింటింగ్, పెద్ద ఫ్రేముతో, వానకీ ఎండకీ తడిసి, ఆయనెంతో అభిమానంగా ఇచ్చారట ఈమె కళాత్మకదృష్టికి మెచ్చి. అయితే ఆ రెండు గదుల కొంపలో స్థలం లేక బయట గోడకి అది వేలాడితే. పిట్ట గోడమీద నంది విగ్రహం ఉంది.

అది చిన్న వరండాలో అటువేపు వంటగదిలా ఉంది. ఈ వరండాలో కాలుకదపలేనన్ని కుర్చీలు, బల్లలు, పెద్ద ఊయల బల్ల-మోకాలూ, ముక్కాలి పీటా వాలు కర్చీ అన్నీనూ. కూర్చునే వాడే దుమ్ము దులుపుకొని కూర్చోవాలి. "కింద రోడ్డుమీద నుండి బోల్డు బస్‌లు వెళ్తాయి, ఎంతకని దులుపుతాం అంటుంది" వాలుకుర్చీలో మురికెత్తి అట్టకట్టిన తలగడ ఉంది. ఆ కుర్చీలోని గుడ్డా అంతే! ఆ బల్లలనిండా ఎంగిలి పళ్లాలూ, కాఫీ గ్లాసులూ-బల్లమీద మరకలూ

ఈగలూ– ఆ పక్కనే సగం సగం చదివి బోర్లించిన పుస్తకాలూ, గ్లాసుల మీద మూతలుగా ఉపయోగించిన మరి కొన్ని పుస్తకాలూ... ఓబల్ల చివర గోడకు చేరబడి మాసిన గెడ్డంతో, మురికెత్తిన గుడ్డలతో ఏదో లావుపాటి ఇంగ్లీషు పుస్తకం చదువుతూ మధ్య, మధ్య తలెత్తి మాట్లాడే ఆంజనేయశాస్త్రి. ఈ శాస్త్రిగారూ, ఈవిడా ఇష్టపడీ, ఓ కప్పుకింద కాపురం చేస్తున్నారట. ఆ ఇంట్లో లక్ష్మీదేవి ఎలాగూ లేనట్టుంది. ఇక సరస్వతీదేవీ చిరుగుల చీరతో ఆ ఇంట్లో తిరుగుతున్నట్టుంది. ఆమె మొదటి భర్త ఆమె మేనమామే! తెన్నేటి ఆయన. ఏం చేసేవాడో తెలియదు. ఆ రెండు గదుల్లో ఎక్కడో ఒకచోట ఉంటాడు. ఆయనకు పక్షవాతం. చుట్ట కాల్చుకుంటో, కాలు ఈడ్చుకుంటో కనిపిస్తాడు. ఇప్పుడే ఆంజనేయ శాస్త్రి ఏ ఉద్యోగం చేస్తాడో తెలియదు. ఇంట్లోనే ఉంటాడు. నేను మెట్లెక్కి వరండాలోకి వెళ్లగానే వాలుకుర్చీలో పడుకొని ఏదో పుస్తకం చదువుతూ నన్ను చూడగానే “అబ్బో బాలీ వచ్చాడే రారా” అంది సరిగ్గా కూచుంటూ. కాలికింద రెస్ట్‌గా పెట్టుకున్న చిన్న బల్లను ముందుకు కాలుతో నెట్టి కూచో కూచో అంది. ఆమె ఆదరణకు, ఆప్యాయతకు సంతోషించి ఆ బల్లమీదే చతికిలబడ్డాను.

ఆంజనేయ శాస్త్రి పుస్తకం పక్కకు తీసి చిన్నగా నవ్వి విష్ చేశాడు.

“బాలీ వచ్చాడు చక్కటి కాఫీ చెయ్– మనమూ తాగుదాం” అంది. శాస్త్రి పుస్తకాన్ని అక్కడే పడేసి కాఫీ చెయ్యడానికి అటు వెళ్లాడు.

చుట్టూ చూశాను ఈ కొంపకన్నా ఎండు చేపలమ్ముకొనే దుకాణం నయం. గదిలో గుమ్మం దగ్గరగా నేలమీద ఎవరో పడుకొని ఉన్నారు. మాసినమరకలున్న మాసిన తెల్లదుప్పటీ కప్పుకున్నాడు. ఆ దుప్పటి మీద వేలాది ఈగలున్నాయి. వాడు తనపెద్ద కొడుకనీ రాత్రే మద్రాసు నుండి వచ్చాడంది. ఈ మాట విన్నాడు కాబోలు ఆ దుప్పటిలోని వ్యక్తి అట్నించి ఇటు వత్తిగిల్లాడు– ఝూంమ్మని ఆ ఈగలు, పప్పుల జంగిటి మీద నుండి ఎగిరినట్టు ఎగిరి, తిరిగి ఆ దుప్పటి మీదే వాలాయి.

“ఏంచేస్తుంటాడు మద్రాస్‌లో” అనడిగాను ఈగల్ని చూస్తూ “సినిమాల్లో మద్దెలవాయిస్తాడంది”.

ఇంతలో దగ్గుకుంటూ, చేతిలో చుట్టను నలుపుతూ, పొట్టిగా నల్లగా ఉన్న వ్యక్తి వచ్చాడు–ఆయన చేయి, కాలు పక్షవాతం వల్ల ఇబ్బందిగా కదులుతున్నాయి–పడుకున్న కుర్రాడిని నింపాదిగా దాటుకొంటూ వచ్చాడు. వస్తూనే ‘లత’ను డబ్బులడిగి లేవనిపించుకొని, చీవాట్లూ తిని కిందికి వెళ్లిపోయాడు. ఆంజనేయ శాస్త్రి కాఫీ కలిపి తెచ్చాడు. ఏదో తాగాననిపించి, ఏదో కాస్సేపు అదీ ఇదీ మాట్లాడి ఇద్దరి దగ్గరా శెలవు తీసుకున్నాను. ఇప్పుడు ఆమె మీద అభిమానంతో పాటు, జాలీ ఏర్పడ్డాయి. నెలలో ఓ రెండు సార్లన్నా మా ఆఫీసుకి వచ్చేది. ఆవిడను చూడగానే పురాణంగారు ఇబ్బంది పడేవారు. తనదో నవల వెయ్యమనీ, దానికి ముందో రెండు మూడు ప్రకటనలన్నా ఇమ్మనీ ఆయన్ని ఇరకాటంలో పడేసేది. అయితే కొన్నాళ్లు దీపావళి ప్రత్యేక సంచికల కోసం ఆమె కథలను కోరి తీసుకున్నారు కూడ. ప్రస్తుతం. ఆమె మాజీ రచయిత్రి అయిపోయింది. ఈలోపు ట్రెండ్ మారిపోయింది. ఆమె విపరీతంగా చదువుతుందనీ శర్మగారు చాల సందర్భాలలో అన్నారు. అయినా అదే పరిస్థితులలో రెండు మూడు నవలలూ రాసింది. వాటికి నేనే ముఖ చిత్రాలూ గీసాను. అందులో ఒకటి ఆమె అనుభవాల సంపుటి లాంటిది. కృష్ణా జిల్లాలో పల్లెలూ–బంధువర్గమూ మద్రాసులో సినీ ఫీల్డులో ఆమె అనుభవాలు, అక్కడే ఆంధ్రప్రభ ఎడిటర్ నార్ల వెంటేశ్వరరావు గారితో పరిచయాలూ ఇవన్నీ ఉంటాయి. ఇందులోని వాళ్ల అమ్మమ్మో లేక మరో ముసలమ్మో చీకట్లో చీపురుకట్టతో గండుపిల్లి అనుకొని రెండు పీకితే అది చచ్చిపోయింది. తెల్లారి లేచి చూస్తే అది పులి.

ఇలాంటి వింతలు, అతిశయోక్తులూ ఇందులో చాలా దొరుకుతాయి. మరో నవలకు ముఖచిత్రం గీస్తే అది ఆమెకు కొంచెమే



నచ్చింది. దాన్ని తీసుకొని తిన్నగా మా ఇంటికి వచ్చింది. ఈ నవలలోని విషయాలన్నీ ఆమె రేడియో స్టేషన్‌లో పనిచేస్తూ అప్పటి అనుభవాలతో అల్లినది. రికార్డింగ్ రూంలో ఆమె కూచున్నట్టూ, ఎదురుగా కాయితాలున్నట్టూ గీసాను. అంతవరకూ బాగానే ఉంది. అయితే అప్పటిలో ఆమెకు ఎంత జడ ఉండేదంటే కుర్చీ కిందపడిపోయి, గుమ్మంలోంచి ఎక్కడికో వెళ్లినంతట. "నేను కుర్చీలో కూర్చున్నానే అనుకో-నూతిలోంచి నీళ్లుతోడినట్టు నా జడను లాక్కొని వళ్లో పెట్టుకోవలసివచ్చేది"అంది.

ప్రస్తుతం నేను నల్లఇంక్‌ను









బ్రష్‌తో తీసుకొని అలా అలా గీసుకొటూ గుమ్మం టర్నింగ్‌లో వదిలేశాను. ఆ జడను. అక్కడ్నించి అది ఎంత వుందో ఎవడికి తెలుసు. బొమ్మను చూసుకొని సంతృప్తిగా ముఖం పెట్టింది. బ్రతుకు జీవుడా! అనుకున్నాను ఆమె వెళ్లిన తరువాత. ఆ తరువాత అది ఆమె నవలకు కవర్ డిజైన్‌గా వచ్చింది.

ఎప్పటిలాగే ఆమె ఓసారి ఆంధ్రజ్యోతి ఆఫీసుకి వచ్చింది చెమట పట్టిన ముఖంతో, అటు ఇటు చెదిరిన వెంట్రుకలు పాయలు పాయలుగా భుజాలమీద పడుతుంటే. చేతిలో ఏదో పుస్తకం. సాధారణంగా ఆమె అలాగే వస్తుంది కానీ ఈ రోజు ఏదో ప్రత్యేకత ఉంది, నడుం దగ్గర వడ్డాణం మెరుస్తోంది. ఎన్ని తులాలేమిటి?" అన్నారు శర్మగారు.

పదితులాలుకు ఎక్కువే-ఉదయమే శాస్త్రిని అటక ఎక్కించి పెట్టిలో ఉంటే తీయించాను" అంది

భోషాణంపెట్టె అటక మీద ఉందా? " శర్మగారికి ఆశ్చర్యం

"మరేం-దానికి మూతలేదు-ఎలుకలు ఉచ్చలు పోశాయని అతడే తోమాడు చింతపడుతో"

"ఏమిటీ చింతపండుతోనా"

"అవును-మరకలు పడితే తోముకోరూ-ఈమధ్య నడుం నిలబడ్డం లేదంటే తనే గుర్తు చేశాడు-"

శర్మగారు నోరెళ్లబెట్టారు.

"ఇత్తడి వడ్డాణం-ఏదయితేనేం-నడుం నిలబడడానికి-"

"అది సరే గాని- రెడీగా ఓ నవల ఉంది..."

"చూద్దాం!" ఆమె వెళ్లిపోయేదాకా ఆయన ముళ్లమీద కూరున్నట్టుండేవారు. చాల సేపు శర్మగారితో మాట్లాడింది పిచ్చాపాటీ-

"ఒంటిగంటయ్యిందన్నారు" శర్మగారు మాకు భోజనాల వేళయింది అన్నట్టు నేనూ పోవాలి. ఆకలేస్తుంది. ఉదయమనగా బయలు దేరాను. ఈపాటికి ఆంజనేయశాస్త్రి సాంబరు కాచే ఉంటాడు-

దాన్ని నాలుగైదు రకాలుగా చెయ్యగలడు మద్రాస్ సాంబర్‌లో మాత్రం స్పెషలిస్ట్ అంది తానూ లేస్తూ...

ఆమె వెళ్లనిచ్చి శర్మగారు అన్నారు కట్టుకున్నవాడయితే చెయ్యడు. కనిపెట్టుకున్నవాడయితే ఎన్నయినా చేస్తాడు. ఇడ్లీలో కొబ్బరి పచ్చడితో సహా- అప్పుడే అసలయిన ఆదర్శ దాంపత్యం బయటకు వస్తుంది"

ఆమె అలా రీపార్టీలస్తుందనే బొమ్మలేసుకొంటూనే ఓ చెవి అటు వేసేవాడ్ని వెళ్లిపోతూ నన్నూ పలకరించేది ఎలా ఉన్నావంటూ.

*(వచ్చే నెల భానుమతి గారి గురించి...)*

# శిశువులు కాదివి శిల్పాలు




కెనాడాకు చెందిన ఈ ముప్పై యేళ్ల యువ కళా కారిణి పేరు కెమిలీ అలెన్. పెళ్లైంది కానీ పిల్లలు లేరు. పిల్లలపై నున్న మమకారంతో సరదాగా పిల్లలు బొమ్మలు తయారు చేస్తూ.. దానినే వృత్తిగా మరల్చుకున్న అలెన్ గురించి ఈ నెల సమ్‌థింగ్ స్పెషల్‌లో ...మీకోసం.

కెమిలీ అలెన్ తయారు చేసే పిల్లల బొమ్మలకో ప్రత్యేకత ఉంది. ఈమె చేసే బొమ్మలన్నీ కూడా అప్పుడే పుట్టిన (0 వయస్సు) వయస్సులో ఉంటాయి. వాళ్ల ఫోజులు, హావభావాలు అన్నీ కూడా చాలా సహజంగా ఆకర్షణీయంగా ఉంటాయి. ఇక్కడ ఇచ్చిన ఫొటోలు చూస్తే మీకే తెలుస్తుంది. పాలిమర్ క్లేతో తయారు చేసే ఈ శిల్పాలు లైఫ్‌సైజులోనూ మరియు అతిచిన్న సైజు (మినియేచర్స్)లో కూడా ఉంటాయి. ఎంత చిన్నవంటే అరచేతిలో ఐదుగురు పాపాయిలను పట్టుకొనేంత, ఒట్టి బొమ్మలే కాదండోయ్... వాటికి సరిపడ కాస్ట్యూమ్స్‌ని కూడా వేస్తుంది. ఇక రంగులంటారా నేచురల్ రంగులతో ఎంతో రియలిస్టిక్‌గా పెయింట్ చేస్తుంది. ఇంత నైపుణ్యం సంపాదించిన ఈవిడ ఈ కళ ఎక్కడ నేర్చుకొందనుకుంటున్నారా? ఈమె నాయనమ్మ దగ్గరేనట. ఇప్పుడీమెకిదే ప్రొఫెషన్. తను తయారుచేసిన చిన్నారుల బొమ్మలతో గ్యాలరీని ఏర్పాటుచేసి, ఒక్కో బొమ్మను వందనుంచి 5000/- డాలర్ల వరకూ అమ్ముతుంది కూడాను. కాదేదీ కళకు అనర్హం అంటే ఇదేనేమో...!



సమ్'థింగ్ స్పెషల్





# శిశువులు కాదివి
# శిల్పాలు





*Somethink Special*

కెమిలీ అలెన్ పాలిమర్ క్లేతో తయారు చేసిన బొమ్మలు





*Somethink Special*

కళాప్రపంచం

# (జనుల) గుండె గుడిలో గూడు కట్టిన గైడ్

**ఎల్.ఆర్. వెంకటరమణ**



**"మరణించగానే మనుషులు మాయమైపోతే ఎంత బాగుంటుంది". మరణించిన వ్యక్తుల అంతిమయాత్రలలో పాల్గొనడమంటే అస్సలు ఇష్టంలేక ఒక మహాకాళాకారుడన్న మాటలివి. ఇంకా చెబుతూ ఒక వేళ నేను చనిపోతే కూడా నా శవాన్ని ప్రదర్శనకు పెట్టి సంతాపాలు వెలిబుస్తూ, శోకాలు తీయవద్దు. నేను బతికున్నప్పుడు ఎలా చూశారో అలాగే ప్రజల జ్ఞాపకాలలో మిగిలిపోవాలన్నది-బాలీవుడ్ దిగ్గజం దేవానంద్ మనోగతం.**

గతం గురించి నాకు మాట్లాడటం ఇష్టం ఉండదు. సాధించిన వాటికి పొంగిపోవడం, అపజయాలకు కృంగిపోవడమన్నది అవివేకుల లక్షణం. హిట్-ప్లాపులతో సంబంధలేకుండా నా పనిని -నేను చేస్తూపోతుంటాను అంటూ నిక్కమైన మాటలు చెప్పే నికార్సైన మనిషి దేవ్ ఆనంద్.

దేవానంద్ పూర్తిపేరు ధరమ్‌దేవ్ పిషోరిమల్ ఆనంద్. అవిభక్త పంజాబ్‌లోని గురుదాస్‌పూర్‌లో 1923, సెప్టెంబర్, 26న జన్మించాడు. తండ్రి పిషోరిలాల్ ఆనంద్, ప్రముఖ న్యాయవాది. ఆంగ్లసాహిత్యంలో డిగ్రీ అందుకున్న తరువాత తన 23న ఏట దేవానంద్ కలల నగరమైన ముంబాయి చేరుకున్నాడు.



చిత్రసీమలో ఒక్క అవకాశం కోసం పరితపించాడు. చర్చిగేట్ వద్ద కల మిలటరీ సెన్సార్ ఆఫీసులో రూ.160 జీతానికి పనిచేశాడు. 1946లో ప్రభాత్ టాకీస్ సంస్థ నిర్మించిన 'హమ్‌ఏక్‌హై' చిత్రంలో అవకాశం వచ్చింది. తరువాత విడుదలైన "జిడ్డి" ఘన విజయం సాధించడంతో దేవానంద్‌కు చిత్రసీమలో స్థానం స్థిరమైంది.

చిన్ననాటి నుండి సాహిత్యం, కళలపట్ల ఆసక్తి చూపేవాడు. తనలోని సాహితీ పిపాస, సృజనలకు అనుగుణంగా ఆంగ్ల సాహిత్యం అధ్యయనం చేశాడు. ఇదే క్రమంలో హాలీవుడ్ చిత్రాలను పరిశీలించాడు. గ్రెగరీపెక్‌ను, ఒమర్ షరీఫ్‌ల నటన అంటే అమితాసక్తి చూపాడు. నటనలో గ్రెగరీపెక్‌ను, నడకలో ఒమర్‌షరీఫ్‌ను అనుసరించాడు. ఒక కాకతీయమైన సంఘటన ఏమంటే గ్రెగరీపెక్, దేవానంద్ ఇరువురూ 88వ ఏటనే మరణించారు.

నాటి బొంబాయిలో 'ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్' అన్న అభ్యుదయ భావాలు కల సంస్థ ఉండేది.



మొదలై పెళ్లివరకు దారి తీసింది. కానీ కుల, మతాలు అడ్డురావడంతో వీరి ప్రేమకథ పరిసమాప్తమైంది. ఈ విషయాలను దేవానంద్ 'రొమాన్సింగ్ విత్ లైఫ్" అన్న తన జీవిత చరిత్రలో పేర్కొంటారు. ఈ పుస్తకం 2007 సెప్టెంబర్, 26న జన్మదినం నాడు ఆవిష్కరించబడింది. ఈ గ్రంథంలో తన జీవితం, తన జీవిత సహచరులు, వారితో తనకు గల అనుబంధాలు, సంబంధాల గురించి దేవ్ ఒప్పుకున్నాడు. ఇంకా సహనటి మోనాసింగ్ (కల్పనాకార్తిక్)తో ఏర్పడిన బంధం కొనసాగి జీవిత భాగస్వామిగా మలచుకున్న తీరును ఒక దృశ్యకావ్యంగా మలచి మనసు మరపిస్తారు.

ఈ పుస్తక ఆవిష్కరణ సమయంలో "ఇలాంటి మరో పుస్తకం రచిస్తారా?" అని ఒక జర్నలిస్టు ప్రశ్నకు" జీవితం, రొమాన్స్ అన్నవి కలసి పయనించేవి. కానీ దానికొక ప్రేరణ కావాలి. ఆ ప్రేరణ లభిస్తే తను మరలా పనివాడవుతానంటాడు దేవ్".

దేవానంద్ సినీ జీవితంలో మరో ఆణిముత్యం 'గైడ్'. ఆర్కేనారాయణ్ నవలకు దృశ్యరూపం గైడ్. ఇందులో వహీదా

అందులో దేవానంద్ అన్న చేతన్ ఆనంద్ సభ్యుడు. ఈ సంస్థ నాటకాలలో దేవానంద్ కూడా పాలుపంచుకున్నాడు తరువాత సినీ జీవితానికి ఇవి నాంది అయ్యాయనవచ్చు. ఇదే కాలంలోనే 'మిలటరీ సెన్సార్ ఆఫీస్'లో ఉద్యోగం. ఇలా ఒడిదుడుకుల నడుమ దేవానంద్ బాలీవుడ్ ప్రస్థానం ప్రారంభమైంది.

1949లో దేవ్ "నవకేతన్' అనే చిత్రనిర్మాణసంస్థ స్థాపించారు. ఈ సంస్థ ద్వారా దాదాపు 35పైగా చిత్రాలు నిర్మించబడినాయి. 1951లో స్వంత నిర్మాణ సంస్థ ద్వారా నిర్మించిన చిత్రం "బాజీ" విజయం దేవానంద్‌కు మంచి గుర్తింపు తెచ్చిపెట్టింది.

అప్పటికే బాలీవుడ్‌లో ట్రాజెడీకింగ్ "దిలీప్‌కుమార్", గ్రేటెస్ట్ షోమాన్ "రాజ్‌కపూర్" హవా నడుస్తున్న కాలం. వీరి సరసన మరో వ్యక్తి తెరపైకి రావడమన్నది ఆషామాషీ విషయం కాదు. కానీ ఆ ఇరువురి కన్నా భిన్నంగా తనదైన శైలితో తెరపైకి వచ్చాడు దేవానంద్. యువత, మహిళలకు ఈ శైలి ఎంతో నచ్చింది. వారి ఆరాధ్యనటుడైనాడు దేవ్. చలాకీతనం, రొమాన్స్, నడక, నడతలలో చూపిన వైవిధ్యం దేవానంద్‌ను వెండితెర వెలుగులుగా నిలిపగలిగింది.

"బాజీ"చిత్రం తెచ్చిన విజయంతో దేవానంద్ వెండితెరవేల్పు అయ్యాడు. సహనటి సురయాతో సాన్నిహిత్యం ఏర్పడిది. వీరిద్దరు కలిసి –'విద్య', 'జీత్', షాయర్, సనమ్ మొదలైన చిత్రాలలో నటించారు. ఒకానొక సమయంలో వీరిరువురి మధ్య ప్రేమ


సురయాతో దేవానంద్

రెహమాన్ సహనటి. ఇందులో "గాతా రహే మేరా దిల్" అన్న గీతం "తేరే మేరే సప్నే" అన్నగీతం "క్యాసే క్యాహో గయా" వంటి గీతాలు సినీ ప్రేక్షకుల గుండె తలుపులు మీటుతుంటాయి. ఈ చిత్రం మనదేశం తరపున ఆస్కార్ పోటీలకు కూడా ఎంట్రీగా వెళ్లింది. ఈ చిత్రాన్ని ప్రఖ్యాత ఆంగ్ల రచయిత, నోబెల్ బహుమతి గ్రహీత పెరల్‌బక్‌తో కలసి ఆంగ్లంలో కూడా దేవానంద్ నిర్మించారు.

***దేవానంద్ దర్శకునిగా "ప్రేమ్ పూజారీ" చిత్రంతో కొత్త రూపుదాల్చాడు. "హరేరామ హరే కృష్ణ", "స్వామీ దాదా", "లూట్‌మార్", "మన్ పసంద్" వంటి హిట్ చిత్రాలిచ్చారు.***

హిందీ వెండి తెరకు దేవానంద్ ఎందరినో పరిచయం చేశాడు. వారిలో దర్శకుడు గురుదత్, సంగీత కళాకారుడు జైదేవ్, గీత రచయిత సాహిర్ లూధియాన్వీ, ఇంకా బలరాజ్‌సహానీ, జీనత్ అమన్, టీనామునిమ్, జాకీష్రాఫ్, టబు వంటి నటీనటులను పరిచయం చేసింది కూడా దేవానందే.

దేవానంద్ నిరంతరం భారత్-పాకిస్తాన్‌ల మధ్య సత్సంబంధాలనే ఆకాంక్షించారు. ఈ దిశగా జరిగిన ప్రతి ప్రయత్నంలోనూ భాగస్వామిగా ఉన్నాడు. అప్పటి ప్రధాని వాజ్‌పేయితో కలసి లాహోర్‌కు చరిత్రాత్మక బస్సుయాత్ర చేసిన బృందంతో దేవానంద్ కూడా ఉన్నారు.




దాదాపుగా వందకు పైగా చిత్రాలలో నటించారు. ఎన్నో ఎత్తుపల్లాలు చూశారు. అవార్డులు ఎన్నో అభించాయి. 2001 సం"లో పద్మభూషణ్ అవార్డు, 2002 సం"-దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు, 2006లో అక్కినేని నాగేశ్వరరావు అవార్డు, ఇంకా ఎన్నో ఫిల్మ్‌ఫేర్ అవార్డులు అందుకున్నారు. "చార్జిషీట్" దేవానంద్ చివరి సినిమా.

దేవానంద్ నటనకు కిషోర్‌కుమార్, మహమ్మద్‌రఫీల గాత్రంతోడై మనసులను పులకరిస్తుంది. "ఖోయా ఖోయా చంద్" అన్నగీతం, "మై జిందగీ కా సాత్ నిభాతా చలాగయా", "మే దిల్ నోహోతా బేచారా", ఫిర్‌వహీ చాంద్" వంటి ఎన్నో గీతాలు గుర్తుండిపోతాయి. "జియా ఓ" అంటూ వచ్చే గీతం "జబ్‌ప్యార్ కిసీనా హోతా హై" అన్నచిత్రంలోనిది. ఇది వింటే గానీ అందులో మజా చెప్పడానికి వీలులేదు. ఫన్‌టూష్ చిత్రంలోని "యే మేరే టోపీ" అన్న గీతం. దేవానంద్‌కు వివిధ రకాల టోపీలంటే మక్కువ.

రాజకీయంలో కూడా దేవ్ క్రియాశీలక పాత్ర వహించాడు. 1975 ఎమర్జెన్సీని వ్యతిరేకించాడు. "నేషనల్ పార్టీ ఆఫ్ ఇండియా" అన్న పార్టీ కూడా ఏర్పాటు చేశాడు అనంతరం దీన్ని రద్దు చేసుకున్నాడు.

***తన స్వీయ దర్శకత్వంలో తన తనయుడు సుశీల్ ఆనంద్‌తో ఒక చిత్రం నిర్మించాడు. దేవానంద్ సోదరులు విజయ్ ఆనంద్, చేతన్‌ఆనంద్ ఇరువురు చిత్రసీమతో పరిచయం ఉన్న వారే.***

"అభినజావోఛోడ్‌కర్" అంటూ తన ప్రేయసి కోసం గీతాలాపనచేశాడు. మనలను వదిలి దేవ్ వెళ్లిపోయారు. 2011, డిసెంబరు 3వ తేదీన లండన్‌లో గుండెపోటుతో మృతిచెందాడు.

తను జీవితాంతం తన గుండె చెప్పినట్లు నడుచుకున్నాడు. ఎందరి గుండెలలోనో స్థానం సంపాదించుకున్నాడు. భగ్నహృదయంతో కలతచెందాడు. గుండె ధైర్యంతో సినిమాలు నిర్మించాడు. బాలీవుడ్ సినీప్రేక్షకుల గుండె గుడిలో కొలువయ్యాడు. గుండెపోటుతో మనందరి గుండెలు బరువుతో నింపిన ప్రేమ్‌పూజారి మనకు దూరమయ్యాడు. సినీలోకాని కొకగైడ్‌గా నిలిచాడు.

*email: venkataramana_lanka@yahoo.com*

# విశ్వవిచిత్రం - రామకృష్ణ చేతి చిత్రం

- వెంటపల్లి సత్యనారాయణ

*ఆశ్చర్యం...*

*.....లోకంలో సమస్త ప్రాణకోటికీ, సకల జీవరాశికీ, ఎప్పటికీ అత్యంత విస్మయం, ఆశ్చర్యం కలిగించే విషయం ఏదైన వుందీ అంటే అది ఈ సృష్టి నిర్మాణమే. ఎందు చేతనంటే ఎంత తవ్వినా, ఎన్ని ఆలోచనలు చేసినా మానవ మేధకు ఎల్లప్పుడూ పరీక్షగానే మిగిలిపోతున్న ఈ అనంత విశ్వనిర్మాణం ఎలా జరిగింది?*

బైబిల్‌లో చెప్పినట్లు కేవలం ఒకే ఒక వారంలో మొత్తం ఈ విశ్వానికి ఆవిర్భావం అయిపోయిందా! అంటే ఏమో ఎవరూ చెప్పలేము. కారణం పై విషయాలు ఎవరూ ఏమి చూడలేదు. కానీ ఆ భగవంతునిచే సృష్టించబడింది అని చెప్పుకుంటున్న ఈ సమస్త ప్రకృతి స్వరూపాలైన కొండలు, గుట్టలు, మహాపర్వతాలు, సరోవరాలు, నదులు, మహాసముద్రాలు, హిమానీ నదాలు లాంటి సమస్త భూ,జల స్వరూపాలు, లతలు, పుష్పాలు, చెట్లు, మహావృక్షాలతో పాటు సూర్యచంద్రనక్షత్రాది తారలతోనే గాక ఇంకా అనేక కోట్లాది జీవులతో నిండిన ఈ విశాల ప్రకృతిలో ఒక్క అణువుకు కూడా సమానం కాని మనిషి తాను నివసించే ప్రకృతికి రంగులతో ప్రతిసృష్టి చేయడం ఒక ఎత్తైతే దాన్ని అతి వేగంగా చేయడం ఇంకో ఎత్తు. ఇక చిత్రసృష్టిని చేయడానికి సాధారణంగా ఎవరైనా వుపయోగించే కుంచె, పేలట్, నైఫ్, లాంటి మానవనిర్మిత పరికరాలను ఏమీ వాడకుండా కేవలం తన చేతివ్రేళ్లతో మనం వూహించని రీతిలో అత్యంత వేగంగా, కేవలం కొద్ది నిముషాలలో తైలవర్ణాలతో ప్రకృతి చిత్రాలను అలవోకగా సృష్టించి ఆశ్చర్యకరమైన రీతిలో వీక్షకులను విస్మయానికి గురిచేసే ఒక విశిష్ఠ చిత్రకారుడు ఆత్మకూరు రామకృష్ణ.... కారణం అతని





సాధించిన రివార్డులతో రామకృష్ణ

ప్రాంతాలు, కాసేపట్లో బీడు భూములు ఆ మరుక్షణం వసంతాన్ని మైమరపించే సుందర ప్రదేశాలు, నదీ తీరాలు, ఆకాశమేఘాలు, నేల, నింగి ఏకంగా కనిపించే పూర్వ దిగంతాలు, పశ్చిమాకాశాలు, ఇలా సమస్త ప్రకృతిలోని వర్ణసౌందర్యాలు నిముషాలలో అతని కళ్లకు కనిపిస్తే ఆ మరుక్షణమే వాటిని కాన్వాస్‌పై

చేతుల్లో రంగులు రాగాలాలపిస్తే, చేతివ్రేళ్లు పేరిణి శివతాండవ నృత్యాలను ప్రదర్శిస్తాయి. వెరసి ప్రేక్షకులను ఒక రమ్యమైన ప్రకృతి ఒడిలోకి తీసుకుపోతాయి. అక్కడ హాయినీ, ఆనందాన్నిగొల్పే ప్రశాంత వాతావరణంలో ప్రేక్షకలోకం తేలియాడేటట్లుచేస్తాయి. రంగులతో అతని చేతివ్రేళ్లు చేసే నాట్యవిన్యాసాలు.

ఒక సృజనాత్మక ఆలోచన జనించడం అదృష్టం అనుకుంటే వంద సృజనాత్మక ఆలోచనలు వెనువెంటనే జనిస్తే మరింత అదృష్టంగా భావించాలి. పుంఖాను పుంఖాలుగా వచ్చే ఆలోచనలు అదే స్థాయి వేగాలతో కాన్వాస్‌పై రంగుల రూపాల్లోకి మారిపోతుంటే.. వాహ్.. ఆశ్చర్యం కదా! అవును ఆశ్చర్యమే. ప్రశాంత ఉషోదయాలను సృజించిన మరుక్షణంలోనే సంధ్యాసమయాలు, పచ్చని పచ్చిక బయల్లు, ఆ వెనువెంటనే ఎడారి ప్రాంతాలు, హిమవత్ శిఖరాలు, ఆ వెంటనే మైదాన



రాష్ట్ర మాజీ గవర్నర్ కృష్ణకాంత్ తో రామకృష్ణ

మనకు ప్రత్యక్షపరుస్తాడు. ఆ చేతి వ్రేళ్లతో గీసిన తెల్లని వలయాకారపు గీత నిర్మలంగా సాగిపోతున్న నదిపై ఏకాదిపత్యం చేస్తున్న నీలిరంగును ఛేదించి నదికి గమనం తీసుకువస్తే, సూర్యకిరణాల వంటి రేఖలు దట్టంగా పెరిగిన పచ్చని చెట్ల గుబురులో ఇంద్రధనుస్సును సృష్టిస్తాయి. పాలనురుగుల్లాంటి తెల్లమబ్బుల చెంతనే సృష్టించబడ్డ దట్టమైన నీలిపర్వతాలు, ఆ దిగువున పచ్చని భూతలాలు చూసే ప్రేక్షకుడి కంటికి అద్భుతమైన హాయిని కలిగిస్తాయి.

ఇలా ప్రకృతిలోని సమస్త వర్ణాల సౌందర్యాలను నిముషాలలో కెమెరాలో క్లిక్‌చేయవచ్చేమో గానీ దాన్ని వాస్తవ రూపంలో చూడాలీ అంటే మరలా దానికి మరింత సమయం కావాల్సిందే. కాని అలాంటి సమయం ఏ మాత్రం అవసరం లేకుండానే ఆలోచన, ఆ వెను వెంటనే ఆచరణ వెరసి రంగు, రంగుల ప్రకృతి దృశ్యాలను ఏకకాలంలో మన ముందుంచగల సత్తా గల చిత్రకారుడు ఆత్మకూరు రామకృష్ణ. అందుచేతనే చిత్రకళలో ఎవరూ అందుకోలేని రికార్డులను అతను సొంతం చేసుకోగలిగారు. 25-10-2010 నాడు 24 గంటల వ్యవధిలో 100 చిత్రాలను పూర్తి చేయాలనుకున్న తన లక్ష్యాన్ని కేవలం 13 గంటల 26 నిముషాలలో బెంగుళూరు కేంద్రీయ విద్యాలయ ఆవరణలో సాధించి "లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్స్ ఒక ఎత్తైతే , ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్స్, వండర్ వరల్డ్ రికార్డ్, రికార్డ్ హెూల్డర్స్ రిపబ్లిక్ మరియు అసిస్ వరల్డ్ రికార్డ్, Fastest time to paint 100 land scapes paintings in 806 mininuts అని అఫీషియల్ వరల్డ్ రికార్డు vrsd.org లాంటి సంస్థలనుండి పొందడం మరో ఎత్తు.

వృత్తిరీత్యా ఒక సాధారణ రైతు కుంటుంబానికి చెందిన శ్రీ ఆత్మకూరు రమణయ్య, రత్నమ్మ దంపతులకు నెల్లూరుజిల్లా



చేతి వ్రేళ్ళతో రంగులద్దుతున్న రామకృష్ణ

ఇందుకూరు పేటలో ది 12-04-1969లో జన్మించిన రామకృష్ణను ఎలాగైనా ఇంజనీర్‌ను చేయాలనుకున్న తన తండ్రి ఆశయాన్ని తనలోని చిత్రకళాభీష్టం అధిగమించడంతో తన తల్లి, మరియు మిత్రుల సహకారంతో రామకృష్ణ చిత్రకళ వైపే పయనించాడు. ఇంటర్‌మీడియట్ పూర్తయిన పిదప తన ప్రాంతానికే చెందిన మరో సీనియర్ చిత్రకారుడు శ్రీ సిరాజ్ హైదరాబాద్‌లో చిత్రకళను అభ్యసిస్తుండడంతో అతని వద్దకు వారు పంపడం అక్కడ B.F.A ఎంట్రన్స్ మెళకువలను నేర్చుకుని JNTU అప్లైడ్ ఆర్ట్స్ విభాగంలో చేరడం జరిగింది. హాస్టల్‌లో వుంటూ చదువుకోవడంతో తనతో పాటు వున్న సీనియర్ మరియు సహచర చిత్రకారుల రచనా తీరులను గమనించడమే గాక వారి ప్రాజెక్ట్ వర్కులలో తను కూడా అప్పుడప్పుడూ పాల్గొని పనిచేయడం ద్వారా కాలేజ్‌లో కంటే హాస్టల్‌లోనే ఎక్కువ పని నేర్చుకోవడం సాధ్యపడిందని చెప్తారు రామకృష్ణ. బి.ఎఫ్.ఏ మొదటి సెమిస్టర్‌లో కళాశాల విద్యార్థులందరిలో ప్రథముడిగా రావడం, తన పని మరియు చదువుపట్ల నమ్మకం కలిగేలా చేయడంతో అదే స్ఫూర్తిని చివరి వరకూ కొనసాగించి JNTU లో గోల్డ్‌మెడల్‌ను అప్పటి రాష్ట్రగవర్నర్ కృష్ణకాంత్ చేతులమీదుగా తీసుకోవడం జరిగింది. ఆ తర్వాత బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుండి, మాస్టర్‌డిగ్రీని కూడా చేసి కేంద్రీయ విద్యాలయంలో ఆర్ట్‌టీచర్‌గా ఉద్యోగం సంపాదించారు.

ప్రారంభంలో అందరి చిత్రకారులకు మల్లే స్టిల్‌లైఫ్, మోడల్ ఆబ్జెక్ట్ డ్రాయింగ్‌తో పాటు ప్రకృతి, మరియు రూపచిత్రాలను కూడా ఆయన ఎన్నో వేశారు. ఈ క్రమంలో "ప్రకృతి-పురుషుడు" అన్న అంశంపై అధివాస్తవిక ధోరణి (Surrealism) లో అతడు వేసిన చిత్రాలు ఒక స్థాయికి అతన్ని చేర్చాయి. ప్రకృతిలోని వృక్షాలను స్త్రీలతో పోలుస్తూ వాటిపై వాలిపోయి సేద తీరడానికి ఆరాటపడే వివిధ రకాల పక్షులుగా పురుషుల్ని చిత్రీకరించి అనాదిగా ప్రకృతిలోని స్త్రీ, పురుషుల మధ్యగల ఆకర్షణను అధివాస్తవిక ధోరణిలో చిత్రించిన ఈ చిత్రాలు ఒక మంచి ఆలోచనగా చెప్పుకోవచ్చు. అలాగే కూచిపూడి నాట్యమంజరి అనే పుస్తకం కోసం 'హస్తాభినయ చంద్రిక' అనే పేరుతో నాట్యానికి సంబంధించిన వివిధ భంగిమలకు అతను వేసిన ఇలస్ట్రేషన్స్ నిజంగా చాలా గొప్పగా వుంటాయి.



చేతి వ్రేళ్ళతో రామకృష్ణ చిత్రించిన చిత్రం

Applied Art లో BFA మరియు MFA డిగ్రీలు చేసిన రామకృష్ణకు ఇలస్ట్రేషన్స్- విజువలైజేషన్‌లు ప్రధాన సబ్జెక్టులు కావడంతో ఎన్నో పుస్తకాలకు ఇలస్ట్రేషన్స్ వేయడమే గాక జాతీయ సమగ్రత, సంఘజీవనం, సారా ఉద్యమం లాంటి వివిధ సామాజిక రుగ్మతలపై అనేక పోస్టర్స్‌ను డిజైన్ చేసారు. ఈ క్రమంలో చేసిన వయోజనవిద్య ప్రాజెక్టులో భాగంగా వేలిముద్రలు మానండి-సంతకాలు నేర్వండి అనే సందేశం ఇచ్చే ప్రయత్నంలో మరి ఇన్నేల్లుగా అలవాటు పడ్డ వేలిమద్రలు ఏంకావాలి? అన్న ప్రశ్నకు సమాధానంగా వాటిని సృజనాత్మకంగా మార్చండి అంటూ కుంచెపట్టుకోలేని పోలియో పీడుతులకు బెంగుళూరులో


చేతి వ్రేళ్ళతో రామకృష్ణ చిత్రించిన చిత్రం


చేతి వ్రేళ్ళతో రామకృష్ణ చిత్రించిన చిత్రం

నిర్వహించిన శిక్షణా శిబిరంలో తొలిసారిగా చేతివ్రేళ్లతో బొమ్మలు వేసి చూపించినపుడు ఆ వికలాంగుల మొహాల్లో వికసించిన అనిర్వచనీయమైన ఆనందం రామకృష్ణను ఆలోచనలో పడేసింది. ఆ క్షణంలోనే చేతివ్రేళ్లతో చిత్రాలకు అంకురార్పణ జరిగింది. ఈ క్రమంలో ఎలక్ట్రానిక్ మీడియా వాళ్లకిచ్చిన డెమోస్ ఓకొత్త ఆలోచనకు పురిగొల్పింది. మొదట్లో ఒక్కో చిత్రరచనకు 15 నుండి 20 నిమిషాలు తీసుకున్న రామకృష్ణ నిరంతర సాధన ద్వారా ఆ సమయాన్ని మరింత తగ్గేలా చూసుకుంటూ రికార్డుల వైపు ప్రయత్నంచేసారు.

అనేక రోజులు, నెలల తరబడి చిత్రంచబడే ఎన్నో చిత్రాలను కేవలం కొద్ది నిముషాలలో తన మునివ్రేళ్లతో రంగులను కాన్వాస్‌పై అలవోకగా అద్దుతూ ప్రకృతికి ప్రతిరూపమిచ్చే క్రమంలో అతను చూపించే వేగం, ప్రదర్శించే వర్ణ విన్యాసం, చిత్రాల్లో కనిపింపజేసే గరుకుతనం (టెక్చర్) పాటించే రంగుల సమతుల్యత అన్నీ చూసే వీక్షకుడికి విస్మయాన్ని కలిగిస్తాయి. విలక్షణమైన ఈ కళాప్రక్రియకు విస్మయం కలిగించే అతని వేగం సహజంగానే అతనికి లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్‌తో పాటు మరెన్నో జాతీయ అంతర్జాతీయ రికార్డులను తెచ్చిపెట్టింది.

చేతివ్రేళ్లతో వేసిన తన చిత్రాల ప్రదర్శన తొలిసారిగా శ్రీ వెంకటప్ప ఆర్ట్‌గేలరీ బెంగుళూరులోనూ, ద్వితీయ ప్రదర్శనను




చిత్రమయి స్టేట్ ఆర్ట్ గేలరీ హైదరాబాద్‌లోనూ నిర్వహించిన రామకృష్ణ ఇంతవరకూ 10 వ్యక్తిగత 15 సామూహిక చిత్రకళా ప్రదర్శనలలో పాల్గొన్నాడు. ఇక అతను సాధించిన అవార్డుల విషయానికొచ్చినట్లయితే 1992 హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ నుండి జాతీయస్థాయిలో హైలీ కమేండెడ్ సర్టిఫికెట్, మరియు సిద్ధిపేట లలితకళా అకాడమీ అవార్డును కూడా పొందారు. 1993లో పాపులేషన్ కంట్రోల్ బోర్డ్ నిర్వహించిన స్పాట్ పెయింటింగ్ పోటీల్లో టి.ఎస్. మెహతా అవార్డు చేజిక్కించుకోగా 1994లో జె.ఎన్.టి.యు నుండి గోల్డ్ మెడల్‌ను సాధించారు. ఇంకా కేమిల్ కంటెస్ట్, లలిత కళావరిషత్ విశాఖపట్నం, కోనసీమ చిత్రకళాపరిషత్ అమలాపురం లాంటి పలు సంస్థల నుండి ఎన్నో బహుమతులను అందుకోవడం జరిగింది.

### జగమెరిగిన 'మేలి' చిత్రం – రామకృష్ణ 'వేలి' చిత్రం

చిత్రకళాస్రష్టకు మారుపేరు నా ఆత్మీయ మిత్రుడు ఆత్మకూరు రామకృష్ణ.

కుంచెతో బొమ్మలు వేయడమే ఓ 'చిత్ర' మైన కళ తన చేతిలోనే చిత్రకళ దాగివుండగా బొమ్మలేసేందుకు వేరే ఉపకరణాల సాయం ఎందుకని తలంచి చేతివేళ్ళనే కుంచెలుగా తలంచి ప్రకృతికి ఆకృతినిచ్చారు.

వీక్షకులు పలు రికార్డు సంస్థల పర్యవేక్షకుల సమక్షంలో తన చేతివేళ్ళ చిత్రకళా నైపుణ్యాన్ని ప్రదర్శించి '7' ప్రపంచ రికార్డులను అందుకొన్నారు. చిత్రకళా చరిత్రలో ఓ 'నూతన' రికార్డును సృష్టించి క్రొత్త అధ్యాయానికి తెరతీసారు.

నశ్వరమైన మానవ శరీరాలను తన చిత్రకళా మాధ్యమంగా తీసుకోకుండా ఈశ్వరమైన ప్రకృతి అందాలను తీసుకొని అందరికీ అలౌకిక ఆనందాన్ని పంచాడు.

మనిషి ఒక ఓ జోన్నే కాకుండా తానున్న ప్రతి జోన్‌కి ముప్పు తెచ్చిపెడుతున్న తరుణంలో అభివృద్ధి పేరిట ఈ నేల నాలుగు చెరగుల నేడు 'మానవ' తప్పిదాలవల్ల కనుమరుగు చేసే లాండ్ స్కేప్ అయిపోతున్న తరుణంలో పర్యావరణ రక్షణలో భాగంగా ఓ బాధ్యతగల కళాకారుడిగా రామకృష్ణ ఈ నేలతల్లి ఋణం తీర్చుకొన్నారు.

ప్రకృతిని శతరూపాలలో చిత్రించి ప్రపంచమానవాళి దృష్టిని పర్యావరణం వైపు మరల్చడంలో సఫలీకృతుడయ్యాడనడంలో సందేహం లేదు.

ప్రకృతిని తన వేళ్ళతో మేట ఆ శిల్ప తరంగాలను నేటి, రేపటి తరాల అంతరంగాలను తాకేలా చేశాడు.

కేవలం తన మునివేళ్ళతోనే చిత్రాలను వేసే ఈ (ఆ) చిత్రమునిని, పల్లె చిత్రకారుడు పదికాలాలపాటు పచ్చగా వికసిస్తూ, ప్రకాశిస్తూ తన చిత్రకళా సౌరభాన్ని ఈ నేల నాలుగు చెరగులా వ్యాప్తి చేయాలని ఆశిస్తూ....



బి.ఎం.పి.సింగ్



కేవలం తన చేతివ్రేళ్లతో చిత్రకళలో మాస్టర్ మీడియా అయిన తైలవర్ణాలతో శతాధిక చిత్రాలను వేస్తూ ఇప్పటికే 7 ప్రపంచ రికార్డులను సొంతం చేసుకున్న రామకృష్ణ గిన్నీస్ రికార్డు కోసం ప్రయత్నిస్తున్నారు. నిరంతర కృషి పరిశ్రమ, పట్టుదలే ధ్యేయంగా సాగుతున్న ఈ చిత్రకారుడికి గిన్నస్‌రికార్డ్ అందుకోవడం కూడా ఏమాత్రం కష్టం కాకపోవచ్చు.

వినూత్నమైన ఈ తరహా చిత్రణలో రాకెట్ వేగంతో దూసుకుపోతూ రికార్డుల మీద రికార్డులు సాధిస్తున్న రామకృష్ణ మనవాడు మన తెలుగువాడు కావడం మనకు గర్వకారణం.

***email: snventapalli@gmail.com***



# రాముడంటే రామారావుగారే...!



(అక్కినేని మనసులోమాట పుస్తకం నుండి)

**కె.వి.రెడ్డిగారు** 'శ్రీ కృష్ణార్జున యుద్ధం' ఆరంభించే ముందు నన్ను కృష్ణుడి వేషం వెయ్యమని అడిగారు. రామారావుగారు అర్జునుడు. మా పర్సనాలిటీల ప్రకారం–ఆయన ఊహ నిజమే. కానీ, నేను ఒప్పుకోలేదు. కృష్ణుడి వేషానికి పొట్టి, పొడుగులు అడ్డురావు గాని, అర్జునుడికి అడ్డ వస్తాయి. అర్జునుడు మహావీరుడు, ఎగు భుజాలతో ఎత్తుగా వుంటాడని పౌరాణికులు రాశారు. కె.వి.గారి లెక్కలో రామారావుగారు అర్జునుడు, నేను కృష్ణుడు సమంజసమే. కాని, 'మాయాబజార్'లో రామారావుగారు కృష్ణుడు వేస్తే, కృష్ణుడంటే ఆయనే అని, ప్రేక్షకజనం తీర్మానించారు. ఆ మాటే అన్నాను, "మీరు ఆయన్ని కృష్ణుడిగా బాగా పాపులర్ చేశారు. ఇప్పుడు నేను వేస్తే, ప్రజల దృష్టిలో అసమంజసవుతుంది. నన్ను, ఆయన కృష్ణుడితో సరిపోల్చారనుకోండి–బాగులేదనిపించుకున్నాననుకోండి– దెబ్బకొడుతుంది. దాని వల్ల నాకు పోయేదేంలేదు. మీకే నష్టం కలుగుతుంది.

జయంతి సంస్థకి, మీరు 'పెళ్లినాటి ప్రమాణాలు' తీశారు. అంత ప్రోత్సాహకరంగా నడవలేదు. మళ్లీ ఇలాంటి పొరపాటు చెయ్యడం ఎందుకు? మీరు ఆలోచించండి. నేను కృష్ణుడికి బాగుండనని కాదు. ఆయన ఆ పాత్రకి స్థిరత్వం సంపాదించుకున్న తర్వాత, ఆయన పక్కన నేను వేస్తే ఇబ్బందుల్లో పడతాం. సినిమాలో



రామారావుగారు లేరనుకోండి, నేను కృష్ణుడనుకోండి. అది వేరే విషయం. మీరు ఉద్దేశించినట్లు రామారావుగారు అర్జునుడు సబబే కాని, ఈ పరిస్థితిలో మాత్రం కాదని నా అభిప్రాయం" అని, వాదించి కె.వి.రెడ్డిగారిని ఒప్పించాను.

అలా 'కృష్ణార్జున యుద్ధం'లో నాకు కృష్ణుడిగా వచ్చిన అవకాశాన్ని–రామారావుగారికి వున్న పాపులారిటీ దృష్ట్యా–వద్దనుకున్నాను. అంతకుముందు 'చెంచులక్ష్మి'లో విష్ణువు వేషం వేశాను గదా ఆ సినిమా ఘనవిజయం సాధించింది కదా. ఐతే, విష్ణువు ఆజానుబాహుడని ఎక్కడా లేదు. వీరత్వం, శూరత్వం, పౌరుషం గల పాత్రలకే ఆ రూపం నిర్దేశించారు. ఎప్పుడైతే–రామారావుగారు రాముడి పాత్రకీ, కృష్ణుడి పాత్రకీ అచ్చుగుద్దినట్టు సరిపోయారో–ప్రజలు ఏ పాత్రల ద్వారా ఆయన్ని ఆరాధిస్తున్నారో– దాన్ని వ్యతిరేకించకూడదు.

అలాగే, ఎమ్.ఎ.వి. వారు తమిళంలో 'సంపూర్ణరామాయణం' ఆరంభిస్తూ నన్ను రాముడు పాత్ర చెయ్యమని అడిగారు. నేను వెంటనే తిరస్కరించాను. "రాముడంటే, రామారావుగారే. ఆయన చేతనే వేయించండి. చిత్ర విజయానికీ, ఆ పాత్రకీ ఆయనే నూటికి నూరుపాల్లు" అని చెప్పాను. అప్పుడు రామారావుగారే ఆ పాత్ర చేశారు. సి.పుల్లయ్యగారు 'లవకుశ' ఆరంభిస్తూ ఇద్దరు హీరోలుంటే బావుంటుందని, నన్ను లక్ష్మణుడు వెయ్యమన్నారు. "లక్ష్మణుడిలో సింపతీ వుంది–మీలాంటి వాళ్లు వేస్తే సినిమాకి మేలు జరుగుతుంది" అన్నారు. నేనంటే ఆయనకి ఇష్టమే. ఆయన దగ్గర ఏ చిత్రమూ చెయ్యలేదనుకోండి. కారణాలు చర్చించలేదు గాని, 'వద్దులెండి' అని తప్పుకున్నాను.

# ఆమె తెలివితేటలు !!!

- బీ.వీ.ఎస్. ప్రసాద్

***గోవింద్, గోపాల్ ఇద్దరిదీ ఒకే ఆఫీస్‌లో ఉద్యోగం. వుద్యోగంలో చేరి పదేళ్లు అయ్యాక ఇద్దరూ ప్రొమోషన్‌కి అర్హత పొందారు. తమాషా ఏమిటంటే - ఇద్దరికీ ఇష్టదైవం వెంకన్నే, పేర్లూ ఆయనవే నాయే ఇద్దరూ పుట్టిందీ ఒకే వూరు. చదివిందీ ఒకే స్కూల్. చేరిందీ ఒకే ఆఫీసులో క్లర్కులుగా. పోటీతత్వం పెరిగింది ఇప్పుడు అని అంటారు కానీ, వీళ్లిదర్దరికీ గత 39 ఏళ్ల నుండీ పోటీయే. పుట్టింది కూడా ఒకే రోజు, ఒకే వూరు. చదువుల్లో, ఆటల్లో పాటల పోటీల్లో ఒకరికి ఫస్ట్ ఒకదాన్లో అయితే మరొకదాన్లో ఇంకోడు వుండాల్సిందే. భలే గమ్మత్తుగా వుంటుంది పోటీ.***

ఇద్దరికీ ఒకే ఏడాది పెళ్లిళ్లు అయ్యాయి. గోపాల్ భార్య పేరు రాధ. గోవింద్ భార్య పేరు రుక్మిణి.

ఇంతకాలం ఒకరికి ఫస్ట్ ఇంకొకరికి సెకండు అంటే వాళ్లు సర్దుకున్నారేమో గానీ, ఇప్పుడు పెళ్లాలు వొప్పుకొనేలా లేరు. ప్రొమోషన్ నాకంటే నాకు కావాలంటూ ఇద్దరి మధ్య పోటీ పెరిగిపోయింది.

రాఘవరావు ఇద్దరకీ బాస్. ఇద్దరూ పని బాగానే చేస్తారు. వారిలో ఎవరినో ఒకరిని ఎంపిక చేయాలి క్లిష్టమైన పనే. గోవింద్‌ని రికమెండ్ చేస్తే గోపాల్‌కి, గోపాల్‌ని రికమెండ్ చేస్తే గోవింద్‌కి నప్పదే ఎలా? ఇలాంటి తరుణంలో తప్పించుకొనే వుద్దేశ్యంతో రాఘవరావు ఎత్తు వేసాడు. వీళ్లలో ఎవరో ఒకరిని ప్రొమోట్ చేస్తే, మరొకరికి కోపం వచ్చి పని మానేస్తే, రేపు ఆఫీసులో పనులు సరిగా జరగవేమోనని బెంగ. వాళ్ల జోనల్ ఆఫీసు నుండి బిగ్‌బాస్- లేడీబాస్ "రమాదేవి"ని రమ్మన్నాడు. ఆవిడ ఎవరో ఒకర్ని సెలెక్ట్ చేస్తే- ఇటు రాఘవరావు కష్టం తీరుతుంది- పైగా గోవింద్, గోపాల్ ఇద్దరూ తనను తప్పు పట్టలేరు. అదీ ప్లాను.



రమాదేవి ఏదైనా పదంటే పదే నిమిషాల్లో తేల్చేస్తుందని గొప్ప పేరుంది. డైరెక్ట్ రిక్రూటీ ఆఫీసర్, రమాదేవి సరే! రేపు శుక్రవారం వస్తాను. కనకదుర్గమ్మ దర్శనం కూడా ఔతుంది" అన్నది. రాఘవరావుకి రమాదేవి ఎలా పదంటే పది నిమిషాల్లో ఇంతటి చిక్కుముడి ఎలా విప్పుతుందో ఉత్కంఠగా వుంది.

రమాదేవి–"రేపు రైల్వే స్టేసన్‌కి వచ్చేటప్పుడు మీరు గోపాల్నీ, గోవింద్‌ని కూడా తీసుకుని రండి. గెస్ట్‌హౌస్‌కి వెళ్దాం. ఎవరో ఒకరికి గెస్ట్‌హౌస్ చేరిన పదినిముషాల్లో ఆర్డర్ ఇచ్చేద్దాం" అని చెప్పి పెట్టేసింది.

రాఘవరావు అలాగే అని ఆరేంజిమెంట్లు చేసాడు. గోవింద్, గోపాల్ ఇద్దరినీ తన కార్లో తీసుకొని రైల్వేస్టేషన్‌కి తీసుకెళ్లాడు.

"గోవింద్ యు ఆర్ సెలెక్టెడ్" అని గోవింద్‌కి షేక్ హ్యాండ్ ఇవ్వడంతో ఆశ్చర్యపోయాడు రాఘవరావు.

విజయవాడ: ప్లాట్‌ఫారం 6–రైల్లోంచి ఎర్రచీరలో నల్లకళ్లద్దాలతో, పసిమి చాయతో రమాదేవి ఠీవిగా దిగింది. రాఘవరావు గోవింద్, గోపాల్‌లను ఇద్దర్నీ పరిచయం చేసాడు. ఇద్దరూ చెరో పుష్పగుచ్ఛం ఇచ్చారు. మేడం ఫ్రంట్‌సీట్‌లో కూర్చొని, రాఘవరావుగారూ "బ్యాక్‌సీట్‌లో కూర్చోండయ్యా" అనే దాకా వెయిట్‌చేసి ఒకేసారి ఇద్దరూ ఠక్కున కూర్చున్నారు. కారు గెస్ట్‌హౌస్ వైపు పరుగులు తీసింది.

కారు రయ్‌మని మలుపులో దూసుకుపోతుంది. ఇంతలో ఒక చిన్న కుక్కపిల్ల దారికి అడ్డం రావడం, సడన్‌బ్రేక్ పడడం జరిగిపోయింది. ఏమైందోనని గోపాల్ గోవింద్‌లు ఇద్దరూ ఒకేసారి కారు దిగారు. కుక్కపిల్లని తప్పించగానే కారు ఎక్కి కూర్చొన్నారు.

మరో రెండు నిమిషాలో గెస్ట్ హౌస్ వచ్చింది.

అందరూ కాఫీలు సేవించారు.

ఇక ఇద్దర్నీ విడి విడిగానో, ఒకేసారో ఇంటర్వ్యూ చేస్తుందని రాఘవరావు అనుకొంటున్నంతలోనే, రమాదేవి,

"గోవింద్ యు ఆర్ సెలెక్టెడ్" అని గోవింద్‌కి షేక్ హ్యాండ్ ఇవ్వడంతో ఆశ్చర్యపోయాడు రాఘవరావు.

గోపాల్–గోవింద్‌ని మనసారా అభినందించాడు. నిజానికి వారిద్దరూ ఇంటి దగ్గరే ఎవరికి ప్రొమోషన్ ఇచ్చినా మరొకరు స్పోర్టివ్‌గా తీసుకోవాలని నిర్ణయించుకొని వచ్చారు. రాని వారికి ప్రొమోషన్ పై సంవత్సరం వస్తుందని తెలిపోతుంది కనుక. ఇలాంటి నిర్ణయాలు చిన్నతనం నుంచి ఎన్నో తీసుకొని వున్నారు. ఎటొచ్చి ఇలాంటి నిర్ణయం రాఘవరావు గారి బుర్రకే మింగుడు పడలేదు. ఎంతో ఎక్స్‌పీరియన్స్ వున్న తను వీళ్లనో ఎవరిని ప్రొమోట్ చేయాలో తేల్చలేకపోవడం ఏమిటి? ఈవిడ పట్టుమని పదినిమిషాల్లో నిర్ణయించడం ఏమిటి? ఇక పట్టలేక, గోవింద్, గోపాల్‌లు వెళ్లగానే, "ఇంత తేలికగా ఎలా తేల్చారు– బేసిస్ ఏమిటి?" అని నెమ్మదిగా నమ్రతతో అడిగాడు.

మీ కారు బ్రేకులు కొంచెం టైట్ చేయించండి. కొద్దిలో కుక్కపిల్ల హరీ అని వుండేది. ఇంత తేలికగా ఎలా సెలక్ట్ చేసాననేగా మీ సందేహం

ఏం లేదు మాస్టారూ ఇద్దరూ సమవుజ్జీలని మీరే చాలా సార్లు చెప్పారు. గోపాల్ అడ్డం వచ్చిన కుక్కపిల్లను తరమడానికి పూనుకొన్నాడు పక్కనే వున్న కర్రపుల్లను తీసుకొని, గోవింద్ కుక్కపిల్లని చేతిలోకి తీసుకొని నిమురుతూ రోడ్డు పక్కన జాగ్రత్తగా వదిలాడు.

చేయాల్సిన పని చేస్తూ పక్క జీవిని గమనించు కొన్న గోవిందే గ్రేట్ అని అలా డిసైడ్ చేసా అంటూ గలగలా నవ్వేసింది.

ఆవిడ సిక్స్‌సెన్స్‌ని అభినందించకుండా వుండలేకపోయాడు. బాస్. అందునా లేడీబాస్ కనుక!!

"పై ఆఫీసుల్లో ప్రొమోషన్లు ఇలా డిసైడ్ అవుతాయన్న మాట" అనుకుంది ప్రొమోషన్ ఆర్డర్ టైపు చేసిన రాఘవరావుగారి పి.ఏ.!!!



కార్టూన్

# 2011 సం॥లో నవ్వులు పంచిన కార్టూనిస్టులు

తెలుగు పత్రికలలో కార్టూనిస్టుల తీరుతెన్నులపై ప్రత్యేక కథనం



**పత్రికలు పాఠకాదరణ పొందడానికి కార్టూన్లు ప్రధాన భూమికను పోషిస్తాయి. అందుకే ఏ పత్రికలో చూసినా మనకు కార్టూన్లు దర్శనమిస్తాయి. కార్టూన్‌లేని పత్రిక ఉప్పులేని కూరవంటిది. కార్టూన్ అనే ప్రక్రియను మొట్టమొదట ప్రారంభించిన తలిశెట్టి రామారావుగారి నుండి నేటి సరసి, కృష్ణ, వినోద్, హరి, హరికృష్ణ వరకు కార్టూన్ రంగంలో తమ ప్రతిభా పాటవాలను ఇప్పటికీ చూపుతున్నారు.**

కళాసాగర్

రాష్ట్రప్రభుత్వం ప్రతీయేటా ప్రకటించే హంస అవార్డులలో 2009 సం॥రానికి గాను రాగతిపండరీని, 2010 సం॥గాను కార్టూనిస్టు, రచయిత అయిన బ్నింను ఎంపిక చేసి, ఈ సంవత్సరం అవార్డులు అందజేసారు. కార్టూన్లకు గతంతో పోలిస్తే ఇప్పుడు ఆదరణ అంతగా లేదనే చెప్పవచ్చు. కారణం గతంలో పెద్ద పత్రికలు సైతం కార్టూనిస్ట్‌ను ప్రోత్సహించి, పారితోషకం పంపేవారు. కాని నేడు పెద్ద పత్రికలు కొత్త కార్టూన్లను ప్రచురించడంలేదు. సరికదా తమ వద్ద ఉన్న కార్టూన్లను తిప్పిపంపటం లేదు. దీని వలన కొత్త కార్టూనిస్ట్‌లకు నిరాశ ఎదురవుతుంది. కాని చిన్న పత్రికలు కార్టూనిస్ట్‌లను ప్రోత్సహించటానికి ప్రాధాన్యత నిస్తున్నాయి.

అలాగే కార్టూన్ రంగంలో ప్రవేశించే నూతన కార్టూనిస్ట్ తనకు అవకాశాలు రావటంలేదని నిరాశపడక, కార్టూన్లు వేసే పద్ధతి, కార్టూన్ ఆలోచనలను మెరుగు పరుచుకొంటూ. అవసరమైతే అందుబాటులోని సీనియర్ కార్టూనిస్ట్‌ని సంప్రదిస్తూ, మంచి కార్టూన్ బుక్స్‌ను చూస్తూ చక్కని హాస్యాన్ని పండించే కార్టూన్లు వేయగల్గితే తప్పక అన్ని పత్రికలల్లోను అవకాశం వస్తుంది. ఏపత్రికలో అయినా పాఠకులను కార్టూన్ చూసి నవ్వించేటట్లు చేయగల్గితే వారు మంచి కార్టూనిస్ట్‌లే. ఇలా కొంతకాలం కార్టూన్లు వేస్తూ వుంటే వారే సీనియర్ కార్టూనిస్ట్‌లుగా మారుతారు.



గత కొన్ని సంవత్సరాలుగా ఎలక్ట్రానిక్ మీడియా బాగా అభివృద్ధి చెంది కంప్యూటర్, ఇంటర్‌నెట్‌లు వచ్చిన తర్వాత కొంతమంది ప్రింట్ పత్రికలను ప్రారంభించటం కన్నా వెబ్‌మ్యాగ్‌జైన్స్ ప్రారంభిస్తున్నారు. అలాంటి మ్యాగజైన్స్‌లో మల్లిక్‌గారు తెలుగువన్.కామ్, కళాసాగర్ ఆధ్వర్యంలో 64కళలుడాట్‌కామ్,







జయదేవ్‌గారి తెలుగు కార్టూన్ డాట్‌కామ్ వంటివి నూతన కార్టూనిస్ట్‌లను ప్రోత్సహిస్తున్నాయి. ప్రింట్ మ్యాగజైన్‌ను కొంతమంది మాత్రమే చూడగలరు. కాని వెబ్‌మ్యాగజైన్ అయితే ప్రపంచం మొత్తం చూస్తుంది కాబట్టి వెబ్ మ్యాగ్‌జైన్స్‌కు ఈనాడు ఆదరణ పెరుగుతుంది. కొత్త, పాత కార్టూనిస్ట్‌లు దీనిని తమ వేదికగా మార్చుకొంటున్నారు.

ఈ సంవత్సరం రెండు తెలుగు కార్టూన్ పుస్తకాలు విడుదలైంది. తొలి తెలుగు కార్టూనిస్టు తలిశెట్టి రామారావు గారి కార్టూన్లతో ముల్లంగి వెంకటరమణారెడ్డి గారు ప్రచురించారు. రెండవది నవ్య వీక్లీలో వారం -వారం చక్కిలిగింతలు పెట్టే సరసిగారు తన మూడవ కార్టూన్ సంకలనాన్ని ప్రచురించారు. కలర్స్ ఆఫ్ ఇండియా పేరుతో శేఖర్ కూడా ఇంగ్లీషులో ఒక పుస్తకం ప్రచురించారు.

2011లో అమెరికా ప్రభుత్వం పొలిటికల్ కార్టూనిస్ట్‌లపై అంతర్జాతీయ స్థాయిలో ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించిన ఇంటర్‌నేషనల్ విజిటర్ లీడర్‌షిప్‌ప్రాజెక్ట్‌కి ప్రపంచంలోని వివిధ దేశాల నుండి ఎంపిక చేసిన మొత్తం (20)మంది కార్టూనిస్టులలో మన భారతదేశం నుండి ఎంపికయిన ముగ్గురు కార్టూనిస్టులలో ఒకరిగా స్థానం సంపాదించి "కలర్స్ ఆఫ్ ఇండియా" అనే తన సరికొత్త కార్టూన్ల పుస్తకం ద్వారా మన కార్టూన్ల కళాసౌరభాన్ని ప్రపంచానికి పరిచయం తెలుగు కార్టూనిస్ట్ "శేఖర్" (ఆంధ్రజ్యోతి దినపత్రిక పొలిటికల్ కార్టూనిస్ట్).

ఈ సంవత్సరం అంటే 2011వ సంవత్సరం వివిధ వార, పక్ష, మాసపత్రికల్లో కార్టూన్లు వేసి నవ్విస్తున్న వారిలో పాతవారితో పాటు, కొత్తవారు తమ ప్రతిభను చాటుకొంటున్నారు. ఇది హర్షించదగిన పరిణామం. సీనియర్ కార్టూనిస్ట్ అయిన బాపుగారు స్వాతి వీక్లిలో కార్టూన్లు వేస్తుండగా, మరొక కార్టూనిస్ట్ జయదేవ్‌గారు స్వాతి, చిత్ర, నది, మల్లెతీగ, కౌముది వంటి వాటిలో కార్టూన్లు వేస్తున్నారు. బాలిగారు కూడా నవ్య, కౌముది పత్రికలలో కార్టూన్లు గీస్తున్నారు. మరో సీనియర్ కార్టూనిస్ట్ రాగతిపండరి చిత్ర, నది, ఆంధ్రప్రదేశ్ పత్రికల్లో విరివిగా కార్టూన్లు వేస్తున్నారు. ఏ.వి.యం






గారు వార్త సండేబుక్, 64కళలుడాట్‌కామ్, చిత్ర, మల్లెతీగ, హాస్యానందంలలో పేజీకార్టూన్లు విరివిగా వేస్తున్నారు. మరో సీనియర్ కార్టూనిస్ట్ సరసిగారు నవ్య వీక్లీలో పాటు అన్ని పత్రికల్లో తన కార్టూన్లతో పాఠకులను నవ్విస్తున్నారు. ఈ సం॥ ఈనాడు ఆదివారంలో కూడా ఆయన కార్టూన్లు ప్రచురితమైనాయి. శేఖర్ కూడా దాదాపు అన్ని పత్రికల్లో కార్టూన్లు వేస్తున్నారు. వెంకట్ ఆంధ్రభూమి ఆదివారంలో పేజీ కార్టూన్లు వేస్తుండగా, వినోద్, వద్దేపల్లి ఆంధ్రభూమి ఆదివారంలో విరివిగా కార్టూన్లు వేస్తూ ఇంకా అనేక పత్రికలలో ఫుల్‌పేజీ కార్టూన్లు గీస్తున్నారు. వీరే కాక విజయ్, ఎస్.ఎన్. వెంటపల్లి, బీ.వీ.రాంప్రసాద్, కృష్ణ, ఆకుండి సాయిరాం, హరగోపాల్, భువన్, రాంమోహన్, బాచి, వి.ఆర్.ప్రసాద్, రామశర్మ, కశ్యప్, నరేష్, గాంధీ, హరి, అర్జున్, రామకృష్ణ, పద్మ, రామశేషు, జి.శ్రీనివాస్, చినబాబు, గంధంశ్రీ, వాగ్దేవి, నాగిశెట్టి, చిన్నన్న, కుమిలి, కందికట్ల, చలపాక ప్రకాష్, వేముల, చంటిబాబు, హరికృష్ణ, మల్లికార్జున, జి.నీరు, నగేష్, శివ వంటి కార్టూనిస్ట్‌లు మల్లెతీగ, స్మైల్‌ప్లీజ్, భావతరంగిణి, నది, చిత్ర, విశాలాక్షి వంటివే కాక ఇతర పక్ష, వార, మాస పత్రికల్లో కార్టూన్లు వేశారు.




### అంతర్జాలంలో కార్టూనిస్టులు

కార్టూనిస్టులలో బ్లాగులు ప్రారంభించిన వారిలో సురేఖ, జయదేవ్, బాబు, కళాసాగర్, శంకర్, వెంకట్, మృత్యుంజయ గార్లను చెప్పుకోవచ్చు. వీరిలో కొందరు తమ పదునైన కార్టూన్లతో బ్లాగర్లను అలరిస్తున్నారు. అలాగే ఫేస్‌బుక్‌ను కూడా మన కార్టూనిస్టులు బాగా ఉపయోగించుకుంటున్నారు. సుభాని, నర్సిం, జయదేవ్, మృత్యుంజయ, టీవీ, చంటిబాబు లాంటి అనేక మంది కార్టూనిస్టులు తమ కార్టూన్లను పోస్టుచేస్తున్నారు. బలరాం లాంటి కార్టూనిస్టులు వెబ్ మేగజైన్లకూ గీస్తున్నారు.

కార్టూనిస్ట్‌లను ప్రోత్సహించే స్మైల్‌ప్లీజ్ నవ్వండి మాసపత్రికలో కొత్త కార్టూనిస్ట్‌లుగా పిపి నాయుడు, నాగషరిత, కాళిదాసు, రాగతి శ్రీశాంతి, నాగరాజ్, విరంచి, కుశల్, ప్రసాద్, తన్వీర్ వంటి కొత్త కార్టూనిస్ట్‌లు విజృంబించి కార్టూన్లు వేస్తున్నారు. ఇంకా అనేక మంది లోకల్ పత్రికలలో కార్టూన్లు గీస్తున్నారు.

ఏది ఏమైనా కార్టూన్ రంగంలోని కొత్తవారు విరివిగా రావటం సంతోషకరం ఇలా వచ్చినవారికి తగిన ప్రోత్సాహం లభిస్తే వీరు కూడ రాబోవు రోజుల్లో మంచి కార్టూనిస్ట్‌లుగా మారతారు.

జూలై నెలలో సుమధుర కళానికేతన్ మరియు 64కళలు డాట్‌కామ్ సంయుక్తగా నిర్వహించిన కార్టూన్ల పోటీ-ప్రదర్శన కార్టూనిస్టులను ఉత్సాహపరిచింది.

ఈ సాంప్రదాయాన్ని ఇలాగే కొనసాగిస్తూ రాబోయే సంవత్సరాలలో మరింత మంది కొత్త కార్టూనిస్ట్‌లు పత్రికలద్వారా, వెబ్ మ్యాగజైన్స్ ద్వారా పరిచయం కావాలని ఆశిద్దాం.

*(ఈ వ్యాసం 2011 సంవత్సరానికి మాత్రమే వర్తిస్తుంది.)*



# కోడి

బి.ఎం.పి.సింగ్

మాలో కోడిపుంజు "రేంజే" వేరు...
తలపై కిరీటంతో రాజసం ఉట్టిపడే "రాయల్టీ".
ఆ దర్పానికీ, దర్జాకీ తగిన "పర్సనాలిటీ"
పందెం పుంజు తినే ఆ ఆహారం స్పెషల్ క్వాలిటీ!
మ్యాచ్ ఫిక్సింగ్ లేకుండా తన యజమానిని గెలిపించే "సిన్సియారిటీ".
వేళ తప్పకుండా "వేకువ"నే కూత వేయటంలో పంక్చువాలిటీ.
ఈ విషయంలో యుగ-యుగాలుగా తనకున్న "సీనియారిటీ"
అనేక రంగుల ఈకలతో నవనవలాడే "నావెల్టీ"
బరిలో బరితెగించి పోరాడే "స్టెబిలిటీ"
పందెంలో కనబరిచే "క్రూయల్టీ"
గెలిచినాక "పబ్లిసిటీ" పాపులారిటీ
ఇవన్నీ వరాలే పుంజు పాలిటి.
స్వామి భక్తిలో కర్ణుడికేమాత్రం తీసిపోదు మా కోడిపుంజు.
దుర్యోధనుడి ఉప్పు కారం తిన్నందుకు కర్ణుడు కురుక్షేత్ర యుద్ధంలో దుర్యోధనుడ్ని గెలిపించాలని
తన సొంత సోదరులయిన పాండవులతోనే పోరాడినట్లు... మా కోడి పుంజు కూడా
తన యజమాని గెలుపుకోసం తన సొంత జాతితో తన ప్రాణాలుపణంగా పెట్టి పోరాడి
తన స్వామి భక్తి ప్రదర్శిస్తుంది.
"ప్రతీ "జీవి"తం ఓ పోరాటం - ప్రతి జీవికి తప్పదు దీన్ని పోరి గెలవటం"
అనే ధర్మానికి నిదర్శనంగా మా కోడిపుంజు నిలుస్తుంది.
కోడి పందెం అనగానే... కుర్రాళ్లే కాదు...
మూడుకాళ్ల ముసలాళ్లూ "గురక"లెయ్యటం మాని ఉత్సాహంతో "ఉరక"లేస్తారు.
పందెం పుంజు ఎగిరినప్పుడల్లా... తాతగార్ల బోసినోర్లు "తుస్సు" మన్నాగానీ
"కస్సు"మని "ఈల" (ఈల) వేసి గోలగోల చేస్తారు. వీరు 60లో 20లవుతారు.
మీ సమాజంలో ఇదీ ! మా పక్షిజాతిలో
ఏ పక్షికీ లేని మా కోడిపుంజు రేంజ్ !
ఈ రేంజ్‌కి ఇతర ఏ పక్షీ చేరలేదు ఛాలెంజ్ !

*email: munipratapsinghb@gmail.com*

# తెలుగు నేల మీద..
# సాంప్రదాయక చిత్రాల మజిలీ

**చిత్రకళకు ఆయువుపట్టుగా ఉన్న తెలుగు నేల మీద మరో వినూత్న ప్రయోగం పురుడుపోసుకుంది. ఒకే రకమైన ఆర్ట్ ఎగ్జిబిషన్‌లు ఏర్పాటు చేసే పద్ధతికి విరామం ప్రకటించి, సాంప్రదాయ కళను నలుగురికి పరిచయం చేసింది. తరతరాల వారసత్వంగా అందివస్తున్న ఈ అరుదైన కళారూపాన్ని నగర ప్రజలకు, చిత్రకారులకు పదిరోజుల పాటు కనువిందు చేసింది.**


చిత్రాలను తిలకిస్తున్న అక్కినేని అమల

సాంప్రదాయ చిత్రాల మెరుపుల్లో సాయంకాలాలు మరింత రంగులమయమయ్యాయి. సాంప్రదాయక చిత్రకారులు తమ చిత్రాలను ఆర్ట్ ఆక్షన్ హౌజెస్ (వేలపు నిలయాలు), ఆర్ట్ గ్యాలరీలలో ఉంచి వాటిని మార్కెట్ చేసుకోవడం చిత్రకళాభిమానులతో మరియు కొనుగోలుదారులతో సంబంధాలు కొనసాగించడమంటే ఇదొక దీర్ఘకాలిక ప్రక్రియ. ఇలాంటి గ్యాపును నింపడం కోసం ఆర్సీటీపీ(రీసోర్స్ సెంటర్ ఫర్ ట్రెడిషనల్ పెయింటింగ్స్) పనిచేస్తుంది. ఇందులో భాగంగానే డిసెంబర్ 12 నుంచి 20 వరకు సాంస్కృతిక శాఖ ఆధ్వర్యంలో ఉన్న స్టేట్ ఆర్ట్ గ్యాలరీతో కలిసి ఒక చిత్రకళా ప్రదర్శన ఏర్పాటు చేసింది. ఈ ప్రదర్శనలో ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన కళాంకారీ పెయింటింగ్స్ (కాళహస్తి) , నిర్మల్ పెయింటింగ్స్(ఆదిలాబాద్) ,గోండు పెయింటింగ్స్ (మధ్యప్రదేశ్), మధుబని పెయింటింగ్స్(బీహార్), తంజావూరు పెయింటింగ్స్ (తమిళనాడు) మరియు బాతిక్ పెయింటింగ్స్ (హైదరాబాద్, ఉత్తరప్రదేశ్)లకు సంబంధించిన ఒరిజినల్ పెయింటింగ్స్‌ని ఆర్ట్ గ్యాలరీలో ప్రదర్శనకు, అమ్మకం కోసం ఇందులో ఏర్పాటు చేశారు. వీటితో పాటు ట్రెడిషనల్ పెయింటింగ్స్‌కు సంబంధించిన సమాచారాన్ని కూడా గ్యాలరీలో అందించారు. ఫైన్ ఆర్ట్స్ కాలేజీ విద్యార్థులతో పాటు, ఇతరులు ఈ సమాచారాన్ని చదివి వారికి ఎంతగానో ఉపయోగపడేదిగా ఉందని చెప్పారు.


ప్రదర్శనను ప్రారంభిస్తున్న బి. శ్రీనివాసరెడ్డి


సన్మానం అందుకుంటున్న శివప్రసాద్ రెడ్డి (కళంకారి చిత్రకారుడు)

ఈ ఎగ్జిబిషన్‌లో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన సాంప్రదాయ చిత్రకారులు డి. వైకుంఠం(చేర్యాల), అనిల్(నిర్మల్), వై. ప్రకాష్ (బాతిక్ ఆర్టిస్టు, హైదరాబాద్), శివప్రసాద్ రెడ్డి (కళాంకారి ఆర్టిస్టు, కర్నూలు)లు పాల్గొన్నారు. శివప్రసాద్‌రెడ్డి చిత్రించిన కళాంకారి చిత్రం 11×47 అడుగుల సైజ్ కలిగిన పెద్ద చిత్రానికి లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్‌లో చోటు దక్కింది. ఈ కళాంకారి పెయింటింగ్‌లో రామాయణ, మహాభారతం వంటి పురాణ ఇతిహాసాల కథాంశాలు ఇందులో ప్రతిఫలించాయి. వైకుంఠం చేర్యాల్ స్క్రోల్ పెయింటింగ్ ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది.

ఈ కార్యక్రమానికి బి. శ్రీనివాస్ రెడ్డి (ప్రిన్సిపాల్, కాలేజ్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్, జేఎన్ఏఎఫ్ఏయూ) ముఖ్య అతిథులుగా, శ్రీ హర్షవర్ధన్ (డైరక్టర్, సాంస్కృతిక శాఖ) విశిష్ట అతిథిగా విచ్చేసి గ్యాలరీని ప్రారంభించగా, ఎన్ఐ-ఎంఎస్ఎమ్ఈ డైరక్టర్ జనరల్ ఉదయ్‌శంకర్, శ్రీ జీయూకే రావులతో పాటు ఆర్సీటీపీ హెడ్ వీవీఎస్ సత్యనారాయణ తదితరులు పాల్గొన్నారు. ముఖ్య అతిథి బి. శ్రీనివాస్ రెడ్డి మాట్లాడుతూ "దేశంలోని అన్ని రకాల సాంప్రదాయ చిత్రకళలను ఒక్కొక్కటి గా, ఆయా కళల గురించి ఒక వర్క్‌షాప్‌ను ఫైన్ ఆర్ట్స్ విద్యార్థులతో కలిసి నిర్వహించాలి" అని సూచించారు.

విచ్చేసిన అతిథులను శ్రీ శివప్రసాద్ రెడ్డి గార్లను (కళంకారి చిత్రకారుడు) నిర్వాహకులు శాలువాలతో సాంప్రదాయబద్ధంగా సన్మానించారు. ఈ ప్రదర్శనకు సంబంధించిన విశేషాలు ఆయా దినపత్రికల్లో ప్రచురితమయ్యాయి.


చిత్రాలను తిలకిస్తున్న చందనాఖాన్

ఈ ఎగ్జిబిజన్ నిర్వహించిన పదిరోజులలో ప్రముఖులు, కళాభిమానులు సందర్శించారు. వారిలో శ్రీమతి చందనఖాన్, ఐఏఎస్, నటి శ్రీమతి అక్కినేని అమల, వర్ధమాన సీనియర్ చిత్రకారులు తోట వైకుంఠం సందర్శించి సాంప్రదాయ పెయింటింగ్స్‌ని కొనుగోలు చేశారు.

ఈ కార్యక్రమానికి నిమ్స్‌మీ సీఈఓ వల్లభరెడ్డి, మరియు ఆర్సీటీపీలోని ఉద్యోగులు సౌమ్య, గౌరి, సుందర్, లింగరాజు గోనెలతో పాటు ఆర్ట్ గ్యాలరీలలోని రాజ్యశ్రీ తదితర సిబ్బంది సహకరించి విజయవంతం చేశారు.

ఇలా సాంప్రదాయక చిత్రకళ ప్రదర్శన తెలుగు చిత్రకారులకు పరిచయం చేయడంతో పాటు, ఇలాంటి కళ ఒకటుందనే విషయాన్ని విడమరిచి చెప్పినట్లైంది. కళను నమ్ముకుని, కళకే జీవితాలను అంకితం చేసిన వారి కృషికి కొంత తోడ్పాటును అందించినట్లైంది. ఇక ముందు సాంప్రదాయక కళకు సంబంధించి మరిన్ని కార్యక్రమాలు ఏర్పాటు చేసేందుకు ఈ కార్యక్రమం ఎంతగానో ఉపయోగపడుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు. ఇది అతిథుల మాట కూడా...

**- గోనె లింగరాజు,** ఎమ్.ఎఫ్.ఏ.
**హైదరాబాద్**

64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం
సంపుటి :2 సంచిక :4 ఫిబ్రవరి 2012



64కళలుడాట్‌కాం మొదటి సంవత్సరం పూర్తి చేసుకొని రెండవ సంవత్సరంలోకి అడుగుపెట్టింది. కళలపై నున్న ఆశక్తితోనూ–అభిరుచితోను ప్రారంభించిన ఈ వెబ్ పత్రికకు విశేష ఆదరణ లభించింది.

ప్రారంభంలో నెలకు వెయ్యిమంది రీడర్స్‌ను (యూజర్స్) కలిగివున్న 64కళలు డాట్‌కాంను ప్రస్తుతం పదివేలకు పైగా యూజర్స్ విజిట్ చేస్తున్నారు. మొదటి సంవత్సరం పూర్తైన సందర్భంగా కొన్ని కొత్త శీర్షికలను ప్రారంభించనున్నాము. త్వరలో ఆ వివరాలు కూడా ప్రకటిస్తాం.

రెండవ సంవత్సరంలోకి అడుగిడిన సందర్భంగా కళాకారుల నుండి, కళాభిమానుల నుండి శుభాకాంక్షలు, ప్రశంసలు అందుతూనే వున్నాయి. వారందరికీ మా కృతజ్ఞతాభివందనాలు.

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : ఎస్.వి.రమణ



యువతను విశ్వరూప ప్రతినిధి చేసిన - వివేకానందుడు

కోనసీమను వర్ణమయం చేసిన చిత్రకళా పోటీలు



ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే

సంస్కృతి

# కోనసీమను వర్ణమయం చేసిన
# చిత్రకళా పోటీలు

(జనవరి 8 మరియు 22వతేదీలలో రాజోలు, అమలాపురంలో జరిగిన చిత్రకళాప్రదర్శన-బహుమతి ప్రధానోత్సవం, వర్క్‌షాప్‌ల గరించి ప్రత్యేక వ్యాసం)

**పుష్పించడం అనేది మొక్కలకు ఫలవంతమైన చర్య అయితే ఆ పుష్పాలకు పరిమళ వర్ణ సౌందర్యాలు తోడయ్యి ఆ సుగంధ పరిమళ గుబాలింపులు నలు చెరుగులా వ్యాపించినపుడు అవి మరింత ఫలవంతమౌతాయి.**



**- వెంటపల్లి సత్యనారాయణ**

పుష్పానికి పరిమళం, మనిషికి వ్యక్తిత్వం ఎలాగో ఓ ప్రాంతానికి సంస్కృతి కూడా అలాగే, అలాంటిసంస్కృతి పరిడవిల్లడానికి తోడ్పడే ముఖ్య సాధనాలు కళలు. అలాంటి కళలతో విశిష్టమైనది చిత్రకళ, రాష్ట్రంలో అలాంటి చిత్రకళావ్యాప్తికి నిరంతరంగా పనిచేస్తూ విశిష్టంగా కృషిచేస్తున్న చిత్రకళా సంస్థలలో మొదటిది కోనసీమ చిక్రకళాపరిషత్, అమలాపురం, అయితే రెండోది రాజోలు చిక్రకళాపరిషత్, రాజోలు. విచిత్రంగా ఈ రెండు సంస్థలు ఒకే ప్రాంతమైన కోనసీమకు చెందినవే కావడం యాధృచ్చికం. అందుకే అందాల కోనసీమ జనవరిలో రమణీయ చిత్రకళాసీమగా మారింది. కారణం రాష్ట్రంలో చిత్రకళాసంస్థలు ఎన్నో ఉన్నా క్రమం తప్పకుండా ఓ ప్రణాళికా బద్ధంగా ఎక్కడా విరామం లేకుండా రాష్ట్ర, జాతీయ స్థాయిలలో చిత్రకళా పోటీలను బాలల స్థాయి నుండి పెద్దస్థాయి వరకూ మరియు మహిళలకు రంగోలీ పోటీలను, ఇంకా చిత్రశిల్ప, నిశ్చల చిత్రప్రదర్శనలు నిర్వహించే సంస్థలు మాత్రం ఈ రెండే కనిపిస్తున్నాయి.

వీటిలో ఇరవైరెండేళ్ళు పూర్తిచేసుకొన్న సంస్థ కోనసీమ చిత్రకళాపరిషత్ అమలాపురం అయితే మొదటి దశాబ్ధాన్ని ఇటీవలే విజయవంతంగా పూర్తిచేసుకుని తన రెండవ దశాబద్దంలోకి అడుగుపెట్టిన మరో చిత్రకళా సంస్థ రాజోలు చిత్రకళాపరిషత్ రాజోలు.

8.01.2012 నాడు రాజోలు చిత్రకళాపరిషత్ తన 10వ వార్షికోత్సవాన్ని ఎంతో ఘణంగా నిర్వహించింది. ఈ సందర్భంగా సంస్థ నిర్వహించిన రాష్ట్రస్థాయి చిత్రకళాపోటీలకు రాష్ట్రంలోని నలుచెరుగులు నుండి వచ్చిన చిత్రాలు ప్రేక్షకులను ఎంతగానో అలరించాయి. విశాలాంధ్ర సీనియర్ కార్టూనిస్ట్, చిత్రకారుడు మరియు రచయిత అయిన టి.వి. గారి వ్యక్తిగత చిత్రకళ ప్రదర్శన ఒక ఎత్తయితే రాష్ట్ర నలుమూలల నుండి వచ్చిన చిత్రకారులకు కాన్వాస్, పేలట్‌లు అందచేసి వారిచే అప్పటి, వీక్షకుల సమక్షంలో తమదైన చిత్రాలు వేయించడం అందరిలో చాలా ఉత్సాహాన్ని నింపింది. తక్కువ వ్యవధి లోనే అయినా చిత్రకారులు నాబా, తారానగేష్, బాలయోగి, వెంపటాపు, ముత్యాలరావు, బీర శ్రీనివాస్, ఎస్.ఎన్ వెంటపల్లి, ఆశీర్వాదం, చక్రవర్తి, ఉదయకుమార్ ఇత్యాది చిత్రకారులు మంచి వచ్చిన చిత్రాలను వేసి అందరినీ ఆకట్టుకున్నారు.



రాజోలు చిక్రకళాపరిషత్ నుండి సత్కారం అందుకుంటున్న టీవీ

రాజోలు చిత్రకళా సంస్థ ప్రారంభం నుండి ఇస్తున్న



రాజోలు చిత్రకళాపరిషత్ నుండి సత్కారం అందుకుంటున్న వెంటపల్లి




చిత్రకారుడు వెంటపల్లి

ప్రఖ్యాత ప్రకృతి చిత్రకారుడు, ఆంధ్రా టర్నల్ వి.వి. భగీరధి స్మారక అవార్డును దశమ వార్షికోత్సవంలో చిత్రకారుడు టీవికి ఇవ్వగా తొలిసారిగా ఈ సంస్థ కార్యదర్శి, స్వర్గీయ భగీరధికి స్వయానా మనమరాలు అయిన శ్రీమతి ఎన్.వి.పి.ఎస్.ఎస్ లక్ష్మీ తన చిత్రకళా గురుదేవులయిన స్వర్గీయ మాదేటి రాజాజీ స్మారక అవార్డును కూడా ప్రవేశపెట్టి ఈ తొలి అవార్డును ప్రముఖ చిత్రకారుడు నడింపల్లి శ్రీధర్‌కి బహూకరించారు.

ఇక దశమ వార్షికోత్సవ సందర్భంగా నిర్వహించిన రాష్ట్రస్థాయి చిత్రకళాపోటీలలో ప్రథమ బహుమతిని ఒక్కరికి ఇవ్వగా 5గురికి ద్వితీయ, 5గురికి తృతీయ, మరో ఐదు ప్రోత్సాహక బహుమతులను ఇవ్వడం జరిగింది.

సంస్థ అధ్యక్షులు వీరభద్రరావు కార్యదర్శి శ్రీమతి ఎన్.వి.పి.ఎస్.ఎస్. లక్ష్మి నిర్వాహణలో ఆద్యంతము ఎంతో గొప్పగా జరిగిన ఈ కార్యక్రమానికి సాలార్‌జంగ్ మ్యూజియం క్యురేటర్ శ్రీమతి కేదారేశ్వరి వచ్చి అందరి చిత్రాలను చూసి వ్యాఖ్యానించడం అదనపు ఆకర్షణగా నిలిచింది. స్పాట్ పెయింటింగ్ వేసిన చిత్రాలను చిత్రకారులు ఆసంస్థకు బహుకరించి తమ గొప్ప మనస్సును చాటుకుని ఈ కార్యక్రమానికి మరింత వన్నె తీసుకొచ్చారు.

ఇక జాతీయ స్థాయిలో జనవరి 22న కోనసీమ నడిబొడ్డు అమలాపురంలో జరిగిన కోనసీమ చిత్రకళాపోటీలు, సంస్థ 22 వార్షికోత్సవం ఎప్పటిలాగే పెద్ద పండుగను తలపించేలా చేసారు. దేశంలో అనేక రాష్ట్రాల నుండి వచ్చిన కళాకారులు, వారి వారి చిత్రాల ప్రదర్శనతో ప్రదర్శనశాల ఓ రమణీయ హరివిల్లుగా మారి ప్రేక్షకులకు కనువిందు చేసాయి.

22-1-2012 ఉదయం 8గంటలకు జాతీయ స్థాయి బాలల చిత్రకళా పోటీలను మాజీ ఎమ్.ఎల్.ఏ. కుడుపూడి చిట్టబ్బాయి ప్రారంభించగా మాజీ మున్సిపల్ కౌన్సిలర్ నల్లా విష్ణుమూర్తి చిత్రకళాపరిషత్ లోగోను ఆవిష్కరించారు. పారుపూడి కృష్ణ శాస్త్రి గారి జ్యోతి ప్రజ్వలన కార్యక్రమంతో 22వ జాతీయ చిత్రకళాపోటీలు ప్రారంభమయ్యాయి.

ఉదయం 9గంటలకు జాతీయ చిత్రకళా ప్రదర్శనను



కోనసీమ చిత్రకళాపరిషత్ ప్రదర్శనను తిలకిస్తున్న సందర్శకులు




64కళలు.కామ్ వెబ్‌మేగ్‌జైన్ మొదటి వార్షికోత్సవ కార్యక్రమం




సత్కారం అందుకుంటున్న జీవన్ గోసిక

అమలాపురం ఆర్.డి.ఓ సంపత్‌కుమార్ ప్రారంభించారు. 9.15 గంటలకు ప్రముఖ చిత్రకారులు స్వర్గీయ రావాడకృష్ణ రాజమండ్రివారి వ్యక్తిగత చిత్రాల ప్రదర్శన కూడా ప్రారంభమైంది.

9.30 గంటలకు ప్రముఖ ఫొటోగ్రాఫర్ జితేంద్ర హరి హైదరాబాద్ వారి ఫోటోగ్రఫి ప్రదర్శన, మరియు దార్లనాగేశ్వరావుగారి రిప్లికాఆర్ట్ ప్రదర్శనను మున్సిపల్ కమీషనర్ శ్రీ బాపిరాజు గారిచే ప్రారంభమైంది.

10గంటలనుండి11గంటల వరకూమహిళల రంగవల్లుల పోటీలు నిర్వహించారు.



ఇక కార్యక్రమంలో ఒక ప్రత్యేక ఆకర్షణగా నిలిచిన అంశం ఈ యేటి పోటీలలో యూనివర్సల్ అవార్డ్ గ్రహీత అయిన హైదరాబాద్‌కు చెందిన జీవన్ గోసికచే లైవ్‌పోర్ట్రైట్ చిత్రణ. ఉదయం 11 గంటలనుండి 12 గంటల మధ్య సాగిన కార్యక్రమాన్ని ఆడిటోరియంలో ప్రేక్షకులందరూ ఆశక్తితో తిలకించారు. కేవలం 30 నిముషాలలోనే జీవన గోసిక తన ఎదురుగా మోడల్‌గా ఉన్న వ్యక్తి రూపచిత్రాన్ని అద్భుతంగా ఏక్రలిక్ కలర్స్‌తో కాన్వాస్‌పై చిత్రించి వీక్షకులను ఆశ్చర్యంలో ముంచెత్తారు.

మధ్యాహ్నం 2గంటలకు కె.సి.పి. డైరెక్టర్ పి.వి. నారాయణాచార్యులచే చిత్రకారుల పరిచయ కార్యక్రమం జరిగింది.

మధ్యాహ్నం 2.30 గంటలకు అంతర్జాల పత్రికలలో అనతి కాలంలోనే అనూహ్య సంచలనం సృష్టించి, కళా రంగంలో విశిష్ఠ సేవ చేస్తూ ప్రపంచ వ్యాప్తంగా తెలుగు కళాకారులను పరిచయం చేస్తున్న వెబ్‌మేగ్‌జైన్ 64కళలు.కామ్ మొదటి వార్షికోత్సవం సందర్భంగా నిర్వహించిన సభలో ఎడిటర్ కళాసాగర్, దీనిలో కళలపై ప్రధానంగా రచనలు చేస్తున్న మాకినీడి సూర్యభాస్కర్, ఎస్.ఎన్. వెంటపల్లి మరియు ఎల్.ఆర్. వెంకటరమణలు పత్రిక లక్ష్యాలను, వివిధ శీర్షికల గురించి వివరించారు. తర్వాత కె.లక్ష్మీమానస, యామిని, శ్రీనవ్య తదితర చిన్నారుల నృత్యం ప్రేక్షకులను బాగా అలరించింది.

అనంతరం ప్రారంభించిన బహుమతి ప్రధానోత్సవంలో ముందుగా కోనసీమ చిత్రకళాపరిషత్ 20వసంతాలు పూర్తిచేసుకున్న సందర్భాన ప్రతిష్ఠాత్మకంగా ఒకే వేదికపై నిర్వహించిన శతచిత్రకారుల సన్మాన కార్యక్రమానికి వచ్చిన మూడు ప్రపంచ రికార్డులు లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్, గ్లోబల్ బుక్ ఆఫ్ రికార్డ్, మరియు ఇండియన్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌ను, మాజీ మంత్రివర్యులు పినిపే విశ్వరూప్, నిమ్మకాయల చిన రాజప్ప మయరియు ఎమ్.ఎల్.ఏ. నల్లమిల్లి శేషారెడ్డిలు ఆవిష్కరించారు.

తదుపరి చిత్రకళారంగంలో విశిష్ఠంగా కృషిచేస్తున్న సీనియర్ చిత్రకారుడు కె.ఎస్. వాస్. విజయవాడ, శ్రీ గువ్వల కెనడి రాజమండ్రి మరియు ప్రముఖ ఫొటోగ్రాఫర్ జితేంద్రహరి హైదరాబాద్‌లకు సన్మాన కార్యక్రమం జరిగింది. అలాగే ఈ ఏటి పోటీలకు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన ఉదయ్‌కుమార్ పాలకొల్లు, టి. మృత్యుంజయరావు గుంటూరు, మరియు తారానగేష్ రాజమండ్రిలకు అభినందన కార్యక్రమం జరిగింది.

ఆపై చిత్రకారులందరూ ఎదురు చూస్తున్న బహుమతి ప్రధాన కార్యక్రమం. సాయంత్రం ప్రారంభయ్యింది.

దేశవ్యాప్తంగా వచ్చిన దాదాపు 300 ఎంట్రీలలో బహుమతుల వివరాలు ఇలా వున్నాయి.

**1. యూనివర్సల్ అవార్డు:** ఒక్కరికి ఐదు వేల రూపాయలు.

**2. మెగా అవార్డు:** ఒక్కొక్కరికి రెండు వేల రూపాయల నగదు, ఐదుగురికి.

**3. టాప్‌టెన్ అవార్డ్స్:** ఒక్కొక్కరికి వెయ్యి రూపాయలు, నగదు మెమెంటోలతో 10మంది చిత్రకారులకు ఈ అవార్డ్స్ ఇవ్వడం జరిగింది.

**4. కె.సి.పి అవార్డ్స్:** ప్రముఖ చిత్రకారుల పేరుమీదుగా ఇచ్చే ఈ అవార్డులు మొత్తం 20 మందికి ఇచ్చారు.

**5. జ్యూరీ అవార్డ్స్:** ఈ అవార్డులు మొత్తం 10 మంది చిత్రాకారులకు ప్రదానం చేయడం చేసారు.



ఇండియా బుక్ ఆఫ్ రికార్డును అందుకుంటున్న కొరసాల సీతారామస్వామి

**6. మెరిట్ అవార్డ్స్:** పదిమంది చిత్రకారులకు

**7. హైలీకమేండెడ్ సర్టిఫికెట్స్:** పదిమంది చిత్రకారులకు

**8. మెరిట్ సర్టిఫికెట్స్:** పదిమంది చిత్రకారులకు అందజేసారు.

అనంతరం జాతీయ స్థాయిలో నిర్వహించిన బాలల చిత్రకళాపోటీలలో గెలుపొందిన విజేలకు మెగా అవార్డ్‌గా ప్రకటించిన వెయ్యి రూపాయల నగదు

తర్వాత మొదటి బహుమతులుగా దేశ నలుమూలల నుండి వచ్చిన వేలకొలది బాలలలో 100మందికి గోల్డు మెడల్స్ బహుకరించడం జరిగింది. అలాగే ప్రతిభ కనబరిచిన వారికి కె.సి.పి అవార్డ్స్, మెరిట్‌సర్టిఫికెట్స్ ఇవ్వడంతో పాటు విశేషంగా పిల్లలను ప్రోత్సహించిన ఉత్తమ ఉపాధ్యాయులకు విశిష్ఠ ఆచార్య పురస్కారాలు అందజేసారు.

రాష్ట్రం నుండే కాక, రాష్ట్రేతర ప్రాంతాల నుండి విచ్చేసిన కళాకారుల మధ్య ఆహ్లాదంగా జరిగిన ఈ కార్యక్రమాన్ని కొరసాల సీతారామస్వామి గారు(సంస్థ కార్యదర్శి) దగ్గరుండి విజయవంతంగా నడిపించారు.

కళాకారులను అత్యధిక స్థాయిలో ప్రోత్సహించి, చిత్రకళను మరింత వ్యాప్తి చేయాలనే ఏకైక లక్ష్యంతో జాతీయ స్థాయిలో ఇరవై రెండేళ్లుగా ఇక్కడ నిర్వహించే చిత్రకళాపోటీల నిర్వహకులు కోనసీమ చిత్రకళాపరిషత్ వ్యవస్థాపక కార్యదర్శి సహస్ర గణపతుల రూపశిల్పి అయిన కొరసాల సీతారామస్వామి గారి కృషి పట్టుదల ముందు ఇప్పటికే ఆయనకు సొంతమైన లిమ్కా, ఇండియా, గ్లోబల్ రికార్డులే కాదు రేపు గిన్నీస్‌బుక్ రకార్డ్ కూడా ఆయన వశం అయినా ఆశ్చర్యపోనవసరంలేదు.




email: snventapalli@gmail.com



# 'చిత్ర' మైన జీవితం

Part-10

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...**





email: balisankar@gmail.com

ఆంధ్రజ్యోతి సంస్థ వారు ఏదో ప్రత్యేకానుబంధం వేస్తున్నారు-ఎన్నో వ్యాసాలుతో పాటు భానుమతి కథ కూడా అందులో ఉంది. ఆ కథ మొదట్లో ఎప్పటిలాగే ఆమె ఫొటో వేసే బదులు ఆమె స్కెచ్ వేస్తే బాగుంటుందన్నారు ఎడిటర్ రామమోహనరావుగారు. నేను గీయడం మొదలెట్టాను.

భానుమతి చెంపల దగ్గర వెంట్రుకలు చెవికింద వరకూ ఉన్నాయి కొనతేలిన ముక్కు, ఎత్తయిన బుగ్గలు నవ్వితే అవి ఇంకా పైకి వెళ్లిపోతాయి. ఇవన్నీ గమనిస్తూ స్కెచ్ వేస్తోంటే "లత" గుర్తొచ్చింది. ఎందుకంటే లతకీ ఇంచుమించు ఇలాగే ఉంటాయి. ఇద్దరూ అక్కా, చెల్లెళ్లంటే ఎవరన్నా ఇట్టే నమ్మవచ్చు.

ఆ తరవాతెపుడో 'లత' ఆఫీసుకు వచ్చింది. ఆమెకీ విషయం చెప్పాను. చాల ఆనందపడింది. కుర్చీ లాక్కొని నా సీటు పక్కన కూచుంటూ "ఇది నువ్వనడమేమిటి? లైలామజ్ను సినిమా నుండే చాల మంది అన్నారు. ఒక విషయం చెప్పనా? మా అమ్మ అందుకే



కదా నెత్తి మొత్తుకొని బాధపడేది. మానాన్న తిన్ననయిన వాడా?! అంది.

నాకు బుర్ర తిరిగిపోయింది. ఎక్కడ్నుంచి ఎక్కడికి వెళ్లింది... ఈ సంగతి భానుమతే వింటే!!

అదే 'లత' గొప్పతనం. మాటల్లో చమత్కారం.

వనితాజ్యోతి మాసపత్రికలో ఓ రెండు పేజీలు రచయిత్రుల గురించి నెలనెలా పరిచయం చేస్తున్నాడు దాని ఎడిటర్ "జె.ఎస్" (జొన్నలగడ్డ సత్యన్నారాయణ). అలా ఓ నెల 'లత' గురించీ రాశాడు. పత్రిక మార్కెట్లోకి వెళ్లింది. అది 'లత' కంట పడింది.

అందులో ఆమెకేదో తప్పు కనబడింది. వెంటనే రిక్షా వేసుకొని ఆంధ్రజ్యోతి ఆఫీసుకు వచ్చింది. జేఎస్.... జేఎస్... ఎక్కడ అని కంగారుగా లోపలికి వస్తోంది. ఈ విషయం ఎవరో ముందే పసిగట్టి 'లత' వస్తోంది. జె.ఎస్. ఎందు కన్నా మంచిది సీట్లోంచి ఎటన్నా పారిపొమ్మనమని చెప్పారు.

లత సంగతి తెలుసు జె.ఎస్. టాయ్‌లెట్‌లోకి పరుగు వేశాడు.

తిన్నగా 'జె.ఎస్.' ఉండే కేబిన్‌లోకి వెళ్లింది లత ఆమె విసురు నడక చూస్తోంటే ఏదో జరిగిందనిపిస్తోంది. జె.ఎస్. సీట్లో లేక పోగానే కుర్చీ లాక్కొని నా బల్ల ముందు కూచుంది.

"చూశావా బాలీ! ఈ "జె.ఎస్." ఎంత పని చేశాడో! ఊళ్లోనే ఉన్నాను కదా! ఓ ఫోన్ కొట్టి నన్ను వివరంగా అడగొచ్చుకదా!.

"ఏమిటన్నట్టు?" ఆమె వేపు చూశాను.

తన చేతిలో ఉన్న ఆ నెల వనితాజ్యోతిని టెబుల్ మీద పరిచింది. అందులో ఓ పేజీలో "లత" ఫొటో వేసి ఆమె గురించి పరిచయ వ్యాఖ్యాలూ, రచనల గురించీ ఉన్నాయి.

"ఇందులో విశేష–మేముందండీ– మామూలే కదా" అన్నాను.

'మామూలేమిటి? నా భర్త స్థానంలో తెన్నేటి వారు అని మా మామయ్యపేరు వేశాడు. ప్రస్తుతం ఆయన కాదు. 'ఆంజనేయ శాస్త్రి' – ఇది చదివి "ఇంకా వాడిపేరు ఉంచావేం? అనీ అంతెత్తు ఎగిరాడు" ఈ శాస్త్రి. ఇది తప్పుకాదా! వాడు లేక వీడూ లేక నా గతేం కావాలి చెప్పు. ఆంజనేయశాస్త్రికి ఎలాగో నచ్చచెప్పి వచ్చాను. ఇంట్లో ఎంత గొడవయిపోయిందనీ– వచ్చే నెల 'సవరణ' వేయించాలి. ఇంతకీ 'జె.ఎస్' టాయ్‌లెట్లో నుండి రాడేం! ఆ కన్నంలో నుండి ఎటన్నా జారిపోయాడా" అంది.



ఇంతలో ఎవరో వచ్చి చెప్పారు. జె.ఎస్. సీట్లోకి వచ్చాడని. రాక చస్తాడా? ఈ పూట ఈమె వదిలేటట్టు లేదు.

నాతో చెప్పినదే ఆయనకూ చెప్పి వచ్చేనెలలో 'సవరణ' వెయ్యమంది ఊళ్లోనే ఉన్నాను కదా! ఓ ఫోన్ కొట్టి అనుమానం తేల్చుకోవచ్చుకదా" అంది.

"ఎక్కడో ఓ పుస్తకంలో ఉంటే అదే వేసేశాను. ప్రస్తుతం మీరు ఏ భర్త దగ్గరున్నారో తెలియలేదు. సారీ అన్నాడు.

"అదే అనేది–తెలుసుకోవచ్చు కదా, సారీ! అంటే సరిపోయిందా జీవితమన్నాక బోల్డు మార్పులొస్తాయి. అదెప్పుడో ఇచ్చిన ఇంటర్వ్యూ అది నువ్విప్పుడు వేశావు. అది సరే గాని సవరణతో పాటు నాదో నవల ఉంది రెడీగా. ఎనౌన్స్ చెయ్యి దానితో పాటే".

జె.ఎస్ బుర్ర తిరిగిపోయింది.

ఈ గోల మధ్యాహ్నం భోజనాల వేళదాకా సాగింది. చివరకు ఇద్దరి మధ్యా ఏం రాజీ కుదిరిందో తెలీదు. ఆమె నవ్వుతూ వెళ్లిపోయింది.

కొడాలి సాంబశివరావు, యామినీ సరస్వతీ అనే వారిద్దరూ మంచి మిత్రులూ, నంధ్యాలవారే. ఇద్దరూ రచయితలే! అయితే సాంబశివరావు ఇంకా చాలా నవలలు రాశారు. నంధ్యాలలో హైస్కూలు రోడ్‌లో ఆయనకో పబ్లికేషన్ సంస్థ కూడా ఉంది. ఇంకా చాల నవలలు అంటే వందపైనే అన్నమాట. ఈ మిత్రులిద్దరూ విజయవాడ వస్తే హొటల్‌లో పది, పదిహేను రోజులపైగానే ఉండి. కొత్త నవలల ప్రింటింగ్, బైండింగ్ అన్నీ చేయించుకొని వెళ్లిపోయేవారు. రెండు, మూడు నవలలకు మాత్రమే నాతో ముఖచిత్రాలు గీయించినట్టు గుర్తు. ఏలూరురోడ్‌లో ఎదురుపడితే చాల సేపు మాట్లాడేవారు.

సాంబశివరావుకి వందనవలలు పూర్తయిన సందర్భంలో ఆయనకో సరదా పుట్టింది. వందో నవల ఆవిష్కరణ సందర్భంలో నంధ్యాలలో చిన్న ఫంక్షన్ ఏర్పాటు చేద్దామనీ, కొంతమంది మిత్రులను ఆ సందర్భంగా ఆహ్వానిద్దామనీ– అనుకున్నదే ఆలస్యం. ఏర్పాట్లన్నీ కూడా జరిపించి విజయవాడలోని ఓ పదిమంది ముఖ్య అతిధులుగా ఆహ్వానించాడు. అందులో నేను ఒకడ్ని, రచయిత్రి లత, ఆమె భర్త ఆంజనేయశాస్త్రి, రచయితలు ఓంకార్, లల్లాదేవి, పురాణ పండరంగనాథ్, కొండముది శ్రీరామచంద్రమూర్తి, కప్పగంతుల మురళీకృష్ణగారు (క్వాలిటీ పబ్లిషర్) ఇంకెవరో ఇద్దరున్నారు. విజయవాడ నుండి అప్పటిలో నంధ్యాలకు డైరెక్ట్ ట్రయిన్స్ లేవు గుంటూరు పోయి ఆ ట్రయిన్‌ను పట్టుకోవాలి. అది



గుంటూరు టూ గోవా వెళుతుందనుకుంటాను. అందరికీ ఒకే బోగీలో బెర్తులు దొరికాయి. అయితే ఆంజనేయశాస్త్రికే బెర్తులేదు. అలా ఎందుకు జరిగిందో తెలియదు. మురళీకృష్ణగారి కాళ్లవేపు చేరాడు. ఆయన ఓ రెండు గంటలు పడుకొని... శాస్త్రిగారిని పడుకోమన్నాడు. అలా ఇద్దరూ తెల్లవార్లూ సర్దుకున్నారు. లల్లాదేవికీ, లతకూ ఏమాత్రం పడదు కాబట్టి, అతడు దూరంగా ఆమె దృష్టిలో పడకుండా ఉండటానికీ ప్రయత్నించేవాడు. ఖర్మకొద్దీ ఆమె దృష్టిలో అటు వెళుతూ, ఇటు వెళుతూ పడ్డాడంటే ఆమె నోరు మహా చెడ్డది. ఏదో ఒకటి కెలికేది. ఓంకార్‌కి అదో సరదా! "లత గారూ లల్లాదేవిగారు వస్తున్నారనీ, మరో పుస్తకం రాస్తూన్నాడనీ అది మీకే అంకితం చేయబోతున్నాడని ఆమెను రెచ్చ గొట్టేవాడు. ఆమె దానికి ద్వంద్వార్థంగా వాగేది. "లాల్లాదేవట" "లల్లాదేవి" ఆడపేరు పెట్టుకున్నాడు. ఓంకార్ పగలబడి ఒకటే నవ్వు. మురళీకృష్ణగారూ అంతే!

ఆ పక్కా, ఈ పక్కా బెర్తులమీదున్న పురాణపండ, కొండముది వార్లూ శివ, శివా!! అందరం ఒకేచోట పడ్డాందేవుడోయ్ వినటానికి చెవులకూ కూడా దోష రహితమవుతున్నాయి అని చెవులు మూసుకొని, ఇంకా భరించలేక వారివారి బెర్తులు ఎవరెవరికో ఇచ్చి మరో చోటికెళ్లి పోయారు.

"నాకు రెండింటి దాకా నిద్రపట్టదు అలా అలవాటయిపోయింది. అందుకే ఏదన్నా పుస్తకం ముందేసుకొని కూచుంటాను".

అది లత పైబెర్తు ఎక్కుతూ" ఆమెకు ఆంజనేయశాస్త్రి ఆసరా ఇచ్చాడు. ఆవిడ త్వరగా నిద్రపోదండీ బాబూ! నిద్రమాత్ర ఒకటి మింగాలి రాత్రిపూట అన్నము తినదు" అంటూ శాస్త్రి బ్యాగ్‌లో ఓ పక్కనున్న పాకెట్ తెరచి చిన్న పసుపురంగు మాత్ర, గ్లాసుతో నీళ్ల ఆమె కందించాడు. అది వేసుకొని నీళ్ల త్రాగింది. "ఇక పరవాలేదు. ఇన్ని మింగినా తెల్లవారు ఝామున నాలుగింటికే లేచి కూచుంటుంది.

రాత్రంతా ప్రయాణం. ఎవరో ఎవరికో చెప్తున్నారు. "లేవండి నంద్యాల స్టేషన్ వస్తోంది అని" అందరం లేచికూచున్నాం. కిటికీ తెరిస్తే వర్షం పడుతోంది. జల్లు లో పలికి వచ్చింది. చీకటీ చెట్లు మసకగా అగపడుతున్నాయి. "కిందకు దిగుతావా!" అన్నాడు లతను ఆంజనేయశాస్త్రి.

"దిగుతాను... దిగుతాను. కంగారుపెట్టకు" అంది.

నాకు నిద్రమత్తు వదిలిపోయింది. దిగుతుందో తెలీదు, పడుతుందో తెలీదు. అందరం అటే చూస్తున్నాం. ఆమెకు దిగటం తెలియలేదు. కొంచెం అటు ఇటూ చూసింది.

ఎలా దిగాలో సలహా ఇవ్వడానికి అందరం సిద్ధంగా ఉన్నాం.

తలకింద పడతపెట్టి పెట్టుకున్న దుప్పటి అతని చేతికి ముందుగా ఇచ్చింది. దాన్ని కింద బేగ్‌లో సర్దాడు. కాళ్లవేపు పెట్టిన చెప్పులు అందివ్వబోయింది. అతనూ అందుకోబోయాడు.

"నా మతిమండినట్టే ఉంది. కట్టుకున్నవాడివి కాకపోయినా, కనిపెట్టుకొని ఉంటున్నావు. ఎంతయినా నా కాలి చెప్పులు. పక్కకు తప్పుకో, కిందవేస్తాను అంది. అదిగో అటువంటి మాటలే లత అనగలదు. అందుకే ఆమె అంటే నాకు గౌరవం. ఆంజనేయశాస్త్రి. పక్కకు తప్పుకున్నాడు.

ఆమె భుజాలకింద, నడుం దగ్గరా చేతులు వేసి ఎలాగో కష్టపడి కిందకు దింపాడు.

"కట్టుకున్న వెధవ కన్నా కనిపెట్టుకున్నవాడే అరవ చాకిరీ చేస్తాడు. బాగానే చెప్పింది" మురళీకృష్ణగారు గొణుకున్నాడు, నా వేపు చూస్తూ.

నంద్యాల స్టేషన్ వచ్చేసింది. ఎవరి బ్యాగులు వారు తీసుకొని స్టేసన్‌బయటకు వచ్చేశాం. మమ్మల్ని రిసీవ్ చేసుకోడానికి ఇంకా ఎవరూ రాలేదు. అందరం కబుర్లు చెప్పుకుంటూ వెయిట్‌చేస్తున్నాం. ఇంతమంది మగాళ్ల మధ్య లత ఒక్కర్తే. స్త్రీ. ఓంకార్ అందరి మధ్యా ఉన్నాడు కాబట్టి జోకులకీ, నవ్వులకీ లోటులేదు. అంతవరకూ

మమ్మల్నే గమనిస్తున్న ఓ వ్యక్తి మా మధ్యకు వచ్చాడు. అతని ముఖం చాల ఆతృతగా ఉంది.

"సారూ! మీరెక్కడ్నించి వచ్చేరూ?" అన్నాడు.

ఓంకార్‌కి సరదా పుట్టింది. కాసేపు కాలక్షేపం.

"విజయవాడ నుండి"

"అలా చెప్పండి సారూ! ఆవిడ ఒక్క ఆమె కనిపిస్తున్నారు మీ మధ్య. తెలీక అడుగుతాను. ఈ వూర్లో ఏదన్నా నాటకం ఉందా సార్!" అని అడిగాడు. ఓంకార్ మెదడులో ఎపుడూ ట్యూబ్‌లైట్ వెలుగుతూనే ఉంటుంది.

అవును మేం నాటకం వేయడానికే వచ్చేం అన్నాడు

అలా చెప్పండిసార్! అదేనాటకం సార్!

ఎంతోమంది మగాళ్ల మధ్య ఒక్క ఆడది ఏనాటకం అయ్యింటుందంటావ్

"పాండవుద్యోగ విజయాలు సార్– ద్రౌపది ఒక్కర్తే, పాండవులు ఐదుగురు"

"కరెక్ట్– ఆవిడ... ద్రౌపది–అయితే ఈనాటకంలో పాండవులు ఎక్కువ వుంటారు"

మేం నవ్వుతున్నాం– ఇష్టలేనివాళ్లు దూరంగా జరిగారు.

లల్లాదేవి ముఖం తిప్పుకున్నాడు. లత ఆంజనేయశాస్త్రీ ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు.

అదేమిటిసారూ! పాండవులు ఐదుగురేకదా!

"కాదు కొన్ని నాటకాలలో రెండో కృష్ణుడు, మూడో కృష్ణుడు వస్తారు కదా! అలా వస్తాం స్టేజ్ మీదకి. అలా పదిమందీ వస్తాం"

"అయితే బాగుంటుంది సార్. నాటకం. ఇంతకీ ఈ నాటకం ఎక్కడ సార్"

"అన్ని నాటకాలూ ఎక్కడేస్తారో ఈ వూళ్లో ఇదీ అక్కడే"

ఇంతలో సాంబశివరావుగారూ –యామినీ సరస్వతీగారూ వచ్చారు. వేన్ తీసుకొని. అందరం బయలుదేరాం అది ఏ హోటలో తెలియదు. మూడు అంతస్తులలో మధ్య కొబ్బరిచెట్లతో, చాలా రూమ్‌లతో పెద్ద హోటలేగాని ఇంకా కన్‌స్ట్రక్షన్ పూర్తికాలేదు. ప్లానింగూ సరిగ్గాలేదు. వరండాలో మొదలైన మొదటి రూం లత, ఆంజనేయశాస్త్రికే కేటాయించారు. దాన్ని.

తరువాత ఉన్న గదిలో ఓంకార్, లల్లాదేవి చేరారు. ఆ తరువాత మరెవరో ఉన్నారు. ఆ తరువాత గదిలో మరళీకృష్ణగారూ నేనూ చేరాం. పురాణిపండ, కొండ.. ముదీ ఆతరువాత రూముల్లో దిగినట్టున్నారు. మాకు కాఫీ, టిఫిన్లూ ఏర్పాట్లు చూసి, సాయంకాలం నాలుగింటికల్లా సిద్ధంగా ఉంటే సభా స్థలానికి వెళదాం ఈ లోపు విశ్రాంతి తీసుకొండి అని చెప్పి వెళ్లిపోయారు.

రాత్రి నిద్ర సరిగ్గా లేదు కదా! నేను నిద్రకుపక్రమించాను. మంచి నిద్రపట్టింది.

ఎవరో తలుపు తోసిన శబ్దమూ– ఎండ, వెలుగూ ఒకేసారి లోపలికి వచ్చాయి. నేను గడియపెట్టకుండా తలుపు దగ్గరగా వేశానన్న మాట. లేచి చూస్తే లత వస్తోంది. కొత్త చీరలో శుభ్రంగా ఉంది. చేతిలో హేండ్‌బ్యాగ్.

నన్ను చూసి "పడుకోలేదా బాలీ" అంది కుర్చీలో కూచుంటూ

"ఏమిటీ? నీ నిద్రయిపోయిందా! అపుడే తయారయ్యావు నాలుగింటి కదా! వాళ్లొస్తానన్నారూ'' మురళీకృష్ణగారు లేచికూచున్నారు.

''అవుననుకో ఎంతసేపని నిద్రపోతాం! శాస్త్రీ తయారవుతున్నాడు అంది.

మరో పదినిముషాల్లో తయారయి హోటల్ రిసెప్షన్‌లోకి వెళ్లిపోయాం. యామినీ సరస్వతిగారు వెన్ తెచ్చారు. బయలుదేరాం అందరం.



ఫంక్షన్ అంతా హైస్కూల్లో ఏర్పాటు చేశారు. ముందుగా సాంబశివరావుగారింట్లో చిన్న మీటింగ్, కాఫీ, టీల ఏర్పాటు. అందరంక ం, లతనూ, ఓంకార్‌నూ భరించలేని వారు చివరికుర్చీల్లో, కూచున్నారు, కూచుని తలుపువంకా,పైనున్న వాసాల వంకా చూస్తూ కాలక్షేపం చేసస్తున్నారు.

అక్కడికి మాలాగే మరికొంత లోకల్ అతిధులొచ్చారు. పరిచయాలు అవుతున్నాయి. అందులో ఒకామె అందరికీ పరచయమయ్యారు ఆమె చాల నవలలు వ్రాశారట.. హైదరాబద్‌లో ఉంటారు– “ఆహా” అనుకున్నాం.

ఆమె అందరిదృష్టిలో పడాలన్న కాంక్షతో ఉన్నట్లు తెలిసిపోతోంది. విపరీతంగా మేకప్ వేసుకుంది. ఓంకార్ అటే చూడ్డం లత కనిపెట్టింది. ఓంకార్‌ని దగ్గరగా పిలిచింది. ఆడదీ, అన్నమూ హితవుగా ఉండాలి అంది. మాకు అర్ధమయిపోయింది. నా పక్కనే కూచున్న కొండముది శ్రీరామచంద్రమూర్తిగారు విసుక్కున్నారు

‘వీళ్లు మళ్లా మొదలెట్టారు అంటూ.

ఓంకార్ తక్కువోడా! రీపార్టీ ఇవ్వొద్దూ!!’’ మీరు చద్దికూడయ్యారుగా అందుక్కాబోలు” అన్నాడు రఫీమని. కొత్తగా అక్కడికి చేరిన వారికేం అర్థం ఆకలేదు. ఇలాంటివి అక్కడ కూచున్న అరగంటలో ఎన్నో జరిగాయి అవి ఇక్కడ రాయలేం...!

అక్కడ్నించి సభాస్థలానికి వెళ్లాం. సభ బాగా జరిగింది. అందరం వీలయినంత వరకూ సాంబశివరావుగార్ని ప్రశంసలతో ముంచెత్తాం. మరనటిరోజు ఉదయాన్నే అహోబిలం నరసింహస్వామి దర్శనం.

సాయంత్రం మహానంది– అదోప్రోగ్రాం.

అలాగే బయలుదేరాం కిందనున్న స్వామిని దర్శించుకొని గుట్టపైకి వెళ్లాం–నాకు దేవుడి మీద భక్తి కన్నా ఆలయ నిర్మాణపు అందాలూ, చెక్కడాలూ, ఇలాంటి కొండల్లో కోనల్లో ఈ ఆలయ నిర్మాణాలేమిటా అన్న ఆలోచనలూ వస్తాయి. అక్కడి శిల్పాలు బాగున్నాయి. ఊరకాలువల్లో నీళ్లూ, రాళ్లమధ్య నుండి వడిగా, చల్లగా ప్రవహిస్తున్నాయి. ఆప్రాంతం చాల చాలా బాగుంది.

అరటినారలో కట్టి, వాడిపోయిన, ఎండిపోయిన పూలమాలలు అక్కడక్కడా పడిఉన్నాయి. అవి వేసుకొని భక్తులు దేవుడ్ని దర్శించుకుంటారు కాబోలు– అలాంటి పెద్దమాలను తీశాడు ఓంకార్. తన మెడలోనుండి, లల్లాదేవి మెడలోకి వచ్చేట్టు వేశాడు.



అమెరికా పర్యటనలో తన కుమార్తెతో బాలి గారు

‘మేం ఎలా ఉన్నాం లతగారూ’ అన్నాడు.

‘ఇప్పుడే పెళ్లాడిన నపుంసిక వెధవల్లాగ’ ఉన్నారంది.

ఓంకార్ ఒకటే నవ్వు–లల్లాదేవి ముఖం వాడిపోయింది. దండను తెంపి దూరంగా వెళ్లిపోయాడు. ఓంకార్‌ని తిట్టి ఉంటాడు, ఆ తరువాత.

సాయంకాలం మహానంది ప్రయాణం, స్వామిని ఎప్పటిలాగే దర్శనం చేసుకున్నాం. కొండల్లోంచి ఎక్కడో ఊరులో ఊరి, గోముఖంలో ఉన్న రాతి రంధ్రం నుండి నీళ్లు కొలనులో పడుతున్నాయి. కొలను మధ్యలో మంటపం. నీళ్లు స్వచ్ఛంగా ఉన్నాయి. అయితే దాన్నిండా చేపలు, నీళ్ల రాతి రాతిరంధ్రంగుండా వచ్చి మంటపం చుట్టూ ప్రదక్షిణ చేసినట్టయి బయటకు పోయి, అక్కడ్నించి అరటి తోటలకూ, పొలాలకూ పోతున్నాయి. ఇష్టమయిన వారు ఇందులో స్నానం చెయ్యొచ్చు అన్నారు. కొంతమంది బయటవరెవరో మెట్ల దగ్గరిగా స్నానాలు చేస్తున్నారు. “లతకు సాన్ననం చేయాలని ఉంది కాని బాగాలోతుగా ఉందే” అంది లోతేమీ లేదు. పదనిన్ను తీసుకెళతాను. అన్నారు శాస్త్రిగారు. ముందే ప్రిపేరయి వచ్చినట్టున్నారు. సంచిలో మరో చీర, తువ్వాలు, ధోతీ ఉన్నాయి.

‘చెయ్యండి, చెయ్యడి– సరిగంగస్నానాలు’ ఓంకార్ ఉత్సాహపరిచాడు. శాస్త్రిగారు నీళ్లల్లోకి దిగిపోయారు. లత చీరగట్టిగా

బిగించింది, కానీ భయపడుతోంది. శాస్త్రిగారు సునాయాసంగా ఆమె నెత్తి భుజాలమీదకు చేర్చుకున్నాడు..

"శాస్త్రికి ఈతొచ్చు అంది సర్దుకుక్కూచుంటూ"

"ప్రేమికులంటే అలా ఉండాలి" ఓంకార్ కేకలు. ఆ నీళ్లలో మంటపం చుట్టూ అందరం ఆనందంగా చూస్తున్నాం. ముమ్మారు ఆమెను అలాగే తిప్పి చివరకు ఒడ్డెక్కించాడు.

"భయపడింది కానీ–అబ్బే బరువేం లేదన్నాడు " శాస్త్రి

ఎందుకుంటుంది. మోజున్నప్పుడు ఏనుగులన్నా ,,,

నీళ్లల్లోకి పోతాయి.

గొణుక్కున్నాడు, మురళీకృష్ణగారు. వీడి మోజు మండినట్టే ఉంది. శాఖాభేదంతో విసుక్కొనేవాడు ఈయన. అలా జరిగింది ఆ ప్రయాణం.

ఒక మిత్రుడి పనిమీద మద్రాసు వెళ్లాను. టి.నగర్ సుధార హోటల్‌లో మకాం. కింద రిసెప్షన్ ముందు నుండి వెళుతుంటే లత, ఆంజనేయశాస్త్రిగారూ ఎదురుగా కుర్చీల్లో కూచుని ఉన్నారు. నన్ను చూసి ఆశ్చర్యంగా మొహంపెట్టి ఏమిటీ? ఇక్కడా! అంది. నా విషయం అంతా చెప్పి మరి మీరెందుకు వచ్చినట్టూ అన్నాను. ఏదో చెప్పి... ఆపనంతా పూర్తయి పోయిందనీ సాయంత్రమే రైలెక్కాలి, సాయంకాలంవరకూ తీరికే, ఆరుద్రగారిల్లు దగ్గరే వెళదామా అంది.

నా మిత్రుడు సాయంకాలం వరకూ రాడు ఏదో పనిమీద బయటకు వెళ్లాడు. సరే అన్నాను. ముగ్గురం బయలుదేరాం. అప్పుడు టైం ఉదయం పదకొండు గంటలయ్యింటుంది. మాకెదురుగా ఒకామె నడుం మీద పెద్ద కూరగాయల సంచి ఆనంచుకొని, ఇంకా చేతుల్లో ఏవేవో కాయగూరలు ఇరికించుకొని, జుట్టు చెదిరిపోయి, నుదుట నుండి చెమటకారుతుంటే ఆపసోపాలు పడుతూ వస్తోంది. లతను చూడగానే పలకరించి చేతులోని సంచినేలమీద పెట్టి చేతులు దులుపుకుంది. ఏవేవో పర్సనల్ విషయాలు మాటడుకున్నారు. మీరు తెస్తున్నారు ఇంట్లో మగవాళ్లెవరూ లేరా అంది లత ఎందుకు లేరూ మింగడానికి, కంచాలు కంచాలు వాల్చుకొని మాత్రం ఉంటారు అని నేలన పెట్టిన సంచి అందుకొని, పొట్లకాయలు లాంటివి చేతుల్లో ఇరికించుకొని వెళ్లిపోతోంది.

ఆమెవరో నీకు తెలుసా అంది లత.

నాకేం తెలుసు!

ఆమె బుజ్జాయిగారి భార్య. బుజ్జాయి చిత్రకారుడు కదా! అంది అరే! ఈ మాట కొంచెం ముందు చెప్పవలసింది వెనక్కు తిరిగి



చూసాను. పాపం ఆమె చేతుల్లోని బరువులతో వెళ్లిపోతోంది. బుజ్జాయిగారితో మీటింగ్ (మార్చి 13-2011)లో ఇన్ని సంవత్సరాలకు కలిస్తే ఆమాటే చెప్పాను. నవ్వాడాయన. సరే, మేముగ్గురం ఆరుద్ర గారింటికి వెళ్లాం. రామలక్ష్మిగార్ని అదే చూడ్డం. ఆరుద్రగారికి కంటి ఆపరేషన్ అయ్యిందన్నారు. ఇంకా కంటికి కట్టు ఉంది. ఈయన పెద్దగా మాట్లాడకూడదు. రామలక్ష్మి గారితోనే కబుర్లు చెప్పివెనక్కు మళ్లాం.

ఆతరువాత రోజుల్లో లత చాల సార్లు కనపడింది. ఆమె కథలకూ బొమ్మలు వేశాను. ఆంధ్రజ్యోతిలో ఉన్నప్పుడే రోడ్డుమీద ఒకసారి కనపడి నీ గురించే ఆలోచిస్తున్నాను. మీ ఇంటికి రావాలి అంది. విషయమేమిటని అడిగాను. ఎవరో పత్రిక పెడుతున్నారు. ఆర్టిస్ట్‌గా నిన్ను సజెస్ట్ చేశాను. వారు రెండు మూడు రోజుల్లో మీ ఇంటికి వస్తారు. ఆంధ్రజ్యోతినుండి నువ్వు బయటకు రావాలి సుమా అంది.

కానీ అలాంటివారెవరూ మా ఇంటికి రాలేదు.

ఇది జరిగిని కొన్నాళ్లకు ఆమె కేదో ఆపరేషన్ అన్నారు. దానికి రక్తస్రావమెక్కువనీ ఆమె గ్రూపురక్తం అవసరమని, అంటే, ఆమె అభిమాని ఒకరు (అదే బ్లడ్‌గ్రూపు) రక్తమిచ్చారు.

శ్రీ బాలి గారి చిత్రమైన జీవితం క్రమం తప్పక చదువుతున్నాను అనేకంటే
కథనం చదివిస్తూంది అనటం సబబేమో!
నిర్భయంగా ఉన్నది ఉన్నట్లు చెప్పే నిజాయితీ వారి శైలిలో ఉన్నది.
బోరు కొట్టకుండా తనదైన బ్రేడ్ - మార్కు హాస్యాన్ని
రొట్టె మీద వెన్నలా అలవోకగా పై పూత పూసి జీవన చిత్రాన్ని ఆవిష్కరిస్తున్నారు ఆయనలోని రచయిత.
కొందరి గురించి కొన్ని నిజాలు తెలుసుకోవటం బాధాకరమైనా మానవ నైజం గురించి తప్పనిసరి
అవగాహనగా అవి ఉపకరిస్తున్నాయి. ఆయన జీవితపు రహదారి వెంట ఆహ్లాదకరమైన ప్రయాణం
ఏర్పాటు చేసిన 64కళలు.కాం!ధన్యవాదాలు!!

- శ్రీదేవి మురళీధర్

ఆపరేషన్ సక్సెస్. కానీ ఈమె చనిపోయింది. ఆ వారం చివరలో సంతాప సభ జరిపారు. ఠాగూర్ స్మారక లైబ్రరీ విజయవాడలో వెళ్లాను. కుర్చీలో ఆమె ఫొటో పెట్టి పువ్వులు పేర్చారు. ఆమె నా వేపు చూసి నవ్వుతున్నట్టే ఉంది.

ఎవరెవరో మాట్లాడారు. నన్నూ మాటాడమన్నారు. ఆమెతో నాకన్నీ నవ్వొచ్చే సన్నివేశాలే జరిగాయి. దానికి అది సందర్భంకాదు. మాట్లాడలేనన్నాను. రక్తం ఇచ్చిన కుర్రవాడు ఎంతో దు:ఖపడుతున్నాడు ఓ మూలకుర్చీలో కూర్చోని.

ఆమె చక్కటి రచయిత్రి. స్పాంటేనియస్‌గా 'రీపార్టీ' ఇవ్వడంలో దిట్ట. ఆ ఫొటోకు నమస్కరించాను.

నేను రాసిన ఓ కథలో ఆమెనే ఇన్‌స్ప్రెషన్‌గా తీసుకున్నాను.

'భరోగా' ఓమారు ఆంధ్రజ్యోతి ఆఫీస్‌కు వచ్చి శర్మగారితో అప్పటి వరకూ పిచ్చాపాటీ మాట్లాడేడు కాబోలు- నాసీటు ముందునుండి ఇద్దరూ కిందకు వెళ్తున్నారు. "బాలి" అచ్చమైన మగాడు అన్నాడు"శర్మగారూ" అవునన్నారు నా మగతనాన్ని వీళ్లేలా గమనించారు అనుకున్నాను, రచయిత చాకచక్యం అక్కడే ఉంది. 'బాలిక' అంటే ఆడపిల్లట! అపుడు 'బాలి' అంటే మగాడు కదా! అన్నారు. అబ్బో అనుకున్నాను. మరో మారు...

"కార్టూనిస్టవి కావాలంటే బొమ్మగీస్తే సరిపోదు దానికి ఫన్నీగావేరే కాప్షనూ ఉండాలి" భరోగారు తరచూ అనే మాటలివి. ఈ మాటలు నాలో బాగానే పనిచేశాయి. బొమ్మలయితే ఏవో వెయ్యగలనుగానీ మాటలు ఫన్నీగా రాయగలనా?.

నండూరి రామమోహన్‌రావుగారు ఏదన్నా పనిమీద నా సీట్లోకి వస్తే అదే సమయంలో నేను ఏదన్నా పుస్తకమో, కాయితమో తిరగేస్తుంటే , "పుస్తకాలు బాగా చదువుతూ ఉండు. అయితే సెలక్ట్ చేసుకోవడంలో ఉంటుంది సాహితీ పరమైనవి ఏమిటో!" అని ఒకటి రెండు సార్లు అన్నారు. ఈ హాస్యంలో కూడా ఎవరిశైలి వారిది. బొమ్మలకోసం కథలూ, నవలలూ చదవడం తప్పనిసరి.

కథలో రచయిత కారెక్టర్ ఎలా డిజైన్ చేశాడో, ఆహార్యం ఏమిచ్చాడో పెన్సిల్‌తో మార్కు చేసుకోవడం మంచిది. ఇదినా అనుభవం మీద నేను తెలుసుకున్నాను. వీటి సంగతి పక్కన పెడితే, అప్పుడే చలంమ్యూజింగ్స్, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "అనుభవాలూ-జ్ఞాపకాలూ" చదివాను రెండింటిలోనూ చదివించే గుణం నన్ను ఆకట్టుకుంది. శాస్త్రిగారి రచనలో అనుభవాలే గాని చెప్పే విధానం అందంగా కనుముందు బొమ్మ కట్టినట్టు చెప్పడం నచ్చింది. ఊహించలేదు. విజయవాడాంధ్రజ్యోతిలో చేరిని చాల నెలలకు మా ఆఫీస్‌కు వచ్చి పురాణంగారి దగ్గర కూచుని మాట్లాడుతున్నారు. తరువాత కొంతసేపటికి పురాణంగారు నన్ను పిలిచి ఆయనను పరిచయం చేశారు సంజీవ్‌దేవ్ గారని. ఆయన మా ముందు నుండే వెళ్లారు. అయితే ఎవరో అనుకున్నాను. మనిషి చాల సింపుల్. చక్కగా సరదాగా మాట్లాడేరు. నా బొమ్మలు గురించి చక్కగా చెప్పారు. ఆయన ఆహ్వానం మీదే గుంటూరు జిల్లాలో ఉన్న వారింటికి, తుమ్మపూడి వెళ్లాను. ఇంటిగుమ్మంపక్క 'సరేఖ' అని చెక్కించారు. మంచిపేరు. నిజంగా ఆ ఇల్లు రసరేఖే! అయితే ఆయన బొమ్మలు గొప్పగా ఉండవు. కాని గొప్ప చిత్రకారునికీ తెలియని నిగూఢత ఆయన బొమ్మల్లో, రచనల్లో కనిపిస్తుంది. గొప్ప కళాభిమాని, రేఖలు,రంగులు గురించి ఆయన చెబుతోంటే నోరెళ్ల బెట్టవలసిందే అదొక తాత్వికత. మేధోమథనం. ఇందులో అంతంత లోతులూ, మూలాలూ ఉన్నాయా అనిపిస్తుంది. వీరు నిరంతర అన్వేషి.

# కలంకారీ కళలో
# కాశిరెడ్డి ప్రతిభ

**చిత్రకళపై ఆశక్తితో చిన్ననాడే ఇల్లు వదిలి వెళ్లిన ఆ బాలుడు...నేడు దేశంలోనే ప్రఖ్యాతిగాంచిన కళంకారీ కళాకారుడిగా గుర్తింపు పొందారు. కలంకారీలో మన రాష్ట్రానికి అంతర్జాతీయ గుర్తింపును తెచ్చారు. రామాయణం, భాగవతం ఘట్టాలతో కూడిన మాస్టర్ కలంకారీ వస్త్రాన్ని రూపొందించి లిమ్కాబుక్ ఆఫ్ రికార్డులో స్థానం సంపాదించిన కాశిరెడ్డి శివప్రసాద్ రెడ్డి గురించి ... ఈ నెల "సమ్‌థింక్ స్పెషల్"లో తెలుసుకుందాం...**




ఆంధ్రరాష్ట్రంలో చిత్తూరు జిల్లాలోని శ్రీకాళహస్తి, కృష్ణాజిల్లాలోని పెడన కలంకారీ కళకు ప్రసిద్ధి. ఇక్కడ తప్ప మరెక్కడా 'కలంకారీ' కళ కనపడదు. అలాంటి కలంకారీ చిత్రకళను నేర్చుకొని అంతర్జాతీయ స్థాయిలో ఖ్యాతిగడించిన వ్యక్తి బనగానపల్లె మండలం, టంగుటూరు గ్రామానికి చెందిన కాశిరెడ్డి శివప్రసాద్‌రెడ్డి, కళల్లో రాణించాలంటే కృషి, పట్టుదల, ఆత్మవిశ్వాసం అవసరం. రైతుకుటుంబంలో పుట్టిన శివప్రసాద్ రెడ్డి చిన్నతనంలో ఇంటినుండి పారిపోయి శ్రీకాళహస్తిలోని కలంకారీ శిక్షణ కేంద్రంలో చేరి, నేడు దేశం గర్వించదగ్గ కళాకారుడిగా ఎదిగారు. 1980సం॥ నుండి కలంకారీ చిత్రాలను గీయడం ప్రారంభించిన వీరు రామాయణం, భాగవతం, భారతం, ప్రకృతి సౌందర్యాలను వారి చిత్రాలకు నేపథ్యంగా తీసుకొని, ప్రకృతిలో లభించే సహజ వర్ణాలతో అపురూప కళాఖండాలను చిత్రీకరిస్తున్నారు. ఇప్పటి వరకూ వెయ్యికి పైగా చిత్రాలను చిత్రీకరించిన వీరు 1995లో ఎన్టీరామారావు గారిచే, 1996లో కేంద్రమంత్రి చిదంబరంలచే సత్కారం అందుకున్నారు.

వీరి చిత్రాలతో ఢిల్లీ, ముంబయి, కలకత్తా, బెంగుళూరు, హైద్రాబాద్, మైసూరు, మద్రాసు వంటి నగరాలలో ప్రదర్శించి 'కలంకారీ' కళా విశిష్టతను దేశం నలుమూలలా చాటి చెప్పారు.

లిమ్కారికార్డ్: ఆంధ్రప్రదేశ్‌కు మాత్రమే పరిమితమైన ఈ కలంకారీ' సాంప్రదాయ కళను సురక్షితంగా కాపాడేందుకు, భావితరాలు గుర్తుంచుకునే విధంగా ఒక భారీ కలంకారీ చిత్రాన్ని రూపొందించాలనే నిశ్చయంతో, తన 30 సం॥రాల అనుభవాన్ని క్రోడీకరించి 2004 సం॥లో 47 అడుగుల పొడవు 11 అడుగుల వెడల్పు కలిగిన నూలువస్త్రంపై రెండేళ్ళ పాటు కష్టపడి రామాయణం, భాగవతం, ఇతిహాసాలు ఘట్టాలుగా విభజించి చేసిన పెయింటింగ్‌లో బార్డరు నందు సంపూర్ణ రామాయణం మధ్య భాగంలో భాగవత కళలు చిత్రీకరించారు. ఇందులో మొత్తం రెండువేల బొమ్మలు ఇమిడిఉన్నాయి. ఈ చిత్రానికి ఉపయోగించిన రంగులన్నీ సహజ వనరుల నుండి లభించినవే కావడం మరో గొప్ప విషయం. ఇన్ని ప్రత్యేకతలు కల్గిన ఈ చిత్రాన్ని 2006సం॥లో పూర్తిచేసి, చరిత్రలో అత్యంత భారీ కలంకారీ చిత్రాన్ని రూపొందించిన చిత్రకారుడిగా లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్స్ స్థానం సంపాదించుకున్నారు శివప్రసాద్‌రెడ్డి.





# యువతను విశ్వరూప ప్రతినిధి చేసిన - వివేకానందుడు

"ఏ ప్రాంతం నుండి ప్రవహించే నది అయినా చివరికి సముద్రంలో కలవాల్సిందే. భిన్న మార్గాలలో పయనించవచ్చు. వివిధ రకాల మనస్తత్వాలు, పరిస్థితులు కలిగి ఉండవచ్చు. తెలివైనవారు, తెలివిలేని వారు, మోసగాళ్ళు, మంచివాళ్లు, అందరూ పరమాతను చేరవలసిందే"-ఇంతటి గంభీరమైన ఊపన్యాసంతో, తన వాగ్ధాటితో ప్రపంచమానవులను ఆకర్షించిన విశ్వమాత ప్రవక్త శ్రీ వివేకానందుడు. 1893 సెప్టెంబర్ 11న అమెరికా ఆర్ట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ చికాగోలో చేసిన ప్రసంగం ప్రతి అమెరికన్ గుండెను తట్టిలేపింది. వివేకానందుని ఆత్మీయ ప్రవచనానికి నాడు ప్రత్యక్షంగా విన్న 7 వేల మంది వినయ చిహ్నంగా లేచి నిలబడి గౌరవాభినాదాలు చేశారు.




ఎల్.ఆర్. వెంకటరమణ

"మత సామరస్యాన్ని, విశ్వజనీనతను ప్రభోదిస్తూ, అందరూ సమానమేనని చాటి చెప్పే హిందూమతంలో పుట్టినందుకు గర్విస్తున్నాను. మేం అన్ని మతాలు సత్యమేనని నమ్ముతాం. ఏమతం వారినైన అక్కున చేర్చుకునే భారతదేశంలో పుట్టినందుకు గర్విస్తున్నాను. హిందూమతం అందరి సుఖసంతోషాలను కోరుకుంటుంది. "సర్వేజనా: సుఖినోభవంతు" అన్నది భారతీయులు చాటే తారకమంత్రం.



నాటి చికాగో సభలో వివేకానందుని ప్రసంగం ప్రారంభంలో సన్నటి ఒణుకుతో ప్రారంభమై రానురాను మేలిమి ముత్యాల వానలా అందరిపై కురిసింది. నాటి సభాధ్యక్షుడు బారోస్ వివేకానందుని ప్రసంగాన్ని ఎంతగానో పొగిడాడు. తరువాత రోజు అన్నీ వార్తాపత్రికలు ఎంతగానో ప్రశంసించాయి. న్యూయార్క్‌కు చెందిన ఒక విమర్శకుడు "పవిత్ర హక్కులపై ఎంతో చక్కగా సంభాషించిన వక్త వివేకానంద. జ్ఞానాన్ని ప్రతిఫలిస్తున్న ఆయన ముఖం ఎంతో వర్చస్సుతో కాంతివంతంగా ఉంది. ఆ అమూల్య మాటలు ఎంతో ఆకట్టుకున్నాయి" అంటూ రాశాడు. సెప్టెంబర్ 11 నుండి 27 వరకు జరిగిన సభలో వివేకానందుడు ప్రసంగించారు.

వివేకానందుడు హిందూ మతాన్ని ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకు విస్తరింపచేయడానికి ఎంతో ప్రయత్నం చేసిన యోగి, శ్రీరామకృష్ణ పరమహంస ప్రియశిష్యుడు. వేదాంత, యోగ, తత్త్వ శాస్త్రాలతో సమాజం మీద అత్యంత ప్రభావం చూపిన ఆధ్యాత్మిక నాయకుడు. పరివ్రాజకునిగా ఎన్నో దేశ, విదేశాలు తిరిగి ఆధ్యాత్మిక వ్యక్తిగా ప్రపంచ గుర్తింపు పొందాడు. రామకృష్ణ మఠాన్ని స్థాపించి రామకృష్ణుల సందేశాన్ని ప్రపంచానికి చాటి చెప్పినవాడు.



ఆదర్శంగా నిలిచాడు.

కెరటాన్ని కాదు, సాగరాన్ని చూడమంటాడు" వివేకాంనదుడు" చావు తథ్యం కాబట్టి ఒక గొప్ప ఆశ కోసం చావడం మేలు" అనగలిగినవాడు. "నీ దేశం వీరులను కోరుతోంది. వీరులుగా ఉ ండండి. పిరికితనాన్ని వదిలేయండి" అంటూ యువతను ఉత్తేజితులను చేయగలిగినవాడు. వివేకాందుని బోధనలు అందించిన స్ఫూర్తి, ప్రేరణలు యువ హృదయాలకు ఒక గొప్ప టానిక్ వంటివి. ఆయన ఆశయాలు యువజనులకు ఇస్తున్న ఉత్తేజాన్ని పరిగణించి ఆయన జన్మదినాన్ని "యువజనోత్సవంగా" కేంద్రప్రభుత్వం ప్రకటించింది.

"నీ సంపదను కోల్పోతే నీవు ప్రత్యేకంగా కోల్పోయింది ఏమీ లేదు. నీ ఆరోగ్యం కోల్పోతే నీవు కొంత కోల్పోయినట్లే. కానీ నీ వ్యక్తిత్వం కోల్పోతే నీవు సర్వం కోల్పోయినట్లే" అంటూ యువతను ఆదర్శం వైపు మళ్లించడానికి మార్గదర్శకత్వం వహించినవాడు.

వివేకానందుడు ఈశ్వరచంద్ర విద్యాసాగర్ గారు నెలకొల్పిన పాఠశాలలో 1870న చేరి విద్యాభ్యాసం చేశాడు. చిన్ననాడే వేణిగుప్త, ఉస్తాద్ అహ్మద్‌ఖాన్ వద్ద సంగీతం నేర్చుకున్నాడు. హార్మోనియం, వయొలిన్‌పై పట్టు సాధించాడు. చిన్ననాడే సృజనాత్మకతతో కళలపట్ల ఆకర్షితుడయ్యాడు. తండ్రి న్యాయవాది. నరేంద్రునికి ఉ ద్దేశ్యపూర్వకంగానే న్యాయశాస్త్ర, సైన్స్ పుస్తకాలనే ఇచ్చేవాడు తండ్రి.

వివేకానందుడు 1863 జనవరి 12న కోలకత్తాలోని ఉన్నత కుటుంబంలో జన్మించాడు. విశ్వనాథ్‌దత్తా, భువనేశ్వరీదేవి తల్లిదండ్రులు. పూర్వనామం నరేంద్రనాధుడు. .చిన్ననాటి నుండే ధ్యానం చేసేవాడు. సన్యాసులు, యోగరి పట్ల ప్రేమ కనబరిచేవాడు. ఏకాగ్రతతో అన్నింటా ముందుండేవాడు. ఇంకా ఏకసంథాగ్రాహి.. ఆయనలో జ్ఞానతృష్ణ అపారం. దైవంను తెలుసుకోవాలనే ఆరాటంతో రామకృష్ణుని చెంతకు చేరి దైవం గురించి తెలుసకొని, శోధించి విశ్వమానవులకు ఆ ఆనందాన్ని పంచాడు వివేకానందుడు.

నరేంద్రనాధుడు సన్యాసం స్వీకరించి వివేకానందుడు అయ్యాడు. భారతదేశాన్ని జాగృతం చేయడమే కాకుండా తన ఉ పన్యాస పటిమతో అమెరికా, ఇంగ్లాండ్‌లలో యోగా, వేదాంత శాస్త్రాలను పరిచయం చేసిన ఘనత ఆయనదే. దేశ, విదేశాలలో ఎందరో శిష్యగణం తయారైంది. 'మానవసేవయే మాధవసేవ' అని ప్రచారం చేశాడు. "సిద్ధాంతాలు, పిడివాదాలు, సంప్రదాయాలు, దేవాలయాలు మొదలైన వాటి గురించి ఆలోచించకు. మనిషి హృదయంలో వెలుగుతున్న ఆత్మతో సరిపోల్చితే అవి ఎందుకు పనికిరావు'' అన్నాడు. ఆధ్యాత్మిక శక్తి సముపార్జించమని ప్రభోదించాడు. అన్యమతాలను నిందించవద్దని చెప్పాడు. యువతకు



ఉపనిషత్తులు, పురాణాలను చదివించాడు. ఇలా చిన్ననాటి నుండే ఏ విషయాన్నయినా తర్కంతో హేతుబద్ధంగా పరిశీలించే శక్తి నరేన్‌కు అలవడింది.

చిన్ననాటి నుండే ధ్యానంలో ఏకాగ్రత సాధించేవాడు. దీని వలన అతనిలో ఏకసంథాగ్రాహి లక్షణాలు క్రమంగా అలవడినాయి. రోజూ వ్యాయామం చేసేవాడు కర్రసాము, గుర్రపుస్వారీ, కుస్తీ, పడవ నడపడం, ఈత ఇలా ఎన్నింటిలోనో ప్రావీణ్యం సంపాదించినవాడు. పాకశాస్త్రంలో కూడా ప్రవేశం ఉంది. మంచి వంటలు చేసి వడ్డించినవాడు.

హెర్బర్ట్ స్పెన్సర్, జాన్ స్టువర్ట్‌మిల్, అగస్టికామ్టె, అరిస్టాటిల్, డార్విన్‌లను బాగా అధ్యయనం చేశాడు. ప్రాక్‌పశ్చిమదేశాల తత్త్వశాస్త్రం, చరిత్ర, తర్కం, వివిధ మతగ్రంథాలను ఆకళింపు చేసుకున్నాడు. వివిధ దేశాలలో వివిధ పరిస్థితులలో మానవ సమాజాలు ఎలా పరిణామం చెందాయో అధ్యయనం చేసినవాడు.

1881లో స్కాటిష్ చర్చి కాలేజీలో డిగ్రీ చదువుకున్నాడు వివేకానందుడు. ఒకరోజు ఇన్సిపాల్ లిలియం హెస్టీ-వర్డ్స్‌వర్త్ వ్రాసిన "దిఎక్స్‌కర్షన్" ఆంగ్లకవిత పాఠంచెబుతూ- "తనకు తెలిసి సమాధి అవస్థ అనే ఆత్మానందాన్ని అనుభవిస్తున్నది రామకృష్ణ పరమహంస" అని చెప్పాడు. దాంతో వివేకానందుడు కోల్‌కత్తా ప్రయాణమయ్యాడు. తరువాత రామకృష్ణులకు ప్రియశిష్యుడైనాడు.

1895లో లండన్‌లో చేసిన ప్రసంగంలో స్వామీజీ-"చిత్రకారుడు అనేవాడు సార్వత్రిక అందానికి సాక్షీభూతుడు. తన ఆనందానికి చిత్రం గీస్తాడు. గీచిన తరువాత ఆ చిత్రం సార్వజనీనమవుతుంది. సర్వుల ఆనందానికి పాత్రుడవుతాడు"- అంటూ చిత్రకళ, కళాకారుని గురించి చెప్పాడు. ఇంకా చెబుతూ "కళాకారుడు ప్రకృతిని చూసి తన్మయుడవుతాడు. అది ఎంతటి తన్మయమంటే కళాకారుని హృదయాన్ని ప్రకృతికి అంకితం చేస్తాడు.



ఆ విధంగా దేవునికి దగ్గర అవుతాడు" అంటాడు. "కళ అన్నదే బ్రహ్మం - ఆ బ్రహ్మంలో కళాకారుడు బ్రహ్మానందభరితుడవుతాడు".

ఇంకా గ్రీక్ చిత్రకళ, భారతీయ చిత్రకళల మధ్య గల పోలికలను పరిశీలించినవాడు. చిన్న చిన్న విషయాలను సూక్ష్మాతి అంశాలు గ్రీక్ చిత్రకళలో ప్రతిఫలించాడు. భారతీయులు తమ చిత్రకళలో ఒక ఆదర్శాన్ని పాదు కొల్పారని తన చిత్రకళాభిరుచిని చెపుతాడు. వివేకానందుడు. పాశ్చాత్య, ప్రాచ్య సంగీతాల మధ్య గల సామ్యాలను చెప్పాడు పాశ్చాత్య సంగీతం హార్మోనీలో ఖచ్చితత్వాన్ని , ప్రాచ్య సంగీతం మెలోడీలో ఖచ్చితత్వాన్ని సాధించామంటాడు.

భారతదేశాన్ని చదవాలంటే వివేకానందుని చదివితే చాలు అన్న పాశ్చాత్యుల భావన సరైనదే. తన రచనలతో ఎందరినో ముందుకు నడిపాడు. గాంధీ, సుభాష్ చంద్రబోస్, అరవింద్‌ఘోష్, జతిన్‌దాస్ వంటి వారెందరో వివేకానందుని బాటలో నడిచినవారే

1902 జూలై 4న శుక్రవారం రాత్రి 39వ ఏట వివేకానందుడు తనువు చాలించారు. "కాలక్రమంలో ఎందరో వివేకానందులు ఉ ద్భవిస్తారు" అన్నది ఆయన ఆఖరి మాట.




email: venkataramana_lanka@yahoo.com

# 'రమణీయ' చిత్రకారుడు ఎన్.వి. రమణ

- కళాసాగర్



*ఒక దృశ్య చిత్రీకరణలో కవికి–చిత్రకారునికి కావాల్సింది వర్ణాలే. అవి అక్షరాలు కావచ్చు. లేదా రంగులు కావచ్చు. పది పద్యాలతోనో–పది పేజీలతోనే కవి చెప్పిన విషయాన్ని ఒక్క బొమ్మలో చూపించ గల చిత్రకారుడు, కవి కన్నా నేర్పరి అనడం అతిశయోక్తి కాదు. సాధన, సౌజన్యం, నిబద్ధత, నైపుణ్యం ఆయన్ని మేటి చిత్రకారునిగా ఎదగడానికి, లబ్ద ప్రతిష్టులైన చిత్రకారుల సరసన చోటు సంపాదించుకోవడానికి కారణమయ్యాయి. కమణీయ భావాలను రమణీయ చిత్రాలుగా గీయగల కుంచె మాంత్రికుడు ఆయన. వాల్మీకి విరచిత రామాయణాన్ని, కలియుగ వెంకటేశ్వరుని లీలలను, శివపురాణ విశిష్ఠతను తెలిపే డిజిటల్ చిత్రాలతో పురాణ పురుషులను మన ముందు సాక్షాత్కరింపజేసిన అభినవ రవివర్మ. కంప్యూటర్ ప్రవేశంతో చిత్రకారుల పని అయిపోయిందనే వాదన సరికాదని–చిత్రకారుని చేతిలో కుంచె అయినా, మౌస్ అయినా ఒకటేనని నిరూపించిన చిత్రకారుడు ఎన్.వి. రమణ.*

అది 1994 సంవత్సరం, విజయవాడలో ఒక పబ్లికేషన్‌లో ఆర్టిస్టుగా పనిచేస్తున్న నాకు రమణగారితో పరిచయం కలిగింది. అప్పటినుండి మా మధ్య స్నేహం కొనసాగతూనే ఉంది. ఎప్పటినుండో ఆయన గురించి ఒక వ్యాసం వ్రాయా లనుకొంటున్నా... అది ఇప్పటికి సాకారం అయ్యింది. ప్రింట్‌మీడియాలో కంప్యూటర్ ప్రవేశించని రోజులవి. బ్రోచర్,



వ్యక్తిత్వం ఆయనది. సాధారణంగా చిత్రకారులు ఏకాంతంగా వర్కు చేసుకోవడానికి ఇష్టపడతారు. కానీ... రమణగారి విషయంలో అది రివర్స్... మిత్రులతో కబుర్లు చెబుతూనే తన వర్కు చేసుకుపోతుంటారు.

రెండున్నర దశాబ్దాలకు పైగా చిత్రకళతో పెనవేసుకపోయిన జీవితం ఆయనది. కళలు అనేవి మనిషిలో పుట్టుకతోనే నిగూఢంగా దాగివుండి, కృషితో, సాధనతో రాణిస్తాయి. అని నమ్మే వారిలో రమణగారొకరు. నమ్మడమే కాదు, తనకు స్వహతాగా అబ్బిన కళకు స్వయంకృషితో నగిషీలు చెక్కుకున్నారు. విజయవాడలో ఒక సామాన్య మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన రమణగారు చదువుకున్నది తక్కువే అయినప్పటికీ, బ్రతుకు బడిలో నేర్చుకున్న పాఠాలెన్నో... అవే ఆయనకు బొమ్మలతో స్నేహాన్ని కుదిర్చాయి. జీవన గమ్యాన్ని నిర్దేశించాయి. ప్రారంభంలో ఒకటి రెండు చోట్ల ఉద్యోగం చేసినప్పటికి ఫీలాన్స్ ఆర్టిస్టుగా స్థిరపడడానికే ప్రాముఖ్యతనిచ్చారు. 'రమణ ఆర్ట్స్' పేరుతో విజయవాడలో స్టూడియోను స్థాపించి అప్రతిహాసంగా కళాసృష్టి చేస్తున్నారు.



బుక్‌టైటిల్, లోగోలు, కేలండర్లు, పిల్లల పుస్తకాలకు బొమ్మలు... ఇలా ఒకటేమిటి ప్రింటింగ్‌కి సంబంధించిన అన్ని రకాల డిజైన్లు చేసే క్రియేటివ్ ఆర్టిస్టుగా పేరు తెచ్చుకొన్నారు. స్వహతాగా చిత్రకారుడు కావడం వలన ఎయిర్‌బ్రష్‌నుపయోగించి ఆయన రూపొందించే ప్రతీ పనిలోనూ సృజనాత్మక చూపించేవారు. ఎయిర్‌బ్రష్‌ను ఆయన ఉపయోగించే తీరు ఆర్టిస్టులను సైతం ఆశ్చర్యపరిచేది. అదే వారికో ప్రత్యేక గుర్తింపును తెచ్చింది. రాష్ట్రంలోని అనేక ప్రాంతాలనుండి నిత్యం ఎంతోమంది పబ్లిషర్స్, ప్రింటర్స్ ఆయన ఆఫీసుకు వస్తూండేవారు. చేసే పనిలో నిబద్ధత, సమయపాలనలో క్రమశిక్షణ గల వ్యక్తి కావడం వలన అంది వచ్చిన అవకాశాలను ఉపయోగించుకొని తన కెరీర్ గ్రాఫ్ పెంచుకొన్న కమర్షియల్ ఆర్టిస్టు ఆయన. పేరుకు కమర్షియల్ ఆర్టిస్టు అయినా, కళను అణువణువునా నింపుకొన్న నిత్య కళాసాధకుడాయన. తనో గొప్ప ఆర్టిస్టునన్న ఇగోలు లేకుండా తనను కలవడానికి వచ్చిన ఎవరికైనా ఆప్యాయంగా పలకరించే



email: ramanaartsvja@gmail.com

## ఎన్.వి. రమణ గురించి...

| | | |
|---|---|---|
| పూర్తిపేరు | : | నీలి వెంకటరమణ |
| జననం | : | 1965 సెప్టెంబర్ 13 |
| జన్మస్థలం | : | విజయవాడ |
| విద్యాభ్యాసం | : | బి.ఏ. |
| తల్లిదండ్రులు | : | నీలి శ్రీనివాసరావు, బంగారమ్మ |
| కుటుంబం | : | సుమతి(భార్య), చంద్రకళ(కుమార్తె) శివసాయి(కుమారుడు) |
| గురువు | : | స్వయంకృషి |
| అభిమాన చిత్రకారులు | : | రవివర్మ, బాపు, రాంకుమార్, జాన్‌పెర్నాండేజ్ |
| హాబీలు | : | పుస్తకాలు చదవటం, విహారయాత్రలు, సినిమాలు చూడటం. |

రమణగారి కెరీర్‌ను రెండు భాగాలుగా చూసినట్లయితే 'చిత్రకళలో కంప్యూటర్ ప్రవేశించక ముందు, తర్వాత అని చెప్పుకోవాలి. తన సుదీర్ఘకెరీర్‌లో సుమారు ఇరవై అయిదువేలకు పైగా పుస్తకాలకు ముఖచిత్రాలు రూపొందించారు. సుమారు వెయ్యికి పైగా పిల్లల పుస్తకాలకు ఇలస్ట్రేషన్లు గీసారు. ఇవేకాక అనేక సంస్థలకు వందలాది కేలండర్లు, పోస్టర్స్ చిత్రించారు. అనూ క్లిప్ ఆర్ట్ వారి సిడిలకు లైను డ్రాయింగులు ఎన్నో గీసారు. కంప్యూటర్ ప్రవేశించిన తర్వాత కొంత స్థబ్దత వచ్చినప్పటికీ దాన్ని అధిగమించడానికి ఆయనకెంతో సమయం పట్టలేదు. కంప్యూటర్‌లోనే అన్ని చేసేయొచ్చు, ఆర్టిస్టులు అవసరం లేదిక అన్న వాళ్ళకు సమాధానంగా, కాదు కంప్యూటర్ వచ్చినా కొన్ని పనులు చిత్రకారులు మాత్రమే చేయగలరని నిరూపించే ప్రయోగాలు చేసారు.

స్వహతాగా ఆస్థికుడైన రమణగారు పురాణ, ఇతిహాసాలను చిత్రించడంలో దిట్ట. పైగా శ్రీనివాసుని భక్తుడు. ప్రతీ పుట్టినరోజునాడూ తిరుపతిని సందర్శించి రావడం ఇప్పటికీ ఆనవాయితీ కూడా. అందుకేనేమో ముందుగా ఆ శ్రీనివాసుని





**రమణగారి కుంచె నుండి ఆవిష్కరించబడిన-**
**మన పురాణ, ఇతిహాసాల సచిత్ర పుస్తకాలు**



- సచిత్ర శ్రీనివాస కళ్యాణము
- సచిత్ర శ్రీ వెంకటేశ్వర సుప్రభాతము
- సచిత్ర మహాశివపురాణం
- సచిత్ర రామాయణం
- సచిత్ర శ్రీ భద్రాచల రామాయణం
- సచిత్ర శ్రీ ఆంజనేయ చరిత్ర & చాలీసా
- సచిత్ర శ్రీ షిర్డీసాయిబాబా మహాత్మ్యం
- సచిత్ర దేవీ నవరాత్రులు
- సచిత్ర బ్రహ్మంగారి చరిత్ర
- సచిత్ర హనుమాన్ చరిత్ర



కళ్యాణాన్ని చిత్రీకరణకు ఎంచుకొన్నారు. సుమారు సంవత్సరకాలం శ్రమించి 2002 సంవత్సరంలో సచిత్ర శ్రీనివాస కళ్యాణము, సచిత్ర శ్రీవెంకటేశ్వర సుప్రభాతము అనే రెండు పుస్తకాలను రూపొందించి సొంతంగా ముద్రించారు. ముందుగా పేపరు డ్రాయింగ్ గీసుకొని, కంప్యూటర్‌లో కలరింగ్ చేసిన ఈ పుస్తకాలకు ఆధునాతన టెక్నాలజీ జోడించడంతో వచ్చిన ఫలితం అనూహ్యం. పుస్తకాలు మార్కెట్‌లోకి వెళ్ళాయి. స్పందన కోసం ఆత్రుతతో ఎదురు చూస్తున్నారు. పబ్లిషర్స్, బుక్‌సెల్లర్స్, భక్తజనపాఠకుల నుండి, చిత్రకారులు, మిత్రులు... ఇలా... ఎందరో ఫోన్లద్వారాను, స్వయంగానూ అభినందిస్తూంటే... ఆయన మనస్సు ఆనందాపారవశ్యంతో నిండిపోయింది. సాక్షాత్తు కళాప్రపూర్ణ బాపు గారి దగ్గర నుండి కూడా ప్రశంసలందుకొన్న సందర్భాన్ని స్మరించుకుంటూ ఒకింత గర్వంగానూ ఫీలవుతారు. తను పడిన శ్రమకు గుర్తింపు లభించినందుకు, తను నమ్ముకున్న కళ తనను ఇంతవాడిని చేసినందుకు కృతజ్ఞతగా ఇంకా ఏమైనా చేయాలన్న ఉత్సాహంతో భారతీయ ఇతిహాసాల ఆవశ్యకతను యువతకు తెలియజెప్పే విధంగా రంగుల చిత్రాలతో సచితర్రామాయణ, మహాశివపురాణం, శ్రీ భద్రాచల రామాయణం, శ్రీ ఆంజనేయ చరిత్ర & చాలీసా, శ్రీ షిర్డీసాయిబాబా మహాత్మ్యం లాంటి మరికొన్ని పుస్తకాలకు అద్భుతమైన చాత్రాలు గీసారు.

ఇవన్నీ చూసి రమణగారు ప్రింట్ మీడియా ఆర్టిస్టు మాత్రమే అనుకొంటే పొరబాటే. ఆయన పేపరుపై ఎంత చక్కని చిత్రాలు వేయగలరో... కాన్వాస్‌పై కూడా అంత కంటే బాగా చిత్రాలు గీయగలరు. త్వరలో తన పెయింటింగ్‌లతో ప్రదర్శనలు నిర్వహించాలన్న అభిలాషతో వున్నారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి మ్యూజియంలో 7 అడుగుల 'జగన్మోహనావతారం' తంజావూరు పెయింటింగ్, భద్రాచలం శ్రీ సీతారామచంద్రస్వామివారి దేవస్థానం చిత్రకోటమండపంలో ఈయన చిత్రించిన 54 ఫ్రేముల రామాయణ చిత్రాలు మరియు అనకాపల్లి వెంకటేశ్వరస్వామి దేవస్థానంలోను వీరి చిత్రాలు ప్రదర్శించబడుతున్నవి. సన్మానాలకు, సత్కారాలకు అంతగా ఇష్టపడని రమణగారు శ్రీదత్త సచ్చిదానంద స్వామివారి ఆశీస్సులు, టి.టి.డి., భద్రచల దేవస్థానం వారిచే సత్కారం. అమలాపురం కోనసీమ చిత్రకళాపరిషత్ నుండి "చిత్రకళావైజయంతి" పురస్కారం అందుకున్నారు.

చిత్రకళలో కంప్యూటర్ ప్రవేశం గురించి... మాట్లాడుతూ...కంప్యూటర్‌తో వేగంగా, క్వాలిటీతో పనిచేయగలుగుతున్నారని, కాకపోతే రీ-కాపీలు పెరిగిపోయాయని, ప్రతిభవున్న కళాకారులను ప్రోత్సహిస్తే, సృజనాత్మకతతో పనిచేస్తారని... తద్వారా కళను బ్రతికించుకోవచ్చునని తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసారు.





టి.టి.డి.మ్యూజియం వారి
సత్కారం అందుకుంటూ...



శ్రీగణపతి సచ్చిదానందస్వామి
సత్కారం అందుకుంటూ...



కోనసీమ చిత్రకళాపరిషత్ నుండి
చిత్రకళావైజయంతి పురస్కారం





# గానకళారూపం

- కోకా విమలకుమారి

*"ఓంకారంచ పరబ్రహ్మ యావదోంకార సంభవ:*
*అకార మకార ఏతే సంగీత సంభవా:*
*అకారో విష్ణు రూపంచ ఉకారో బ్రహ్మరూప*
*మకారో భర్గ రూపంచ సర్వమోంకార రూప:*

ఓంకారము పరబ్రహ్మ స్వరూపము. ఆ ఓంకారము నందే సర్వప్రపంచము పుట్టినదని మన శాస్త్రాలు చెబుతున్నాయి. అందులో అకార, ఉకార, మకారములనే మూడక్షరముల వలననే సంగీతము పుట్టెనని భావింపబడుచున్నది. అకారము విష్ణురూపమనియు 'ఉ' కారము బ్రహ్మ స్వరూపమనియు, 'మ' కారము పరమేశ్వర స్వరూపమనియు ఈ త్రిమూర్తుల స్వరూపమే ఓంకారమనియు అర్థము. దానము, యజ్ఞము, జపము ఈ మూడింటిని అవుపాసన చేసిన యెడల ధర్మార్థ కామ మోక్షములనెడి ఫలితాన్ని పొందవచ్చును. కాని పరిపూర్ణత చెందినటు వంటి ఒక్క సంగీత జ్ఞానము వలన ధర్మార్థ కామ మోక్షములనెడి చతుర్వర్ణ ఫలితాన్ని పొందవచ్చునని మనలా క్షిణికులు పేర్కొని యున్నారు.

రాగస్వర తాళములనే మూడింటి కలయికే సంగీతము. ఈ మూడును నాదమును విడిచి ఉండవు కావున ఇవి నా ధాత్మలుగా పేర్కొనుబడుచున్నది. బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు ముద్వురును ఈ నాదమును పాసించిన వారగుటచే. ఈ త్రిమూర్తులు నాదాత్మలులుగా పేర్కొనబడినారు.



సంగీతానికి, సాహిత్యానికి చాలా సన్నిహిత సంబంధం ఉంది. మనస్సులోని భావాలను స్థితిగతులను అందంగా మధురమైన స్వరం పలికించే రాగం వ్యక్తం చేస్తుంది. మనుష్యుల వ్యక్తిత్వం వివిధ రకాలుగా ఎలా ఉంటుందో అలాగే ఒక్కొక్క రాగానికి ఒక్కొక్క ప్రత్యేకత ఉంటుంది. పాడేవారికి, వినేవారికి కూడా రసానందాన్ని కలిగించాలి. ఈ ప్రత్యేకతలను తెలుసుకొని అనుభవించి పాడినప్పుడే ఆ రాగం యొక్క భావం వ్యక్తమవుతుంది.

మన ఇళ్లలో రేడియోలో సంగీతం వస్తుంటే 'బోర్' అంటూ ఠక్కున రేడియో కట్టేస్తూ ఉంటారు. అలాంటి వారిని సంగీత పరిజ్ఞానం లేనివారని మనం భావించవచ్చును. కాని అదే సంగీతాన్ని ప్రశాంత వాతావరణంలో ఏకాగ్రతగా పది నిముషాల పాటు ఆలకించినట్లయితే ఆ రాగాలాపనలో మనకు తెలియని ఆనందానుభూతి కలుగుతుంది. సంగీతంలో శిక్షణ పొందిన వారే



కచ్చేరీలకు హాజరవుతారని అనేకమంది అపోహ. కాని కళల కంకితమయ్యేవారు కొందరుంటే ఆ కళలను ఆరాధించేవారు, పోషించేవారు మరికొందరుంటారు. అసలు కళాపోషకులే లేకుంటే కళారాధన మరుగున పడిఉండేది. కనుక సంగీతం మీద కాస్త ఆసక్తి ఉన్నవారు తమకు నచ్చిన రాగాలను పదే పదే వినాలి. అలా వింటూ ఉంటే రాగఛాయలు తెలుస్తాయి. ఇది పలానా రాగంలో ఉన్న కీర్తన్లు అని వెంటనే గ్రహించగల శక్తి, గుర్తించగల మేధస్సును పొందగలుగుతారు.

పల్లె ప్రజలే జానపదులు. పూర్వం స్త్రీ, పురుషులు ఇంటివన్ను, పొలంవన్ను





"ఆనందామృతవర్షిణి అని పాడగా వర్షం కురిసిందట. ముత్తుస్వామి దీక్షితుల వారి శిష్యునికి ఏ మందుకూ తగ్గని అనారోగ్యం నవగ్రహ కీర్తనలను పాడుకొనగా పూర్తి ఆరోగ్యం లభించుటే గాక మంచి శక్తివంతుని గావించెనట. ఈ విధంగా సంగీత మాధుర్యానికున్నటువంటి అపారమగు శక్తిని తెలియజేసే కథలు చరిత్రలో అనేకం ఉన్నాయి.

సంగీత చరిత్రలో ప్రముఖ ఆంధ్ర వాగ్గేయకారులలో ప్రసిద్ధినొంది భగవత్ ధ్యానంలో సంగీత సాధన చేసి శివైక్యము నొందిన వారిలో కృష్ణమాచార్యులు, తాళ్లపాక అన్నమాచార్యులు, త్యాగరాజు, క్షేత్రయ్య ముత్తుస్వామి దీక్షితులు మొదలగువారు సుప్రసిద్ధులు. అన్నమాచార్యుల వారు రాసిన 32,000 కీర్తనలలో సుమారు 12000 కీర్తనలు నేడు లభ్యమవగా వాటిని ఆయన కుమారులు పెద తిరుమలాచార్యులు రాగిరేకులమీద వ్రాయించి భద్రపరిచినారు. వాటిలోని ఆధ్యాత్మిక సంకీర్తనలు కొన్నింటిని తిరుమల దేవస్థానంవారు ఒక ప్రచార సంఘాన్ని నియమించి కచ్చేరీల ద్వారా దేశమంతటా ప్రచారం చేస్తున్నారు.

చేసుకొనేటప్పుడు సంతోషంతో కూనిరాగాలు తీస్తూ ఉండేవారట. వాటినే జానపద గేయాలు అంటారు. స్వరగీతానికి ఈ గేయాలే ధర్మాలను క్రోడీకరింపగా సంగీతశాస్త్రం ప్రారంభమయిందని మన శాస్త్రాలు చెబుతున్నాయి.

"శిశుర్వేత్తి పశుర్వేత్తి గానకళావేత్తి" ఆపాద మధురమైన సంగీతాన్ని ఏమీ తెలియని శిశువులు, పశువులు కూడా విని అందలి గాన రసాలను ప్రతీతి కలదు. చిత్తశుద్ధి, నమ్రత, ఏకాగ్రత కలిగిన గాయకుడు భగవదనుగ్రహాన్ని పొందగలడు.

నేవలూరుతో అక్షయలింగని మీద శంకరాభరణ రాగంలో "అక్షయలింగవిభో, స్వయంభో అను పాటను రాగాలాపన చేసి పాడగా మూసిన తలుపులు తెరువబడినాయట. వర్షాలు లేక భూమి ఎండిపోయి కరువు ఏర్పడిన సమయంలో అమృతవర్షిణి రాగంలో



సంగీత బ్రహ్మ త్యాగరాజు ఉత్కృష్టమైన సాహిత్యాన్ని దివ్యమైన సంగీతంతో చేర్చి 'పంచరత్నాలు' అనే గొప్ప సంగీత శిల్పాన్ని సృష్టించారు. అంతే గాక సెలయేటి ప్రవాహంవలె ఉండి పదయమకములు కలిగిన భక్తిపూర్వకమైన దివ్యనామ సంకీర్తన లెన్నింటనో సంస్కృతాంధ్రభాషలో రచించారు.

ఆధ్యాత్మిక విజ్ఞానానికి, కలాసంపదకు నిలయమైన కర్ణాటక సంగీతాన్ని మించి నేడు పాశ్చాత్యసంగీతం బాగా వ్యాప్తి చెందింది. ఈ పాశ్చాత్య సంగీతంలో గాత్రం కంటే జంత్రవాయిద్యాల శబ్ధం అధికంగా ఉంటుంది. దీని ఫలితంగా కర్ణాటక సంగీతానికి విలువతగ్గిపోతున్నదనే అపోహ చాలామందిలో ఉంది. కాని అది కేవలం అపోహ మాత్రమే. క్రమేణా కాలంలో మార్పు తప్పించి పెద్దగా మార్పురాలేదు. కనుకనే మన దేశంలో ప్రాచీన కర్ణాటక సంగీతాలకున్న విలువలు మారలేదనుటకు నిత్యజీవితంలో సంగీత ప్రియులాస్వాదిస్తున్న సంగీత కచ్చేరీలను మనం చూస్తూనే ఉన్నాం.

అంతర్జాతీయ ఖ్యాతినొందిన సంగీత కళ ఒక విధంగా సాహిత్యం కంటే గొప్పదనుటలో సందేహం లేదు. కనుక సంగీతం అభ్యసించుటకు ఓపిక లేనివారు కనీసం సంగీతాలాపనను ఆలకించి ఆస్వాదించుట అలవరచుకొన్నచో ఇది యొక కళాత్మకమైన అలవాటు కాగలదని ఆశిద్దాం!

కథ

# సెల్‌ఫోన్ సుబ్బలక్ష్మి...

- శ్రీనివాసరాజు ఇందుకూరి

**పిల్లల్ని కాలేజీకి, భర్తగారిని ఆఫీసుకు పంపించేసి హాల్లో కొచ్చి కూర్చుని టీ.వీ ఆన్జేస్తుండగా... సుబ్బలక్ష్మి ఫోన్ మోగింది. "హమ్మయ్యా ఎవరోకరు మాట్లాడటానికి దొరికారు". అని మనసులోనే ఆనందపడిపోతూ ఫోనెత్తింది సుబ్బలక్ష్మి.**

"వదినా... బావున్నావా... చాలా రోజులయ్యింది నీతో మాట్లాడి", అంది అవతలివైపు నుండి ఆడగొంతు.

"హా బావున్నానే సుజాతా... నువ్వెలావున్నావు. చాలా రోజులేంటి... అసలు మమ్మల్ని మర్చిపోయావు ఏంటి, అంతా బాగానే వున్నారు కదా!... తమ్ముడు ఎలా వున్నాడు. ఆరోగ్యం అదీ బాగానే వుంటుందా", లాంటి కుశలప్రశ్నలు అవీ అయిపోగానే.

"అవును అలా జరిగిందేంటే... ఈశ్వర్‌కి, దేవికి పెళ్లి ఫిక్సయ్యింది కదా!!, మున్నా దేవికోసం ముంబయి నుండి తిరిగొచ్చేసాడు కదా!. దేవిప్పుడు ఈశ్వర్‌ని పెళ్లిచేసుకోనంటుంది... మున్నానే పెళ్లి చేసుకుంటానని పట్టుబడుతుంది అదేం చోద్యమో... ఇప్పుడే ఆ అమ్మాయిని మధురై పంపించేసారు.., మున్నాకి ఈ విషయం తెలియదు పాపం... వెతుకుతున్నాడు. చూస్తున్నావా అసలు" అంది సుబ్బలక్ష్మి ఆయాసపడిపోతూ.

"సుందరకాండలో ట్విస్టు చూసావా... ఎంతబాగుందో... స్నేహ తిరిగొచ్చిందనుకుంటే... నేను స్నేహాను కాదు... నేత్రాదేవి అని చెబుతుంది. ముందు ముందు ఏం జరుగుతుందో చూడాలి చాలా ఇంట్రస్టింగా వుంది నాకు"..., అని వేరే టాపిక్ మొదలుపెట్టి ఒక గంట మాట్లాడుకున్నాకా ఫోన్ కట్ అయిపోయింది. "అయ్యో కట్ అయ్యిందే...", అని మరళా డయల్ చేసి ఈ సారి వంటలు, చీరలు, నగలు లాంటి మాటలు మొదలెట్టింది సుబ్బలక్ష్మి.

"ఏం కూర చేసావు... కరివేపాకు పులుసా... నేనూ మొన్న మా టీవిలో చూసాను అది నా ఫోనులో వీడియో తీసిపెట్టుకున్నాను కూడా.. రేపొండుదామని అనుకుంటున్నాను. నువ్వు ఆల్రెడీ చేసేసావా... ఎలావచ్చింది", అని ఊపిరి కూడా తీసుకోకుండా ప్రశ్నలు మీద ప్రశ్నలేసేసింది సుబ్బలక్ష్మి. అవతలి వేపున్న సుజాత, ప్రతీ ప్రశ్న రాసుకున్నట్టుగా మర్చిపోకుండా ఒక్కొక్కదానికీ సమాధానాలు చెప్పేసింది. మళ్లా ఓ గంట గడిచింది ఈ టాపిక్కి అయ్యేసరికి.

కాలింగ్ బెల్ మ్రోగింది... ఎవరా అని డోర్ సీత్రూ నుండి చూస్తే భుజంపై గ్యాస్‌బండ పెట్టుకుని కనిపించాడు గ్యాస్‌వాడు... డోర్ తీసి.. అక్కడపెట్టు అన్నట్టుగా సైగచేసి.. కిచెన్ చూపిస్తూ ఫోన్లోనే మాట్లాడుతూనే వుంది. సుబ్బలక్ష్మి.

"ఎవరూ గ్యాస్ వాడా... అవును గ్యాస్ ధరలు ఎంత మండిపోతున్నాయో... మాకు నెలకోబండ అయిపోతుందొదినా... " అంది సుజాతా.

"మీకం నెలన్నా వస్తుంది మాకు పదిహేను రోజులకే అయిపోతుంది..." అంది





సుబ్బలక్ష్మి. "హమ్మో..." అవునా...' అని ఆశ్చర్యపోయింది సుజాత. కిచెన్లో కెళ్లి గ్యాస్ బండపైకి ఎత్తిచూసి "మేడమ్... ఈ బండ కూడా నిండుగా ఉంది... మీకు కాదా మేడమ్గ్యాస్?" , అన్నాడు గ్యాస్ పట్టుకొచ్చినబ్బాయి.

"అయ్యో నా మతి మండిపోనూ... మాకు నిన్నే గ్యాసొచ్చింది బాబూ... డోర్ నెంబరెంతా!, ఇరవైరొండా.. అయితే... పక్కింటివాళ్లకి", అని నాలిక్కరుచుకుని గ్యాస్ అబ్బాయిని పంపించేసి డోర్ వేసేసి... మరళా అదే విషయం ఫోన్లో చెప్పుకుని నవ్వుకున్నారిద్దరూ.

"వదినా వదినా.. మాకు ఇక్కడ కరెంటుపోయింది... మీ ఇంట్లో టీ.వీలో అనుకుంటా... మావూరి వంట కార్యక్రమం పాటినిపిస్తుంది... కాస్త ఫోను టీ.వీకి దగ్గరగా పెట్టవా... ఆపాటంటే నాకెంతో ఇష్టం..." అంది సుజాత.

"అవునవును నాక్కూడా చాలా ఇష్టం... నేనైతే అది రికార్డుచేసుకుని మరీ ...నా సెల్ఫోన్ రింగ్టోన్లో కూడా పెట్టుకున్నాను తెలుసా". అని గర్వంగా చెప్పింది సుబ్బలక్ష్మి.

టీ.వీ సౌండు పెంచి సెల్ఫోన్ దగ్గరపెట్టి పాటినిపించింది. ఆ పాటతో పాటు తనూ పాటందుకుని ఫోన్లో పాడసాగింది సుబ్బలక్ష్మి.

మళ్లీ కాలింగ్బెల్ మోగింది...కాలక్షేపం కబుర్లు చెప్పుకోటానికొచ్చింది ఎదురింటావిడ, ఇదిగో సుజాతా..." ఎదురింట క్కయ్యగారు వచ్చారు... స్పీకర్ ఆన్ చేస్తున్నాను... ఆవిడని పరిచయం చేస్తాను ఈ మధ్యే ఇక్కడ అద్దెకు దిగారు..., నాకు ఈ మధ్య రోజంతా కాలక్షేపం అవుతుంది. అంటే ఆవిడ చలవే... ప్రతిరోజు ఈ టైములో మేమిద్దరం టీ.వీ చూస్తూ మంచిచెడూ మాట్లాడుకుంటాం"., అని ఫోన్ స్పీకర్ ఆన్చేసి ముగ్గురూ కబుర్లలో పడ్డారు.

కాసేపయ్యాకా ఫోను ఎదరింటావిడకి వదిలేసి... ఇంట్లో పనులు చేసుకోవటం మొదలు పెట్టింది సుబ్బలక్ష్మి. పనిచేసుకుంటూనే... మధ్య మధ్యలో పరుగెత్తుకు విచ్చి వాళ్లతో మాటలు కలుపుతూ ఉంది సుబ్బలక్ష్మి.

అలా మాట్లాడుకుంటుండగా ...ఏదో గుర్తొచ్చినట్టుగా "పిల్లలు స్కూల్కెళ్లిపోయారా... మరదలా. మీ బుజ్జిగాడు ఎలా చదవుతున్నాడే.. చాలా కాలమైంది వాళ్లను చూసి,... ఓసారి అంతా హైద్రాబాదు రాకూడదేంటే...", అని అడిగింది సుబ్బలక్ష్మి సుజాతను.

"హైద్రాబాదా... ఎందుకు అక్కడెవరున్నారొదినా?, పిల్లలా... ఎవరి పిల్లలూ? సీరియల్లో ఎవరి పిల్లలు గురించన్నా అడుగుతున్నావా వదినా", అని ఎదురు ప్రశ్నేసింది సుజాత.

"అదేంటే నీకిద్దరు పిల్లలు కదా!, అమ్మాయి అబ్బాయినూ..., వయసు దాచుకోటం కోసం అక్కయ్య దగ్గర అబద్ధమాడుతున్నావా ఏంటి..." అని నవ్వుతూ అడిగింది సుబ్బలక్ష్మి.

"అదేంటొదినా.. నువ్వలా అంటున్నావు. ఇంతకూ మీరు మా విజయవాడలో వుంటున్న సుబ్బలక్ష్మొదినేనా...నేను గుంటూరు సుజాతని", అంది సుజాత.

"హా.. మాది హైద్రాబాదమ్మా విజయవాడ కాదు..., నా మాటైనా గుర్తుపట్టలేదామ్మా, మాకు సుజాత అని మరదలుంది.. అందుకే అదే ఫోను చేసిందేమో అనుకున్నా నీ మాట అచ్చు మా సుజాతలానే వుంది ఇప్పుడు కూడా", అంది సుబ్బలక్ష్మి.

"అవునా.. నాకు అదే డౌటొచ్చి మిమ్మల్నడిగితే... జలుబు చేసింది నాకు అన్నారు కదా..., నిజమే అలాగే అయ్యుంటుంది అనుకున్నానండి.. సారీ అండీ రాంగ్ నెంబరు" అంది సుజాత.

"ఇంతసేపు మాట్లాడుకున్నా అనుమానమే రాలేదమ్మా.. అవునమ్మా రాంగ్ నెంబరు... ఏమీ అనుకోవద్దు... ఏమీ అనుకోకమ్మా..." అని నవ్వుతూ నాలుగు సార్లు చెప్పింది సుబ్బలక్ష్మి.

చార్జింగ్ పెడదామని తీసిన ఫోన్లో... భర్తఫోన్ నుండి ముప్పైరెండు మిస్సడ్కాల్స్, వేరే నెంబరు నుండి పది మిస్డ్కాల్స్ని చూసి ఆశ్చర్యపోయింది సుబ్బలక్ష్మి... అయ్యో... ఈయనెప్పుడు చేసారు... అసలు కాల్ వెయిటింగ్ బీప్ సౌండ్ వినబడలేదు... ఇప్పుడు వెంటనే ఫోన్ చెయ్యకపోతే చంపేస్తారు... అని భర్తకు ఫోన్ చేస్తుంది సుబ్బలక్ష్మి... వాళ్ళాయిన తిట్లెక్కడ వినాలో అని... నేను మళ్లీ వస్తానక్కయ్యగారు అంటూ ఎదురింటావిడ ఇదే అదనుగా పారిపోయింది.

భర్తకు ఫోన్జేసిన సుబ్బలక్ష్మి.. నెమ్మదిగా.. "ఏమండీ ఫోన్ చేసారా... నేను సుజాతతో మాట్లాడుతున్నాను... మీ కాల్స్ చూడలేదు", అని కవర్ చేసింది.

"ఫోన్ చెయ్యటమా ఏమన్నానా... ఒక గంటసేపు అలా ఫోను పట్టుకుని ట్రై చేసన్రా నీ ఎంగేజ్ సౌండ్ విని చెవులు నొప్పుపుడుతున్నాయి... అసలు నువ్వీలోకంలో వుంటే కదా..., నాకొక ఎకౌంట్ నెంబరు కావల్సొచ్చింది అందుకే అంతలా ట్రై చేసాను... ఇప్పుడవసరంలేదులే.. దొరికింది. నువ్వు మాట్లాడింది సుజాతతోనా.. మరి ఆ సుజాతేమో నా నెంబరుకు చేసి... తన ఫోన్ నెంబరు మారింది, అది చెబుదామంటే వదిన ఫోన్ బిజీ అని వస్తుంది... అని చెప్పిందేంటీ..., నాకు తెలుసు నువ్వు ఎవరితోనో సోదేస్తూ వుండుంటావ్.. సుజాతతో అని అబద్ధం చెబుతున్నావ్... నీకసలు సెల్ఫోన్లో ఎవరన్నా దొరికితే లోకమే తెలియదు కదా!!..', అని సీరియస్గా ఉవున్న భర్త తిట్ల పురాణం మొదలుపెట్టేసరికి భయపడి ఫోన్ పెట్టేసి సోఫాలో కూలబడింది సుబ్బలక్ష్మి.

కాసేపటికి తేరుకున్నాకా... "ఏమీ అనుకోకే... అప్పుడప్పుడూ ఫోన్ చేస్తుండు-ఇట్లు మీ సుబ్బలక్ష్మి వదిన", అని ఒక ఎస్మెస్... రాంగ్ నెంబరు సుజాతకి పంపించింది సుబ్బలక్ష్మి.

# వార్తలు

**ఏవిఎమ్**

టి.విలో వార్తలు వస్తున్నాయి

కరెంటు కోత ఎత్తేశారు. బొగ్గు ఉత్పాదన వల్లా, ప్రాజెక్టుల్లో నీళ్లు నిండుగా వున్నందువల్లా కరెంటు ఉత్పత్తి పెరిగింది. మన అవరాలకు పోగా మిగిలిన కరెంటును మాత్రమే ఇతర రాష్ట్రాలకు అమ్మాలని 'జీవో' పాసైంది. కరెంటు రేటు తగ్గించారు!, వచ్చే సంక్రాంతిలోగా మనరాష్ట్రంలో మట్టిరోడ్లు కనబడవు, అన్నీ సిమెంట్ రోడ్లే! పొలాలకు భూసారం తగ్గకుండా ఎరువులు కనిపెట్టారు పైగా అవి కారు చౌకగా అమ్ముతారు! కూరలు, బియ్యం నిత్యావసరవస్తువులు ప్రభుత్వం ఒత్తిడితో సగానికి సగం తగ్గించారు! బంగారం, వెండి రేట్లు కూడా పాతిక సంవత్సరాల క్రితం వున్న రేట్లకు దిగి వచ్చాయి! పెట్రోలు, డీజిల్ రేట్లు అనూహ్యంగా తగ్గాయి! పెట్రోలు కొంటే కిరసనాయిలు ఉచితం పథకాలు కూడా అమలవుతున్నాయి. రాష్ట్రంలో ఎటునుంచి ఎటు తిరిగినా ఐదు రూపాయల నామమాత్రపు చార్జీలతో రాష్ట్ర రోడ్డు రవాణాసంస్థ అన్ని దేశాల కన్నా ముందు వరుసలో వున్నది! ఆదాయ పన్ను వుంచారు! ఆస్థిపన్ను, వృత్తిపన్ను, భూమిశిస్తు లాంటి తదితర పన్నులన్నీ ఎత్తేశారు! 'రామరాజ్యం' మరోసారి వచ్చింది అంటే నమ్మండి! "అందువల్ల ప్రభుత్వం వారు ఉద్యోగుల జీతభత్యాలు కూడా తగ్గించారు!"

ఈ చివరి మాట విని... "ఆ.." అన్న పొలికేక పెట్టాడు మహర్షి! "వురేయ్ మహర్షీ! ఏమిట్రా ఆ మొద్దునిద్ర.. ఆ కలవరింతలూ... ఆ పొలికేకలూ... ఆఫీసులోనే కాక ఇంట్లో కూడా నిద్రపోతున్నావన్న మాట!" వంటింట్లోనించి అరుస్తోంది తల్లి కాత్యాయిని.



# 'హాస్యబ్రహ్మ' జంధ్యాల


శ్రీనివాస్

## అసలైన హాస్యానికి చిరునామా

నవ్వడం ఒక భోగం, నవ్వించడం ఒక యోగం, నవ్వలేకపోవడం ఒక రోగం' అంటూ నవ్వుకు సరికొత్త నిర్వచనం చెప్పిన 'జంధ్యాల' పేరు వినగానే, ప్రతివారి పెదవులపై నవ్వు తొణికిసలాడుతుంది. ఆరోగ్యకరమైన హాస్యానికి చక్కని చిరునామా జంధ్యాల. తెలుగు చలనచిత్ర పరిశ్రమకు ఎక్కువ మంది ప్రతిభావంతులైన హాస్యనటులను అందించిన ఘనత కలిగిన దర్శకుడు జంధ్యాల.

తెలుగు సినిమా రంగంలో హాస్య దర్శకుడుగా తనకంటూ ఓ ప్రత్యేక ముద్రను సంపాదించుకున్న జంధ్యాల పశ్చిమగోదావరి జిల్లాలోని నరసాపురంలో 1951 జనవరి 14న జన్మించారు. జంధ్యాల నారాయణమూర్తి, సూర్యకాంతం వీరి తల్లిదండ్రులు. జంధ్యాల వెంకట దుర్గాశివసుబ్రహ్మణ్యశాస్త్రి అనేది ఈయన పూర్తిపేరు. విద్యాభ్యాసం మొత్తం విజయవాడలో కొనసాగింది. జంధ్యాల కాలేజి రోజుల నుంచే నాటకాలు రాస్తూ, దర్శకత్వం వహించారు. స్వయంగా విన్నకోట రామన్న పంతులు ఆధ్వర్యంలో ఒక నాటక సంస్థ ప్రారంభించారు. మొదటి నాటకం "ఏక్ దిన్ కా సుల్తాన్" ఎంతో పేరు తెచ్చి పెట్టింది. తన నాటకాలే కాకుండా, ఇతరులు రాసిన నాటకాల్ని ప్రదర్శించి, ప్రముఖుల్ని సత్కరిస్తుండేవారు. జంధ్యాల రాష్ట్రవ్యాప్తంగా అనేక నాటక పరిషత్తుల్లో పాల్గొని ఉత్తమ నటుడు, ఉత్తమ ప్రదర్శన అవార్డులు ఎన్నో పొందారు. సినీ రంగంపై మక్కువతో మిత్రులు, శ్రేయోభిలాషుల ప్రోత్సాహంతో 1973లో మద్రాసులో అడుగుపెట్టారు. మొదటిసారిగా "పెళ్లికాని పెళ్లి" అనే సినిమాకు రచన చేసారు. అయితే "దేవుడు చేసిన బొమ్మలు" సినిమా ముందు రిలీజైంది. దాదాపు 140 సినిమాలకు రచయితగా పనిచేసారు. ఎక్కువ సినిమాలు హాస్యరస ప్రధానమైనవే. కె.విశ్వనాథ్, కె.రాఘవేంద్రరావు, ఎ.కోదండరామిరెడ్డి లాంటి ప్రముఖ దర్శకుల చిత్రాలకు రచనలు చేసారు. 1983లో ఏకంగా 80 సినిమాలకు మాటలు రాసారు. తెలుగు సినిమా చరిత్రలో ఇదొక రికార్డు. హాస్య చిత్రాలకు ఎంత చిలిపిగా రాసారో. ''శంకరాభరణం'' లాంటి చిత్రాలకు అంత హృద్యంగా రాసారు. 1981లో "ముద్దమందారం" సినిమా ద్వారా దర్శకులుగా మారారు. ప్రదీప్, పూర్ణిమ హీరో హీరోయిన్లుగా చేసిన ఈ చిత్రం
















శత దినోత్సవం జరుపుకుంది. దర్శకులుగా 40 సినిమాలు రూపొందించారు. వీటిలో నాలుగుస్తంభాలాట, రెండు జెళ్ళసీత, శ్రీవారికి ప్రేమలేఖ, ఆనందభైరవి, నెలవంక, రావుగోపాలరావు, శ్రీవారి శోభనం, రెండురెళ్ళు ఆరు, సీతారామకళ్యాణం, పడమటి సంధ్యారాగం, అహ నా పెళ్ళంట, వివాహ భోజనంబు, చూపులు కలిసిన శుభవేళ, బావా బావా పన్నీరు, ప్రేమ ఎంత మధురం, బాబాయ్ హొటల్, ఓహో నా పెళ్ళంట లాంటి సినిమాలు విజయవంతమవడంతో పాటు దర్శకులుగా జంధ్యాలకు ఎంతో పేరు తెచ్చిపెట్టాయి. నరేష్, రాజేంద్రప్రసాద్ లాంటి కామెడీ హీరోలతోనే కాకుండా ఇమేజ్ చట్రంలో ఇరుక్కుపోయిన చిరంజీవి, బాలకృష్ణ, అక్కినేని నాగేశ్వరరావు లాంటి అగ్రహీరోలతో కూడిన తనదైన ముద్రలో చిత్రాలు రూపొందించడం ఒక్క జంధ్యాలకే సాధ్యమైంది.

జంధ్యాల ఎందరో హాస్య నటుల్ని తెలుగు తెరకు పరిచయం చేసారు. బ్రహ్మానందం, వేలు, వీరభద్రరావు, గుండు హనుమంతరావు, శ్రీలక్ష్మి, కోట శ్రీనివాసరావులను సమర్ధవంతమైన హాస్య కళాకారులుగా తీర్చిదిద్దారు. "నాలుగు స్థంభాలాట" సినిమాలో "సుత్తి" అనే పదాన్ని ప్రయోగించి, ఆ పదానికి ఎంతో ప్రాచుర్యం కల్పించారు. ఈ పదం ఇప్పటికీ జనసామాన్యంలో పదే పదే వినిపిస్తుంటుంది. అందులో నటించిన వేలు, వీరభద్రరావు 'సుత్తి జంట'గా ఎంతో ప్రసిద్ధులయ్యారు.

## ఒకే ఏడాది 80 చిత్రాలు



జంధ్యాల రకరకాల ఇతివృత్తాలు తీసుకుని రాశారు. అయితే ఎక్కువగా కామెడీ చిత్రాలకు రాశారు. ఆయన దర్శకత్వం వహించిన చిత్రాలు కూడా ఎక్కువగా కామెడీలే. జంధ్యాల స్పీడ్ రైటర్. పది రోజుల్లో సినిమాకు మాటలు రాసేవారు. ఒక్కోసారైతే నాలుగైదు రోజుల్లోనే రాసేసేవారు. అలా ఓ ఏడాది అంటే 1983లో ఏకంగా 80 సినిమాలకు మాటలు రాశారు. తెలుగు సినిమా చరిత్రలో అది రికార్డు. జంధ్యాలకు అందుకు తగ్గట్టుగానే అవకాశాలు కూడా వచ్చాయి. ఆయన కళాత్మక చిత్రాలకు ఎంత హృద్యంగా రాశారో (ఉదాహరణకు శంకరాభరణం) హాస్య చిత్రాలకు అంత చిలిపిగా రాశారు. ఉదాహరణకు అహనా పెళ్లంట. జంధ్యాల చిత్రాల్లో సగటు మనిషి కనిపిస్తాడు.

జంధ్యాల సినిమాల్లో ప్రత్యేక హాస్య పాత్రలు పోషించిన శ్రీలక్ష్మి హాస్య నటిగా తెలుగు తెరపై ఎంతో కాలం రాణించింది. ఎంతోమందిని పరిచయం చేసిన జంధ్యాల "ఆపద్భాందవుడు" సినిమాలో నటించి, ఆ పాత్రకు ఎంతో వన్నెను తెచ్చారు.

జంధ్యాల సినిమాల్లో సున్నితమైన హాస్యం ఉంటుంది. అది సుతారంగా తాకి మనసును గిలిగింతలు పెడుతుంది. ఇలాంటి హాస్యాన్ని సృష్టించి, హాస్య బ్రహ్మ అయిన జంధ్యాల 2001 జూన్ 19న తెలుగు ప్రేక్షకుల్ని విచారసాగరంలో ముంచి అనంత లోకానికి వెళ్లిపోయారు. వెనుకటి తరం హాస్య రచయితలు పింగళి నాగేంద్రరావు, చక్రపాణి, సముద్రాల వంటి వారి బాటలో నడిచి, హాస్యాన్ని తన ఆయుధంగా నమ్మి, ఆరోగ్యవంతమైన హాస్యాన్ని తన చిత్రాల్లో చూపించిన జంధ్యాల, తెలుగువారి పెదవులపై చిరస్థాయిగా ఉంటారు.

*జనవరి 14 జంధ్యాల జయంతి సందర్భంగా...*

కవిత

# వందేమాతరం

– రమణశ్రీ

పాత సంస్కృతికి పాతరవేసి
పాశ్చాత్య సంస్కృతికి పట్టం కట్టి
అర్ధరాత్రి వేడుకలకు వేదిక కాని
యువతరానికి ఇదే నా వందనం
సప్త వ్యసనాలకు స్థావరమై
ఇల్లూ వళ్ళూ గుల్ల చేసుకుంటూ
అదే నాగరికతని భ్రమపడని
యువతరానికి ఇదే నా వందనం
ఆంగ్ల మాధ్యమంలో అక్షరాలు దిద్దించకుండా
తెలుగు బడులలో శతక పద్యాలు వల్లె వేయించే
అక్కడక్కడ అవశేషించిన
యువతరానికి ఇదే నా వందనం
వాహనాలపై వానర విన్యాసాలు చేస్తూ
రహదారులని రక్తసిక్తంచేస్తూ
కన్నవారికి కడుపుకోత కలిగించని
యువతరానికి ఇదే నా వందనం
కనిపెంచిన తల్లిదండ్రులను
కనిపించే దేవతలుగా కొలుస్తూ
వారిని వృద్ధాశ్రమాలకు అంకితమివ్వని
యువతరానికి ఇదే నా వందనం

*email: munipratapsinghb@gmail.com*

# 64 కళలు.కామ్

www.64kalalu.com

సకల కళల సమాహారం



## విరాళం/సహాయం కోసం విజ్ఞప్తి

**64కళలు డాట్‌కాం పత్రిక పురోభివృద్ధికి మీరూ తోడ్పడవచ్చు. అందుకు మీ అందరి సహకారం కావాలి. పత్రిక అభివృద్ధికి మీరు రెండు విధాలుగా సహాయం అందించవచ్చు.**

**1. ప్రచారం:** 64కళలు డాట్‌కాం సకల కళల సమాహారం పత్రికను రోజుకు సగటున 300మంది సందర్శిస్తున్నారు. పత్రిక చదివిన వారు మీ మిత్రులకు తెలియజేయండి. తద్వారా కళాకారులకు పత్రిక చేరువవవుతుంది.

**2. సహాయం:** పత్రిక ఎప్పటిలానే సజావుగా నడవడానికి మీ సహాయం కావాలి. గత 15 నెలలుగా వెబ్ పత్రిక నిర్వహణలో ఎంతో సమయమూ, ధనమూ ఖర్చుపెట్టాల్సి వచ్చింది. కళలకు సంబంధించిన ఈ పత్రికను ప్రచురించడానికి కావలసిన కంటెంట్ సేకరించడంతో పాటు, డి.టి.పి చేయడానికి పత్రిక డొమైన్ రిజిస్ట్రేషన్, హోస్టింగ్, మెయింటెనెన్స్ కోసం ఇలా పలు విధాలుగా సమయమూ, ధనమూ అవసరమవుతుంది. రాబోయే సంవత్సరాలలో పైన పేర్కొన వాటికోసం కావాల్సిన ధనసహాయం చేయదలచినవారు క్రింది మెయిల్/మొబైల్‌ను సంప్రదిస్తే మీకు బ్యాంక్ అకౌంట్ వివరాలు తెలియజేస్తాము. ***cell: + 91 9885289995, editor@64kalalu.com***

***మీరు 64కళలు పత్రికకు సహాయం చేయాలంటే మరో విధంగా సహాయపడవచ్చు.***

- మీరు పత్రిక సభ్యులుగా చేరి వ్యాసాలు రాయవచ్చు.
- మీకు తెలిసిన ప్రతిభావంతులైన కళాకారుల వివరాలను మాకందిస్తే, వారి గురించి పత్రికలో ప్రచురిస్తాం.
- మీ లేదా మీ మిత్రుల వ్యాపార ప్రకటనలు 64 కళలు డాట్‌కాం పత్రికకు ఇచ్చి ప్రోత్సహించవచ్చు.

### 64కళలు డాట్కాం పత్రిక స్థాపన ముఖ్యోద్దేశాలు :

- తెలుగునేల నలుదిశలా వున్న ప్రతిభాసంపన్నులైన కళాకారులను పత్రిక ద్వారా పరిచయం చేయడం.
- కళారంగంలో నిత్యం జరుగుతున్న కార్యక్రమ విశేషాలను ఎప్పటికప్పుడు వీక్షకులకందించడం.
- ప్రతిభాసంపన్నులైన వృద్ధకళాకారులకు సహాయం అందేలా చూడటం.
- తెలుగు తేజాలను అంతర్జాలం ద్వారా విశ్వవ్యాప్తి చేయడం.
- వెబ్ పత్రికలో వచ్చిన వ్యాసాలను పుస్తకరూపంలోకి తేవడం.

Organised by:




(Regd. 2001)

**Andhra Artists, Sculptors & Cartoonists Association**

A PLATFORM OF YOUNG GENERATION ARTISTS



# జయదేవుని అష్టపదులు

- మాకినీడి సూర్య భాస్కర్

## మధుమధురం మధుసూదన వదన సరోజమ్

అనేకమంది గోపికలు శ్రీకృష్ణుణ్ణి చుట్టుముట్టి శృంగారకేళితో రాసలీలలాడుచుండగా, ఆ దృశ్యాన్ని రాధకుచూపుతూ ఆమె చెలికత్తె రాధను ప్రేరేపిస్తోంది. దూరంగా కనిపిస్తున్న కృష్ణలీలా వినోదాలకు ప్రత్యక్ష వ్యాఖ్యానంగా ఈ అష్టపది సాగుతుంది. రాధను బృందావనానికి తీసుకువచ్చిన ఆమె చెలికత్తె, మాధవుని మదనకేళిని చూపిస్తూ రసరమ్యంగా వర్ణిస్తోంది.

ఈ అష్టపదిలో కమనీయ వర్ణనతో దృశ్య సాక్షాత్కార విధానంలో జయదేవ కవి ఆ లీలామానుషుని శృంగారకేళీ కలాపాల్ని మన కట్టెదుట నిలుపుతున్నాడు.

చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ
కేళి చలన్మణికుండల మండిత గండయుగ స్మితశాలీ
హరిరిహ ముగ్ధవధూనికరే – విలాసిని విలసతి కేళిపరే

శ్రీకృష్ణుడు తన నల్లని దేహం నిండా మంచి గంధం పూసుకున్నాడు. పీతాంబరాన్ని, వనమాలనీ ధరించాడు. క్రీడా సంభ్రమమందున్న ఆతని చెవులకున్న మణికుండలాలు రెండు చెక్కిళ్ళమీదా తాండవమాడుతున్నట్టుగా కదులుతుండగా, విలాసవంతులైన ప్రియురాండ్ర సమూహంలో మరింత విలాసంగా ఉన్నాడు, మాధవుడు.

పీనపయోధరభార భరేణ హరిం పరిరభ్య సరాగమ్
గోపవధూ రనుగాయతి కాచి దుదంచిత పంచమ రాగమ్
॥హరిరిహ॥

రాధా! చూస్తున్నావా, ఆ గొల్ల భామ మోహతమకాన్ని భరించలేక బరువెక్కి యున్న తన పాలిండ్ల ఉబలాటంతీరేలా శ్రీకృష్ణున్ని ఎంత గాఢంగా కౌగిలించుకుందో! అతని వేణునాదంతో శ్రుతి కలిపి పంచమస్వరంతో కంఠమెత్తిఎంత విలాసంగా పాడుతోందో!!

క్వాపి విలాసవిలోల విలోచన ఖేలనజనిత మనోజమ్
ధ్యాయతి ముగ్ధవధూరధికం మధుసూదన వదన సరోజమ్
॥హరిరిహ॥

ఆహా! ఆపిల్లను చూడు! శృంగార భావాలెన్నో కదలాడుతుండగా,కన్నుల్ని మనోహరంగా తిప్పుతూమన్మధుణ్ణి తలపిస్తున్న శ్రీకృష్ణుడి ముఖకమలాన్ని చూస్తూ చేష్టలుడిగి ఎలా చూస్తోందో!కృష్ణ సౌందర్యాన్ని ఆశ్చర్యంతో చూస్తూ ఆతనిముఖ పద్మాన్నే తదేకంగా ధ్యానిస్తోంది కదా!

ఈ పదంలో గొప్ప చమత్కారముంది. 'మధు' అనే రాక్షసుణ్ణి చంపినవాడు కనుక శ్రీకృష్ణుడు మధుసూదను డయ్యాడు. కానీ, జయదేవుడు ఇక్కడ ఉద్దేశించిన అర్థం వేరు. 'మధు' అంటే తేనె; 'సూదనం' అంటే 'స్రవించడం'. తనువంతా నిలువెల్లా తేనెను స్రవిస్తున్నవాడని ప్రస్తుతార్థం. అటువంటి శ్రీకృష్ణుని ముఖారవిందం – 'మధుసూదన వదన సరోజమ్' ఇంకెంత మధు మధురంగాఉంటుందో కదా! అందుకే ఆ పిల్ల కృష్ణుని ముఖాన్ని తదేకంగా చూడడంలో ఆశ్చర్యం ఏముంటుంది?!

క్వాపి కపోలతలే మిళితా లపితుం కమపి శ్రుతిమూలే
క్వాపి చుచుమ్బ నితంబవతీదయితం పులకైరనుకూలే
॥హరిరిహ॥

అదిగదిగో! మరో పడతి మోహ భ్రాంతితో తమకమును ఆపుకోలేక తన ప్రియుడైన శ్రీకృష్ణున్ని ముద్దు పెట్టుకోబోయి, అంతలోనే సిగ్గు లేదని చెలులు నవ్వుతారనేమో, భారములైన తన పిరుదుల్ని విలాసంగా కదిలిస్తూ అతని చెవిలోరహస్యమేదో చెప్పే నెపంతో తన ముఖాన్ని కృష్ణుడి చెక్కిలికి చేర్చి గగుర్పాటు చెందుతూ ముద్దాడుతోంది, చూస్తున్నావా!

కేళికళా కుతుకేన చ కాచిదముం యమునా జలకూలే
మంజుల వంజుల కుంజగతం విచకర్ష కరేణదుకూలే
॥హరిరిహ॥

అటు చూడవోయి రాధా! యమునానదిలో జలక్రీడలాడుతోన్న ఆ గొల్లపిల్ల ప్రబ్బపొదలో విహరిస్తోన్న శ్రీకృష్ణుడి పంచె పట్టి నవ్వుతూ ఎలా లాగుతోందో!

కరతలతాళతరళ మలయావళిజ కలిత కలస్వన వంశే
రాసరసే సహ నృత్యపరా హరిణా యువత్ణి ప్రశశంసే

॥హరిరిహ॥

అదిగదిగో, ఆ యువతి రాసక్రీడలాడుతూ, కృష్ణుడి వెంబడిస్తూ పాట పాడుతూ నాట్యం చేస్తోంది. పాటకు అనుగుణంగా చేతి గాజుల్ని గలగలలాడిస్తూ తాళం వేస్తోంది. ఆమె వేస్తోన్న తాళం శ్రీకృష్ణుడి వేణునాదంతో ఎంత చక్కగా కలిసిపోతుందో! "భళీ! నీ నేర్పరితన"మంటూ కృష్ణుడు ఆమెను పొగుడుతున్నాడు.

శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామం
పశ్యతి సస్మిత చారుతరామపరా మనుగచ్ఛతి వామామ్

॥హరిరిహ॥

కృష్ణుడు చూడు, ఆ కోమలి నెలా కౌగిలించుకుంటున్నాడో!మరో పక్క మరో పడతి చెక్కిలి నొక్కుతూ మేళమాడుతున్నాడు. ఒక రమణితో రమిస్తున్నాడు. ఇంకో పక్క మరొకామె మధురంగా నవ్వుతుంటే, ఆమెను చూస్తూ ఉర్రూతలూగిస్తున్నాడు. ముందు పోతున్న మరో ముగ్ధ వెనుకపడి ఎలా పోతున్నాడో!

ఇందరు, ఇందరు కృష్ణులున్నారా నిజంగా! ఒక్కడే ఇందరిగా ఎంత భ్రమ కలిగిస్తున్నాడు? ఒకతెని ఆలింగించుకుంటున్నాడు;మరొకతెను చుంబిస్తున్నాడు;వేరొకతెను రమిస్తున్నాడు.పోనీ వేరు వేరు సమయాలా? కాదే! ఏక సమయం; ఒకే సమయంలో, ఇందరిని గూడి రకరకాల శృంగార కేళీ కలాపాలు సలపడం కృష్ణుడొక్కడికే చేతనైన విద్యలాగంది, చూడబోతే!

శ్రీ జయదేవ భణిత మిద మద్భుత కేశవ కేళిరహస్యమ్
బృందావనవిపినే లలితం వితనోతు శుభానియశస్యమ్

॥హరిరిహ॥

చిరంతన కీర్తిని కలుగజేస్తూ, హృదయాహ్లాదకరమైన శ్రీకృష్ణుని అద్భుత క్రీడా రహస్యాల్ని తెలిపే శ్రీజయదేవుని శ్రీసూక్తిని వినువారికీ, చదివేవారికీ మంగళం కలుగజేస్తుంది.

విశ్వేషా మనురంజనేస జనయన్నానంద మిందీవర
శ్రేణీశ్యామల కోమలై రుపనయన్నంగై రసంగోత్సవమ్।
స్వచ్ఛందం వ్రజ సున్దరీభిరభిత్ణ ప్రత్యఙ్గ మాలిఙ్గిత్ణ
శృంగార్ణ సఖిమూర్తిమానివ మధౌ ముగ్ధో వార్ణిక్రీడతి॥

ఈ వసంత రుతువులో ప్రేమానురాగాలు అతిశయిస్తుంటే, గొల్లభామలతో కూడి సంతస సముద్ర తరంగాలు ఉవ్వెత్తున లేస్తుండగా, నల్ల కలువపూల నుల్లసంబాడుతూ ఉల్లమున యుల్లాసము పల్లవింపగా గొల్ల భామల బాహిరావయవాలనే కాక యుల్లంబులనూ కౌగిలించుకుంటున్నాడు శ్రీకృష్ణుడు. విభావాది సంగమములచే మూర్తీభవించిన శృంగారవనంలా ఉన్న బృందావనంలో అనంగకేళీ మనంబుతో శ్రీకృష్ణుడు చెలరేగిపోతున్నాడు.

వసంత మహిమ. గోపికల మీదే కాదు, కృష్ణుడిపైనా ఒకేలా ఉంది. అందుకే ప్రేమాప్యాయతలు క్రమ్ముకొంటుంటే, గొల్ల పడుచులతో పరిహాసాలాడుతూ ప్రఫుల్ల మనస్కుడయ్యాడు శ్రీకృష్ణుడు.

గోపికల ఆ స్వేచ్ఛ; కృష్ణుని చుట్టూ చేరి సరసాలాడే యథేచ్ఛ; అదృష్టవంతులు కదా ఆ గోపికలు. అతని తనువు తాకి పులకించిపోతున్నారు, ఎప్పుడే పుణ్యం చేసుకున్నారో!

నిత్యోత్సంగవసద్భు జంగకబల క్లేశాది వేశాచలం
ప్రాలేయ ప్లవనేచ్ఛయాను సరతి శ్రీఖండ శైలానిల్ణ।
కించ స్నిగ్ధ రసాల మౌళిముకుళా న్యాలోక్య హర్షోదయా
దున్మీలన్తి కుహ్వా, కుహూరితి కలోత్తాల్ణా పికానాంగిర్ణ॥

పాములు నిత్యం తమతో కాపురం చేస్తూ మాటిమాటికీ తమని గుటుక్కున మింగడంవల్ల, ఆ విషతాపాన్ని మంచునీట మునిగి పోగొట్టుకోవాలని మలయ మారుతాలు హిమపర్వతాల దారిలో పోతున్నాయి. వసంత కాలంలో చిగురించిన లేలేత మావిచిగుళ్ళుచూచి గండుకోయిలలు సంతసంతో పంచమ రాగాన్ని మనోహరంగా కుహుకుహూ కూతలట్లు కూస్తున్నాయి.

రాసోల్లాస భరేణ విభ్రమభృతా నూభీరవామభ్రువా
మభ్యర్ణం పరిరభ్య నిర్భర ముర్ణ ప్రేమాన్ధయా రాధయా
సాధు త్వద్వదనం సుధామయ మితి వ్యాహృత్య గీతస్తుతి
వ్యాజాదుృట చుంబితస్మిత మనోహారీ హర్ణి పాతువ్ణ

ప్రేమాతిశయంతో ఒళ్ళు తెలియని స్థితిలో, రాసక్రీడల నోలలాడతూ సంతోషాన్ని పొందుతున్న విలాసవంతులైన స్త్రీలు చూస్తున్నారనే బిడియం లేకుండా, శ్రీకృష్ణుని చేరి రాధ, ఆతని గాఢంగా కౌగిలించుకుంటూ,"ఓ కృష్ణా! నీ మోము సుధామయం. అందువల్లనే నీ నోట వెలువడే గీతమూ సుధామయంగానే ఉంటుంది. ఒక్క గీతం పాడవా, వింటా"నందిరాధకూ తప్పలేదు; ఆ మిషతో శ్రీకృష్ణుని చేరి రాధ ఆతని అధరాన్ని చుంబింపగా, ముద్దుల మూటగట్టు చిరునగవుతోముఖమండలం ప్రకాశిస్తుండగా మనసులను ఆకర్షించే శ్రీకృష్ణుడు మమ్మల్నీ, మిమ్మల్నీ, అందరినీ ఎప్పుడూ రక్షించుగావుతయని జయదేవ కవి మంగళాశాసనం చేస్తున్నారు.

***

# బెంగుళూరు చిత్రసంత

***కళ అందరికోసం అన్న స్లోగన్‌తో గత 9 యేళ్ళుగా బెంగుళూరులో జరుగుతున్న చిత్రసంతకు ఆంధ్రప్రదేశ్ నుండి పెద్ద సంఖ్యలో చిత్రకారులు, కళాభిమానులు హాజరవుతారు. జనవరి 29, 2012లో జరిగిన చిత్రసంతకు హాజరైన, విజయవాడకు చెందిన చిత్రకారుడు టీవీ, చిత్రకారిణి ఇంజేటి జానకిల స్పందన వారి మాటల్లో చదవండి.....***



చిత్రసంతలో పాల్గొన్న జానకి తన సోదరితో

కర్ణాటక చిత్రకళాపరిషత్ చిత్రకారులను ప్రోత్సహించటానికి ఏర్పాటుచేసే ప్రదర్శన పేరే చిత్రసంత

పేరుకు చెబుతున్నట్లుగానే ఇది చిత్రాలకు సంబంధించిన సంత. గత నెల అంటే జనవరి 29న ఆదివారం నాడు బెంగుళూరులోని కుమార కృప రోడ్డులో ఉన్న కర్ణాటక చిత్ర కళాపరిషత్ ప్రతి ఏడాది ప్రతిష్ఠాత్మకంగా ఏర్పాటు చేసే "చిత్రసంత" జరిగింది. గత 9ఏళ్ళుగా ఇది జరుగుతూ వస్తుంది. ఇది కేవలం ఒకరోజు మాత్రమే జరుగుతుంది. ఉదయం 9కి మొదలయ్యి రాత్రి 7గం॥లకి ముగుస్తుంది. ఈ చిత్రసంతకు దేశం నలుమూలల నుండి అనేక మంది చిత్రకారులు వచ్చి తాము గీసిన చిత్రాలను ప్రదర్శిస్తారు.

వివిధ మాధ్యమాలలో అంటే ఆయిల్‌పెయింటింగులు, వాటర్ కలర్ పెయింటింగులు, యాక్రిలిక్స్, ఆయిల్ పేస్టెల్స్, పెన్సిల్ వర్క్స్ లాంటివి అనేక సైజులలో వున్న చిత్రాలు, వివిధ రీతులలో అంటే తంజావూరు, మధుబనీ, మ్యూరల్, నిర్మల్ మొదలగు సంప్రదాయ చిత్రకళా రీతులలో తయారు చేసిన చిత్రాలు ఇంకా సమకాలీన చిత్రకళా శైలిలో చేసిన చిత్రాలను చిత్రకారులు ప్రదర్శిస్తారు. పెయింటింగ్‌లే కాకుండా ఛాయా చిత్రాలను కూడా ప్రదర్శిస్తారు.

ఈ చిత్రసంతలో చిత్రకారులు చిత్రించిన చిత్రాలను సామాన్యులకు అందుబాటులో ఉండే ధరలకే అమ్ముతారు. ఇలా చిత్రకారులు తాము వేసిన చిత్రాలను విక్రయించేందుకు గాను చిత్రకారులు కర్ణాటక చిత్రకళా పరిషత్‌కు నామమాత్రపు రుసుముగా రూ.100/- చెల్లిస్తే వారి ఒక స్టాలు కేటాయిస్తారు.

ఇక్కడకు దేశం నలుమూలల నుండి సుమారు 1500 మంది చిత్రకారులు వస్తారు. అటు చిత్రకారులకు ఇటు చిత్రకళాభిమానులకు



చిత్రసంత స్టాల్‌లో టీ.వీ.

బెంగుళూరులోని కర్నాటక చిత్రకళాపరిషత్ వారి ఆర్ట్ కాంప్లెక్స్ ఎదురుగా వున్న కుమార కృప రోడ్డులో ఇది జరుగుతుంది. ఆ రోడ్డుకి అటూ ఇటూ వున్న ఫుట్‌పాత్‌లపై రెండేసి మీటర్ల స్థలాన్ని తెల్లగీతలతో విభజించి స్టాల్ నంబర్లు వేసి చిత్రకారులకు కేటాయిస్తారు. చిత్రకారులకు ఒక కుర్చీ ఒక టేబుల్ కూడా ఇస్తారు. ఆ 'స్టాలు'లో వారు తమ చిత్రాలనో, శిల్పాలనో ప్రదర్శించి అమ్ముకోవచ్చు. ఆరోజు ఉదయం 9గంగలనుండి సాయంత్రం ఏడు గంటల వరకు ఈ సంత జరుగుతుంది. ఆ సంతలో కన్నడ చిత్రకారులు, కేరళ చిత్రకారులు, తమిళచిత్రకారులు, ఆంధ్రచిత్రకారులు పాల్గొంటారు. బెంగుళూరు ప్రజలు ఈ సంతకు విరివిగా వచ్చి చిత్రాలను చూడటమే కాదు కొంటారు కూడా. దక్షిణ భారతదేశంలో ఇదొక అద్భుతం. అక్కడ రకరకాల చిత్రాలు దర్శనమిస్తాయి. ఇతర ప్రాంతాల నుండి కూడా కళాప్రియులు, చిత్రకారులు, యువచిత్రకారులు కూడా దీనిని చూడటానికి వస్తారు. ఈ చిత్రసంతను కార్నాటక చిక్రకళాపరిషత్ వారు నిర్వహిస్తారు. ఆ ఆర్ట్ కాంప్లెక్స్‌లోని చిత్రకళాశాల విద్యార్థులే అక్కడ వాలంటీర్లుగా సేవ చేస్తున్నారు. ఈ సంతకు నెలరోజులముందే స్టాల్సును కేటాయిస్తారు. దరఖాస్తుఫారం వుంటుంది. స్టాల్ రిజిస్ట్రేషనుకు గాను ఒక వందరూపాయలు చెల్లించాలి. ఒక ఫోటోని, చిత్రకారుడు అని తెలిపే గుర్తింపు పత్రాన్ని కూడా ఇవ్వవలసి వుంటుంది. ఇది వారి 9వ సంత. నేను ఐదవ సంతలోను 9వ సంతలోను పాల్గొన్నాను. మూడు పెయింటింగులు అమ్ముకున్నాను....

– **టీ.వీ.** చిత్రకారుడు







ఇది ఒక పండుగే. ఎందుకంటే అనేక అపురూపమైన చిత్రాలు, వాటిని చిత్రించిన చిత్రకారులను ఒకే చోట చూడవచ్చు. ఆర్ట్ ఎగ్జిబిషన్ ఏర్పాటు చేసే చిత్రకారులు, గ్రూపు ఎగ్జిబిషన్‌లు ఏర్పాటు చేసే చిత్రకారులు పరిమితంగా ఉంటారు. కాని ఇక్కడ వందలాది చిత్రకారులు కలిసి తాము గీసిన చిత్రాలను ప్రదర్శిస్తారు. మరియు విక్రయిస్తారు.

సహజత్వాన్ని సంతరించుకున్న రియలిస్టిక్ పెయింటింగ్‌లు అలాగే ఆలోచింపజేసే యాబ్‌స్ట్రాక్ట్ పెయింటింగులు చూపరులను కట్టిపడేస్తాయి. ఈ సంతేలో మరికొన్ని జిలుగులు ఏంటంటే చిత్రకళాపరిషత్‌లోని చిత్రకళాశీల విద్యార్థులు చేసే నృత్యాలు, పాటలు సందడి కూడా చాల బాగుంటుంది. ఇతర సంతలలో లాగానే చిరుతిళ్ళు బండ్లు, బూరలు, ఐస్‌క్రీం బండ్లు సందడి కూడా బాగానే ఉంటుంది. ఇటువంటి చిత్రసంతలు కేవలం బెంగుళూరులోనే కాకుండా కర్ణాటకలోని పెద్దనగరాలైన మైసూరు, మంగుళూరు, షిమోగాలలో కూడా జరుగుతాయట.

పూర్వకాలంలో చిత్రకళ అంటే కేవలం మహారాజులు, ఆ తరువాత కాలంలో జమీందారులు మాత్రమే పోషించిన కళ. ఇవాల్టి రోజుల్లో ఒరిజినల్ పెయింటింగులు అంటే కేవలం సంపన్నులకే సొంతం. మధ్యతరగతి వాళ్లకు ఆమడదూరంలో ఉంటూ వస్తుంది. అందుకు కారణం అవి తమకు అందుబాటులో లేవని. కాని ఇటువంటి చిత్రసంతల వలన ఎంతో అపురూపమైన కళాఖండాలు ఒరిజినల్స్ సామాన్యులకు అందుబాటు ధరల్లో లభిస్తున్నాయి.

ఇటువంటి చిత్రసంతలు మన రాష్ట్రప్రభుత్వం కూడా ఏర్పాటు చేస్తే ఎంతో బాగుంటుంది. మన రాష్ట్రంలో పెద్ద పట్టణాలైన హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణాలలో ఏర్పాటు చేస్తే చిత్రకారులకు, కళాభిమానులకు బాగుంటుంది. ఈ చిత్రసంతల వలన ప్రజలలో చిత్రకళపై ఆశక్తి, అవగాహన పెరుగుతుంది. తద్వారా చిత్రకళకు చిత్రకారులకు మనరాష్ట్రంలో కూడా మరింత ప్రోత్సాహం లభిస్తుందని నా అభిప్రాయం.

**– జానకి ఇంజేటి,** చిత్రకారిణి

64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :2 సంచిక :5 మార్చి 2012



# అంతర్జాతీయ మహిళాదినోత్సవ సంచిక

64కళలుడాట్‌కాం మొదటి సంవత్సరం పూర్తి చేసుకొని రెండవ సంవత్సరంలోకి అడుగుపెట్టింది. కళలపై నున్న ఆశక్తితోనూ-అభిరుచితోను ప్రారంభించిన ఈ వెబ్ పత్రికకు విశేష ఆదరణ లభించింది.

మార్చి 8న అంతర్జాతీయ మహిళాదినోత్సవం సందర్భంగా 64కళలుడాట్‌కాంను మహిళాదినోత్సవ ప్రత్యేక సంచికగా రూపిందించాం. వివిధ కళల్లో కృషిచేస్తున్న మహిళామణులను పరిచయం చేసాం.

ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.

**కళాసాగర్**
ఎడిటర్



ముఖచిత్రం చిత్రకారిణి : **లక్ష్మి**



**ఇండియన్ ఆర్ట్‌ను ఇష్టపడే ఫ్రాన్స్ చిత్రకారిణి- కెరల్**

**చిత్ర జగతిలో పున్నమి రేడు... దామెర్ల**



అతిథి

# ఇండియన్ ఆర్ట్‌ను ఇష్టపడే ఫ్రాన్స్ చిత్రకారిణి- కెరల్

జీవితం అనేది ఓ రంగుల ప్రపంచమే కాదు. అనేక సంఘటనల సమాహారం కూడా. చిత్రవిచిత్రమైన ఈ జీవన యానంలో ఎదురయ్యే అన్ని సంఘటనలూ మధురస్మృతులు కాలేవు. కేవలం కొన్ని మాత్రమే అలా కాగలవు. వాటిలో తెలిసి జరిగేవి కొన్నైతే తెలియకుండా సంభవించేవి మరికొన్ని. తెలిసి జరిగిన వాటి కంటే తెలియకుండా జరిగే వాటిలో పొందే మాధుర్యం మరింత అధికంగా వుంటుంది. అలా నా జీవితంలో జరిగిన ఓ మధురమైన సంఘటన ఇది.



- వెంటపల్లి సత్యనారాయణ

ఎక్కడో యూరప్ ఖండంలో ఫ్రాన్స్ దేశానికి చెందిన ఓ 21ఏళ్ల అమ్మాయి భారతదేశం రావడం, ఆపై ఆంధ్రదేశంలోని అతిమారుమూల ఏజెన్సీ ప్రాంతమైన చర్ల రావడమేకాక? ఓ సాయంత్రం మా ఇంటికి రావడం నెట్‌లో 64కళలు.కామ్ వీక్షించడం, దనా దనా 25 నిమిషాలలో ముందస్తు పెన్సిల్ స్కెచ్ ఏమీ వేయకుండానే నా పోర్ట్రెయిట్‌ని రంగుల్లో డైరెక్ట్‌గా వేయడం. మమ్మల్నందర్నీ ఆశ్చర్యంలో ముంచేయడమే కాక నేను ఆమె యొక్క ఇంటర్వ్యూ కూడా తీసుకోవడం అంతా ఓ కలలా జరిగిన ఈ సంఘటన 4.1.2012న మా ఇంట్లో జరిగింది. మమ్మల్ని ఇంతలా ఆశ్చర్యానికి గురిచేసిన ఆ 21 ఏళ్ళ ఆ అమ్మాయే మిస్ 'కెరల్ బెహతూ' (Carole ber Taux) స్పెల్లింగ్ పరంగా మనం కెరల్ బెర్టాక్స్ లేదా కెరల్ బెటాక్స్ అని పిలవాలి కాని ఫ్రెంచి ఉచ్చారణలో "కెరల్ బెహతూ"గా ఆమె చెప్పింది.

కళలకు, ఫ్యాషన్లకు పుట్టినిల్లయిన ఫ్రాన్స్ దేశస్థురాలు అయిన ఆమె అక్కడ నార్మండి అనే ప్రదేశంలో వ జోసెఫ్ బెహతూ, మేరి క్రిష్టియన్ బెహతూ అనే దంపతులకు జన్మించింది. తండ్రి ఓ రిటైర్డ్ టీచర్ కాగా తల్లి స్వతంత్రంగా ఓ డ్రెస్‌షాప్ నిర్వహిస్తూ వ్యాపార రంగంలో వుంది. ఆమెకు కారెంట్ బెహతూ అనే ఓ సోదరుడు కూడా వున్నారు. ఫ్రాన్స్ దేశంలో "esam" CAEn college (ఆమె ఉచ్చారణలో ఎస్, ఎమ్‌కో కాలేజ్)లో చిత్రకళలో బ్యాచులర్ డిగ్రీని గత జూలై 2011న పూర్తిచేసింది.

సహజంగా కళ, ఫ్యాషన్ మరియు విద్యారంగాలలో మనకంటే ఎంతో ముందున్న యూరప్ ఖండాన్ని వదిలి ఎమ్.ఎఫ్.ఎ. చేసేందుకు ఇండియాను ఎంచుకొనడానికి గల కారణమేమిటి? అన్న ప్రశ్నకు అమె సమాధానం ఇలా చెప్పింది.



కెరల్ ని ఇంటర్వ్యూ చేస్తున్న వెంటపల్లి మరియు అన్వేష్ నాన్న గారు

తాను BVA (Batchelor of Visual Arts) కోర్స్ చేస్తుండగా అక్కడ ఫ్రాన్స్ దేశంలో సుభోద్ గుప్తా లాంటి భారతీయ చిత్రకారులు పారిస్, ఢిల్లీ, బోంబే పేరుతో ఫ్రాన్స్ మరియు భారతీయ చిత్రకారుల యొక్క గ్రూప్‌షోను తాను చూడడం జరిగిందని అక్కడ భారతీయ చిత్రకారుల చిత్రాలకు Inspire అయ్యి తన ఎమ్.ఎఫ్.ఎను ఇండియాలో చేస్తే ఎలా వుంటుందన్న ఆలోచన తనలో రేకెత్తిందని ఆ ఉద్దేశ్యంతోనే 05-9-2011న తాను ఇండియా వచ్చి బెంగుళూర్ చిత్రకళాపరషత్‌లో చేరానని నాతో పాటు MFA చేస్తున్న ఖమ్మంజిల్లా చర్లకు చెందిన మా మిత్రుడు అన్వేష్ పరిచయం కావడం అతనితో కలిసి సెలవులకు ఇలా వాళ్లింటికి రావడం జరిగిందని చెప్పింది.

బి.ఎఫ్.ఏ.లో ఆమె స్పెషలైజేషన్ మరియు





కెరల్ చిత్రాలు

ఫ్రాన్స్-ఇండియాల మధ్య విధానంలో మీరు గుర్తించిన తేడాలేమిటి అని అడగగా వావ్ వాటే బిగ్ క్వశ్చన్ అంటూ ఆమె ప్యారిస్‌లో ఒకే అంశంపై కాకుండా కళకు సంబందించిన విద్యార్థికి నచ్చిన అన్ని అంశాలను అక్కడ బోధిస్తారని ఇలా చేయడం వలన అక్కడ విద్యార్థికి అన్ని విషయాలలోనూ కొంత ప్రావీణ్యత ఏర్పడుతుందని, అదే ఇక్కడయితే ఒక ప్రత్యేక అంశంపై పెయింటింగ్, స్కల్ప్చర్, అప్లైడ్ ఆర్ట్స్ ఇలా ప్రత్యేక అంశాలపై బోధన సాగుతుందని రెండింట్లోనూ లాభనష్టాలు ఉన్నాయని ఆమె చెప్పింది.

మీరు పోర్రైట్ చాలా వేగంగా డైరెక్ట్‌గా రంగులతో వేస్తారని మా అన్వేష్ ద్వారా విన్నాను. అంతలా ఎలా సాధ్యం? అని వేసిన ప్రశ్నకు పారిస్‌లో Nudes, మరియు హ్యూమన్ స్టడీ తప్పనిసరని, హ్యూమన్‌స్టడీ అధికంగా చేయడం వలన దానిపై పట్టు ఏర్పడుతుందని


వెంటపల్లి పోట్రయిట్ వేస్తున్న కెరల్

అందువల్లనే అక్కడ పోర్రైట్ వేయడంతో కొంత ప్రావీణ్యం ఏర్పడుతుందని చెప్పింది.

ప్రస్తుతం సాగుతున్న ఆబ్‌స్ట్రాక్ట్ ఆర్ట్‌పై మీ భావన ఏమిటి? అని అడగగా చిత్రకారుడు విశాలమైన మనస్సుతో తాదాత్మ్యం చెంది దాన్ని రంగుల పరిభాషలో వ్యక్తం చేసే ఓ కళాఖండంగా ఆబ్‌స్ట్రాక్ట్ ఆర్ట్‌ని వర్ణించింది.

భారతీయ చిత్రకారుల గురించి ఆమెను అడగగా రాజారవివర్మ, అమృతాషేర్‌గిల్, కె.కె. హెబ్బార్‌లు తెలుసునని చెప్పింది. మన దామెర్ల రామారావు భగీరధి, ఎమ్.ఎఫ్.హుస్సేన్, మంజిత్‌భవా, చ్యాయష్ మెహతా, జహంగీర్ సభావలాల గురించి అడిగితే తనకు తెలియదని చెప్పింది. అమృతాషేర్‌గిల్ తనకు బాగా ఇష్టమైన చిత్రాకారిణిగా పేర్కొంది. అప్పుడు నేను మన దామెర్లరామారావు గురించి చెబుతూ కేవలం (28) ఏళ్ల వయసులోనే ఆంధ్రచిత్రకళకు బలమైన పునాదులు వేసి ఆధునిక ఆంధ్రచిత్రకళా బ్రహ్మగా ఆయన మారితే అమృతాషేర్‌గిల్ కూడా కేవలం (28)ఏళ్ల వయసులోనే భారతీయ చిత్రకళపై ఓ చెరగని ముద్రవేసి గతించారని చెప్పాను. ఎమ్.ఎఫ్ హుస్సేన్ గురించి తనకు తెలియదన్న ఆమెకు అంతర్జాతీయ చిత్రకళా మార్కెట్‌లో అత్యధికంగా సేలబిలిటీ సాధించి పికాసో ఇండియాగా పేరుగాంచిన భారతీయ చిత్రకారుడని, కురు వృద్ధుడని (97) ఏళ్ళ వయసులో 2011 జూన్ నెలలో లండన్‌లో చనిపోయాడని చెప్పాను.

ఇంకా ఇతర చిత్రకారుల గురించి అడుగగా అమెరికా చిత్రకారుడు ఎడ్వర్డ్ హూపర్, బొంబాయి చిత్రకారిణి నళిని మాళిని, బెంగుళూర్ చిత్రకారిణి షీలాగౌర్‌ల గురించి చెప్పింది.

ఇక ఫ్రాన్స్‌కి సంబంధించి, లూయిస్ దేవిడ్, ఎడ్గర్ డిగాస్, జాన్‌హానెరె, ఫ్రగ్‌నార్డ్‌ల గురించి అడుగగా వాళ్లంతా అక్కడ ప్రముఖ చిత్రకారులని అలాగే గేమ్స్ పోన్షల్ అనే మరో చిత్రకారుడి గురించి ఆమె చెప్పుకొచ్చింది.

వాటర్, ఆయిల్, ఏక్రలిక్ వీటితో ఏ మీడియా మీ కిష్టమని అడిగిన ప్రశ్నకు దేని ప్రత్యేకత దానిదే అయినా తనకు బ్లాక్ జెల్‌పెన్‌తో డ్రాయింగ్స్ వేయడం బాగా ఇష్టమని చెప్పింది. ఇక చిత్రకళలో తను




చేసే ప్రదర్శనల గురించి అడుగగా తానింకా విద్యార్థినని One man show ఇంతవరకూ చేయలేదని, త్వరలో చేయబోతున్నానని, పారిస్‌లో గ్రూప్‌షోలో పాల్గొన్నానని చెప్పింది. అవార్డుల గురించి అడగ్గా తనకు యూనివర్శిటీ స్థాయిలో ఓ అవార్డు వచ్చిందని చెప్పింది.

భారతదేశం ఎలా వుంది? అన్న ప్రశ్నకు చాలా బావుంది. ఇక్కడ సంస్కృతి తనకు బాగా నచ్చిందని అన్వేష్ అమ్మగారి ద్వారా చీరకట్టడం నేర్చుకున్నానని ఇలా బొట్టు పెట్టుకోవడం, గాజులు వేసుకోవడం బాగుందని చెప్పింది. అయితే ఇక్కడ జనాలు ఇతరులను అందరిలాగే చూడకుండా ఓ ప్రత్యేకంగా చూడడానికి ప్రయత్నించడం బాగుండదని చెప్పింది. ఫొటోలు తీయడానికి అంతగా సుముఖత చూపలేదు. తానొక వస్తువును కాదని అందరి లాంటి మనిషినేనని చెప్పుకొచ్చింది. బాపు శ్రీరామరాజ్యం సినిమా తనకు చాలా బాగా నచ్చిందని, సినిమాను చూడడమే గాక అందులోని పాటలను అన్వేష్ సహాయంతో పాడడం కూడా నేర్చుకుంది. నా పోర్ట్రెట్ వేస్తున్న సమయంలో మా ఇంట్లోని సిస్టమ్ నుండి శ్రీరామరాజ్యం సినిమా పాటలు నెమ్మదిగా వినిపిస్తుంటే వాటితో కలిసి ఆమె పాడుతుండడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

చర్లలో ఉన్న మూడు రోజుల్లోనూ అన్వేష్ వాళ్ల కుటుంబం ఆమెకు ఇక్కడ గల వివిధ ప్రదేశాలను చూపించారు. అందులో భాగంగా పర్ణశాల వెళ్లి అక్కడ బాపు బొమ్మల శైలిలో రూపొందించిన శిల్పాలు చూపించి చిత్రకారుడు బాపు గురించి చెప్పడం జరిగింది. అలాగే చర్లలోని చిత్రకారులను చూపించడంలో భాగంగా మొదట నా చిత్రాలు, తర్వాత బీర శ్రీనివాస్ మరియు ముత్యాలరావు చిత్రాలను చూపించడంతో పాటు మా ఇంట్లో 64కళలు.కామ్‌లో ఈ నెల చిత్రకారుడు ఆత్మకూరు రామకృష్ణపై "విశ్వవిచిత్రం–రామకృష్ణ చేతిచిత్రం" ఆర్టికల్‌ని చూపించి ఈచిత్రకారుడు కేవలం 13 గంటల 20 నిముషాలలో 100 లాండ్‌స్కేప్స్ వేసి ఏడు ప్రపంచ రికార్డులను సృష్టించాడని చెప్పగా వావ్ అని ఆశ్చర్యపోయింది.

కెరల్ చర్లలో వున్న మూడు రోజులలో ఏదో ఒక సమయంలో నేను ఆమెను అన్వేష్ వాళ్లింట్లో కలవడం, ఆమెను గమనించిన మీదట నాకు అవగతమైన విషయం. ఆమె చాలా తెలివైన సున్నితమనస్కురాలు. ఏ సూక్ష్మ విషయాన్నైనా ఇట్టే పట్టేయ గల శక్తి ఆమెలో నాకు కనిపించింది. ఈ రెండు రోజులల్లోనే ఇక్కడ ఆమె బైక్ డ్రైవింగ్ నేర్చుకుంది. సహజంగా మంచి గాయకుడైన అన్వేష్ నాన్న శ్రీ చలంగారు ఓ రోజు సాయంత్రం ఇంట్లో బాల్యం గురించి ఓ పాటపాడుతూ వుంటే అక్కడ పైన తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్ డిస్టబ్ చేస్తుందనో ఏమో, ఆమె ఫ్యాన్ ఆఫ్ చేసి వెంటనే తన వెంట తెచ్చుకున్న ఫారిన్ ఓయిస్ రికార్డర్‌ని ఆన్ చేసి శ్రద్ధగా రికార్డు చేసుకుంది. ఆఖరున వాట్ ద మీనింగ్ ఆఫ్ దట్ సాంగ్ అని నన్ను అడిగినప్పుడు నేను చెప్పాను, అది అందమయిన బాల్యం గూర్చి వర్ణించే పాటని చెప్పాను. ఆమె చాలా హేపీగా ఫీలయింది. అలాగే ఇక్కడ తేగడ హైస్కూల్ మరియు చర్ల రాహుల్ విజ్ఞాన్ స్కూల్ పిల్లలతో ఇంటరాక్టయి ఫ్రాన్స్ దేశంలో విద్యావిధానం గురించి పిల్లలడిగిన ప్రశ్నలకు ఓపిగ్గా ఆమె సమాధానాలు చెప్పింది. ఏ విషయాన్నైనా సులభంగా గ్రహించడం, దానిపై స్పందించడం, ఏదీ అతికాకుండా వుండడం, ఇంటికి చేరిన వెంటనే ఏకాంతంలోకి పోవడం, జరిగినవన్నీ వెంటనే ఆమె ఒక బుక్‌లో నోట్ చేసుకోవడం నచ్చని విషయాలను వెంటనే సున్నితంగా చెప్పడం, మర్యాదగా మెలిగిన ఈ 21 ఏళ్ళ అమ్మాయిలో అరవై ఏళ్ల పరిణతి కనిపించింది.

6-1-2011నే తిరిగి బెంగుళూర్ వెళ్లానుకున్న ఆమె అన్వేష్ వాళ్ల నాన్న చలంగారు ఓ మీటింగ్ పనిమీద కొత్త గూడెం వెళ్లి ఆరోజు ఆయన లేకపోవడంతో ఆయన లేకుండా బయలుదేరడం ఇష్టంలేని ఆమె తన ప్రయాణాన్ని మరుసటి రోజుకి వాయిదా వేసుకుంది.

7-1-2012 శనివారం ఉదయం 7.30 గంటలకు కెరల్, అన్వేష్‌లు తిరిగి బెంగుళూర్ ప్రయాణమయ్యారు. నాకు ఫోన్ రావడంతో వెళ్లాను బస్‌స్టాప్‌కి, నా "సంక్రాంతి" పెయింటింగ్‌తో పాటు చిత్రకారుడు బాపు చిత్రాల పుస్తకం "హరివిల్లు"ను ఆమెకు ప్రెజెంట్ చేశాను. ఆమె ముఖం సంతోషంతో విప్పారింది. ఎంతో ఆనందంతో తెలుగులో "ధన్యవాదములండి" అంది.

అన్వేష్, కెరల్‌లు బస్ ఎక్కుతుండగా మేమంతా సంతోషంగా వీడ్కోలు చెప్పాం. ఓకే బాయ్ అంటూ ఆనందంగా చెబుతూ వుండగా బస్ మూవ్ అయ్యింది. అది నెమ్మదిగా కదులుతూ కాసేపటికి పూర్తిగా అమ్మాయిని మానుండి దూరం చేసింది. మూడురోజులుగా మమ్ముల్నందరిని అలరించి ఆకట్టుకున్న ఆ ఫ్రాన్స్ అమ్మాయి రూపాన్ని అంతా ఒకసారి మననం చేసుకొంటూ నెమ్మదిగా అందరం అక్కడినుండి వెనక్కి తిరిగాం.

వారంరోజుల తర్వాత మరలా ఆమె నుండి ఒక హాట్ మెయిల్. హాయ్ మిష్టర్ వెంటపల్లి ఎలా ఉన్నారని?.

*email: snventapalli@gmail.com*

# 'చిత్ర' మైన జీవితం

Part-11

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...**





email: balisankar@gmail.com

## సంజీవ్‌దేవ్ గారి గురించి...

ఆయన ఆహ్వానం మీదే గుంటూరు జిల్లాలో ఉన్న వారింటికి, తుమ్మపూడి వెళ్లాను. ఇంటిగుమ్మం పక్క 'సరేఖ' అని చెక్కించారు. మంచిపేరు. నిజంగా ఆ ఇల్లు రసరేఖే! అయితే ఆయన బొమ్మలు గొప్పగా ఉండవు. కాని గొప్ప చిత్రకారునికీ తెలియని నిగూఢత ఆయన బొమ్మల్లో, రచనల్లో కనిపిస్తుంది. గొప్ప కళాభిమాని, రేఖలు, రంగులు గురించి ఆయన చెబుతోంటే నోరెళ్ల బెట్టవలసిందే అదొక తాత్వికత. మేధోమథనం. ఇందులో అంతంత లోతులూ, మూలాలూ ఉన్నాయా అనిపిస్తుంది. వీరు నిరంతర అన్వేషి.

ఆ ఇంటి హాల్లో ఆయన కెంతో పరిచయమున్న 'నికోలస్‌రోరిక్ పెయింటింగ్ ఒరిజినల్ ఉంది. పైన నీలాకాశం, పచ్చని కొండల మధ్య మెలికలు తిరుగుతూ ప్రవహిస్తున్న పావనగంగా నది అది. అది అలా చూస్తోంటే మనం మరో శిఖరాగ్రాన్న హాయిగా కూచుని చూస్తున్న అనుభూతిని ఇస్తుంది.


సంజీవ్‌దేవ్

సంజీవ్‌దేవ్ గారి బొమ్మలు (నీటిరంగు చిత్రాలు) విజయవాడ సువార్తవాణి హాల్లో ప్రదర్శనకు పెట్టారు. చూడ్డానికి వెళ్లాను. ఆ కాంపౌండ్‌లోకి అడుగుపెట్టానో లేదో, ఆయన కిటికీలోంచి చూశారు కాబోలు. గబగబా బయటకు వచ్చి నా చేయి పట్టుకొని, నీ బొమ్మలతో నా బొమ్మలు పోల్చవద్దు అన్నారు. అది నిజమే. ఓరాయి–దాని పక్కనో గడ్డిపోచ నీటి చుక్కలు, ఆ పక్కన ఎక్కడో ఎండుటాకు–మరో బొమ్మలో అస్పష్టయిన గీతలు ఆ పక్కనే నీలంగా పూలు ఆ బొమ్మలు –దేనికో నిగూఢమైన సాంకేతాలు. అయితే తమాషా కంపోజిషన్–ఏ ఇజానికీ అందకుండా ఉన్నాయి.. అన్నీ చూశాను. మామూలు వ్యక్తులకు అర్థమవడం కష్టమే!

ఆ తరువాత ఎన్నో సంవత్సరాలకు ఓ మిత్రుడు ఫోన్ చేశారు. సంజీవ్‌దేవ్‌గారింటికి 'రసరేఖ' వెళదామా అని. "కారణం! ఆయన అమెరికాకు వెళ్లి వచ్చారు వచ్చిన రాత్రే దొంగలు పడ్డారని". రెండు రోజుల తరువాత తీరిక చేసుకొని నేనూ ఆ మిత్రుడూ వెళ్లాం. ఆయన అమెరికా ప్రయాణం కన్నా, ఇంటికి చేరుకోగానే దొంగలు పడ్డ విషయం చెప్పి బాగా నవ్వించారు. ఆ దొంగలెవరో కాదు. వాళ్ల ఊరి వాళ్లే!! ఆ వీధిలో పదే పదే తిరుగుతూ వీధి చివరనున్న కోవెల అరుగుమీదకు చేరి చుట్టలు కాలుస్తూ, కేకలు వేసే కుర్రకారే. ఆ రాత్రి ముఖాలు కనపడకుండా ముసుగులు వేసుకొని –మధ్య మధ్య నవ్వుకున్న బాపతే! అంతా సరదా దొంగలు. సరదా దొంగతనం. అయితే వారికి దక్కింది నిజాం బంగారమే!! ఆయనకు కావలసిన చాల పుస్తకాలు అమెరికాలో కొనుక్కున్నారు. కొంతమంది మిత్రులు ఆయనకు గల అభిరుచిని గమనించి కొన్ని పుస్తకాలు బహూకరించారు. ఇవన్నీ రెండు పెట్టెలయ్యాయి. బట్టలు తగ్గించేసి వీటినే

తన వెంట తెచ్చుకున్నారు. హైద్రాబాద్ నుండి కారులో ఇంటికి రావడం, ఇంటి ముందు కార్లో నుండి రెండు పెద్ద బరువైన పెట్టెలు దిగడం, అప్పటికే రాత్రి పన్నెండు గంటలు దాటడం, ఇదంతా ఊళ్లో ఉన్న కొంతమంది పనీ పాటా లేని మూర్ఖులు గమనిస్తున్నారు. వారేం నిర్ణయానికి వచ్చారంటే సంజీవ్‌దేవ్‌గారు అమెరికా నుండి ఆ రెండు పెట్టెల నిండా బోల్డు డబ్బు మోసుకొచ్చారని. అందుచేత ఈ రాత్రే ఆయన బుర్ర బద్దలు కొట్టి ఆ డబ్బులు ఎత్తుకెళ్లాలని ఆలోచనకు వచ్చారు. ఆ ఆలోచనను ఆచరణలోకి పెడదామని కర్రలు పట్టుకొని ముఖాలకు ముసుగులు కట్టి ఆ ఇంటి ప్రహరీ గోడదూకి అరటిచెట్ల పక్క వరుసగా నిలబడి ఉన్నారు. ఖర్మకొద్దీ ఆయనకు నిద్రరాక భార్యతో ఆ విషయమూ, ఈ విషయమూ మాట్లాడి, బాత్‌రూంకి వెళదామని ఆయనే బయటకు వచ్చారు. అయితే ఇందులో కొంతమంది కొత్తదొంగలున్నారు. వాళ్లకి నవ్వు వస్తోంది. ఎలా ఎటాక్ చెయ్యాలో వారికి తెలియడంలేదు, అందుకే ఆ నవ్వు. ఆయన వేసిన లైటు వెలుగులో వరుసగా అరటి చెట్ల మధ్య వీరుల్లా వీరుండడం, కిచకిచమనటం ఆయన గమనించి ఎవరు మీరని అడిగారట. మేం దొంగలం అని ఎలా చెప్తారు?

అందులోని సీనియర్‌గాడు కొంచెం ముందు కొచ్చి “మీరిందాక అమెరికా నుండి వచ్చారు కదా! రెండు పెట్టెల నిండా బోల్డు డబ్బుమోసుకొచ్చారని తెలిసి” ఆ గొంతు ఆయనకు పరిచయమైనదే ఆయన నవ్వి “డబ్బుమోసుకొచ్చానని ఎవరన్నారు! అవన్నీ పుస్తకాలు, ఆ తలుపు పక్కనే ఉన్నాయి-పోయి ఇపుడైనా చూడండి లేకపోతే రేపు పొద్దుటయినా చూడండి అన్నారు. వాళ్లు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. కొంతమందికి నవ్వాగడంలేదు. తరువాతేం అడగాలో వాళ్లకీ తెలియడం లేదు. ఏమని చెప్పాలో ఈయనకూ తెలియడం లేదు.

ఇదేమిటీ బాత్‌రూంకి పోయి వస్తానన్నారే! ఏవో మాటలు వినిపిస్తున్నాయేమిటి అని ఆయన శ్రీమతి బయటకు వస్తే దొంగలు ముఖాన్న గుడ్డలు కట్టుకొని వరుసగా నిలబడి ఉన్నారు. ఆ ముసుగులు చలికి కట్టుకున్నారేమోనను కున్నారావిడ “వీళ్లెవరు? రేప్పొద్దుట పలకరించవచ్చు కదా!” అందట.

కాదు అని ఆయన విషయమంతా ఆమెకు చెప్పి, వీరంతా పేదవారు, తెచ్చిన పుస్తకాలని చెప్పగానే డిసప్పాయిమెంట్ అయి ఉన్నారు. నీ మెడలోని గొలుసు వాళ్లకిచ్చేయ్, అది అమ్మి అందరూ డబ్బు పంచుకుంటారు అన్నారాయన.

“ఇది మరీ బాగుంది” అని అమె కేకలు వేసింది. లేదు ఇచ్చేయ్! చెప్పాను కదా! వాళ్లు వరి· చేతుల్తో వెళ్లడం మంచిది కాదు. అని ఆయన ఆమె మెడలోని గొలుసు వారికిచ్చేసి ఇక ఇళ్లకు వెళ్లండి. నిద్రలేకుండా ఏమిటీ అర్ధరాత్రి తిరుగుళ్లు అని మరో మారు హెచ్చరించారు.

ఆ గొలుసు తీసుకొని వారు గోడదూకి నవ్వుకొంటూ పోతోంటే ఆమె లబోదిబోమంటూంటే... ఆయన బాత్‌రూంకి వెళ్లి తిరిగివస్తూ “పద లోపలికి పోదాం” అన్నారు.

తరువాత రోజు బంధువులకీవిషయం తెలిసి పోలీస్ రిపోర్ట్ ఇచ్చారు. ఆ తరువాత ఏమయ్యిందో తెలీదు. ఆ పుస్తకాలు ఆయన చూపించారు. గొప్ప పుస్తకాలు ఎక్కువ ఆర్ట్ గురించీ, తత్త్వం గురించీ ఉన్నాయి

మరో విషయం గుర్తొస్తోంది.

1960 ప్రాంతాల్లో ఆంధ్రప్రభ వారపత్రికవారు, ఆ పత్రికలో చక్కని శీర్షికను నడిపారు. మరుగున పడుతున్న మన ప్రాచీన కళల మీద రెండు పేజీలతో బొమ్మలూ, ఫొటోలతో కూడిన ఫీచర్ అది. వారపత్రికలలో నా బొమ్మలు చూసి, నా మిత్రుడుయిన వ్యక్తి ఈయన. పేరు యర్రబోలు ప్రసన్న రావ్. తండ్రి డిప్యూటీ తహశిల్దార్. ఎవరి ద్వారానో మా ఇంటి చిరునామా తెలుసుకొని మా ఇంటికి వచ్చాడు. బొమ్మలు వేయగలడు. కానీ పెద్దగా ప్రాక్టీస్ లేదు. ఆర్టిస్ట్‌ల గురించి ఏమన్నా వ్యాసాలు ఇంగ్లీష్‌లో వస్తే ఆ పుస్తకాలు కొని తెచ్చి ఇచ్చేవాడు నాకు. అతనికి డిగ్రీ అయిపోయింది. అయితే నామీద విపరీతమైన అభిమానం ఏర్పరుచుకొని నన్నెలాగైనా ‘శాంతినికేతన్’ లాంటి ప్రదేశాలకు పంపి గొప్ప ఆర్టిస్ట్‌ని చేయాలన్న తపన ఆయనలో ఉండేది. నాకు తెలియకుండానే ప్రాస్పెక్టస్ తెప్పించాడు. మా ఇంట్లో వారికి ఇష్టంలేదు. నాకూ ఇష్టంలేదని చెప్పాను. అయితే మేమిద్దరం ఆంధ్రప్రభకు రెండు, మూడు వ్యాసాలు తయారుచేశాం. బొమ్మలు నేను వేశాను. అనకాపల్లి స్టేషన్‌కు దగ్గర్లో ఉన్న బొజ్జన్న కొండ (బుద్ధన్నకొండ) చారిత్రక వివరాలు, శిధిలమవుతున్న శిల్పాలు గురించీ, ఏటికొప్పాక లక్క పిడతలు గురించీ, నక్కపల్లిలో కలిసి ఉన్న ఉపమాకకొండ, వెంకటేశ్వరస్వామీ, తీర్థంకరల గురించీ, పంచదార్ల అనే సహజనీటిధార్ల గల తూర్పు చాళుక్యులతో నిర్మింపబడిన ధర్మలింగ స్వామి ఆలయం, స్థలపురాణం, శిల్పవైభవం చెక్కిన శాసనాల గురించీ, ఇలా వ్యాసాలూ, స్కెచ్‌లు గీసి పంపాం. వాటన్నింటినీ ప్రచురించి మంచిపారితోషికమే పంపారు.

దీనితో మిగిలిన మిత్రుల మధ్య మాకు మంచి గుర్తింపే వచ్చింది. డిగ్రీపూర్తిచేసిన ప్రసన్నరావు బి.ఇడి ట్రయినింగ్ చేద్దామని అప్లయి చేస్తే విజయనగరంలో సీటు వచ్చింది. వెళ్లిపోయాడు. అక్కడ్నుంచే ఉత్తరాలు రాసేవాడు. వాటిలోనూ నేను ఇంకా ఆర్ట్‌లో డెవలప్ చేసుకొనే సూచనలే! అవకాశాలే!!. విజయనగరంలో ప్రఖ్యాత సంప్రదాయ చిత్రకారులు అంట్యాకుల పైడిరాజులు గారి స్టూడియోకి వెళ్లానని అక్కడ నువ్వు చేరితే సంప్రదాయక చిత్రకళ ఏమిటో నీకు అర్థమవుతుందనీ, ఏదన్నా చిన్న రూం తీసుకున్నా... భోజనం ఖర్చులు ఉండవనీ, ఎందువల్లనంటే రాజావారి కిందాలో బీదవిద్యార్థులకు ఉచితంగా భోజనాలు పెడతారనీ... అవన్నీ తెలుసుకున్నాననీ రాసేవాడు.

ఈ చిత్రకళలో కొత్త కొత్త విషయాలూ, సంప్రదాయాలూ తెలుసుకోవడంలో నాకూ సరదాయే గానీ, పొరుగూరిలో నన్ను ఆర్ట్ నేర్పించే అంత ఆర్థిక స్తోమత మా ఇంట్లోవారికి ఏదేదో చెప్పాడు. మరో ప్రయత్నించేద్దామని పత్రికల్లో వచ్చిన నా బొమ్మలన్నీ కత్తిరించి ఓ ఫైలు తయారు చేశాడు.

ఆ రోజుల్లో అనకాపల్లిలో కోరుకొండ సుబ్బరాజు గారనే డాక్టర్‌గారుండేవారు. ఆయన వైశ్యులూ, ప్రముఖులు, వారికో వితరణ సంఘముంది. బీదవిద్యార్థులను ఆర్థికంగా ఆదుకుంటారు. ప్రసన్నరావు ఆ ఫైలు తీసుకొని, నన్ను వెంట బెట్టుకొని ఆయన దగ్గరకు తీసుకెళ్లాడు. ఆయనకు నా బొమ్మల ఫైలు చూపించి, “ఈ బొమ్మలన్నీ ఈ కుర్రవాడు వేసినవనీ, విజయనగరంలో ఉన్న ఫైన్‌ఆర్ట్స్ ప్రిన్సిపాల్ శ్రీపైడిరాజు గారి దగ్గర ట్రయినింగ్ అయితే ఇంకా ఫైన్ అవుతాడనీ, అది రెండున్నర సంవత్సరాల కోర్సనీ, ముందుగా ఓ సంవత్సరానికి కొద్దిపాటి ఆర్థికసాయం మీరు చేస్తారని ఆశ” అన్నాడు.

ఆయన ఆ బొమ్మలన్నీ చూసి పెదవి విరిచేశారు. “మీరు రెండు నెలలు ముందు రావలసింది. మాకో కమిటీ ఉంది మేం కొంత బడ్జెట్ కేటాయించి వారి ముందు పెడతాం. ఎకడమిక్ ఇయర్ ముందు ఇవన్నీ జరుగుతాయి. ఆ డబ్బు వారందరికీ సర్దుతాం. ఇక ఈ సంవత్సరం ఏమీ లేనట్టే. వచ్చే సంవత్సరం ఆలోచిస్తాం. అప్పుడు రండి” అన్నారు. చేసేది లేక ఇద్దరం ఆ ఇంటిమెట్లు దిగాం. అయినా ప్రసన్నరావులో ఆశ చావలేదు.

*అంట్యాకుల పైడిరాజు, చిత్రకళాశాల గురించి...*



...రంటం                చిత్రకారుడు : అంట్యాకుల పైడిరాజు

## ఆశక్తికరంగా ఉంది.

బాలిగారి జీవిత చిత్రం ధారావాహిక చదువుతున్నాను. చాలా బాగుంది. వారు చూచిన ప్రపంచం తన దృక్కోణం నుండి వారు చాలా ఆసక్తికరంగా చిత్రిస్తున్నారు.

నిజానికి మొన్నటి వరకూ మీ పత్రిక గురించి నాకు తెలియనే తెలియదు. మాలిక బ్లాగ్ అగ్రిగేటర్ ద్వారా నా దృష్టికి రావటంతో, పత్రికలో బాలిగారి కథనం చూడటం జరిగింది. తొలిభాగం యెక్కడా అని అంచనావేసి పట్టుకుని మొత్తం ప్రస్తుత సంచిక వరకూ అన్ని భాగాలూ యేకబిగిని చదివాను. వారి కథనం చదివించింది అనుకోవటం మరింత సబబేమో.

రాబోయే భాగాల గురించి యెదురు చూస్తున్నాను. సమయాభావం వలన మీ పత్రిక పాత యెడిషన్లు ఇంకా పూర్తిగా పరిశీలించలేదు. వీలువెంబడి అన్నీ చదవాలని ప్రయత్నిస్తున్నాను. మంచి మంచి సంగతులు చాలా కనిపించాయి. కొన్ని చదివాను కూడా. మంచి పత్రికను అందిస్తున్న మీ కృషికి అభినందనలు.

మీ పత్రిక యిలాగే దిగ్విజయంగా నడుస్తూ ఉండాలని ఆశిస్తున్నాను.

భవదీయుడు,

**తాడిగడప శ్యామలరావు**

- పద్మకళ

సకళ కళల సమ్మేళనం

# బాలానందం

బాలల కళావేదిక





## బాలానందం ద్వితీయ వార్షికోత్సవం సందర్భంగా ప్రత్యేక వ్యాసం

సాహితికి నాట్యమంటే ప్రాణం, ఆ అమ్మాయి ఆసక్తి చూసి ఆమెను మంచి నృత్యకారిణిగా మలచాలని తల్లిదండ్రులిద్దరూ నిర్ణయించుకున్నారు. వివిధ నృత్య ప్రదర్శనలు చూసీ చూసీ ఓ రోజు సాహితికి తనూ అలా ప్రదర్శన ఇవ్వాలన్న కోరిక కలిగింది. అదే మాట తండ్రితో అంది. దీంతో ఆయన పలువురి వద్దకు వెళ్లి తన చిన్నారి ప్రదర్శనకు సహకరించమని కోరినా ఫలితం లేకపోయింది. విజయవాడ 'బాలానందం' సంస్థ ఇలాంటి ఔత్సాహిక బాలలకు ప్రదర్శన అవకాశాలు కల్పిస్తోందని తెలుసుకుని వారిని సంప్రదించారు. అలా సాహితి ప్రదర్శన ఏర్పాటైంది. ఆమె కోరిక తీరింది. అనంతరం ప్రదర్శనలు ఒకదాని వెంట మరొకటి పోటీ పడుతూ వచ్చాయి. సాహితి లాంటి చిన్నారులెందరో మన చుట్టూ ఉన్నారు. వారిలో దాగి ఉన్న ప్రతిభను గుర్తించే వారు, వెన్నుతట్టి ప్రోత్సహించే వారు అరుదు. అలాంటి ప్రతిభావంతులకు దన్నుగా నిలుస్తోంది బాలానందం.

**స్ఫూర్తి–** నలభై ఏళ్ల క్రితం తమిళనాడు నుంచి వలస వచ్చిన సినిమా నృత్య దర్శకుడు పరమానందం పిళ్ళై వివిధ నృత్యరీతుల్లో పేరు గడించారు. ఆయన కుమారుడు హేమంత్‌కుమార్, శిష్యురాలు, కోడలు కూడా అయిన పద్మశ్రీ ఇద్దరూ నాట్యకారులే. వీరిద్దరూ కుటుంబ వారసత్వాన్ని అందిపుచ్చుకుని అసంఖ్యాకంగా ప్రదర్శనలిచ్చారు. వర్ధమాన కళాకారులను ప్రోత్సహించేందుకు బాలానందం పేరుతో ఒక సంస్థను నెలకొల్పారు. చిన్నతనంలో తన నాట్య ప్రదర్శనకు అవకాశం కోసం తన తల్లి పడిన ప్రయాసలే 'బాలానందం' స్థాపించడానికి స్ఫూర్తి నిచ్చాయంటారు హేమంత్.









## అతిథులూ సామాన్యులు కాదు...

పిల్లల ప్రదర్శనలకు అతిథులుగా వచ్చే వారికి కూడా కొన్ని ప్రత్యేక నింబంధనలుంటాయి. సాహిత్య, కళా రంగాలకు చెందిన ఇద్దరుప్రముఖులను నెలనెలా ఆహ్వానిస్తారు, వారు కార్యక్రమం మొదటి నుంచి చివరి వరకు ఉండాలి. అన్ని కార్యక్రమాలు అయిన తరువాత అభ్యర్థులకు స్ఫూర్తిదాయకమైన సందేశం ఇవ్వాలి. అభ్యర్థులందరికి జ్ఞాపికలు అందజేయాలి. చివర్లో అందరూ కలిసి వేదిక పైకి చేరి జనగణమన పాడాలి. ఈ విధానం వల్ల పిల్లలకి చిన్ననాటి నుంచే ఇతరుల కార్యక్రమాలు చూసి తమలో తాము విశ్లేషించుకునే అలవాటు ఏర్పడుతుంది. ఎటువంటి భేదాలు లేకుండా పిల్లలను తమ తమ విద్యలను ప్రదర్శించుకునే అవకాశం లభిస్తుందని నిర్వాహకుల ఉద్దేశం.



అతిథిగా విచ్చేసిన శ్రీమతి యార్లగడ్డ శైలజను సత్కరిస్తున్న పద్మశ్రీ, హేమంత్‌లు

## చేయీ చేయీ కలిపి....

హేమంత్ దంపతుల సదాశయానికి తగు రీతిలో స్పందించిన లయోలా కళాశాలలోని 'కళాదర్శిని' విభాగం ప్రతి నెలా కార్యక్రమాల నిర్వహణ కోసం వేదిక, దీపాలంకరణ తదితర సదుపాయాలను ఉచితంగా సమకూర్చుతోంది. ముఖ్యంగా కళాదర్శిని ప్రిన్సిపాల్ ఫాదర్ రవిశంకర్ తో పాటు ఎన్.ఎస్.ఆర్.మూర్తి, అమ్మ ఆర్ట్స్ రాజు, యధునాదకుమార్ లాంటి వారు ఎంతో మంది సహకారం అందిస్తున్నారని హేమంత్ దంపతులు చెప్పారు. ప్రతినెలా నాలుగో ఆదివారం సాయంత్రం 6 గంటల నుంచి 9 గంటల మధ్య బాలానందం వేదిక బాలల సందడితో నిండిపోతుంది. సుమారు 50 మంది వరకు చిన్నారులు ఈ వేదికపై తమ ప్రతిభా పాటవాలను ప్రదర్శించి అందరి మన్ననలూ పొందుతారు.

బాలానందం ప్రదర్శనలతో చిన్నారుల్లో ఆత్మ విశ్వాసం పెరుగుతోందన్నది తల్లితండ్రుల మాట. జానపదం, భరతనాట్యం, కూచిపూడినాట్యం, ఆంధ్రనాట్యం, శాస్త్రీయ, లలిత సంగీతాలు, దేశభక్తి గీతాలు, మోనోయాక్షన్,మృదంగం, తబలా, వీణ, వయోలిన్, ఫ్లూట్, హార్మోనియం, కీబోర్డ్, గిటార్ వంటి వాయిద్యాలు, చిత్రలేఖనం వంటి సృజనాత్మక కలల్లో చిన్నారులు తమ ప్రతిభను పదిమంది ముందూ ప్రదర్శించవచ్చు. పిల్లలకు చదువు ఎంత ముఖ్యమో...ఆటలు, కళలు కూడా అంతే ముఖ్యం. కళాభ్యాసం వల్ల ఏకాగ్రత, జ్ఞాపకశక్తి పెరెగుతుంది.





అతిథులుగా విచ్చేసిన మిమిక్రీ స్టార్ సిల్విస్టర్‌ను నాట్యాచార్య భాగవతుల వెంకట్రామశర్మను సత్కరిస్తున్న దాస్, పాథర్ రవిశంకర్,హజరత్తయ్య గుప్త తదితరులు


బాలానందం స్థాపకులు పద్మశ్రీ, హేమంత్‌లు


చిత్రకళాప్రదర్శన

## బాలానందంకు రెండేళ్ళు

తన కళను పదిమంది ముందూ ప్రదర్శించకపోతే... ప్రేక్షకులంతా చప్పట్లు కొట్టకపోతే... కళాకారుడిని ఆకర్షణ శక్తి అంటే ఏమిటో తెలియదు. తన లోపాలూ తెలియవు. మా చిన్నప్పుడు స్టేజీ దొరకడం ఎంతో కష్టంగా ఉండేది. ప్రేక్షకులు చప్పట్లు కొడితే మా బలం కొండంతయ్యేది. కళల్లో ప్రవేశమున్న వారందరినీ ప్రోత్సహించి పరిపూర్ణ కళాకారులుగా మలచడమే బాలానందం లక్ష్యంగా 2010 సం॥ లో స్థాపించామని, ద్వితీయ వార్షికోత్సవం జరుపుకోవడం మరింత ఉత్సాహాన్నిచ్చిందని, రానున్న కాలంలో నగరానికే పరిమితమైన ఈ నెలవారీ కార్యక్రమాలను రాష్ట్ర వ్యాప్తం చేయాలని సంకల్పించుకున్నాం. గత రెండేళ్ళ కాలంలో సుమారు 500 మంది పిల్లలకు వేదికపై అవకాశం ఇవ్వగలగటం నిజంగా మా అదృష్టంగా భావిస్తున్నాం అంటున్నారు పద్మశ్రీ, హేమంత్‌లు.

### ఈ ప్రోత్సాహం అభినందనీయం

*-ఫాదర్ రవిశంకర్,* ప్రిన్సిపల్, కళాదర్శిని



విజయవాడలో చాలా సాంస్కృతిక సంస్థలున్నా, ప్రత్యేకించి బాలల కోసం ఏ సంస్థా లేదు. ఈ ఆలోచనలతో వారు మమ్మల్ని సంప్రదించగానే వేం ప్రోత్సహించాం. హేమంత్ దంపతులు నాట్యాచార్యులైనా వారు ఇతర కళాకారులను ప్రోత్సహించటం గొప్ప విషయం. ఇటువంటి కార్యక్రమాల నిర్వహించటం వ్యయప్రయాసలతో కూడుకున్నది. భవిష్యత్తులో 'బాలానందం' మరింత శక్తిదాయకంగా రూపుదిద్దుకోవాలని ఆకాంక్షిస్తున్నాం.



# స్వాతంత్ర్య బీజాలు-
# అమీర్‌జాన్ చిత్రాలు




అతనో కమర్షియల్ ఆర్టిస్ట్. కళనే నమ్ముకున్న తను కళతోనే ఏదైనా సాధించాలనుకున్నాడు. 63మంది భారత స్వాతంత్ర్య సమరయోధుల చిత్రాలను 7 గంటల వ్యవధిలో చింతగింజలపై వేయాలన్న లక్ష్యంతో ది. 21 జనవరి 2012న నెల్లూరు టౌన్‌హాల్‌లో పలువురు ప్రముఖుల, ప్రభుత్వాధికారుల సమక్షంలో కార్యరంగంలోకి దిగాడు. అతనే షేక్ అమీర్‌జాన్. సెంటీమీటరు సైజులో ఉండే చింతగింజలపై గాంధీ, నెహ్రూ, బోస్, అంబేద్కర్, పటేల్, లాల్‌బహుదూర్‌శాస్త్రి, అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్... ఇలా తన కుంచెతో రంగుల చిత్రాలను వేసుకుంటూ వెళుతున్నాడు. ప్రేక్షకులు ఉత్కంఠతో చూస్తున్నారు. నిర్దిష్ట సమయం కంటే 48 నిమిషాలు ముందుగానే 63 మంది జాతీయ నాయకుల చిత్రాలను చిత్రించి, “ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్”లో స్థానం సంపాదించాడు. ప్రత్యేక ఆహ్వానితులుగా వచ్చిన చింతపట్ల వెంకటాచారి ‘ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్’ ధృవీకరణ పత్రాన్ని అందజేసారు. ఆహుతులైన ప్రేక్షకులు, అతిథులు అమీర్‌ను అభినందనలతో ముంచెత్తారు.

అంతేకాదు ఇదే అంశాన్ని గిన్నీస్ బుక్ ఆఫ్ రికార్డ్స్, లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్, గ్లోబల్ వరల్డ్ రికార్డ్ సంస్థలకు నామినేట్ చేసారు కూడా.

నెల్లూరుకు చెందిన అమీర్ మైసూర్ డి.ఎమ్.ఎస్.కాలేజి నుంచి పెయింటింగ్‌లో బి.ఎఫ్.ఏ. చేసారు. 2006లో నెల్లూరు తంజావూరు చిత్రకారిణి అన్నపూర్ణగారి ఆధ్వర్యంలో కోమల ఆర్ట్‌గ్యాలరీని స్థాపించి ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. 2000 సం॥లో వందరూపాయల నోటును చిత్రించి అప్పటి కలెక్టర్ వై.శ్రీలక్ష్మి ప్రశంసలందుకున్నారు. మీరూ అభినందించాలనుకుంటే అమీర్‌నంబరు 9440824913 కు రింగ్ చేయండి.




ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్ అందుకుంటూ...



అమీర్ జాన్ చింతగింజలపై చిత్రించిన చిత్రాలు






అమీర్‌జాన్ చిత్రించిన వంద రూపాయల నోట్



ప్రముఖ నిర్మాత దిల్‌రాజు నుండి అభినందనలు అందుకుంటూ..






కళాప్రపంచం

# ధీరోదాత్త చిత్రకారిణి-జార్జియా ఓ'కాఫే

తన చిత్రాలలో అంత: సౌందర్యాన్నీ, అంత:రూపాన్నీ తనదైన శైలిలో ఆవిష్కరించిన చిత్రకారిణి, ఎముకలు, అస్థిపంజరాలను అందమైన చిత్రాలుగా మలుస్తుంది. ఈమె చిత్రాలు దూరం నుండి చూసినపుడు పాలపొంగువలే ఉంటాయి. వాటికి గల పేరు చూసి ఎముకలు, అస్థిపంజరాలు ఇంత అందంగా గీయవచ్చా? అని ఆశ్చర్యపోతాం. సాధారణంగా ఇవి భయానికి, ప్రమాదానికి, చిహ్నాలు, వాటిలోనున్న అందాన్ని ఆవిష్కరిస్తారు. "జార్జియా ఓ కాఫే". భౌతిక విషయాల పట్ల ప్రత్యేక అభిమానాన్ని చూపి, తన చిత్రాలను ఆవిష్కరిస్తారు.



**ఎల్.ఆర్. వెంకటరమణ**

ఓ కాఫే ఒక్కొక్క కాలంలో, ఒక్కొక్క అంశంపై చిత్రాలను గీచింది. పుష్పాలు చిత్రకళా వస్తువులయ్యాయి. ఎడారి అంశంతో కొండలు, గుట్టలు, ఇసుక తిన్నెలు చిత్రించారు. అనంతరం ఎత్తయిన భవనాలు, అస్థిపంజరాలు చిత్రాంశాలు అయ్యాయి. ఈ వస్తువులకు, ఆమె వ్యక్తిగత జీవిత విషయాలకు పోలికలతో చిత్రాలు చిత్రించబడ్డాయి. తన జీవితంలో, తనకు కలిగిన కష్టనష్టాలు, సుఖసంతోషాలకు ఈ చిత్రాలు అద్దం పడతాయి. తనలోని వేదన, ఆవేదన అన్నీ కూడా బహిర్గతమవడానికి చిత్రకళామధ్యమం ఒక వేదిక అయింది. మరో విధంగా గమనిస్తే తన ఉద్వేగాలు అణచుకోవడానికి చిత్రకళ అన్నది ఒక స్వాంతన చేకూర్చిందని చెప్పవచ్చు.

ఓ కాఫే దాదాపు తన వంద సంవత్సరాల సుదీర్ఘ జీవిత కాలంలో స్త్రీవాదిగా, స్వాతంత్ర్య పిపాసిగా, తనను తాను మలచుకున్న స్వేచ్ఛా విహంగం జార్జియా ఓకాఫే. తన జీవితంలో ఎదురైన ఒడుదుడుగుల నెరవని ధీశాలి. సంతోష, దు:ఖ సన్నివేశాలకు చలించని స్థితప్రజ్ఞురాలు.

జార్జియా ఓ 'కాపే 15, నవబర్ 1857లో అమెరికాలోని నిస్కాన్సిన్‌లో ఒక వ్యవసాయ కుటుంబంలో జన్మించారు. మొత్తం ఏడుగురున్న సంతానంలో ఈమె రెండవ వ్యక్తి, లలిత కళలపై తల్లికి గల మక్కువ ఓ కాఫే చిన్ననాటే బ్రష్ పట్టింది. సాధారణ చదువుతో పాటు, ఏదేని ఒక కలను విధిగా పిల్లలకు నేర్పాలన్న ది ఆ తల్లి ఆరాటం. అలా ఓ కాఫే చిత్రకళను ఆశ్రయించింది.

చిన్ననాటి నుండే చిత్రకళపై గల ఆసక్తితో ఈ రంగంలో



మరింత సాధనకు చికాగో పయనమైంది. అక్కడి కళాశాలలో జాన్ వెండర్‌పూల్ ఆమె ఉపాధ్యాయుడు. చిత్రకళపట్ల ఆసక్తిని మరింత రాజేశారు. ఆకారాలు, రూపాల గురించి ఓ కాఫే మస్తిష్కంలోకి ఎక్కించగలిగాడు. ఈ విషయాలు ఆమె జీవిత చరమాంక వరకూ ఆమెతోనే, ఆమెలోనే ఆమె మనస్సులోనే నిలుపుకోగలిగింది. నాటి ప్రాథమిక అవగాహన. ఆమె చిత్రాలన్నిటా ప్రస్ఫుటమయ్యాయి. చిత్రానికి గల ప్రాథమిక సూత్రాలు, రంగు, రూపాలు, ఆకారాలు, వాటిని ఎలా ఒక రూపంలోకి తేవాలన్న విషయాలు ఇక్కడే నేర్చుకుంది.

చికాగో అభ్యసనం తరువాత మరింత సాధనకోసం న్యూయార్క్ పయనమైంది. అక్కడ విలియం మెర్రీట్‌ఛేస్ ఆమె గురువు. చిత్రకళను ఉన్నతంగా మలచిన కళాశిల్పి అతను. రంగుల సాంద్రత ఎలా వాడాలో ఇక్కడ నేర్చుకుంది. ఇక్కడే జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాల పట్ల చలించనట్టి మనస్తత్వాన్ని



స్వంతం చేసుకుంది. ట్యూబర్క్యులోసిస్‌తో తల్లి పడుతున్న బాధలు తట్టుకోలేక, చిత్రకళను కొంతకాలం వదిలి ఉద్యోగ వేటలో పడింది. తల్లి అనారోగ్యం, ఉద్యోగ భద్రతలేని తండ్రి ఉద్యోగం పలితం ఓ కాఫీ కూడా సంపాదించవలసి వచ్చింది. ఒక ప్రకటనా సంస్థలో పనికి కుదిరింది.

ఆర్థిక ఇబ్బందులు కొంతవరకు అధిగమించగానే మరలా చిత్రకళాభ్యాసాన్ని కొనసాగించింది. 1912లో వర్జీనియా ఆర్ట్ స్కూలులో చేరింది. అక్కడ ఆర్థర్ వెస్లీడా వద్ద చిత్రకళాభ్యాసం చేసింది. అందవిహీనంగా అగుపడే వస్తువులో కూడా అందం ఏదో ఒక మూల దాగుంటుంది. దాన్ని ఎలా పట్టుకోవాలో అతని వద్ద నేర్చుకుంది. భౌతిక అంశాలలో, అంతర్గతాంశాన్నీ చిత్రం ప్రతిఫలించాలని అతను నూరిపోశాడు. ఇక్కడే ప్రసిద్ధ రష్యన్ చిత్రకారుడు వసాలే కాందిన్‌స్కీ చిత్రాలు పరిచయమయ్యాయి. కాందిన్‌స్కీ ప్రకారం-"చిత్రాలలో భౌతిక విషయాలు బయటకు కనిపించినా, వాటిలో అంతర్గత ఆత్మలుంటాయి. వాటిని ఆవిష్కరించడమే చిత్రకారుని పని" అన్నది అతని సిద్ధాంతం. ఈ విషయాన్ని ఓ కాఫే తన నరనరాల్లోనూ నింపుకుంది.

1915 నుండి తనకంటూ ఒక ప్రత్యేకశైలి ఉండాలని తపించింది. దీంతో చార్‌కోల్ చిత్రాలు గీచింది. చార్‌కోల్‌తో పాటు నీలిరంగు వాడింది. నిరంతర గమనానికి ప్రతీకగా నీలం ఎంచుకుంది. ఆకాశం, సముద్రం వంటి విశాల దృశ్యాలతో నీలంరంగులోనే ఉంటాయి. తనశైలి కూడా అంతటి విస్తృతమైనదని ఆమె భావించింది. ఈ చిత్రాలు న్యూయార్క్ ఫొటోగ్రాఫర్ ఆల్ఫ్రెడ్ స్టెయిజ్‌లిస్ట్‌ను ఆకర్షించాయి. వీరి మధ్య పరిచయాలు, ప్రేమకు దారి తీశాయి. 1924లో కళాసాక్షిగా ఒకటయ్యాయి. ఓ'కాఫే జీవితానికి, ఆ కళాజీవితానికి వెన్నటి నిలిచాడు. ఓ కాఫే కన్నా ఆల్ఫ్రెడ్ దాదాపు పాతిక సంవత్సరాలు పెద్దవాడు.

ఓ కాఫేకు తన పట్ల తనకున్న నమ్మకం, తను నమ్మిన సిద్ధాంతాల వలన ఆల్ఫ్రెడ్‌ను పెళ్లి చేసుకోలేదు. కలిసి జీవితాన్ని పంచుకుంది. వెడ్డింగ్‌రింగ్ కూడా మార్చుకోలేదు. మిసెస్ ఆల్ఫ్రెడ్ అని కూడా పిలిపించుకోవడానికి ఇష్టపడలేదు. ఆమె స్వేచ్ఛా పిపాసి. ఇదే విషయం ఆల్ఫ్రెడ్‌కు నచ్చింది. ఒక మిత్రునిగా, సన్నిహితునిగా తన పాత్ర నిర్వహించాడు. పాలరంగు తెలుపు దుస్తులంటే ఓ కాఫేకు ఎంతో ఇష్టం. ఆమె తెల్లని దుస్తులలో ఉండగా వేల సంఖ్యలో ఫొటోలు తీసాడు.





వీరి సాన్నిహిత్యాన్ని ఓర్వలేనివారు–ఆమె అందాలు ఫొటోలు తీసి సొమ్ముచేసుకుంటున్నాడని అదేవిధంగా ఓకాఫే చిత్రిస్తున్న పుష్పాలు స్త్రీ మర్మావయావాలు పోలి అసహ్యాన్ని కలిగిస్తున్నాయని ప్రచారం చేశారు. దీంతో విసుగుచెందిన ఓ కాపే కొంత కాలం కాంక్రీటు భవనాలనే చిత్రించేది.

ఆల్ఫ్రెడ్ మరణం ఓ కాఫేను కొంతకాలం కుంగతీసింది. ఒక సంవత్సరం ఇంటివద్దనే ఉండిపోయింది. తన అంతర్మధనాన్ని పింక్‌కొండలు, ఫైన్‌చెట్లు తెల్లని పర్వతాలు, నల్లని రహదారులను చిత్రించింది. ఆల్ఫ్రెడ్ మరణం తరువాత ఒంటరిగానే నలభై సంవత్సరాలు జీవించగలిగిన ధీరోదాత్త ఓకాఫే.

ఆల్ఫ్రెడ్ మరణం తరువాత ఆమెలో ఎన్నో మార్పులు వచ్చాయి. లోపల అగ్నిపర్వతాలు బ్రద్ధలవుతున్నా ప్రశాంతతో జీవించగలిగింది. న్యూమెక్సికోలో అబెక్యూలో ఒక భవనం నిర్మించుకుంది. అక్కడే పళ్లు , కూరగాయల తోటను పెంచుకుంది. ఈ భవనంలోనే చివరి వరకూ ఉండిపోయింది. ఇంటిపై కప్పుపై ఈజిల్ పెట్టుకొని చిత్రాలు గీచేది. 1986లో తన 98వ ఏట మరణించింది. కొద్ది రోజుల ముందు వరకూ చిత్రకళారాధన చేయగలిగింది.

ఆమె చిత్రాలు తెలిపే కొన్ని విషయాలు చిత్రాన్ని చూసినపుడు ఒక భావన ఉంటుంది. దానికున్న పేరు చూడగానే మన భావన మారిపోతుంది. Yellow colour-green leaves భార్యాభర్తల సంకేతం . Peach and glavs అన్నది భార్యాభర్తల అనుబంధానికి చిహ్నం. Cow's skull అన్న చిత్రంలో ఆవు తలభాగం, పుర్రె రెండు ఒకే సారి కనిపిస్తాయి. Plevis with pedeval అన్న చిత్రం పాలపొంగులా ఉంటుంది. కాని అదొక ఎముకా? అని ఆశ్చర్యపోతాం.

జార్జియా ఓ 'కాఫే తనదైన శైలిలో, తనదైన జీవితాన్ని గడిపింది. " I Will do as I please" అన్నది ఆమె నమ్మిన సిద్ధాంతం.

*email: venkataramana_lanka@yahoo.com*

# గోదావరి తీరాన వికసించిన కళాపద్మం - లక్ష్మి

- వెంటపల్లి సత్యనారాయణ



"పద్మం సరస్సులో వికసించడం సహజం అదే పద్మం ప్రవహించే గోదావరిలో వికసిస్తే అసహజం"

నిశ్చలమైన సరస్సులో విరబూసే పద్మాలకు ప్రత్యేకత లేకపోవచ్చు. గానీ ప్రవహించే గోదావరికి ఎదురొడ్డి వికసించిన పద్మానికి తప్పక ప్రత్యేకత వుంటుంది. కారణం ఆ ప్రవాహం మామూలు గోదావరి కాదు. కూర్ల్రే, దామెర్ల, వరదా వెంకటరత్నం, భగీరథి, రాజాజీలతో పాటు సత్యవాణి, బుచ్చికృష్ణమ్మ లాంటి కళా కెరటాలతో ఉవ్వెత్తున ఎగిసిపడిన గోదావరి. అలాంటి ఉత్తుంగ తరంగాల ప్రవాహంలో మునిగిపోకుండా ఆ కళల అలలపై అలా తేలియాడుతూ తనదైన స్థాయిలో ఆ కళా వారసత్వ కమలాలను రాజమహేంద్రి నందు నేటికీ విరబూయిస్తూ ముందుకు సాగుతూ, మరో కళాపద్మ(ం).గా పిలవబడుతున్న విశిష్ఠ చిత్రకారిణి శ్రీమతి లక్ష్మి.

వ్యక్తి జీవితాన్ని ప్రభావితం చేసే అంశాల్లో పొగడ్త, తెగడ్తల కంటే ముందు ఆ కుటుంబం, మరియు పరిసరాలు ఎక్కువగా ప్రభావం చూపిస్తాయి. శ్రీమతి పద్మగారి విషయంలో కూడా ఇది మనకు బాగా కనిపిస్తుంది. ప్రఖ్యాత ప్రకృతి చిత్రకారులు, ఆంధ్రాటర్నర్‌గా పేరు గాంచిన శ్రీ వి.వి. భగీరథి స్వయంగా ఈ మె తాతగారు కావడమే గాక భగీరథి గారి భార్య, ఈ చిత్రాకారిణికి అమ్మమ్మ అయిన శ్రీమతి రత్న మాణిక్యం కూడా చిత్రకారిణే కావడం. ఒక విశేషం. చిత్రకళలో తన తాతల కాలం నాటి దామెర్ల, వి.వి. రత్నం, బాపిరాజు, సత్యవాణి, బుచ్చికృష్ణమ్మల నుండి మొన్నటి రాజాజీలే కాకుండా నేటితరం వరకూ రాజమండ్రిలో పరిడవిల్లుతూ వస్తున్న చిత్రకళా వారసత్వం ఆమెపై ప్రభావం చూపాయి. అందుచేతనే ఆమె వేసిన "తిరుమల గిరిరోడ్" లాంటి ప్రకృతి చిత్రాలను చూసినపుడు ఆమె తాతగారైన భగీరథి ప్రభావం, పేరంటం, పూలకోసం, సుబ్బిగొబ్బెమ్మ, తదితరమైన చిత్రాలు చూసినపుడు దామెర్ల



వేసిన చిత్రంలో భక్తకన్నప్ప లాంటి స్వచ్ఛమైన భక్తుడి ఆరాధనకు పిల్లవాడిలో కనిపింపజేసారు. ఇక ఆ తర్వాత ఆమె వేసిన "మధ్యతరగతి జీవితం", వర్క్ అండ్‌ప్లే, సేవ్ ది గ్రీనరీ, విజటబుల్ సెల్లర్ లాంటి చిత్రాల్లో కొంత ఆధునికత కనిపిస్తుంది. సర్వ ప్రక్రియలలో బహు నిష్ణాతులైన ఆమె గురు దేవులు శ్రీ రాజాజీ గారి ప్రభావం ఈ కాలంలో ఆమెచే ఇలాంటి చిత్రరచన చేయించడానికి కారణమై వుంటుంది. ఏది ఏమైనప్పటికీ కొంత నవ్యతతో వేసిన ఈ తరహా చిత్రాల కంటే ముందు కాలంలో సాంప్రదాయ బద్ధంగా వేసిన చిత్రాలలోనే ఆమె ప్రతిభ, ప్రత్యేకత కనబడుతుంది.

శ్రీమతి వేలకంటి సక్కుబాయి, గంగావతరం దంపతులకు తూర్పుగోదావరి జిల్లా "మర్రిపాక" అనే గ్రామంలో జన్మించిన శ్రీమతి పద్మకు తన అమ్మమ్మ, తాతయ్యల కళావారసత్వం రావడంతో చిన్నతనంలోనే చిత్రకళపై మక్కువ చూపించారు. రాజమండ్రి దామెర్ల రామారావు స్మారక చిత్రకళాశాల ప్రిన్సిపల్ శ్రీమాదేటి రాజాజీగారి శిష్యరికంలో ఆమె మెళకువలను నేర్చుకుని చిత్రకళలో లోయర్, హయ్యర్, టి.టి.సి.లు ఉత్తీర్ణులయ్యారు. ఆ పిదప రాజమండ్రిలోనే తెలుగు భాషలో మాస్టర్ డిగ్రీని, పండిట్‌ట్రైనింగ్ కూడా పూర్తిచేసిన ఆమెకు తెలుగు భాషోపాధ్యాయురాలిగా ఉద్యోగం రావడంతో ప్రభుత్వ ఉద్యోగంలో స్థిరపడ్డారు.

నేను చిత్రకళపై ఆర్టికల్స్ రాయడంలో బాగంగా శ్రీమతి పద్మగారి ఇంటిని రెండు సార్లు దర్శించడం జరిగింది. మొదటిది 2009లో నా మిత్రుడు బీర శ్రీనివాస్‌తో కలిసి భగీరధి గారి చిత్రాలు దర్శించేందుకు వెలితే రెండోది మా అన్నయ్య గారి అబ్బాయి "మురళి"తో కలిసి శ్రీమతి పద్మగారి చిత్రాలకోసం అక్టోబర్ 2011న వెళ్లడం జరిగింది. వారింటికి వెళ్లినప్పుడు మరెన్నో ఆసక్తికరమైన విషయాలు మాకు తెలిసాయి.

శ్రీమతి పద్మ కేవలం చిత్రకారిణి, ఉపాధ్యాయిని మాత్రమే కాదు. మంచి రచయిత కార్యదక్షురాలు, మంచి సృజనాత్మక ఆలోచనలు కల వ్యక్తిగానూ కనిపించింది. 2003లో ఆమె తూ॥గో॥జిల్లా రాజోలు జిల్లా పరిషత్ హైస్కూలు నందు పనిచేస్తున్న కాలంలో ఆ స్కూలు పిల్లలలో గల సృజనాత్మకతను వెలికి తీసేందుకు ఆమె నిర్వహించిన "చిట్టిస్కూల్ మేగజైన్" అందుకు ఓ గొప్ప ఉదాహరణ. సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం, ఆటలు, విద్య, నాట్యం, దస్తూరి ఇలాంటి వాటిల్లో పిల్లలను ప్రోత్సహించి బాగా ప్రతిభ కనబరిచిన బాలబాలికలకు "చిట్టి అవార్డ్స్" పేరుతో సంగీతంలో అయితే "చిట్టికోకిల" చిట్టి బాలు, చిట్టి చిత్ర, చిత్రలేఖనంలో అయితే "చిట్టి రామారావు" చిట్టి రవివర్మ, 'చిట్టిషేర్‌గిల్' సాహిత్యంలో అయితే చిట్టి శ్రీశ్రీ, చిట్టి మొల్ల, ఆటలతో అయితే చిట్టి మల్లీశ్వరి, చిట్టి

రామారావు నుండి రాజమండ్రిలో వస్తున్న ఆ కళా వారసత్వ ఛాయలు మనకు కనిపిస్తాయి. చిత్రీకరించే వస్తువుల్లో ఎక్కువగా తెలుగు సాంప్రదాయాలకు చెందినవై వుండడం, చిత్రీకరణలో అడుగడుగునా తొణికిసలాడే లాలిత్యం, చిత్రాలలో మంచి పొందిక వెలుగు నీడలకంటే సమితల దృశ్య చిత్రీకరణకే ఎక్కువగా ప్రాముఖ్యత నీయడం, కంటికి ఆహ్లాదకరమైన రీతిలో ఉండే వర్ణణ ఇక్కడి ప్రత్యేకత.

సుబ్బి, గొబ్బెమ్మ చిత్రంలో ఆమె ఎనిమిది మంది అమ్మాయిలతో సాంప్రదాయకమైన ఆ ఆట ఆడుతూ వున్న దృశ్య చిత్రీకరణలో కనబరిచిన పొందిక ఆ పల్లె పడుచులలో కనిపింపజేసిన లావణ్యం, ముఖ్యంగా వారి లంగా, వోణి చిత్రీకరణలో ఆమె చూపిన విభిన్నత, వాస్తవికత చిత్రాన్ని చూస్తున్న ప్రేక్షకుడికి హాయి గొలిపేలా వుంటుంది. అలాగే మరో చిత్రం పేరంటం, లాలిపాట, "పూలసేకరణ"లాంటి చిత్రాలు కూడా అలాంటి అనుభూతినే కలగజేస్తాయి. అలాగే ఆమె చిత్రించిన వేరొక చిత్రం "సరస్వతి"లో కూడా ఒక ప్రత్యేత కనిపిస్తే విఘ్నేశ్వరుడి చిత్రంలో ఒక చిన్నారి ఆ విగ్రహంపైకి ఎక్కి మరీ మందార పుష్పాన్ని గణపతి బుజంపై పెట్టడానికి ప్రయత్నిస్తున్నట్లు

సానియా, చిట్టి టెండూల్కర్, చదువులలో అయితే చిట్టి సరస్వతి, నాట్యంలో చిట్టి మయూరి, దస్తూరీలో "చిట్టి సులేఖరి, చిట్టి సులేఖిని ఇలా ఎంపిక చేసి ప్రతీ ఏటా చిట్టి అవార్డుల వేడుక నిర్వహించి ఆ సభలో ప్రముఖుల చేతులమీదుగా వాటిని ఆయా బాలబాలికలకు అందించడమే గాకుండా వాటినన్నింటినీ ఆ యేడాది చిట్టి స్కూల్ మేగజైన్ రూపంలోకి తీసుకురావడం చూసి నిజంగా మాకు ఆశ్చర్యం అనిపించింది. ఈ విధమైన ఏక్టివిటి చేయడం పట్ల వెంటనే ఆమెకు అభినందనలు చెప్పకుండా ఉండలేకపోయాము. నిజంగా ప్రతి పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయులలో కనీసం కొందరికైనా ఇలాంటి సృజనాత్మక ఆలోచనలు ఉన్నట్లైయితే భవిత ఎంత సృజనాత్మకంగా మారుతుందో కదా అని అనిపించింది.



ఇక 2002లో తాను చిత్రకారుడు కానప్పటికీ చిత్రకళపై ఆసక్తితో రాజోలులోని ప్రముఖ న్యాయవాదిగా పనిచేస్తున్న శ్రీ వీరభద్రరావు గారి అధ్యక్షతన ప్రారంభమైన ది. రాజోలు చిత్రకళపరిషత్‌కు ప్రారంభం నుండి ఆమె కార్యదర్శిగా వుంటూ ప్రతిఏటా జరిపే రాష్ట్రస్థాయి చిత్రలేఖన పోటీలు, ప్రదర్శనల నిర్వాహణలో ఆమె పాత్ర అత్యంత కీలకమైనది. అంతేకాకుండా ఆమె తాతగారు స్వర్గీయ భగీరథి స్మారక అవార్డుని 2002లో స్థాపించి ప్రతిఏటా రాజోలు చిత్రకళాపరిషత్ వార్షికోత్సవంలో ఓ ప్రముఖ చిత్రకారునికి ఇస్తున్నారు. అలాగే ఈ ఏడాది 2011లో ఎంతో ఘణంగా నిర్వహించిన సంస్థ దశమ వార్షికోత్సవంలో తన చిత్రకళా గురుదేవులైన స్వర్గీయ మాదేటి రాజాజీ గారి పేరు మీద కూడా ఓ అవార్డుని స్థాపించి ఈ తొలి అవార్డుని ప్రముఖ యువ చిత్రకారులు నడింపల్లి శ్రీధర్‌గారికి ఈయడం జరిగింది. ది.8-1-2012న జరిగిన దశమ వార్షికోత్సవ సభ నిర్వాహణలో ఆమె కనబరిచిన నేర్పు నా పాటు పాల్గొన్న చిత్రకారులందరికీ గొప్పగా అనిపించింది.

భాషా బోధన చేస్తున్నంత మాత్రాన అందరూ కవులూ, రచయితలు కాలేరు. కానీ శ్రీమతి పద్మ మాత్రం చిత్రకళ, భాషా బోధనతో పాటు సాహిత్య సృజన కూడా చేయగలరు. సాహిత్యంలో అనేక చిన్న కథలు, పాటలతో పాటు చిత్రకారులు దామెర్ల, వరదా వెంకటరత్నం, భగీరథి, రాజాజీ గార్లపై ఎన్నో వ్యాసాలు రాసారు. 2008లో ప్రముఖ చిత్రకారులు డాక్టర్ బి.ఏ.రెడ్డి గారి జీవన యానంపై "గోల్డెన్ పేలట్" అనే పుస్తకాన్ని నిజంగా ఆమె ఎంతో కవితాత్మకంగా రచించారు. రాజమండ్రి చిత్రకళానికేతన్ తరపున సన్మానాలు పొందిన ఎందరో చిత్రకారుల సన్మాన పత్రాలు శ్రీమతి పద్మగారి కలం నుండి జాలువారినవే.


చిత్రకారిణి, ఆమె తండ్రిగార్లతో వ్యాసరచయిత

ఇక చిత్రకారిణిగా ఆమె ప్రముఖ చిత్రకళా



గోల్డ్ మెడల్ సొంతం చేసుకున్నారు. 1995లో, 2002లోనూ యంగ్ ఎన్వాయిస్ ఇంటర్‌నేషనల్ నుండి విశిష్ఠ ఆచార్య మరియు చైతన్య దీప్తి పురస్కారాలను అందుకున్నారు.

ఇక 1997లో తన చిత్రకళా గురుదేవులైన రాజాజీగారి జన్మదినం సందర్భంగా రాజమండ్రిలోనూ, 2000లో రోటరీక్లబ్ రాజోలులోను, 2010లో ప్రఖ్యాత సాలార్‌జంగ్ మ్యూజియం హైదరాబాద్‌నందు తన వ్యక్తిగత చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించడమే గాక అనేక ఆర్ట్ కేంప్‌లందు పాల్గొన్నారు.

2009లో రాష్ట్ర టూరిజమ్ శాఖ వారు రివర్‌బే రాజమండ్రి నందు నిర్వహించిన గ్రూప్‌షోలో కూడా పాల్గొన్నారు. పలు సంస్థలనుండి సన్మానాలు పొందడమే గాక మున్సిల్ కార్పొరేషన్ విజయవాడ, లలితకళాపరిషత్ విశాఖపట్నం, సాలార్‌జంగ్ మ్యూజియం హైదరాబాద్ ఇత్యాది సంస్థలతో పాటు కొందరి ప్రైవేటు వ్యక్తుల సేకరణతో కూడా శ్రీమతి పద్మగారి చిత్రాలు వుండడం విశేషం.

సంస్థలయిన నవరంగ్‌చిత్రకళానికేతన్, దామెర్ల ఆర్ట్‌గేలరీ, కోనసీమ చిత్రకళాపరిషత్, హైద్రాబాద్ ఆర్ట్‌సొసైటి, లలితకళాసమితి, అంకాల ఆర్ట్స్ అకాడమీ ఇత్యాది సంస్థలు నిర్వహించే పోటీలలో పాల్గొని ఎన్నో బహుమతులందుకోవడం జరిగింది. 1990లో నవరంగ్ చిత్రకళాపరిషత్, వెల్లటూరు నుండి ప్రథమబహుమతిని, లలిత కళాసమితి విశాఖపట్నం వారి నుండి నగదు బహుమతి, 1992, 94, 95, 96, మరియు 2011 సంవత్సరాలలో ప్రఖ్యాత కోనసీమ చిత్రకళా పరిషత్ నుండి నగదు మరియు భగీరధి అవార్డులతో పాటు ఆ సంస్థ ద్విదశాబ్ధి ఉత్సవంలో ఘణంగా నిర్వహించిన శత చిత్రకారుల సన్మానం కూడా అందుకున్నారు.

1994 మరియు 1996లో గంటి శేషగిరి రావు అవార్డుని, అంకాల ఆర్ట్స్ అకాడమీ భీమవరం నుండి పొందగా, వి.యస్.ఎన్ ఆర్ట్ గేలరీ విశాఖపట్నం వారు నిర్వహించిన జాతీయ చిత్రకళాపోటీల్లో



నేను శ్రీమతి పద్మగారి ఇంటర్వ్యూ నిమిత్తం వారింటికి వెళ్లిన ప్పుడు ఆశ్చర్యకరమైన మరో అంశం శ్రీమతి పద్మగారి నాన్నలో గుర్తించాను, "కాదేదీ కళకనర్హం" అన్నట్లు (70) ఏళ్ల వయస్సులో ఆయన తన చిన్నతనం నుండి వివిధ అంశాలపై సేకరించిన ఎన్నో అరుదైన విషయాలు (చిత్రకళ, సాహిత్యం, నాయకులు, ముఖ్య సంఘటనలు, పుష్పాలు, ఇలా అన్ని అంశాలకు సంబంధించి ...సేకరించి వాటిని ఓ ప్రత్యేక బౌండులుగా చేయించి భద్రపరిచిన తీరు చూసి ఆశ్చర్యపోవడం మా వంతైంది. ఈ విషయంలో ఆయన నిజంగా మరో ముల్లంగి వెంకటరమణారెడ్డిని తలపించారు.

ప్రస్తుతం తూర్పుగోదావరి జిల్లా కోరుకొండ మండలం గా దరాడ జిల్లా పరిషత్ హైస్కూల్‌నందు గ్రేడ్–1 తెలుగు ఉపాధ్యాయినిగా పనిచేస్తూ అటు చిత్రకళ, సాహిత్య సేవలతో పాటు రాజోలు చిత్రకళాపరిషత్ కార్యదర్శి బాధ్యతలు సమర్ధవంతంగా నిర్వహిస్తూ ఉండడమే గాక, తన తాతగారైన ప్రఖ్యాత చిత్రకారులు శ్రీభగీరధి స్మారక చిత్రకళా పాఠశాలను కూడా రాజమండ్రిలో నడిపిస్తూ రాజమహేంద్రి కళాసరోవరంలో ఈ పద్మంతో పాటు మరెన్నో కళాపద్మాలను విరబూయిస్తున్న శ్రీమతి లక్ష్మిగారి కృషి ఎంతో అభినందనీయమైనది.

*email: snventapalli@gmail.com*



ప్రొఫైల్

# సంగీ, నృత్య కళాసవ్యసాచి - శ్రీమతి సంధ్యామూర్తి



శ్రీమతి జి. సంధ్యామూర్తి

- లంక ప్రసాద్

**భారతీయ సంస్కృతి సంప్రదాయాలు నేటి యువత పదకోశం నుంచి క్రమేపి మాయమవుతున్న కాలం. పాశ్చాత్య నృత్య సంగీత హోరులో శాస్త్రీయతకు విలువ తగ్గుతున్న సమయంలో కళల ఖిల్లా అనంతజిల్లా. అనంతపురం నగరంలో శాస్త్రీయ, సంగీతాలకు పెద్ద పీటవేస్తూ ఆవిర్భవించిన నిలయం శ్రీనృత్య కళానిలయం". శ్రీమతి జి. సంధ్యామూర్తి గారు తన తల్లిగారు కీ॥శే॥ సరస్వతమ్మ, తండ్రిగారు కీ॥శే॥ పి.యస్.శర్మగార్ల ఆశీర్వచనంతో 3సం॥ల వయస్సులోనే నృత్యం నేర్చుకోవడం, 6 సం॥ల వయస్సు నుండి శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించారు.**

కీ॥శే॥ వరదరాజ అయ్యంగార్ వద్ద భరతనాట్యం, కూచిపూడి వేదాంత పార్వతీ శంకర్ గారి వద్ద నాట్యంలో మెళకువలు, అణ్ణామలై చెట్టియాల్ వద్ద సంగీతంలో శిక్షణ పొందారు. శ్రీమతి జి. సంధ్యామూర్తి తాను అభ్యసించిన మన సంప్రదాయ నృత్య సంగీతాలను 7 సం॥లు కేరళలోని ఆలువాలోనూ, 3 సం॥లు గుజరాత్‌లోని నటియాడ్‌లలో విద్యార్థులకు శిక్షణ యిచ్చారు.

తన తండ్రిగారు కీ॥శే॥ పి.యస్. శర్మ అనంతపురం లలిత కళాపరిషత్ కార్యదర్శిగా 10 సం॥లు సేవలందించారు. ఆయన స్థాపించిన 'శ్రీనృత్య కళానిలయం'లో వందలాది మందికి మన కళల పట్ల శిక్షణ యిచ్చి చైతన్య వంతులను చేస్తున్నారు.

2011 సం॥ అక్టోబర్ నందు శ్రీనృత్యకళానిలయం 30 సం॥లు పూర్తిచేసుకొంది. 3 దశాబ్ధాల క్రితం కాలిమువ్వల సవ్వడి నృత్య కళాభారతిని అలరించాలన్న ఆశయం-కేవలం 5మంది విద్యార్థునులతో ప్రారంభించిన శిక్షణ. విద్యార్ధినీ విద్యార్థుల నాట్య సుగంధం శ్రీ చందనం మించిన పరిమళంతో రాష్ట్ర, రాష్ట్రేతర, దేశ, విదేశాలలో అనంతపురంలోని శ్రీనృత్యకళానిలయం పరిఢవిల్లుతోంది.

1981సం॥ నుంచి స్టేజ్ పెర్ఫార్మెన్స్‌ను తన శిష్యులచే యివ్వడం జరిగింది. 1985లో చిలకూరి పేట కళానిలయం వారిచే 'నాట్యమయూరి' అవార్డు అందుకొన్నారు. 1989లో అనంతపురం తపోవనంలోని శివాలయ ప్రాంగణంలో 24 గంటలపాటు ఆ నటరాజుకు నృత్య నీరాజనం సమర్పించారు. 1991లో హంపి డాన్స్ ఫెస్టివల్‌లో పాల్గొన్నారు. 1992లో పుట్టపర్తి శ్రీసత్యసాయి బాబా సన్నిధిలో నృత్యప్రదర్శన. 1993లో సింగపూర్‌లో మొదటి నృత్య ప్రదర్శన. 1995లో కీ॥శే॥ ।నందమూరి తారకరామారావుగారి జ్ఞాపకార్థం కళానీరాజన పురస్కారం అందుకొన్నారు. 2000 సం॥లో అనంత ఆణిముత్యంగా మెరిసారు.

శ్రీ గణపతి సచ్చిదానందస్వామి సన్నిధిలో ఆయన రచించిన దశావతారలకు నృత్య కల్పన చేసి ఆయన అభినందనలు అందుకున్నారు. తిరుమల బ్రహ్మోత్సవాలలోనే కాదు రాష్ట్రవ్యాప్తంగా వేల ప్రదర్శనలిచ్చి అనంతఖ్యాతిని చాటారు.

రమణమహర్షి భక్తురాలుగా వుంటూ తాటిపత్రిలోని అనాధశరణాలయంలో ఉచిత శిక్షణ యిస్తున్నారు. "సంరక్షిత" సంస్థ ద్వారా ఎన్నో సేవా కార్యక్రమాలు చేపట్టారు. అక్టోబర్ 16, 2011న కీ।।శే।। పద్మశ్రీ కల్లూరు సుబ్బారావు అవార్డు అందుకొన్నారు.



శ్రీమతి జి. సంధ్యామూర్తి నుండి మెమెంటో అందుకుంటున్న వ్యాసరచయిత

తన భర్త కీ।।శే।। జి. కృష్ణమూర్తిగారి సహకారంతో 30 సం।।ల పైగా అనంతపురం నందు మన సంప్రదాయ కళలను కాపాడుతూ వేలాది మంది చిన్నారులను చైతన్య పరుస్తున్నారు శ్రీమతి జి. సంధ్యామూర్తి

సరిగమల నిలయం- శ్రీ నృత్య కళానిలయం

సరిగమలతో సరాగాలాడుతూ

సుస్వర మధుర సంగీత ఝురిలో ఓలలాడుతూ

శాస్త్రీయ సంగీత సామ్రాజ్ఞిగా, నాట్య మయూరిగా, అనంత ఆణిముత్యంగా అందరి మదిలో సంరక్షితగా కళాపోసనకై అహర్నిశలు సర్వం తానై శ్రమిస్తున్న అనంత అమృత మూర్తి జి. సంధ్యామూర్తి.





# ఇదీ మన వరస !!

- బీ.వీ.ఎస్. ప్రసాద్

**సెక్రటేరియట్! 10.00. హై లెవెల్ మీటింగ్ స్టార్ట్ కాబోతోంది. అందరూ సెల్స్ స్విచ్చాఫ్ చేసారు. ఇంతలో ఒక రింగ్‌టోన్ డిస్టర్బ్ చేసింది. ఆ ఫోన్ ఛైర్మన్ సెల్ కి! 'ఐ యామ్ యిన్ ఎ మీటింగ్ మామ్. విల్ కాల్ యు ఆఫ్టర్ హాఫ్ ఎన్ అవర్'?..." సరే అలాగేరా బాబూ" అవతల్నుంచి.**

"వేరార్ వియ్... హవ్ ఆల్ కం? షల్ వి స్టార్ట్.. ఎజెండా ఈజ్ రెడీ?... కాఫీ, స్నాక్స్ ఎరేంజ్‌డ్?" పి.ఏ.కి సూచనలు అబునై.

"రీడ్ ఔట్ మినిట్స్ ఆఫ్ లాస్ట్ మీటింగ్" ఆర్డరు వేశారు కమిటీ ఛైర్మన్. "ఆం! ఫస్ట్ ఆఫ్ ఆల్... యింట్రడ్యూస్ న్యూలీ యాడెడ్ మెంబర్స్"...

"అయామ్..." ఒక్కొక్కరుగా లేచి నమస్కారంచేసి ఎవరికి వాళ్లను ఛైర్మన్‌కు పరిచయం చేసుకొంటున్నారు. అంతా ఇంగ్లీష్‌లోనే. హై లెవెల్ మీటింగ్ కదా మరి!!

శంకరం మాస్టరుగారి వంతొచ్చింది!!

'సభకు నమస్కారం! ఈ సమావేశానికి నన్ను ఆహ్వానించి నన్నొక సభ్యుడిగా చేసుకొన్నందుకు కృతజ్ఞతలు. అయితే సభ యిలాగే ఆద్యంతం ఇంగ్లీషులోనే జరిగే లాగైతే ఇప్పుడే నా రాజీనామా కూడా ప్రకటిస్తున్నాను!

'హే! వాట్ హేపెన్డ్ టు హిమ్' ఎవరో ఆ చివర్లో నుంచి విసుగు ప్రకటించారు.

'అవును. నాకేం కాలేదు. మన తెలుగే అధోగతి పాలౌతుంది. ఇది మన తెలుగు భాషాభివృద్ధికి నిర్దేశించిన సభ. యిందులో మీరంతా ఇంగ్లీషులోనే మాట్లాడుతారు. అదే నాకు నచ్చనిది. మార్పు ఇక్కడ నుండే మొదలు కావాలి! రాజీనామా చేసి వెళ్లేముందు నాదో సూచన: "తెలుగు అకాడమీ" ఏమిటి? అకాడమీ తెలుగుపదమా! 'తెలుగు సాంస్కృతీ పీఠం'గా మార్చండి" అంటూ విసవిసా వెళ్లిపోయారు శంకరం మాష్టారు!!

అందరూ "ఓకే" అనుకొంటూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు!!



కథ

# బుజ్జికన్న ....

- పద్మకళ

హైవే మీద ప్రయాణం. సాఫీగా సాగిపోతోంది బండి జామ్మంటూ. రోడ్డు మధ్యలో ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగుల్ని కలగలిపి రకరకాల పూలు. ఇలా వెళ్తూ వెళ్తూ ఏదో ఓ చోట వీటికి దూరమవ్వాల్సి వస్తుందేమో ...! బెంగగా ఉంది. ఒక్కసారి బండి ఆగితే బావుండు! ఒక్క దూకు దూకి ఆ అందమైన పూల మొక్కల మీదికురికేస్తే ... లేలేత చిగురుల్ని, నోరూరించే మొగ్గల్ని, పువ్వుల్ని ఆమ్యామ్యనిపించేస్తే ఎంత బావుండో... ! మనసునిండా ఆశలు నిండిన ఊసుల్తో బుజ్జిగాడి చూపులు చెట్లకేసి, వాటికున్న పూలకేసి...



సింగిల్ పేజీ కథ

# ఫ్రీ...ఫ్రీ...

## ఏవిఎమ్

మహర్షి

సాయంత్రం ఆఫీసునుంచి ఇంటి కొచ్చేసరికి ఇల్లంతా కొత్త ఫర్నీచర్‌తో అంటే రాయల్ మోడల్ సోఫాలూ, ఫ్రిజ్, ఏసీ, ప్లాస్మా టి.వీతో ఇల్లంత కళ కళలాడుతూ వున్నది.

మంచి ఘుమఘుమలాడే కాఫీతో వచ్చింది మానస

“ఏవిటివన్నీ! ఎక్కడివి”? కోపంగా అడిగాడు మహర్షి

“ముందు ఈ కాఫీ తాగండి” అన్నది మానస కూల్‌కూల్‌గా కన్ను గొడుతూ ఆ కాఫీని ఒక్క గుక్కలో తాగి” ఇక చెప్పు!” అన్నాడు మహర్షి

‘ఇవన్నీ ఎక్కడివి, ఎవరిచ్చారూ!?” అనుమానం, కోపం మిక్స్ చేసి  ఇవన్నీ ఫ్రీగా ఇచ్చారండీ!

నిజమా! ఉచితంగానా! అయితే నా చెవిలో కాలీఫ్లవర్ పువ్వు పెట్టు అబ్బే నిలబడదు

చాలుగాని బోడి సరసం! ఈ ఫ్రీ వెనుకున్న అసలు రహశ్యం చెప్పు!

ఏం కొనకుండా ఎందుకిస్తారు! మీకేమన్నా పిచ్చా!

తర్వాత నాకు వచ్చేది అదేలే గాని!... ఏం కొన్నావో చెప్పు!

కనకదుర్గ వారధి పక్కనే అపార్ట్‌మెంట్సు కడుతున్నారు గదా! దానికీ, దీనికీ లింకేంటీ!?

ఎందుకంత తొందర... చెప్పనీయండీ!

చెప్పు... చెప్పు...నీరసంగా కూర్చున్నాడు రాయల్‌సోఫాలో

ఒక్కటే ఒక్కటి కొన్నా!

ఏంటా ఒక్కటి!?

అక్కడ, త్రీబెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్

ఒక్కటే కొన్నా! ఓ అరగంలో బ్యాంకు వాళ్లు వస్తారూ... మీ బోడి సంతకం ఒక్కటి పెట్టండి చాలు!

ఆ బిల్డరే ఇచ్చాడు ఇవన్నీ...



# చిత్ర జగతిలో పున్నమి రేడు... దామెర్ల

(మార్చి 8న దామెర్లరామారావు జన్మదిన సందర్భంగా ప్రత్యేక వ్యాసం)

ప్రకృతి కాంత చిగురుటాకు చీరకట్టి, చిరువిరులతో చామరాలు వీస్తూ వసంతకాల శోభను చల్లని గాలులతో ఇనుమడింపచేస్తుంది. ఈ మనోహర దృశ్యాలను వర్ణాలతో వర్ణించ గల కుంచె కరువయిన ఈ ఆంధ్రావనిలో ఆ లోటును తీర్చేందుకు ఏ పరలోక దివ్యాత్మో స్వల్ప వ్యవధికై ఇల అరుదెంచెను, దామెర్ల రామారావు రూపంలో....




తొలిచూలుకు పువ్వుల ముడుపు

– ఆత్మకూరు రామకృష్ణ

కలకాలం చెర'గని'సజీవ చిత్రం.
ఓ 'కల' కాలంలో చెరిగిన (నిజ) జీవన చిత్రం

– దామెర్లరామారావు

కవిత

# వందేమాతరం

- రమణశ్రీ

పాత సంస్కృతికి పాతరవేసి
పాశ్చాత్య సంస్కృతికి పట్టం కట్టి
అర్ధరాత్రి వేడుకలకు వేదిక కాని
యువతరానికి ఇదే నా వందనం
సప్త వ్యసనాలకు స్థావరమై
ఇల్లూ వళ్ళూ గుల్ల చేసుకుంటూ
అదే నాగరికతని భ్రమపడని
యువతరానికి ఇదే నా వందనం
ఆంగ్ల మాధ్యమంలో అక్షరాలు దిద్దించకుండా
తెలుగు బడులలో శతక పద్యాలు వల్లె వేయించే
అక్కడక్కడ అవశేషించిన
యువతరానికి ఇదే నా వందనం
వాహనాలపై వానర విన్యాసాలు చేస్తూ
రహదారులని రక్తసిక్తంచేస్తూ
కన్నవారికి కడుపుకోత కలిగించని
యువతరానికి ఇదే నా వందనం
కనిపెంచిన తల్లిదండ్రులను
కనిపించే దేవతలుగా కొలుస్తూ
వారిని వృద్ధాశ్రమాలకు అంకితమివ్వని
యువతరానికి ఇదే నా వందనం

*email: munipratapsinghb@gmail.com*

64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం
సంపుటి :2 సంచిక :6 ఏప్రిల్ 2012



## శ్రీరామనవమి శుభాకాంక్షలు....

64కళలుడాట్‌కాం 18 నెలలు పూర్తి చేసుకొంది. కళలపై నున్న ఆశక్తితోనూ-అభిరుచితోను ప్రారంభించిన ఈ వెబ్ పత్రికకు విశేష ఆదరణ లభించింది.

64కళలుడాట్‌కాంకు రచనలు మేమూ చేయవచ్చా అని ఎంతో మంది మెయిల్స్ పంపిస్తున్నారు. కళలకు సంబంధించిన వ్యాసాలు (ఫొటోలతో) నిరభ్యంతరంగా పంపవచ్చు. పేజీలు పెంచమని కొంతమంది పాఠకులు అడుగుతున్నారు. రెండు సంవత్సరములు పూర్తయ్యేవరకూ కొన్ని సాంకేతిక కారణాలవల్ల వీలుపడదని తెలియజేస్తున్నాం.

ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.

కళాసాగర్
ఎడిటర్


ముఖచిత్రం చిత్రకారుడు : తారా నగేష్



పిల్లలు - బొమ్మలు

ఎన్‌టిఆర్ పురస్కారం అందుకున్న శాయి



ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే

# పిల్లలు - బొమ్మలు

- బి.ఏ. రెడ్డి

**చిన్న పిల్లల చేతిలో బలపంవున్నా, పెన్సిలు వున్నా, రంగు చాక్‌పీసులు వున్నా, స్కెచ్‌పెన్నులు వున్నా, ఇంకా ఏమైనా వుంటే వారు అందుబాటులో వున్న పలకమీద గాని, పేపరు మీదగాని ఏమీలేకపోతే గోడమీదగాని ఏదో ఒక బొమ్మ గీస్తూ వుండడం, వారేదో పనికిరాని పని చేస్తున్నారని మనం మందలించడమూ మామూలే. ఐతే ఈ పిచ్చి గీతలే వారిలోని సృజనాత్మక శక్తికి పునాదులని పెద్దలు గ్రహించాలి.**





భాషలకు లిపి కంటే ముందు చిత్రాల ద్వారా తమ భావాలను మానవుడు వ్యక్తీకరించేవాడు. కాలక్రమేన ఆ చిత్రాలే మానవుని సృజనాత్మకతో కళారూపాలుగా రూపొందాయి. ముందుగా గిరిజన కళ. తరువాత జానపదకళ, ఆపైన క్లాసికల్ మరియు రియలిస్టిక్ ఇప్పుడు ఆధునిక చిత్రాలు అనేక నూతన పోకడలు అందుకొన్నాయి.

జాగ్రత్తగా పరిశీలిస్తే వ్యక్తులు ఏ వృత్తిలో వున్నప్పటికి వారిలో కొంతమంది మాత్రం పేరుప్రఖ్యాతులు సంపాదించుకోగల్గుతారు. వీరు తమ వృత్తిలో తమ తమ సృజనాత్మక శక్తితో నూతన విధానాలను కనిపెట్టి సమాజ మనుగడకెంతో ఉపయోగపడుతుంటారు. ఈ ప్రగతికి మూలకారణం వారిలోని సృజనాత్మక శక్తి, పరిశీలనా పటిమ, అకుంఠిత దీక్ష మరియు వారి విధులపై ఆసక్తి.

బాల, బాలికలలో పైన ఉదహరించిన బీజాలను నాటడం పెద్దల వంతు. దీనికి చిత్రలేఖనం ఎంతో ఉపయోగపడుతుంది. కేవలం మనం కొన్ని రంగులు, ఒక తెల్లకాగితం ఇస్తే బాలలు ఆ కాగితంపై కొన్ని రూపాలు, కొన్ని రంగులు మేళవించి ఓ చిత్రాన్ని చేయగల్గుతారు. దాని

అర్థం ఏమంట "The Child Produces Some thing out of nothing" దానినే మనం సృజనాత్మకత అంటాము. అదే విధంగా ఒక కత్తెర, పేపర్లు ఇస్తే వివిధ రకాలైన ఆకారాలను, బొమ్మలను తయారుచేయడం బాలల చేతిలోని కళానైపుణ్యానికి, నేర్పుకి నిదర్శనం.

ఈ చిత్ర రచనా క్రమంలో పిల్లలలో ఓర్పు, నేర్పు, పరిశుభ్రమైన సంపూర్ణ విశ్వాసము ఇంకా ముఖ్యంగా నిర్భరమైన భావప్రకటనాశక్తి అలవడతాయి. బొమ్మలు వేయడం నేర్చుకొనేటప్పుడు కొన్ని చిత్రాలు గీయడం నేర్చుకొనగల్గుతాడు. కాని ఈ చిత్ర రచనా పరిక్రమ కార్యక్రమంలో (Longrun) లో పైన ఉదహరించిన సద్గుణాలన్నీ బాలలో వృద్ధిచెందుతాయి. వారిని సుసంపన్నులను చేస్తాయి. ఐతే స్కూలు స్థాయిలో చిత్రకళకు తగిన ప్రాముఖ్యత ఇవ్వకపోవడం, పరీక్షలవుత్తీర్ణతకు చిత్రకళాపటిమను ప్రాతిపదికగా తీసుకొనకపోవడం వల్లను తల్లిదండ్రులు గాని ఉపాధ్యాయులుగాని బాలలను ఈ దిశలో ప్రోత్సహించుటలేదు. దానివల్ల పిల్లలు తమ బాల్యంలో రంగుల ద్వారా, రూపాల ద్వారా చక్కని చిత్ర రచన ద్వారా పొందాల్సిన ఆనందాన్ని, అనుభూతిని కోల్పోతున్నారు. ఈ ఆనందాన్ని హరింపజేసే పెద్దలు క్షమార్హులుకారు. పైగా వారిలోని సృజనాత్మక శక్తికి అడ్డుగా నిలబడుతున్నారు. ఈ ధోరణిమారాల్సిన అవసరం ఎంతైనా వుంది. రోజురోజుకు పెరిగిపోతున్న ఈ పోటీ ప్రపంచంలో నూతనత్వానిదే పెద్దపీట. అనగా సృజనాత్మక శక్తి వున్న వ్యక్తులే స్వయంగా అభివృద్ధి పొందగలరు. వారే సమాజానికి తమ నూతన అన్వేషణ ఫలితాల ద్వారా, దేశాభివృద్ధికి దోహదం చెయ్యగల్గుతారు. చివరగా చెప్పేదేమంటే సృజనాత్మకతకు అంకురార్పణ డ్రాయింగు క్లాసులోనే ఆరంభం అవుతుంది. పెద్దలైన మనం పిల్లలతో ఈ దిశలో సహకరిద్దాం.



# సర్వం రామమయం

- విష్ణుబొట్ల రామకృష్ణ




**రామెూ విగ్రహవాన్ ధర్మ: సాధు: సత్యపరాక్రమ:**

**రాజా సర్వస్యలోకస్య దేవానాం మఘవానివ... (అరణ్యకాండ)**

రాముడు మూర్తీభవించిన ధర్మం సత్పురుషుడు, సత్యపరాక్రముడు. దేవతలకు ఇంద్రుడు ప్రభువైతే, సకలలోకాలకు రాముడు ప్రభువు. ఈ మాటలు అన్నది దేవతలు కాదు, మానవులు కాదు, లోకాన్ని పీడించే రాక్షసులు. రాముని యెుక్క గుణగణాలను, ధైర్యసాహసాలను గురించి, వినటమే కాదు స్వయంగా చూసి రాముని చేతిలో ప్రాణాలు విడిచిన మారీచుడు రావణునితో అన్న మాటలు. రాముడు ఆ యుగంలో ధర్మాన్ని పాలించిన వ్యక్తి, కాని ఈనాటికి అలా యుగధర్మాన్ని పాలించిన వ్యక్తులు లేకపోవటం వల్ల శ్రీరామచంద్రుడు ఆ యుగంలోను, ఈ యుగంలోను ధర్మం మూర్తీభవించిన వ్యక్తిగా, సకల లోకాలకు ఆదర్శప్రాయుడిగా నేటికీ మిగిలిపోయాడు.

*సీతను పత్నింగా పొందిన శ్రీరాముడు ఏకపత్ని వ్రతం స్వీకరించి సీతరాముడుగా ప్రసిద్ధి పొందాడు. ఏకపత్నీ వ్రతం స్వీకరించి సీతనే సహధర్మచారిణిగా భావిస్తే ఆమెతోనే జీవితాన్ని సాగించిన ఏకపత్నీవ్రతుడు శ్రీరాముడు. అందుకనే శ్రీరామచంద్రుని కళ్యాణాన్ని ప్రతిసంవత్సరం వేడుకగా జరుపుకొంటాం.*

శ్రీరాముడు గుణగణాలను దేవతలు సైతం వర్ణించలేకపోయారు. సామాన్య మానవులైన మనం వర్ణించటం అంటే అదో సాహసమే. ఎందుకంటే శ్రీరాముడు మానవుడిగా పుట్టి మహనీయుడైనాడు. శ్రీ మహావిష్ణువు దుష్టశిక్షణ కోసం అవతరించిన అనేక అవతారాలలో శ్రీరామచంద్రుని అవతారానికి ఒక ప్రత్యేకత ఉంది. మిగిలిన అవతారాలలో దైవత్వాన్ని చూపి, దైవస్వరూపుడైనాడు. కాని రామావతారంలో పూర్తిగా మానవుడిగా ఉంటూ, ఒక సామాన్య మానవుడు ఎదుర్కొనే కష్టాలు, సుఖాలను తాను ఎదుర్కొని, మానవ జీవితం యెుక్క పరిపూర్ణతను చాటిన మహా పరుషుడు శ్రీరామచంద్రుడు.

శ్రీరామచంద్రుని గునగణాలను గురించి చెప్పాలంటే ఆయన పుట్టుక నుండి అవతార పరిసమాప్తి వరకు ప్రతి ఒక్కటి ప్రతి ఒక్కరు ఆయన్ను ఆదర్శనీయంగా తీసుకోవలసిందే. దైవ వరప్రసాదంగా జన్మించిన శ్రీరాముడు సామాన్య మానవుడిగా వుంటూనే, దుష్ట సంహారం కోసం, గురువు గారి సేవ చేయటం కోసం. తండ్రి అనుమతితో ఋషి ఆశ్రమాలకు చేరి సర్వ విద్యాపారంగతుడైనాడు. రాజుగా సుఖాలు అనుభవించవలసిన శ్రీరాముడు ఆశ్రమ జీవితం గడిపాడు. అలాగే మారిచ, సుబాహులను సంహరించటం ద్వారా దుష్టసంహారానికి నాంది పలికాడు. అహల్యకు శాపవిమోచనం కల్గించటం ద్వారా తనలోని దైవత్వాన్ని చూపాడు. సీతాస్వయంవరంలో తన పరాక్రమాన్ని చూపి ప్రపంచంలోని రాజులందరికి తన భుజబలాన్ని చూపించాడు రాముడు.

స్వయంవరం ద్వారా సీతను పత్నిగా పొందిన శ్రీరాముడు ఏకపత్ని వ్రతం స్వీకరించి సీతరాముడుగా ప్రసిద్ధి పొందాడు. పరస్త్రీని అన్యధా భావించక, ఏకపత్నీ వ్రతం స్వీకరించి సీతనే సహధర్మచారిణిగా భావించి ఆమెతోనే జీవితాన్ని సాగించిన ఏకపత్నీవ్రతుడు శ్రీరాముడు. అందుకనే శ్రీరామచంద్రుని కళ్యాణాన్ని ప్రతిసంవత్సరం వేడుకగా జరుపుకొంటాం.



రామాయణాన్ని మొత్తం క్షుణ్ణంగా ప్రతి అంశాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే రాముడు వేసే ప్రతి అడుగు, తీసుకునే ప్రతి నిర్ణయం ధర్మబద్ధంగా, శాస్త్ర ప్రకారం ఉంటుంది. అందుకనే ఆయన పరిపాలించిన కాలం స్వర్ణయుగం అయింది. శ్రీరామరాజ్యం అయింది.

ఇన్ని గుణాలు, ఇన్ని మంచి లక్షణాలు ఉన్న వ్యక్తి మరే యుగంలోను లేకపోవటం వల్లనే రాముడు యుగపురుషుడు అయినాడు. ఆనాటి నుండి ఈనాటి వరకు రాముడు యుగపురుషుడే. అందుకే ఈ కలియుగంలో ప్రతి తల్లిదండ్రులను తమ బిడ్డ శ్రీరామచంద్రుడుగా ఉండాలని, ప్రతి యువతి తనకు కాబోయే భర్త శ్రీరాముని వంటి గుణగణాలు కల్గి ఉండాలని కోరుకొంటుంటారు. అన్నదమ్ముల మధ్య ఐక్యత కోసం వారిని రామలక్ష్మణులతో పోలుస్తారు. ఇలా అనేక సందర్భాలలో అనేక చోట్ల సీతారాముల వారు ప్రతి ఒక్కరి జీవితాల్లో మమేకమై ఉన్నారు. అందువల్ల నేటికి ప్రతిఒక్కరు శ్రీరామున్ని దైవంగా కొలుస్తున్నారు. ఆయన్ని ఆదర్శంగా తీసుకొని మంచి గుణగణాలు కల్గిన వ్యక్తులుగా మారాలనుకుంటున్నారు. అందువల్లనే రాముడు సకల గుణధాముడు, కోదండరాముడు, సీతారాముడు వంటి పేర్లతో మనందరి మధ్య నేటికి ఉన్నాడు. ఈ శ్రీరామనవమి రోజు ఆయన్ని భక్తితో కొలిచి మనమూ తరిద్దాం.

భార్యభర్తలు అంటే శ్రీరాముడు, సీత వలే అన్యోన్యంగా కలిసి జీవించాలని ఉద్దేశ్యంతోనే పెద్దలు కూడా సీతారాముల్లా జీవించండి అంటూ ఆశీర్వదిస్తారు.

తండ్రి పినతల్లికి ఇచ్చిన మాటను నిలపటానికి రాజ్యాన్ని తృణప్రాయంగా వదిలేసి, తండ్రిమాటను శిరసా వహించి సీత, లక్ష్మణులతో వనవాసాలకు సాగాడు శ్రీరాముడు. సూర్పణక రాక్షస చేష్టలకు తగిన శాస్తి జరిపి సీతకు తోడు నిలిచాడు. పరస్త్రీ వ్యామోహంతో అమోఘ భక్తిసంపన్నుడు, విద్యావంతుడు, మహబలశాలి అయిన రావణుడు సీతను అపహరించగా, సామాన్య మానవుడి వలే దు:ఖించాడు రాముడు. తర్వాత కార్యోముఖుడై సీతాదేవిని వెదుకుతూ అనేక మందికి మోక్షాలను ప్రసాదించాడు అందులో జటాయువు, శబరి వంటివారు ఎందరో ఉన్నారు. వాలిని చంపి సుగ్రీవునికి రాజ్యాన్ని కట్టబెట్టాడు శ్రీరాముడు. అక్కడ తన స్నేహధర్మాన్ని నిరూపించాడు. హనుమంతుడు లంకలో ప్రవేశించి సీత జాడను కనుగొని, రామునికి ఆనవాలు చూపి రామునికి ప్రియశిష్యుడు అయ్యాడు హనుమతుడు. అందుకే హనుమంతుడు రాముని అంతరంగకుడిగా ప్రసిద్ధిపొందాడు. చిరంజీవిగా వరంపొందాడు. అల్పుడు మాట్లాడిన మాటలకు విలువనిచ్చి సీతమ్మను ఋషి ఆశ్రమాలకు పంపి కఠినమైనవాడు అనే మాట పడినవాడు రాముడు. ప్రజల మాటలకు పాలకులు ఎంత విలువ ఇవ్వాలి అనే దానికి ఉదాహరణ ఈ సంఘటన. ఇది నేటి రాజకీయ నాయకులు బాగా గుర్తుంచుకోవలసిన విషయం. ఇలా



# 'చిత్ర' మైన జీవితం

Part-12

ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...





email: balisankar@gmail.com

ప్రభవ మాసపత్రికను గోపాలరావు అనే ఆయన నడిపేవాడు. ఆయనొకసారి తన పత్రికలో ఏదన్నా బొమ్మల కథ వెయ్యాలన్న ఆలోచన వచ్చింది. ఆప్రపోజల్‌ను నా ముందుంచాడు. సరే ఏదన్నా వర్క్ చేద్దాం అనుకున్నాను. కానీ ఏంచేయాలో ఏ కథ తీసుకుంటే బాగుంటుందో ఒక నిర్ణయానికి రాలేక పోయాను. ఆ సమయంలో శాస్త్రిగారు మా ఆఫీసుకి వచ్చారు. అప్పటికే ఆయన 'బాలీ కథలు' చదివి ఉండటం వల్ల అందులోని ఓ కథను ఎన్నుకొని బొమ్మల కథలా మలిస్తే ఎలా ఉంటుందీ అన్న ఆలోచన వచ్చింది. మనసులో అనుకున్నదే తడవుగా శర్మగారి దగ్గర కూచున్న ఆయనకీ విషయం చెప్పి పర్మిషన్ ఇమ్మన్నాను. అంగీకరించారు. అలా ఓ కథను తీసుకుని బొమ్మలు కథగా మలిచాను. ప్రభవలో వచ్చింది.

ఆ తరువాత్తరువాత ఆయనతో పరిచయం పెరిగింది. ఒకరోజు ఆఫీసు గేటు ముందుకువచ్చాను. లోనికి వెళదామని. ఇంతలో శర్మగారూ, శాస్త్రిగారూ డైరక్ట్‌గా హొటల్నుండి వస్తున్నట్టున్నారు. గేటు ముందు రిక్షా ఆగింది. చూస్తే వీళ్లిద్దరూ రిక్షా దిగుతున్నారు. 'బాలీ' నీతో పనుంది అన్నారు శాస్త్రిగారు. ఆగాను. శర్మగారితో అంతకుముందే ఏం చెప్పాడో "వెళ్లు వెళ్లు ఆయనతో" అన్నారు శర్మగారు. ఓ గంటలో నిన్ను "తిప్పి పంపేస్తాను, నాతోరా! అన్నారు ఈ శాస్త్రిగారు. వారు దిగిన రిక్షాయే ఎక్కాం.

సాధారణంగా నాకు మంగళ, బుధవారాల్లో నా సీట్లో మెడ తిప్పలేనంత వర్కు ఉండేది. ఆవారం వీక్లీ ముగిసే రోజది. మిగిలిన రోజుల్లో కొంత పరవాలేదు. "సరే! అదేం పనో... ఈరోజు సీట్లో పెద్దగా పనిలేదనుకొని రిక్షాలో కూచున్నాను. రిక్షా బయలు దేరింది. రిక్షా వాడు తొక్కుతూనే ఉన్నాడు. బందర్‌రోడ్‌మీదనుండి కస్తూరి బాయ్‌పేట మీదుగా ఏలూరు రోడ్‌కు వెళ్లి రామమందిరం ఎదురుగా ఉన్న అరుణా పబ్లిషర్ బాబూరావుగారితో మాట్లాడి, తిరిగి ఆసందుల్లోంచి, గొందుల్లోంచి, బందర్‌రోడ్ వైపే మల్లింది. ఈలోపు ఒక్కముక్కా మాట్లాడలేదు. లబ్బీపేటలో ఉన్న ఆంధ్రజ్యోతి ఆఫీస్ ముందునుండే బెంజిసర్కిల్ వరకూ వెళ్లాం. ఫాంట్‌జారిపోతోంది. దాన్ని పైకి లాక్కుంటూ రిక్షా దిగాడు. ఆతని వెనుక నేను...రిక్షా వాడికి డబ్బులిచ్చి పంపేశాడు.

ఎదురుగా ఉన్న కిళ్లీకొట్టు బల్లమీద కూర్చున్నాం'. అప్పుడు చెప్పాడు నువ్వు నాకు కోపరేట్ చెయ్యాలని'

ఇప్పటివరకూ చేస్తూనే ఉన్నాను. "ఏ విషయంలో?" అడిగాను.

"అదే ఆలోచిస్తున్నాను. ఎక్కడ్నించి మొదలెట్టాలా అని"

ఎక్కడ్నుంచి మొదలెట్టాలా అని ఆలోచించడానికే ఇంత టైంపట్టాలా ఈ రచయితగారికి, దానికోసం ఆఫీస్‌లో పని మానుకొని ఊరంతా ఊరేగడం నాకు విసుగ్గా ఉంది. మరి కొంచెం ఆలోచించాడు-అప్పుడన్నాడు.

"నేనోపత్రిక పెట్టాలనుకొంటున్నాను పేరు, డిక్లరేషన్ వచ్చేసింది. విశాఖపట్నంలో కొంతమంది మిత్రులు ఈ విషయంలో నాకు సహకరిస్తానన్నారు".

మంచిది-మీరు త్వరలో తీసుకు రండి

"అదే అదే -విశాఖపట్నం నుండే ప్రారంభిస్తాను దానికి నీవు బొమ్మలు వేసి పెట్టాలి. మాసపత్రిక



దీనికేనా? ఈ ప్రసవవేదన అంతా.. ఆలోచిస్తూ అనుకున్నాను. ఈయనలో ఒక్కోసారి గొప్ప అమాయకుడూ-పసివాడూ కనిపిస్తాడూ అని శర్మగారన్న మాట గుర్తొచ్చాయి. లేకపోతే నానా విధరొచ్చులను తవ్వి తలకెత్తుకోవడమేమిటి? మరో రిక్షాను పిలిచాడు. దానిలో బయలుదేరాం. తిన్నగా ఆంధ్రజ్యోతి ఆఫీసుముందే దిగాం. మధ్యలో మరే విషయమూ ఆయన మాట్లాడలేదు. హాయిగా ఊపిరిపీల్చుకున్నాను. జారిపోతున్న ఫాంట్‌ను సర్దుకొంటూ శర్మగారి కేబిన్‌లోకి వెళ్లాడు. నేను నా సీట్‌లోకి వెళ్లాను. మరుసటి రోజు శర్మగారు అడిగారు రాత్రి కొట్టిన మత్తు కళ్లతో నిన్నంతా ఆయనా, నువ్వు ఎక్కడెక్కడికి తిరిగారని

జరిగింది చెప్పాను ఆయనొక పత్రిక పెడతారట

ఆయన ఫకాలున నవ్వారు. "ఈమాట ఎప్పట్నించో అంటున్నారు కథలు రాసేవోడు ఆవేశమూ కాంక్షేగాని పత్రికను పెట్టి సక్సెస్ చెయ్యలేడు. అదొక ఊపు అంతే!... కమర్షియల్ ఆలోచనలున్నవాడే పత్రికను సక్సెస్ చేస్తాడు-అయితే వాడికి రాయడం రాదు. రాసేవాడ్ని పట్టుకుంటాడు అన్నాడు గొప్ప నగ్న సత్యాన్ని వొలకబోస్తూ.

రావిశాస్త్రిగారు ఆ తరువాతెప్పుడూ పత్రికను పెట్టినట్టు నేను వినలేదు.

నటులకు/రచయితలకు, కవులకూ కొండకచో చిత్రకారులకూ (వీరికి విదేశాలలో ఎక్కువ, ఇండియాలో తక్కువ) కొంతమంది అభిమానులు ఏర్పడతారు. ఆయా వ్యక్తుల రచన, కళలను గుర్తించి, చదివీ ఆరాధించీ, చేరువ కావాలని ఆశించీ మనసు పారేసుకుంటారు. అయితే ఆయన చెప్పిన దానికీ, చూపిస్తున్న దానికీ, ఆచరణలో పెడుతున్న దానికీ ఏ మాత్రం తేడా వచ్చినా భరించలేరు. తిట్టుకుంటూ దూరంగా జరగనన్నా జరుగుతారు లేక బలహీన మనస్కులయితే ఆత్మహత్యకూ వెనుదీయరు.

ఊహించింది వేరు. ప్రత్యక్షంగా గమనిస్తున్నది వేరయి చాల బాధపడిన వ్యక్తి, ముఖ్యంగా రావిశాస్త్రి గారి విషయంలో అనంతం అనే కుర్రవాడు.

శాస్త్రిగారి రచనలు చదివీ, ఆరాధించీ వీరభక్తుడయి, ఆయన రచనల్లోని కొటేషన్స్‌లో స్థిరాభిప్రాయాన్ని పెట్టుకొని ఏమన్నా తేడా వస్తే ఆయన్ని నలుగురిలోనూ జాడించి అడిగేవాడు అనంతం. ఆంధ్రప్రదేశ్‌లో ఆయన వీరభక్తులు చాల మంది ఉండవచ్చు. కాని అనంతం ఆయన వెనక వెనకనే తిరిగేవాడు. గమనించేవాడు, తిట్టుకొనేవాడు. నిజానికి ఇతడే అల్పజీవి. అనంతం చామనఛాయగా, పైకి దువ్విన రింగుల జుత్తుతో కొంచెం పళ్లు ఎత్తుతో (అలాకనవడేవి) సుమారు ఐదడుగుల మూడంగులాలుంటాడు. పోర్టు ఆఫీస్‌లో పనిచేసేవాడనుకుంటాను. చేతిలో ఎప్పుడూ ఏదో బరువైన పుస్తకం, ఏదో వేసుకున్నాను సుమా అన్నట్టు వంటి మీద దుస్తులూ పాలిష్ కొట్టుకొని బూట్లూ సిటీబస్ స్టేండ్‌లలో నిలబడి ఇంకా బస్ రాకపోతే నిలబడే రెండు కాళ్లను క్రాస్‌గా పెట్టి పుస్తకం పేజీలు తిరగేసేవాడు. పక్క వాళ్లతో మాట్లాడాలనుకొంటే ఆ పుస్తకం అతని చంకలోకి దూరిపోయేది. ఇక పుస్తకంలో పెన్సిల్‌తో అండర్‌లైన్లు గీయడం తన అభిప్రాయాన్ని పుస్తకంలో ఓ మూలరాయడం అతని అలవాటు.

అతడికి మిగిలిన రచయితల గురించి అభిమానం, ఆరాధనా తెలియవుగాని రావిశాస్త్రి అంటే వల్లమాలిన అభిమానం. వారానికి ఓ రెండు సార్లు అయినా ఆయన్ని కలిసేవాడట. కలిసినపుడల్లా ఆయన మీద కేకలే! అతడొస్తున్నాడంటే రావిశాస్త్రి హడలిపోయేవాడట- అలా వచ్చి ఆయన్ని ఇబ్బంది పెట్టవద్దని అనంతానికి చాలమందితో చెప్పించాడట. కానీ అనంతం వినలేదు. అలా చెప్పిన వారిలో పురాణంగారు ఒకరు, "ఏదో రాస్తాం అలా రాసినట్టే ఆచరించమని కాదుగా. ఆయనా మనిషే, మనిషికుండే బలహీనతలు ఆయనకూ ఉన్నాయి. నువ్వు ఆయన రచనలు చదివీ, ఆక్షేషియన్ డాగ్‌లా వారానికోమారు ఆయనపై పడితే ఎలా? భయపడుతున్నాడు.

అయినా అనంతం వినలేదు.

“రావిశాస్త్రిగారు ఎవ్వరికీ భయపడలేదు అత్యయిక పరిస్థితిల్లో జైల్లో పెట్టినపుడూ అంతే! ఒక్క అనంతానికి తప్ప “పురాణం గారు ఇదంతా మాకు చెప్పి నవ్వేవారు.

విశాఖపట్నం వీధిల్లో అనంతాన్ని నేనూ చూశాను.

మీటింగ్‌ల్లో కలిశాను కూడా. తరువాత చాల చిన్నవయసులోనే అనంతం అనంతలోకాల్లోకి వెళ్లిపోయాడు. ఒకసారి నేను నా స్వంతపనిమీద విశాఖపట్నం వెళ్లి ఆ పనులన్నీ చక్క బెట్టుకొని విజయవాడ తిరిగి వెళ్లిపోదామని విశాఖపట్నం స్టేషన్‌కు వచ్చాను. మధ్యాహ్నం రెండు గంటలయ్యింటుంది. ట్రయిన్‌లో కనీసం నిలబడ్డానికన్నా చోటు లేదు. విపరీతమయిన రష్. దానికి తోడు ఉక్కపోత. బేగ్ భుజాన్న వేసుకుని ఫ్లాట్‌ఫామ్ మీద తచ్చాడుతున్నాను. రావిశాస్త్రిగారూ, ఆయన పక్కనో అమ్మాయి చాల కంగారుగా ఫ్లాట్‌ఫాం మీదకు వచ్చారు. ఆయన చేతిలో పెద్ద బ్యాగ్ ఉంది. దాన్ని మోయలేకపోతున్నాడు. చాల బరువుగా ఉన్నట్టుంది. ఆయన పక్కన నడుస్తున్న అమ్మాయిని గుర్తుపట్టాను. తలకు పూల, పూలస్కార్ఫ్ కట్టుకున్న అమ్మాయే ఈమె. అయితే ఇప్పుడీమె తలకు పూలస్కార్ఫ్, ఎర్రని గీతులున్న స్కార్ఫ్ ఉంది. ఎంతయినా పెద్దవాడు. పాపం పేరున్నవాడు. ఎదురెళ్లి విజయవాడ గాని వస్తున్నారా సార్! అన్నాను.

నేను ‘బకరా’ను అయిపోతున్నానని మరచిపోయాను. ఆయన చుట్టూ చూసి ‘ఈ అమ్మాయి మావాళ్లే! సామర్లకోట వరకూ వస్తుంది. ఏదన్నా ఓ సీట్ ఖాళీగా ఉంటే బాగుంటుంది. టీసీని అడగ గలవా నా పేర్న అన్నాడు. అంతా లాయర్ తెలివి.

నేను టీసీని కలిసి అంతా చెప్పి “రావిశాస్త్రిగారి బంధువు. ఆమె ఒక్కరికీ ఒక్క సీటు ఇప్పించగలరా” అనడిగాను.

వాడు నన్ను ఎగా దిగా చూసి “రావిశాస్త్రా! వాడెవడూ” అన్నాడు. బిక్కచచ్చిపోయాను.

ఇదంతా ఈయనకు చెబితే బావుండదని సీట్లు లేవటసార్ అన్నాను. నేను విజయవాడ వెళుతున్నానని తెలుసుకొని అయితే సరే ఈ అమ్మాయి సామర్లకోటలో దిగిపోతుంది. గెద్దనాపల్లి పరిషత్ పోటీలకు వెళ్తుంది. వీళ్ల ట్రూప్ రావాలి. వచ్చారో లేదో తెలీదు. అంతవరకూ నువ్వు కొంచెం ఎక్కడన్నా చోటు చూసి కంపెనీ ఇయ్యి అన్నాడు. అప్పటి వరకూ తాను మోస్తున్న బ్యాగ్‌ను ఆమెకిచ్చాడు. సరేనన్నాను.

ఎదురుగా ఉన్న బోగీలో ఎలాగో సర్దుకున్నాం. బ్యాగ్ కిందవేసి దానిపై కూర్చుంది. నేను నిలబడే ఉన్నాను. కాళ్లు నొప్పి పెట్టినపుడల్లా కాలుమార్చి కాలు మీద నిలబడి ఆమె మాటలు వింటున్నాను. బండి బయలుదేరింది.

ఆమె చక్కని నటి. చాల పరిషత్తులలో పాల్గొంది. ఒక్కో నాటకంలో పాతిక సార్లైనా పాల్గొంది. ప్రాక్టీస్ అవసరం లేదు. అవార్డులూ పొందింది. ప్రస్తుతం అలాంటి పోటీ డ్రామాకే వెళుంది. సాదాసీదా అమ్మాయి. గొప్ప అందగత్తేం కాదు. కనుముక్కు తీరు బాగుంటే సిన్మాలోకి చెక్కేసేదేమోగాని, ఆమె మాటల్లో సిన్మాలంటే అంత ఇష్టం లేదని చెప్పింది. రావిశాస్త్రి గారు ఎంత మంచివారంటే అని మొదలు పెట్టి ఎంత బాగా చూసుకుంటారో చెప్పింది. తాను నాటకరంగంలో ఉండటం వల్ల చాలమంది మగవాళ్లు తనమీద నెట్ వేయబోయారని వాళ్లనెలా మట్టి కరిపించిందీ చెప్పింది. తానూ ఓ బ్రాహ్మణుల ఇంటపుట్టాననీ, అందువల్ల కులం వల్ల కలిగే గొడవ తమ మధ్య లేదని, గుంటూరు జిల్లాలో ఏదో ఊరిలో పుట్టినా విధివశాత్తూ విశాఖపట్నం రావలసి వచ్చిందనీ, ఇక్కడొక గురువుగారు తనను కలిసి డ్రామాల్లో తర్ఫీదు ఇచ్చారనీ, వారి చలువల్లే తానో నటిగా తయారయ్యాననీ, పైగా తన పవిత్రతను, డిసిప్లిన్‌కు రావిశాస్త్రిగారు గమనించీ తన ప్రాపంకలోకి తీసుకున్నారని ఎంతో ఆనందంగా చెప్పింది. నేను విశాఖపట్నంలోనే స్థానికంగా ఉన్న మరో డ్రామా నటి గురించి అడిగాను.

ఇక్కడొక విషయం చెప్పాలి. ఈ రెండో ఆమె అసలు పేరు నాకు తెలుసు. మారుపేరు సీత అని అనుకుందాం. ఆమెతోను నటించాను. ఆమె అంటే నాకు గౌరవం. సీతకు ఆ పాత్ర కొట్టిన పిండి.

అందువల్ల రిహార్సల్స్‌లో నాకు చాలా విషయాలు చెప్పింది. అవన్నీ మెలకువలు, డైలాగ్ మరచిపోతే గుర్తుకు తెచ్చుకొనే పద్ధతులున్నూ. అందులో ఆమె సహకారం మరువలేను.

మేం కేవలం రెండు రోజుల్లో కొన్ని గంటలే కలిశాం. రెండే రిహార్సల్స్ వేశాం!! ఇపుడీ సీత గురించే ఈమె నడిగాను.

“అబ్బో మీరంటున్న సీత గురించి చెప్పుకోవడం” మహా పాపం అంది “ఏం?” అన్నాను.

అయ్యో నెమ్మదిగా అంటున్నారు. అన్ని విధాల నెలకెంత సంపాదిస్తుంది అనుకున్నారూ... అబ్బో! ఈ విశాఖపట్నం, అస్సాం గార్డెన్స్‌లో పెద్ద మేడే కట్టింది” అంది.



నేనేం మాటాడలేకపోయాను అప్పటికీ ఆ సీతను చూసి చాల సంవత్సరాలు అయిపోయింది కాబట్టి ఆమెను గుర్తుతెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ ఆలోచిస్తున్నాను.

స్వతహాగా నాకు కొంచెం సిగ్గుఎక్కువ. దానికి తోడు స్టేజ్‌ఫియర్ కూడ. అయితే ఇవి నేను జయించాలి. అయితే ఆ "తాండవ డామ్ సైట్"లో నేను పనిచేస్తున్నప్పుడు జగన్నాథ్ అనే మహానటుడు ఉండేవాడు. అతడు నిజంగా మహానటుడే గానీ వ్యసనాలు వల్ల ఆగిపోయాడు. విశాఖపట్నం ఆంధ్రాయూనివర్సిటీ కె.వెంకటేశ్వరరావుగారి శిష్యరికంలో చాలా డ్రామాలు ఆడేనని చెప్పేవాడు. నమ్మవచ్చు. సరుకుంది. కానీ నిలకడ తక్కువ. నా మాడ్యులేషన్ టెస్ట్ చేసి నన్ను ఓ నాటకంలో బుక్‌చేశాడు. ఆ నాటకం పేరు "కొడుకుపట్టాలు". బాగా రిహార్సలు చేశాం. నాకున్న భయంపోయింది. ప్రాంప్టింగ్ అవసంరలేదు. నేను ఆ నాటకంలో బాగానే చేశానన్నారందరూ. అందులోని ముసలివేషం నాది. అపుడే సీతతో పరిచయం. హీరోయిన్ సీత. ఆ తరువాత సంవత్సరం మరో నాటకం వేశాం. భమిడిపాటి రాధాకృష్ణగారి 'దంతవేదాంతం'. ఇందులో హీరో కేరక్టర్ వేశాను. పిఠాపురం నుండి హీరోయిన్ వచ్చింది. ఆమెకు డైలాగులు రావు. ఏదో అయ్యిందనిపించింది. ఈ అనుభవమే తరువాత రోజుల్లో సినీమా అవకాశాలు వస్తే వేశాను. చిన్న చిన్న వేషాలు. చాల చిన్న వయస్సులో ఇంకా సినీ ఫీల్డ్‌కి వెళ్లకముందే తను రాసిన నవల ఆంధ్రజ్యోతిలో సెలక్ట్ అవడం వల్ల అది ఎప్పుడు మొదలు పెడతారో తెలుసుకోవడానికి ఉత్సాహంతో వచ్చిన నేటి మేటి దర్శకుడు "వంశీ". నన్ను "అన్నయ్యా" అని ప్రేమతో పిలుస్తూ చాల ఉత్తరాలు రాశాడు. అతను దర్శకత్వం వహించిన 'లింగబాబు లవ్ స్టోరీ'లో వేషం వేశాను. అలాగే ఉమామహేశ్వరరావుగారు దర్శకత్వంలో మరో పిక్చర్ (పూలపల్లకీ)లో నటించాను. ఈయనే డైరక్ట్ చేసిన 'ఆడది' అనే పిక్చర్‌కి చాల ఆర్ట్ వర్క్ చేశాను. సంగీతం శ్రీనివాసరావుగారు దర్శకత్వం వహించిన 'తరంమారింది'కి ఆర్ట్ వర్క్ చేశాను. తిరిగి వంశీ తీసిన మరో పిక్చర్‌లో నటించవలసిందే. అది మొత్తం ఏలూరులో తీశారు. అయితే నా చేతిలో వర్క్ హెవీగా ఉండటం వల్ల టైం కుదరలేదు. వెళ్లలేకపోయాను.

నాకు సినీమాల్లో నటించి ఏదో చేయాలని కాదు. ఆ హడావుడీ, ఆ పద్ధతీ తెలుసుకొని దాన్ని నా బొమ్మల్లో ఉపయోగించుకొనే అనుభవం కోసమే! బండి నడుస్తూనే ఉంది. నాకు సీటు దొరకలేదు. కాలు నొప్పెడుతున్నప్పుడల్లా మరో కాలుకు మారుతూనే ఉన్నాను. ఈమె మాటల్లో ముఖ్యమైనది ఏమంటే "త్వరలో వారో ఇంటివారవ్వడం", ఆమె మాటలన్నీ చాల వరకూ శాస్త్రిగారి చుట్టూ తిరిగాయి.

బండి సామర్లకోటకు చేరుకుంది.

ఈ నటి దిగిపోయింది. "నేను వస్తానండీ!! రేపు రాత్రికే నాటకం, ధ్యాంక్స్" అంది. ఇంతలో

"ఏటీ –ఇక్కడున్నావా!! వచ్చావా లేదా అని భయపడుతున్నామనుకో–ఒరేయ్ సూరీ! పక్క బోగీలోనే ఉందిరా, మన హీరోయిన్ ఎవడో నవ్వుతూ అరిచాడు. బిలబిలమంటూ ఓ డజన్ మంది ఈమె చుట్టూ మూగారు పెద్ద పెద్ద బేగ్‌లతో ఈ హీరోయినూ వాళ్లతో నవ్వుతూ, వీరే నాకింతవరకూ కంపెనీ ఇచ్చారని నన్ను పరిచయం చేసి అందులో ఒకడి భుజాన్న తన బేగ్‌ను తగిలించింది. వారు బయలుదేరారు. నేను తిరిగాను. రైలెక్కాను సీటుకోసం తిరిగి వెతుక్కోవడం ఇవన్నీ మామూలే!

రావిశాస్త్రిగారు విజయవాడ వస్తే పురాణంగారు ఇద్దరో ముగ్గురో ముఖ్యులయిన వ్యక్తులకు ఫోన్ చేసేవాడు. వారంతా ఆయనకు ప్రాణమిత్రులే కాక, అభ్యుదయవాదులూ, ఆదర్శ భావాలు గల వారయ్యింటారు. లేక అలా మనకు వినిపిస్తారు. వారిని వీరూ, వీరిని వారూ కీర్తించుకుంటారు. అయితే ఆయన ఇలా వస్తున్న సంగతి (రావిశాస్త్రిగారు విజయవాడ రావడం) ఈయనతో పాటు మరో ముఖ్యమైన వ్యక్తికే ఫోను వెళ్లేది. ఆయన అరుణాపబ్లిషింగ్ ప్రెస్ ఓనర్ "బాబూ రావుగారు". పూర్తిపేరు బెల్లం బాబూరావుగారు. ఆయన పేరులోనే 'బెల్లం' ఉంది కాబట్టి చీమలు చేరడం మామూలే! ఈ బెల్లం బాబూరావుగారు చేయవలసిన పని ఏమిటయ్యా అంటూ రావిశాస్త్రిగారికి ఇష్టమైన హెూటల్‌లో ఇష్టమైన రూం తీసి ఉంచడం ( కొన్ని హెూటల్ శుభ్రంగా ఉండి బాత్‌రూం దగ్గరిగా అదుబాటులో ఉంటుంది. ఎవడన్నా తాగి కక్కినా, రూం బాయ్ అందుబాటులో ఉంటారు. వెంటనే క్లీన్ చేస్తారు. క్రింద రిసెప్షనల్‌లో కూర్చుని వస్తున్న అతిథుల్ని సంతోషంగా చిరునవ్వుతో పలకరించి శాస్త్రిగారు బసచేసిన రూం నెంబర్ చెప్పడం. మద్య, మధ్యలో (మద్యే మద్యే పానీయంలాగ) లేచి వెళ్లి ఆ రూంలోని వారికి ఏఏ మార్క్ సీసాలు కావాలో, దాంతో ఏఏ తినుబండారాలు కావాలో తెలుసుకొని, ఆయా చెత్తని లోనికి పంపడం, తాగి తాగి, వాగి వాగి అర్ధరాత్రయి, కొంపలూ, కొంపల్లో వీరికోసం కనిపెట్టుకొని ఉండే పెళ్లాలూ గుర్తుకి వచ్చీరానట్టుంటే, ఆ గదిలోకి బాబూరావుగారు చేరి ఒక్కొక్కడ్నీ కిందకు జాగ్రత్తగా దింపి, రిక్షాలో కూలేసి, ఆ రిక్షా వాడికి ఈ శాల్తీని ఎక్కడ దింపాలో వివరించి, ఒక వేల ఆ రిక్షవాడు పాతవాడూ, పరిచయమున్న వాడూ అయితే సగం తలనొప్పి వదిలిందిరా! అనుకుని వాడి జేబులో బాడుగ డబ్బులు వేసి ఇళ్లకు పంపడం.

"ఇక ఇప్పుడు ఇంటికి వెళ్లను, పెళ్లం తిడుతుందీ లేక ఇప్పుడు ఇంటికెళ్లిమాత్రం చేసేదేముందీ, ఏదో ఇక్కడే పడుకుంటానూ" అనేవాడికి , శాస్త్రిగారితో పాటే మొల మీద లుంగీలు సర్ది, టేబుల్ మీద సీసాలూ, సగం సగం మిగిలిన ఎంగిళ్లూ సర్ది, హెూటల్‌వాడికి ఈ సగం, సగం ఎగిరే జీవుల్ని అప్పచెప్పి వెళ్లడం బాబూరావుగారి పని.

ఇదంతా ఈ వెర్రి బాబారావుగారు ఎందుకు నెత్తిన వేసుకొంటున్నాడయ్యా అంటే దానికీ ఓ కారణం ఉంది. బాబూరావుగారు నిదానస్తుడూ, నమ్మకస్తుడూనూ. ఆయన తండ్రిగారూ అంతే!

మామూలుగా ఆయన నటుడే గానీ నిజజీవితంలో కాదు. చాల నాటకాల్లో నటించారని విన్నాను.

రావిశాస్త్రిగారు ఏం రాసినా, అంటే ఏ కథలు రాసినా, ఏ నవలలు రాసినా అది అచ్చు వేసి, అమ్ముకొనే పెటెంట్ ఈయనకే ఉంది. అలా అది ఎప్పుడో దాఖలైపోయింది. దానికోసం ప్రత్యేకంగా శాస్త్రిగారి పర్మిషన్ తీసుకోనవసరం లేదు. చేసుకున్న వాళ్లకు,

*నేను అనకాపల్లిలో ఫోర్త్‌ఫారం చదువుతున్నప్పుడే 'కృష్ణా పత్రిక', 'ఆంధ్రపత్రిక' లాంటి వాటిలో చిన్న చిన్న బొమ్మలు వేసేవాడిని. అవి సింపుల్ రేఖాచిత్రాలు, పండగ వాతావరణం స్ఫురించేవి లేక రైతాంగజీవనం గురించి తెలిసేవి మాత్రమే.*

చేసుకున్నంత మహదేవా అన్నట్టు, అమ్ముకున్నంత ఆదాయం బాబూవారుగారి కందుతుంది. శాస్త్రిగారికి జనంలో ఏలుకుబడీ, పురాణంగారిచ్చే పబ్లిసిటీ ఎలాగూ ఉండనే ఉంది. అయితే బాబూరావుగారు ఇదిగోనండి మీ రెమ్యూనరేషన్" అని ఆయనకేం ఇవ్వక్కర్లేదు. అవసరం కలిగినప్పుడు ఇదిగో ఇలా హెూటల్ ఖర్చులూ, విశాఖపట్నం పోయే బస్ ఖర్చులూ (ఆయనెప్పుడూ బస్‌లోనే వైజాగ్ వెళ్లేవారు) పెడితే చాలు.

ఆంధ్రజ్యోతి నుండి నేను తప్పుకున్న తరువాత వీరి గురించి నాకే విషయాలూ తెలియలేదు. శాస్త్రిగారూ ఆ తరువాత కొత్తగా ఏం రాసినట్లూ లేదు.

విజయవాడలో నేను కొంచెం స్థిరమయ్యాక మచిలీపట్నం వెళదామనుకున్నాను. ఎందుకంటే నేను అనకాపల్లిలో ఫోర్త్‌ఫారం చదువుతున్నప్పుడే 'కృష్ణా పత్రిక', 'ఆంధ్రపత్రిక' లాంటి వాటిలో చిన్న చిన్న బొమ్మలు వేసేవాడిని. అవి సింపుల్ రేఖాచిత్రాలు, పండగ వాతావరణం స్ఫురించేవి లేక రైతాంగజీవనం గురించి తెలిసేవి మాత్రమే. నేనో ఆర్టిస్టును అని చెప్పే ధైర్యం మాత్రం లేదు. అయితే నా సహ విద్యార్థులకు మాత్రం కొద్దిగా తెలుసు. ఈ సంగతి ఎలా

తెలిసిందో గానీ మా క్లాసుటీచర్. చలపతిరావుగారికి మాత్రం తెలిసింది. ఆయన నిక్‌నేమ్ 'పొడుంపట్టు'గారని. సాయంకాలానికల్లా చిన్న డబ్బాముక్కుపొడుం, ఆయన ముక్కులోకి పోయేది. అందువల్ల ఆయన మీసాలు ఎర్రబడిపోయి, పంచె చివరితో ముక్కు తుడుచుకోవడం వల్ల అదంతా మకిలిపట్టి ఉండేది. ఆయన పక్కన ఇలబడలేం పొడుకంపు, ఆయన మాకు ఇంగ్లీషు, సోషల్ స్టడీస్ చెప్పేవారు. ఇంగ్లీష్‌లో మంచిదిట్ట. ఆయన మా కాంపోజిషన్ పుస్తకాలు దిద్ది ఇచ్చాడంటే క్లాసందరూ తుమ్మాల్సిందే. పేజీల మద్యే ఆయన కార్చిన ముక్కు పొడుం మరకలు, గుండ. అక్షరాలు, ముక్కు చీమిడితో చెరిగి ఉండేవి. పేజీలు తిప్పుతోంంే టే ఆ ఘాటు మా ముక్కుల్లోకి దూరి తుమ్ములు వచ్చేవి. ఈ దిక్కుమాలిన అలవాటు తప్ప ఆయన మంచివాడు. పాఠాలు సులభంగా ఎలా అర్థం చేసుకోవాలో విడమరచి చెప్పేవాడు. ఆయనొక మారు నన్ను పిలిచి నువ్వు శంకర్రావు, అనకాపల్లి అని పేపర్లలో బొమ్మలు వేస్తుంటావు కదరా! అన్నాడు. అవునని తల ఊపాను.

"మా ఇల్లు తెలుసు కదూ రేపొద్దున్న మా ఇంటికోమారు రా ఆ పక్క వాళ్లెవరో నిన్ను అడుగుతున్నారు" అన్నాడు. సరే! ఆ రెండోరోజు ఆయనడిగినట్టే వారింటికి వెళ్లాను. నన్ను చూడగానే ఆయన వీధిగుమ్మంలో చాపపరిచి లోపలికి వెళ్లి ఓ కొత్త వ్యక్తిని వెంటపెట్టుకు వచ్చారు. ఆయన్ని నాకు పరిచయం చేశారు. ఆయన పొట్టిగా తెల్లగా ఉన్నాడు. చాపమీద ఇద్దరం కూర్చున్నాం. ఆయన పేరు. "వి.వి. ఠోణపే" మహారాష్ట్రియన్. ఆయన పుట్టినదీ పెరిగినదీ అంతా ఆంధ్రాలోనే. బందర్‌లో స్థిరపడ్డాడు. డ్రాయింగ్ మాష్టారుగా అక్కడ పనిచేస్తున్నారనుకుంటాను. పత్రికల్లో నా బొమ్మలు చూడడం వల్ల ఈ అనకాపల్లిలో వారి బంధువుల ఇంటికివచ్చి మా మాష్టారుతో ఏదో మాటల సందర్భంగా నా పేరు చెబితే "అతడు మా క్లాసులోనే ఉంటాడని'' మేష్టారు అనడం నన్ను ఇలా పిలవడం జరిగిందన్నమాట!

ఆయన నా బొమ్మలు గురించి ప్రశంసిస్తూ మాట్లాడేరు. చాలా వ్యాసాలూ ఆర్ట్ గురించి వ్రాసారు. అవన్నీ చూపించారు. ప్రస్తుతం ఈ అనకాపల్లి ఎందుకొచ్చారంటే ఈ వూరుకి దగ్గర్లోనే బొజ్జన్న (బుద్ధన్న) కొండ అని బౌద్ధ స్థూపం ఉంది. దాన్ని పరిశీలించాలనీ, వీలయితే ఫొటోలుతో ఓ వ్యాసం తయారుచేయాలనీ ఆయన ఆలోచన. పనిలో పనిగా నన్నూ చూడ్డం.

చాలా సేపు ఆర్ట్ గురించి మాట్లాడారు. బందర్‌లో తన ఆర్ట్‌స్టూడియో ఉందనీ, ఎప్పుడయినా అటు వస్తే వారింటికి రమ్మనమనీ అడ్రస్ ఇచ్చారు. మరో ముఖ్యమయిన విషయమేమంటే త్వరలోనే బందర్‌లో ఆర్ట్ ఎగ్జిబిషన్‌పెట్టబోతున్నామనీ, దాని కోసం నా పెయింటింగ్‌లు ఏమన్నా ఉంటే పంపమని చెప్పారు.

శెలవు తీసుకొని ఇంటి ముఖం పట్టాను. మరో పదిరోజుల్లో ఓ మూడు వాటర్‌కలర్ పెయింటింగ్‌లు చిన్న సైజుల్లో వేసి పంపాను. ఓ నెల తరువాత ఆయన నుండి సమాధానం, మనీఆర్డర్ వచ్చాయి. నేను గీసి పంపిన మూడు పెయింటింగ్‌ల్లో, రెండు కృష్ణా జిల్లా కలెక్టర్‌గారు కొన్నారు. ఇవేనా మొదటి పెయింటింగ్‌లు అమ్మకం. సంతోషమేసింది. ఆయనకూ నాకు మధ్య కొన్నాళ్ల పాటు ఉత్తరప్రత్యుత్తరాలు నడిచాయి.

అయితే 'ఠోణపే' గురించి ఆ తరువాత ప్రయత్నించాను. ఆయన పోయారని తెలిసింది. కానీ ఎలాగూ విజయవాడకు ఇన్నాళ్ల తరువాత వచ్చాను. ఆయన ఇచ్చిన పాత ఎడ్రస్‌లో వెతికితే! ఆయన గీసిన బొమ్మలు చూడవచ్చు అని వెళ్లాను. నాకు తెలుసున్న వారితో అడిగించాను. ఎవరూ చెప్పలేకపోయారు. అది 'జపాన్‌మేడ అనే ప్రాంతం' బందర్ పట్టణంలో అలాగే అప్పటిలో జరిగిన మరో సంగతి గురించి చెప్పుకోవాలి! నేను గీసిన చిన్న చిన్న బొమ్మలు పత్రికల్లో వచ్చేవి అని చెప్పాను కదా! అలా ఒకసారి మా అనకాపల్లిలో కొంచెం ప్రత్యేకంగా కనపడే గ్రామీణ యువతుల్ని దృష్టిలో పెట్టుకొని అనకాపల్లి పడుచులు అనే బొమ్మలు గీసాను. ముక్కుకి బంగారు పోగులు, చెవులకు నాగజోడ్లు, ఎత్తుగొలుసులు, పక్క కొప్పులు, కొప్పుల మీద బంతిపూలు, మెడలో కుత్తిగంటు, పట్టెడు, నల్లపూసలు, నాను గొలుసు ఇవన్నీ మెడకు అలంకారాలు, (ఇవే అలంకారాలతో వడ్డాది పాపయ్య గీసాడు. అనకాపల్లి పడుచు అని) ఇవి కృష్ణాపత్రికలో వచ్చాయి. సంతోషించాను. అంతవరకే నాకు తెలుసు. అయితే ఈ నా బొమ్మల్ని మరో వ్యక్తి (చిత్రకళాభిలాషి) గమనిస్తున్నాడని నాకు తెలియదు. ఆయన 'ఝూర్స్‌గూడా'లో (ప్రస్తుతం ఝార్ఖండ్) ఉంటారు. ఆయన నా బొమ్మల్ని పత్రికల నుండి కత్తిరించి జాగ్రత్త చేసి, హిందీ పత్రికల్లో ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యంగా విశాఖ ప్రాంతం గురించి వ్యాసం వ్రాస్తూ ఈ బొమ్మల్ని అందులో పొందుపరిచారు. ఇలా నా బొమ్మలుతో రెండు మూడు ఆర్టికల్స్ వచ్చాయి. ఆయన వాటి కాపీలను నాకు పంపారు. (తెలుగుపత్రికాఫీసులనుండే నా ఎడ్రస్‌ను సంపాదించారని తరువాత తెలిసింది). ఆయనెవరో నాకు తెలియదు. మరో ట్రిప్‌లో ఆయన నుండి పెద్ద రిజిస్టర్ కవరే వచ్చింది. అందులో ప్రసిద్ధ చిత్రకారులయిన రవిశంకర్‌రావల్, ఏ.ఏ. ఆలమేల్కర్, ఎన్.ఎస్

బెంద్రేల బొమ్మలు, సావనీర్‌లూ వచ్చాయి. తీరిక దొరికినపుడల్లా వారి పద్ధతులూ, కంపోజింగ్‌లూ రంగుల పోకడలూ గమనించాలని ఆ సావనీర్‌లును తిరగేసేవాడిని. వీటిని చూసి మీ ఆర్ట్‌కి ఇంకా మెరుగులు దిద్దుకోండి అని వాటితో జతచేసి పంపిన వారి ఉత్తరంలోని మాటలు నిజమయ్యేవి. అలా

ఆ తరువాత రోజుల్లో ఆయన నుండి ఉత్తరాలు ఆగిపోయాయి. ఎటువంటి పుస్తకాలూ రాలేదు. ఈ మధ్యలో చాల సంవత్సరాలు గడిచాయి. తిరిగి నేను విజయవాడ వచ్చిన తరువాత "ప్రజాసాహితి" పత్రికతో పరిచయమేర్పడింది. ఆ పత్రిక సంపాదకులు మా ఇంటికి వచ్చి అవసరమయిన బొమ్మలు గీయించుకోవడం మొదలెట్టారు. అలా వచ్చి వారు "నిర్మలానందగారు". ఆయన ఆ పత్రికకు ఆరోజుల్లో కొన్నాళ్ళు సంపాదకత్వం వహించారు. ఓ రోజు నా టేబుల్ ముందు కూర్చుని ఆ మాటా ఈమాటా చెబుతూ వారి స్వస్థలం శృంగవరపు కోట అని అనకాపల్లిలో రెవెన్యూ శాఖలో పనిచేసానని ఆ రోజుల్లో నా మేనమామలతో (మా మామయ్య రెవెన్యూలో పనిచేశారు) తానూ పనిచేశానని ఆ తరువాతే రైల్వే డిపార్ట్‌మెంట్‌లో సెలక్ట్ అయి వెళ్లిపోయానని 'ఝూర్స్ గూడా'లోనూ ఆ చుట్టు పక్కలా చాలా చోట్ల పనిచేశానని చెప్పారు. ఆ రోజుల్లోనే ఆయన నా బొమ్మలను సేకరించి ఎన్నో హిందీ వ్యాసాలలో వాటిని ఉపయోగించి మన తెలుగుతనం, కట్టూ బొట్టులను వారికి పరిచయం చేశానని చెప్పారు. నేను ఆ రకంగా ఆయనకు ఉపయోగపడినందుకు సరదా వేసింది. ఇక అప్పట్నించి ఆయనను 'మామయ్యా' అనే పిలవడం మొదలెట్టాను. ఆయనా సరదాపడ్డాడు. ఇప్పటికీ అదే పిలుపు.

ఉత్తమాభిరుచులు గల వ్యక్తులు, వ్యక్తిగత పరిచయాలు లేకపోయినా ఎలా స్పందిస్తారనడానికి ఇదే నిదర్శనం.

అనకాపల్లి నర్సింగరావుపేటలో ఉన్న మా ఇంటివీధి కొట్లో (అదే ఆ రోజుల్లో నా స్టడీస్‌రూమ్+స్టూడియో) ఏదో రాసుకొంటున్నాను. గవరపాలెం నుండి నాకు తెలిసిన అప్పారావు అనే వ్యక్తి ఎవరినో వెంటపెట్టుకు వచ్చాడు. ఈయనే 'శంకర్రావు' అని ఆ వ్యక్తికి నన్ను పరిచయం చేశాడు. ఆ కొత్త వ్యక్తికి పరిచయం చేశాడు నాకు. ఆయన పేరు 'సూరిశెట్టి సాంబశివరావు బాబ్జీ'. నన్ను చూడగానే ఆ బాబ్జీగారు ఆనందంగా ముఖంపెట్టారు. నా బొమ్మలు పేపర్లలో చూస్తున్నానన్నారు. 'అలాగా' అన్నాను. అసలు విషయమేమంటే ఈ బాబ్జీగారు 'బాలమిత్ర' అనే పాపులర్ చిన్న పిల్లల పత్రికను ఎడిట్ చేస్తారట. అది ఇక్కడ్నించే జరుగుతుంది. కథలు సెలక్ట్ చేసి మద్రాస్ పంపుతారట. అక్కడ 'బాలమిత్ర' ఆఫీస్‌లో ఉండే వారి స్టాఫ్ ఆర్టిస్ట్ వాటికి బొమ్మలు వేస్తే అక్కడుండే రెసిడెంట్ ఎడిటర్ వాటిని పత్రిక పేజీల్లోకి వచ్చేట్టు చేస్తాడు.

బాబ్జీగారు తన చేతిలో ఉన్న పేపర్ల కట్టను నా ఎదురుగా ఉన్న బల్లపై పెట్టి తెరిచారు. అవన్నీ చిన్న చిన్న కథలు వారి స్టాఫ్ ఆర్టిస్ట్ 'చలం' అనే ఆయన వేసిన బొమ్మలు. ఆ బొమ్మలపై కలర్ ఇండికేషన్ చేసిన మార్క్స్ ఉన్నాయి. "మీరిలా వెయ్యగలరా! పెద్ద కష్టం కాదు. ప్రయత్నించండి. కథలు మద్రాస్ పంపి కంపోజ్ అయిన బొమ్మలు వేయించేసరికి ఆలస్యమయిపోతోంది అందుకు" అన్నాడు.

"ఊ... అనండి ఈ కథలన్నీ మీకు ఇస్తాను" అన్నాడు.

'చలం' అనే ఆర్టిస్ట్ వేసిన ఒరిజనల్ చిత్రాలు చూస్తున్నాను అలా నేను వెయ్యలేను... నాకంత ప్రాక్టీస్ లేదు. తీరా ఒప్పుకొన్నాక బాగా వేయలేకపోతే బావుండదు.

"చేతులెత్తేసాను. నేను వయ్యలేను" అని.

ఆయన చాలా డిసప్పాయింట్ అయిపోయాడు. "సరే! రేపు మళ్లీ వస్తాను. మీరు మాతో మా ఇంటికి రావాలి. అన్నాడు. అలాగే అన్నాను.

నాకు పత్రికల్లో బొమ్మలు వేసే అవకాశం రావడం ఇదే మొదలు. అయితే భయంతో న్యాయం చేయలేనేమో అని వదులుకున్నాను అప్పటిలో.

ఆ మరసటి రోజు వారు కోరినట్లు బాబ్జీ గారింటికి గవరపాలెం వారితో వెళ్లాను.

ఆయన ఇల్లంతా పెయింటింగ్‌లమయం. అవన్నీ వడ్డాదిపాపయ్యగారి ఒరిజనల్ బొమ్మలు. ఎన్నో కొలతలతో, కళ్ళు చెదిరపోతున్నాయి చూస్తున్నకొద్దీ.

వారూ వీరూ ఫ్రెండ్సట.

ఋతువుల గురించీ, అష్టవిధానాయికల గురించీ వేసిన బొమ్మలవన్నీ ఏదీ నాలుగడుగులకు తక్కువలేదు. వేస్ట్‌గా పక్కన పడవేసే "టీ" ప్లయివుడ్ చెక్కబల్లలను శుభ్రంచేసి వేసిన పెయింటింగ్‌లు అవన్నీనూ. బాబ్జీగారు రైల్వేలో పనిచేసేవారనుకుంటాను. ఖర్గపూర్‌కీ, అనకాపల్లికీ మధ్య తిరుగుతుంటారు. ఆ తరువాత రోజుల్లో పాపయ్యగారు ఇవే సబ్జెక్ట్‌ను, యువమాసపత్రిక. రెండు మూడు కవరు పేజీలమీద ఋతువులనీ, అష్టవిధనాయికలనీ, ఒక సిరీస్‌గా ప్రకటించారు.

# కాగితంతో కళాఖండాలు


సబీనా కార్నిక్

సమ్‌'థింక్ స్పెషల్

అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ...

కాదేదు కవితకనర్హం అని శ్రీశ్రీ అన్నట్లు..

నేడు కళ కొత్త పుంతలు తొక్కుతుంది.

నూతన ఆవిష్కరణలతో సృజనకు ఆకాశమే హద్దు. రంగుల కాగితాలను అతికించి (2డి) చిత్రాలను రూపొందిస్తే అది కొలేజ్ ఆర్ట్.

అదే రంగుల కాగితాలతో 3డైమెన్షన్లో చిత్రాలను రూపొందిస్తే అది పేపర్ స్కల్ప్చర్.

ముంబయికి చెందిన సబీనా కార్నిక్ వృత్తిరీత్యా గ్రాఫిక్ డిజైనర్. స్వహతాగా మంచి చిత్రకారిణి కూడా. ఇంకేముంది హేండ్‌మేడ్ పేపర్‌ను కత్తిరించి తన సృజనాత్మకను జోడించి వివిధ రకాల పేపర్ స్కల్ప్చర్‌ను రూపొందించసాగింది. ఈ చిత్రాలు ఇంటర్‌నెట్ ద్వారా ప్రముఖ బంగారు నగల బ్రాండ్ 'తనిష్క్' వారిని ఆకర్షించాయి. కట్‌చేస్తే సబీనా రూపొందించిన ఇంగ్లీషు లెటర్స్‌తో 'తనిష్క్' వారి బ్రోచర్ రూపొందించారు.

ఇంగ్లీషులో వేలాది ఫాంట్స్ ఉండగా సబీనా రూపొందించిన అక్షరాలు చూసారా? ఎంత ప్రత్యేకంగా కన్పిస్తున్నాయో... దటీజ్... సబీనా. అక్షరాలే కాదు టైగర్, ఎలిఫెంట్, బర్డ్స్ చిత్రాలు చూడండి సబీనా ప్రతిభ ఏపాటిదో మీకే అర్థం అవుతుంది.









సబీనా అక్షరాలతో రూపొందించిన తనిష్క్ వారి ప్రకటన

# "చివరి వరకూ ఉండే సాహిత్యాన్నిచ్చిన చింతనాశీలి" బుచ్చిబాబు



ఎల్.ఆర్. వెంకటరమణ

**ఒక వ్యక్తి బాహ్య జీవితాన్ని అతని అంతరంగిక జగత్తు- ఆ జగత్తులోని విభిన్న శక్తులకు కుదిరిన సమన్వయం నిర్ణయిస్తుంది. ప్రతి వ్యక్తీ తన అంతరింగిక జగత్తును, బాహ్య ప్రపపంచంతో కుదుర్చుకొనే సమన్వయం వల్లనే అతను శాంతి సౌఖ్యాలను అనుభవించగలుగుతాడు. ఇలా నాటి సాహిత్యంలో కాల్పనికోద్యమసాహిత్యం నుండి విడివడి రచనలు చేసిన కళాతాత్వికుడు-బుచ్చిబాబు. ఇలా తెలుగు సాహిత్యంలో కాల్పనిక ఉద్యమం తరువాత వచ్చిన ఆధునిక మార్గం తెలుగుసాహిత్యాన్ని మరో మెట్టు ఎక్కించగలిగింది.**

బుచ్చిబాబు సృష్టించిన సాహిత్యమంతా పాత్రల అంతరంగ చిత్రణకే అధికప్రాధాన్యత ఉంటుంది. బాహ్య ప్రపంచంలో జరుగుతున్న కొన్ని సంఘటనలు తన పాత్రల అంతరంగ జీవితాన్ని ఎలా ప్రభావితం చేస్తున్నాయో, ఎలాంటి ఉద్దీపనా ప్రేరణలు చేస్తున్నాయో చూపడమే బుచ్చిబాబు సాగించిన సాహిత్య సృష్టి లక్ష్యం.

''జీవితంలో ప్రేమించి విఫలం కావడం కాదు, ప్రేమించలేకపోవడమే గొప్ప విషాదం" అన్నది బుచ్చిబాబు గారి సిద్ధాంతం. మానవ జీవిత సౌందర్యతృష్ణ, సామరస్యం, కరుణ, విషాదం, ఉల్లాసం, వేదన, వాంఛ వీటిని నిశితంగా వివరంగా తన రచనలలో వ్యాఖ్యానించాడు.

బుచ్చిబాబు గారి అసలు పేరు-శివరాజు వెంకట సుబ్బారావు. 1916 జూన్ 14న ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లాలో జన్మించారు. ఆంగ్లంలో రాస్తున్న కవితలకు "సంతోష్‌కుమార్" అన్న పేరుతో, తెలుగు రచనలు "బుచ్చిబాబు" అన్న కలంపేర్లతో రచించారు. తండ్రి వృత్తిరీత్యా పలు ప్రాంతాలు పర్యటించడం, గ్రామీణ ప్రాంతప్రకృతి రమణీయత వీరిలో సాహిత్యం సౌందర్యం పిపాసను మరింత లేపాయి. 1936లో కాలేజీ మేగజైన్‌లో తొలి రచన ప్రచురించబడింది. నాటి నుండి 30 ఏళ్ళ రచనా జీవితంలో ఒక నవల, 82 కథలు, 40 వ్యాసాలు, 40 నాటకాలు, పరామర్శగ్రంథం, స్వీయచరిత్ర మరికొన్ని రచనలు చేశారు.



బుచ్చిబాబుగారు చిత్రకారుడు కూడా. మునివేళ్ళు మచ్చుటపడితే కాన్వాస్‌పై రంగులు నర్తించేవి. గీయాలన్నదే తడవుగా ఎన్నో డ్రాయింగ్స్ గీచుకునే వాడు. ఆకాశవాణి కేంద్రంలో రికార్డింగ్ రూంలో కూడా ట్రాకర్‌పై స్కెచ్చస్ గీస్తుండేవారు. రికార్డింగ్ చేస్తూ మాట్లాడుతున్నవారిని అలాగే స్కెచ్ గీచి ఇస్తుండేవారు. అలా అర్జున్‌సింగ్, శ్రీమతి ఇందిరాగాంధీల స్కెచ్‌లు అప్పటికప్పుడు గీచేవారు.

"ఆయన నవలాకారుడైనప్పటికినీ ఎక్కువ చదివేది అంతర్జాతీయ మేధావుల రచనలు "కానీ ఆయన నిత్యజీవితంలో మేధాజీవిగా కాక, హృదయజీవిగా గోచరిస్తాడు" అంటారు సంజీవదేవ్, "శిల్పమంతా నీ చేతిలోనే ఉంది బుచ్చిబాబు" అంటారు మురిపెంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణ "ఆంగ్లంలో నిధివి నీవు"- అంటారు పింగళి లక్ష్మీకాంతంగారు.

బుచ్చిబాబు గారు అనంతపురం, విశాఖపట్టణం కాలేజీలలో ఆంగ్ల లెక్చరర్‌గా పనిచేశారు. 1945లో ఆకాశవాణిలో ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్‌గా చేరారు. చెన్నై, విజయవాడ, హైదరాబాద్ ఆకాశవాణి కేంద్రాలలో పనిచేశారు. సర్వీసులో ఉండగానే మనలను వదిలి వెళ్లిపోయారు.

ఆయన సాహిత్యానికే కాక, ఆకాశాణి కార్యక్రమాలలో కూడ నూతన ఒరవడి సృష్టించారు. ఆకాశవాణి కోసం ఆయన రాసిన నాటకం "రాయలు కరుణ కృత్యం" ఆధారంగానే "మల్లీశ్వరి" చిత్రనిర్మాణం జరిగింది. స్టేజీ నాటకాలు కూడా రచించారు. "ఆత్మవంచన", "తెరపడని నాటకం", దారిన పోయే దానయ్య" ఇంకా అందరూ ఆడవాళ్లే పాత్రధారులు గల "కార్యదర్శి కళ్యాణి" అన్నవి ప్రసిద్ధ నాటకాలు. "ఆత్మవంచన" నాటకం ద్వారా ప్రముఖ సినీనటి సావిత్రిని స్టేజ్ నాటకానికి పరిచయం చేశారు. ప్రసిద్ధ హిందీ నటుడు పృధ్వీరాజ్‌కపూర్ ఈ నాటకాన్ని చూసి బుచ్చిబాబును ఎంతగానో ప్రశంసించారు. "దారిన పోయే దానయ్య" నాటకంలో నిర్మలమ్మ, పుండరీకాక్షయ్య నటించారు. వారెంగతానో ప్రశంసించారు. ఇక నందూరి వారి ఎంకి పాటలు అంటే బుచ్చిబాబుగారికి అమితమైన ప్రేమ. ఆ పాటలన్నిటికి





బుచ్చిబాబు గీసిన బొమ్మ

స్కెచ్‌లు గీచుకున్నారు. ఎంకి పాటల ప్రేరణతోనే "ఉత్తమ ఇల్లాలు" అన్న రేడియో నాటకం రాశారు. దీనికి నండూరి సుబ్బారావు గారు కూడా ఎంతో పొంగిపోయారు. "నా పాటని పాత్రలతో ప్రాణం పోశావని" ముచ్చట పడిపోయారు.

గోపీచంద్, పాలగుమ్మి పద్మరాజు, కరుణ కుమార్, తిలక్ కళలంటే బుచ్చిబాబుకు ఎంతో ఇష్టం. దేవులపల్లి, తల్లావఝుల కవిత్వం అంటేను అదే ప్రేమ. "అజ్ఞానం" పేరున బుచ్చిబాబు ఒక కవితా సంపుటి కూడా తెచ్చారు. హార్మోనియం, వయోలిన్ కూడా వాయించగలిగారు.

బుచ్చిబాబుగారి కథలు తెలుగు సాహిత్యంలో మైలురాళ్ళ అనతగ్గవి. కథాశిల్పానికి సంబంధించి సోమర్‌సెట్ మామ్‌కు ఏకలవ్యశిష్యుడు. "నా కథలన్నీ నేను ఎరిగి ఉన్న మనుషులు, స్థలాలు, అనుభవాలు వీటి గురించి వ్రాసివే". అని చెప్పుకున్న బుచ్చిబాబు, మామ్ లాగానే తాను ''తనను కదల్చిన సంఘటనలను నోట్ పుస్తకంలో వ్రాసుకునేవాడు."

బుచ్చిబాబు కథలలో కనబడేది ''అంతరంగంలో అణచివేయబడిన శృంగార భావనలు, ప్రేమించి దూరంగా ఉంది. శరీర సుఖం కోరిక, మనస్సుని ఆనందంతో నింపుకునే సాహిత్యం రాణిస్తుంది"– అన్నది బుచ్చిబాబు గారి సిద్ధాంతం మనస్తత్వ శాస్త్రంలో తనకు గల పరిజ్ఞానం పలు సందర్భాలలో బుచ్చిబాబు పాత్రల స్వరూపాన్ని వివరించడం, వ్యాఖ్యానించడం దోషాలని తెలిసిన కొన్ని సందర్భాలలో నిగ్రహించుకోలేక సుదీర్ఘ వర్ణనలు వివరాలు పొందుపరచారంటారు విమర్శకులు".

"మనసులో జరిగే అలజడి వివరించడం బుచ్చిబాబు అభిమాన విషయం". పాశ్చాత్య సాహిత్యంలో జేమ్స్‌జాయిస్, వర్జీనియా వుల్ఫ్, మార్సెల్ ప్రౌస్ట్ మొదలైన వారి "స్ట్రీమ్‌ఆఫ్ కాన్షస్‌నెస్ విధానానికి తెలుగులోకి తెచ్చిన వారిలో బుచ్చిబాబు ప్రముఖుడు. ఈ ధోరణిలోనే "చైతన్యస్రవంతి" అన్న కథ రచించాడు. కానీ ఇది కథగా అంతగా రాణించలేదన్నది విమర్శకుల భావన.

బుచ్చిబాబు కథలు గురించి చర్చిస్తున్నపుడు రసెల్ గురించి కొంత చెప్పుకోవాలి. "రసెల్‌కు అంకితమైన రెండు కథలు" అని "మరమేకులు–చీరమడతలు"; కొత్తనీరు–పాతవంతెన" అన్న రెండు కథలు రచించాడు. ఇవి రసెల్ సిద్ధాంతంలోని స్వేచ్ఛా ఆరాధన అన్న అంశంగా వచ్చినవి. బెర్‌ట్రాండ్ రసెల్ 'నీతి' అనే పేరుతో, ''సంప్రదాయం'' అన్న పేరుతో సంఘంలో పేరుకుపోయిన కుళ్ళును మన కళ్లముందుంచుతాడు. రసెల్ రచన "What I belive" అన్న గ్రంథం ఆధారంగా బుచ్చిబాబు ఈ రెండు కథలు రచించాడు.

తెలుగు నవలా సాహిత్యంలో ఒక గొప్ప మలుపు తెచ్చిన నవల "చివరకు మిగిలేది", బుచ్చిబాబు రచించిన ఏకైక నవల. 1946లో ఈ నవల రచించారు. 1952లో ప్రచురించబడింది. "నవోదయ" అన్న పత్రికలో సీరియల్ ప్రచురించబడినది. దీనికి బుచ్చిబాబు మొదట "ఏకాంతం" అన్న పేరు పెట్టారు. కానీ అచంట జానకీరామ్ "చివరకు మిగిలేది" అన్న పేరు సూచించారు. దీనికి బుచ్చిబాబు చెబుతూ– "ఈ పేరు కథకు సమగ్రత నివ్వడమే కాక సరిహద్దులను కూడా నిర్ణయించింది" అంటాడు.

''చివరకు మిగి లేదేమిటి? అన్న ప్రశ్నతో నవల ప్రారంభమవుతుంది. ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకునేందుకు చేసిన ప్రయత్న జ్ఞాపకాలు, తనతో తాను సమాధాన పడటం– 'మిగిలింది' అనే 'సమాధానం' తో పూర్తి అవుతుంది. పాఠకుల ఆలోచనలకు ప్రారంభమవుతుంది.




అస్తిత్వవాద ధోరణిలో నడచిన ఈ నవలపై ఫ్రాయిడ్ ప్రతిపాదించిన

"ఇదిపస్‌కాంప్లెక్స్" సిద్ధాంత ప్రభావం కనబడుతుంది. మానవుడు తన ఇతర బాహ్యలోకాల్లో తనతో తాను, బాహ్య ప్రపంచంతో సంఘర్షణ పడి ఈ రెండింటి సమన్వయం సాధించడాన్ని కళాత్మకంగా చిత్రించిన కళాఖండం "చివరకు మిగిలేది".

ఈ వనలలోని కథానాయకుడు "దయానిధి", ఇతనే నవల ఆత్మ–శరీరము. మిగిలిన ఇతర పాత్రలన్నీ దయానిధి చైతన్యంలో జనించి, అభివృద్ధి చెంది, ఆ చైతన్యంలోనే అంతమవుతాయి. దయానిధి – దేన్ని నమ్మలేని సందేహశీలతత్వం కలవాడు. ప్రతీది సందేహదృష్టితో చూస్తుంటాడు. సమాజంలో ఘర్షణ పడుతాడు గానీ, ఎదురుతిరిగి ప్రవర్తించలేదు. ధాఫి–ది. మారియర్ నవల "రెబెకా"లో వలే ఈ నవలలోనూ దయానిధి తల్లిపాత్ర నీడలా ఉ ంటుంది. ఇతర పాత్రలు కోమలిని–ఈమెను ప్రేమిస్తాడు, లైంగికానుభవానికి జంకుతాడు; సుశీల–ఈమెను ద్వేషిస్తాడు; ఇందిర–ఈమెను పెళ్ళి చేసుకున్నా శోభనం రాత్రి తప్పించుకునిపోతాడు; అమృతం–అమెలో తన తల్లితో కల రూపానికి సరిపోవడం (mother Fixation) ఒక వ్యక్తి తనను తాను తెలుసుకొని, తనను తాను సంస్కరించుకొని, తనలో తాను ఐక్యమై, తనలో తాను సమాధాన పడితేనే సమాజంలో, బాహ్య ప్రపంచంలో సమాధానం దొరకుతుందనే జీవిత దృక్పథాన్ని చెబుతుంది.– "చివరకు మిగిలేది", మనస్తత్వ శాస్త్ర విషయాలెన్నో పంక్తుల రూపంలో నవలంతా పరచుకొని ఉన్నాయి. వాటిలో కొన్ని "భావాలు మానవులందర్నీ ఏకం చేస్తాయి. వాటిని చెప్పడంలో ప్రయోగించే వివిధ భాషలు మానవుల్ని విడదీస్తాయి. "(పేజీ. 15); "ఎవరో, ఎప్పుడో సహాయపడతారన్న ఆశ ఉన్న మనుషులే భయపడేది" ( పేజీ–83); మన నిజ స్వరూపం మనం చూసుకోలేం ఇతరులు చెపితే సహించలేం (పేజి. 139); అందర్లా కాకుండా ఎవరైనా వింతగా జీవిస్తుంటే, సంఘం క్షమించదు" ( పేజీ–144); "ప్రేమకు ద్వేషం ముగింపు, యవ్వనానికి వాంఛ ముగింపు, జీవితానికి మృత్యువు ముగింపు" (పేజీ–169); "మనిషి అడ్డు తగలకపోతే జీవితం సమస్యలను అదే పరిష్కరిస్తుంది" (పేజీ–236); తనను తాను తృణీకరించినవాడు ప్రపంచాన్ని అంగీకరించలేడు (పేజి. 266);

బుచ్చిబాబు సెప్టెంబర్ 20, 1967న మరణించారు. అప్పటికి ఆయన వయస్సు 51 ఏళ్ళు బుచ్చిబాబుగారి సతీమణి శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారు కూడా చిత్రకారిణి, రచయిత్రి.



# ఆంధ్రాఫెర్నాండేజ్- శ్రీనగేష్



తారా నగేష్

*A Thing of beauty is a Joy forever* అన్నాడు జాన్‌కీట్స్ అనే సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత కేవలం తన *26* ఏళ్ళ అత్యల్ప జీవిత కాలంలో, ఇప్పటికి దాదాపు *200* ఏళ్ళకు పూర్వం... సౌందర్యోపేతమైన ఏ చిన్న పనైనా అది ఎప్పటికీ ఆహ్లాదాన్ని కల్గిస్తుందనేది దాని సారాంశం.

**- వెంటపల్లి సత్యనారాయణ**

సౌందర్యంతో కూడుకున్న ఓ చిన్నపనే అంతటి ఆహ్లాదాన్ని కలిగిస్తే మరి అతని వృత్తే అలాంటిదై, నింతరంగా అదే పనిని కొనసాగించే అతని వ్యాపకం మరెంత హాయిని, ఆహ్లాదాన్ని ఇవ్వాలి? అవును కచ్చితంగా అలాంటి అనుభూతినే కలిగిస్తాయి అతని చిత్రాలు. కారణం అతను చిత్రించడానికి ఎంచుకున్న వస్తువు ఒకటైతే, అది అతని కుంచె ద్వారా రూపును సంతరించుకోవడం మరో ఎత్తు. అందుకే సౌందర్యానికి ప్రతిరూపాలైన ప్రకృతి, పడతులు అతని కుంచె ద్వారా రూపు కట్టించుకోవడానికి ఉవ్విళ్లూరుతాయి.

కారణం సప్తవర్ణ శోభితమైన ప్రకృతికి తన రోటరింక్‌పెన్ నల్లటి గీతలతో ఓ కొంగ్రొత్త అందాలను తీసుకువస్తే తెలుగింటి పల్లెపడుచుల రూపాలను, వారి మనోగతాలను, భావాలను, అనుభూతులను, దైనందిన క్రియలను వీక్షకులకు విస్మయం కలిగించే వర్ణ సమ్మేళనంలో తన కుంచెను ముంచి మరింత సౌందర్యభరితం చేయడం రెండో కారణం. అందుకే అతని చిత్రాలు చూపరుల మానసాలను కొల్లగొడతాయి. సుప్రసిద్ధమైన ఉత్తరాది చిత్రకారుడు జాన్ ఫెర్నాండేజ్ బొమ్మలను తలపింపజేస్తాయి. అతనే గోదావరి తీరాన కళల కాణాచిగా



వరదా వెంకటరత్నం, అడవి బాపిరాజు, సత్యవాణి, బుచ్చికృష్ణమ్మలతో పాటు ఆ తర్వాత కాలంలోని రాజాజీపై కూడా ఆ ప్రభావం చాలా కాలం కొనసాగింది. ఫలితంగా రాజాజీ శిష్యులపై కూడా ఆ ప్రభావం పడింది. అసంఖ్యాకమైన రాజాజీ శిష్యులలో ఒకరైన శ్రీనగేష్ కూడా అందుకు మినహాయింపు కాదు. అందుకే 1982 నుండి 2001 వరకూ అతడు వేసిన, ఋశ్యశృంగబందనం, సిద్ధార్ధ వైరాగ్యం, కృష్ణుని ద్వారకాపయణం, జంగం దేవర లాంటి ఎన్నో చిత్రాలు ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

చిత్రితాంశం ఏదో ఒక పురాణ, సాంఘిక లేదా, చారిత్రక అంశానికి చెందినదై వుండడం, చిత్రాన్ని ఎక్కువ వ్యక్తులతో కంపోజ్ చేయడం, వెలుగునీడల కంటే సమతల దృశ్యచిత్రీకరణకే

*ఏ కళాప్రక్రియ అయినా నిరంతరంగా కొనసాగాలి అంటే ఆ ప్రక్రియలో ఆ చిత్రకారునికి తగిన ఆదరణ, గుర్తింపులతో పాటు, ప్రోత్సాహం కూడా కావాలి. ముఖ్యంగా కళనే జీవనాధారంగా చేసుకున్న ఇలాంటి చిత్రకారుడికి ఇది మరీ అత్యంత ఆవశ్యకం.*

వెలుగొందిన రాజమహేంద్రి నందు ఉద్భవించిన మరో ఆంధ్రాపెర్నాండేజ్ తారానగేష్‌గా ప్రసిద్దిగాంచిన శ్రీనగేష్.

శ్రీ బోగరాజు నాగేశ్వరరావు, భానుమతి దంపతులకు 11-2-1965లో రాజమహేంద్రినందు జన్మించిన శ్రీనగేష్‌కు జన్మత: అబ్బిన చిత్రకళపై గల ఆసక్తికి మెరుగులు దిద్దుకునే అవకాశం కల్పించింది. అక్కడి దామెర్ల రామారావు స్మారక చిత్రకళాశాల. చిత్రకళ యందు సర్వప్రక్రియలలో నిష్ణాతుడు మరియు అప్పటి దామెర్ల రామారావు స్మారక చిత్రకళాశాల ప్రిన్సిపాల్ అయిన స్వర్గీయ మాదేటి రాజాజీ గారి శిష్యరికంలో ఈ కళయందలి మెళకువలను నేర్చుకుని సుశిక్షుతుడైన చిత్రకారునిగా తయారయ్యాడు.

ప్రాథమిక విద్యాభ్యాసం 10వ తరగతితోనే ముగిసినా చిత్రకళయందలి ఆసక్తితో డ్రాయింగ్ లోయర్, హయ్యర్ పరీక్షలతో పాటు తమిళనాడు ప్రభుత్వం నుండి పెయింటింగ్‌లో డిప్లమో కూడా చేసి అందులో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

ఆధునిక ఆంధ్రచిత్రకళకు ఆద్యుడుగా ఓ బలమైన పునాదులు వేసి అచిరకాలంలోనే అమరుడైన దామెర్ల రామారావు గారి ప్రభావం నుండి తప్పించుకోలేక పోయిన ఆ కాలం నాటి



అధిక ప్రాధాన్యతనిచ్చి, జలవర్ణాలనే అధికంగా వినియోగించడం ఈ విధానంలో ముఖ్యంగా మనం గమనిస్తాము. 2001 వరకూ దాదాపు రెండు దశాబ్దాల పాటు 'ఈ తరహాలోనే ఆయన ఎన్నో చిత్రాలను వేసారు.

(110) మంది వ్యక్తులతో కంపోజ్ చేసి వేసిన శ్రీకృష్ణుని ద్వారకా పయణం, (75)మంది వ్యక్తులతో కంపోజ్ చేసిన "శిలువ వేసే ముందు క్రీస్తును హింసించుట" లాంటి చిత్రాలు అతని ప్రతిభకు తార్కాణాలు. ఎంతో ప్రతిభ, శ్రమతో కూడుకున్న ఇలాంటి విస్తారమైన సామూహిక చిత్రరచనలు ఆకాలంలో ఆయనకు ఎన్నో బహుమతులతో పాటు ఎందరో ప్రముఖుల ప్రశంసలు పొందేలా చేసాయి. 1989లో అంకాలా ఆర్ట్స్ అకాడమీ భీమవరం వారు నిర్వహించిన చిత్రకళాపోటీలలో శ్రీనగేష్ వేసిన "బృందావనం" చిత్రంలోని గ్రూప్ కంపోజిషన్ ప్రఖ్యాత సినీ పబ్లిసిటీ డిజైనర్ గంగాధర్‌ను సైతం ఆశ్చర్యపోయేలా చేసింది. కానీ చిత్రరచనలో చూపించిన శ్రద్ధ, ఆ చిత్రాల రచనకు ఉపయోగించిన మెటీరియల్‌లో చూపించకపోవటంతో జలవర్ణాలతో వేసిన ఎంతో మహత్తరమైన అలాంటి చిత్రాలు పాడైపోయి వుండడం చూసిన ఎవరికైనా ఎంతో బాధనిసిస్తుంది.

ఇటీవల నేను నా మిత్రుడు బీరశ్రీనివాస్ కలిసి తారాస్టూడియోలో శ్రీనగేష్‌గారు వేసిన ఆ బొమ్మలను చూసినపుడు మాకు అదే భావన కలిగింది.

ఏ కళాప్రక్రియ అయినా నిరంతరంగా కొనసాగాలి అంటే ఆ ప్రక్రియలో ఆ చిత్రకారునికి తగిన ఆదరణ, గుర్తింపులతో పాటు, ప్రోత్సాహం కూడా కావాలి. ముఖ్యంగా కళనే



నగేష్‌తో రచయిత వెంటపల్లి



జీవనాధారంగా చేసుకున్న ఇలాంటి చిత్రకారుడికి ఇది మరీ అత్యంత ఆవశ్యకం.

ఎంతో ప్రతిభ, శ్రమలతో కూడుకున్న శైలి అయినప్పటికీ దీర్ఘకాలానికి నోచుకోని జలవర్ణమాధ్యమానికి తోడు మారుతున్న కాలంలో వీటికి ఆదరణ కూడా కరువవ్వడంతో శ్రీనగేష్ ఈ తరహా చిత్రరచనకు పూర్తిగా స్వస్తి చెప్పి ఓ నూతన పంథాను ఏర్పరుచుకున్నారు.

వృత్తిరీత్యా ఫ్రీలాన్స్ ఆర్టిస్ట్‌గా పనిచేస్తున్న శ్రీనగేష్ "తారా" అన్నపేరుతో రాజమండ్రిలో ఓ స్టూడియోను ఏర్పాటుచేసుకుని అక్కడ మోడల్ ఆదారంగా రూపచిత్రరచన చేయడం



ప్రారంభించారు. అప్పటి నుండి ఆయన తారానగేస్‌గా ప్రసిద్ధిగాంచారు. వివిధ వ్యక్తుల ఆర్డర్లపై వేసే రూపచిత్రాలతో పాటు ఓ సిరీస్‌గా తెలుగు ప్రజల కట్టు, బొట్టు, సాంప్రదాయాలు అత్యంత సహజంగా ఉట్టిపడేలా మన పల్లెపడుచుల చిత్రాలు వేయడం ప్రారంభించారు.

2001 తర్వాత శ్రీకారం చుట్టి వేస్తున్న ఈ తరహా చిత్రాల్లో గుడికి, నందిపూజ, హరతి లాంటి చిత్రాల్లోని అంశం మరలా దామెర్ల కాలం నాటి వెలుగునీడల ప్రాధాన్యత లేని సమతల చిత్రీకరణతో కూడుకున్న స్త్రీ మూర్తి యొక్క వయ్యారపు భంగిమలే. కానీ వాటికి వెలుగునీడలను చొప్పించి, అత్యంత వాస్తవికతను జోడించి ఆ చిత్రాలకు మరింత సొగసు, సౌందర్యాలను ఆయన తీసుకొచ్చారు.

ముఖ్యంగా ఆయన చిత్రాల్లోని అమ్మాయిల వస్త్ర ధారణలో చూపించే పట్టుపరికినీల ధగధగలు, జరీ అంచుల నిగనిగలు, టెర్లిన్, సిల్కు వస్త్రాల మిలమిలలు, సిల్కుపోలిస్టర్ వస్త్రాల్లోని మెరుపు మరియు సున్నితత్వం, కాటన్ వస్త్రాల్లోని గురుకు మరియు హుందాతనాలను అత్యంత సహజంగా ఆయన రంగుల్లో చిత్రీకరించిన తీరు ప్రేక్షకులను ఆశ్చర్యపోయేలా చేస్తే అతని చిత్రితాంశాలైనటువంటి మల్లెపూల మాలకట్టే మగువలు, నిండు బిందెతో నీళ్లు తెస్తున్న అందమయిన అమ్మాయిలు, రంగవల్లులద్దుతున్న సుందరాంగులు, ఏక్‌తార వాయిస్తున్న పడుచుపిల్లలు, దీర్ఘాలోచనలో మునిగిన ఆరిందలు, ఇలా పల్లెపడుచుల ప్రతిభంగిమలను అత్యంత సహజంగా, ఫొటోగ్రఫీని సైతం తలదన్నేలా వేస్తున్న అందమైన అమ్మాయిల చిత్రాలు శ్రీనగేష్‌ని ఓ స్థాయిలో నిలబెట్టడమే గాక ఆంధ్రప్రదేశ్‌లోనే ఓ అరుదైన చిత్రకారుడిగా గుర్తింపు పొందేలా చేసాయి.

ఇంత సహజంగా రూపుదిద్దుకుంటున్న ఈ చిత్రాలన్నింటికీ శ్రీనగేష్ కుటుంబ సభ్యులే మోడల్స్ అంటే ఆశ్చర్యపోక తప్పదు. పూర్తిగా మోడల్ ఆధారంగా వేస్తున్న ఆయన చిత్రాలకు 1992లో పెళ్లయ్యే వరకూ తన చెల్లెలు శైలజ, మరియు ఆయన భార్య మోడల్స్ కాగా ఆ తర్వాత 2001 నుండి ఆయన కుమార్తెలయిన సౌందర్య తార, ఐశ్వర్య తారలు మోడల్సుగా ఉండడం విశేషం.

ఇక ప్రకృతి చిత్రాల విషయానికొచ్చినట్లయితే రాజమండ్రి పుష్కరఘాట్, బిర్లాటెంపుల్, గోల్కొండ పోర్ట్, కర్నాటక చిత్రకళాపరిషత్ లాంటి సుందర ప్రదేశాలు అతని రోటరింగ్‌పెన్ నల్లటి గీతలతో మరింత సౌందర్యాన్ని సంతరించుకున్నాయి.

చిత్రకారుడిగా శ్రీనగేష్ రాష్ట్రంలోని ప్రముఖ చిత్రకళా సంస్థలన్నింటి నుండి ఎన్నో అవార్డులు, సన్మానాలు అందుకోవడం జరిగింది. 1982లో నవరంగ చిత్రకళా నికేతన్ వెల్లటూరు



మరియు దామెర్ల అకాడమీ రాజమండ్రి ల నుండి ఉత్తమ బహుమతులందుకోగా, 1986లో మరలా నవరంగ చిత్రకళా సంస్థనుండి ప్రథమ బహుమతి నందుకున్నారు, 1989లో అంకాలా ఆర్ట్ అకాడమీ భీమవరం నుండి తన "బృందావనం" చిత్రానికి గాను. బెస్ట్ ఆర్టిస్ట్ అవార్డుని అందుకోగా లలిత కళాసమితి సిద్ది పేటనుండి 1990లో కూడా బెస్ట్ ఆర్టిస్ట్ అవార్డ్‌ని అందుకున్నారు. 1991లో నవరంగ్ చిత్రాకళాసరిషత్ పోటీల్లో బలరామకృష్ణుల బాల్యం" చిత్రానికి గోల్డ్‌మెడల్ అందుకోగా, ప్రఖ్యాత కోనసీమ చిత్రకళాపరిషత్ అమలాపురం మొదటి రాష్ట్రస్థాయి చిత్రకళాపోటీల్లో మొదటి మెగా అవార్డుని తన "ఋశ్యశృంగబంధనం" చిత్రానికి శ్రీ నగేష్ సొంతం చేసుకోవడం విశేషం. ఇంకా అడపా చిత్రకళాపరిషత్ నర్సీపట్నం హైదరాబాద్ ఆర్ట్ సొసైటీలతో పాటు 2008లో స్టేట్ ఆర్ట్ గ్యాలరీ హైదరాబాద్ నిర్వహించిన పోటీల్లో 5000/- నగదు బహుమతి నందుకోవడం మరో విశేషం. ఇక కోనసీమ చిత్రకళాపరిషత్ తన 20 ఏళ్ళప్రస్థాన సందర్భంగా, ప్రతిష్టాత్మకంగా నిర్వహించిన శతచిత్రకారుల సన్మానంతో పాటు ఆ సంస్థ 22 ఏళ్ల ప్రస్థానంలో ఎన్నో అవార్డులు ఆ సంస్థ నుండి ఆయన తీసుకోవడం జరిగింది.

ఇక చిత్రకళా ప్రదర్శనల విషయానికి వచ్చినట్లయితే శ్రీ కొరసాల, ఎన్.యస్. శర్మ, వెంపటాపు, ఉదయకుమార్, కొచ్చెర్ల, నాభా తదితర చిత్రకారులతో కలిసి సప్తవర్ణ పేరుతో 2005, 2006, 2007లో హైదారాబాద్ స్టేట్ ఆర్ట్ గ్యాలరీలో 3 సార్లు, బెంగుళూర్, రాజమండ్రి, కాకినాడ, అమలాపురం తదితర చోట్ల గ్రూప్‌షోలు నిర్వహించడం జరిగింది. ప్రముఖ దినపత్రిక సాక్షి ఫన్‌డేలో మొన్నటి వరకూ తన అద్భుత రేఖా వర్ణ విన్యాసాలతో చిత్రకళాభిమానులను ఆశ్చర్యచకితులను చేసిన "హంపి" అనే యువ చిత్రకారుడు శ్రీనగేష్ యొక్క శిష్యుడే. అలాగే వానపల్లి, గంగరాజు లాంటి మరికొందరు శిష్యులు కూడా చిత్రకళలో నేడు మంచి కృషి చేస్తూ ముందుకు సాగుతుండడం ఆనందకరమైన విషయం.

ప్రముఖ చిత్రకారులు, కోనసీమ చిత్రకళాపరిషత్ కార్యదర్శి మరియు సహస్ర గణపతుల రూపశిల్పి అయిన శ్రీ కొరసారల సీతారామస్వామి గారు చెప్పినట్లు సహజత్వం పూర్తిగా విస్మరించి సరళమార్గాల కోసం వివిధ బాటలు పడుతున్న ఈ రోజుల్లో స్ప్రే, వాష్, ప్యాచ్, జల, ఏక్రిలిక్, మరియు ఆయిల్స్‌తో ఆయన ప్రయోగాలు చేస్తూ మన కట్టు, బొట్టు, సాంప్రదాయాలను అత్యంత



సహజంగా అమ్మాయిల రూపంలో చిత్రిస్తున్న తీరు అద్భుతం. రాబోయే కాలానికి కాబోయే అత్యంత సహజ చిత్రకారుడు శ్రీనగేష్ అని చెప్పడంలో ఏమాత్రం నాకు సందేహం లేదంటారాయన అందుకే అప్రతిహతంగా సాగుతున్న శ్రీనగేష్ కళాకృషి నభూతో నభవిష్యత్ కావాలని ఆశిద్దాం.

*email:* ***snventapalli@gmail.com***




# సింగ్ స్లో'గన్'ల కింగు

- బ్నిం

ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్ ను అందుకుంటున్న సింగ్

*ఎవరండి బాబూ.... ఈ ముని ప్రతాప్ సింగ్*

*పేరు చూస్తే పంజాబీ సింగన్న లావుంది-*

పెదవో... పెన్నో విప్పితే మాటల మరాఠీలా మాయ చేస్తున్నాడు.

అలవోకగా అంత్యప్రాసలు విసిరేస్తున్నాడు. మన పదాన్ని ద్వంద్వార్థ ప్రయోజనం సాధిస్తూ విరిచేస్తున్నాడు-ముడుచుకున్న పదాన్ని విడమర్చి విరియ జేస్తున్నాడు. మాటని ఒక చోట నొక్కి మీటి చమత్కారాలు యిస్తున్నాడు.

తెలుగు దనాన్ని కబ్జాచేసి ఆక్రమించుకుంటున్నాడు

తెలుగుపత్రికలో బి.ఎమ్.పి.సింగ్ పేరు చూసి మనసుంటి తెలుగోళ్లు సిక్కుల్లో పడిపోతారు

మనకన్నా తెలుగు యమ టేస్టీగా వొండివొడ్డిత్తున్నారే... అని బిక్క మొహంతో ముక్కున వేలేసుకుంటారు-

ఆ మధ్య.. ముఖీమీడియా వారి ధృవతార రైటర్‌గా పరిచయం అయ్యి అవడంతోనే మూణ్ణిముషాల ముచ్చట్లలోనే... ఆయన పద సంపదలు పేర్చి ఆ పర్వత శిఖరాగ్రంపై కూర్చుని మాటలు తూటాలు పేల్చడం మొదలెట్టారు. తలెత్తి చూస్తూ వినేటప్పటికి కళ్ళు తిరిగాయి. కిందకి దూకమని దండం పెట్టేశా!

కొంచెం అలవాటు అవుతోంది ఆయన్ని వినడం-ఆశ్చర్యపడిపోతున్న నన్ను పడకుండా పట్టుకోవడానికి నా చుట్టూ పదిమంది చేరారు. అయినా ఈయన మాటల వేగానికి వాళు ్ల ఎగిరి దూరంగా పడ్డారు.

ఇది తొలినాటి ముచ్చట. నాకెందుకో చిన్నప్పట్నించీ అక్షరాలతో మితిమీరి మ్యాజిక్ చేసేవాళ్లంటే వికటపోకడేమో అనే నమ్మకం దృఢంగా ఉండేది. నేనూ అలాటి వాళ్లకి కొంచెం దూరంగానే ఉండేవాణ్ణి. కానీ ఈయన మ్యూజిక్‌లో విద్యుత్తుంది. వేగంలో విద్యుత్తుంది. లేకపోతే ముఖీమీడియా పావనీ ప్రసాద్ అంతటి వారు



బ్నిం, కళాసాగర్ మధ్యలో సింగ్

# సింగ్‌ను వరించిన వరల్డ్ రికార్డులు




వివిధ రంగాలలో విశిష్ట సేవలందించిన భారతీయ భవ్యచరిత్ర నిర్మాతల జీవన పరిమళ చిత్రాలను ఒక్కొక్కటి కేవలం రెండు నిముషాల నిడివిగల 365 డాక్యుమెంటరీలలో **"ధృవతారలు"** అనే శీర్షికలతో టివి5 లో రోజుకి నాల్గుసార్లు ప్రతి ఎపిసోడు ప్రసారమయింది. ఈ కార్యక్రమం మింటి నుండి ప్రతి ఇంటి జనమానసాల్లో అమందానందాన్ని నింపింది. ఈ బృహత్తర కార్యక్రమ సృజనశీలి 'శ్రీ బి.ఎం.పి.సింగ్ అనే హిందీ ఉపాధ్యాయుడంటే ఎంత ఆశ్చర్యం! కాని ఇది పదహారణాల సత్యం.

రచయిత శ్రీ బి.ఎం.పి.సింగ్ గారు తమ మాతృభాష హిందీ అయినా, తెలుగంటే ఆయనకు ప్రాణం. ఆయనతో మాట్లాడిన రెండు నిముషాల్లోనే తెలుగుపట్ల తనకున్న సహజ పాండిత్యం దైవదత్తమనిపిస్తుంది. ఆయనతో మాట్లాడిన రెండు నిముషాల్లోనే. ఆంధ్రభాషాభిమానానికి అక్షరసాక్ష్యంగా ఈ ధృవతారల కార్యక్రమం ద్వారా చరిత్రలో మరుగునపడిపోయిన గొప్ప గొప్ప వ్యక్తిత్వాలను తెలుగులో రాసి వెలుగులోకి తెచ్చి అశేష ఆంధ్రుల మన్ననలకు ప్రశంసలకు పాత్రులైనారు. ఈ ధృవతారల విశేషతను ప్రపంచం నలుదిక్కుల ఉన్న ఎన్నో రికార్డు సంస్థలు గుర్తించి, అవార్డులను తమ ధృవతారల ద్వారా ఆకాశానికెత్తాయి.

అవార్డులు ఇలా వచ్చాయి

ప్రపంచంలోనే "తొలి అతిలఘు డాక్యుమెంటరీ" విభాగంలో రికార్డు నెలకొల్పినట్లు ఈ దిగువ సంస్థలు ధృవీకరించి ధృవపత్రాలిచ్చాయి.

1 ఇండియా వరల్డ్ రికార్డ్సు

2. గ్లోబల్ వరల్డ్ రికార్డ్సు

3. వండర్ వరల్డ్ రికార్డ్సు

4. యు.ఆర్.డి.బి. యు.యస్.ఏ రికార్డు 5. వరల్డ్ రికార్డ్ 6. ఆంధ్రప్రదేశ్

ప్రపంచంలోనే "తొలిసారిగా అత్యధిక సార్లు ప్రసారమైన డాక్యుమెంటరీ క్యాటగిరీ"లో కూడా "ధృవతారలు" గర్తింపు పొంది యు.ఆర్.డి.బి-యు.ఎస్.ఏ. వారి ధృవపత్రాన్ని సాధించింది.

అంతేకాక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక శాఖ కూడా ఈ కార్యక్రమ ప్రత్యేకతను, ప్రాతినిధ్యాన్ని, ప్రాముఖ్యాన్ని గుర్తించింది. "ఆంధ్రప్రదేశ్ రాజీవ్ విద్యామిషన్" వారు ఈ ధృవతార సీడీల్ని రాష్ట్రంలోని ప్రతి పాఠశాలలో ప్రదర్శించడానికి అనుమతినిస్తూ ప్రొసీడింగ్స్ విడుదలచేసి, 'ధృవతారల' పసిడివన్నె ద్విగుణీకథం చేశారు.

గత నాలుగు సంవత్సరాలుగా శ్రీ బి.యం.పి.సింగ్‌గారు తెలుగులో వెలువడే జాగృతి, ఈనాడు, పత్రిక, సాహితీకిరణం, ఉషశ్రీ వెలుగు లాంటి దిన, వార పత్రికల్లోనేగాక, 64కళలుడాట్‌కామ్ వంటి నెట్ మ్యాగజైన్‌లలో కూడా మానవ జీవన ప్రస్తుత స్థితిగులు, సాహిత్య సాంస్కృతిక విషయాలపై అనేక వ్యాసాలు, కవితలు, నానీలు రచించారు. చిత్రకళా ప్రదర్శనలకు, ప్రకటనలకు, గణిత సదస్సులకు తనదైన శైలిలో సూక్తులు, నినాదాలు రాసారు.

బ్నిం లాంటి గొప్ప ఫ్రెండుండగా విజయవాడ రైటర్ని ఎందుకు మెచ్చుకుంటారో తెల్సుకోడానికి కొంత టైంపట్టింది. ముఖీమీడియా వారి ధృవతారలు పుస్తకంగా వేస్తున్నప్పుడు పేజిలేఔట్-కోసం స్క్రిప్ట్ చూస్తూ అంతమంది గొప్ప వాళ్ల మీద రిపిటేషన్స్ లేకుండా స్వల్పాక్షరాల్లో అనంతార్థంగా ఆయన రాసిన రైటప్స్ ఒకదాన్ని మించి ఒకటి మెరిసే ఆ తారలకే కొత్త మెరుగులు పెట్టినట్టు అనిపించింది.

ఆ మహనీయులు ఈయన రచన చదివుంటే, ఇతని వాక్యాలు పదే పదే చెప్పుకుని మురిసే వారనిపిస్తుంది.

అసలు ఈయన తెలుగువాడే అని ఖచ్చితంగా అన్పిస్తుంది.

మనవాళ్ళే మధ్య మర్చిపోయిన తెలుగు సామెతల్ని, తెలుగు వంటల్ని తెలగుదనాన్ని మళ్ళీ మనకి గుర్తుచేస్తూ ఆయన రాస్తున్న వ్యాసాలు, వేస్తున్న ఉపన్యాసాలు, చదివితే, తెలుగు తియ్యందనాలు చవులు ఊరిస్తుంటాయి. ఏకవాక్య పదాలతో... విజయవాడ విద్య, వ్యాపార, ప్రచార, రంగాల్ని అలరిస్తున్న ఆయన రచనా సరళి అక్షర లక్షల విలువల సిరులని తలపిస్తాయి.

ఈయన పెన్ను మహత్యం ఏంటో గానీన... హిందీ, ఇంగ్లీషు కూడా అంత బాగానూ రాస్తుంది. అందు తెలుగుదనం.. ఏ కోశానా ఉండదు-దాని జన్మభూమి భాష దానికీ..ఉంటుంది. మాతృభూమి పరిమళం గుబాలిస్తూంటుంది.

సింగ్ గారు ఈరోజు ఎక్కే రికార్డుబుక్‌ల సంఖ్య పెరుగుతోంది-ఆయన సీజనల్‌గా ఎన్ని రాశారో ఆయనకే తెలియదు గానీ.. రాసిన కాసిన్ని కాప్షన్స్ బేనర్లెక్కాయి. ఫ్లోన్లెక్కాయి-పోస్టర్లకెక్కాయి. గోడలకెక్కాయి. నోళ్లలో నానాయి. సింగు స్లోగన్‌ల కింగు.

# కె.యస్.టి. శాయికి ఎన్టీఆర్ పురస్కారం

- వాడ్రేవు సుందర్రావు
నంది, గరుడ అవార్డుల గ్రహీత

**నాటకరంగంలో విశిష్ఠమైన సేవ చేసిన వారికి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎన్టీఆర్ రంగస్థల పురస్కారంతో గౌరవిస్తుంది. ప్రతి ఏటా నందినాటకోత్సవాల సందర్భంగా ఒక గొప్ప వ్యక్తిని, ఈ పురస్కారంతో సత్కరిస్తారు. అటువంటి ప్రతిష్ఠాత్మకమైన పురస్కారం, ఈ సంవత్సరం, కె.యస్.టి. శాయికి దక్కింది. గత అరవై సంవత్సరాలుగా, నాటక రంగంతో వారికి ఉన్న అనుబంధానికి, చేసిన సేవకు లభించిన గొప్ప గౌరవం ఇది.**



కె.యస్.టి. శాయి

1936వ సంవత్సరం డిసెంబర్ 6వ తేదీన, బాపట్ల సమీపంలోని కంకటపాలెంలో శాయి జన్మించారు. వారి తల్లితండ్రులు శ్రీమతి కాశీ అన్నపూర్ణ, ఆదినారాయణలు. చిన్నతనం నుండే ఆయనలో కళాభిరుచి వెలుగుచూసింది. బాపట్లలోని భావనారాయణ స్వామి కోవెలకు దగ్గరగా, వారి ఇల్లు ఉండేది. ప్రతిరోజూ ఆ దేవాలయంలో జరిగే హరికథల్ని దీక్షతో విని, తానూ అలా హరికథను చెప్పేవాడు. పిల్లలందరూ ఆ కథల్ని విని ఎంతో ఆనందించేవారు. ఆ రోజుల్లోనే అన్నవరపు శివయ్య అనే నటుడు, శాయిలోని ఆసక్తిని చూసి, ప్రోత్సహించి, రామదాసు నాటకంలో రఘురాముడి వేషం వేయించాడు. ఆ చిన్ననాడే ఆయన మిత్రద్రోహి అనేపేరుతో ఓ నాటిక వ్రాసి, పిల్లందరితో కలిసి ప్రదర్శించాడు.

చదువుకునే రోజుల్లో, బాపట్లలోని పూర్వవిద్యార్థి సంఘ



ఎన్టీఆర్ రంగస్థల పురస్కారం అందుకుంటున్న సాయి

వార్షికోత్సవంలో "ఈ ఉత్తరంనాది" అనే నాటిక రచించి ప్రదర్శించారు. ఆ నాటిక చూసిన మాచిరాజు బాలగంగాధరశర్మ అనే గొప్ప దర్శకుడు, శాయిని తన బృందంలోకి తీసుకుని ఎంతగానో ప్రోత్సహించారు. ఇండియన్ నేషనల్ థియేటర్ అనే సంస్థలో శాయి ఎన్నో నాటికలు వ్రాయడం, ప్రదర్శించడం జరిగింది.

1962లో మనదేశంపై చైనా దురాక్రమణ చేసింది. ఆ దురాక్రమణని ఖండిస్తూ, "జననీ జన్మభూమిశ్చ" అనే నాటకం వ్రాసి, ఎన్నో చోట్ల ప్రదర్శించి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసిన దేశభక్తుడు ఆయన. ఆ నాటకంలో ఆయన వేసిన సిపాయి వేషం, ఆయనకెంతో పేరు తెచ్చింది.

కళాకారుడు ఓ సాంస్కృతిక సైనికుడనీ, ఒక ఒక ఆయుధమనీ, దానితో ప్రజాసమస్యల్ని పరిష్కరించవచ్చనీ నమ్మిన కళాకారుడు శాయి. అందుకే ఆయన ప్రజానాట్యమండలిలో రచ్చబండ వంటి నాటిక రచించి, ఎన్నో ప్రదర్శనలు చేసారు.

1955-56 సంవత్సరాలలో, ఆంధ్రవిశ్వకళా పరిషత్. తరఫున ఒక కళాబృందంతో ఢిల్లీ వెళ్లి, అఖిలభారత స్థాయి సాంస్కృతికోత్సవాలలో పాల్గొన్నారు. అప్పుడే ఆనాటి భారతరాష్ట్రపతి డా॥బాబూరాజేంద్రప్రసాద్, ఉపరాష్ట్రపతి డా॥సర్వేపల్లి రాధాకృష్ణన్, ఆనాటి మన ప్రధాని నెహ్రూ, ఇందిరాగాంధీల వంటి మహామహులు వీరి ప్రదర్శనను చూసి, ఎంతగానో ప్రశంసించారు.

తెలుగు నాటకరంగంతో ఏకమైపోయిన జీవితం ఆయనది. నటుడిగా ఆయనెంతో కీర్తి పొందారు. గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం నాటకంలో "గిరీశం" వేశాన్ని, వందప్రదర్శనలు చేశారు.

# డా॥ చిట్టినేని శివకోటేశ్వరరావుకి
## నాటక గ్రంథ రచనా నంది అవార్డ్



***ఉత్తమనాటక గ్రంథరచనకు, ప్రతిఏటా రాష్ట్రప్రభుత్వం ఇచ్చే నంది అవార్డ్స్, 2011వ సంవత్సరానికి డా॥ చిట్టినేని శివకోటేశ్వర రావు అందుకున్నారు. "తెలుగు నాటకరంగంలో జానపదకళారీతులు" అన్న వారి పరిశోధనా గ్రంథానికి ఈ పురస్కారం లభించింది.***

శివకోటేశ్వరరావు వృత్తిరీత్యా వాణిజ్య శాస్త్ర అధ్యాపకుడు. కానీ ప్రవృత్తిరీత్యా నాటకరంగ పరిశోధకుడు. ఎన్నో పెద్ద పదవుల్ని నిర్వహిస్తూ కూడా, నాటక రంగాన్ని వదలలేదు ఆయన. అంతేకాదు ఒకవైపు ఉద్యోగం చేస్తూనే, మరొకవైపు నాటకరంగపరిశోధన సాగిస్తూ వచ్చారు. నాటకం అంటే ఆయనకు వల్లమాలిన ప్రేమ, అనురాగం అందుకే ఆంధ్రవిశ్వవిద్యాలయంలో నాటకంపై డిప్లొమా చదివారు కూడా!

ఆంధ్రవిశ్వవిద్యాలయం నుండి ఎమ్.కాం. పట్టా పొందిన తరువాత గుంటూరులోని విజ్ఞాన్ కళాశాలలో కొంతకాలం వాణిజ్య శాస్త్రోపన్యాసకుడిగా పనిచేశారు. ఆ తరవాత విజ్ఞాన్ పబ్లిక్‌పాఠశాలకు జనరల్ మేనేజర్‌గా, విజ్ఞాన్ విద్యాసంస్థ ఆర్థిక నిర్వహణ చూస్తూ, భాగస్వామిగా కూడా కొనసాగారు. ఆ తరువాత కాటూరి వైద్యకళాశాలకు ఫైనాన్స్ మేనేజర్‌గా సమర్థవంతంగా పనిచేసి ఉత్తమ నిర్వాహకుడని ప్రశంసించబడ్డారు. ఇదంతా ఆయన ఉద్యోగజీవితం మరి ఆయన కళాజీవితం మూడు గొప్ప అంశాల సమాహారం. వాటిలో మొదటిది ఆయన మంచి నటుడు. ఎన్నో పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేశారు. ఎన్నో పరిషత్తులలో వార నటించిన నాటకాలు, నాటికలు ఎన్నో బహుమతుల్ని గెల్చుకున్నాయి. వారిలో కన్పించే మరో లక్షణం, నిర్వహణా సామర్థ్యం. 1982 నుండీ గుంటూరులో ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాల్ని నిర్వహించారు. గుంటూరు కళాపరిషత్‌కు ఆరేళ్లపాటు జనరల్ సెక్రటరీగా నాటకరంగానికి ఎంతగానో చేయూతనిచ్చారు. చిల్డ్రన్ థియేటర్ అన్న అంశంపై వారెన్నో పరిశోధనా పత్రాలు సమర్పించారు.


నంది అవార్డ్ అందుకుంటున్న చిట్టినేని

ఇక వారి నాటక ప్రస్థానంలోని అతిముఖ్యమైన అంశం వారి పరిశోధన. "తెలుగునాటకంపై జానపదకళారీతులు" అన్న వారి పరిశోధనకు బెర్హంపూర్ విశ్వవిద్యాలయం, పిహెచ్.డిని ప్రదానం చేసింది. ఆ పరిశోధనకు ఒడిశారాష్ట్రంలోని ఆనాడు వారికి బంగారు పతకం లభించింది. ఆ గ్రంథానికే నేడు ఉత్తమ నాటక గ్రంథంగా నంది అవార్డ్ -2011 లభించింది. డా॥చిట్టినేని శివకోటేశ్వరరావు నాటకరంగంపై మరిన్ని పరిశోధనలు చేస్తారని తెలుగు నాటకరంగ వికాసానికి ఎంతగానో దోహదపడతారని మనసారా ఆశిద్దాం?

---

**కె.యస్.టి. శాయి** పాటిబండ్ల ఆనందరావు రచించిన, పడమటిగాలిలో, కోడిపెంట అంజయ్య పాత్రలో ఎనభై ప్రదర్శనలు, శిల్పం నాటకంలో ధర్మయ్యగా నూటయాభై ప్రదర్శనలు... ఇలా ఎన్నో వందలాది ప్రదర్శనలు చేశారు. రచయితగా ఎన్నో నాటికలు, నాటకాలు వ్రాశారు. "కోపం, ఉత్తరం, దొంగపపెళ్లి, టులెట్, సుమతి, అసమర్థుని డైరీ, కలిపురుషుడు, పునర్జీవం, భోగిమంటలు, పులీమేకా ఇలా ఎన్నో నాటికలు, నాటకాలు ఆయనలోని రచనా సామర్థ్యానికి ప్రతిబింబాలు.

సాంఘిక నాటకాలతో బాటుగా ఎన్నో చారిత్రక పౌరాణిక నాటకాలలోనూ నటించారు. కె.ఎస్.టి. శాయి. ఎన్నో నాటక పరిషత్తులకు న్యాయనిర్ణేతగా సేవలందించారు కూడా!

అభినయ సమ్రాట్ అనీ, నాటకరంగ కృషీవలుడనీ, రంగవిరించి అనీ, ఎందరో ఎన్నో బిరుదులిచ్చి శాయిని గౌరవించారు. ఈ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా ప్రతిష్ఠాత్మకమైన ఎన్టీఆర్ రంగస్థల పురస్కారంతో వారిని గౌరవించింది. వారి జీవితంలో అన్నిటి కన్నా గొప్ప విషయం, వారెంతో మంది రచయితల్ని, దర్శకుల్ని, సాంకేతికుల్ని, నటీనటుల్ని ప్రోత్సహించారు. తన కళాప్రతిభను, ఎందరికో పంచిపెట్టి, వారిని గొప్పవాళ్లుగా తీర్చిదిద్దారు. నేటికీ దిద్దుతున్నారు.

నాయుడు గోపి, భారతుల రామకృష్ణ వంటి ఎందరో శిష్యులు ఈనాడు నాటకరంగంలో గురువుకి తగ్గ శిష్యులయ్యారు. ఇంతకన్నా అదృష్టం ఇంకేముంటుంది?

# నందిపురస్కారం అందుకున్న సుప్రసిద్ధ నాటక రచయిత

# డా॥ కందిమళ్ళ సాంబశివరావు



***నాటకరచయితగా, సుప్రసిద్ధులు డా॥కందిమళ్ళ సాంబశివరావు. 1959వ సంవత్సరం జూలై 1వ తేదీన, ప్రకాశంజిల్లా కోలలపూడిలో జన్మించిన వీరు, తెలుగు నాటకరంగంలో ఎన్నదగిన వ్యక్తుల్లో ఒకరు.***

1970వ సంవత్సరంలో నాటకరంగంలో అడుగుపెట్టి, గత నలభైరెండేళ్ళుగా నాటక రచయితగా, నటుడిగా, విమర్శకుడిగా, గుణనిర్ణేతగా, పరిశోధకుడిగా, గ్రంథరచయితగా ఇలా బహుముఖంగా నాటకరంగానికి సేవలందిస్తున్న విశిష్టులు కందిమళ్ళ.

"ఉప్పుకప్పురంబు, సారాసంహారం, భూమిక, ముద్రారాక్షసం, నల్లసముద్రం, వఱడు, ఖడ్గసృష్టి, జలచైతన్యం, నల్లరేగడి, ఎగిరేపావురము, పుణ్యభూమి కళ్ళుతెరువు, మరణమృదంగం, అగ్నివర్షం, సైసైజోడెడ్లాబండి, నల్లజర్లరోడ్డు వంటి ఆణిముత్యాల వంటి నాటకాలు ఎన్నింటినో రచించిన గొప్ప నాటక రచయిత డా॥ సాంబశివరావు.

వారి రచనలన్నీ విజయవంతమై రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాలలో ఎన్నో వందల బహుమతుల్ని గెల్చుకున్నాయి. సారావ్యతిరేకఉద్యమ సందర్భంలో వారి రచన "సారాసంహారం" రాష్ట్రవ్యాప్తంగా రెండు వేల ప్రదర్శనలు చేయబడింది. ఆకాశవాణి అన్ని కేంద్రాల నుండీ ఈ నాటికను ఎన్నో మార్లు ప్రసారం చేసింది. వారి మరో రచన "వఱడు" ఒరిస్సా రాష్ట్రంలో డిగ్రీ రెండవ సంవత్సరం విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా నిర్ణయించబడి, తెలుగునాటకానికే గౌరవం తెచ్చింది. ఖడ్గసృష్టి నాటిక హిందీలోకి అనువదించబడి, జాతీయ స్థాయిలో ఉత్తమ నాటకంగా ప్రథమబహుమతిని అందుకుంది.

డా॥కందిమళ్ళ గొప్ప పరిశోధకులు. "తెలుగు నాటకరంగం నూతన ధోరణులు–ప్రయోగాలు" అనే వారి పరిశోధనా గ్రంథానికి వారికి డాక్టరేట్ లభించింది. "గుంటూరుజిల్లా నాటకరంగ చరిత్ర" అనే వారి సిద్ధాంత గ్రంథంతో వారు డిలిట్ అందుకున్నారు. ఇప్పుడు 2010వ సంవత్సరానికి వారికి ఉత్తమనాటక గ్రంథరచయితగా నంది అవార్డ్ లభించింది.

వీటితో పాటుగా, నాటకరంగంపై వివిధ విశ్వవిద్యాలయాలు నిర్వహించిన అనేక జాతీయ సదస్సులలో పాల్గొని ఎన్నో పరిశోధనా పత్రాలు సమర్పించారు. అవన్నీ నాటకరంగంపై పరిశోధన చేసేవారికి అమూల్యమైన ఆధారాలు. దిన, వార, పక్షపత్రికలలో 200 లకు పైగా నాటకరంగ వ్యాసాలు వ్రాసిన గొప్ప వ్యాసకర్త వారు. వీటన్నింటికీ తోడుగా రోటరీ ఇంటర్నేషనల్ 315కి అసిస్టెంట్ గవర్నర్‌గా వారు అందించిన సేవలు అమోఘమైనవి. వారు శతాధిక సంవత్సరాలు జీవించి, తెలుగునాటక వికాసానికి మరింతగా కృషి చేయాలని ఆకాంక్షిద్దాం.


నంది అవార్డ్ అందుకుంటున్న కందిమళ్ళ

email:
vadrevusundarrao@gmail.com

# విశాలాక్షి- ఇంటింటా తెలుగు సాహిత్య మాసపత్రిక

## తెలుగు పత్రికలు - సంపాదకులు



కోసూరు రత్నం

పుస్తకాలు, పత్రికలు లేని ప్రపంచాన్ని నేడు ఊహించుకోలేం. ఈప్రపంచంలో పుస్తకం ఓ అద్భుతం. ఎందరెందరో భాషాభిమానం, దేశాభిమానం, సమాజశ్రేయస్సు, ఉద్యమస్ఫూర్తితో పత్రికలు స్థాపించి పాఠకులకు అందుబాటులోకి తెస్తున్నారు. లెక్కకు మిక్కిలిగా వెలువడుతున్న పత్రికలలో చిరకాలం నడిచేవి-పాఠకాభిమానం పొందేవి కొన్నే. పత్రికలను పాఠకాభిమానం పొందేలా సారథ్యం వహించేవాడు సంపాదకుడు. అలాంటి సంపాదకులను ***64***కళలు.కామ్‌లో నెల-నెలా పరిచయం చేసే శీర్షికే తెలుగుపత్రికలు-సంపాదకులు.




పత్రికలను నడపటం కంటే సాగరాన్ని ఈదటం చాలా సులభం. ఎందుకంటే సాహిత్యానికి ఎంత విలువ ఉందో. సాహిత్యాన్ని అందించే పత్రికలు అంతే విలువ ఉంది. ప్రోత్సాహం లేకపోవటం వల్లనే ఈనాడు సాహితీప్రియులకు తగినన్ని పత్రికలు రావటంలేదు. వచ్చినా ఎక్కువ కాలం నిలబడడంలేదు.

ఎంతో మంది రచయితలు, కళాకారులు, కవులు మేధావులు పుట్టిన నెల్లూరులో సాహితీ ప్రియులూ ఎక్కువే. కాని ఇంతపెద్ద నగరానికి అందుబాటులో సరైన పత్రికలు లేవు. ఆ లోటు తీర్చటం కోసం సాహితీ మిత్రులను ప్రోత్సహించటం కోసం మరియు తన చిరకాల కోరిక అయిన వృద్ధాశ్రమాన్ని అభివృద్ధి చేయాలనే లక్ష్యంతో 2010 జనవరిలో విశాలక్షి అనే మాసపత్రికను నెల్లూరు జిల్లాలో ప్రథమంగా స్థాపించారు. సాహిత్యాభిలాషి, సేవాతత్పరుడు పత్రికా సంపాదకుడు-పబ్లిషర్ కోసూరు రత్నం, సాహిత్యం మీద ప్రేమ, అభిమానంతో పాటు తను స్థాపించిన విశాలాక్షి వృద్ధాశ్రమాన్ని గురించి తెలియజేయటానికి వృద్ధుల సేవతో పాటు సాహిత్య సేవ చేయాలనే లక్ష్యంతో పెట్టిన పత్రిక విశాలాక్షి. మంచి పత్రికగా నిలపాలని, ఎవరి సహాయం ఆశించక సొంత ఖర్చులతో నిర్వహిస్తున్నారు కోసూరి రత్నం. ప్రభుత్వంగాని, స్వచ్ఛంధ సంస్థలుగాని, వ్యాపార ప్రకటనల రూపంలో గాని మరే విధంగా అయినా సహాయపడినా విశాలాక్షి వృద్ధాశ్రమాన్ని అభివృద్ధి పరిచి వృద్ధులకు ఇతోధికంగా సహాయ పడటమే ధ్యేయంగా నడుపుచున్న పత్రిక విశాలాక్షి




**అవార్డ్స్** – 2011 హరివిల్లు క్రియేషన్స్ నెల్లూరు వారి ఉగాది పురాస్కారం

2011 డా॥ సి. నారాయణరెడ్డి సేవారత్న అవార్డు హైద్రాబాద్ మరియు అవోచా, లైన్స్‌క్లబ్, రోటరీ, మరియు సోమిరెడ్డి జమున స్మారక అవార్డులు అందుకొన్నారు.

ఈ పత్రికకు వర్కింగ్ ఎడిటర్ ప్రముఖ రచయిత ఈతకోట సుబ్బారావు.

# కోసూరి రత్నం గారి గురించి



శ్రీమతి కనకమ్మ, కొండయ్యగార్ల ముద్దుబిడ్డ. ఆత్మకూరు తాలూకా ఇనగవరం గ్రామంలో జన్మించి-చిన్న నాటి నుండీ తల్లి ప్రోత్సాహం, ఆదరణ, ప్రేమ వంటబట్టించుకొని తన జీవితాన్ని ఆదర్శవంతంగా మలచుకొన్న శిల్పి.

"ఆకలిగొన్న వారిని అంత అన్నం పెట్టరా"... అనేది మా అమ్మ అంటారు. ఆయన. పుట్టినదీ, పెరిగినదీ గ్రామీణ నేపథ్యంలో. డిగ్రీ పుచ్చుకొని 1982లో మెడికల్ రిప్రజెంటేటివ్‌గా వృత్తి చేపట్టినా... ఆయన మనసు" సమాజానికి నేనేం చేయగలను?" అనే ఆలోచనతోనే రోటరీ ద్వారా పెక్కు రక్తదాన శిబిరాలూ, ఆరోగ్య పరీక్షల క్యాంప్స్ నిర్వహించారు. అవి తనలోని సేవా దాహార్తిని తీర్చలేదు. మథర్‌థెరీస్సా సేవా స్ఫూర్తి తనకు మార్గదర్శకమని నమ్మి 2002 తన ఆస్థిలో కొంత అమ్మివేసి రూ.8.5 లక్షలతో విశాలాక్షి వృద్ధాశ్రమాన్ని స్థాపించారు.

ఆర్థికబలం లేకున్నా... గొప్ప సంకల్ప బలం మెండుగా వుంది. చిత్తశుద్ధి తోడై ఉన్నత ఆశయాలే లక్ష్యంగా సేవే మార్గం అని నమ్మి ఎలాంటి ప్రభుత్వ గ్రాంట్లూ ఏవీ లేకున్నా... నేడు 60 వయసు పైబడిన 32మంది వృద్ధుల్ని ఆశ్రమంలో చేరదీసి అక్కున చేర్చుకొని ఆనందిస్తున్నారు.

"ఆదర్శప్రాయంగా జీవించాలన్నదే నా లక్ష్యం.. పదిమందీ నన్ను, నా తరువాత కూడా తలుచుకొనేలా నా తల్లితండ్రులకు పేరు తెచ్చేలా జీవించాలనేదే నా ఆశయం" అంటారు ఆయన.




పిల్లల నిరాదరణకు గురైన వృద్ధులు, ఒంటరి తనంతో ఆర్థికంగా మరో దారిలేని పేదలూ వున్నారు ఆశ్రమంలో.

అనతికాలంలోనే విశాలాక్షి మంచి విలువలు గల మాసపత్రికగా పేరు సంపాదించుకుంది. తొలి వార్షిక వేడుకలు జరిపిననపుడు శ్రీ యండమూరి వీరేంద్రనాథ్‌గారు ఆత్మీయ అతిథిగా విచ్చేసి "విశాలాక్షి" పత్రిక మరో 'భారతి'లో ముద్రితమైన కవితలకు ముగ్ధుడై శ్రీ వీరేంద్రనాథ్‌గారు ఇద్దరు కవులకు బంగారు పతకాలు యివ్వడం ఆ పత్రికలోని సాహిత్య విలువలకు అద్దం పడుతుంది.

వృద్ధాశ్రమం నిర్వహణలో తెలిసిన దాతల స్థానికుల సహాయం స్వీకరించినా-నిర్వహణ పెనుభారమే. వీరి సహధర్మచారిణి శ్రీమతి లక్ష్మిగారు స్వయంగా వృద్ధులకందరికీ ఆమె వంటచేయడం బహుదా ప్రశంసనీయం.

మీరు యిక ముందు యింకేం చేయాలను కుంటున్నారు అని అడగ్గానే.. తన మనసులో దాచుకున్న తన ఆశయాల్ని బయటపెట్టారు.

'విశాలాక్షి' ఆశ్రమాన్ని రాష్ట్రంలోనే బెస్ట్ ఆశ్రమంగా చేయాలనీ... పల్లెలో ఆదరణకు నోచుకోని, అడుక్కునే పిల్లలు వుంటారనీ వారికి విద్యాభ్యాసాలు నేర్పి సంస్కారవంతులను చేయాలనే ఆశయం వున్నదన్నారు.

ఆర్థికంగా బలహీనులై... చక్కటి ప్రతిభ కనబరిచే విద్యార్థులను ఆదుకోవాలనీ... గుడ్డి, మూగ, చెవిటి మానసిక వికలాంగ పిల్లలకోసం ఒక స్కూల్ స్థాపించాలనేది తన సంకల్పంగా అభివర్ణిస్తారు శ్రీరత్నంగారు.

మెరిసే కళ్ళు...

పెదవులపై తరగని చిరునగవు,

పలకరింపులో ఆప్యాయత

మంచి చేయాలనే తలంపు...

యివన్నీ కలగలిపితే

ఆవిష్కృతమౌతారు శ్రీ కోసూరి రత్నంగారు.

మమతను పంచే సహృదయుల ఆశయాలు సిద్ధించాలని ఆకాంక్షిద్దాం...

# కళావల్లభ బళ్ళారి రాఘవ

**( 2-8-1880--16-4-1946 )**

- వాడ్రేవు సుందర్రావు
నంది, గరుడ అవార్డుల గ్రహీత

*భారతజాతిపిత మహాత్మాగాంధీజీ ఎవరి నటనకు జేజేలు పలికాడో...*

*పుంభావసరస్వతి విశ్వకవి రవీంద్రుడు ఎవరి అభినయాన్ని కోరి.. మరీ చూశాడో...*

*ప్రపంచ ప్రఖ్యాత ఆంగ్ల నాటకకర్త జార్జి బెర్నాడ్‌షా ఏ నటుడి ముందు వినయంగా తలవంచాడో...*

*ఎవరి నటనాకీర్తి సప్త సముద్రాలను దాటి, ఖండ ఖండాంతరాలలో ఖ్యాతిగాంచిందో...*

ఎవరిపాత్రపోషణ నవరసాలకూ నిలయంగా, నాట్యవేదానికి నిర్వచనంగా నటనాప్రతిభకు నిలువెత్తు నిదర్శనంగా, నటనాశిల్పానికి సజీవదర్పణంగా సర్వకాలీనమైన పాఠ్యంగా, సమస్త కళా ప్రపంచానికి వెలుగుదివ్వెగా, సకల నటీనటజగత్తుకు ఆదర్శప్రాయంగా, అనుసరణీయమైన మార్గంగా అపూర్వమైన సన్నివేశంగా, అపురూప కథాచిత్రణగా నిలిచిందో,....... ఆ నటుడు, మనవాడు... మన తెలుగువాడు.... అంటే గర్వంతో హృదయం ఉప్పొంగనిదెవరికి? ఆనందంతో పరవశించనిదెవరు?

ఆ నటుడు వేరెవరో కాదు... ఆయనే రాఘవ.

మహానటుడు బళ్ళారి రాఘవ.

తెలుగు నాటకరంగ చరిత్రలో ఒక నూతనశకానికి నాంది బళ్ళారి రాఘవ. తెలుగు నాటకానికి ఉజ్వలోజ్వలమైన భవితను ప్రసాదించిన ధన్య పురుషుడు రాఘవ. తెలుగు, కన్నడ, హిందీ, పార్సీ భాషలతో పాటుగా, ఆంగ్లభాషలోనూ అసమానమైన రీతిలో ఎన్నెన్నో పాత్రల్ని పోషించి, చిరస్మరణీయుడైన నటశ్రేష్ఠుడు రాఘవ. నటుడిగా ఎంతటి మహోన్నతుడో, అంతకు మించిన గొప్ప మానవతావాది. మానవ జీవనలోతుల్ని మనసారా గ్రహించిన మహనీయుడు రాఘవ. సాటిమనిషి కష్టానికి రాఘవ హృదయం కరిగిపోయేది. ఆపన్నులను ఆదుకోవడానికి, తన సర్వస్వాన్ని సైతం త్యాగం చేయడానికి సంసిద్ధుడై నిలిచిన మానవోత్తముడు రాఘవ.

బళ్ళారి రాఘవ మోహనరూపం, మధురమైన వాక్కు, గంభీరమైన స్వరం, అపూర్వమైన నటనాకౌశలం, కరుణార్ద్రమైన హృదయం, సహజమైన హాస్యప్రియత్వం, నిస్వార్ధ సేవాతత్పరత కళాకారులకే కాదు, సమస్త మానవాళికీ నిత్యస్మరణీయులు. సర్వదా శిరోధార్యాలు.




ఆధునిక తెలుగు నాటకరంగం ఆవిర్భవించిన 1880లోనే, బళ్ళారి రాఘవ జన్మించడం యాదృచ్ఛికం కాదు. ధార్వాడ నాటక సమాజం తెలుగునేలలో పర్యటించిన కాలం అది. కందుకూరి వీరేశలింగం తెలుగునాటకానికి తొలి ప్రయోక్తగా నిలిచిన, 1880లోనే బళ్ళారి రాఘవ జన్మించడంలో, ఏదో భవిష్యత్ సూచన ఉంది అన్నది నిశ్చయం. రాఘవ తండ్రి నృసింహాచారి. బళ్ళారి మునిసిపల్ హైస్కూల్‌లో తెలుగు పండితులుగా పనిచేసిన నృసింహాచారి అష్టావధాని. తెలుగు నాటక పితామహుడిగా పేరొందిన ధర్మవరం రామకృష్ణమాచార్యులు సోదరి శేషమ్మగారిని నృసింహాచార్యులు వివాహం చేసుకొన్నారు. వీరవైష్ణవులు వారు. ఎంతో సౌజన్యం, సహృదయం మూర్తీభవించిన జంట వారిది. నిజానికి వారిది అనుకూల దాంపత్యమే కానీ, ఎంత కాలానికీ వారికి సంతానం కలగకపోవడమే పెద్దలోటుగా ఉండేది. సంతానం కోసం ఎన్నో వ్రతాలు చేసారు. నోములు నోచారు. తీర్థయాత్రలు చేసారు.

కాలం గడిచిపోతున్న కొలదీ వారి దు:ఖం మరింత

తీవ్రమవుతూ వచ్చింది. అదే సమయంలో బళ్ళారిలో గడిగి వీరభద్రప్పగారి ఇంటి దగ్గర "బసప్ప" అనే అవధూత ఉండేవాడు. నృసింహాచార్యుల దంపతులు బసప్పను భక్తితో సేవించారు. అవధూత ఎంతో సంతోషించి, ఆ దంపతులను అనుగ్రహించాడు. అవధూత వరంతో ఆ దంపతులకు ఒక పుత్రుడు ఉదయించాడు. ఆ పుత్రుడికి "బసప్ప" అని పేరు పెట్టారు. కానీ కొన్నాళ్ళకు వైష్ణవ సంప్రదాయాన్ని అనుసరించి రాఘవాచార్యులని పిలుస్తూ వచ్చారు. నిజానికి వారి ఇంటిపేరు తాడిపర్తివారు. ఆవిధంగా చూస్తే ఆయన తాడిపర్తి రాఘవాచార్యులు. కానీ బళ్ళారిలో నివాసం ఉండడం వల్ల, బళ్ళారి రాఘవగా ప్రసిద్ధిపొందారు. కన్నడ కళావేత్త కైలాసం, రాఘవకు "రెగ్గీ" అనే ముద్దుపేరు పెట్టారు కూడా.

చిన్నతనం నుండీ కథలంటే రాఘవ చెవి కోసుకునేవాడు. మధురమైన కంఠస్వరం ఆయనకు పుట్టుకతోనే లభించిన ఓ వరం. రాఘవకు ఆరేళ్ళ వయసు ఉన్నపుడు ఓ నాటక సమాజం తాడిపత్రి గ్రామానికి వచ్చి, "హరిశ్చంద్ర, లంకాదహనం, కంసవధ" నాటకాలు ప్రదర్శించింది. ఆ మూడు నాటకాలు, ఆ బాలుడి హృదయంలో నటించాలనే ఆసక్తిని రేకెత్తించాయి. ఆ తరువాత ఎక్కడ నాటక ప్రదర్శన జరిగినా, రాఘవ తప్పకుండా వెళ్ళేవాడు. మెట్రిక్యులేషన్ పరీక్ష వరకూ, రాఘవ చదువు బళ్ళారిలోనే సాగింది. కళాశాల విద్యకోసం మద్రాస్ (నేటి చెన్నై) చేరిన రాఘవ సుగుణ విలాస సభలో సభ్యుడయ్యాడు. మద్రాస్‌లోని లా కళాశాలలో, న్యాయవాదవిద్య చదువుతున్నప్పుడు, రాఘవలోని నటనాసక్తిని తగిన ప్రోత్సాహం లభించింది. ఆనాటి లా కళాశాల ప్రిన్సిపాల్ ఆర్థర్ డేవిస్ గొప్ప నాటకవేత్త. ఆంగ్లంలో షేక్స్‌పియర్ మహాకవి రచించిన నాటకాలన్నింటినీ ఔపోసన పట్టిన గొప్ప ప్రతిభావంతుడు. ఆయన దృష్టి రాఘవపై పడింది. ఆనాటినుండే ఆంగ్ల నాటకాలలోని ఎన్నెన్నో అమోఘమైన పాత్రలు రాఘవకు నూరిపోశాడు. షేక్స్‌పియర్ మహాకవి సృష్టించిన ఎన్నో పాత్రల్ని రాఘవ మథించి, వాటికి తనదైన సృష్టి చేసాడు. షైలాక్, హేమ్లెట్, ఒథెల్లో పాత్రల్లో ఆయన నటన అసామాన్యం.

మద్రాస్ నుండి తిరిగి వచ్చి బళ్ళారిలోనే తన న్యాయవాద వృత్తి ప్రారంభించాడు రాఘవ. అచిరకాలంలోనే న్యాయవాదిగా రాఘవాచార్యుల పేరు బళ్ళారి జిల్లా అంతా వ్యాపించింది. కోర్టులో ఆయన వాదన వినడానికి ఎక్కడెక్కడినుండో ప్లీడర్లు వచ్చేవారట. ఆయన వాదిస్తున్నంతసేపూ, ఆయన ప్రదర్శించే హావభావ నైపుణ్యం చూసి ప్రత్యర్థులు కూడా ఆశ్చర్యపోయేవారట.

ఇదే కాలంలోనే కర్నూల్ నివాసియైన లక్ష్మణరావుగారి కుమార్తె కృష్ణమ్మతో రాఘవ వివాహం జరిగింది. భర్తకు తగ్గ భార్య కృష్ణమ్మ.



అతిథి సత్కారంలో, ప్రజాసేవలో ఆమెకు ఆమే సాటి.

న్యాయవాదవృత్తి చేస్తున్నప్పుడే రాఘవ జీవితంలో రంగస్థలం ప్రధాన భూమికను ఆక్రమించింది. 1906వ సంవత్సరంలో బళ్ళారిలో వాణీవిలాస్ థియేటర్‌లో ఒథెల్లో నాటకం ప్రదర్శించాడు. ఆ నాటకంలో రాఘవ ఒథెల్లోగా నటించగా, వట్టం శ్యామారావు డెస్‌డిమోనా పాత్ర పోషించారు. ఆ ప్రదర్శన ఎంతో విజయవంతం అయ్యింది.

బళ్ళారి పట్టణం కన్నడ, తెలుగు సంస్కృతుల సంగమస్థలం. ఆ పట్టణంలో అందరూ రెండు భాషలూ మాట్లాడతారు. అందువల్ల క్రమంగా రాఘవ కన్నడ నాటకాలు, తెలుగు నాటకాలు రెండింటిలోనూ పాత్రలు ధరించడం ప్రారంభించాడు. ఆంగ్ల నాటకాలు ఆనాటికే రాఘవకు కొట్టినపిండి. కొంత కాలానికి హిందీ నాటకాలు, పార్శీ నాటకాలు కూడా రాఘవాచార్యుల్ని ఆకర్షించాయి. ఈవిధంగా రాఘవ బహుభాషా నటుడిగా రూపుదిద్దుకొన్నాడు.

ఆనాటికి బళ్ళారిలో రెండు సుప్రసిద్ధమైన నాటక సంస్థలు ఉండేవి. ఒకటి కోలాచలం శ్రీనివాసరావు నిర్వహిస్తున్న "సుమనోరమ

సభ''. రెండోది ధర్మవరం రామకృష్ణాచార్యులు నడుపుతున్న "సరసవినోదినీ సభ''. ఈ రెండు సభలూ పోటాపోటీగా నాటకాలు ప్రదర్శించేవి.

రాఘవాచార్యులు ఆజానుబాహుడు. ఆకర్ణాంత విశాలనేత్రుడు. ఎంతో ఆకర్షణీయమైన ముఖవర్చస్సు. కోటేరు లాంటి ముక్కు. విశాలమైన ఫాలభాగం, జులపాల జుట్టు, మెడలో సన్నని బంగారు గొలుసు, గంభీరమైన నడక, బళ్ళారి వీధుల్లో గాని మద్రాస్, బెంగుళూరులలో గానీ ఆయన నడిచివెడుతుంటే, స్త్రీ పురుష భేదం లేకుండా అందరూ సంభ్రమాశ్చర్యాలతో తిలకించేవారట.

ఒక విచిత్రమైన పరిస్థితిలో రాఘవాచార్యులు పౌరాణిక నాటక ప్రవేశం చేశారు. ఒకనాడు "భారతయుద్ధం" అనే నాటకం జరుగుతోంది. మొదటి రంగం పూర్తయ్యింది. ప్రేక్షకులందరూ నాటకంలో లీనమై ఉన్నారు. ఇంతలో ఒక విషాదవార్త తెలిసింది. ధర్మరాజు పాత్ర నటించే నటుడి, కుమార్తెకు కలరా వ్యాధి సోకిందని ఆమె ప్రమాదకరమైన పరిస్థితిలో ఉందని. దానితో ధర్మరాజు పాత్రధారి ఏడుస్తూ ఇంటికి పరుగెట్టాడు. మరి నాటకం ఎలా? ఆ స్థితిలో కోలాచలం వారు పరుగున వచ్చి, ప్రేక్షకులలో ఉన్న రాఘవను బ్రతిమలాడారు. నాటకాన్ని రసాభాసా కానీయకుండా కాపాడమని అర్థించారు. నాటకం నిలబెట్టడం కోసం ధర్మరాజు పాత్ర పోషణకు సిద్ధమై, మేకప్ వేసుకొంటున్నప్పుడే పోర్షన్ చదివించుకువిని, అలవోకగా నటించి, నాటక ప్రదర్శనను విజయవంతం చేశాడు రాఘవ.

పద్మనాభ వెంకోబార్ రచించిన "శివాజీ" నాటకాన్ని రాఘవ ఎంతో గొప్పగా ప్రదర్శించేవారు. కోలాచలం శ్రీనివాసరావు స్వయంగా రచించిన "విజయనగర పతనం" అనే నాటకంలో, రాఘవ నటించిన పఠాన్ రుస్తుం పాత్ర చిరస్మరణీయమైన పాత్రగా ఖ్యాతి పొందింది. మద్రాస్ రాష్ట్ర ప్రభుత్వం ఆ నాటక ప్రదర్శనను నిషేధించింది. 1933వ సంవత్సరం డిశంబరు 25వ తేదీన ఆంధ్ర నాటక కళాపరిషత్ మహాసభ జరిగింది. ఆ సభకు రాఘవ అధ్యక్షత వహిస్తూ, పౌరాణిక నాటకం కన్నా, సమాజ సమస్యలను ఎత్తిచూపి, పరిష్కారాలను సూచించే సాంఘిక నాటకాల వైపు చారిత్రక కథలవైపు, ఎంతగానో దృష్టిపెట్టవలసిన అవసరం ఉందని నొక్కి చెప్పారు. ఆయన దృష్టిలో సన్మానాలు, సత్కారాలు, బిరుదులు అహంభావానికి చిహ్నాలు. ఉత్తమ నటుడి మనస్సు వీటన్నిటికీ అతీతంగా ఉండాలని ఆకాంక్షించేవారు.

కోలాచలం వారి హరిశ్చంద్ర నాటకంలో హరిశ్చంద్రుడిగా ఒక కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టారు రాఘవ. నాటక పాత్ర పోషణలో రాఘవది ఓ ప్రత్యేకమైన ఒరవడి. మహాభారతంలోని దుర్యోధన పాత్రను ఒక ప్రత్యేకమైన పద్ధతిలో రూపకల్పన చేశారు. రాఘవ దృష్టిలో దుర్యోధనుడు మహానాయకుడు. సంకల్పసిద్ధుడైన మహారాజు. ఆయన దృష్టిలో దుర్యోధనుడు దుర్మార్గుడు కాదు. కృష్ణ సంకల్పసిద్ధికి పరిపూర్ణంగా సహకరించిన పరమ భాగవతోత్తముడు. ఈ భావాలన్నింటినీ దుర్యోధన పాత్రలో ఆయన ఎంతో గొప్పగా ప్రకటించి, ప్రేక్షకులచేత జేజేలందుకొన్నారు. ముఖ్యంగా హిరణ్యకశిప, రావణ, కంస పాత్రల చిత్రణలో బళ్ళారి రాఘవ ప్రదర్శించిన నేర్పు చిరస్మరణీయం. వారిని దుర్మార్గులుగా, దుష్టులుగా చిత్రించే విధానానికి భిన్నంగా, వారిలోని ఔన్నత్యాన్ని కూడా చూపించే విధంగా తీర్చిదిద్దాడు రాఘవ. హిరణ్య కశిపునిలోని రాజ్యనిర్వహణ సామర్థ్యాన్ని, రావణాసురునిలోని గొప్ప శివభక్తిని, కంసునిలోని కార్యదీక్షతను ప్రస్ఫుటంగా చూపి, దుష్టపాత్రలను కూడా విశిష్టమైనవిగా తీర్చిదిద్దిన బళ్ళారి రాఘవ నిజంగా మహోన్నతుడు.

రాఘవ నటనాజీవితంలో మరొక మరపురాని పాత్ర రామదాసు. ధర్మవరం గోపాలాచార్యులు రచించిన "రామదాసు" నాటకంలో, రాఘవ ప్రదర్శించిన రామదాసు పాత్ర మహోన్నతమైనది. భక్తిభావంలోని వైవిధ్యాలన్నింటినీ తన అసమానమైన నటనా నైపుణ్యంతో రాఘవ ప్రదర్శించిన తీరు, వర్ణించడానికి మాటలు చాలవు. రామదాసు పాత్ర కరుణరసంతో ఆరంభమై, అక్కడి నుండి ఆర్ద్రమై, దాని నుండి వ్యంగ్యంవైపు మరలి, తరువాత ఆవేశం చేరి, ఇలా అది రంగస్థలంపై సాగే ఒక అద్భుతమైన కావ్యంగా నిలిచేది.

విశ్వకవి రవీంద్రుడు, సి.ఎఫ్.ఆండ్రూస్ కలసి బెంగుళూరు వచ్చినపుడు బళ్ళారి రాఘవ నటించిన "ప్రహ్లాద" నాటకం చూశారు. హిరణ్య కశిపుడిగా రాఘవాచార్యుల నటనకు పరవశించి, రాఘవను తన విడిదికి పిలిపించుకొని, దైవదత్తమైన కళాప్రతిభ మీది అంటూ ప్రశంసించారు.

భారత స్వాతంత్ర్య పోరాటంలో దేశమంతా పర్యటిస్తూ గాంధీ మహాత్ముడు ఒకసారి బెంగుళూరు వచ్చినపుడు ఆయన గౌరవార్థం అమెచూరు అసోసియేషన్‌వారు పండిత తారానాథ్ రచించిన దీనబంధు కబీర్‌దాసు నాటకాన్ని ప్రదర్శించారు. నాటకం చూడడానికి కేవలం ఇరవై నిమిషాలు మాత్రమే గాంధీజీకి సమయం ఉంది. కానీ పది నిమిషాలు దాటేక గాంధీజీ నాటకంలో లీనమైపోయారు. ప్రార్థనకు వేళ అయ్యిందని ప్రక్కనే ఉన్న శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచారి గుర్తుచేశారు. ఇంతకన్నా గొప్ప ప్రార్థన ఏముంది అంటూ గాంధీజీ నాటకాన్ని చివరి వరకూ చూసారు. కబీర్‌పాత్రలో బళ్ళారి రాఘవ నటనకు గాంధీజీ హృదయం పరవశించి పరిప్లావితమయ్యింది. ఆ ఆనందంలోనే "రాఘవ మహారాజ్‌కీ జై" అంటూ జేజేలు పలికారు గాంధీజీ. నిజానికి ఒక నటుడికి ఇంతకన్నా




అదృష్టం ఇంకేముంటుంది?

1927లో ఆయన రంగూన్ వెళ్ళి, నాటక ప్రదర్శనలిచ్చి వచ్చాక, ప్రభుత్వం రాఘవను గవర్నమెంట్ ప్లీడర్‌గా నియమించింది. ఆ పదవిలో తొమ్మిది సంవత్సరాలు ఎంతో నేర్పుగా పనిచేసారు ఆయన. ఆయన ప్రతిభకు మెచ్చిన ప్రభుత్వం ఆయనకు రావుబహదూర్ బిరుదునిచ్చి గౌరవించింది.

1928లో రాఘవాచార్యులు ఇంగ్లండ్ వెళ్ళారు. పాశ్చాత్య నాటకరీతులను అధ్యయనం చేసారు. ప్రపంచ ప్రఖ్యాత ఆంగ్ల నాటకకర్త జార్జ్ బెర్నాడ్‌షాతో కేవలం పది నిముషాల ఇంటర్వ్యూకి మాత్రమే అవకాశం లభించింది. రాఘవను చూశాక బెర్నాడ్‌షా వదలలేక పోయారు. అంతే ! కాలం తెలియలేదు. గంటలు గడిచిపోయాయి. మర్చెంట్ ఆఫ్ వెనిస్ నాటకంలోని ఒక సన్నివేశాన్ని – అప్పటికప్పుడే ప్రదర్శించి చూపించాడు రాఘవ. బెర్నాడ్‌షా ఆనందంతో రాఘవని కౌగలించుకొన్నాడు. ఫ్రాన్స్ దేశపు రాజధాని పారిస్‌లో జరిగే అఖిల ఐరోపాఖండ దేశాల నాటక సమ్మేళనానికి సగౌరవంగా రాఘవాచార్యుల్ని ఆహ్వానించారు. భారతీయ నాట్యకళా వైశిష్ట్యం అనే అంశంపై ఆ మహాసభలో మహోన్నతమైన ప్రసంగం చేసి, శ్రోతల్ని పరవశింపచేసాడు రాఘవ. అక్కడి నుండి జర్మనీ రమ్మని రాఘవని ఆహ్వానిస్తే, జర్మన్ వెళ్ళి నాటకరంగంపై ఎన్నో ప్రసంగాలు చేసి, భారత, ఆంగ్ల, ఫ్రాన్స్, జర్మన్ దేశాల నాటక సంప్రదాయానికి సేతు నిర్మాణం చేసిన కళాస్రష్ట రాఘవ.

రాఘవ సినీ జీవితం చెప్పుకోదగినది. 1935 నుండి 1940 వరకూ రాఘవ సినీరంగంలో కొనసాగి ద్రౌపదీమాన సంరక్షణం, రైతుబిడ్డ, చండిక చిత్రాలలో నటించారు. రాఘవ నటనా ప్రతిభను దర్శించడానికి భవిష్యత్ తరాలకు మిగిలిన అవకాశం ఆ చిత్రాలే. నిత్యం నవ్యతను ఆశించే రాఘవకు రంగస్థలం ఇచ్చినంత సంతృప్తి, చలనచిత్రాలు ఇవ్వలేదు. అందుకే రాఘవ సినీ పరిశ్రమను వదలి తిరిగి, నాటక రంగానికి మరలిపోయాడు.

తెలుగు నాటకరంగంలో సాంఘిక నాటకాల ఆవశ్యకత గురించి రాఘవ ఎంతో నొక్కి చెప్పేవాడు. పి.వి..రాజమన్నార్ వ్రాసిన తప్పెవరిది నాటకాన్ని 1929–30లలో రాఘవ అనేక ప్రదర్శనలిచ్చాడు. ఆయన వ్రాసిన మరొక నాటకం "తెగని సమస్య". రాఘవ ఈ నాటకంలో ఎన్నో మార్పులు, చేర్పులు చేసి, 23–4–1946న బళ్ళారి ఓపెన్ ఎయిర్ స్టేడియంలో ప్రదర్శించి, నాటకమంటే ఇదే అనిపించారు.

బళ్ళారి రాఘవ కేవలం నటుడు మాత్రమే కాదు. నాటకరంగ దార్శనికుడు. నాటకరంగ సంస్కర్త. అభ్యుదయకాముకుడు. ఆలోచనాశీలి. రంగస్థలంపై స్త్రీ పాత్రలు విరివిగా పురుషులు ధరించే రోజుల్లో స్త్రీ పాత్రల్ని స్త్రీలచేతనే ధరింపచేసిన ప్రగతిశీలి. ఒకనాడు నాటకరంగంలో వైభవంగా వెలిగి, చివరి రోజుల్లో ఆకలిబాధతో అలమటించే నిరుపేద కళాకారుల సంక్షేమానికి, పరితపించిన మానవతావాది. పట్టణాలలో శాశ్వత రంగస్థలాలు ఉంటే తప్ప, నాటకం నిలబడదని, అందుచేతే ప్రతీ పట్టణంలో రంగస్థలాల ఏర్పాటు గురించి పదేపదే వివరించి, రంగస్థలాల నిర్మాణానికి తన వంతుగా నాటక ప్రదర్శనలు చేసిన కళోద్ధారకుడు. అంతేకాదు కొత్తనటుల్ని తయారుచేయడానికి నటశిక్షణా కోర్సుల్ని రూపకల్పన చేయాల్సిన అవసరం ఎంతో ఉందని నొక్కి వక్కాణించేవాడు రాఘవ. ఈనాడు అన్ని విశ్వవిద్యాలయాలు, థియేటర్ ఆర్ట్స్ కోర్సులు నిర్వహించి ఎందరినో మహానటులుగా తీర్చిదిద్దటం వెనుక ఆనాటి రాఘవ ఆలోచన ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

చివరి క్షణాల్లో కూడా నాటకం గురించే చర్చిస్తూ, నాటకం గురించే స్మరిస్తూ 1946వ సం॥రం ఏప్రిల్ 16వ తేదీన పౌర్ణమినాడు మంగళవారం రోజున పరమపావనమైన పంపాక్షేత్రంలో రథోత్సవంలో భగవంతుడు ఊరేగుతున్నప్పుడు రాత్రి 11–05 ని॥లకు ఆ కళావల్లభుడు ఈ జీవనరంగస్థలం నుండి నిష్క్రమించి, పంపాపతిలో ఐక్యమయ్యాడు. జాతిజనులకు నిత్యస్మరణీయుడయ్యాడు.

ఏప్రిల్ 16వ తేదీయే మన తెలుగు నాటక దినోత్సవం.కళావల్లభుని కళాప్రతిభకు నిలువెత్తు నీరాజనం సమర్పించే దివ్య సందర్భం, మహత్తర సన్నివేశం ఏటేటా లభించే గొప్ప అదృష్టం. దానిని సద్వినియోగం చేసుకోవడం మనందరి బాధ్యత, కర్తవ్యం.

*email: vadrevusundarrao@gmail.com*





# జయదేవుని అష్టపదులు

- మాకినీడి సూర్య భాస్కర్

## కామజ్వర పీడిత రాధ

తన విరహతాపం గురించి చెలితో మొర పెట్టుకున్న రాధ ఎలాగైతేనేం, తన ప్రియసఖుణ్ణి కలుస్తుంది. మదనజ్వర సంపీడితయైన ఆ రాధాదేవి కృష్ణుడితో తన తియ తియ్యని జ్ఞాపకాలను మళ్ళీ తనసఖితో పంచుకుంటోంది.

**నిభృత నికుంజ గృహం గతయానిశిరహ సినిలీయ హసంతం**
**చకిత విలోకిత సకలదిశా రతిరభసభరేణ హసంతం**
**సఖి! హే కేశిమథన ముదారం**
**రమయమయాసహ మదన మనోరథ భావితయా సవికారం**

సఖీ! నీవెరిగినదే కదా! ఏపుగా పెరిగిన పొదచుట్టూ బాగు చేసుకుని నిర్మించుకున్న పొదరింట్లోరహస్య శృంగార వికారాలు జరుపుకున్నామో! అంతా ఏకాంతం. ఏకాంతంలో ఈ కాంతతో శ్రీకృష్ణుడు...తలచుకుంటుంటేనే తనువూ,మనసూ పులకలేస్తున్నాయి. ఆహా! ఏమని చెప్పను, ఆ కృష్ణ లీలలు...

నాకన్నా ముందుగానే చేరిపోయేవాడు అక్కడికి. ఒక్కసారైనా నేను ముందుండాలనుకునేదాన్ని. ఉహూ...సాధ్యపడలే దెప్పుడూ! ప్రతిసారీ తనే ముందుండేవాడు. ఎందుకో తెలుసా!

నాకన్నా ముందుగా అక్కడ చేరి దాక్కుని నన్నేడిపించేవాడు. రాత్రిపూట...అదీ ఒంటరిగా...అనవసరంగా వచ్చానేమో అనిపించేది. ఆ కటిక చీకట్లో చిక్కుకుపోయానని పించేది. భయపడేదాన్ని. ఒంటరిగా...అక్కడ...నన్నలా ఎవరైనా చూస్తే, ఎంత నగుబాటు!

బాగా ఏడిపించి ఏడిపించి అప్పుడు, ఎక్కణ్ణుంచి వచ్చేవాడో, నా ఎదురుగా ప్రత్యక్షమయ్యేవాడు. పెద్దగా నవ్వుతూ దరిజేరి, “నీ తెలివింతేనా!” అని పరిహాస మాడేవాడు.

ఆ తర్వాత అతడు చేసే రతి రభస అంతా ఇంతా కాదు.చెలరేగిపోయేవాడు...అల్లరి చేసేవాడు. కేశిమథనుడే, నా ప్రియుడు...ఎంతటి ఉదారుడో! నాకు బాగా తెలుసు. ఈ మదనమనోరథాలు తీరేలా...కృష్ణుడి చెంత చేరి గడిపేలా ఏదైనా చేయవే సఖీ! ఈ మన్మథ తాపాన్ని తట్టుకోలేకున్నాను. కాంక్షలూరే కళ్ళు నిరంతరం అతని కోసమే వెదుకుతున్నాయి. చీర ముడి దానికదిగా విడివడి జారిపోతున్నది. మళ్ళీ మళ్ళీ ముడి వేస్తున్నా...పిసరంత లాభం లేదు. మన్మథ వికారాలు నా మనసులోచెలరేగుతున్నాయే, నా సఖీ! ఒక అతివ అదే పనిగా ఒక పురుషుణ్ణి పొగడడం ...ఎలాంటి వికారమంటావు? చెప్పవే!

**ప్రథమ సమాగమ లజ్జితయా పటచాటు శతైరనుకూలం**
**మృదు మధురస్మిత భాషితయా శిథిలీకృత జఘన దుకూలం**
**॥సఖి॥**

మా ప్రథమ సమాగమం తలుచుకుంటేనే మైమరపు కలుగుతోంది. ఎక్కడలేనీ సిగ్గు అప్పుడే ముంచుకొస్తుంది. అదేమిటో నాలో నేను ముడుచుకు పోతాను. నోట్లోంచి ఒక్క మాట వస్తేనా!

ఆ రోజు ఎన్ని మాయ మాటలు చెప్పేడో, కృష్ణుడు. ఆశ్చర్యం. నా సిగ్గు ఎక్కడికి పోయిందో, నాకైతే తెలియలేదు.

అంతా...అదంతా కృష్ణుడి మాయేనమ్మా! అతని మాయలో పడి...నెమ్మదిగా మాట్లాడడం ఆరంభించాను. నన్నలా మాటల్లో పెట్టి, నెమ్మదిగా కోక ముడి ఊడదీశాడు.

ఒక్కటి మాత్రం చెప్పగలను. ప్రథమ సమాగమ వేళ, లజ్జితయైన ప్రియురాలి మోహంలోని సిగ్గునంతా పోగొట్టి, తన కనుకూలంగా స్వాధీన పరచుకునే విద్యలో అతడే సాటి.

ఇదిగో, చూశావూ! కృష్ణుడి ఊహ మనసులో చెలరేగినంతలోనే చీర ముడి దానికదిగా ఎలా జారిపోతోందో! కృష్ణుడే ఊడదీసాడనడం సబబు కాదుగాక కాదు.

**కిసలయ శయన నివేశితయా చిరమురసి మమైవ శయనం**
**కృతపరిరంభణ చుంబనయా పరిరభ్య కృతాధర పానమ్**
**॥సఖి॥**

లేచివురులు పరుపులు మాకు. కిసలయ శయనం ఎంత హాయిగా ఉంటుందో నీకు తెలియదు.నా గుండెలపై తల పెట్టుకుని పడుకునేవాడు. ఆ తదుపరి ఆలింగనం...చుంబనం...గాఢంగా



అధర పానం. ఒక పద్ధతిలో రతి కేళికి సమాయత్తం చేయడం అతనికే తెలుసు.

**అలస నిమీలిత లోచనయా పులకావలి లలిత కపోలం**
**శ్రమజలసకల కళేబరయా వరమదన మదాదతిలోలమ్**
**॥సఖి॥**

కామాతిరేకంలో కళ్ళు నెమ్మదిగా మూతలు పడేవి. అలస నిమీలిత నేత్ర నయ్యేదాన్ని. ఆ ముద్రఆనందాతిశయానికి ప్రతీక. నా సంగతి సరే. అతని చెక్కిళ్ళు కూడా పులకరించిపోయేవి. ఎంత మనోహరమో ఆ చెక్కిళ్ళు! శృంగారం శ్రమ సుమా! ఆ శ్రమకు నాకు ఒళ్ళంతా చెమటలు పట్టి తడిసిపోయేది. అతను మాత్రం ఒళ్ళు తెలియనంతగా 'మదన మదాతి లోలు' డయ్యేవాడు. చెమటలు పట్టడం, ఒళ్ళు కంపించడం, వెంద్రుకలు నిక్కబడుచుకోవడం, గొంతు పూడుకుపోవడం, ముఖం రంగు మారిపోవడం, కళ్ళ వెంబడి నీళు ౣ కారడం...ఎన్నెన్ని మదన వికారాలో!

**కోకిల కలరవ కూజితయా జిత మనసిజ తంత్ర విచారం శ్లథ**
**కుసుమాకుల కుంతలయా నఖ లిఖిత ఘన స్తన భారమ్**
**॥సఖి॥**

ఆ శృంగార సమయంలో నోటి వెంట కోకిల కలస్వనాల్లాంటి శబ్దాలేవేవో వస్తుంటాయి. నేనలా మణికూజితాలు చేస్తుంటే, తనకు తెలిసిన కామశాస్త్ర విద్యలన్నీ ప్రయోగించేవాడు, కృష్ణుడు. కొప్పు విడివడి జుట్టంతా చిక్కులు పడిపోయేది. కొప్పులోని పూలన్నీ జారిపోయేవి. నా పాలిండ్లపై నఖ క్షతాల చంద్ర వంకల్ని రచిస్తూ ఉండేవాడు కృష్ణుడు, ఆ సమయంలో!

**చరణ రణిత మణినూపురయా పరిపూరిత సురత వితానం ముఖర**
**విశృంఖల మేఖలయా సకచగ్రహ చుంబన దానమ్**
**॥సఖి॥**

శృంగార కేళిలో శ్రీకృష్ణునితో మునిగి తేలేటప్పుడు నా కాలికి ధరించిన రతనాల అందియలు ఘల్లు ఘల్లుమని లయబద్ధంగా మోగుతుండేవి. నడుముకు దట్టించి బిగించిన వడ్డాణం గణగణమంటూజారిపోయేది. ఆ సమయంలో నా తలపై చెయ్యివేసి, బుగ్గలు పుణికి పుచ్చుకుని, నాకు ముద్దుల దానంచేసేవాడు.

**రతిసుఖ సమయ రసాలసయా దరముకుళిత నయయ సరోజం**
**నిస్పృహ నిపతితతనులతయా మధుసూదన ముదిత మనోజమ్**
**॥సఖి॥**

లేలేత ఆకుల శయ్య మీద అలసి, నిస్సహాయంగా నా తనూలత డస్సిపోయిన వేళ ... సరిగ్గా అప్పుడా మధుసూదనుడైన కృష్ణుడు ఉదిత మనోజుడే అవుతాడు. తనను అప్పుడే మన్మథుడు ఆవహించినట్లుగా, ప్రవర్తిస్తాడు.

**శ్రీ జయదేవ భణిత మిద మతిశయ మధురిపు నిదువన శీలం**
**సుఖ ముత్కంఠిత గోపవధూ కథితం వితనోతు సలీలమ్ ॥సఖి॥**

ఇది పద్మావతీ ప్రియుడైన మహాకవి శ్రీజయదేవుడు చెప్పిన తీయని లీలలతో కూడిన శ్రీకృష్ణుడి చరిత్ర.

ఉత్కంఠియై గోప వధువు, రాధ పాడిన గీతం, మనల కందరికీ సుఖాన్ని కలుగజేయు గాక!

**శ్లో॥ హస్తస్రస్త విలాస వంశమనృజు భ్రూవల్లి మద్వల్లవీ**
**బృందోత్సారిదృగంత వీక్షిత మతి స్వేదార్ద్ర గండస్థలం**
**మాముద్వీక్ష్య విలజ్జితం స్మిత సుధాముగ్ధాననం కాననే**
**గోవిందం వ్రజ సుందరీగణ వృతం పశ్యామి హృష్యామి చ॥**

ఓ చెలీ! బృందావని నాకు తెలియనిదా? కృష్ణుడు అక్కడ ఏం

చేస్తుంటాడో తెలియదా! ఒకసారి అకస్మాత్తుగా వెళ్ళాను. అప్పుడతడు కొందరు గోపికా స్త్రీజనంతో యధేచ్ఛగా ఉన్నాడు.ఒక్కసారిగా అనుకోకుండా నన్ను చూసి చాలా కంగారు పడిపోయాడు. ఆ తొట్రుపాటులో అతని చేతినుండి విలాసవంతమైన ఆతని పిల్లన గ్రోవి చటుక్కున జారిపడింది తెలుసా!

అసలే తీగల్లాంటి కనుబమలు. వాటిని పైకెత్తి, గొల్లభామల గుంపు వైపుగా తన దృగంత వీక్షణాలను సారించి సైగలు చేశాడు. గోపికలేమన్నా తక్కువ తిన్నారా?! ఆ చూపుల్లోని మర్మార్థ గూఢార్థసంకేతాలను పసిగట్టగలిగిన వారే!

గోపికా జనంతో క్రీడలాడి అలసిన స్వామి చెక్కిళ్ళు చెమటలు పట్టి మెరుస్తుండగా, నన్ను చూసి తాను సిగ్గుపడ నారంభించాడు. అతని దగ్గరొక అస్త్రం ఉంది. అదేంటో తెలుసా! అతని చిరునవ్వే!! దాన్ని ప్రయోగించి ఎంతటివాళ్ళనైనా సునాయాసంగా పడగొట్టేస్తాడు.అంతటి నేర్పు కలిగిన 'స్మిత సుధా ముగ్ధాననుడు' నా స్వామి చిరునవ్వే అతనికి అలంకారం...అదే అతని ఆయుధం. ఆ ఆయుధంతోనే సమస్త లోకాన్ని లోబరుచుకుంటాడు, లీలా మానుష విగ్రహుడు! అలాంటి స్థితిలో గోప స్త్రీ పరివేష్ఠితుడైన శ్రీకృష్ణుని చూసి సంతోషించాలా? వద్దా? ఎవరు చెప్పినా ఏమంటారు గనుక. నవ్వాగలేదు, నాకు. పెద్ద పెట్టున నవ్వేశాను కూడా!

**శ్లో॥ దురాలోకస్తోకస్త బకనవకా శోక లతికా**
**వికాస: కాసారోపవన పవనో అపివ్యథయతి,**
**అపి భ్రామ్యద్భృంగీరణిత రమణీయా న ముకుళ**
**ప్రసూతి శ్చూతానాం సఖి! శిఖరణీయం సుఖయతి!**

చెలీ! ఓ నా చెలీ!! కొత్త అశోక లతలు విరహంలో వేగుతున్నవారికి పూసిన స్తోకస్తబకాలే కదా! చిన్ని చిన్ని పూల గుత్తులు...చూస్తున్న కొద్దీ పెరిగిపోయే విరహం!తోటంతా ఇవే పూలు. అంతకంతకూ పెరిగిపోతున్న విరహం;

తాపోపశమనం కోసం అక్కడక్కడా చెరువులున్నాయి కానీ, ఫలితం లేదు. వాటిపైనుంచి వీచే పిల్ల గాలులు...అవి మరింత బాధించడం కోసమే అలా వీస్తున్నట్లనిపిస్తోంది. ఈ ఉపవనంలోని పవనాలు బాధించడం కోసమే...నన్ను బాధించడం కోసమే ఉన్నాయేమో!

దానికి తోడు, తుమ్మెదల ఝుంకార నాదాలు; అరవిరిసి కొనలుదేరి ఉన్న మామిడి పూలలోని మకరందాన్ని గ్రోలడంకోసం,ఆ పూలు ఎప్పుడెప్పుడు వికసిస్తాయా...ని ఎదురుచూస్తూ ఉన్నాయి మిక్కిలిగా ఉత్కంఠభరితమైన ఆడు తుమ్మెదలు. వాటి ఝుంకార నాదాలు మరీ అసహనం కలిగిస్తున్నాయి.

**శ్లో॥ సాకూత స్మిత మాకులాకులగద్ధమ్మిల్ల మొల్లాసిత**
**భ్రూవల్లీ కమళిక దర్శిత భుజామూలోర్థ్వహస్త స్తనం**
**గోపీనాం నిభృతం నిరీక్ష్య గమితాకాంక్షశ్చిరం చిన్తయ**
**న్మంతర్ముగ్ధ మనోహరం హరతు వ్ణ క్లేశం నవ్ణ కేశవ్ణ**

పైకి చిరునవ్వులు రువ్వుతున్నారు గోపికలు. కానైతే, ఆ నవ్వు వెనుక చాలా అర్థాలు; ఒక్కొక్కరి నవ్వు ఒక్కో సంకేతాన్నిస్తోంది. సాకూత స్మితాలు కదా, నర్మగర్భం!

కామాతురతలో కలిగిన గగుర్పాటుకు చిక్కుముడి కొప్పు జారిపోతూ ఉంటే... జారిపోయే ఆ జుట్టును ముడి వేసే ప్రయత్నంలో చేతుల్ని నిలువునా పైకెత్తేది అందుకోసమేనా?! అదో వంక; అలా పైకెత్తి, బాహు మూలాల్నీ, స్తన ద్వయాల్నీ ప్రదర్శిస్తూ...తీగల్లాంటి తమ కనుబొమ్మల్ని ఎత్తి క్రీగంట తననే చూస్తున్న ఆ గోపికల శృంగార కార్య కలాపాలనన్నీ గమనిస్తూనే ఉన్నాడు శ్రీకృష్ణుడు. ఏమీ ఎరుగని వాడిలా అమాయికత్వాన్ని నటిస్తూ ఎవరెవరు తన మీద ఎంతెంత మమకారాన్ని కలిగి ఉన్నారో కనిపెట్టే ఆ శ్రీకృష్ణుడు మన కష్టాల్ని తొలగించు గాక!

*email: makineedi.telugusubmissions@gmail.com*

64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :2 సంచిక :7 మే 2012



64కళలుడాట్‌కాం 19 నెలలు పూర్తి చేసుకొన్న సందర్భంగా వాడ్రేవు సుందర్రావు గారి 'కళాజ్యోతి' కొత్త శీర్షిక ప్రారంభించాం. నాటక, సాహితీ రంగాలలో కృషిచేస్తున్న వారిని నెలనెలా మీ ముందుకు తీసుకువస్తాం.

64కళలుడాట్‌కాంకు రచనలు మేమూ చేయవచ్చా అని ఎంతో మంది మెయిల్స్ పంపిస్తున్నారు. కళలకు సంబంధించిన వ్యాసాలు (ఫొటోలతో) నిరభ్యంతరంగా పంపవచ్చు.

ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.

కళాసాగర్
ఎడిటర్



ముఖచిత్రం చిత్రకారుడు : **కాపు రాజయ్య**



**అక్కినేని అనుభవాలు...**

**సంస్కరణ యోధుడు కందుకూరి వీరేశలింగం**



ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే

# అలసెంద్రవంక
# గోరటి వెంకన్న



\- కళాసాగర్

**గోరటి వెంకన్న** ఈ పేరు చెబితే మనశ్శరీరాలు పులకించిపోతాయి. అతని పాట మన రక్తనాళాల్లో సంలీనమై ప్రవహిస్తుంది. ఈ ముద్దుబిడ్డని కన్నతల్లి ఈరమ్మ. తండ్రి నర్సింహ్మ. ఏప్రిల్4, 1964న వెంకన్న కెవ్వుమన్న తొలిరాగంతో మహబూబ్‌నగర్ జిల్లా తెలకపల్లి మండలం గౌరారం పల్లె ధన్యతనొందింది. మూడో తరగతి వరకు గౌరారంలో, తర్వాత పదోతరగతి వరకు రఘుపతిపేటలో చదువుకున్నారు. కల్వకుర్తి ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ఇంటర్మీడియట్ చదివే రోజుల నాటికే వెంకన్న కవిత్వ రచన మొదలు పెట్టారు. పాటలు పాడటం, విద్యార్థి ఉద్యమాల్లో భాగస్వామ్యం అతని జీవితంలో అంతర్భాగమయ్యాయి. జడ్చర్లలో డాక్టర్ బూర్గుల రామకృష్ణారావు డిగ్రీకళాశాల నుంచి 1985లో బి.ఏ.లో పట్టా పుచ్చుకున్నారు. అదే ఏడాది హైదరాబాద్‌లోని ఆంధ్రసారస్వత పరిషత్ కళాశాలలో ఎం.ఏ. తెలుగులో చేరారు. రెండో సంవత్సరంలో ఉండగా ఉద్యోగం రావడంతో చదువుకి మధ్యలోనే స్వస్తి చెప్పాల్సి వచ్చింది. 1987లో నాగర్‌కర్నూలులో జూనియర్ అసిస్టెంట్‌గా నాగర్‌కర్నూలులోని కోఆపరేటివ్ డిపార్ట్‌మెంట్‌లో చేరిక. ప్రస్తుతం అక్కడే సబ్‌డివిజనల్ కోఆపరేటివ్ ఆఫీసరుగా పనిచేస్తున్నారు. చిన్నప్పట్నించి సృజనాత్మకంగా వ్యవహరించడం వెంకన్న నైజం. పాటలు, ఆటలు ఆడటం, సాంస్కృతిక కార్యక్రమాల్లో ప్రదర్శనలు ఇవ్వడం అతని అభిరుచి, అలవాటు. రఘుపతి పేటలో వడ్ల వెంకటయ్య పద్యాలు పాడటం విని పాడటం నేర్చుకున్నాడు. బడిలో కొన్ని

ఏకపాత్రాభినయాలు చేసిన వెంకన్నకి రంగస్థలమంటే ప్రీతి. ఇప్పటికీ రంగస్థలం మీద పౌరాణిక పాత్రల్లో నటిస్తున్నారు. హైస్కూలు దశలోనే కీర్తనలు, పద్యాలు రాసిన వెంకన్న విద్యార్థి ఉద్యమాల్లో క్రియాశీలకపాత్ర వహించారు. హైస్కూలు దశలోనే పద్యాలు, కీర్తనలు, పాటలు రాశారు. ఉద్యమాల్లో పాల్గొనే వేళ అతని పాట పదునెక్కింది. అతని కంఠస్వరం కొత్తరాగాల్ని ఆలపించింది. 1986 తర్వాత విప్లవోద్యమాలతో సంబంధం వెంకన్న పాటకి గమనాన్ని, గమ్యాన్ని సూచించాయి. అవగాహనలో నైశిత్యం అతనికి దృష్టి వైశాల్యాన్ని ఇచ్చింది. ఈ క్రమంలోనే పాటకి వున్న బలం అర్థమైంది. పాటలో కవితాత్మక సౌందర్యం తారాస్థాయిని అందుకోడానికి అతని మూలాలు, అతని  నేల ప్రాశస్త్యం, విస్తృత అధ్యయనం తోడ్పడ్డాయి. అతని పాటలు గేయరూప కవితలు. ఇదివరలో రెండు పుస్తకాలు వచ్చాయి. 1. ఏకునాదం మోత, 2. రేలపూతలు, పాటల ఆల్బమ్స్ అయిదు వచ్చాయి. తొలుత 'ఎన్‌కౌంటర్' సినిమాకు పాట రాశారు. 'శ్రీరాములయ్య' చిత్రంలో నటించారు. పాడారు. సినిమాలకు దాదాపు అరవై దాకా పాటలు రాశారు. కొన్ని సినిమాల్లో నటించారు. 'ధూంధాం' చిత్రంలో తనే కథానాయకుడు. 'పల్లె కన్నీరు పెడుతుందో' పాట తెలుగునాట దశదిశలా వ్యాపించి, అతని కవితా సౌందర్యాన్ని లోకానికి తెలియజెప్పింది. గ్లోబలైజేషన్‌కి వ్యతిరేకంగా వచ్చిన రచనల్లో ఇదే అగ్రగామి గీతం. ఒక బైరాగిలా, తాత్వికునిలా తన పాటల ద్వారా లోకాన్ని మేల్కొల్పడం వెంకన్న పాటల్లోని విశిష్టత. సృజనాత్మకంగా జీవించే వెంకన్నని వరించిన అవార్డులు అనేకం. 'హంస' పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం సాహిత్య పురస్కారం, అధికార భాషా సంఘం పురస్కారం, విశాలాంధ్ర పురస్కారం, 'తెర' సంస్థ వారి జీవిత సాఫల్య పురస్కారాలు.... ఇంకా ఎన్నో వెంకన్న అందుకున్నారు. ప్రకృతి, పల్లె, వ్యథార్థుడయిన మనిషి అతని ప్రధాన ఇతివృత్తాలు.

లైఫ్‌లైన్
శేఖర్



## గోరటి వెంకన్న

నలుబదైదేండ్లనాడు గౌరారం గర్వపడ్డది
తెలంగాణ జనులకు కొత్త పాటనే ఇచ్చింది
గోరటి నర్సింహ గొంతు సాలొచ్చింది
మహబూబునగరు మురిసి ముద్దాడింది

రఘుపతిపేట జడ్చర్ల సదువులే జెప్పినవి
బిఏలు ఎమ్మేలు బతుకునే జూపినవి
సర్కారు కొలువులు సవ్వడే జేసినవి
పాటలా నావకు పటుదోవ జూపినవి

ఏకునాదం మోత జోరుగా మోగింది
రేలపూతల పాట ఉద్యమం అయ్యింది
అలసెంద్రవంకతో భూదేవి మురిసింది
పాటలా పోరణ్ణి పైపైకి ఎత్తింది

పాలనురగల ఏరు పాట దారి చూపింది
గాలికెగిసె రెల్లుగడ్డె దరువు నేర్పింది
నీటి తెప్పల ఇసుక తిప్ప వేదికయినది
ఊటసెలిమె పాటలకు తల ఊపి ఊగింది

# ‘చిత్ర’ మైన జీవితం

Last Part

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందిస్తున్నారు. చిత్రమైన జీవితంలో...చివరి భాగం.**





email: balisankar@gmail.com

## వడ్డాది పాపయ్యగారి గురించి...

ఇక ప్రముఖ రంగుల చిత్రకళా తపస్వి వడ్డాది గారితో నా పరిచయం చెప్తాను. విజయనగరంలో ఫైన్‌ఆర్ట్స్ ప్రిన్సిపాల్ శ్రీ పైడిరాజుగారి వద్ద బొమ్మలు నేర్చుకొని నా కొచ్చిన కొద్దిపాటి చిత్రకళకు మెరుగులు దిద్దుకొమ్మని పదే పదే పోరిన, నా శ్రేయోభిలాషి ప్రసన్నరావు గురించి లోగడ చెప్పాను. ఆ ప్రసన్నరావు విజయనగరంలో బి.ఇడి ట్రయినింగ్ ముగించుకొని మా అనకాపల్లికి దగ్గర్లోనే ఉన్న కసింకోట హైస్కూల్‌లో టీచర్‌గా సెటిల్ అయ్యాడు.

విజయవాడలో ఉంటున్న నాకు ఒకసారి ఉత్తరం రాస్తూ ఈ కశింకోటలోనే ప్రముఖ చిత్రకారుడు శ్రీ వడ్డాదిపాపయ్యగారు సెటిల్ అయ్యారని, ఎప్పుడో మనం అనుకున్నట్లు మద్రాస్‌లో లేరని, ఈమారు వరుసగా రెండు మూడు రోజుల్లో ఇక్కడ ఉండేట్లు వస్తే



మంచిదని రాశాడు. ఇంకా ఆ లెటర్‌లోనే మరికొన్ని విషయాలు రాశాడు. పాపయ్యగారు మసీదు వీధిలో ఇల్లు కట్టుకున్నారనీ, ఆయన మనవడొకడు తన క్లాసులో ఉన్నాడనీ, పాపయ్యగారు తరచూ వీధుల్లో కనిపిస్తారనీ రాశాడు.

ముందు నాకు నమ్మకం కలగలేదు.

ఆయన మద్రాస్ చందమామ పబ్లికేషన్‌లో స్టాఫ్ కదా! ఇక్కడకు రావడమేమిటి? అలా వస్తే వారి స్వంతవూరు శ్రీకాకుళం వెళ్లాలి. నాగావళి నదీ ప్రాంతం నుండి శారదా నదీ ప్రాంతానికి వచ్చారా?

“ఒకమారు వెళ్లి చూస్తే...” అనుకున్నాను.

ఆ తరువాత రోజుల్లో ఏవో శెలవులు వచ్చాయి. అనకాపల్లి వచ్చాను. కసింకోట దగ్గరే కాబట్టి వెళ్లి ప్రసన్న రావుని కలిశాను.

“ఆయన చాల మూడీగా ఉంటాడని, కాబట్టి నాకు ఇంటర్వ్యూ ఇవ్వక పోవచ్చు ముందు మెయిన్‌రోడ్‌లో ఉన్న లైబ్రేరియన్‌ను కలువు. ఆయన చాలా విషయాలు చెప్తాడు. ఎందుకంటే ఈయనా ఆయనా ఫ్రెండ్స్, సాయంకాలంపూట పాపయ్యగారికి లైబ్రరీకి వెళ్లే అలవాటు ఉంది” అన్నాడు.

అలాగే లైబ్రేరియన్‌ను కలిశాను. ఆ లైబ్రరీ మెయిన్ హాల్లో పాపయ్యగారు గిఫ్ట్ ఇచ్చిన పెద్ద సరస్వతీ బొమ్మ అద్దం కట్టించి ఉంది. ఆ లైబ్రేరియన్ నా పేరు అడిగి పరిచయం చేసుకొని నాకో కుర్చీ చూపించి కూర్చోమన్నాడు. “పాపయ్యగార్ని నిన్ననే ఇక్కడ సంతలో చూశాను. ఆయనెవరితోనూ కలవడు మూడీగా ఉ



ంటాడన్నది నిజం ఎప్పుడయినా లైబ్రరీకి వస్తాడు. మహా అయితే ఓ పదినిముషాలు లైబ్రరీలో గడుపుతారేమో అంతే! భుజంమీద చిరిగిన కల్లీలాల్చీతో నేలమీద అమ్ముతున్న కాయగూరల దుకాణం ముందు కూర్చుని, జేబు రుమాలును పరచి వంకాయలు మూటకడుతున్నాడు, నిన్న "అతడు గుర్తుకు తెచ్చుకుంటూ నాతో చెబుతున్నాడు.

నా మనసు కలుక్కుమంది.

చిత్రకళాసామ్రాజ్యపు రంగుల రారాజు ఆయిన వ.పా. కు స్వాభిమానం ఎక్కువ. ఆ స్థితి ఆయన అంగీకారంతోనే నడుస్తోందేమో ఆయన ఆనందంగానే ఉండవచ్చు. ఆలోచించాను. దానికి నేను ఈ క్షణంలో బాధపడ్డం అనవసరం. ఇంకా ఆయనను చూడనేలేదు. అయితే ఆయనతో గల పరిచయస్తుల మాటలు వింటుంటే ఇలా అనిపిస్తోంది.

"ఆయనను ఎపుడు కలవాలి?" అడిగాను.

పరవాలేదు ఆయన ఇంట్లోనే ఉండవచ్చు. కలవండి. మీరెవరో పేరు చెప్పకండి. అభిమానినని చెప్పండి చాలు అన్నాడు. ఈయన చెప్పినట్లే బయలుదేరాను. ఈవూరే చిన్నది. అది మసీదు వీధి. ఊరి చివర సరియైన దారిలేదు. కిందంతా ఇసుక, మట్టి, వర్షాకాలంలో అయితే బురదేమిగులుతుంది. దూరంగా చెట్ల మధ్య ఆయన ఇల్లు కనపడింది. డాబా ఇల్లు.

డాబా గోడమీద ఆయన బొమ్మల్లో సహజంగా కనపడే ఎగురుతున్న ఆంజనేయుడి బొమ్మ వేసి ఉంది. కాషాయపు రంగులో.

కాంపౌండ్‌వాల్ గేటుకీ, ఇంటికీ మధ్య పైన ఏదో పూలతీగ అల్లుకొని ఉంది. గేటుకి ఎడమ చేతివేపు పైకి మెట్లున్నాయి. మెట్లమలుపులో ఏదో పుస్తకం తిరగేస్తూ ఆయన నిలబడి ఉన్నాడు.

అక్కడికి సగం ఇబ్బంది తగ్గింది. గేటు చప్పుడు చేసి ఇది పాపయ్యగారి ఇల్లేనా అని అడిగే బాధ తప్పింది.

గేటు తీసి లోపలికి వెళ్లాను. ఎవరన్నట్టు చూశాడు. మీ అభిమానిని అన్నాను.

పైకి వెళదాం రమ్మన్నాడు. ఆయన వెనకే మెట్లెక్కాను. ఇద్దరం గదిలోకి వెళ్లాం సన్నగా పొడవుగా ఉందది. ద్వారానికి దగ్గర్లోనే ఆయన బొమ్మలు వేసుకునే బల్ల ఉంది. బల్లమీద ఓ పక్కగా రంగులూ, బ్రష్‌లూ, రంగులు కలుపుకొనే చిన్న అద్దం ముక్కా ఉన్నాయి. ఆ పక్కనే కత్తెరా! వృత్తాకారం కోసం వృత్తలేఖిని, కత్తిరించిన అట్టముక్కలూ, పోస్ట్‌కార్డు ముక్కలూ ఉన్నాయి. అవి కోటలూ, గుళ్లూ, గోపురాల కోసం కత్తిరించినవి అయ్యింటాయి. వృత్తలేఖిని ఉపయోగిస్తు చిన్న రంధ్రం పడే అవకాశముంది పేపర్ మీద. దానివల్ల ఎంతో కష్టపడి వేసిన బొమ్మ పాడవుతుంది. రంగుల ట్యూబులు 'కేమిల్' కంపెనీవి పేలట్ పక్కనున్నాయి. అయితే పక్కనున్న చిన్న అరలో మామూలుగా ఇనపకొట్లలో దొరికే మట్టిరంగులు నీలం, ఎరుపు, పసుపు రంగులు వంటివి సిమ్మెంట్‌తో కలిపి నేలపై రంగులు పరుస్తారు. అటువంటివి అందులో ఉన్నాయి. అయితే ఈయన ఈ రంగులూ బొమ్మలకు వాడతారన్నమాట. ఆరంగు పొడర్‌లకు పలుచని గంజిగానీ, బంకనీళ్లు గానీ కలిపి పెద్దపెద్ద పెయింటింగ్‌లకు వాడతారని విన్నాను గానీ ఈయనా తన బొమ్మల్లో ఆ ప్రయోగాలు చేస్తారని ఇప్పుడే గ్రహించాను.

ఏది ఏమైనా వీరు చేయి తిరిగిన రంగుల మాష్టారు. ఏ రంగు ఏ మిశ్రమంలో ఎంత వాడాలో వీరికి తెలిసినట్టు ఎవరికి తెలుస్తుంది. ఇదంతా అనుభవంమీద అలవడిన విద్య. ఒక్క గ్లాన్స్‌లో అన్నీ గమనించాను.

ఆ గది లాంటి హాలు గోడలపై జేగురు రంగులో సగం సగం వేసిన ఆయన పంతకంతో వేసే ఆంజనేయుడి బొమ్మలున్నాయి. వాటిపైన గోడపగుళ్లు, వర్షం నీటితో అట్టకట్టిన చారికలు. ఆయన చిత్రకారుడుగా పెద్ద కంపెనీలో పనిచేసినా సంపాదించింది ఏమీ లేదని ఆ గోడలే చెపుతున్నాయి. చిన్న సైజులో ఉన్న ఆ ఇల్లే చెప్తోంది. ఆయన ఆర్థిక పరిస్థితి ఎంతో. ఆయన చూపించిన కుర్చీలో

## కృతజ్ఞతలు

గత పదమూడు నెలలుగా 'చిత్రమైన జీవితం' పేరుతో ప్రముఖ చిత్రకారుడు, కార్టూనిస్టు బాలిగారు తన ఆత్మకథను 64కళలుడాట్‌కాం పాఠకులతో పంచుకున్నారు. తన జీవితంలో లభించిన తీపి జ్ఞాపకాలతో పాటు, ఎదురైన చేదు అనుభవాలను తనదైన శైలిలో అక్షరీకరణ చేసి అందించిన బాలిగార్కి పత్రిక తరపున ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం. 'చిత్రమైన జీవితం' చదివి దేశ విదేశాల నుండి తమ అమూల్యమైన అభిప్రాయాలను తెలియజేసిన పాఠకులకు కళాభివందనాలు.

కళాసాగర్, ఎడిటర్




కూర్చున్నాను. అప్పటి వరకూ రంగులతో ఉన్న బ్రష్‌లు కడిగేశాడు. సగం సగం వేసిన బొమ్మను టేబుల్ సొరుగులో దాచేశాడు. ఇక చెప్పండి అన్నట్టు నా వేపు చూశాడు. ఆయన గురించి వ్యాసం రాయతలచుకున్నాను కాబట్టి ఆయనకు అనుమానం రాకుండా (ఈవ్యాసం ఆంధ్రప్రభలో ఆదివార సంచికలో వచ్చింది) ప్రశ్నలు వేసీ వేయనట్టు వేస్తున్నాను. లైబ్రేరియన్ కూడా ఈయన మూడ్స్‌ను గుర్తు చేశాడు. కాబట్టి అది దృష్టిలో పెట్టుకోవాలి. వారి తండ్రిగారు కూడా శ్రీకాకుళంలో కొన్ని దేవాలయాలకు రంగులూ, బొమ్మలూ వేసేవారనీ తండ్రికి, కింద నిలబడి రంగులు అందించేవాడినని అలా ఆయన్ని గమనించేవాడినని తరువాత దశలో పేపర్‌మీద, కార్డ్‌బోర్డ్‌లపై బొమ్మలు వేస్తూ, డ్రాయింగ్ టీచర్ల్ వేసే పద్ధతులు అనుకరించేవాడినని చెప్పారు. తన పిల్లలెవరికీ ఇందులో అంతశ్రద్ధలేదని, అందువల్లవారు ఇందులో ముందుకురాలేదని మరో ప్రశ్నకు తన ఫ్రెండ్స్ తనకు బహుమతిగా ఇచ్చిన పుస్తకాలలోని రోమన్, గ్రీకు శిల్పాల ఆకారాలను కొంత నేటివిటీతో మిళితం చేసి, బొమ్మలూ వాటిల్లో భంగిమలుతో కొత్తధనం తీసుకురావాలని ప్రయత్నించానని చెప్పారు. అయితే ఈ సమాధానాలన్నీ నా ఎదురుగా కూర్చునే చెప్పలేదు. అటుతిరిగి, ఇటుతిరిగి చెప్పడమే గోడ పక్క స్టూలు మీద చాల పెయింటింగ్‌ల బొత్తి ఉంది. వాటివేపే చూస్తోంటే, వాటిలో కొన్ని తీసినా చేతికి ఇచ్చాడు. అవన్నీ అంతకు ముందు 'యువ'లోనూ 'చందమామ' పత్రికల్లో ముఖచిత్రాలుగా వచ్చినవే. ప్రింటయిన తరువాత ఆ పత్రికాధిపతులు జాగ్రత్తగా ఏమాత్రం నలగకుండా ఆయనకు రిటర్న్ చేస్తారని చెప్పాడు, ( ఆ స్టూలు మీదున్నవన్నీ అలాంటివే). అయితే ఆ స్టూలు కిందపడి అసంపూర్ణంగా మరో బొమ్మ కనిపించింది. దాన్ని చేతిలోకి తీసుకున్నాను. అది దుర్గామాత బొమ్మ. ఆరు భుజాలుండాలి. లేక ఎనిమిది భుజాలున్నా ఉండాలి. ఏడు భుజాలే ఆయుధాలతో ఉన్నాయి."ఆ వంపుల్లో ఎక్కడో మిస్ అయిపోయాను ఒక భుజం. అందుకే దాన్ని పూర్తిచేయలేదు" అన్నాడు.

ఆయనతో మాట్లాడిన దానికన్నా చూసిందీ, గమనించిందీ ఎక్కువ. ఆ తరువాత రోజుల్లో ఆ అనుభవంతో రెండు మూడు వ్యాసాలు వ్రాశాను. ఆయన మిత్రుడు, మాకు బంధువూ అయన వత్తి జగజపతిరావునాయుడు గారి ద్వారా మరిన్ని విషయాలు సేకరించాను, ఏది ఏమైనా ఆయనలో ఆత్మాభిమానం ఎక్కువని. దేనికోసం చేయి చాచడనీ, దేహీ అనడం అలవాటే లేదని, తనో చిన్న ప్రపంచం సృష్టించుకొని దానిలోనే జీవితాంతం గడిపాడనీ, వారి అబ్బాయిలు చెప్పిన మాటల్లోనూ, ఆయన మిత్రులు చెప్పిన మాటల్లోనూ గ్రహించాను.

చివరగా మరో మాట. తన గురించి, తన మరణం గురించి ఎవరికి చెప్పవద్దని ఇంట్లో వారికి చెప్పి మరీ చనిపోయారట. ఆయన చనిపోయిన తేదీ 1993 డిసెంబర్ 30న ఏది ఏమైనా ఆయన మాటలకందని చిత్రకారుడు, గొప్ప వ్యక్తి నిరాడంబరుడు.

# మన కార్టూనిస్టులు

- వెంటపల్లి సత్యనారాయణ

"అక్షరం రూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క. లక్షమెదళ్లకు కదలిక అన్నాడు, ఆనాడు మహాకవి కాళోజీ. అక్షరానికున్న శక్తి అలాంటిది. వేల అక్షరాలతో చెప్పలేని భావాన్ని ఒక్క కార్టూన్ ద్వారా చెప్పొచ్చు అంటున్నారు నేటి కార్టూనిస్టులు. నిరక్షరాస్యులను కూడా కదిలించగల శక్తి కార్టూన్‌కుంది.

వివరణ అవసరం లేకుండా సూటిగా, సంక్షిప్తంగా, విషయాన్ని పాఠకుడి హృదయానికి హత్తుకునేలా చేసే గొప్ప కళా మాధ్యమం కార్టూన్. అందుకే రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాహిత్య, కళా విషయాలతో నిమిత్తం లేకుండా అన్ని రకాల పత్రికలలోనూ నేడు కార్టూన్లు ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ఇంత శక్తివంతమైన కళాప్రక్రియకు తెలుగులో ఆద్యుడు శ్రీ తలిశెట్టి రామారావు గారైతే, ఆ తర్వాత కార్టూన్ విస్తృతంగా వ్యాప్తిలోకి రావడానికి బాపు, జయదేవ్, బాలి, మోహన్, ఏ.వి.ఎమ్, చంద్ర, మల్లిక్, సత్యమూర్తి, శ్రీధర్, కుమారి రాగతి పండరి లాంటి ఎందరో కార్టూనిస్టులు కృషి చేస్తున్నారు.

తెలుగు కార్టూన్‌ది ఎనభైరెండేళ్ళ చరిత్ర. తలిశెట్టిరామారావుగారి జన్మదినమైనటువంటి మే 20న 'తెలుగుకార్టూనిస్టుల దినోత్సవం'గా జరుపుకోవాలని కార్టూనిస్టు మిత్రులందరూ నిర్ణయించుకున్నాం. దీనికి 64కళలు పత్రిక మద్దతు ప్రకటించి 'మన కార్టూనిస్టులు' పేరుతో నెలకో కార్టూనిస్టును సమగ్రంగా పరిచయం చేసే శీర్షికను ఈ నెల నుండే ప్రారంభిస్తున్నాం. ఈ శీర్షికను 'చిత్రకళ' ఫీచర్‌ను గత 19 నెలలుగా రాస్తున్న ప్రముఖ చిత్ర కళావిమర్శకుడు, కార్టూనిస్టు వెంటపల్లి సత్యనారాయణ గారు నిర్వహిస్తారు.

తెలుగు కార్టూన్ పితామహుడు తలిశెట్టి రామారావు గారితో 'మనకార్టూనిస్టులు' శీర్షికను ప్రారంభిస్తున్నాం. చదవండి, హాయిగా నవ్వండి, మీ అభిప్రాయాలను తెలియజేయండి...

- కళాసాగర్, ఎడిటర్

## మరుగున పడిన మాణిక్యం

**వజ్రం ఉనికిని అగాధం అంతం చేయలేదు. అవి ఎంత లోతుకు కూరుకుపోయినా కాంతిని వెదజల్లే అవకాశం దానికీ, ఆ ప్రకాశాన్ని చూసి తరించే అవకాశం జనానికి ఏదో రోజు తప్పక వస్తుంది.**

కారణం... కాలం పూసిన మసి ఆ కాంతిని ఏ మాత్రం తగ్గించలేదు. స్వత: సిద్ధమైన దాని వెలుగులు ఎప్పటికైనా అలా విరాజిల్లుతూనే వుంటాయి. అలా 116 ఏళ్ల క్రిందట వెలిగి మాయమై నేడు మరలా ప్రకాశిస్తున్న ఆ కళా వజ్రమే తలిశెట్టి రామారావు అయితే, ఆ వజ్రాన్ని వెలికి తీసి ఆ వెలుగులను మనం చూడడానికి కారణభూతుడైన ఆ ఘనుడు. మాత్రం ముల్లంగి వెంకటరమణారెడ్డిగారు.

ఏమిటీ ఈయన గొప్ప తనం! ఏం చేసాడని ఈ వ్యక్తిని స్మరించుకోవాలి అని అనుకుంటే... కేవలం తన 28 ఏళ్ళ అత్యల్ప జీవితకాలంలోనే అసంఖ్యాకమైన చిత్రరచన ద్వారా చరిత్ర సృష్టించిన స్వర్గీయ దామెర్ల రామారావుకి ఇంకా ఒక సంవత్సరం ముందుగానే అనగా 20-05-1896లో శ్రీమతి రామానుజమ్మ, సీతయ్య దంపతులకు ఆనాటి జయపురం సంస్థానంలోని ఉమర్ కోటలో తలిశెట్టి జన్మించారు. అది యాదృచ్ఛికమో ఏమో గానీ ఈ ఇరువురు రామారావులలో



ఒకరు ఆధునిక తెలుగు చిత్రకళకు ఆద్యుడిగా ప్రసిద్ధి గాంచితే రెండో వ్యక్తి తొలి తెలుగు కార్టూనిస్ట్‌గా ఖ్యాతి గడించాడు. కానీ చిత్రకళ, కార్టూన్ రంగాలను అధ్యయనం చేస్తున్న వాళ్లకు సైతం తలిశెట్టిని గురించి నిన్న మొన్నటి వరకూ తెలిసింది కేవలం ఒక కార్టూనిస్ట్‌గా మాత్రమే అది కూడా వేళ్లమీద లెక్కింపదగిన ఓ ఐదారు కార్టూన్‌ల ద్వారా మాత్రమే.

కానీ ఆ కాలంలో ఆయన జయపురం సంస్థానంలో ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే లలితకళారంగాలలో అజరామమైన కృషిని చేసిన విషయం ఇంతకాలం మరుగునపడిపోవడం చాలా దురదృష్టకరమైన విషయం.

ప్రాథమిక విద్యనుండి మెట్రిక్యులేషన్ వరకూ జయపురంలో విద్యాభ్యాసం గడిచింది. ఇంటర్ మీడియట్ పర్లాకిమిడిలోనూ, బి.ఏ. డిగ్రీని విజయనగరంలోనూ చేసిన తలిశెట్టికి ఆనాటి జయపురం మహారాజు ఆర్థికసాయం చేయడంతో చెన్నపట్నం (మద్రాస్) వెళ్లి ఎల్.ఎల్.బి. చదివారు. సహజంగా చిత్రకళ యందు అమిత ఆసక్తి కల తలిశెట్టిని ఆకాలంలో మద్రాస్‌లో విరివిగా లభించే పంచ్, పాసింగ్‌షో, న్యూయార్క్‌ల లాంటి ప్రఖ్యాత విదేశీ కార్టూన్ మ్యాగజైన్స్ బాగా ప్రభావితం చేసాయి. మద్రాస్‌లో న్యాయశాస్త్రం పూర్తిచేసిన తదుపరి ఆయన జయపురం మహారాజా వారి కోర్టులో దివాన్‌గా పనిచేసారు. ఒక ప్రక్క ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే చిత్రకళపై గల అమిత ఆసిక్తతో చూసిన ప్రతి సంఘటననూ చిత్రాల్లోకి మలచడం హాబీగా చేసుకున్నారు. విరివిగా లైఫ్ స్కెచెస్ గీయడం ద్వారా డ్రాయింగ్‌పై మంచి పట్టు సాధించారు.

మనకు అందుబాటులో వున్న దానిని బట్టి 1929ల నాటికే భారతి, ఆంధ్రపత్రిక, వాణి లాంటి పత్రికలలో విరివిగా ప్రచురించపబడ్డ ఆయన కార్టూన్లు మనం పరిశీలించినట్లైతే లైఫ్ స్కెచింగ్‌పై ఆయన ఎంత శ్రద్ధ పెట్టారో గమనించవచ్చు. ఎంతో సాధన చేస్తేనే గాని రాని ఆ గీతల్లోని పరిణతి పరిపక్వత, అనాటమీ ప్రతి కదలికల్లో కనబడే భంగిమలు ఇవన్నీ కార్టూన్‌లలో అప్పటికే అంతగొప్పగా వేయగలిగారూ అంటే దానికి ఆయన ఎంతో సాధన చేసి యుండాలి.



ప్రభందసుందరి వర్ణణతో మొదలైన అతని కార్టూన్ ప్రస్థానం క్రమక్రమంగా సామాన్యులు, అసామాన్యులు, కూలీలు, పనివాళ్లు, వారు వీరు అనే భేదం లేకుండా సమాజంలో మనకు ఎదురయ్యే అందరి వ్యక్తులు వారి వృత్తులు, దైనందిన వ్యవహారాలు, వేషభాషలు, కట్టు, బొట్టు, సాంప్రదాయాలు, కళలు, కళాకారులు, ఏ వర్గాన్నీ వదలకుండా అందరిపైనా ఆయన ఎన్నో కార్టూన్‌లు వేసారు. ముఖ్యంగా ఆయన కార్టూన్‌లలో మెచ్చుకోదగిన అంశం చక్కని డ్రాయింగ్.

క్షురకర్మ అన్న పేరుతో అతను వేసిన కార్టూన్ స్ట్రిప్ (చూచి త.రా. తొ.తె.వ్య.చి. పేజినెం 87)లో మంగళివాడు క్షవరం చేసే క్రమంలో కత్తెర చేయించుకుంటున్న వ్యక్తిని రకరకాల భంగిమలలో పెట్టి అతడికి నరకం చూపిస్తున్నట్లు వేసిన ఆ కార్టూన్‌లోని బొమ్మలు చూసినపుడు మనం పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకుంటాం. వ్యాఖ్యారహితంగా (6)చిత్రాల్లో చూపించిన ఈ కార్టూన్‌లోని డ్రాయింగ్ నేటి యానిమేషన్‌కి ఏమాత్రం తీసిపోదు. అలాగే గ్రీష్మంలో ఒకరాత్రి, కవి, సంభాషణ యందు అదికాభిలాష లాంటి మరికొన్ని కార్టూన్ స్ట్రిప్స్ ఇందుకు మంచి ఉదాహరణలు. ఇక రెండోది హాస్యాన్ని సృష్టించేందుకు అతడు ఎంచుకునే అంశాలు చాలా విచిత్రంగా వున్నాయి. వీటిలో కొన్ని వ్యక్తుల అలవాట్ల నుండి హాస్యాన్ని సృష్టిస్తే, బ్రహ్మకు కొన్ని సూచనలు, మనకు తోకలున్నచో, లాంటి కార్టూన్‌లు నవ్వుల పువ్వులు పూయిస్తాయి.




"మోటారు ప్రమాదనివారణకు సూచనలు" అంటూ వేసిన కార్టూన్ స్ట్రిప్ నవ్వుకు తోడు ఆలోచనను రేకెత్తిస్తే, క్రీ।।శ।।త. 2030లో మనుషుల వేషభాషలపై వేసి కార్టూన్లు అతని ముందు చూపును తెలియజేస్తాయి. బస్‌స్టాప్‌లో కూర్చున్న ఇద్దరు ప్రయాణీకులకు వారిపైన గోడకు పెట్టబడ్డ "దొంగలున్నారు జాగ్రత్త" అనే బోర్డ్ ద్వారా వారిలో ఒకరిపై ఒకరికి రేకెత్తించిన అనుమానపు చూపులను అద్భుతంగా వ్యక్తం చేయడం ద్వారా ఎలాంటి వ్యాఖ్యా లేకుండానే అది చూసే ప్రేక్షకుడికి పొరలు పొరలుగా నవ్వు వచ్చేటట్లు చేసారు.

మనం ఇంతకాలం కేవలం ఒక కార్టూనిస్ట్‌గానే చూస్తున్న తలిశెట్టి రామారావు ఓ మంచి చిత్రకారుడు, రచయిత కూడా అంటే ఆశ్చర్యపోక తప్పదు. ఆయన వేసిన చిత్రాలలో, భరతాగమనము, విరంగిణి, రాదాకృష్ణ నిద్రిత యాక్షాంగణ, శివపార్వతులు లాంటి ఎన్నో చిత్రాలు ఆనాటి భారతి తదితర పత్రికలలో ప్రచురింపబడ్డాయి. చిత్రకళలో ఈయనకు సమకాలికులయిన దామెర్ల, వరదావెంకటరత్నం, భగీరధి, బుచ్చికృష్ణమ్మ లాంటి వారు ఆకాలంలో రాజమహేంద్రిలో ఆధునిక ఆంధ్రచిత్రకళకు బలమైన పునాదులు వేయగా తలిశెట్టి మాత్రం ఈ ప్రాంతంలో చిత్రాలు వేసినా ఆయన కార్టూన్ రంగంపైనే ఎక్కువగా దృష్టిపెట్టి విరివిగా వాటినే వేసారు. బహుశా జయపురం సంస్థానంలో వారి దివాన్ ఉద్యోగబాధ్యతలు నిర్వాహణ ,,,,,, కొంత కారణం కావచ్చు.

ఇక రచయితగా కూడా ఆయన వివిధ అంశాలపై ఎన్నో వ్యాసాలు వివిధ పత్రికలలో రాసారు. నాటకాలు, ప్రదర్శనలు, కార్టూన్ చిత్రకళ, నాట్యకళ, మేజువాణీలు వాటి వ్యవహారాలు, వాటియందలి చిత్రాలు లాంటి అంశాలతో పాటు బళ్లారిరాఘవ తదితర వ్యకులపై కూడా వ్యాసాలు రాసి ప్రచురించారు. అంతేకాకుండా 1930లో భారతీయ చిత్రకళపై అనేక వ్యాసాలతో 208 పేజీల పుస్తకాన్ని ఆయన రచించి ప్రచురించారు. భారతీయ చిత్రకళకు సంబంధించి బహుశా ఇదే తొలి గ్రంధమని ఆంధ్రపత్రిక సంపాదకులు, దేశొద్దారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు పేర్కొనడం గమనార్హం.

మసకబారిన చరిత్రపుటల్లో ఇరుక్కుపోయి, పొరలు కమ్మిన కళ్లకు ఇంతవరకు కనిపించకుండా పోయిన ఈ అరుదైన మన కళావజ్రాన్ని వెలికి తీసి ఆ కళాకాంతుల్ని మనం చూసేందుకు కారణభూతుడైన 75 ఏళ్ళ నవయువకుడు ముల్లంగి వెంకటరమణారెడ్డి గారి కృషినీ, తలిశెట్టి రామారావు జన్మ దినమైన "మే20" తేదీన తెలుగు కార్టూన్ దినోత్సవంగా ప్రకటించేందుకు సన్నాహాలు చేస్తున్న తోటి కళాకారుల కృషిని మనసారా అభినందిస్తున్నాను.




కామినీ కాముకులు

# ఆదర్శనీయ వ్యంగ్యచిత్రకారులు తలిశెట్టి

క్రోక్విల్ శంకు, సీనియర్ కార్టూనిస్టు



వ్యంగ్యచిత్రాలు దేశకాల పరిస్థితులకు చెందినవైవుండాలనే ఉన్నతాదర్శానికి కట్టుబడిన తలిశెట్టి రామారావు గారు, తెలుగువారి తొలి వ్యంగ్యచిత్రకారులుగా నేటితరం కార్టూనిస్టులకు ఆరాధ్యదైవంగా తెలుగుజాతి చరిత్రపుటల్లో సుస్థిర స్థానాన్ని పొందారు. ఆయన లాగే, ఆయన వ్యంగ్యచిత్రాలు కూడా నేటికీ సజీవంగా ప్రజ్వరిల్లుతున్నాయంటే అందుకు వారిఉన్నతాదర్శమే ప్రధాన కారణం.రామారావు గారి కార్టూన్లు చూస్తుంటే ఆనాటి కట్టుబాట్లు, ఆహార్యం, సగటు జీవితాల్లో తొంగిచూసిన అవకతవకలు, అప్పటి సాంఘిక నియమాలు, ఆంక్షలు కళ్ళకు కట్టినల్లు కనిపిస్తాయి. అంతేకాదు రామారావు గారి వ్యంగ్యచాతుర్యం సుతిమెత్తని చురక వేసేలావుంటుందే తప్ప మొరటుగా వుండదు. అది ఆయన ఉన్నత సంస్కారం. ఎదుటివాడి లోటుపాట్లను సవరించే ప్రయత్నంగా, వాటిని ఎత్తి చూపాల్సివస్తే, అది అరటిపండులో సూదిగుచ్చినంత మొత్తగా చెప్పేవారు.

నిజజీవితానుభవాల్లోంచి, నాటి సామాజిక స్థితిగతుల్లోంచి పుంఖాను–పుంఖాలుగా వెలుగు చూసిన రామారావు గారి కారూన్లు వేటికవేసాటి. అంతటి మహనీయుడి గురించి నిన్న మొన్నటి వరకూ చాలామందికి వివరంగా తెలియకపోవడం బాధాకరమనిపిస్తున్న దశలో రమణారెడ్డిగారు తలిశెట్టి వారి కార్టూన్లకు ఆకర్షితులై, అక్కడితో ఆగక వాటిని ప్రత్యేక శ్రద్ధతో సేకరించి ఏడాది క్రితమే సంకలన పరచి పుస్తకరూపంలో విడుదల చేయడం హాస్యాభిలాషులైన తెలుగు వారందరికీ ఎంతో ఆనందాన్నిచ్చింది.

కానీ, ఆ సంకలనాన్ని చూసాక రామారావుగారి గురించి మరిన్ని వివరాలు తెలుసుకోవాలని, ఆయన వ్యంగ్యచిత్రాలను వీలయినన్ని ఎక్కువ చూడాలనే తపన అందరిలోనూ ఉంది. త.రా. గారి ప్రథమ సంకలనానికి వచ్చిన ప్రోత్సాహంతో శ్రీముల్లంగి రమణారెడ్డి గారు మరింత విశేషప్రయత్నం చేసారు. ఒక డాక్టరేట్ పట్టానివ్వదగినంత పరిశోధన జరిపి, ఇప్పటి వరకూ వెలుగుచూడని తలిశెట్టి గారి వ్యక్తిగత విశేషాలను ఇందులో పొందుపరిచారు. కార్టూన్లతో పాటు కుటుంబ సభ్యుల ఛాయాచిత్రాలను సేకరించి ద్వితీయభాగంలో ప్రచురించడం ఎంతో ముదావహమైన విషయం.

ఇప్పుడీరెండు భాగాలను హాస్యప్రియులైన తెలుగువారందరూ తమ తమ స్వంత 'ఇంటి గ్రంథాలయానికి' చేర్చడం, అలాగే ప్రతీ తెలుగు కార్టూనిస్టు ఈ రెండు భాగాలను అధ్యయనం చెయ్యడం ఎంతో ఆవశ్యకం. నేటి తరం కార్టూనిస్టులు ఆయన ఆదర్శాన్ని




మార్గదర్శకంగా తీసుకుంటూ రచనలు చేయగలిగితే, వారికి అంతకన్నా ఘనమైన నివాళి మరొకటుండదు.

కళాప్రపంచం

# ఆనందతాండవ భాష్యకారుడు-ఆనందకుమారస్వామి

*"Nations are created by poets and artists, not by merchants and politicians. In art lie the deepest principles"* దేశ నిర్మాణం యావత్తు కవులు, కళాకారుల వల్ల మాత్రమే సాధ్యమవుతుంది. అని కుండబద్దలు కొట్టినట్లుగా చెప్పగల ఒకే ఒక కళాసాహిత్య, తాత్త్విక, శాస్త్రకారుడు శ్రీ ఆనంద కెంటిష్ కుమారస్వామి, భారతీయ చిత్రశిల్పకళా వైభవాన్ని ప్రపంచానికి చాటిన మహనీయుడు, శాస్త్రవేత్తగా ఆరంభమైన ఆయన జీవితం కళాకారునిగా, కళావిమర్శకునిగా, చిత్రకారునిగా మలుపు తిరిగింది. ఆయన వెలువరించిన సాహిత్యం ఆయన గొప్పతనాన్ని మాత్రమే మనముందుంచాడు. భారతీయ కళారీతులకు మహోన్నత్వాన్ని సాధించిపెట్టాయి.



ఎల్.ఆర్. వెంకటరమణ

ఆనందకుమారస్వామి శ్రీలంక రాజధాని కొలంబోలో 1877 ఆగస్టు 22న జన్మించాడు. తండ్రి సర్‌ముత్తు కుమారస్వామి, తల్లి ఎలిజబెత్ క్లేబీబి తండ్రి తమిళ వారసత్వమున్న సింహళీయుడు. తల్లి బ్రిటీషు వనిత. ఆనందునికి రెండేళ్లు నిండకమునుపే తండ్రిని కోల్పోయాడు. తల్లి ఆనందుని తీసుకుని బ్రిటన్‌కు పయనమైనది. ఆమె కెంట్ ప్రాంతానికి చెందిన మహిళ. అందుకే కుమారస్వామి పేరులో 'కెంటిష్' వచ్చి చేరింది.



ఆనందుడు బ్రిటన్‌లోని వైక్లిఫ్ మరియు లండన్ విశ్వవిద్యాలయాలలో అభ్యసించాడు. కుమారస్వామి భూగర్భశాస్త్రంలో డిగ్రీ చదివాడు. లండన్ విద్యాలయం నుండి డాక్టరేట్ అందుకున్నాడు. ఈ విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పొందిన తొలి సింహళీయుడు.

సింహళదేశ భూగర్భశాస్త్ర పరిశోధనా సంస్థ డైరక్టరుగా నియమితులై సిలోన్ చేరుకున్నాడు. ఈథల్‌మేరీ అనే బ్రిటీషు వనితతో వివాహమైనది. ఆమె మంచి ఫొటోగ్రాఫర్.

1904వ సంవత్సరంలో ఆనందుడు 'థోరియం' మరియు 'యురేనియం' కలిసిన 'థోరినైట్' అనే కొత్త ఖనిజాన్ని కనుగొన్నాడు. ఈవిధంగా సింహళ దేశమంతా ఖనిజ నిక్షేపాల కోసం విరివిగా తిరగవలసి వచ్చింది. ఇదే కాలంలో కళాసంపద కూడా మెండుగా ఉందన్న సంగతి గమనించాడు. క్రమేపి కళాసంపదను అధ్యయనం చేయడం మొదలుపెట్టాడు.



1907లో ఆనందకుమారస్వామి, రవీంద్రనాథ్‌ఠాగూర్, హావెల్‌లు మంచి మిత్రులయ్యారు.

1909-1913 మధ్యకాలంలో ఆనందుడు తన భార్య ఈథెల్‌తో వివాహబంధం విడిపోయింది. భారతదేశ రాజధాని కలకత్తా నుండి ఢిల్లీకి మార్చినపుడు ఢిల్లీ నగరాన్ని భారతీయ రీతిలో తీర్చిదిద్దాలని పేర్కొన్నాడు. మనదేశంలో ఒక జాతీయ మ్యూజియం ఉండాల్సిన అవసరాన్ని ఆనందుడు గుర్తించాడు. ఆ సంస్థకు తనను డైరెక్టర్‌గా చేస్తే శాశ్వతంగా భారతదేశంలో ఉండిపోవాలని తహతహలాడాడు. కానీ ఇది వీలుపడలేదు. అమెరికాలోని బోస్టన్‌మ్యూజియం వారు ఆనందుని కోరిక మన్నించారు. దాంతో తను సేకరించిన విలువైన సంపద బోస్టన్ మ్యూజియంకు తరలిపోయింది.

1916లో 'రాజ్‌పుట్ చిత్రకళ' గురించి విలువైన గ్రంథాన్ని రచించాడు. ఇదే కాలంలో "బుద్ధిజం" గురించిన మరో గ్రంథం వెలువరించాడు. మరో మారు ఆనందునికి వివాహం జరిగింది. ఆలిస్‌రిచర్డ్ సన్ అనే బ్రిటీష్ వనిత. ఈమెకు రతన్‌దేవి అనిపేరు

ప్రాచీన శిల్పకళావిశేషాలే కాదు. ఆనాటి కుమ్మరి చక్రం, కుండలు, వడ్రంగికొయ్య పనితనం, కంసాలి చేతిలో రూపుదిద్దుకునే లోహం-ఇలా అన్నీ అమితంగా ఆకర్శించాయి. చిన్న పనివారం గొప్ప కళాకౌశలాన్ని గుర్తించగలిగాడు ఇలా రూపు దిద్దుకున్న రచనం "Medierval Sinhalese Art" ( 1908).

1910లో సర్‌జార్జ్‌బర్ట్‌వుడ్ భారతదేశంలో లలిత కళలే లేవు అంటూ విమర్శించాడు. ఇదే కాలంలోనే ఆనందకుమారస్వామి లండన్‌లో "ఇండియా సొసైటీ" స్థాపించి, భారతీయ కళాసంస్కృతికి చెందిన ఎన్నో విలువైన సంగతులు చెప్పి, విమర్శకుల నోరు మూయించగలిగారు.

కళావిమర్శకుడు జాన్‌రస్కిన్ కూడా భారతీయ కళ అవాస్తవమైనదంటూ పేర్కొన్నాడు. దీనికి జవాబుగా ఆనందకుమారస్వామి "విశ్వకర్మ" పత్రికలో 1912-1914లలో ఎన్నో విలువైన వ్యాసాలు ప్రచురించి రస్కిన్ అభిప్రాయం పొరపాటుగా రుజువు చేశాడు. విన్సెంట్‌స్మిత్ కూడా భారతీయ కళలలను సరిగా అర్థంచేసుకోక విమర్శలు చేశాడు.

భారతీయ కళను, దాని విశిష్టతను సరిగ్గా అర్థం చేసుకున్న వ్యక్తి హెవెల్. ఇతను కలకత్తా స్కూల్ ఆఫ్ ఆర్ట్ ప్రిన్సిపాల్‌గా సేవలందించారు. అవనీంద్రుని ప్రోత్సహించాడు. నందలాల్‌బోస్, సురేంద్రనాథ్ గంగూలీలను చిత్రకారులుగా తీర్చిదిద్దాడు.



మార్చాడు. రతన్ అంటే వజ్రం అని అర్థం. వీరి దాంపత్యజీవితం ఎక్కువ కాలం నిలబడలేదు. 'రోహిణి' అనే అమ్మాయి పుట్టింది. తరువాత ఇరువురు విడిపోయారు.

ఆనందుని నిష్పక్షపాతమైన దృష్టికోణంతో వెలువరించే సాహిత్య, కళా, తాత్త్విక వ్యాసాలు ఎందరో పాశ్చాత్యులను ఆకర్షించింది. మనోవైజ్ఞానిక వేత్త యంగ్, ప్రముఖ నృత్యకళాకారిణి ఇసదోరా డంకన్, అమెరికన్ చిత్రకారుడు ఎరిక్‌గ్రిల్ ఇలా ఎందరో ఉన్నారు. ఎరిక్ ఆనందుని గురించి చెబుతూ– "కళ, జీవితం, మతం మొదలైన వాటిలో సత్యాన్ని నిగ్గుతేల్చగలిగినవాడు ఆనందకుమారస్వామి మాత్రమే" అంటాడు.

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారితో కలిసి ఆనందకుమారస్వామి రచించిన "The Mirror of Geoture" (అభినయం దర్పణం) అన్న గ్రంథాన్ని హార్వర్డ్ యూనివర్శిటీ ప్రెస్ వారు ప్రచురించారు. "History of Indian and Indovesian Art (1927) రచించాడు.

రతన్‌దేవితో విడిపోయిన తరువాత ఆనందుడు తనకన్నా 20 సంవత్సరాలు చిన్నదైన స్టెల్లాబ్లాక్‌తో ప్రేమలో పడ్డాడు. వీరు 1922లో అధికారికంగా వివాహం చేసుకున్నారు. 1930లో వీరు విడిపోయారు. అనంతరం స్టెల్లాబ్లాక్ 1931లో ఎడ్వర్డ్ ఎలేసు అన్న గీత రచయితను పెళ్లాడింది. స్టెల్లా దాదాపు వందసంవత్సరాలు జీవించింది. 1999లో ఆమె మరణించింది. ఎన్నో విలువైన కళాసంపదను, వ్యాసాలను సంకలనం చేయగలిగినది.




1930లో ఆనందుడు అర్జెంటీనా మహిళ డోనా బాసియా రన్‌స్టయిన్‌ను వివాహమాడాడు. అప్పుడు డోనా వయస్సు 25, ఆనందుని వయస్సు 53. వీరికి రామరోనంబలం అన్న కుమారుడు జన్మించాడు. డోనాతో ఆనందుని దాంపత్యజీవితం ఆనందంగా గడిచింది.

భారతీయ శిల్పకళారీతులను విదేశాలలో విశేష ప్రాముఖ్యత తెచ్చిపెట్టడానికి ఆనందుని ఉపన్యాసాలు, వ్యాసాలు కారణాలు. విభిన్న సంస్కృతులు, కళల గురించి దాదాపు 500 వ్యాసాలు రచించాడు. భారతీయ, సింహళ, బర్మాదేశ కళారీతులు గురించి, రవీంద్రుని కళాసాహిత్యల గరించి, ఎన్నో విలువైన వ్యాసాలు రచించాడు.

ఆనంద కెంటిష్ కుమారస్వామి అని పేరు చెప్పగానే గర్తొచ్చే విశిష్ట రచనం "The Dance of Shiva" పద్నాలుగు వ్యాసాల సంకలనమిది. అందులోని వ్యాసం పేరు, పుస్తకం పేరు ఒకటే. భారతీయ, ప్రపంచ వైజ్ఞానికులకు విలువైన సమాచారాన్ని అందించిన పుస్తకమిది. నటరాజస్వామి మూర్తి యొక్క శివతాండవ రూపానికి సరికొత్త భాష్యం చెప్పి "శివతాండభాష్యకారుడు" అయ్యాడు. నటరాజు అన్నపదం నృత్యానికే రాజు అని అర్థం. దక్షిణ భారతదేశంలో చోళులు పాలిస్తున్న (క్రీ.శ. 880–1279) మధ్యకాలంలో అందమైన కాంస్య విగ్రహాలు తయారయ్యాయి. భారతీయ శిల్పకళకు నిదర్శనాలయ్యాయి.

నటరాజు యొక్క నాలుగు చేతులు–నాలుగు దిక్కులు సూచిస్తున్నాయంటాడు. ఒక చేత అగ్ని దుష్టసంహారానికి గుర్తు; మరో చేత ఉన్న డమురుకం విశ్వనిర్మితికి చిహ్నం; అభయ హస్తం రక్షణకు చిహ్నం.

ఈ మొత్తం నటరాజు యొక్క "ఆనందతాండవం" ప్రతిరూపమిది. ఇందులోనే సృష్టి, స్థితి, లయ, ఆత్మీయానుభూతి, ఆశ్చర్యానుభూతి మిళితమై ఉంటుంది. అంతర చైతన్యంలో ఒకరకమైన మధుర ధ్యానానుభూతిని కలుగచేస్తుంది. ఈ విశిష్ఠ శిల్పం.





ఈ "Dance of Shiva" అన్న విషయాన్ని ఫ్రిడ్జోవ్‌కాప్రా ఆధునిక శాస్త్రరీత్యా పోలిక చెప్పడానికి ప్రయత్నించాడు. మరో ప్రముఖ ఆంగ్ల కవి "రూత్‌పీల్" చక్కని కవితా పంక్తులలో విశ్లేషిస్తాడు.

"The Dance of Shiva" వ్యాస సంకలనం కొత్త ఎడిషన్ కోసం మార్పులు చేస్తూ, చేస్తూ.... అలా స్పృహ తప్పి పడిపోయాడు. అలాగే ప్రాణాలు విడిచాడు. 1947 సెప్టెంబర్ 9న ఆనందకుమారస్వామి మరణించాడు. ఆయన కోరిక ప్రకారం, ఏ ప్రాంతంలో అయితే మరణిస్తే అక్కడే ఖననం చేయాలి. అలా బోస్టన్‌లో హైందవ సంప్రదాయం ప్రకారం ఉత్తర క్రియలు జరిగాయి. అనంతరం ఆయన చితాభస్మాన్ని భారత, సింహళ దేశాలకు తీసుకుని రాబడింది. భారతదేశంలో గంగానదిలో నిమజ్జనం చేశారు.

ఆనందకుమారస్వామిని స్వాతంత్ర్య కాంక్షలో మాజినీ అంతదేశభక్తుడు, బౌద్ధికస్వేచ్ఛలో ఎవర్సన్‌తోనూ, ఈస్థటిక్స్ విషయంలో ఆనందవర్ధనునితోనూ పోల్చదగిన వ్యక్తిగా విమర్శకుల భావన. భారతీయ ఆధ్యాత్మిక, తాత్త్వికలను విదేశాలలో బావుటూ ఎగురవేసిన వివేకానందస్వామి వలే– భారతీయ కళానైపుణ్యాలను విదేశాలలో విశేష ఖ్యాతి తెచ్చినవాడుగా ఆనందకుమారస్వామిని పేర్కొంటారు.

"The Dance of shiva"- నజరాజ విగ్రహ స్ఫూర్తితో Ruth peel రాసిన పద్యం.

"The Source of all movement,
Shiva's dance,
Gives rhytham to the Universe,
He dances is evil places,
in Sacred,
he creates and preserves,
Destroys and releases.
we are part of this dance
This eternal rhythem,
And were to us if, blinded
by illusions,
We detach ourselves
From the dancing Cosmos,
This Universal harmony....

*- Ruth peel.*

email: venkataramana_lanka@yahoo.com

# జానపదుల ఆత్మకు జీవం పోసిన

# డా॥ కాపురాజయ్య



- వెంటపల్లి సత్యనారాయణ

***అది 2006-2008 ప్రాంతం. నేను బద్రాచలం సబ్‌ట్రెజరీలో పనిచేస్తున్న కాలం. ప్రతిరోజూ నేను ఆఫీసుకు వెళ్లేదారిలో అధునాతన శైలిలో అక్కడ నూతనంగా నిర్మించిన రాష్ట్రప్రభుత్వ పర్యాటక రంగానికి చెందిన పున్నమి రెస్టారెంట్ నన్ను బాగా ఆకర్శించేది. పెద్దపెద్ద వృక్షాల నడుమ వాటికేమాత్రం భంగం కలిగించకుండా వాటిమధ్య మూడు అంతస్థులలో అక్కడ నిర్మించిన ఆ రెస్టారెంట్ బద్రాచల పట్టణానికే ఒక మకుటాయమానంగా కనిపించడం ఒక కారణమైతే, దాని లోపల అలంకరణకోసం లక్షలు పోసి కొన్న ప్రముఖ చిత్రకారుల ఒరిజినల్ చిత్రాలు అందులో అలంకరింపబడి వుండడం నా ఆసక్తికి రెండో కారణం. అందుచేతనే ఆ రోజుల్లో నేను నా మిత్రుడు బీర శ్రీనివాస్ తప్పనిసరిగా ఖరీదైన ఆ రెస్టారెంట్‌కి టీ తాగే నెపంతో వీలైనప్పుడల్లా వెళ్లేవాళ్లం. ఇరవై లేదా ముప్పైరూపాయలు చెల్లించి టీ లేదా కాఫీ తాగే నెపంతో మేము దాదాపు అక్కడ గడిపే గంట సమయంలో ఓ అరగంట అన్ని రూములూ గాలిస్తే, మిగిలిన అరగంట మాత్రం ఎప్పుడూ అక్కడి కాఫీరూములో ఒకే ఒక టేబుల్ దగ్గర కూర్చొని గడిపే వాళ్లం. కారణం అక్కడ ఎదురుగా ఉన్న గోడపై రెండు పెద్ద కాన్వాస్‌లను జతపరిచి అలంకరింపబడ్డ ఒక పెళ్లి ఊరేగింపు చిత్రం.***

తెలంగాణా ప్రాంతంలోని ఓ సంపన్న వర్గానికి చెందిన కుటుంబంలోని అమ్మాయి పెళ్లి ఊరేగింపుకు సంబంధించిన చిత్రమది. అందంగా అలంకరించబడిన పెళ్లికూతురు పల్లకీలో కూర్చుండగా ఆ పల్లకీకి అటూ, ఇటూ నలుగురేసి కండలు తిరిగి, కోరమీసాలు, తలపాగాలు ధరించిన బోయీలు మోస్తూ వుండగా ఆ రాత్రి వేళ వెలుగు చూపే నిమిత్తం మరి కొందరు కాగడాలు పట్టుకుని నడుస్తుండగా, పళ్లు , పూలూ అలకంరింపబడ్డ పళ్లాలతో కొందరు మహిళలు, రాజసంగా మీసాలు మెలివేస్తూ



పంచెకొంగు చేతపట్టుపకుని సపరివార సమేతంగా ఆ ఊరేగింపు వెంట నడుస్తున్న ఇంకొందరు పురుష పుంగవులు ఇలా సాగుతున్న ఆ పెళ్లి ఊరేగింపు చిత్రం ఒకటైతే, సవరగిరిజనుల నృత్యానికి సంబంధించిన చిత్రం మరోప్రక్క, ఈ రెండు చిత్రాల్లోని వ్యక్తుల రూపాలలోని విభిన్నత, వారి దేహ, వస్త్ర సౌందర్యాలలోనే గాక, నేపద్యంలోని చెట్ల నిర్మాణ చిత్రణలో కూడా కనబరచిన చిత్రకారుని రేఖావిన్యాసం, వర్ణవ్యత్యాసం, రంగు రేఖలలోని పరిశు భ్రత పరిపక్వత, సాధికారిత మమ్మల్ని బాగా ఆకట్టుకునేవి. మమ్మల్ని అంతలా ఆకట్టుకున్న ఆ చిత్రాల సృష్టికర్త మరెవరో కాదు. తనదే... కేవలం తనదే అయిన రేఖ మరియు వర్ణ విన్యాసంతో తెలంగాణా ప్రాంత జానపదుల ఆత్మను మరే చిత్రకారుడూ ఆవిష్కరింపలేనంత గొప్పగా కాన్వాస్‌పై కెక్కించి జానపద బ్రహ్మగా పేరుగాంచిన డాక్టర్ కాపురాజయ్యగారి కుంచెనుండి జాలు వారిన చిత్రరాజాలవి.

ఒకే అంశాన్ని ఎంచుకుని ఒక జీవిత కాలం మార్పులేకుండా చిత్రాలు వేస్తూ ప్రేక్షకులను రంజింపజేయడం అన్నది ఎంతో సాహసోపేతం మరియు ఎంతో ప్రతిభావంతమైన చర్య అవుతుంది. కారణం మార్పులేకుండా నిరంతరంగా ఏకరీతిలో సాగే శైలి ఎప్పుడూ మార్పు నాస్వాదించే ప్రేక్షకుడి కంటికి తప్పకుండా కొంతకాలానికి విసుగును కలిగిస్తుంది. మరి 70 ఏళ్లుగా ఆంధ్రదేశమేకాదు యావత్ భారతదేశ కళాకారులను, కళాభిమానులను అలరించడమే గాక, ఎందరో చిత్రకళా విమర్శకుల ప్రశంసలకు సైతం ఆయన చిత్రాలు పాత్రమౌతున్నాయి అంటే విసుగు కలిగించాల్సిన మార్పులేని ఆచిత్రాల శైలిలో విసుగు రప్పించని, ప్రశంసాపాత్రమైన బలీయమైన కోణం ఏం దాగుందీ వాటిల్లో? సౌందర్యవంతమైన రూపాలు గానీ, మిరిమిట్లు గొలిపే వర్ణవిన్యాసం గానీ ఏమీ లేని ఆ చిత్రాల్లో వాటికంటే ఎన్నో రెట్లు గొప్పది, మరియు తరతరాలుగా గ్రామీణ జీవనంలో అల్లుకుపోయిన గొప్ప ఆచారాలు, సాంప్రదాయాలు, కళలు, సంస్కృతితో పెనవేసుకుపోయిన జానపదుల జీవనం వాటిల్లో దాగివుంది.

కమ్మరి కొలిమి, కుమ్మరి చక్రం, జాలరిపగ్గం, సాలెలమగ్గం, మేదరి బుట్టలు మాత్రమే కాదు, చాకలి మరియు గీతకార్మికుల ఇక్కట్లు, గొల్లభామల పాట్లు, పశువుల కాపరుల వేటలు, వరినాట్లు, పంటకోతలు, ఇలా సమాజంలోని జానపదుల శ్రమైక జీవన సౌందర్యాన్ని ఆవిష్కరించడమే గాక, సాంప్రదాయకంగా జానపదాలలో పెనవేసుకుపోయిన ఆచారాలకు ప్రతిరూపాలైన జానపదుల జాతకాలు, పూనకాలు, పోతురాజుల ఆటలు, పోలేరమ్మ జాతరలు, బతుకమ్మల సంబరాలు, భజంత్రీల వాయిద్యాలు, గిరిజన సామూహిక నృత్యాలు, పెళ్లి ఊరేగింపులు ఇంకా గ్రామిణ సమాజానికి వినోదాన్ని కలిగించే జానపద గాయకుల పాటలు, గ్రామీనుల ఆటలు, కోలాటాలు, కొమ్ము సంబరాలు ఇలా ప్రతీదీ సమాజంతో ముడిపడివున్న అతని చిత్రాల్లో గ్రామీణ జానపద జీవనంలోని ఆత్మను సజీవంగా పదిలపరిచారు. కాబట్టే మిరుమిట్లు గొల్పే వర్ణాలు, సౌందర్యవంతమైన రూపాలూ లేకున్న వాటిని మించిన స్థాయిలో సహజత్వాన్ని నింపుకున్న ఆయన చిత్రాలు నిత్యం అందరి కళాహృదయాలలో వెలుగొందుతూ వున్నాయి.

సూక్ష్మమైన మరియు లోతైన పరిశోదనలతో కూడిన ఇంతటి జానపద ఆత్మ ఆయనకు ఎలా అలవడిందీ అంటే ఆయన పుట్టి

పెరిగిన వాతావరణ పరిస్థితుల గురించి మనం తెలుసుకోవాలి. మెదక్‌జిల్లా సిద్దిపేటలో శ్రీమతి లక్ష్మి, రాఘవులు అనే నిరుపేద దంపతులకు మూడవ సంతానంగా ది. 07-04-1925న జన్మించిన రాజయ్య గారి విషయంలో అతని కుటుంబం కంటే తనచుట్టూ వున్న సమాజమే అతన్ని అధికంగా ప్రభావితం చేసినట్లుగా మనకు కనిపిస్తుంది.

సుప్రసిద్దమైన, సుసంపన్నమైన సాంప్రదాయాలకు పేరెన్నికగన్న సిద్దిపేట నకాషి చిత్రకారులు, రంగోలీ కళాకారులు, రథచిత్రలేఖకులు, బొమ్మల పనివాళ్లు, పటచిత్రకారులకు కొలువై నెలవై రాజయ్యగారికి చిన్ననాటి నుండి ఉత్తేజాన్నిస్తూ అతనిలోని కళాసౌందర్యాత్మకు ప్రేరణగా నిలిచాయి. అంతేగాక సిద్దిపేటలోని వివిధ వృత్తి కళాకారులకు నిలయమైన పారుపల్లి వీధిలోనే ఈయన ఇల్లు వుండడం, అక్కడ గల కుమ్మరి, కమ్మరి, బ్రాహ్మణ, ముదిరాజు యాదవ, గౌండ్లు, రజక, దూదేకులు మొదలైన వారందరూ చిన్నతనంలోనే రాజయ్యగారి మనసుపై చెరగని ముద్రలు వేశారు. వీరంతా వారి వారి వృత్తులలో నైపుణ్యాలతో దేవాలయాలపై మెరుగులు దిద్దడం, గ్రామ పొలిమేరల్లో దేవతలను చిత్రించడం, పల్లకీలను, కుండలను, మూకుల్లను బొమ్మలతో అలంకరించడం, రథాలపై వివిధ ఆకృతులను చిత్రించడం లాంటి చిత్రవాతావరణంలో ఆయన పెరిగారు. తోలుబొమ్మలాటలు, హరికథలు, ఒగ్గుకథలు, పాండవుల కథలు, వీధి భాగవతాలు వంటి దేశీయ కళారూపాలను బాగా చూసిన రాజయ్య జానపదీయాన్ని తన నరనరాన జీర్ణించుకున్నారు. అంతబలమైన ప్రభావం ఆయనపై పడడం వలనే ఇన్నేల్లయినా అదే శైలిలో తన చిత్రరచనా వ్యాసంగంలో విజయ వంతంగా కొనసాగగలుగుతున్నారు.

చిన్నతనమందే ఎదురైన ఆర్థిక అవరోదాలకు తోడు తండ్రికూడా చనిపోవడంతో మరకా చంద్రయ్య అనే తన తండ్రి స్నేహితుడు ఆదుకున్నాడు. ఆరవతరగతిలో ఉంటుండగా రాజయ్య వేసిన ఓ చిత్రాన్ని చూసి ముగ్దుడైన "కుబేరుడు" అనే డ్రాయింగ్ టీచర్ రాజయ్యను బాగా ప్రోత్సహించాడు. ఆ పిదప 1943లో హైదరాబాద్ సెంట్రల్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్‌లో చేరారు. 1945లో మద్రాస్ నుంచి చిత్రకళలో డిప్లమోతో పాటు హయ్యర్ టీచర్ ట్రైనింగ్‌ను కూడా హైదరాబాద్ నుండి పూర్తిచేశారు. ఆపై డ్రాయింగ్ టీచర్ ఉద్యోగంలో స్థిరపడ్డారు. తొలుత ప్రాచ్య విదానంలో అనగా వాష్ పద్ధతిలో చిత్రించినప్పటికీ ఆ తర్వాత నకాషీ చిత్రకారుల అద్భుత టెక్నిక్‌కు ముగ్ధుడై టెంపెరా రంగుల వాడకం మొదలుపెట్టారు. 1950 నుండి 1970 వరకూ ఆయన టెంపరా, చిత్రాలు పేపర్, అట్ట, ప్లైవుడ్, అప్పుడప్పుడు గోడపై కూడా పౌడర్ రంగులు అద్దుతూ ఆయన చిత్రించేవారు. ఏది చిత్రించినా వాటికి మూలం మాత్రం జానపదమే నేపధ్యంగా ఉండేది.

అసంఖ్యాకంగా చిత్రించడం ఒకెత్తైతే వాటికి తగిన గుర్తింపు రావడం అన్నది మరో ఎత్తు. ఎంతటి ప్రతిభాపాటవాలున్నా దానికి తగిన గుర్తింపు గాని నోచుకోనట్లయితే ఆ కళాకారునిపై దాని తాలూకు ప్రభావం పడటం గమనార్హం.

"10-8-1957న ఆంధ్రప్రభలో మీరు రాసిన వ్యాసం చదివాను. ఆంధ్రచిత్రకారుల గురించి దేశవిదేశాలలో పరిచయం చేసేవారు ఎవరూ లేరే! అని ఇంతవరకూ బాధపడుచుండేవాడిని. గానీ ఆపనిని మీరు నిర్వర్తిస్తున్నందుకు కృతజ్ఞతలు" అంటూ 13-8-1957న అప్పటికి బొంబాయిలో చిత్రకళాభ్యాసం చేస్తూ ఆపై రాజమహేంద్రి నందలి దామెర్ల స్మారక చిత్రకళాశాల ప్రిన్సిపల్‌గా వుంటూ వివిధ పత్రికలలోనే గాక "తూలిక" అనే తన పత్రిక ద్వారా మన ఆంధ్ర చిత్రకారుల గురించి మరియు ప్రపంచచిత్రకళారీతుల గురించి ఆంద్రాంగ్ల భాషలలో ప్రపంచానికి పరిచయం చేసిన





ప్రముఖ చిత్రకారులు స్వర్గీయ మాదేటి రాజాజీగారికి, కాపు రాజయ్య గారు రాసిన ఉత్తరాన్ని బట్టి అప్పటి ఆయన అంతరంగాన్ని మనం అంచనా వేయవచ్చును. కానీ ఆ తదుపరి ప్రసార సాధనాలు మరియు కళావర్గాలద్వారా కూడా మంచి ఆదరణ రాజయ్యగారికి రావడంతో సహజంగా తాను పయనిస్తున్న ఆ జానపదచిత్రణా మార్గంలో విశ్వాసం మరింత రెట్టింపయ్యేలా చేసింది. వెంటవెంటనే స్థానిక, ప్రాంతీయ జాతీయ స్థాయిల్లో ఆయనకు ఎన్నో అవార్డులు లభించాయి. లండన్‌లో సుప్రసిద్ధమైన 'ది స్టూడియో అనే ఓ చిత్రకళా పత్రికలో రాజయ్యగారి చిత్రం ఒకటి ప్రచురితం కావడంతో అంతర్జాతీయంగా కూడా ఆయనకు గుర్తింపు లభించింది. క్రమేణా ఆధునిక చిత్రకళలో మూడు ప్రధాన ప్రేరణలైన (ఆబ్‌స్ట్రాక్ట్, సాంప్రదాయక, ప్రతీకాత్మకత మూడు మార్గాలు ఆయనపై ప్రభావం చూపినప్పటికీ తన మనసులో చెరగని ముద్రవేసిన జానపద నేపద్యానికి తోడైన అతని నిరంతర పరిశ్రమ అతనికి ప్రత్యేకశైలి అలవడేలా చేశాయి. క్రమంగా టెంపెరా నుండి నూనెరంగులకు మరలి విరివిగా చిత్రరచన సాగించారు.





సృష్టిలోని ప్రకృతిని యధాతథంగా అనుకరించడం ఉత్తమకళ కాదు. అలాగని ప్రకృతిని పట్టించుకోకుండా పూర్తిగా విస్మరించడం కూడా ఉత్తమకళ అనిపించుకోదు. ఆ రెండింటినీ సమన్వయం చేస్తూ చిత్రకారుడు తనదైన కోణంలో భావాన్ని ఆవిష్కరించడం ఉత్తమమైన కళ అవుతుంది. ఆ భావనలో అంశం మరలా తనతోటి సమాజానికి చెందినదై వుండి అదీ అతి సరళమైన రీతిలో వ్యక్తం చేసే కళాప్రక్రియ మరింత ఉత్తమమైనదౌతుంది. తన సుదీర్ఘమైన కళాయానంలో రాజయ్యగారు చేసిన గొప్పపని అదే. ప్రపంచవ్యాప్తంగా ఎన్నో ధోరణలు ఆయనపై ప్రభావం చూపిన కాలంలో శివుడు, కృష్ణుడు, తిరపతి వెంకన్న లాంటి మతపరమైన మరియు పవిత్రమైన అంశాలను తాంత్రిక, ప్రతీకాత్మకలతో కూడిన ఆధునిక పద్దతులులలో కొంతకాలం చిత్రించినా ఆ భావవ్యక్తీకరణకు మరలా తనతోటి కళాకారులతో ముందుకు సాగాలని ఏవేవో టెక్నిక్‌లను అనుసరించక, తన స్వతసిద్ధమైన చాలా తేలికయినటువంటి పద్దతులనే ఆయన అనుకరించాడు. ఏధోరణిలో ఎప్పుడు ఎలా చిత్రించినా ఆయన చిత్రాల్లో నిజాయితీ కనిపిస్తుంది. ప్రముఖ చిత్రకళా విమర్శకుడు, కవి అయిన మాకినీడి పేర్కొన్నట్లు అతని తత్వానికి కొంచెం భిన్నంగా వున్న ఈవిధమైన చిత్రణ రచింపకనో ఏమో మరలా ఆయన జానపద జీవనంపైనే దృష్టిపెట్టి అసంఖ్యాకంగా వేసిన బతుకమ్మ బోణాలు, ఎల్లమ్మ జోగి, పొలేరమ్మ జాతర, పాలోయమ్మ పాలు, గీతకార్మికులు పాట్లు, దోబిఘాట్, వడ్డెరలు, కోలాటం, పంటకోతలు, పూనకాలు, పోతురాజుల ఆటలు తదితరమైన ఎన్నో



వందలు చిత్రాలు కేవలం మనరాష్ట్రం, దేశంలోనే కాక ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలలో ప్రదర్శించి జానపద కళావిశిష్ఠతను ప్రపంచ నలుమూలలా చాటి చెప్పిన గొప్ప చిత్రకారుడు డాక్టర్ కాపురాజయ్యగారు.

భారతీయ చిత్రకళాపరిచయంలో భాగంగా లలితకళా అకాడమీ న్యూఢిల్లీ ద్వారా 1950లో చెకోస్లావేకియా, హంగేరి, బల్గేరియా, రుమేనియా దేశాల్లో ప్రారంభమైన తన అంతర్జాతీయ చిత్రకళా ప్రదర్శన 1963, 64, 1972, 79, 1986, 84 87, 88,89, 1991 మరియు 1992 వరకూ క్యూబా, సోఫియా, హవానా, మెక్సికో పెర్త్, ఆస్ట్రేలియా, అమెరికా, లండన్ తదితర దేశాలతో పాటు, మనదేశంలోని న్యూఢిల్లీ, ముంబాయ్, కోల్‌కత్తా, మద్రాస్, అహ్మదాబాద్, అలహాబాద్, జైపూర్, బోపాల్, బెంగుళూర్, హైద్రాబాద్ తదితర ముఖ్య నగరాలలో జరిగిన అనేక గ్రూప్‌షోలలో తన చిత్రాలను ప్రదర్శించారు.

ఇక 1953 నుండి 1998 వరకు దాదాపు 30 సార్లు రాష్ట్రంలోని ముఖ్య నగరాలన్నింటా వివిధ సందర్భాలలో తన వ్యక్తిగత చిత్రప్రదర్శనలు నిర్వహించారు.

ఇక సుదీర్ఘమైన తన కళాయానంలో ఎన్నో అవార్డులు, రివార్డులు ఆయన సొంతమయ్యాయి. 1955లో ఐ.ఏ.ఎఫ్ ఏ సి.ఎస్ సిల్వర్ జూబ్లి సందర్భంగా న్యూఢిల్లీలో జరిగిన పోటీల్లో రెండవ బెస్ట్ అవార్డ్, 1957లో ఇండియన్ అకాడమీ ఆఫ్‌ఫైన్ ఆర్ట్స్ అమృతసర్‌లో క్యాష్ అవార్డ్, మైసూర్ దసరా ఎగ్జిబిషన్‌లో సెకండ్‌ప్రైజ్, శిల్పకళాపరిషత్ పాట్నాలో 1958లో జరిగిన ఆలిండియా ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో గోల్డ్‌మెడల్, 1959 మరియు 60లో మధ్యప్రదేశ్ చిత్రకళాపరిషత్ నిర్వహించిన పోటీల్లో బెస్ట్ అవార్డ్, 1964, 76లలో మైసూర్ దసరా ఎగ్జిబిషన్‌లో ప్రథమ బహుమతి మరియు స్పెషల్‌ప్రైజ్, 1974లో రాజమండ్రి నందు జరిగిన ఆలిండియా ఆర్ట్‌ఎగ్జిబిషన్‌లో మొదటి బహుమతిని, హైదరాబాద్‌లో జరిగిన 37వ అఖిలభారత చిత్రకళాపోటీలలో గోల్డ్‌మెడల్ మొదలైనవి ఆయన పొందిన బహుమతులలో కొన్ని ముఖ్యమైనవి.

ఇక ఆయన బిరుదులు, సన్మానాలు గురించి చెప్పుకుంటే 1966లో రజిత పత్రం, 1968లో హైద్రాబాద్ ఆర్ట్ సొసైటీ సిల్వర్ జూబ్లి సదర్భంగా ఆయనకు తామ్రపత్రాన్ని ఇచ్చి గౌరవించారు. జె.ఎన్.టి.యు. కళాప్రవీణ బిరుదును, ఆలిండియా ఆర్ట్స్ అండ్‌క్రాఫ్ట్స్ న్యూఢిల్లీ వారు కళావిభూషన్ బిరుదుతో సత్కరించారు. తాను స్వయంగా సిద్దిపేటలో లలిత కళాసమితిని స్థాపించిన ఈ చిత్రకారుని ఆంద్రప్రదేశ్ ప్రభుత్వం 25.3.2000న హంస అవార్డుతో పాటు ముప్పైవేల నగదుతో సత్కరించింది. 2007లో న్యూఢిల్లీ లలిత కళా అకాడమీ లలిత కళారత్న బిరుదును ప్రధానం చేసింది.

నేషనల్ గేలరీ ఆఫ్ మోడర్ ఆర్ట్ న్యూఢిల్లీ, పార్లమెంట్ భవనం, సాలార్‌జంగ్ మ్యూజియం, స్టేట్ మ్యూజియం, న్యూఢిల్లీ లలితకళా అకాడమీ, టి.టి.డి, ఏ.పి.యస్,ఆర్.టి.సి, ఐ.టి.సి బద్రాచలం, కల్చరల్ మినిస్ట్రీ మాస్కో, నేషనల్ మ్యూజియం క్యూబా తదితర దేశాలతో పాటు మన మాజీ గవర్నర్, ఉపరాష్ట్రపతి డా॥ శంకర్ దయాళ్‌శర్మ, డా॥జె.బాపురెడ్డి, సి. ఆంజనేయరెడ్డి ఐ.పి.యస్ తదితర ఎందరో గొప్ప వ్యక్తుల కలక్షన్స్‌లో



ఇంతటి ప్రతిభావంతమైన ఆ మహా చిత్రకారున్ని కలుసుకునే అవకాశం మా మిత్రులు ప్రముఖ చిత్రకారులు శ్రీ మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావు గారి ద్వారా కలిగింది. 13.8.2011న స్టేట్ ఆర్ట్ గేలరీ హైదారాదబాద్‌నందు ప్రాంరభమైన ఆయన చిత్రకళా ప్రదర్శన వీక్షంచే నిమిత్తం నేను నా మిత్రుడు బీరశ్రీనివాస్, మరియు రాజారాంబాబు వెళ్లడం. ఆరోజు మంచెంగారి ఎగ్జిబిషన్ చూసిన మాకు మరుసటి రోజు డా॥రాజయ్య గారిని కలవాలనే ఆలోచన రావడంతో 14.8.2011 ఉదయమే మంచం గారితో కలిసి మేం నలుగురం మంచెంగారి కారులోనే సిద్దిపేటకు బయలుదేరాం. 87 ఏళ్ళ వయసులో ఉన్న రాజయ్య గారిని కలుసుకోవడం మాకు గొప్ప ఆనందమైతే, ఆయన కంటికి దెబ్బతగిలి అనారోగ్యంతో మంచంపై ఉండడం మాకు బాధ కలిగించింది. చిత్రకారుడు మాత్రమే గాక యమ్.బి.బి.యస్. చేసి అక్కడే వైద్య వృత్తిలో స్థిరపడ్డ రాజయ్యగారి పెద్దబ్బాయి డా॥ కాపు రమేష్‌గారు మమ్మల్ని సాదరంగా ఆహ్వానించి రాజయ్యగారికి మమ్మల్ని పరిచయం చేశారు. ఆ పిదప ఆయన ఇంటికి ఇంచుమించు ఎదురుగానే ఉన్న కళాభవన్‌కి తీసుకెల్లి రాజయ్యగారి కళాసామ్రాజ్యాన్ని చూపించడమే గాక మా అందరికీ రాజయ్యగారి చిత్రం తాలుకు ఒక్కో ఆయిల్ ప్రింట్ కాపీని ఇచ్చి గొప్ప ఆనందాన్ని ఇవ్వగా 87 ఏళ్ల వయసులో ఆరోగ్యం బాగుండని స్థితిలో కూడా లేచి డా॥రాజయ్యగారు నాకిచ్చిన ఆటోగ్రాఫ్ మరింత గొప్ప బహుమానమయ్యింది.

రాజయ్యగారి చిత్రాలున్నాయి.

"కుంచె పదాలు" నే కవితా సంకలనాన్ని రచించడం ద్వారా ఆయన మంచి కవిగా కూడా నిరూపించుకున్నారు. తన 37ఏళ్ల సుదీర్ఘ ఉద్యోగ ప్రస్థానంలో 33 ఏళ్లుసిద్దిపేటలోనే డ్రాయింగ్ టీచర్‌గా పనిచేసి కళాభవన్ నిర్మించి అందులో ఎంతో మంది శిష్యగణాన్ని ఆయన తీర్చిదిద్దారు నేడు ప్రముఖ చిత్రకారులుగా వెలగొందుతున్న గౌరీశంకర్, లక్ష్మాగౌడ్, యాసాల బాలయ్య, బాలరత్నం ఇత్యాది చిత్రకారులంతా రాజయ్యగారి శిష్యులే కావడం విశేషం తన ఎనమండుగురు సంతానంలో నలుగురు మగవాళ్లను తన కళావారసులుగా తయారుచేస్తే అమ్మాయిలను ఉపాధ్యాయులుగా ఆయన తీర్చిదిద్దారు.



రాజయ్యతో వ్యాసరచయిత వెంటపల్లి

జీవితాంతం ఓ నిబద్దత, పట్టుదలతో కృషి చేసి అజరామమైన కళాసంపదను సృష్టించిన ఆ మహా చిత్రాకుడిని కలుసుకోవాలన్న నా కల అలా నెరవేరడానికి కారణమైన మా మిత్రులు మంచెం గారికి, ఎంతో ఓపికగా రాజయ్య గారి చిత్రాలన్ని చూపించిన డాక్టర్ రమేష్ గారికి మనసులో కృతజ్ఞతలు తెలుపుకుంటూ ఆ మహా చిత్రకారుడు రాజయ్యగారి వద్ద శెలవుతీసుకుని బయలుదేరాం ఆ సాయంత్రం అక్కడి నుండి.

*email:* **snventapalli@gmail.com**

# దేవుడున్నాడా?

నా దృష్టిలో "దేవుడు" అనే పదార్థం ఒక అద్భుతమైన సృష్టి. అవును. "పురాణ పాత్రలన్నీ సృష్టించబడినవే- అవి జరిగినవి కావు' అని భారత, భాగవతాలు రచించిన వ్యాసుడే చెప్పాడు.

'ఇతిహాస పురాణేభ్యామ్
వేదస్సముప బ్రహ్మయేత్
న సీత న చ రుక్మిణి॥'



అక్కినేని నటజీవితానికి 75 వసంతాలు పూర్తయిన సందర్భంగా...నాస్తికుడైన అక్కినేని అభిప్రాయాలు...

సామాన్య మానవులకు, మూర్ఖులకు, జ్ఞాన హీనులకు, అజ్ఞానులకు, మంచి చెడ్డలు, నీతినిజాయితీ, ధర్మాధర్మాలు, న్యాయాన్యాయాలు అనే విషయాలను తెలియజెప్పడానికి, ఉదాహరణగా సృష్టించబడిన పాత్రలు మాత్రమే- అని చెప్పారాయన. దైవం ప్రజల్ని భయపెడుతుంది. దైవభీతి వుండవలసిందే. "దేవుడున్నాడు-చూస్తున్నాడు' అంటేనే-మానవులు ఇన్ని తప్పులు, నేరాలూ చేస్తున్నారే- అసలు ఆ భయం కూడా లేకుండా పోతే, ఈ మానవులు ఎలా వుండేవారో! ఏమైనా ఎవరి అభిప్రాయం వారిది. నాది చిన్నతనం నుంచి తార్కిక స్వభావం, ఏదైనా తర్కానికి నిలబడాలి. నాకెందుకో దేవుడు అనేవాడున్నాడనీ, అతను విగ్రహాల్లో వుంటాడనీ నమ్మకంలేదు. పెద్దవాళ్లకి ఆ నమ్మకాలుంటాయి. నా పెళ్లయిన తర్వాత సత్యనారాయణ వ్రతం చెయ్యాలని అమ్మ చెప్పింది. అప్పుడు నాకు 24 ఏళ్లు. 'ఎందుకమ్మా' అని ఓ మాటగా అన్నా-అమ్మకోసం వ్రతం ఆచరించాను. నా నమ్మకం నాది, ఐతే ఇంకొకరి అభిప్రాయంతోనూ, నమ్మకాలు, విశ్వాసాలతోనూ విభేదించను. "నా నమ్మకాన్నే మీరూ పాటించండి" అని ఎవరికీ ఉద్బోధ చెయ్యను. కాకపోతే ఏదైనా విషయాన్ని గ్రహించాలంటే వితండవాదం లేవదీయాలి. "దేవుడు లేడు" అని నేనంటే అవతలివాళ్లు ఉన్నాడని మాట్లాడతారు. దానిమీద చర్చ జరిగితే, చాలా విషయాలు నాకు తెలుస్తాయి. ఐతే, నేనేదో గొప్పవాడినని చెప్పడానికి ఈ మాట చెప్పడంలేదు, నేనెప్పుడూ ఆ మాట చెప్పుకోను. అరవైఆరు సంవత్సరాలుగా, ఈ సినిమా ప్రపంచంలో వున్నాను. విభిన్నమైన పాత్రలు చేసి, మంచి నటుడనిపించుకున్నాను, అవార్డులు అందుకున్నాను. ఇప్పటికీ నా ప్రజాదరణ నాకు వుంది. అభిమానులు వస్తూనే వుంటారు. ఐతే నేను గొప్పవాడినని అనుకోవచ్చుగా! కాదు. నాకంటే గొప్పవాళ్లు ఎందరో వున్నారు. ఇంకా నేను తెలుసుకోవలసిందీ, నేర్చుకోవలసిందీ ఎంతో వుంది! నాకు జిజ్ఞాస ఎక్కువ, ఆ జిజ్ఞాసే లేకపోతే, శుద్ధ పల్లెటూరి అనాగరీకుడికి ఈ మాత్రమైనా లౌకిక జ్ఞానం కలిగేదా?

మొత్తానికి 'కృష్ణార్జున యుద్ధం'లో అర్జునుడి పాత్రే నన్ను వరించింది. రొమాంటిక్ పాత్ర. పాటలున్నాయి, దర్శకుడు, రచయిత సమగ్రమైన పాత్రగా రూపొందించారు. ఐతే, చిత్రం చివరిలో అర్జునుడు, కృష్ణుడూ పోటీ పడినప్పుడు రథం దిగి కృష్ణుడికి నమస్కరించాలి. అది ఆ పాత్ర లక్షణం, సంస్కారం. నేను కింద నిలబడ్డాను. రామారావుగారు రథం మీద వున్నారు. నేను మరీ పొట్టిగా, వున్నట్టనిపించింది. 'కృష్ణార్జున యుద్ధం' చిత్రం చూసిన తర్వాత, నా భార్య ఒక మాట అంది: " ఇంకెప్పుడూ రామారావుగారి పక్కన పౌరాణిక చిత్రాలలో వెయ్యకండి!" ఆమె



‘కృష్ణార్జున యుద్ధం’ లో ఏఎన్ఆర్, ఎన్టీఆర్

అన్నమాట నిజమే కదా! ఇంతటి సద్విమర్శ చెయ్యగల అన్నపూర్ణ నా భార్య అయినందుకు ఎంతో గర్వపడ్డాను.

మళ్లీ ‘విప్రనారాయణ’ విషయానికి వస్తే, ఈ అగ్ని పరీక్షలో కూడా నెగ్గాలనుకున్నాను. విప్రనారయణుడు పరమ భాగవతోత్తముడు, నిష్ఠాగరిష్ఠుడు, శ్రీరంగనాధుడి చింత తప్ప ఐహిక వాంఛలు లేనివాడు. అలాంటివాడు దేవదేవి వేసిన ఉచ్చులో చిక్కుకున్నాడు, పాత్ర తీరులో మలుపులున్నాయి. ఘర్షణ వుంది. భాషా సంపద గల సంభాషణలున్నాయి. “ఈ పాత్ర కూడా నాకు మంచి పేరు తెచ్చిపెడుతుంది. నేను గట్టిగా కృషి చెయ్యాలి’’ అని నిర్ణయించుకున్నాను, సముద్రాల రాఘవాచర్యగారితో కూర్చుని సంభాషణలు చదువుతూ, తప్పొప్పులు, ఉచ్చారణ సవరించుకుంటూ, అర్థాలు తెలుసుకుంటూ కంఠస్థం చేసేవాడిని, తెల్లవారుజామున లేచి, సంభాషణలు చదువుతూ, మననం చేసుకునేవాడిని, సంభాషణ ఎక్కడ విరిచి చెప్పాలి? ఎలా మాడ్యులేట్ చేస్తే బాగుంటుంది– అని ఆలోచించేవాడిని. అలాంటి పాత్ర నటించడానికి కొంత స్ఫూర్తి అవసరమవుతుందని నాగయ్యగారి ‘భక్తపోతన’ చిత్రం మళ్లీ మళ్లీ చూశాను. ఆ పాత్రలో ఆయన నటించిన విధానం, అభినయం, భక్తిభావం గ్రహించాను. షూటింగ్స్‌లోని కొన్ని దృశ్యాల్లో దర్శకుడు రామకృష్ణగారితో చర్చించి–ముందుగా చేసి చూపించి– నా ఉద్దేశం తెలియజేసేవాడిని, షాట్‌లో నటించిన తర్వాత, రామకృష్ణగారు బాగుందన్నా నాకు తృప్తిగా వచ్చినట్లు అనిపించకపోతే ఇంకో టేక్ చేద్దాం అని అడిగేవాణ్ణి. ఈ కళకి అంతేముంది? ఎంత బాగాచేస్తే అంత మంచిది. ఓర్పు వహించాలి. పాత్ర మీదనే దృష్టి కేంద్రీకరించాలి. నటుడి బాధ్యతే అది. ఐతే, ఎంత స్వచ్ఛంగా సంబాషణ చెప్పినా ‘శ్రీ’ సరిగా పలకలేకపోతున్నారు. ‘స్రీ’ అని వచ్చింది గాని, శకార శబ్దం స్వచ్ఛంగా వినిపించలేదు. అవన్నీ మళ్లీ ‘డబ్’ చేశాను. చిత్రం ప్రజల్లోకి వెళ్లిన తర్వాత “నాగేశ్వరరావు ఈ పాత్ర కూడా అద్భుతంగా నిర్వహించాడు’’ అన్న ప్రశంసలు విన్న తర్వాత–కృషి ఫలించిందన్న తృప్తి కలిగింది.

భిన్న విభిన్నమైన పాత్రలే ఏ నటుడికైనా నిండుదనం తెస్తాయి. నన్ను ‘నటసమ్రాట్’ అన్నా ‘మహానటుడు’ అన్నా కారణం ఆ పాత్రలే. ఆ గొప్పదనం అంతా ఆ పాత్రలదీ, ఆ పాత్రల్ని సృష్టించిన రచయితలదీ, తీర్చిదిద్దిన ఎంతో మంది టెక్నీషియన్లదీ, ఎక్కడో రామాపురంలో పుట్టిన వాడికి, చదువు లేనివాడికి, సంస్కారం తెలియనివాడికి, ప్రపంచంలోని అన్ని దేశాల ప్రభుత్వాల దగ్గర్నుంచి ఆహ్వానాలు వచ్చాయంటే, అదంతా నా గొప్పదనమా? నా అదృష్టం కొద్ది నేను నటుడినయ్యాను. అలా కాకుండా, చదువుకుని వుంటే ఏ ఉద్యోగమో చేసుకుంటూ పొట్టపోసుకునే వాడినేమో! చదువు లేక పోవడం వల్లనే నాకు ఈ భిక్ష లభించిందా? మా అమ్మ ప్రోత్సాహం, ఆశీస్సులు లేకపోతే ఈ రంగంలోకి వచ్చి వుండేవాడినా? మా అన్న రామబ్రహ్మంగారు చొరవచూపించకపోతే, ఈ రంగంలోకి వచ్చి వుండేవాడినా?

“వీడిని చదివించే స్తోమత మనకి లేదు. చదువుకోవడానికి ఇక్కడ సదుపాయాలూ లేవు. ఏదో నాటకాల్లో వేషాలు వేస్తున్నాడు. బాగానేవున్నాడు, వాడికీ ఉత్సాహం వుంది, ఉండనీ, ఎలాగో ఒకలా నాలుగురాళ్లు సంపాయించుకోడానికి ఒక దారి దొరికిందిగా’’ అంది అమ్మ– మా అన్నయ్యతో. అది అమ్మ ఆశీస్సు. అమ్మ చెప్పిన ఆ దార్లోనే వెళ్లి–నాకు నేనుగా కాంక్రీట్ వేసుకున్నాను. సత్పురుషుల సాంగత్యం లభించింది. విశాలమైన ప్రపంచం కనిపించింది. అంతులేని కళాసాగరాన్ని కనిపించిన మేరకు దర్శించగలిగాను.

## నిస్వార్థ కళాసేవకుడు

# పఠాన్ ఇబ్రహీంఖాన్

- వాడ్రేవు సుందర్రావు

నంది, గరుడ అవార్డుల గ్రహీత




*తెలుగు భాషను, సంస్కృతిని మనసారా ప్రేమించి, తెలుగువారి జానపద కళారూపాల అభ్యుదయ వికాసాలకోసం తపనపడుతూ, గత మూడు దశాబ్దాలుగా తరగని సేవ చేస్తున్న నిస్వార్థ కళాసేవకుడు పఠాన్ ఇబ్రహీంఖాన్. కళ కళకోసమే కాదు, కళ ప్రజలకోసం అని నమ్మి, ఎన్ని కష్టనష్టాలు ఎదురైనా తన కార్యక్రమాలను కొనసాగిస్తూ, కళాకారులను ప్రోత్సహిస్తున్న ఉత్తమ నిర్వాహకుడే ఇబ్రహీంఖాన్. 1983లో బండారులంక లాంటి ఓ సామాన్యమైన గ్రామంలో ప్రారంభించబడిన "శ్రీ అభ్యుదయ కళానికేతన్" అనే చిన్న సంస్థ, ఆనాటి నుండి నేటి వరకూ పెద్ద సంస్థలకు తీసిపోనివిధంగా ముందుకు నడుస్తూ, అనేక కార్యక్రమాలను నిర్వహిస్తుందంటే అందుకు ముఖ్య కారకుడు ఇబ్రహీంఖాన్. ఆయన ప్రారంభించిన అభ్యుదయ కళానికేతన్, హరికథ, బుర్రకథ, ఏకపాత్రాభినయం వంటి సంప్రదాయ కళారీతులకు ఆలవాలమై నిలిచింది. సంగీతానికి, నాట్యానికి పెద్దపీట వేసింది. ముఖ్యంగా జానపద కళలకు కొంగు బంగారమయ్యింది. కేవలం కళాప్రదర్శనలే కాదు, కళాకారులకు సంబంధించిన పెన్షన్‌లు, రేషన్‌కార్డులు, ఇళ్ళ స్థలాలు, గృహనిర్మాణాలు వంటి అనేక విషయాలలో అండదండలందిస్తూ, వారి అభ్యుదయానికి అంకితమై నిలిచింది అభ్యుదయ కళానికేతన్. ఇదంతా ఇబ్రహీంఖాన్ నిరంతర కృషి ఫలితమే.*

తూర్పుగోదావరి జిల్లాలోని బండారులంక, పుల్లేటికుర్రు వంటి గ్రామాలన్నీ చేనేత పరిశ్రమకు ప్రసిద్ధి చెందినవి. ఎందరో నేత కార్మికులు, వారి కుటుంబసభ్యులు రేయనక పగలనక శ్రమించి, అందమైన చేనేత చీరల్ని అందిస్తారు. కులమతాలకు అతీతంగా ఎందరో ఈ నేతవృత్తిలో పనిచేస్తుంటారు. అటువంటి చేనేత కార్మికులే పఠాన్ మస్తాన్‌ఖాన్, ఆయన భార్య అష్రఫ్ ఉన్నీసా బేగం. నేతపనిలో విన్పించే అందమైన మాటల్లో ఒకటి "పడుగు", రెండోది "పేక". పడుగు అంటే అడ్డం, పేక అంటే నిలువు. ఈ రెండూ సమానంగా కలిపి లాగితేనే నేతపని సజావుగా సాగుతుంది. ఏమాత్రం తేడా వచ్చినా నేతపని అస్తవ్యస్థమై పోతుంది. అలా పడుగు పేకల్లా కలిసి, బ్రతుకు పండించుకొన్న ఆ దంపతులకు 1-2-1955న ఇబ్రహీంఖాన్ జన్మించారు. ఖాన్ జన్మించినది పశ్చిమగోదావరిలోని పాలకొల్లుకు సమీపంలోని మట్టపర్రు. కార్యక్షేత్రం అంతా తూర్పుగోదావరిలోని బండారులంక. ఈవిధంగా ఇబ్రహీంఖాన్ ఉభయగోదావరుల సంగమకేంద్రమై నిలిచాడు.

అమలాపురంలోని ఎస్.కె.బి.ఆర్.కాలేజీలో బి.కాం. పూర్తయ్యాక, కొన్నాళ్ళు రత్నగర్భ పత్రికలో సహాయ సంపాదకుడిగా పనిచేసారు. మరికొంతకాలం పటాన్‌చెర్వులో ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేసారు. ఏ ఉద్యోగాలు చేసినా ఆయనలోని కళాభిరుచి వసివాడలేదు సరికదా, దినదిన ప్రవర్ధమానమవుతూ వచ్చింది. ఒకవైపు ఉద్యోగం చేస్తూనే అలహాబాద్‌లోని హిందీ సాహిత్య సమ్మేళనం





సత్కారం అందుకుంటున్న ఖాన్

ఆయన మనస్సుపై ఆ ప్రభావం పడింది. ఆయన జీవన ప్రస్థానమంతా ఒంటరి పోరాటమే. ఎంతమంది ఆయనతో ఉన్నా, అసలైన సందర్భంలో మాత్రం ఆయన ఒంటరి యోధుడే.

క్రమంగా ఇబ్రహీంఖాన్ దృష్టి నటనవైపు మళ్ళింది. సహజంగానే ఆయన మంచి నటుడు. 1975లో, అంటే ఆయన ఇరవయ్యవ యేట, బండారులంకలోనే వినాయకచవితి ఉత్సవాలలో, ఆయన నటించిన తొలి నాటిక ''లేత గులాబీ'' ప్రదర్శింపబడింది. చరిత్ర, ఏక్‌దిన్‌కా సుల్తాన్, ఎడ్రస్‌లేని మనుషులు,

నుండి ఆయన హిందీలో సాహిత్యరత్న పట్టం అందుకొన్నారు. ఆ తరువాత ప్రయివేటుగా ఎమ్.ఎ. చేసారు. మహబూబ్‌నగర్‌లో హిందీ పండిట్ శిక్షణ పొంది, అమలాపురంలో హిందీ పండితుడిగా ఉద్యోగజీవితంలో స్థిరపడ్డారు. నాటి నుండీ హిందీభాషోపాధ్యాయుడిగా జీవన ప్రయాణాన్ని సాగిస్తూ, తన శక్తిని, ఉత్సాహాన్ని, తన మనస్సుని, తన హృదయాన్ని కళారంగానికే అర్పించి కళా జీవనప్రయాణాన్ని సాగిస్తున్నారు.

ఇబ్రహీంఖాన్ తండ్రి మస్తాన్‌ఖాన్ గొప్ప బుర్రకథ కళాకారుడు. బ్రతుకు తెరువు కోసం బట్టలు నేసినా, ఆత్మసంతృప్తి కోసం బుర్రకథలు చెబుతూ వచ్చేరు. కన్నతండ్రి ప్రభావం, చిన్ననాటినుండీ ఖాన్‌పై పడింది. దానికితోడు ప్రఖ్యాత బుర్రకథ కళాకారుడు జూనియర్ నాజర్, ఆయనకు స్వయంగా మేనమామ. ఈ ఇద్దరి వల్ల, ఇబ్రహీంఖాన్ కళాప్రస్థానం బుర్రకథతోనే ప్రారంభమవడంలో ఆశ్చర్యమేముంది? బొబ్బిలియుద్ధం, వీరాభిమన్య, అల్లూరి సీతారామరాజు, పలనాటియుద్ధం వంటి ఎన్నో గొప్ప కథల్ని ఎంతో శ్రద్ధతో నేర్చుకొని, వందలాది ప్రదర్శనలు చేసారు. ప్రేక్షకులకు ఆయన బుర్రకథంటే వల్లమాలిన ఇష్టం, చెప్పలేనంత ప్రేమ. ముఖ్యంగా వీరాభిమన్య కథ అంటే, ఖాన్‌కి ఎంతో ఇష్టం. అపారమైన కౌరవ సైన్యాలను ఒక్కడుగా ఎదిరించిన అభిమన్యుడి తెగువ, అతడి ధైర్యం, చూపిన సాహసం ఆయన మనసును ఎంతగానో ప్రభావితం చేసాయి. ఆ కథను ఎంతో ఇష్టంగా చెప్పడంవల్లనో, ఎందుకో, తెలియకుండానే

హుష్‌కాకి, స్నేహం, ఎవరికివారే యమునా తీరే, మొద్దబ్బాయి, రేషన్‌కార్డు, అల్లూరి సీతారామరాజు వంటి ఎన్నో నాటికలు, నాటకాలలో విభిన్నమైన పాత్రల్లో కన్పించి ప్రేక్షకుల ప్రశంసలందుకొన్నారు.

ఇబ్రహీంఖాన్‌కి ఇష్టమైన మరో కళారూపం ఏకపాత్ర. బాలచంద్రుడు ఏకపాత్ర ఆయనకు ఎంతో ఇష్టమైన పాత్ర. అంతేకాక ఆయనకు ఎంతో పేరు తెచ్చిపెట్టిన పాత్ర కూడా ! ఖాన్ మంచి గాయకుడు. ముఖ్యంగా జానపద గీతాలాపనలో ఖాన్‌ది అందెవేసిన చేయి. జానపదగీతాలతో గ్రామప్రజల ఊహలు, ఉద్వేగాలకు అక్షరరూపం ఇచ్చి, స్వర మధురిమను జతపరచి, శ్రోతలకు అలౌకికమైన అనుభూతిని ప్రసాదించటంలో ఆయనకు ఆయనే సాటి. ఇదంతా ఒక కళాకారుడిగా ఇబ్రహీంఖాన్ కళాప్రస్థానం.

ఇక ఆయనలో కన్పించే మరొక గొప్ప కోణం "నిర్వహణా నైపుణ్యం". 1983లో ప్రారంభించబడిన శ్రీ అభ్యుదయ కళానికేతనే, నిజంగా కళాఅభ్యుదయానికి నికేతనమే. ప్రతీఏటా క్రమం తప్పకుండా అభ్యుదయ కళానికేతన్ ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాల్ని నిర్వహిస్తోంది. ఎందరో కళాకారులకు, ముఖ్యంగా ఔత్సాహిక కళాకారులకు తమ ప్రతిభను ప్రదర్శించుకోవడానికి మంచి వేదిక కల్పిస్తోంది. ఈనాడు ఉభయగోదావరి జిల్లాలలో సుప్రసిద్ధులైన ఎందరో నటులు, దర్శకులు, గాయకులు. ఒకనాడు ఔత్సాహికులుగా అభ్యుదయ కళానికేతన్‌లో ప్రదర్శనలు చేసినవారే, ఖాన్‌చేత





*శ్రీఅభ్యుదయ కళానికేతన్ సభ్యులతో ఖాన్ -1983 సం॥లో*

సత్కరించబడినవారే. చంద్రమోహన్ ప్రక్కన నటించిన అందరూ గొప్ప హీరోయిన్‌లుగా రాణించినట్లే, ఖాన్ వేదిక మీద ప్రదర్శన చేసిన వారందరూ ఆయా రంగాలలో ఎంతో గొప్పవాళ్ళవుతారని మిత్రుల నమ్మకం. 1983 ఫిబ్రవరి నెల 1వ తేదీన బండారులంకలో స్థాపించబడిన అభ్యుదయ కళానికేతన్‌కు 2000 సంవత్సరంలో అమలాపురంలో ఒక విభాగం, 2009లో కాకినాడలో మరొక విభాగం ఏర్పడ్డాయి. ఇలా మూడు విభాగాలూ నిర్విరామంగా, నిరంతరాయంగా కళా సంబంధమైన కార్యక్రమాల్ని కొనసాగిస్తూనే ఉన్నాయి. వీటన్నింటికీ తోడుగా ఖాన్‌లో కన్పించే మరొక గొప్ప అంశం "సమాజ సేవ". కాకినాడలోని నెహ్రూ యువజన కేంద్రం సహకారంతో అనేక సేవా కార్యక్రమాల్ని నిర్వహించారాయన. నాయకత్వ శిక్షణా శిబిరాన్ని ఏర్పాటుచేసారు. వయోజన విద్యా కార్యక్రమాలు చేసారు. ఉచిత వైద్య శిబిరాలు ప్రారంభించారు. అగ్ని ప్రమాదాలు సంభవించినపుడు, వరదలు వచ్చి ప్రజాజీవితం సంక్షోభపడినపుడు, ఆపన్నహస్తం అందించారు ఇబ్రహీంఖాన్. ప్రభుత్వం నిర్వహించే కార్యక్రమాల్ని విజయవంతం చేయడంలో అందరికన్నా ముందున్నారు. రైతు సదస్సులు, మహిళా దినోత్సవాలు, ఎయిడ్స్ నిరోధ అవగాహనా కార్యక్రమాలు, ... ఇలా ఒకటేమిటి... ఎన్నో... ఎన్నో సాంఘిక సేవా కార్యక్రమాల్ని అమలుచేయటంలో, ఎంతో శ్రద్ధని, నిష్ఠని కనబరచిన, కనబరుస్తున్న సేవాతత్పరుడు ఆయన.

వీటన్నిటికీ తోడుగా నిరుపేదలైన వృద్ధకళాకారులకు పెన్షన్‌లు అందించడంలో, ప్రయాణ సదుపాయాల్ని కల్పించడంలో, ఇతరత్రా వైద్య సౌకర్యాలు ఏర్పరచడంలో గత ముప్పై ఏళ్ళుగా నిత్యకృషి సాగిస్తూనే ఉన్నారు ఇబ్రహీంఖాన్. అంతేకాదు కళారంగంలో, సాంఘిక సేవా కార్యక్రమంలో విశిష్టమైన సేవచేసిన వ్యక్తులకు "అభ్యుదయశ్రీ" బిరుదునిచ్చి సత్కరిస్తూ, పాతకొత్తల సమాహారంగా నిలుస్తున్నారాయన.

ఇబ్రహీంఖాన్ నిస్వార్థసేవను గుర్తించిన రాష్ట్ర ప్రభుత్వం రాజమండ్రిలో నంది నాటకోత్సవాలు నిర్వహించినప్పుడు, వారిని ఆహ్వానించి సత్కరించింది. ఎన్నో సంస్థలు వారిని సత్కరించి ఎన్నో బిరుదులు ఇచ్చాయి. ఎంత ఘనతను స్వంతంచేసుకున్నా, ఎంత గౌరవం పొందినా ఇబ్రహీంఖాన్ ముఖంలో, నడతలో, నడకలో, మాటల్లో, మనసులో లేశమాత్రమైనా గర్వపురేఖ కన్పించదు సరికదా, సర్వదా వినయం తొంగిచూస్తుంది. ఎదిగిన కొద్దీ ఒదిగి ఉండాలన్న సూత్రం ఆయన ఎడల అక్షరసత్యం. దీనికి తోడు ఆయన గొప్ప స్నేహశీలి. మనుషులంటే ఎంతో ఇష్టం ఆయనకు. అందుకే ఇబ్రహీంఖాన్ ధన్యుడు.

జీవితాంతం ఇలా నిస్వార్థంగా, నిర్మోహంగా, నిర్విరామంగా కళాసేవ చేస్తూ జీవితాన్ని పండించుకోవాలనేది ఆయన ఆశ. అది నెరవేరాలనేది అందరి ఆకాంక్ష.

*email:* ***vadrevusundarrao@gmail.com***

# విశాలాక్షి- ఇంటింటా తెలుగు సాహిత్య మాసపత్రిక

## తెలుగు పత్రికలు - సంపాదకులు

పుస్తకాలు, పత్రికలు లేని ప్రపంచాన్ని నేడు ఊహించుకోలేం. ఈప్రపంచంలో పుస్తకం ఓ అద్భుతం. ఎందరెందరో భాషాభిమానం, దేశాభిమానం, సమాజశ్రేయస్సు, ఉద్యమస్ఫూర్తితో పత్రికలు స్థాపించి పాఠకులకు అందుబాటులోకి తెస్తున్నారు. లెక్కకు మిక్కిలిగా వెలువడుతున్న పత్రికలలో చిరకాలం నడిచేవి-పాఠకాభిమానం పొందేవి కొన్నే. పత్రికలను పాఠకాభిమానం పొందేలా సారథ్యం వహించేవాడు సంపాదకుడు. అలాంటి సంపాదకులను *64*కళలు.కామ్‌లో నెల-నెలా పరిచయం చేసే శీర్షికే తెలుగుపత్రికలు-సంపాదకులు.



కోసూరు రత్నం



పత్రికలను నడపటం కంటే సాగరాన్ని ఈదటం చాలా సులభం. ఎందుకంటే సాహిత్యానికి ఎంత విలువ ఉందో. సాహిత్యాన్ని అందించే పత్రికలు అంతే విలువ ఉంది. ప్రోత్సాహం లేకపోవటం వల్లనే ఈనాడు సాహితీప్రియులకు తగినన్ని పత్రికలు రావటంలేదు. వచ్చినా ఎక్కువ కాలం నిలబడడంలేదు.

ఎంతో మంది రచయితలు, కళాకారులు, కవులు మేధావులు పుట్టిన నెల్లూరులో సాహితీ ప్రియులూ ఎక్కువే. కాని ఇంతపెద్ద నగరానికి అందుబాటులో సరైన పత్రికలు లేవు. ఆ లోటు తీర్చటం కోసం సాహితీ మిత్రులను ప్రోత్సహించటం కోసం మరియు తన చిరకాల కోరిక అయిన వృద్ధాశ్రమాన్ని అభివృద్ధి చేయాలనే లక్ష్యంతో 2010 జనవరిలో విశాలక్షి అనే మాసపత్రికను నెల్లూరు జిల్లాలో ప్రథమంగా స్థాపించారు. సాహిత్యాభిలాషి, సేవాతత్పరుడు పత్రికా సంపాదకుడు-పబ్లిషర్ కోసూరు రత్నం, సాహిత్యం మీద ప్రేమ, అభిమానంతో పాటు తను స్థాపించిన విశాలాక్షి వృద్ధాశ్రమాన్ని గురించి తెలియజేయటానికి వృద్ధుల సేవతో పాటు సాహిత్య సేవ చేయాలనే లక్ష్యంతో పెట్టిన పత్రిక విశాలాక్షి. మంచి పత్రికగా నిలపాలని, ఎవరి సహాయం ఆశించక సొంత ఖర్చులతో నిర్వహిస్తున్నారు కోసూరి రత్నం. ప్రభుత్వంగాని, స్వచ్ఛంధ సంస్థలుగాని, వ్యాపార ప్రకటనల రూపంలో గాని మరే విధంగా అయినా సహాయపడినా విశాలాక్షి వృద్ధాశ్రమాన్ని అభివృద్ధి పరిచి వృద్ధులకు ఇతోధికంగా సహాయ పడటమే ధ్యేయంగా నడుపుచున్న పత్రిక విశాలాక్షి



**అవార్డ్స్** – 2011 హరివిల్లు క్రియేషన్స్ నెల్లూరు వారి ఉగాది పురాస్కారం

2011 డా॥ సి. నారాయణరెడ్డి సేవారత్న అవార్డు హైద్రాబాద్ మరియు అవోచా, లైన్స్‌క్లబ్, రోటరీ, మరియు సోమిరెడ్డి జమున స్మారక అవార్డులు అందుకొన్నారు.

ఈ పత్రికకు వర్కింగ్ ఎడిటర్ ప్రముఖ రచయిత ఈతకోట సుబ్బారావు.

# కోసూరి రత్నం గారి గురించి



శ్రీమతి కనకమ్మ, కొండయ్యగార్ల ముద్దుబిడ్డ. ఆత్మకూరు తాలూకా ఇనగవరం గ్రామంలో జన్మించి-చిన్న నాటి నుండీ తల్లి ప్రోత్సాహం, ఆదరణ, ప్రేమ వంటబట్టించుకొని తన జీవితాన్ని ఆదర్శవంతంగా మలచుకొన్న శిల్పి.

"ఆకలిగొన్న వారిని అంత అన్నం పెట్టరా"... అనేది మా అమ్మ అంటారు. ఆయన. పుట్టినదీ, పెరిగినదీ గ్రామీణ నేపథ్యంలో. డిగ్రీ పుచ్చుకొని 1982లో మెడికల్ రిప్రజెంటేటివ్‌గా వృత్తి చేపట్టినా... ఆయన మనసు" సమాజానికి నేనేం చేయగలను?" అనే ఆలోచనతోనే రోటరీ ద్వారా పెక్కు రక్తదాన శిబిరాలూ, ఆరోగ్య పరీక్షల క్యాంప్స్ నిర్వహించారు. అవి తనలోని సేవా దాహార్తిని తీర్చలేదు. మథర్‌థెరీస్సా సేవా స్ఫూర్తి తనకు మార్గదర్శకమని నమ్మి 2002 తన ఆస్థిలో కొంత అమ్మివేసి రూ. 8.5 లక్షలతో విశాలాక్షి వృద్ధాశ్రమాన్ని స్థాపించారు.

ఆర్థికబలం లేకున్నా... గొప్ప సంకల్ప బలం మెండుగా వుంది. చిత్తశుద్ధి తోడై ఉన్నత ఆశయాలే లక్ష్యంగా సేవే మార్గం అని నమ్మి ఎలాంటి ప్రభుత్వ గ్రాంట్లూ ఏవీ లేకున్నా... నేడు 60 వయసు పైబడిన 32మంది వృద్ధుల్ని ఆశ్రమంలో చేరదీసి అక్కున చేర్చుకొని ఆనందిస్తున్నారు.

"ఆదర్శప్రాయంగా జీవించాలన్నదే నా లక్ష్యం.. పదిమందీ నన్ను, నా తరువాత కూడా తలుచుకొనేలా నా తల్లితండ్రులకు పేరు తెచ్చేలా జీవించాలనేదే నా ఆశయం" అంటారు ఆయన.




పిల్లల నిరాదరణకు గురైన వృద్ధులు, ఒంటరి తనంతో ఆర్థికంగా మరో దారిలేని పేదలూ వున్నారు ఆశ్రమంలో.

అనతికాలంలోనే విశాలాక్షి మంచి విలువలు గల మాసపత్రికగా పేరు సంపాదించుకుంది. తొలి వార్షిక వేడుకలు జరిపినప్పుడు శ్రీ యండమూరి వీరేంద్రనాథ్‌గారు ఆత్మీయ అతిథిగా విచ్చేసి "విశాలాక్షి" పత్రిక మరో 'భారతి'లో ముద్రితమైన కవితలకు ముగ్ధుడై శ్రీ వీరేంద్రనాథ్‌గారు ఇద్దరు కవులకు బంగారు పతకాలు యివ్వడం ఆ పత్రికలోని సాహిత్య విలువలకు అద్దం పడుతుంది.

వృద్ధాశ్రమం నిర్వహణలో తెలిసిన దాతల స్థానికుల సహాయం స్వీకరించినా-నిర్వహణ పెనుభారమే. వీరి సహధర్మచారిణి శ్రీమతి లక్ష్మిగారు స్వయంగా వృద్ధులకందరికీ ఆమె వంటచేయడం బహుదా ప్రశంసనీయం.

మీరు యిక ముందు యింకేం చేయాలను కుంటున్నారు అని అడగ్గానే.. తన మనసులో దాచుకున్న తన ఆశయాల్ని బయటపెట్టారు.

'విశాలాక్షి' ఆశ్రమాన్ని రాష్ట్రంలోనే బెస్ట్ ఆశ్రమంగా చేయాలనీ... పల్లెల్లో ఆదరణకు నోచుకోని, అడుక్కునే పిల్లలు వుంటారనీ వారికి విద్యాభ్యాసాలు నేర్పి సంస్కారవంతులను చేయాలనే ఆశయం వున్నదన్నారు.

ఆర్థికంగా బలహీనులై... చక్కటి ప్రతిభ కనబరిచే విద్యార్థులను ఆదుకోవాలనీ... గుడ్డి, మూగ, చెవిటి మానసిక వికలాంగ పిల్లలకోసం ఒక స్కూల్ స్థాపించాలనేది తన సంకల్పంగా అభివర్ణిస్తారు శ్రీరత్నంగారు.

మెరిసే కళ్ళు...

పెదవులపై తరగని చిరునగవు,

పలకరింపులో ఆప్యాయత

మంచి చేయాలనే తలంపు...

యివన్నీ కలగలిపితే

ఆవిష్కృతమౌతారు శ్రీ కోసూరి రత్నంగారు.

మమతను పంచే సహృదయుల ఆశయాలు సిద్ధించాలని ఆకాంక్షిద్దాం...

నీరాజనం

సంస్కరణ యోధుడు, సాహితీ వైతాళికుడు
స్త్రీజనోద్ధారకుడు, జాతికి ప్రాత:స్మరణీయుడు

# కందుకూరి వీరేశలింగం

**(16-4-1848 - 27-5-1919)**

- వాడ్రేవు సుందర్రావు
**నంది, గరుడ అవార్డుల గ్రహీత**

రాజమండ్రి అంతా ఉడికిపోతోంది..

ఎక్కడికక్కడే జనం గుంపులుగా చేరి ఏదో తీవ్రంగా చర్చించుకొంటున్నారు. గోదావరీ స్నానఘట్టాలలో పురోహితులందరూ, ఏదో ఉపద్రవం ముంచుకొస్తున్నట్లుగా భయపడిపోతున్నారు. ఇన్నీసుపేటలో, దానవాయిపేటలో, కందకం రోడ్డులో... ఇలా ఒక్కటేమిటి... ఎక్కడెక్కడ నలుగురు నిలబడడానికి అవకాశం ఉందో, అక్కడ జనమందరూ చేరి ఏదేదో మట్లాడుకొంటున్నారు. ఉమా మార్కండేయస్వామి గుడిలో నాపరాళ్ళమీద బాసింపట్లు వేసుకొని కొందరు, ముంగాళ్ళ మీద కూర్చొని ఇంకొందరు పిచ్చిపిచ్చిగా వాదించుకొంటున్నారు. వేణుగోపాలస్వామి గుడి మెట్లు మీద మరికొందరు మల్లగుల్లాలు పడుతున్నారు. ఆడవాళ్ళు వంటపనులు మానివేసి, ఒకచోట చేరి ఏమిటీ విడ్డూరం అంటూ నోళ్ళు నొక్కుకొంటున్నారు.



భార్య
రాజ్యలక్ష్మితో
వీరేశలింగం

జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ ఏకాఏకిని కాకినాడ నుండి గుఱ్ఱపుబండిలో రాజమండ్రి వచ్చి, శాంతిభద్రతల పరిస్థితిని పర్యవేక్షిస్తున్నాడు. జాయింట్ మేజస్ట్రేట్ వచ్చి అక్కడి స్థితిగతుల్ని ఎప్పటికప్పుడు గ్రహిస్తూ వచ్చేడు. సాయంకాలం అవుతున్న కొద్దీ, ఊరంతా ఏదో కలత చెందినట్లు కన్పిస్తోంది. రాజమండ్రి పౌరులు మాత్రమే కాదు, కాకినాడ, పిఠాపురం, విశాఖపట్నం వరకూ ఉన్న ప్రాంతాల నుండి కూడా కొందరు పెద్దలొచ్చి ఆనాటి సంఘటనను చూడాలని ఎంతో ఉత్సుకతతో ఎదురుచూస్తున్నారు. అందరికళ్ళూ అటువైపే, అందరి దృష్టీ ఆ ఇంటివైపే.

సూర్యుడు గోదారిలో అస్తమించాడు. మెల్లిగా చీకటిపడుతోంది. గోదారిగట్టు మీద ఎన్నో కాగడాలు వెలిగించారు. దానితో చీకట్లో ఉన్న గోదారిగట్టు అంతా పట్టపగల్లా అయ్యింది. జనంలో ఆసక్తి తారాస్థాయికి చేరుతోంది. మరికాసేపటిలో జరగబోయే కార్యక్రమాల్ని చెడగొట్టాలని కొందరు దుడ్డుకర్రలు చేతబట్టి మారుమూలల్లో నిలబడ్డారు. అయితే అటువంటివాళ్ళను ఎదుర్కోవడానికి, ఎందరో కళాశాల విద్యార్థులు సిద్ధంగా నిలిచారు. శాంతి భద్రతల్ని కాపాడే అతి ముఖ్యమైన పనిని జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ తన చేతుల్లోకి తీసుకొని, తానే స్వయంగా పర్యవేక్షిస్తూ ఉండడం వల్ల, కార్యక్రమాన్ని కాపాడడానికొచ్చిన కళాశాల విద్యార్థుల వల్ల అల్లరిమూకలు భయంతో అడుగు కదపలేదు. అనుకొన్న సమయం సమీపించింది. మంగళవాయిద్యాలు ఒక్కపెట్టున మ్రోగాయి. వధూవరులు తలపైన జీలకర్ర బెల్లం పెట్టుకొన్నారు. వైవాహిక మంత్రాలతో అగ్నిసాక్షిగా వరుడు, వధువు మెడలో తాళి కట్టాడు. అది ఒక చారిత్రక సంఘటన. తరతరాలుగా వైధవ్యపు శృంఖలాలలో మ్రగ్గిపోతున్న స్త్రీల బ్రతుకుల్లో, వెలుగు నింపడానికి ఉద్యమించిన గొప్ప సంఘటన అది. స్త్రీ జాతి చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించదగిన మహత్తర ఘడియ అది. అదే వితంతు స్త్రీ పునర్వివాహ ఘట్టం. అది జరిగింది. 1881 వ సంవత్సరం డిశంబర్ నెల 11వ తేదీ.

ఆ మహాకార్యాన్ని చేసి జాతిచరిత్రలో ఓ కొత్త అధ్యాయానికి అంకురార్పణ చేసిన మహనీయుడే వీరేశలింగం. తెలుగు వారి పుణ్యఫలం కందుకూరి వీరేశలింగం. దురాచారాలు రాజ్యమేలుతున్న ఒకనాటి సమాజంలో, దుర్మార్గులు, అవినీతిపరులు, లంచగొండులు


రాజమండ్రి పట్టణంలోని వీరేశలింగం గారి శిలావిగ్రహం

విచ్చలవిడిగా విజృంభించి, నీతి న్యాయాలను, సత్యధర్మాలను అణగదొక్కిన ఒకానొక కాలంలో వీరేశలింగం జన్మించాడు. అధర్మాన్ని, అన్యాయాన్ని ధైర్యంగా ఎదిరించి, సమాజశ్రేయస్సు కోసం జీవితాంతం పోరాటం చేసాడు. తన మార్గంలో ఎన్ని కష్టనష్టాలు ఎదురైనా, ముందుకే నడిచాడు తప్ప వెనకడుగు వేయలేదు. సంఘంలోని దురాచారాలను నిర్మూలించడమే తన ఏకైక కర్తవ్యంగా భావించి, అనవతరం సంస్కరణబాటలో సాగాడు. వీరేశలింగం జన్మించి, జీవించి, సంఘసంస్కరణ కోసం శ్రమించి ఉండకపోతే మన సమాజం ఎన్నో విధాలుగా వెనుకబడి ఉండేది.

1848వ సంవత్సరం ఏప్రిల్ 16వ తేదీన రాజమండ్రిలో వీరేశలింగం జన్మించాడు. కందుకూరి వారు వీరశైవులు. విభూతి ధారణం, రుద్రాక్షలు, పార్థివలింగపూజ వీరశైవుల నిత్యకృత్యం. వీరేశలింగం తాతగారి పేరు వీరేశలింగమే. ఆ పేరే ఆయనకి పెట్టారు. వీరేశలింగం తండ్రి సుబ్బరాయుడు. తల్లి పున్నమ్మ. పుట్టినప్పటి నుండీ వీరేశలింగంది దుర్బల శరీరం. పైగా పురిటిలోనే ఆయాసం, దగ్గు పట్టుకొన్నాయి. ఆరు నెలల చిరుత ప్రాయంలో స్ఫోటకం వచ్చింది. అందరూ వీరేశలింగం అప్పుడే చనిపోతాడనుకొన్నారు కానీ, ఆయన బ్రతికాడు. అవును మరి... భవిష్యత్‌లో ఈ సమాజానికి అంత మహోపకారాలు చేయవలసి ఉండగా ఆయన ఎలా మరణిస్తాడు? కానీ వీరేశలింగం చిన్ననాటనే ఆయన తండ్రి సుబ్బారాయుడు మరణించాడు. తండ్రిలేని ఆ పిల్లవాడ్ని పెదనాన్న వెంకటరత్నం ఆదరించి, అక్కున చేర్చుకొన్నాడు.

చిన్ననాడు పులిపాక అమ్మిరాజు దగ్గర వీరేశలింగం అక్షరాభ్యాసం జరిగింది. గూని సోమరాజు బడిలో, వీరేశలింగం బాలరామాయణం, అమరకోశం చదువుకొన్నాడు. పాఠశాలలో వీరేశలింగానిది ఎప్పుడూ ప్రథమస్థానమే. 1861వ సంవత్సరంలో వీరేశలింగానికి పదమూడు ఏళ్ళ వయసులో, బాపమ్మతో వివాహం అయ్యింది. పెళ్ళిలో ఆమె పేరును రాజ్యలక్ష్మి అని మార్చింది ఆయన తల్లి. రాజ్యలక్ష్మి నిజంగా రాజ్యలక్ష్మి. ఆమె అడుగుపెట్టిన వేళా విశేషం ఏమిటో గానీ, అది వీరేశలింగం ఇంట సకల శుభాలకూ, సమాజ శుభాలకూ నాంది పలికింది. 1910లో మరణించేంత వరకూ ఆమె వీరేశలింగానికి అన్ని విధాలా తోడునీడగా నిలిచింది.

కోరంగి పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడిగా వీరేశలింగం తన ఉద్యోగ జీవితం ఆరంభించాడు. 1874లో ధవళేశ్వరంలోని ఆంగ్లో–వెర్నాక్యులర్ పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడిగా అవకాశం వచ్చింది. ధవళేశ్వరం నుండే ఆయన సామాజిక కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. 1875లోనే ఆయనకు బసవరాజు గవర్రాజుతో స్నేహం అయ్యింది. అది ప్రగాఢమైన అనుబంధంగా మారింది. కాలక్రమంలో రాజమండ్రి ఆర్ట్స్ కళాశాలలో వీరేశలింగం తెలుగు ఉపాధ్యాయుడిగా నియమించబడ్డాడు. వీరేశలింగం జీవితంలో చెప్పుకోదగిన సంఘటనలు ఎన్నో.. ఎన్నెన్నో...1890లో రాజమండ్రిలో పౌరుల కోసం పురమందిరాన్ని నిర్మించాడు. 1898లో మద్రాసులో జరిగిన అఖిల భారత సాంఘిక మహాసభకు వీరేశలింగం అధ్యక్షత వహించాడు. దాదాపుగా మూడు దశాబ్దాల ఉద్యోగ జీవితానికి 1904లో ముగింపు పలికి సంఘ సంస్కరణ కార్యక్రమాల్ని, గ్రంథరచనని ఉధృతం చేసాడు. 1906లో వీరేశలింగం అనుష్ఠాన బ్రహ్మసమాజీకుడై కులాన్ని, జంధ్యాన్ని వదిలిపెట్టాడు. అదే సంవత్సరంలో హితకారిణీ సమాజాన్ని స్థాపించి, తన యావదాస్తినీ దానికి అర్పించాడు. చివరి క్షణం వరకూ సమాజసేవకే తన జీవితాన్ని సమర్పించుకొన్న వీరేశలింగం, 1919 మే 27వ తేదీన ఉదయం 4 గం॥ల 20 నిమిషాలకు, మద్రాస్‌లోని కొమరాజు లక్ష్మణరావు గారింట తుదిశ్వాస విడిచారు.

ఆయన జీవితం ఓ మహాకావ్యం. ఆయన కృషి ఓ మహాగ్రంథం. అందులో ఎన్నో మహత్తరమైన అధ్యాయాలున్నాయి. ఎన్నో చారిత్రక సంఘటనలున్నాయి. వీరేశలింగం పేరు చెప్పగానే

మొదటిగా గుర్తొచ్చేది వితంతు పునర్వివాహం. అది వీరేశలింగం సాధించిన ఓ అద్భుతం. ఒకనాడు ఈ దేశంలో కన్యాశుల్కమనే దురాచారం ఉండేది. ముక్కుపచ్చలారని ఆడపిల్లల్ని డబ్బుకోసం, వయసు మళ్ళిన వాళ్ళకి ఇచ్చి కట్టబెట్టేవారు. ఆడపిల్లకు జ్ఞానం వచ్చే సరికి, ఆ ముసలి భర్త చనిపోయేవాడు. దానితో ఆ అమ్మాయి జీవితాంతం విధవగా బ్రతకవలసివచ్చేది. అదొక ఘోరం. పరమదుర్మార్గం. విధవలకు తిరిగి వివాహం చేయకూడదని, వారు జుట్టు తీసేసి, బొట్టు తుడిచేసి, తెల్లబట్టలు కట్టుకొని, ఒంటిపూట భోజనం చేస్తూ బ్రతకాలని, వారు ఎదురొస్తే అశుభమని... అసలు విధవే అమంగళకరమని, ఇలా ఆడవాళ్ళ బ్రతుకును ఎన్నో విధాలుగా అస్తవ్యస్థం చేసింది ఆనాటి సమాజం. వీరేశలింగం ఈ దురాచారాన్ని సమూలంగా రూపుమాపాలని సంకల్పించుకొని తొలి వితంతు వివాహం జరిపించాడు. ఇందుకోసం వీరేశలింగం ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కోవలసింది, ఎన్నో బాధలు పడాల్సివచ్చింది. అయినా ఆయన ఆ దుర్మార్గాన్ని ధైర్యంగా ఎదిరించి, విజయం సాధించాడు. వీరేశలింగం చేపట్టిన ఉద్యమాలలో ఎంతో ప్రాముఖ్యమైనది స్త్రీ విద్య. ఆనాటి సమాజంలో స్త్రీలకు విద్య అవసరం లేదని, వారి జీవితం కేవలం వంటఇంటికే పరిమితమనీ, అందరి నిశ్చితాభిప్రాయం. ఎవరైనా ఆడవాళ్ళు చదువుకోవాలనుకొన్నా, దానివల్ల వారి భర్తకి ఆయుక్షీణం అని నూరిపోసేవారు. వీరేశలింగం ఈ మూఢనమ్మకాన్ని కొట్టిపారేశాడు. పురుషులతో సమంగా స్త్రీలకు కూడా చదువుకొనే హక్కు ఉందని, అది శాస్త్ర సమ్మతమని నిరూపించాడు. పైగా స్త్రీలు చదువుకొంటేనే వారి కుటుంబం వృద్ధిలోకి వస్తుందని, ఇల్లాలి చదువే ఇంటికి దీపం అని, వీరేశలింగం తన ఉపన్యాసాల ద్వారా, రచనల ద్వారా నొక్కి చెప్పాడు. అలా చెప్పడమే కాదు. ఆయనే స్వయంగా తన భార్యకు చదువు చెప్పి, విద్యావంతురాల్ని చేసాడు. 1874వ సంవత్సరం సెప్టెంబర్ నెలలో ధవళేశ్వరంలో బాలికా పాఠశాలను ప్రారంభించి స్త్రీ విద్యారంగంలో ఎందరికో మార్గదర్శకుడయ్యాడు వీరేశలింగం. ఈ రోజు ఇన్ని వేలమంది, లక్షలమంది స్త్రీలు ఇంత విద్యాధికులై, ఎన్నో గొప్ప గొప్ప పదవుల్లో ఉన్నారంటే, అందుకు మూలకారణం, తొలి అడుగు కందుకూరి వీరేశలింగమే.


వీరేశలింగం గారి ముఖ్య శిష్యుడు బసవరాజు

వీరేశలింగం ఉద్యమాలలో మరో గొప్పకోణం, పత్రికా నిర్వహణ. సమాజంలోని దురాచారాలను తొలగించడానికి ఒక స్వతంత్ర పత్రిక అవసరం ఎంతో ఉందని గమనించాడు వీరేశలింగం. అందుకోసం 1875 అక్టోబర్‌లో వివేకవర్ధని అనే పత్రికను స్థాపించాడు. వివేకవర్ధని పత్రిక, అవినీతిపరుల పాలిట సింహస్వప్నమైంది. లంచగొండుల్ని అణిచివేసే గొప్ప ఆయుధమైంది. పత్రికని ముద్రించడానికి స్వయంగా ఒక ప్రింటింగ్ మెషీన్ కొని, రాజమండ్రిలోనే ముద్రణ ప్రారంభించాడు. పత్రికా రచయితగా, నిర్వాహకుడిగా వీరేశలింగం నిర్వహించిన పాత్ర అనితరసాధ్యం.




వీరేశలింగం గారి సమాధి

నాటక రచన, ప్రయోగం. నిజానికిసంస్కృతంలో నాటకం అనే ప్రక్రియ ఎంతో వృద్ధిచెందినా, గత శతాబ్ది వరకూ తెలుగులో నాటక ప్రక్రియ వికసించనే లేదు. వీరేశలింగానికి ఓ పదేళ్ళముందుగా తెలుగు నాటక రచన ఆరంభమైంది కానీ, నాటక ప్రదర్శన మాత్రం మొదలుకాలేదు. వీరేశలింగమే తొలినాటక ప్రయోక్త. 1880వ సంవత్సరంలో ఆయన రచించిన వ్యవహార ధర్మబోధిని నాటకం ప్రదర్శించబడింది. ప్లీడర్ల అవినీతిని వివరించే ఈ నాటకానికీ మరొక పేరు ప్లీడరు నాటకం. ప్రదర్శనను అందుకొన్న తొలి తెలుగు నాటకం ఇదే. ఆవిధంగా వీరేశలింగం తొలి తెలుగు నాటక ప్రయోక్త. వీరేశలింగం రచనల్లో కొన్ని సంస్కృత నాటకాలకు అనువాదాలు. మరికొన్ని ఆంగ్ల నాటకాలకు అనువాదాలు. ఇంకొన్ని స్వతంత్ర పౌరాణిక నాటకాలు. ఇంకొన్ని ప్రహసనాలు. నాటక రచయితగా వీరేశలింగ మహాకవి స్థానం అపూర్వమైనది.

సమాజాన్ని సంస్కరించే కార్యక్రమాన్ని అవిశ్రాంతంగా చేసి చేసి 1890వ సంవత్సరంలో వివేకవర్ధని ఆగిపోయింది. 1883 నుండి 1890 వరకూ స్త్రీల కోసం “స్త్రీ హితబోధిని” అనే మరొక పత్రికను నిర్వహించారాయన. 1906వ సంవత్సరం మార్చి 1 నుండీ సత్యవాదిని పత్రికను ప్రారంభించి విజయవంతంగా నడిపారు. పత్రిక అనేది ఏ ధర్మాల్ని నిర్వర్తించాలో, ఏవిధంగా సమాజశ్రేయస్సుకు ఉపయోగపడాలో, నేటికీ వీరేశలింగం నుండే నేర్చుకోవాలి.

వీరేశలింగం చేసిన భాషాసేవ అపూర్వం. తెలుగులో ఎన్నో కొత్త ప్రక్రియల్ని లోకానికి అందించారు వీరేశలింగం. చిన్నప్పుడు చదువుకొనే రోజుల్లో మార్కండేయ శతకాన్ని రచించాడు. అలా శతక రచనతో ప్రారంభమై దాదాపు పదివేల పేజీలకు మించిన సాహిత్యాన్ని వీరేశలింగం సృష్టించాడు. మార్కండేయశతకం, వేణుగోపాలశతకం, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం వంటి ఇరవై పద్య గ్రంథాలను రచించాడు వీరేశలింగం. ఇక వచనం గురించి చెప్పాల్సివస్తే అసంఖ్యాకమైన వచన రచనలు చేశారు కందుకూరి. రాజశేఖరచరిత్రం, సత్యవతీ చరిత్రం, సత్యరాజా పూర్వదేశయాత్రలు, చంద్రమతీ చరిత్రం, సత్యసంజీవిని వంటి నవలలు, కథలు, కవులచరిత్ర, స్వీయచరిత్ర వంటి చరిత్రలు, దేశచరిత్రలు, శాస్త్ర గ్రంథాలు, పాఠ్యగ్రంథాలు వంటి అనేక గ్రంథాల్ని రచించి, ముద్రించి తెలుగువారికి అమూల్యమైన సాహితీ సంపదను అందించి ధన్యుడయ్యాడు. తెలుగునేలను, తెలుగు ప్రజలను ధన్యుల్ని చేసాడు వీరశలింగం. అంతగొప్ప వాఙ్మయాన్ని సృష్టించాడు కాబట్టే, తెలుగువారు వీరేశలింగాన్ని ప్రేమతో గద్యతిక్కన అని పిలుచుకున్నారు.

వీరేశలింగం కీర్తికిరీటంలో మరొక కలికితురాయి ఆయన

ఇన్ని రచనలు చేయడంతో పాటుగా, సమాజంలోని అవినీతిని, లంచగొండితనాన్ని, దాంభిక ప్రవర్తనని, దురాచారాల్ని నిర్మూలించడానికి, నాటకాన్ని ఓ ఆయుధంగా వాడిన అసలు సిసలు నాటక రచయిత వీరేశలింగం.

ఇలా వీరేశలింగం గురించి చెప్పాల్సివస్తే, ... అదో మహాగ్రంథమవుతుంది. ఆయన సాగించిన ఉద్యమాలు, నిర్మించిన మందిరాలు, సంకల్పించిన ఉత్కృష్టమైన కార్యాలు, కార్యక్రమాలు, ఆశించిన సమాజశ్రేయస్సు, దర్శించిన స్త్రీజనాభ్యుదయం, అంకితమైన మహోన్నత విలువలు... ఇలా ఒక్కటేమిటి... వీరేశలింగం నడిచిన బాట అంతా భావితరాలకు వెలుగుబాటే. తాను జీవించి ఉన్న కాలం కన్నా, ఓ నూరేళ్ళ ముందుకు చూసిన క్రాంతదర్శి వీరేశలింగం.

కందుకూరి వీరేశలింగం ఒక వ్యక్తి కాదు, ఒక మహాశక్తి.

---

*దీనికి సహకరించిన బుడ్డిగ శ్రీనివాసు గారు, ఛైర్మన్, ఎస్. చంద్రశేఖర్ గారు, అసిస్టెంట్ కమీషనర్ & కరస్పాండెంట్, హితకారిణీ సమాజం మరియు పురావస్తుశాఖ వారికీ, పురమందిరం నిర్వాహకులకూ మా కృతజ్ఞతాభివందనాలు.*

*email:* ***vadrevusundarrao@gmail.com***

64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం
సంపుటి :2 సంచిక :8 జూన్ 2012



64కళలుడాట్‌కాం 20 నెలలు పూర్తి చేసుకొన్న సందర్భంగా 'మన కార్టూనిస్టులు' కొత్త శీర్షిక ప్రారంభించాం. తెలుగు కార్టూన్ రంగాన్ని సుసంపన్నం చేస్తున్న వారిని నెలనెలా మీ ముందుకు తీసుకువస్తాం.

64కళలుడాట్‌కాంకు రచనలు మేమూ చేయవచ్చా అని ఎంతో మంది మెయిల్స్ పంపిస్తున్నారు. కళలకు సంబంధించిన వ్యాసాలు (ఫొటోలతో) నిరభ్యంతరంగా పంపవచ్చు.

ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.

కళాసాగర్
ఎడిటర్



ముఖచిత్రం చిత్రకారుడు : ఉల్చి



**కుంచె శిల్పాలు- ఉలి(ల్చి) చిత్రాలు**

**సాహితీ తపస్వి మునిసుందరం**



ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే

# సాహితీ తపస్వి మునిసుందరం

**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ వారిచే ఉత్తమ నాటక రచయితగా సాహితీ పురస్కారం అందుకోబోతున్న తరుణంలో మునిసుందరం గారి ప్రొఫైల్.**

ఆ యువకుడి వైపు అలానే చూస్తూ ఉండిపోయారు గరికిపాటి రాజారావు. తనను చూడడానికి వచ్చిన ఆ విద్యార్థి కళ్ళలో కన్పిస్తున్న వినయం, నిలబడిన పద్ధతిలో ప్రకటితమయ్యే వినమ్రత, అభివాదం చేసే చేతుల్లో కన్పించే ఆదరం, వేసుకొన్న తెల్లని దుస్తుల్లో విన్పించే స్వచ్ఛతా రాగం . . . ఇవన్నీ చూస్తూ; ఆయన ఏదో తెలియని ఆత్మీయతా భావనకి లోనయిపోయారు.

- వాడ్రేవు సుందర్రావు

నంది, గరుడ అవార్డుల గ్రహీత

గరికిపాటి రాజారావు తెలుగు నాటకానికి అదృష్టవశాత్తూ లభించిన వరప్రసాదుడు. పద్యరాగాల్ని ఆలపించడమే నాటకమని సర్వులూ భావిస్తున్న ఒకానొక కాలంలో జన్మించి, నాటకమంటే ఏమిటో తెలియజెప్పిన గొప్ప ప్రయోక్త రాజారావు. తెలుగు నాటకానికి నవ్యతను, నాణ్యతను ప్రసాదించి, నాటక ప్రదర్శనకు సవ్యదిశను, భవ్యదశను చూపిన దర్శకోత్తముడు రాజారావు. ముఖ్యంగా సాంఘిక నాటకానికి ఎనలేని గౌరవం కల్పించిన మహనీయుడు రాజారావు. రాజమండ్రిలో విశ్రాంతి లేకుండా ఒకవైపు వైద్యవృత్తి చేస్తూనే, మరొకవైపు అనవతరం నాటకసేవ చేస్తూన్న గరికిపాటి రాజారావు అలా ... ఆరోజు... తనని చూడడానికి వచ్చిన ఆ యువకుడ్ని చూసి, ఎంతగానో సంతోషించాడు. మనసారా ఆదరించాడు.



కాళ్ళకూరి నారాయణరావు (జడ్జి) గారితో మునిసుందరం

తన పేరు మునిసుందరమని, రాయలసీమలో చిత్తూరు జిల్లాలోని పారకాల్వ గ్రామవాసిననీ, హిందీ పండిత శిక్షణ కోసం ఈ రాజమండ్రి వచ్చాననీ.... ఆ యువకుడు తనని తాను పరిచయం చేసుకున్నాడు. అన్నింటికన్నా మిన్నగా తనకున్న రచనాసక్తి గురించి, నటనా ప్రవేశం గురించి చెప్పగానే నాటకమే ఊపిరిగా భావించే రాజారావు మనసు పరవశించింది. మునిసుందరాన్ని తన ఆత్మీయ సహచరుడ్ని చేసుకొన్నారాయన.

నాటక రచనలో మునిసుందరానికి తొలిపాఠం గరికిపాటి రాజారావు దగ్గరే ఆరంభమైంది. ఎప్పుడు కలసినా ఎంత తీరిక లేకపోయినా, మునిసుందరాన్ని ప్రేమతో ఆదరించేవారు రాజారావు. ఆయన ప్రేరణ మీదే "రాతిగుండె" అనే నాటికను రాజమండ్రిలోనే రచించి ఇచ్చారు మునిసుందరం. భవిష్యత్‌లో నీవొక గొప్ప రచయితవు అవుతావని దీవించారు రాజారావు. నిండు మనసుతో అందించిన ఆయన దీవెన కాలక్రమంలో అక్షరసత్యమయ్యింది. మునిసుందరం నాటకరచయితగా సుప్రసిద్ధులయ్యారు.

దివ్యక్షేత్రమైన తిరుపతి పేరు తలచుకోగానే భక్తిభావంతో హృదయం ఉప్పొంగిపోయి, కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీవేంకటేశ్వరుడు గుర్తొస్తాడు. స్వామి మన స్మృతి పథంలో మెదలుతూండగానే గోవింద రాజులు, అనంతరం పద్మావతీ దేవి ప్రత్యక్షమవుతారు. వారందరికీ భక్తితో మనస్సులో నమస్కరించి, ఆ దేవదేవుడి సృష్టిలోని మానవుల గురించి, అందునా కళాస్రష్టల గురించి, కవి రచయితల గురించి, మరీముఖ్యంగా నాటక రచయితల



తెలుగు నాటకరంగ దినోత్సవ సందర్భంగా తిరుపతిలో సత్కారం అందుకుంటున్న మునిసుందరం గారు

గురించి, ఆలోచించగానే తొలిగా గుర్తొచ్చే పేరు, సహృదయులైన మునిసుందరం మాస్టారిది. కవిగా, రచయితగానే కాదు, అంతకు మించి మానవీయత నిండిన ప్రేమైకమూర్తిగా ఆయనకు మనకు కన్పిస్తారు. దానితో మాటల్లో చెప్పలేని ఆత్మీయతా పరిమళమేదో మనల్ని ఆవరించినట్లనిపిస్తుంది.

మన దేశంలో స్వరాజ్య సమరం ముమ్మరంగా సాగుతున్న కాలంలో, మునిసుందరం జన్మించారు. 1937వ సంవత్సరం సెప్టెంబర్ 14వ తేదీ ఆయన జన్మదినం. ఇందులో తెలియకుండానే ఒక ప్రత్యేకత ఉంది. మునిసుందరం మాస్టారు వృత్తిరీత్యా హిందీ అధ్యాపకుడు. హిందీలో విద్వాన్ డిగ్రీ పొంది, ఎమ్.ఎ. చేసి, ముప్ఫై ఆరు సంవత్సరాలు హిందీ లెక్చరర్‌గా పనిచేసారు. అయితే ఆయన పుట్టిన రోజైన సెప్టెంబర్ 14వ తేదీయే మనదేశంలో హిందీని రాజభాషగా ఆమోదించిన రోజు. అందుకే దేశమంతా సెప్టెంబర్ 14వ తేదీన, హిందీ దినోత్సవ వేడుకల్ని వైభవంగా జరుపుకుంటారు. అలా ఒక హిందీ అధ్యాపకుడి పుట్టినరోజు, భారతదేశ హిందీ భాషాదినోత్సవం ఒక్కనాడే జరగడం యాదృచ్ఛికమే కావచ్చు కానీ, నిస్సందేహంగా ఆనందించాల్సిన విషయం.

మునిసుందరం మాస్టారి జీవితంలో మరో విచిత్రముంది. ఆయన ప్రధానంగా హిందీ అధ్యాపకుడు. జీవితంలో సుదీర్ఘకాలం వృత్తిరీత్యా హిందీ భాషా బోధనా వ్యాసంగంలోనే గడిచింది. కానీ వారి సాహిత్య సృష్టిలో అత్యధికశాతం తెలుగులోనే సాగింది. మహామహులందరి జీవితాలలోనూ ఈ వైచిత్రి కనబడుతూనే ఉంటుంది. మహాకవి గురజాడ అప్పారావు కూడా, విజయనగరంలో ఇంగ్లీషు పాఠాల్ని బోధించారు, కానీ తెలుగులోనే అజరామరమైన సాహితీ సంపదను అందించి, చిరస్మరణీయులయ్యారు.

తిరుపతి పట్టణానికి సమీపంలోని రామచంద్రాపురం మండలంలో, పారకాల్వ గ్రామంలో సంపన్న కుటుంబీకులైన లక్ష్మమ్మ, నాదముని నాయుడు దంపతులకు జన్మించిన, మునిసుందరం బాల్యమంతా ఆ చిన్ని గ్రామంలోనే గడిచింది. భూస్వామ్యవ్యవస్థలో, అందునా గ్రామీణవ్యవస్థలో అంతస్థుల అడ్డుగోడలు ఎక్కువ. ఆత్మీయపు పలకరింపు కన్నా, అంతరాలను తెలిసి మసలడమే అవసరం. అనురాగపు దగ్గరితనం కన్నా, అధికారపు వినమ్రతకే గౌరవం. మునిసుందరం బాల్యానికి అదే వేదిక. అటువంటి వ్యవస్థలో నుండి, వెలుగుచూసిన భావుకుడైన ఆ పిల్లవాడి మనస్సు నిండా చెప్పలేనంత బాధ, చెప్పుకోలేనంత ఆవేదనా కన్పిస్తాయి. మునిసుందరం తొలినుండీ అంతరాలెరుగని వాడు. అధికారం కన్నా, ఆపేక్షకే పెద్దపీట వేసినవాడు. సహజసిద్ధంగా కళాకారుడికుండే ప్రేమానురాగాలు పుష్కలంగా ఉన్నవాడు. లోకాన్ని, లోకుల్ని మనసారా ప్రేమించినవాడు, నేటికీ ప్రేమిస్తున్నవాడు. అందుకే ఆ చిన్న నాటి రోజుల్లో ఆ పల్లెలో కన్పించిన కృత్రిమమైన వ్యవస్థమీద ఆయన ఇంత కాలం తన రచనల ద్వారా తిరుగుబాటు చేసి నిష్కల్మషమైన తన అంతరంగాన్ని నిర్భయంగా ఆవిష్కరించి చూపించాడు. దాదాపుగా మునిసుందరం రచనలన్నిటా ఈ ఆర్తి, ఆవేదన, వాటి సంఘర్షణ, తత్ఫలితంగా ఆవిర్భవించిన పరిష్కారాలు కన్పిస్తాయి. తన స్వేచ్ఛా ప్రవృత్తికి, స్వాతంత్ర్యపిపాసకు అనుగుణమైన ఇతివృత్తాలనెన్నుకొని తనదైన రచనా పాటవంతో రూపుదిద్ది గొప్ప కళాఖండాలుగా తీర్చిదిద్దారు. ఆయన సుప్రసిద్ధ రచన "ఏ వెలుగులకీ ప్రస్థానం" నాటికలో నాయకుడు సిద్ధార్థుడు. అతడే బోధివృక్షం క్రింద, ముక్తుడై బుద్ధుడవుతాడు. మునిసుందరం అంతరంగ ప్రయాణం ఇదే. హృదయక్షేత్రంలో రగిలిన ఈ భావాన్నే సిద్ధార్థుడి నోటివెంట సూటిగా విన్పిస్తాడాయన.

"పిచ్చివాడా! మీ రాజు రమ్యహర్మ్యాలలో వుంటున్నాడే, మృష్టాన్న భోజనాలారగిస్తున్నాడే, హంసతూలికా తల్పంపై శయనిస్తున్నాడే. మరి ప్రజలో....? వాళ్ళకీ సుఖాలు లభిస్తున్నాయా? లక్షలాది శ్రమజీవులు తమ సుఖాల్ని బలిపెట్టి ఏ ఒక్కడికో సౌఖ్యం




తిరుపతిలో 'కోనేటి రాయుడు' సిడి. ఆవిష్కరణ సభలో మునిసుందరం గారు

కట్టబెట్టాలా ? ఒక్కడికోసం ఇందరు దుఃఖాంబుధిలో మునగాలా? ఈ ప్రశ్న వేసింది సిద్ధార్థుడే కానీ, దాని వెనుక మునిసుందరం హృదయావిష్కరణ విస్పష్టంగా కన్పిస్తుంది.

మునిసుందరం తిరుపతిలోని శ్రీవేంకటేశ్వరా ఓరియంటల్ కళాశాలలో హిందీ విద్వాన్ చదివి, 1956లో విశ్వవిద్యాలయంలోనే ప్రథమస్థానంలో నిలిచారు. ఆ తర్వాత రాజమండ్రిలోని బి.ఇడి. శిక్షణాకళాశాలలో పండిత శిక్షణ పొందడం, వెనువెంటనే కడపలోని ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో అసిస్టెంట్ లెక్చరర్‌గా ఉద్యోగ జీవితం ఆరంభించడం జరిగిపోయాయి. 36 సంవత్సరాలు హిందీ లెక్చరర్‌గా వేలాదిమందికి విద్యాబోధన చేసారు. ఆరునెలలు కాలం పాటు డిగ్రీ కళాశాల పిన్సిపాల్‌గా పూర్తి అదనపు బాధ్యతను నిర్వహించారు. తిరుపతిలోని శ్రీవెంకటేశ్వరా విశ్వవిద్యాలయ బోర్డ్ ఆఫ్ స్టడీస్‌కి ఛైర్మన్‌గా తొమ్మిదేళ్ళ కాలం సహకారం అందించారు. 1968 నుండి 1971 వరకూ చిత్తూరు జిల్లా రచయితల సంఘానికి సారధ్యం వహించారు. 1992లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేత ఉత్తమ అధ్యాపకుడి అవార్డును 1989లో ఉత్తమ హిందీ అధ్యాపకుడిగా హిందీ అకాడమీ అవార్డును అందుకొన్న మంచి అధ్యాపకుడు మునిసుందరం మాస్టారు.

మునిసుందరం నాటక రచయిత కావడానికి ముందే, నటుడయ్యారు. వారి అన్న మేఘవర్ణం నాయుడు ప్రోత్సాహంతో కొన్ని నాటకాలలో మంచి పాత్రల్ని పోషించారు. ఆయన రంగస్థల ప్రవేశం "స్త్రీ " పాత్రతో జరిగింది. ఆ తరువాత పల్లెపడుచులో గోపి, పేదరైతులో కధానాయకుడిగా, అన్నాచెల్లెలు లో సత్యం, దొంగవీరడులో రాంబ్రహ్మం, అమరత్యాగిలో గోవిందామాత్యుడు, నిరపరాధిలో ప్రతినాయకుడు, మనిషిమారలేదులో లక్ష్మీపతి, దేశం



భార్య లక్ష్మీరాజ్యంతో మునిసుందరం

నీ సర్వస్వంలో

హుమయూన్, ఇది కథ కాదులో సి.ఐ.డి. సుందరం వంటి ఎన్నో పాత్రల్లో నటించి, ప్రేక్షకుల ప్రశంసలందుకోవడం జరిగింది. అంతేకాక "అచ్చి" అనే స్త్రీ ఏకపాత్ర కూడా ప్రదర్శించారుట. నటుడిగా ప్రారంభమైన రంగస్థలయాత్ర, కాలక్రమంలో ప్రసిద్ధ నాటకరచయితగా రూపొంది నలుగురిమెప్పును పొందింది.

వారి నాటకరచనల్ని నాలుగు విభాగాలుగా వర్గీకరించవచ్చు. మొదటివి చారిత్రక పౌరాణిక రూపకాలు, రెండోవి సాంఘిక రూపకాలు మూడోవి లఘు రూపకాలు నాల్గోవి హాస్యరూపకాలు. మునిసుందరం మాస్టారి సాహితీ సృష్టి విస్తృతమైనది, బహుముఖీనమైనది. మాస్టారి గురించి చెప్పగానే తొలుత గుర్తొచ్చేవి ఆయన చారిత్రక పౌరాణిక నాటికలు. అందులో బహుప్రసిద్ధమైనది. "ఏ వెలుగులకీ ప్రస్థానం". రెండో నాటిక " వరూధినీ గాంధర్వం". అల్లసాని పెద్దనామాత్యుడి మనుచరిత్ర కథ నేపథ్యంగా వ్రాసిన అందమైన నాటిక ఇది. దేశభక్తి ప్రేరితమైన మరొక గొప్ప రచన " దేశం నీ సర్వస్వం" రాణా ప్రతాప్ కథాంశంతో సాగే ఈ నాటిక ప్రేక్షకుల్ని అడుగడుగునా ఉత్తేజపరుస్తుంది. చరిత్రలో అశోకుడి గురించి, జనానికి ఒక విధంగానే తెలిసుంటుంది. ఆ అశోకుడి కధలో మరొక కోణాన్ని ఎంతో గొప్పగా ఆవిష్కరించిన నాటిక " చరిత్రలో చినిగిన పుట ". ఇందులో ఎన్నో ఆణిముత్యాల్లాంటి సంభాషణలు ఎడనెడ ప్రయోగించారు మాస్టారు. ఈనాటికలో ప్రధానపాత్ర తిష్యరక్షిత. ఆమె అశోకుడితో మాట్లాడుతూ జీవితాన్ని ఒక్క వాక్యంలో ఎంతో




విశాఖపట్టణంలో 'మట్టివాసన' పుస్తకావిష్కరణ సభలో మునిసుందరం తదితరులు




మునిసుందరం గారి పుస్తకాలు

నాటకంలో భాగస్వాముల్ని చేస్తుంది. మాస్టారి మరోనాటిక " ఇదికథకాదు ". ఆర్థిక అసమానతల అడ్డుగోడల మధ్యనలిగిపోయిన ప్రేమ, ఈ నాటికకు ఊపిరి. నాటికనిండా, గొప్ప సస్పెన్స్ కన్పిస్తుంది. ప్రేక్షకులలో అంతు తెలియని ఉత్కంఠ కన్పిస్తూ, నాటికను ఆద్యంతం గొప్పగా నడిపిస్తుంది.

1976 జూలైలో ఆకాశవాణి, విజయవాడ నుండి ప్రసారం చేయబడి, మునిసుందరం మాస్టారికి గొప్ప గౌరవం తెచ్చిన

అందంగా విశ్లేషిస్తుంది. "జీవితం దేవుడు మానవుడికిచ్చిన గొప్ప వరం. మబ్బుల్లో మెరుపులా దానికి వయసు తక్కువ! " – ఎంత అందమైన భావం. ఎంత అద్భుతమైన ఉపమానం. మరొక చోట రాధాగుప్తుడనే మంత్రి నోట మాస్టారు పలికించిన సంభాషణలో ఒక అందం, ఒక లయ, అంతకు మించిన ఒక గొప్ప భావం ఒకచోట చేరి ఎంత అందంగా కన్పిస్తాయో చూడండి" ఈ విశాల మౌర్య సామ్రాజ్యాన్ని ఆవరించిన శాంతి తెరలలో ఎంతో భయంకరమైన క్రాంతి పురుడు పోసుకొంటుందేమోనని నా భయం" పద ప్రయోగంలో ఆయనకు ఆయనే సాటి. మునిసుందరం వ్రాసిన మరోనాటిక "మహాదాత". అందులో భారతకథలోని కర్ణుడి అంతిమ ఘడియల్ని, ఆస్థితిలో కర్ణుడి దానశీలతని నాటక రూపంగా తెలుగువారికి అందించి, శెభాష్ అనిపించుకొన్నారు.

మునిసుందరం మాస్టారి పద్ధతి ఒకే వరవడిలో సాగిపోయే రచనా విధానం కాదు. అది భిన్న ప్రాతిపదికమీద కట్టుకొన్న సుందర సౌధం. అందుకే పౌరాణిక, చారిత్రక నాటికల రచనలో, ఆయన ప్రయోగించిన కరుణ రసం, సాంఘికాల కొచ్చేసరికి హాస్యరసానికి ఆలంబనం అయ్యింది. అయితే సంభాషణల సూటిదనం మాత్రం ఎక్కడైనా ఒక్కటే. అదే ఆయన ప్రత్యేకత. వారి పేరొందిన సాంఘిక నాటిక "అహం బ్రహ్మ అనే జనతాక్లబ్". ఇది ప్రతీకాత్మక ధోరణి (సింబాలిక్ స్టైల్)ని, అనుసరించే నాటిక. మేధావులు నిర్లిప్తతతో వ్యవహరిస్తే దేశానికి అరిష్టం అంటూ, ప్రబోధించిన ఈ నాటిక, 1977లో వెలువడినా, నేటికాలానికీ గొప్ప సందేశం అందిస్తోంది. ఇందులో ఎలియనేషన్ (తాదాత్మ్యవిచ్ఛిత్తి) కన్పిస్తూ, ప్రేక్షకుల్ని

***" ప్రేమకు స్వార్థం తోడయితే ప్రేమ బలహీనతగా మారుతుంది", " మనం రైలు ఎక్కగలమే కానీ, దాన్ని టయానికి గమ్యం చేర్చలేం కదా", " తెలుగువాడు కదండీ .... ఎదుటివాడు ఏడుస్తుంటే చూడలేడు".***

నాటిక "సింగారం" బ్రతుకు తెరువుకోసం కష్టపడి బ్రతికే స్త్రీని, ప్రపంచం ఎన్ని విధాలుగా వేధిస్తుందో, ఈ నాటికలో ఎంతో హృద్యంగా చూపించాడు రచయిత. నిజంగా ఇది గొప్ప నాటిక. మునిసుందరం మాస్టారి సంభాషణాచాతుర్యానికి ప్రతీకగా నిలబడే మరో సాంఘిక నాటిక "ఇదో రకం ప్రేమకథ".

ఈ నాటికలో ఎన్నో సంభాషణలు.... ఎంతో అందంగా.... ఎంతో బలంగా.... అడుగడుగునా కన్పిస్తాయి.

" ప్రేమకు స్వార్థం తోడయితే ప్రేమ బలహీనతగా మారుతుంది", " మనం రైలు ఎక్కగలమే కానీ, దాన్ని టయానికి గమ్యం చేర్చలేం కదా", " తెలుగువాడు కదండీ .... ఎదుటివాడు ఏడుస్తుంటే చూడలేడు".

మాస్టారి నాటికా రచనల్లో "నిజం కాటేసింది" ఓ మంచి నాటిక. హిందీ రచయిత వినోద్ రస్తోగీ వ్రాసిన నాటికకు అనువాదం " శిథిలాలు " నాటిక. వారి మరో రచన "భయం" మొత్తం ఇరవై ఒక్క నాటికలు, నాటకాలు అందించి, తెలుగునాటకాన్ని సంపన్నవంతం చేసిన మహనీయులు మునిరత్నం. భయం నాటికతో ఆయన రచనా ప్రస్థానం ఆరంభమై, ఏ వెలుగులకీ ప్రస్థానంతో మహాభినిష్క్రమణ చేసింది. ఆయన రచించిన చివరి నాటిక " ఏ

వెలుగులకీ ప్రస్థానం" అదీ 1983లో.

నాటకమే కాదు, కవిత్వం కూడా ఆయన అభిమాన విషయమే.

"వెన్నెల ముళ్లు" అనే ఆయన కవితా సంకలనం, మాస్టారి హృదయాన్ని ఎంతో గొప్పగా ఆవిష్కరిస్తుంది. వెన్నెలలోని ఆర్ధ్రతని, ప్రేమలోని సౌకుమార్యాన్ని, మానవతలోని మృదుత్వాన్ని అక్షరరూపంగా మార్చి తన కవితలలో చూపించారు మునిసుందరం. వెన్నెలముళ్ళులో ఓ వైపు గొప్ప ప్రణయభావన కన్పిస్తుంది. మరోవైపు అంతర్లీనంగా ఎంతో తాత్త్వికత కన్పిస్తుంది. ఈ కవితలన్నిటా వైచిత్రి, వైవిధ్యం మనోజ్ఞంగా దర్శనమిస్తాయి. ఓ కవితలో జీవితం గురించి కవి ఇలా అంటాడు.

జీవితం అగ్గిపువ్వు
ఎద ఎదలో అగ్గి పువ్వులు పూయించిన వాడే
జీవించినట్టు లెక్క ....

మునిసుందరం మంచి కథారచయిత కూడా! ఆణిముత్యాలనదగిన పదిహేను కథల్ని అందించారాయన. తన కథల్లో, ఓ పన్నెండు కథల్ని ఎంచుకొని, "జవాబు తెలియని వాడు" అనే పేరుతో ఓ కథా సంకలనాన్ని ప్రచురించారు. ఇందులో దాదాపుగా అన్నికథలూ, మానవజీవితాన్ని ఎంతో హృద్యంగా ప్రతిబింబిస్తాయి. మానవుల ఆర్థిక, సామాజిక జీవనాన్ని నేపథ్యంగా తీసుకొని, రూపుదిద్దిన ఈ కథలలో ఎంతో వైవిధ్యం కన్పిస్తుంది. కానీ అంతఃసూత్రం మాత్రం ఒక్కటే. అదే మనిషి. వివిధ కోణాలలో కన్పించే మానవ జీవనాన్ని ప్రతిబింబించడం సమస్యల్ని, సంఘర్షణల్ని విశ్లేషించడం, సరైన పరిష్కారాన్ని ప్రతిపాదించడం.... మునిసుందరం మాస్టారి కథలకున్న ప్రత్యేక లక్షణాలు. అందుకే ఆయన కథలన్నీ పాఠకులకు ప్రీతిపాత్రాలయ్యాయి... అవుతూనే ఉన్నాయి.

మాస్టారి మరో ప్రయోగం " లఘురూపకాలు" తక్కువ సమయంలో, కొద్ది శ్రమతో, కొద్ది మంది పాత్రధారులతో ప్రదర్శించేవి లఘురూపకాలు. ఇటువంటి రచనా విధానంలో వీరి ప్రత్యేకత వీరిదే. చిత్తూరు ఆర్ట్ లవర్స్ సారధి, ప్రముఖనటుడు, దర్శకుడు కీ॥శే॥ వి. జయరాం కోరికమీద వ్రాసి ఇచ్చిన రూపకాలివి.

ఈ రూపకాలన్నింటా ఓ వైపు క్లుప్తత, మరోవైపు సూటిదనం, ఇంకో వైపు సంభాషణా చతురత విస్పష్టంగా కన్పిస్తాయి. ఈ రూపకాలు కూడా గమ్మత్తుగా ప్రారంభం అవుతాయి. అప్పటి వరకూ ఏదో జరిగిపోయినట్లు, అప్పుడే ఆ సన్నివేశంలో ఆ సంభాషణ ఆరంభమవుతుంది. ఇదొక విలక్షణమైన పద్ధతి. వీరి అన్ని లఘురూపకాలూ సంఘర్షణా ప్రధానాలు. సంభాషణా విలసితాలు.

ఇంత విస్తృతమైన సాహిత్యాన్ని సృష్టించిన మునిసుందరం మాస్టారు శ్రీవేంకటేశ్వరుడిపై ఎన్నో మధురమైన గీతాల్ని కూడా రచించారు. ఆ గీతాలన్నీ ప్రఖ్యాత గాయని డా॥ శోభారాజు స్వరపరచి, గానం చేసి, ఒక సి.డి. రూపంలో అందించారు. అదే "కోనేటిరాయ". స్వామివారికి అక్షరాలతో పదార్చన చేసే అదృష్టం అందుకొన్న మాస్టారు నిజంగా ధన్యులు.

ఇలా మునిసుందరం మాస్టారి సాహితీ ప్రయాణం బహుముఖీనమైన ఆధ్యాయం. నాటకం, రూపకం, కథ, నవల, వచనకవిత, మినీకవిత, త్రిపద, లలితగీతం, చరిత్ర, వ్యాసం, ప్రసంగం... నిజంగా అదొక విస్తారమైన సాహితీసృజన. విస్తృతమైన సాహితీ ప్రయాణం. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో, మద్రాస్ విశ్వవిద్యాలయంలో మునిసుందరం మాస్టారి రచనలపై జరిగిన పరిశోధనలకు ఒక పి.హెచ్‌డి., రెండు ఎమ్.ఫిల్ డిగ్రీలు అందుకొన్నారు సాహితీ పరిశోధకులు. "మునిసుందరం-మానవతా వాదం" అన్న అంశంపై మరొక పరిశోధన సాగుతోంది కూడా!

ఇలా.... ఇంత ఇష్టంగా .... ఇంత హృదయపూర్వకంగా.... ఇంత సత్యైక దృష్టితో....ఇంతటి సమన్వయ శక్తితో... ఈనాటికీ సాహితీ ప్రయాణాన్ని సాగిస్తూన్న.... మునిసుందరం మాస్టార్ని గతంలో ఎన్నో పురస్కారాలు వరించాయి. ఆనాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, నటసార్వభౌముడు అయిన శ్రీ నందమూరి తారక రామారావు స్వయంగా ఉగాది పురస్కారంతో మాస్టార్ని సత్కరించారు. అంతటి గౌరవం పొందిన మాస్టారికి ఈనాడు ఒక కొత్త పురస్కారం లభించింది. హైదరాబాదులోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ నాటకరచయితగా గౌరవిస్తూ, 2010వ సంవత్సరానికి, నాటక రచనా పురస్కారాన్ని వారి సాంఘిక నాటకాలకు ప్రకటించింది. ఇది నిస్సందేహంగా బంగారానికి సువాసన అబ్బినట్లే. మునిసుందరం మాస్టారి, ఈ విజయం వెనుక కన్పించే గొప్ప స్త్రీమూర్తి వారి ధర్మపత్ని లక్ష్మీరాజ్యం. అడుగడుగునా వారిని అన్నివిధాలా ప్రోత్సహించిన, ప్రోత్సహిస్తూన్న ఉత్తమ ఇల్లాలామె. అందుకే ఈ పురస్కారం మాస్టారు ఒక్కరిదే కాదు. ఆమెది కూడా. వెరశి వారిద్దరిదీ. వారిద్దరూ ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరుల్లా కలకాలం ఆరోగ్యసంపదలతో ఆనందంగా జీవించాలి. గౌరవాలను, సన్మాన సత్కారాలను ఇబ్బడిముబ్బడిగా అందుకోవాలి.... శుభం

*email: vadrevusundarrao@gmail.com*



# మన కార్టూనిస్టులు

- వెంటపల్లి సత్యనారాయణ

"అక్షరం రూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క. లక్షమెదళ్లకు కదలిక అన్నాడు, ఆనాడు మహాకవి కాళోజీ. అక్షరానికున్న శక్తి అలాంటిది. వేల అక్షరాలతో చెప్పలేని భావాన్ని ఒక్క కార్టూన్ ద్వారా చెప్పొచ్చు అంటున్నారు నేటి కార్టూనిస్టులు. నిరక్షరాస్యులను కూడా కదిలించగల శక్తి కార్టూన్‌కుంది.

వివరణ అవసరం లేకుండా సూటిగా, సంక్షిప్తంగా, విషయాన్ని పాఠకుడి హృదయానికి హత్తుకునేలా చేసే గొప్ప కళా మాధ్యమం కార్టూన్. అందుకే రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాహిత్య, కళా విషయాలతో నిమిత్తం లేకుండా అన్ని రకాల పత్రికలలోనూ నేడు కార్టూన్లు ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ఇంత శక్తివంతమైన కళాప్రక్రియకు తెలుగులో ఆద్యుడు శ్రీ తలిశెట్టి రామారావు గారైతే, ఆ తర్వాత కార్టూన్ విస్తృతంగా వ్యాప్తిలోకి రావడానికి బాపు, జయదేవ్, బాలి, మోహన్, ఏ.వి.ఎమ్, చంద్ర, మల్లిక్, సత్యమూర్తి, శ్రీధర్, కుమారి రాగతి పండరి లాంటి ఎందరో కార్టూనిస్టులు కృషి చేస్తున్నారు.

తెలుగు కార్టూన్ పితామహుడు తలిశెట్టి రామారావు గారితో 'మనకార్టూనిస్టులు' శీర్షికను ప్రారంభిస్తున్నాం. చదవండి, హాయిగా నవ్వండి, మీ అభిప్రాయాలను తెలియజేయండి...

– కళాసాగర్, ఎడిటర్

## కొంటె బొమ్మల బాపు



సముద్రాన్ని సీసాలో బంధించాలి అన్న ఆలోచన ఎంత హాస్యాస్పదమో, బాపు అను రెండక్షరాల కళాప్రపంచాన్ని ఒక చిన్న వ్యాసంలో చెప్పాలనుకోవడం కూడా అంతే హాస్యాస్పదమౌతుంది. కారణం ఆది అంతాలు అగుపించని మహా సముద్రమంతటి కళాసామ్రాజ్యాన్ని కృషితో, పట్టుదలతో ఏర్పరుచుకున్న అతని కళా ప్రపంచపు సరిహద్దులు కూడా కూడా అంతే విశాలంగా మారిపోయాయి. ఇలస్ట్రేషన్స్, కేరికేచర్, కార్టూన్స్ మరియు సినిమా అనే చతుర్విధ ప్రక్రియలలో నలుచెరగులా దృఢంగా వేళ్లూనుకు పోయిన ఆ చిత్రకళా వటవృక్షమే బాపు అని పిలవబడే సత్తిరాజు లక్ష్మీనారాయణ.

పుట్టింది పశ్చిమగోదావరి జిల్లా నరసాపురంలో సూర్యకాంతమ్మ, వేణు గోపాలరావు దంపతులకు 1933 డిశంబర్ 15న. బి.కామ్. బి.ఎల్., చదివిందీ మద్రాస్‌లో అడ్వకేట్‌గా రిజిస్టర్ చేసుకున్నది కూడా మద్రాస్ హైకోర్ట్‌లో. వృత్తికి, ప్రవృత్తికీ పొంతన లేని ఆ లాయర్ వృత్తిని వదిలివుండకపోయినట్లయితే ఆంధ్రావని అందానికి ప్రతిరూపంగా అతని కుంచె నుండి జాలువారిన ఆ వాలుజడల వయ్యారులు, కొంటె చూపులకోనంగిలు, రెండుజడల సీతలు, నవరసాల నాయికులు, నర్తకీ మణుల బంగిమలు, నవలా నాయికలు, ఇంకా ఎంకీ, శశిరేఖ, మధురవాణి, కిన్నెర సాని, సీగాన పెసూనాంబ, అప్పులఅప్పారావు, చిచ్చురపిడుగు బుడుగు, నాయుడు బావ లాంటి పాత్రలేగాక, రసరమ్యమైన రామాయణ చిత్రాలు, వీక్షించే బాగ్యాన్ని మనం కోల్పోయే వాళ్లం. అంతే గాదు. సీతాకళ్యాణం,



భాగవతం, శ్రీరామరాజ్యం లాంటి దృశ్య కావ్యాలను మనం వీక్షించలేకపోయేవాళ్ళం.

ఇంతేనా ఆ కళాసామ్రాజ్యపు సరిహద్దులు అని అనుకుంటే పొరబాటే, బాపును ప్రత్యక్షంగా ఎవరైనా ఎరిగి ఉండకపోవచ్చేమో కానీ బాపు బొమ్మను చూడని కళ్లు, బహుశా ఉండకపోవచ్చు. కారణం మనం నిత్యం వివిధ కార్యాల నిమిత్తం ప్రయాణించే ఆర్టీసీ బస్‌లో సాధారణంగా ముందరి సీట్లలో కూర్చునేందుకు ప్రయత్నించినపుడు "కాదు ఇవి స్త్రీలవి అని చెప్తుంది అక్కడ వయ్యారపు గీతల్లో వున్న బాపు బొమ్మ. అంతలా అల్లుకుపోయిన బాపు గీత, అతని చేతిరాతలే కాదు వయ్యారపు వలపు వ్యంగ్య గీతలలో కూడా ప్రేక్షకులను చక్కిలిగింతలు పెట్టించారు. తొలి వ్యంగ్య చిత్రకారుడు తలిశెట్టి ప్రారంభించిన ఈ వ్యంగ్య చిత్రకళాప్రక్రియకు తన పొదుపైన రేఖలు, ప్రాణమిత్రుడు రమణతో కలిసి చేసిన వయ్యారపు వ్యాఖ్యలు వెరసి కార్టూన్ కళకు పరిపూర్ణత తీసుకువచ్చాయి.

విరాళం అన్న కార్టూన్‌లో టౌన్ హాలు నిర్మాణానికి విరాళాలు సేకరిస్తున్న వ్యక్తికి విరాళంగా వచ్చిన ఇటుకలను చూపిస్తూ విరాళం ఇమ్మంటే ఏమిచ్చాడో చూడు ఆ పెద్ద మనిషి అని వ్యక్తి అంటే రెండో వ్యక్తి "గోల్డేమో గోకి చూడు" అన్న డైలాగ్‌లోని పంచ్ అద్భుతంగా వుండి ప్రేక్షకుడిలో పొరలు పొరలుగా నవ్వు రప్పిస్తుంది. మరొక కార్టూన్‌లో.

బొండాంలా మారిన భార్యకు మెరుపు తీగలా చలాకీగా ఉన్న ఒకప్పటి తన ప్రియుడు తారసపడితే తన ప్రక్కనే వున్న బియ్యంబస్తాలాంటి తన భర్తకు గర్వంగా అతన్ని పరిచయం చేసే ప్రయత్నంలో "పొట్ట లోనికి లాక్కుచావండి" అన్న భార్య ఆజ్ఞను ఆ బొండాం భర్త అమలు పరిస్తే ఏమౌతుంది? అంతవరకూ అతని పొట్టను టైట్‌గా పట్టి వున్న ప్యాంట్ కాస్తా ఊడి క్రిందపడిపోదూ! అదుగో చంద్రం" అన్న ఈ కార్టూన్ చూస్తే ఎవరైనా నవ్వకుండా ఉండగలరా? అయితే పండక్కి మైసూరెడుతున్నాం. కనుక ఇక్కడికి రావద్దని కార్డు రాసిన కోడలు పిల్లకి తన భర్తతో కలిసి వెళ్తున్న రైలుబండికి ఎదురుగా వచ్చే మరో రైలులోనే తన ముసలి అత్తమామలు కనిపించినపుడు గానీ తాను రాసిన పోస్టుకార్డ్‌ని పోస్ట్ చేయడం మరిచాననే విషయం గుర్తుకు వస్తే అక్కడ ఆ కోడలు పిల్లలోని గాబరా, గందరగోళం, ఇటు అత్తమామల్లోని ఆందోళనలు చూస్తే ప్రేక్షకుడిని కడుపుబ్బ నవ్విస్తుంది. హైద్రాబాద్- బెంగుళూర్ కార్టూన్‌లో.

దాదాపు 12 ఏళ్ళ వయసులోనే అనగా 1945లోనే ప్రారంభించిన తన కళాయానంలో నేటి వరకూ ఎన్నో వేల వ్యంగ్య చిత్రాలను ఆయన సృజించారు. ఈ సుదీర్ఘ కళాప్రయాణంలో అతని రేఖా విధానంలో ఎన్నో మార్పులను మనం గమనించగలం. మొదట్లో చాలా సాదాసీదాగా ఉన్న అతని రేఖలు, కాలక్రమంలో పరిపక్వత సంతరించుకున్న అతని కుంచె నాజూకైన సన్నటి గీతలను ఒకసారి సృజిస్తే, మరోసారి బొద్దుగీతలు ఇంకోసారి లావు సన్నటి గీతల సమ్మేళనం. ఇలా పయనించి ప్రస్తుతం కార్టూన్‌లో ఇంచుమించు సన్నటిగీతలు, పల్చటి రంగు లతో ఆయన వేస్తున్నారు. బ్రష్ లేదా పెన్ ఎన్నో రకాలుగా, ఎలా వాడినా కార్టూన్, ఇలస్ట్రేషన్ రెండింటినీ ఒకే గాటిన కట్టకుండా రెండింటికీ ప్రక్కా బేధం చూపిస్తూ ఇటు గీత, అటు రాత రెండింటా భావవ్యక్తీకరణను అత్యున్నత స్థాయిలో చెప్ప గల మహా చిత్రకారుడు ఈ రెండక్షరాల బాపు.

సినిమా కార్టూన్‌లో శుభం కార్డ్‌ని సైతం 'భశుం" అని వేసి ప్రేక్షకులని గగ్గోలు పెట్టించిన బాపూ... సరిలేరు వేరెవ్వరూ నీకు.

అన్నింటా టాపైన ఓ బాపూ, అందుకో మా హేట్సాఫ్.!






ఆ బూజు పనేవిటా
దౌర్భాగ్యుడా!


జరగవయ్యా జరుగు
ఇంకోడొస్తున్నాడు




అదింకా పూర్తిచెయ్యలేదంట-


బస్సు బాగా
రద్దీగా వుందేమిటో-


ఇదిగో అమ్మడూ - బంగారు తల్లివి గానీ
మా ఆయన్ని చూసి ఒక్కమాటు నవ్వవూ
లేపోతే ఇంటికి రానని మారాం చేస్తున్నారు

# చుక్కలతో చక్కని చిత్రాలు

సమ్'థింగ్ స్పెషల్

**అతనో చిత్రకారుడే కానీ, అతనికి కుంచెతో పనిలేదు. కేవలం బాల్‌పాయింట్‌పెన్ వుంటేచాలు చుక్కలతో చిత్రాలు సృజిస్తాడు, అద్భుతాలు సృష్టిస్తాడు.**


జి.వి.సాగర్

అతనో చుక్కల చిత్రకారుడు. చుక్కలతో విచిత్రాలు చేయడానికి అలవాటు పడ్డాడు. మహాత్ముడు, రాష్ట్రపతి, అంబేద్కర్, ఎన్టీయార్... ఇలా ఎంతోమంది మహనీయుల రూపాలకు చుక్కలతో చక్కగా ప్రాణం పోయగలడు. విలక్షణమైన చుక్కల కళను పోషిస్తున్న ఆ కళాకారుడే గిన్నె సాగర్. తిరుపతిలోని తిరుమల తిరుపతి దేవస్థానానికి చెందిన శిల్పకళాశాలలో చిత్ర కళోపాధ్యాముడుగా పనిచేస్తున్న ఆయన... ఇటీవలే గ్లోబల్ వరల్డ్ రికార్డ్ సాధించారు. ఈ సందర్భంగా తన జీవితం ఎన్ని మలుపులు తిరిగిందో ఆయన మాటల్లో...



"మాది పాలమూరు జిల్లాకు చెందిన మూసాపేట. ఊరంతా కూలీలే. ఈ దేశంలో గొప్ప నిర్మాణాలైన వంతెనలు, ఆనకట్టలు, రహదారులు, భవనాలు అన్నిటి వెనుకా మా పాలమూరు ప్రజల కష్టం ఉంది. మానాన్న గిన్నె రాములు కూడా ముఠా నాయకుడు. ముఠా కట్టి దేశంలో ఏ మూలకైనా పనికోసం వెళ్లేవాడు. అయితే నా చిన్నప్పుడే జబ్బుచేసి వైద్యం లేక నాన్న చనిపోయాడు. ఇంటికి పెద్దదిక్కు లేకపోవడంతో మా అన్న భీమయ్యసాగర్, చదువు మానేసి కూలీగా మారిపోయాడు. నేను కూడా మూడో తరగతి మానేసి మా వాళ్లతో కలిసి కూలి పనులకు వెళ్లేవాణ్ణి. మట్టిపనులు చేస్తూనే ఆ మట్టితో ఆడుకునే వాణ్ణి. అప్పటి నంచే బొమ్మలు గీయడం అలవాటైంది. పని మీద కన్నా బొమ్మలు వేయడం మీదే నాకు శ్రద్ధ ఎక్కువైంది. నా తీరు చూసి మావాళ్లు నన్ను తిరిగి బడిలో వేశారు. ఊరు వలసపోతే మిగిలేది ముసలివాళ్లేకదా! మా నాయనమ్మ దగ్గరే నేను పెరిగాను. మూసాపేట హైస్కూల్‌లో పదోతరగతి పాసయ్యాను. తర్వాత నన్ను మహబూబ్‌నగర్‌లో ఇంటర్‌లో చేర్పించారు. అయితే, పూట గడవని స్థితిలో చదువెలా సాగుతుంది...? మళ్లా మధ్యలోనే చదువు ఆగిపోయింది. మళ్లీ కూలి పనులకు వెళ్లక తప్పలేదు. ఈ క్రమంలో నేను చేయని పనిలేదు. కటౌట్లు, హోర్డింగులు ఏర్పాటు పనులు చేశాను. పోస్టర్లు అతికించాను. ఆ పోస్టర్లను చూస్తూ బొమ్మలు వేసేవాణ్ణి. అయినా, చదువుకోవాలనే కోరిక మాత్రం నాలో చావలేదు. పదకొండేళ్లు కూలి పనులు చేస్తూనే టెక్నికల్ బోర్డు పరీక్షలలో డ్రాయింగ్ లోయర్, హైయ్యర్ పాసయ్యాను. తర్వాత టి.టి.సి పరీక్షలలో నెగ్గాను. మా ఊరినుంచి పనికోసం రోజూ షాద్‌నగర్ వెళ్లడం కష్టమైపోయేది. ఎందుకంటే అప్పట్లో బస్ ఛార్జీలు తక్కువైనా భరించే స్తోమత నాకుండేది కాదు. ఆ ఖర్చును తగ్గించుకోవడానికి ఒకటే మార్గం అదే బస్ పాస్ సంపాదించడం. దానికోసం తెలుగు విశ్వవిద్యాలయంలో బి.ఎఫ్.ఎ.లో చేరి పాస్ తీసుకున్నా. 1984లో బిందు పద్ధతిలో తొలి చిత్రం 'పల్లెపడచు' వేయడంతో నా జీవితం మలుపుతిరిగింది.








కూలీలే స్ఫూర్తి...

ఆనకట్టలు కట్టేటప్పుడు వందల అడుగుల ఎత్తుకు కూలీలు వెళ్లాలి. పరంజాలపై నుంచి వేల మంది కూలీలు నెత్తిన గమేళాలతో వెళ్లే దృశ్యాన్ని దూరం నుంచి చూస్తే, చిన్న, చిన్న చుక్కలుగా కనిపిస్తారు వాళ్లు. పనిలో రోజూ చూసే ఈ దృశ్యాలతోనే నేను చుక్కల బొమ్మలు వేయగలిగా. బాల్‌పాయింట్‌పెన్. పెన్సిల్ చుక్కలలో గాఢతను పెంచటం, తగ్గించటం ద్వారా రంగులు, చీకటి వెలుగులు, ఆభరణాల వన్నె చిన్నెలను చిత్రకళలో చూపవచ్చు. టీ డికాషన్‌తోనూ వైవిధ్యభరితమైన చిత్రాలను వేశాను. బిందు చిత్రాలు వేయాలంటే గంటల తరబడి శ్రమించాలి. ఒక్కో చుక్క ఓపిగ్గా పెట్టుకుంటూ లక్షల చుక్కలు





సమ్'థింగ్ స్పెషల్



వేస్తే గానీ ఒక రూపం రాదు. దశావతారాలు, అష్టలక్ష్మి, ఒకే చిత్రంలో రామకృష్ణులు, వేంకటేశ్వరుడు, తెలుగుతల్లి, లక్ష్మీదేవి బొమ్మలను వేశాక నాకు మంచి గుర్తింపు లభించింది. తిరుమల శిలాతోరణం, ప్రసిద్ధి చెందిన శిల్పాలు, గుహాలయాల నమూనాలనూ ఇదే పద్ధతిలో చిత్రీకరించాను.

1999లో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో జరిగిన దక్షిణ భారతీయ విశ్వవిద్యాలయాల యువజనోత్సవాలకు వచ్చిన అప్పటి గవర్నర్ రంగరాజన్, ప్రశంసలు అందుకోవడం మరిచిపోలేనిది. నేపాల్, నాగపూర్, బంగ్లాదేశ్, శ్రీలంకలలో జరిగిన పెయింటింగ్ ప్రదర్శనల్లోనూ నా కళకు చోటు దక్కడం ఎంతో సంతృప్తినిచ్చింది. నాగపూర్, జైపూర్, ఆగ్రా, ఢిల్లీ, బెంగుళూర్, హైదరాబాద్‌లలో నేను వేసిన బిందు చిత్రాలెన్నో ప్రదర్శనలకు నోచుకున్నాయి. తిరుమలలో 2005లో ఏర్పాటు చేసిన బిందు చిత్రాల ప్రదర్శన చూసిన నాటి సాలార్ జంగ్ మ్యూజియం డైరెక్టర్ ఎ.కె.వి.ఎస్.రెడ్డి ఎటువంటి రుసుం కట్టనవసరం లేకుండా సాలార్‌జంగ్ మ్యూజియంలో ఒక నెల రోజుల పాటు నా చిత్రాల ప్రదర్శనకు అనుమతినివ్వడం ప్రోత్సాహాన్నిచ్చింది. మహబూబ్‌నగర్ గోల్డెన్ జూబ్లీ (2003) సందర్భంగా నా చిత్రాలను పాలమూరు శ్రమ వీరులకు అంకితం ఇచ్చాను. ఈ మధ్యనే బిందు చిత్రకళలో 3700 అడుగుల నిడివి కలిగిన బొమ్మలు వేసినందుకు గ్లోబల్ వరల్డ్ రికార్డు వచ్చింది. ఇందులో 120 మంది పార్లమెంటు సభ్యుల చిత్రాలు వేసి, వాటిని వారికే అందించాను. ఇన్నేళ్ల నా జీవితానికి గుర్తింపు తీసుకొచ్చిన చుక్కల కళను ఎప్పటికీ మరువలేను. ఎప్పటికీ వదిలిపెట్టలేను.



# "కళాతత్త్వవేత్త - ఖలీల్ గిబ్రాన్"







"లెబనాన్ కొండలలో ఉన్నప్పుడు పుస్తకం రూపుదిద్దుకున్న తొలిసారి నుంచి అది నా వద్ద ఎప్పుడూ ఉండేది. అది నాలో ఒక భాగం అయిపోయినట్లు ఉండేది. దీనిని ప్రచురణ కర్తకు ఇచ్చే ముందు నాలుగు సంవత్సరాలు నాతో పాటు ఉంచుకున్నాను. ఇందులో ప్రతిఒక్కమాట నేను రాయగలిగిన దాంట్లో అత్యుత్తమమైనదిగా నిర్ధారించుకున్న తరువాతే దానిని ప్రచురణకు ఇచ్చాను" అంటాడు ఖలీల్ గిబ్రాన్ తన పుస్తకం *"The Prophet"*

**ఎల్.ఆర్. వెంకటరమణ**

లెబనాన్ పర్వత ప్రాంతానికి, వాదీక్వీదేపా పర్వతాల మధ్యగల పీఠభూమి ప్రాంతంలో గల గ్రామమే– బిషారీ. ఇక్కడ నివసించే ఖలీల్ గిబ్రాన్ సీనియర్‌కు కమేలా రెమాలకు 1883 జనవరి 6న ఖలీల్ గిబ్రాన్ జన్మించాడు. గిబ్రాన్ అనంతరం 1885లో మరియానా, 1887లో సుల్తానాలు జన్మించారు.



ఖలీల్ గిబ్రాన్ తల్లి కమేలా రెమా. ఈమె మొదటి భర్త పేరు హానా అబ్దుల్ సలీం రెమా. వివాహం తరువాత బ్రెజిల్ వెళ్లారు. వీరికి పీటర్ అనే అబ్బాయి కూడా పుట్టాడు. హానా అబ్దుల్ మరణించడంతో కమేలా రెమా ఒంటరిదయింది. తరవాత ఈమె ఖలీల్ గిబ్రాన్ సీనియర్‌ను వివాహమాడింది. ఈమె మోరనేట్ జాతికి చెందిన మహిళ.

తల్లి కమేలా బాల గిబ్రాన్‌ను ఎంతగానో ప్రోత్సహించేది. జానపద కళలు, చారిత్రక కథలు చెబుతూ గిబ్రాన్‌ను ఉత్తేజపరిచేది. కళలు, సంగీతం కూడా పరిచయం చేసింది. గిబ్రాన్ తను రాసిన "బ్రోకెన్ వింగ్స్" లో "తల్లి" గురించి ప్రస్తావిస్తూ–" ప్రతి ఒక్కరికి అత్యంత ఇష్టమైన పదం "అమ్మ", సుఖాలలో, బాధలు, సంతోషాలలో ఎపుడుగానీ తల్లి తమ వెంటే నీడలా ఉంది రక్షిస్తుంది" అంటూ రాసుకున్నాడు. కమేలా రెమా సంప్రదాయక కుటుంబం నుండి రావడంతో మత సంప్రదాయాలు కూడా బాల గిబ్రాన్‌కు అలవాటయ్యాయి.

గిబ్రాన్ చిన్ననాడే చిత్రకళ పట్ల అమితాసక్తి పెంచుకున్నాడు. తల్లి లియోనార్డో డావిన్సీ చిత్రాలను పుస్తకాల నుండి సేకరించి



బాల గిబ్రాన్ చేత నఖలు గీయించేది. విమర్శకులు సైతం "గిబ్రాన్ చిత్రాలలో లియోనార్డోడావిన్సీ చిత్రాలను అనుసరిస్తున్నట్లు వుంటాయంటారు".

గిబ్రాన్ తండ్రి పన్నులు వసూలు చేయు అధికారి. గిబ్రాన్‌కు 8 ఏళ్ల వయస్సులో తండ్రి వసూలు చేసిన పన్నులు ఎగ్గొట్టాడనే నేరంపై ఖైదు చేశారు ఒట్టోమాన్ ప్రభుత్వం. అప్పటికే అంతంత మాత్రమున్న కుటంబ పరిస్థితి మరింత దిగజారింది. దారిద్ర్యంతో బ్రతకవలసి వచ్చింది. ఉన్న ఇల్లు ఖాళీ చేయాల్సిన దుస్థితి. దీంతో పాఠశాలకు వెళ్లి చదవలేకపోయాడు. కానీ అరబిక్, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలతో పరిచయం కలిగింది.

గిబ్రాన్ తను రాసిన ''ప్రవక్త'' పుస్తకంలో – "ఆకలిగొన్నప్పుడు చీకటి గుహలలో సైతం ఆహారం కోసం మంచి వెతుకుతుంది. దప్పిక గొన్నప్పుడు మృతనీటిని సైతం తాగుతుంది." అంటాడు.

గిబ్రాన్ తన తల్లి, చెల్లెళ్లతో 12వ ఏటనే లెబనాన్ వదిలి అమెరికాలోని బోస్టన్ చేరుకున్నారు. అక్కడ జీవనోపాధికోసం వెతుక్కున్నారు. నాడు అనేక మంది ఇలా వలసలు వెళ్లేవారు. అక్కడ కమేలా రెమా చిన్నపని సంపాదించింది. గిబ్రాన్ బడికి వెళ్లగలిగాడు. అతనికి గల ఆంగ్ల పరిచయం, చిత్రకళ విషయాల పట్ల ఆసక్తి బోస్టన్ ఉపాధ్యాయులకు విస్మయం కలిగించింది. వారు ప్రోత్సహించారు. గిబ్రాన్ తన మొదటి ఆంగ్ల రచన "ది మేడ్‌మేన్"లో తన చిన్న నాటి పరిస్థితులను అద్భుతంగా చిత్రిస్తాడు.

గిబ్రాన్ చిత్రకళాపాటవాన్ని గుర్తించిన మహిళ ఫ్లోరెన్స్ పియారే. ఈమె ఇతనిని జెస్సీ ఫెర్మోంట్ బేల్ అనే సంఘసేవకురాలికి గిబ్రాన్‌ను పరిచయం చేసింది. అదే విధంగా ఫ్రెడ్ హాలెండ్ డే అనే వ్యక్తి వలన గిబ్రాన్–కీట్స్, షెల్లీ, బ్లేక్, ఎమర్సన్ సాహిత్యం పరిచయమైనది.

1898లో గిబ్రాన్ తిరిగి లెబనాన్ వచ్చాడు. మదరసా అల్‌హిక్‌మక్ అనే పాఠశాలలో విద్యార్థిగా చేరాడు. అక్కడ యూసఫ్ హదాద్ అనే గురువు వద్ద విద్యనభ్యసించాడు. హదాద్ యువ గిబ్రాన్‌తో ఇలా అంటాడు–Think long and hard and write less. in this way you will gain a lot and become immensely creative". ఈ విషయాన్ని గిబ్రాన్ చివరి వరకు గుర్తుపెట్టుకున్నాడు, ఆచరించాడు.



లెబనాన్‌తో చదువు అయిన అనంతరం తిరిగి బోస్టన్ చేరుకున్నాడు. మేరే ఎలిజబెత్ హాస్కెల్ పరిచయం వలన గిబ్రాన్ కళ, కవితకు ఊపిరి పోసినట్లయింది. ఈమె బోస్టన్‌లో ఒక పాఠశాల నడుపుతున్న వ్యక్తి. ఈమె గిబ్రాన్ పెయింటింగ్స్‌ను ప్రదర్శనకు కూడా పెట్టింది.

గిబ్రాన్ ధనవంతురాలైన మిస్‌హేలా డాషర్ అనే అమ్మాయితో ప్రేమలో పడ్డాడు. గిబ్రాన్ పేదవాడు. దాంతో ఆమెను మరొకరితో పెళ్లిచేసేసారు. ఇలా గిబ్రాన్ తొలిప్రేమ భగ్నమైంది. "The Broken wings" అన్న గ్రంథంలో తన ప్రియురాలిని సెల్మా అనే పేరుతో చిరస్మరణీయం చేశాడు.

గిబ్రాన్ హేస్కెల్ పాఠశాలలో చిత్రకళను బోధించాడు. గిబ్రాన్ కష్టకాలంలో జోసఫెన్ ఎంతగానో తోడ్పడింది. చివరికి అతని పెయింటింగ్స్‌కు మోడల్‌గా కూడా ఉంది. తన చిత్రాల మోడల్ మిచెలిస్‌తో ప్రేమలో పడ్డాడు ఈ వివరాలు "The Beloved" లో వివరిస్తాడు. కానీ ఈ బంధం ఎంతకాలమో నిలువలేదు.





గిబ్రాన్–"Martha", "Yuhana the mad", "Dust of the Ages and the Eternal Fire" అన్న మూడు కళలు రచించాడు. గిబ్రాన్‌లోని చిత్రకళాసక్తిని మరింత రగిలించడానికి అతన్ని పారిస్‌కు పంపింది హాస్కెల్. పారిస్‌కు వెళ్లడానికి మునుపు "The Beauty of Death" అన్న కవిత రాశాడు. 1908లో పారిస్ పయనమైనాడు.

నాడు పారిస్‌ను "కాంతివంతమైన నగరమని"; "19వ శతాబ్ది రాజధాని" అనే పేర్లు ఉండేవి. కళలకు సంబంధించి అనేక కళాఉద్యమాలకు వేదిక పారిస్, "స్కూలు ఆఫ్ పారిస్" అన్నది చిత్ర, సాహిత్యకళారంగాలో వినపడే పదం. నాడు ఎందరో చిత్రకారులు అక్కడ ఉన్నారు– బొనార్డ్, దేగాస్, దిలాక్రోక్స్, డిలాయుని, గాగిన్, క్లీ, మటెస్సీ, పికాసో, రూసో, సూరత్, వాన్‌గో, విస్లర్ ఇంకా రోడిన్ వంటివారు.

గిబ్రాన్ రోడిన్ స్టూడియోకు వెళ్లాడు. అక్కడ చిత్రకళాభ్యాసం చేశాడు. గిబ్రాన్‌పై ఆంగ్లకవి, చిత్రకారుడు విలియం బ్లేక్ ప్రభావం అధికంగా పడింది. 1908లో లెబనాన్‌లో కొత్త ప్రభుత్వం వచ్చింది. గిబ్రాన్‌పై టర్కీ ప్రభువుల ఆంక్షలు కూడా










తొలగిపోయాయి. కానీ 1912 నుండి గిబ్రాన్ అమెరికాలోనే స్థిరపడిపోయాడు.

జర్మన్ తత్త్వవేత్త ఫ్రెడ్రిక్‌నీషే ప్రభావం గిబ్రాన్‌పై పడింది. గిబ్రాన్ ఇతని గురించి చెబుతూ "19వ శతాబ్ది మొత్తానికి ఇతనొక్కడే గొప్ప తత్త్వవేత్త" అంటాడు. నీషే రచన "Thus Spoke Zarathustra" ప్రభావం గిబ్రాన్‌పై ఎంతగానో పడింది. గిబ్రాన్ తరువాత రచనలకు ఈ పుస్తకం ప్రభావం ఎంతగానో పడింది.

తనను ఎంతగానో ఆదుకున్న మేరీ హేస్కెల్‌ను వివాహమాడాలనుకున్నాడు. కానీ ఆమె ఇందుకు అంగీకరించలేదు. ఈ సంఘటన గిబ్రాన్ జీవితంలో గొప్ప మార్పు తెచ్చింది. ఆ తరువాత అతను చేసిన అన్ని రచనలను హేస్కెల్‌కే అంకితమిచ్చాడు. నాటి నుండి గిబ్రాన్ మది నుండి వివాహబంధం అనే విషయం శాశ్వతంగా తొలగిపోయింది. "తనను తాను పరిపూర్ణుడు చేసుకోవడం తప్ప ప్రేమకు మరో ఉద్దేశ్యానికి తావుండరాదు" అనే నిశ్చితాభిప్రాయంతో జీవించాడు.

1923లో గిబ్రాన్ మహత్తర రచన ''ప్రాఫిట్'' రచించబడింది. తొలుత ఇది అరబిక్‌లో తరువాత ఆంగ్లంలో గిబ్రాన్ రచించాడు. మొదట ఈ గ్రంథం 1,300 కాపీలు ముద్రించారు. 1937 నాటికి లక్షా ముప్పైవేల కాపీలు ముద్రించారు. 1957 నాటికి మిలియన్ల సంఖ్యలో ముద్రించాల్సి వచ్చింది. దాదాపుగా 20 భాషలలో ఈ పుస్తకం అనువాదమయింది.

"The Prophet" ను తెలుగులో "జీవనగీతం" పేరుతో అనువదించారు. ఇందులో 28 ప్రశ్నలకు ప్రవక్త అల్‌ముస్తాఫా సమాధానాలిస్తాడు. ఇవన్నీ జీవితానికి సంబంధించినవి. భాషతో సంబంధం లేదు. భావం మాత్రం విశ్వమానవ భావం. అందుకే ఈ పుస్తకం నేటికినీ ప్రజల గుండెలలో గూడుకట్టుకున్నది.

గిబ్రాన్ "ప్రాఫిట్" తరువాత– "the Garden of the prophet"- "The death of the Prophet" అన్న ట్రైయాలజీ విడుదల చేశాడు. ఐరిస్ రచయిత జార్జి రస్సెల్ గిబ్రాన్ "ప్రాఫిట్" గ్రంథాన్ని రవీంద్రుని "గీతాంజలి"తో పోల్చాడు. గిబ్రాన్ 1916 డిసెంబర్ 19న హేస్కెల్‌కు రాసిన ఉత్తరంలో "తాను రవీంద్రుని కలిసినట్లు, ఒక గొప్ప వ్యక్తిని చూసినట్లయిందని" రాసుకున్నాడు.

1931 ఏప్రిల్ 10న గిబ్రాన్ మరణించాడు. ఆగస్టు 21వ తేదీ నాటికి అతని మృతదేహం లెబనాన్‌కు చేరగలిగింది. తన స్వస్థలం బషారీలో సమాధి చేశారు. ఈ ప్రాంతం నేడొక యాత్రాస్థలం. అక్కడ ఒక మ్యూజియం కూడా నిర్మించారు. ఇక్కడ అతని రచనలు, చిత్రాలు ప్రదర్శితమవుతుంటాయి.

"మిఖాయిల్ నేమి" గిబ్రాన్ మిత్రుడు. ఇతడు "ఖలీల్ గిబ్రాన్ జీవితచరిత్ర''ను 1934లో ప్రచురించాడు. 1950లో ఇది ఆంగ్లంలో అనువదించబడింది. 1970లో "మొదటి అంతర్జాతీయ గిబ్రాన్ మహోత్సవం" లెబనాన్ రాజధాని బీరూట్‌లో జరిగింది. ఇక్కడ గిబ్రాన్ రచనలు, చిత్రాలపై విశేష చర్చలు జరిగాయి."తన జీవితంలో ఎదురైన సంఘటనలు, వ్యక్తులు తనకు గురువులని; ఆ సంఘటనలే నన్ను మనిషిగా నిలబెట్టాయని" వినమ్రంగా గిబ్రాన్ చెబుతాడు.

# కుంచె శిల్పాలు- ఉలి(ల్చి) చిత్రాలు


ఉల్చి

- మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావు

**ఉల్చి అనే రెండక్షరాల పదం ఎక్కడ నుంచి 'వచ్చా'యని వెదుకుతూ పోతే అప్పటి నిఘంటువులో దొరక్కపోయినా ఇప్పటి గూగుల్ సెర్చ్ మీటితే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని ఒంగోలు సమీపాన గుళ్ళకమ్మ నదీతీరంలో ఓ గ్రామంగా దర్శనమిస్తుంది.**

ఆ పదాలనే కుంచె పేరుగా, కలం పేరుగా, ఉలిపేరుగా చేసుకొని ఆ ఊరికే వన్నె తెచ్చిన చిరంజీవి శ్రీ రెడ్డిబోయిన కృష్ణమూర్తి.

ఉల్చిగారి వద్ద వాష్ టెక్నిక్ వర్ణాలు దిద్ది ఆయన ద్వారా చిత్రకళలో కొంత అనుభవం పొందినప్పటికి కలంతో ఏమాత్రం అనుభవంలేని నేను ఈ 64కళలు.కామ్‌కి మా గురువుగారిని పరిచయం చేయడం కొంత సాహసమే అయినా దానిలో ఎంతో సంతృప్తి ఉంది. ఇది నా కర్తవ్యంలా భావిస్తున్నాను.

ఉల్చిగారితో నా పరిచయం 1974వ సంవత్సరంలో. నేను భావపురి (బాపట్ల) వ్యవసాయ కళాశాలలో అడుగుపెట్టిన కొన్ని మాసాలకు ర్యాగింగ్ అనంతరం పరిచయమయిన శ్రీయలమంద ద్వారా ఉల్చి గారి గురించి విన్నాను. అనంతరం నా సహ విద్యార్థి శ్రీ సత్యన్నారాయణతో కలిసి మాయాబజార్‌లో నివసిస్తున్న ఉల్చిగారి ఇంటి వద్ద మా మొదటి కలయిక.

అప్పుడు ఆయన "రాజా మాధవవర్మతీర్పు" అనే చిత్రకావ్యాన్ని తైలవర్ణ మాధ్యమంతో మొదటి తెలుగు మహాసభల సందర్భంగా ప్రభుత్వం వారి కోరిక మేరకు కాన్వాసుపై చిత్రీకరిస్తున్నారు. కాన్వాసుపై తైలవర్ణాలతో చిత్రాలను వేస్తున్నప్పుడు చూడడం నా మొదటి అనుభూతి. ఆ చిత్రం హైదరాబాదులోని శ్రీ పొట్టిశ్రీరాములు విశ్వకళాపరిషత్‌లో ఇప్పటికీ ప్రదర్శితమమైవుంది.

నేను వేసిన కొన్ని చిత్రాలను ఆయనకు చూపించి రంగులు వేయడంలో శిక్షణ ఇవ్వవలసినదిగా కోరాను.



తర్వాత కాళీ సమయాల్లో రెండు వాష్ పెయింటింగ్స్‌తో పాటు ఎన్నో విషయాలు నేర్చుకోవడం నా అదృష్టంగా భావిస్తాను. ఈ సమయంలో ఆయన వేసిన అనేక చిత్రాలు పరిశీలించడం జరిగింది. 1977లో నా గ్రాడ్యుయేషన్ తర్వాత బాపట్లకు దూరమయిన నేను ఏ ప్రాంతంలో ఉన్నా మా సంబంధాలు చివరి దాకా కొనసాగాయి.

09-01-1940 తేదీన జన్మించిన రెడ్డిబోయిన కృష్ణమూర్తిగారి తండ్రి శ్రీ కోటయ్య. తల్లి శ్రీమతి శేషమ్మ ఆయన ఇద్దరు అన్నలకు, ఇద్దరు అక్కలకు ముద్దుల తమ్ముడు. వారిది వ్యవసాయ కుటుంబమయినా కోటయ్యగారు స్థానిక పాఠశాలలో ఉపాధ్యాయునిగా పనిచేసేవారు. వారు మంచి చిత్రకారులు, శిల్పి, అన్నగారైన రెడ్డిబోయిన వెంకటేశ్వర్లుగారు కూడా చిత్రకారులు, కవి, గాయకుడు, చిత్రకళోపాధ్యాయుడిగా సుమారు 38సంవత్సరాలు ఆ వృత్తిలో పనిచేసి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు అందుకున్నారు.

కళాకారుల వంశంలో జన్మించిన ఉల్చిగారు కూడా బాల్యం నుండి రేఖలు గీయడం ప్రారంభించారు. అన్నగారి శిష్యరికంలో 1955లో డ్రాయింగ్ లోయర్‌గ్రేడ్ ప్రథమశ్రేణి లో ఉత్తీర్ణులయ్యారు. అన్న గారి సలహా మేరకు స్కూలు ఫైనల్ వరకు రేఖలకు విరామం ఇచ్చి తిరిగి ఆయన ఆశీస్సులతో మళ్లీ ప్రారంభించారు.

అప్పటి ఒంగోలు డ్రాయింగ్ టీచర్ మరకా సూర్యనారాయణ గారి శిక్షణతో డ్రాయింగ్ హైయ్యర్ గ్రేడ్ పూర్తి చేసిన అనంతరం, మద్రాసు గవర్నమెంట్ నుంచి పెయింటింగ్‌లో డిప్లమో ప్రథమశ్రేణిలో సాధించారు.

1970సం॥లో ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమీ స్కాలర్‌షిప్‌తో సంప్రదాయ చిత్రకళలో ప్రొ॥ కొండపల్లి శేషగిరిరావు గారి వద్ద శిక్షణ.

శ్రీ కొండపల్లి శేషగిరిరావు గారి వద్ద శిక్షణానంతరం చైనా, జపాన్, బెంగాలీయుల సాంప్రదాయశైలిలో ఎన్నో వాష్ చిత్రాలు చేసారు.

వాటిలో ముఖ్యంగా బుద్ధ చరిత్రలోని ఘట్టాలు.. ''మాయాదేవికల'', ''సిద్ధార్ధజననం'', ''కేశఖండనం'', "కాషాయిస్వీకారం", "ప్రాణులపై కరుణ", "అమ్రపాలిబిక్ష", ''తపస్సు'', రాహులుడు వంశపారంపర్య ఆస్తికోరుట'' ముఖ్యమైనవి. బుద్దుని సిరీస్ చేసే సమయంలో వాటిని 5లక్షలకు తీసుకుంటామని కేంద్రప్రభుత్వం ముందుకొస్తే సీరిస్ పూర్తి అయిన తర్వాత చూద్దామని త్రోసిపుచ్చారు.

జానపదుల జీవిత అంశాలలో "కలువబాల", "పర్వతపుత్రి", "ఎదురు చూపులు", "ఎదురు తెన్నులు", "పొలానికి" "సంతకు", జాలరస్త్రీ వాష్ ప్రకియలో చేసిన కొన్ని మచ్చుతునకలు.

ఈ వాష్ చిత్రాలలో రేఖా నిబద్దత, రంగుల ఎంపిక, వాటి రంగరింపులో ఉల్చిగారు చూపిన నేర్పు, ఓర్పు ప్రతీ కళాఖండంలోను కనిపిస్తుంది. ప్రతీ చిత్రంలోను ఓ సందేశం వినిపిస్తుంది. ఈ చిత్రాల గురించి మాటలతో చెప్పడం కష్టం. చూసి మాత్రమే అనుభూతి పొందగలం.

1970 ప్రాంతంలో ఆయన చిత్రీకరించిన "మానవత్వం" పలువురి ప్రశంసలు మరి కొంతమంది విమర్శలను పొందింది. ఆ చిత్రంలో అడవిలో సొమ్మసిల్లిన యువకునికి చంటిపాపతో వెళుతున్న ఒక కోయి స్త్రీ తన చనుపాలతో సేద తీర్చుచున్న దృశ్యం మానవత్వాన్ని నిద్రలేపుతుంది.







తైలవర్ణ మాధ్యమంతో చిత్రించిన "రాజసిద్దార్ధ అజంతా చిత్రాన్ని మైమరపిస్తుంది, ఆరడుగుల కాన్వాసుపై చిత్రించిన జీవనపోరాటం"-వెదురు పొదలలో పైనుంచి ఆహారం కోసం దూసుకు వచ్చిన పక్షి. క్రింద అది ఆహారం కోసం నిరీక్షిస్తున్న కప్ప మధ్య చిక్కుకున్న కీటకం చూపరులను ఆలోచింపజేస్తుంది.

ఆయిల్ పేస్టల్స్‌తో కూడా ఎన్నో మీనియేచర్ ప్రకృతి చిత్రాలు వేశారు. ఇవన్నీ ఎంతో అందంగా, ఆహ్లాదకరంగా కనిపిస్తాయి. కాగితం మీద గరుకు తలాలను రంగులతో పూఢ్చి ముస్తాబు చేసిన రాళ్ళు, చెట్టుకొమ్మలు, వేళ్ళు, నీళ్లు. ఆకాశం ఎంతో ఆకర్షణీయంగా కనిపిస్తాయి. చెట్ల మధ్యలో ఉండిపోయిన సహజీవనం' చేస్తున్న రాయి ఆ టైటిల్‌కు ప్రాణం పోస్తుంది.

ఇతర మాధ్యమాల కొస్తే 1979-84 మధ్యకాలంలో ఆయన శోధించి చేసిన ప్రయోగాల్లో "అటమిక్ బ్రష్ వేల్స్" "కాశ్మీక్ స్పెక్ట్రం", "వాటర్ ఏంటిక్స్", వాటర్ కట్స్",, "వాటర్ గ్రాఫిక్స్" ఎన్నో ఉన్నాయి. నీటితో ఎనామిల్ రంగుల వ్యాకోచ సంకోచాలను ఉపయోగించికొని వాటిని అద్ది ఎన్నో కళాకృతులు సృష్టించారు. వీటిలో ఆయన ఎంచుకున్న రంగులు వాటి విన్యాసాలు చూసి పరవశించవలసిందే.

ఆయన శిల్ప చరిత్ర పరిశీలిస్తే బాపట్ల వ్యవసాయ కళాశాలలో సిమెంటు కాంక్రీటుతో నిర్మించిన 30 అడుగుల "వ్యవసాయ విజ్ఞాన జ్యోతి" విగ్రహం కళాశాల సందర్శకులకు స్వాగతం పలుకుతూ కళాశాల సింబల్‌గా నిలుస్తుంది. అలాగే గుంటూరులోని "లాం" వ్యవసాయ క్షేత్రంలో 9 అడుగుల రైతు విగ్రహానికి ప్రాణం పోసారు. కళాశాల లోపలకు వెళ్లే కొద్ది "శృతివీణ", "స్వరజతి", "లవర్స్ అండర్ షెల్టర్" వంటివి ఎన్నో తారసపడతాయి.

ఉల్చిగారి ఉలితో మలచుకున్న దారు శిల్పాలలో తల్లి బిడ్డ, డాన్సర్ వంటివి నైరూప్యరీతిలో ఉంటాయి. వృక్షాల కొమ్మలు, వేళ్ల సహజ భాగాలను ఎంచుకొని కొద్దిగా మెరుగులు దిద్ది తయారు చేసిన "ఫామ్ ఆఫ్ మెలోడి" వంటివి ఎన్నో ఉన్నాయి.

గ్రానైట్‌తో కూడా బుద్ధుని శిల్పాలు చేసారు. పనికిరాని ఇనుము మరియు ఇతర లోహపు ముక్కలు ఆయన చేతిలో పడి ఏదో ఆకృతి దాలుస్తాయి.

ఈయన చిత్రకారుడు, శిల్పి మాత్రమే కాదు కవి కూడా. ఆయన వ్రాసిన కవితలు అనేక ప్రముఖ మాస, వార పత్రికల్లో ప్రచురించారు. 2000 సం॥లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి సహకారంతో "రాతి పొత్తిళ్లు" కవితా సంపుటిక వెలువడింది. ఆ కవితలు డా॥ సి.నా,రె, డా॥ నాగభైరవ కోటేశ్వరరావు వంటి కవుల మన్ననలను పొందినవి.

బోన్‌సాయి వృక్షాలపై ఆయన ఎన్నో దశాబ్దాల అనుభవంతో మఱ్ఱి, జువ్వి, వేప, మేడి, కమలా, బత్తాయి వంటి మరుగుజ్జు వృక్షాలకు కాయలు కాయించారు.

వృత్తిరీత్యా ఆయన వ్యవసాయ కళాశాలలో చిత్రకారునిగా





వ్యాస రచయిత మంచెం

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి పురస్కారం భావపురి కళాభిమానులచే కనకాభిషేకం, ప్రకాశం జిల్లా రచయితల సంఘం, అభిమాన పురస్కారం, అప్పాజోశ్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్ అమెరికా వారి సన్మానం, అఖిల భారత ఫైనార్ట్స్, క్రాఫ్ట్స్ సొసైటి వారి సన్మానాలు అందుకున్నారు.

ఉల్చిగారు 55వ చిత్రకళా ప్రదర్శనను అప్పటి రాష్ట్రగవర్నర్ 2011 రంగరాజన్ దంపతులచే ప్రారంభించబడి వారి మన్నలకు పాత్రులయ్యారు.

కోట్ల రూపాయిలు విలువ చేసే ఈ కళా సంపదను చీరాలలోని "ఉల్చి ఆర్ట్ మ్యూజియం"లో సజీవంగా భద్రపరచడం జరిగింది.

2008సం॥ ఆగష్టు 26వ తారీఖున ఈ బాహ్య ప్రపంచానికి దూరమయినా ఆయన సృజించిన కళాసంపద ఆయన్ని నేటికీ చిరంజీవిని చేసింది.

ఉల్చి ఆర్ట్ మ్యూజియం మందు ఆయన సృష్టించిన వామన వృక్షాలు స్వాగతం పలుకుతాయి. మ్యూజియంలోకి ప్రవేశించిన వెంటనే ఆయన చిత్రాలు చిత్రంగా పలుకరిస్తాయి. ఆయన శిల్పాలు వెన్ను తడతాయి. ఆయన చేసిన ప్రయోగాలు ఆలోచింప చేస్తాయి.

ఉల్చిగారి సుదీర్ఘ ప్రయాణంలో వారికి అడుగడుగునా ప్రోత్సహించి ఇప్పటికీ వారి సంపదను కాపాడుతూ వస్తున్న వారి భార్య రాజేశ్వరికి కళాకారులందరూ ఋణపడి వుంటారు.

కళాకారులు, కళాభిమానులు చీరాలలోని వారి ఆర్ట్ మ్యూజియం తప్పక సందర్శించాలి. యువ చిత్రకారులు వారి కళపై పరిశోధనలు చేయాలి. ఈ సాంప్రదాయకళ అంతరించకుండా చూడాలి.

ప్రభుత్వం ముందుకు వచ్చి ఆయన చిత్రాలను సేకరించి ముందుతరాల వారికి అందుబాటులో ఉంచాలి వారి చిత్రాలను రంగులతో ప్రచురించి అందరికీ అందుబాటులోకి తేవాలి. అప్పుడే వారి కళా కృషి మరిన్ని కాలాలపాటు పదిలంగా ఉంటుంది.

1964నుండి సేవలు అందించి 2000 సం॥లో పదవీ విరమణ చేసారు.

శ్రీమాదాల రంగారావు గారు నేతృత్వంలో నిర్మించిన కొన్ని చలన చిత్రాలకు కళా దర్శకునిగా పనిచేసారు.

భావపురిలో 1969లో "లలితకళాకేంద్రం" స్థాపించి వార్షిక చిత్రకళాపోటీలు నిర్వహించడంతో పాటు ప్రముఖ చిత్రకారులయిన శ్రీ పి.టి. రెడ్డి, శ్రీ బాపు, శ్రీ సంజీవదేవ్ వంటి వారి ప్రదర్శనలు ఏర్పాటు చేసారు. ఎంతో మంది ప్రముఖ చిత్రకారులను సన్మానించారు.

ఆయన చిత్రాలకు రాష్ట్రస్థాయి, జాతీయ స్థాయి పోటీలలో ఎన్నో బెస్ట్ అవార్డులు వచ్చాయి. సుమారు 54 వ్యక్తిగత చిత్ర, శిల్పకళాప్రదర్శనలు దేశ, విదేశాలలో నిర్వహించారు. 1981సం॥లో తానా వారి ఆహ్వానంతో అమెరికా, కెనడాలు దర్శించి అక్కడ కూడా వ్యక్తిగత ప్రదర్శనలు ఏర్పాటు చేసారు.

ఆయన చిత్రాలు ఆంధ్రప్రదేశ్ ఆర్కిలాజికల్ మ్యూజియం, ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ, మద్రాసు లలిత కళా అకాడమీ, తెలుగు విశ్వవిద్యాలయం, తానా మరియు ఇతర దేశాల్లో కొలువుతీరి వున్నాయి.

వివిధ అకాడమీల నుండి "రమ్యశిల్పి", "కళావిభూషణ", "శిల్పకళావిరించి", "విశ్వకళా కౌముది" వంటి బిరుదులతో సత్కరింపబడినా, నేను ఇప్పటికి విద్యార్థినే నంటూ వినయంగా సమాధానం చెప్పేవారు.

(మరికొన్ని చిత్రాలు తరువాయి పేజీలో)

Hobby

# "తెలుగు పత్రికలు-తొలి సంచికలు"

## (1980-2010)

- పులిపాటి దుర్గారావు,
బి.ఎస్‌సి, బి.ఇడి.

తెలుగు సాహిత్యంలో పత్రికలకు ప్రత్యేక స్థానం ఉంది. కథ, కవిత, నవల, కార్టూన్లు, కాలక్షేపం కబుర్లు, సినిమా సంగతులు. ఇలా ఒకటేమిటి పలు అంశాలతో పలురకాల పత్రికలు వచ్చాయి. వస్తూనే ఉన్నాయి. మనలో ప్రతీ ఒక్కరు ఎన్నో పత్రికలు కొంటూంటాం కాని, ఇప్పుడు మనం చెప్పుకోబోయే వ్యక్తిలో ఒక ప్రత్యేకత ఉంది. గత మూడు దశాబ్దాలనుండి తెలుగులో వెలువడిన అనేక పత్రికల మొదటి సంచికలను సేకరించడమే కాకుండా, నేటికీ వాటిని భద్రపరచి 'లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్స్'ను సాధించారు. ఆ అనుభవాలను వారి స్వీయ రచనలో 64కళలుడాట్‌కాంకు అందిస్తున్నారు పులిపాటి దుర్గారావు గారు మీ కోసం...

-ఎడిటర్

"చినిగిన చొక్కా అయినా తొడుక్కో-మంచి పుస్తకం కొనుక్కో" అన్న కందుకూరి వీరేశలింగం గారి మాటలే నాకు స్ఫూర్తి.

నా చిన్నప్పుడు మా ఇంట్లో మా అమ్మా, నాన్న తమ కోసం వారపత్రికలు, మాకోసం పిల్లల పుస్తకాలు బాగా తెచ్చేవారు. చిన్నప్పటి నుండి అవి చదవటం అలవాటు అయి, ఎప్పుడూ ఏదో ఒక పుస్తకం కొనటం, చదవటం, దాచుకోవటం మామూలయింది. గత 30సం॥ల నుండి అలవడిన అలవాటుతో పుస్తకాలు కొంటూ వుంటే చాలా పుస్తకాలు ఒకటి లేదా రెండు సార్లు వచ్చి మాయమవటం చూశాను. అసలు, ఆగిపోయిన పుస్తకాల తొలి సంచికలను దాచి వుంచితే బాగుంటుందన్న ఆలోచన వచ్చింది. ఆ ఆలోచనలో గత 3 దశాబ్దాలుగా నేను కొన్న దిన, వార, పక్ష, మాస, ద్వైమాస, త్రైమాస పత్రికలు అన్నింటి తొలి సంచికలను దాచి వుంచాను. ఇప్పటకి 360కు పైగా వివిధ పత్రికల తొలి సంచికలు సేకరించాను. వాటిని పరిశీలిస్తే ఆ రోజుల్లో ప్రచురణలు, ధరలు, ప్రకటనలు, శీర్షికలు, ముద్రణ వంటి వాటిలో తేడాలు తెల్చుకోవచ్చు. వాటిని దాచివుంచుట. చెదపురుగుల నుండి, ఇతర యిబ్బందుల నుండి కాపాడటం ఒక సమస్య. ఎవరైనా తెల్సిన వాళ్ల ద్వారా కూడా కొన్ని పుస్తకాలు సేకరించాను. చదువుకొనే రోజుల్లో ఒకసారి సినిమాకెళ్ళమని 4/- యిస్తే ఆ డబ్బులతో 1984లో ఆంధ్రపత్రిక వజ్రోత్సవ సంచిక కొన్నాను. ఇలా పుస్తకాలంటే అమితమైన ప్రేమతో దాచివుంచిన ఈ తొలిసంచకలే నన్ను, నాకు పూర్తి సహకారాన్నిచ్చిన నా తమ్ముడు పులిపాటి శ్రీనివాసరావు (ఇటీవలే కేన్సర్‌తో చిన్నవయసులోనే మరణించాడు)ను లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్‌కు ఎక్కించాయి. వృత్తిరీత్యా గణిత ఉపాధ్యాయుడనైనా సాహిత్యంపై అభిమానంతో నేను సాధించిన ఈ రికార్డు వెనుక ప్రోత్సహించిన అమ్మానాన్నలే కాక, అడ్డుచెప్పని కుటుంబ సభ్యులు కూడా వున్నారు.

(మరిన్ని విషయాలు వచ్చే సంచికలో....)

'పౌరాణికబ్రహ్మ'

# కమలాకర కామేశ్వరరావు



'గుండమ్మకథ' సినిమా విడుదలై 50 వసంతాలు పూర్తయిన సందర్భంగా చిత్రదర్శకుడు కమలాకర కామేశ్వరరావు గారికి నీరాజనాలు అర్పిస్తూ.... ప్రత్యేకవ్యాసం.

**కొందరు దర్శకుల పేర్లు వినగానే సినిమా గుర్తుకు వస్తుంది. కానీ కమలాకర కామేశ్వరరావు చలనచిత్ర రంగంలో జానపద, సాంఘిక, చారిత్రక, పౌరాణిక చిత్రాల నిర్దేశకుడిగా ప్రేక్షకుల మదిలో నిలిచిపోయారాయన. కాసుల కంటే కళకు ప్రాధాన్యం ఇచ్చిన సం'తృప్తి' వరుడు. తెల్లటి లాల్చీ, తెల్లని పంచె, తెల్లని జుట్టు, నుదిటిపై ఎర్రని కుంకుమ బొట్టుతో తెలుగుదనానికి ప్రతీకగా, సినీ 'ధర్మరాజు'గా తెలుగుచలనచిత్ర ప్రముఖుల ప్రశంసలను అందుకున్న వినయశీలి.**

సుమారు ఆరు దశాబ్దాల సినీ జీవిత ప్రస్థానంలో అన్ని భాషల్లో కలిపి అయిదు పదుల చిత్రాలకు మాత్రమే దర్శకత్వం వహించారు కమలాకర కామేశ్వరరావు. అందులో సగానికి పైగా ఆణిముత్యాలే. రాశి కంటే వాసి ముఖ్యమనే విషయం కలాకర విషయంలో అక్షరసత్యం. ముఖ్యంగా పౌరాణిక చిత్రాలకు ప్రాణ ప్రతిష్ఠ చేసిన ఆ స్రష్ఠ ప్రేక్షకుల మదిలో 'పౌరాణికబ్రహ్మ'గా నిలిచిపోయారు. ఆయనకు ముందూ, తర్వాతా పౌరాణికాలు తీసిన దర్శకులు ఉన్నా, ఆయన శైలి అనితర సాధ్యమని సినీ రంగ ప్రముఖులే అంగీకరిస్తారు. పౌరాణిక పాత్ర ధారణలో అద్వితీయుడిగా అంతర్జాతీయంగా ఖ్యాతిని ఆర్జించి స్వయంగా దర్శకుడైన ఎన్.టి.రామారావు కూడా




పౌరాణికాలకు సంబంధించి కమలాకరతో చర్చించడాన్ని బట్టి పురాణేతిహాసాలపై ఆయనకున్న పట్టును అర్థంచేసుకోవచ్చు. 1980లో రామానందసాగర్ దూరదర్శన్ కోసం పౌరాణికాలు ధారావాహికగా తీయడానికి కమలాకర చిత్రాలను పరిశీలించడం విశేషం.

### సద్విమర్శ దర్శకుడిని చేసింది!

పాత్రికేయునిగా జీవితం ప్రారంభించిన కమలాకర సినిమా టెక్నిక్‌కు సంబంధించి అనేక పుస్తకాలు చదివి, ప్రతి సినిమాను చూసి వాటిలోని మంచి చెడులను సమీక్షించేవారు. కథ, కథాకథనం తదితర అంశాలపై పత్రికల్లో ఆయన వెలవరించిన సమీక్షలు, విమర్శలు పాఠకులనే కాకుండా సినీ రంగ ప్రముఖులను ఆలోచింపచేసేవి. ఆయన సమీక్షల ఆధారంగా సినిమా చూడాలా? వద్దా? అని ప్రేక్షకులు నిర్ణయించుకునేవారట. అలా, కృష్ణా పత్రికలో రాసిన సమీక్ష ఆయన చలనచిత్ర రంగప్రవేశానికి తొలి సోపానమైంది. 'టాకీపులి' హెచ్.ఎం.రెడ్డి నిర్దేశకత్వంలో వచ్చిన 'ద్రౌపది వస్త్రాపహరణం' ఆర్థికంగా విజయం సాధించినా, అదే సంవత్సరం (1936)లో ఎన్. జగన్నాథ్ పోటీగా తీసిన 'ద్రౌపదీ మానసంరక్షణ' చిత్రీకరణలోనే సాంకేతిక, కథకథాల విలువలు ఉన్నాయన్న కమలాకర సమీక్ష సినీ ప్రముఖులను ఆశ్చర్యపరిచింది. హెచ్.ఎం. ఆ సమీక్షను హుందాగా స్వీకరించి ఆయనను సినిమా రంగానికి ఆహ్వానించారు. తెలుగుచలన చిత్రరంగంలోనే ఆణిముత్యాలుగా చెప్పుకునే అయిదు చిత్రాలకు కథా సహకారం అందించి దర్శక దిగ్గజాలు హెచ్.ఎం. రెడ్డి, కేవీ రెడ్డి, బి.ఎన్.రెడ్డి దగ్గర మెలకువలు నేర్చుకున్నారు. చిత్రానువాదం (స్క్రీన్‌ప్లే)లో కేవీరెడ్డిది అగ్రస్థానమైతే ఆయన తరువాతి

స్థానం కమలాకరదేనని సినీ అనుభవజ్ఞులు అంటారు. పాతాళభైరవి, మాయాబజార్ లాంటి చిత్రాలకు స్క్రీన్‌ప్లేలో అందించిన సహకారమే ఆయన దర్శకత్వ ప్రతిభకు బాటవేసింది. 'సినిమాకు మొత్తం దృశ్యాలతో స్క్రీన్‌ప్లే రూపొందిన తరువాత చూడకుండానే వరుసక్రమంలో కథ చెప్పగలగాలి. అలా చెబుతున్నప్పుడు ఎక్కడైనా ఆగినా, ఆలోచించవలసి వచ్చినా అది సరైన స్క్రీన్‌ప్లే కాదు. అది దర్శకుడి లోపం' అని భావించేవారు.



**కథా చర్చకు నడిచే**

కళే తప్ప కాసులకోసం వెంపర్లాడని దర్శకశ్రేష్ఠుడు కామేశ్వరరావు. సినిమా తీయాలని వచ్చిన వారితో కథ గురించే తప్ప పారితోషికం గురించి ప్రస్తావించేవారు కారట. 'మంచి చిత్రం తీస్తామంటున్నారు. నన్ను చేయమంటున్నారు. ఏముంది? పారితోషికం కోసం పట్టుబడితే ప్రేక్షకులకు మంచి చిత్రం లేకుండా పోతుంది. అది మహాపాపం కదా?' అన్నది ఆయన జవాబు. కీర్తి ప్రతిష్ఠలు, సంపాదన కంటే మంచి చిత్రం కోసం పరితపించిన సిసలైన ప్రేక్షక పక్షపాతి. దర్శకుడు సినిమాకు కెప్టెన్ అని, ఆయన మాటకు తిరుగుండదని భావించే రోజుల్లోనే కామేశ్వరరావు శైలి విభిన్నంగా ఉండేది. నటవర్గం, సాంకేతిక నిపుణులకు గౌరవం ఇచ్చేవారు. సినిమా చిత్రీకరణ విరామ సమయంలో తోటి నటులు కూర్చుని ఉన్నా, తాను మాత్రం నిలుచునే తమ పనులు చేసుకునేవారట. ప్రత్యేకించి-దర్శకుడి ఊహలకు, ఆలోచనకు, అంచనాలకు అనుగుణంగా పాత్రలకు ప్రాణం పోసే నటీనటులను మరింతగా గౌరవించాలన్నది ఆయన భావన. తోటి సాంకేతిక నిపుణుల సూచనలు మన్నించి, ఏ మాత్రం బాగున్నా వాటిని అమలు చేసేవారు. కథా చర్చలకు వెళ్లాలంటే నిర్మాత పంపే కారు కోసం ఆగక నడిచే వెళ్లేవారు. క్రమశిక్షణ, పనిమీద శ్రద్ధ (డ్యూటీమైండ్) పాటించిన దర్శకుడు.



౦

దర్శకుడిగా ప్రారభంలోనే అపజయం ఎదురైనా దానిని 'విజయానికి సోపానం'గానే భావించారు. మొదటి మూడు చిత్రాలు పరాజయం పొందినా పట్టుదలతో ఆణిముత్యం- పాండురంగ మహాత్స్యం-ఆవిష్కరించారు. ఈ విషయంలో ఎన్టీఆర్ ఇచ్చిన దన్ను మరువరానిదని కమలాకర్ పలు సందర్భాల్లో అనేవారు. చంద్రహారం, గుణసుందరికథ (తమిళం), పెంకిపెళ్లాం చిత్రాలు వరుస పరాజయాలతో ఆయనపై 'విఫల' దర్శకుడిగా ముద్రపడింది. ఎన్టీఆర్‌కు










అప్పటికే ఆయనతో గల సన్నిహితత్వంతో, ఆయనపై అపార నమ్మకంతో పాండురంగమహాత్మ్యం' సినిమా అప్పగించారు. ఆయన నమ్మకం వృథా కాలేదు. 'పూవుకు తావి అబ్బినట్లు' సృజనాత్మక దర్శకుడికి అభిరుచి గల నట, నిర్మాత తోడైతే ఉత్తమ చిత్రసృష్టికి బీజం పడినట్లే. అంతే కమలాకర విజయయాత్ర ప్రారంభమైంది. ఆ ఇద్దరి కలయికతో ఎక్కువ పౌరాణికాలు వచ్చాయి. అగ్రశేణి నటులతో' గుండమ్మకథ హాస్యప్రధాన చిత్రం నిర్మించిన కమలాకర 'మహామంత్రి తిమ్మరుసు, మహాకవి కాళిదాసు' చారిత్రక చిత్రాలకు దర్శకత్వం వహించారు. అయితే తాను ఎన్ని చిత్రాలకు దర్శకత్వం వహించినా నచ్చిన చిత్రం 'నర్తనశాల' అనేవారు. జకార్తాలో అంతర్జాతీయ చిత్రోత్సవంలో ప్రదర్శితమైన ఆ చిత్రం కీచకపాత్రధాని ఎస్వీరంగారావును 'యశస్వి'ని చేసింది. ఉత్తమ కళాదర్శకుడి



పురస్కారాన్నీ గెలుచుకుంది. జాతీయ స్థాయిలో ద్వితీయ ఉత్తమ చిత్రంగా పురస్కారాన్ని అందుకుంది. అప్పటి రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ రాష్ట్రపతి భవన్‌లో 'నర్తనశాల', మహామంత్రి తిమ్మరుసు' చిత్రాలను ప్రత్యేకంగా తిలకించారు. 'మహామంత్రి తిమ్మరుసు, మహాకవి కాళిదాసు' రాష్ట్రపతి రజతపతకం గెలుచుకున్నాయి. మహాకవి కాళిదాసు చిత్రం మధ్యప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం నుంచి 'కాళిదాస్ సమ్మాన్' పురస్కారం అందుకుంది. ఆయన దర్శకత్వంలోని పౌరాణికాలు ఎన్టీఆర్ 'వన్నెల'ను పెంచినట్లే 'నర్తనశాల' ఎస్వీఆర్‌ను 'యశస్వి'ని చేసింది. 'తిమ్మరుసు' గుమ్మడికి, 'కాళిదాసు' అక్కినేనికి, 'వీరాంజనేయ' అర్జాజనార్ధనరావుకు విశేష ఖ్యాతి తెచ్చిపెట్టాయి. నా చలనచిత్ర జీవితంలో ఎవరితోనూ వివాదపడలేదు. వేటినీ కోరలేదు. ఎవరు (నిర్మాతలు) ఎంతిస్తే అంతే తీసుకున్నాను. అయినా ఎప్పుడూ సంతోషంగానే ఉన్నాను. ఇప్పుడూ బాధపడడంలేదు. తెలుగుచలనచిత్ర ఆవిర్భావ వికాసాలకు దోహదపడిన హెచ్.ఎంరెడ్డి, కేవీరెడ్డి, బి.ఎన్ రెడ్డి దగ్గర దర్శకత్వం మెలకువలు నేర్చుకుని, అనేక మంది నట దిగ్గజాలతో పనిచేయడమే నా భాగ్యం' అని జీవిత చరమాంకంలో కామేశ్వరరావు అన్న మాటలు ఆయన నిరాడంబరత, విధేయతలకు నిదర్శనాలు. నిజమే...!... ప్రపంచ పౌరాణిక చిత్ర నిర్మాణంలోనే తెలుగువారిది ప్రత్యేకత అయితే, అందులో కమలాకరది అందెవేసిన చేయి. కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల తరపున ఆయన ఎలాంటి సత్కారాలు, పురస్కారాలు అందుకోకపోయినా పౌరాణిక చిత్రాలు ఉన్నంతకాలం ఆయన ప్రకాశిస్తూనే ఉంటారు. ఆ దర్శక శ్రేష్ఠుడికి శతజయంతి నివాళులు.

**– ఆరవల్లి జగన్నాథ స్వామి**

# నిత్యకళారాధకుడు
# నున్న కేశవప్రభు

- వాడ్రేవు సుందర్రావు
నంది, గరుడ అవార్డుల గ్రహీత



***అది రాజమందిరమూ కాదు, రమ్యహర్మ్యమూ కాదు... సమస్త సౌకర్యాలతో నిండిన మహాభవనమూ కాదు.... వైభవోపేతమైన విలాసమందిరమూ కాదు. చాలాకాలం క్రిందట కట్టిన ఓ సాధారణ సున్నపుగోడల ఇల్లు. సామాన్యమైన మధ్యతరగతి కుటుంబాల జీవనరీతిని, జీవితపద్ధతిని ప్రతిబింబించే మామూలు ఇల్లు. నిజానికి అందులో చెప్పుకోదగినంత ప్రత్యేకత ఏదీలేదు.***

మరి... మరి... నన్ను అంతగా ఆ ఇంట్లో ఆశ్చర్యపరచినదేమిటి? నన్నేకాదు.... నా వంటి కళాభిమానులందర్నీ ఆశ్చర్యపరచేది, అబ్బురపరచేది, ఆనంద పరవశుల్ని చేసేది, ఆలోచనా నిమగ్నుల్ని చేసేది, దిశానిర్దేశం చేసేది, కర్తవ్యోన్ముఖుల్ని చేసేది... ఏమిటది? అదే... ఓ అద్భుత దృశ్యం... ఓ అపూర్వ కళాప్రదర్శనం.... ఆ ఇంట కన్పించింది. ఆ మహాప్రదర్శనం గతంలో నేనెన్నడూ చూడనిది, అన్నాళ్ళ నా జీవితంలో ఎన్నడైనా చూడాలనుకొన్నది.... అదే. ఓ మహాకళాకారుడి ప్రతిభా ప్రదర్శనం. ఓ నిరంతర కళా శ్రామికుడి కళార్చనా ఫలం, ఓ నిత్య కళారాధకుడి అవిశ్రాంత శ్రమకు అపూర్వరూపం.



వందలాది బహుమతులు.... వందల మెమెంటోలు... ఎన్నో వెండికప్పులు.... మరెన్నో అందమైన మెడల్సు, ఇంకెన్నో సన్మానపత్రాలు, ఎన్నో.... ఎన్నో.... ప్రశంసాపత్రాలు... వాటన్నింటితో ఆ గది కిక్కిరిసిపోయి కూర్చోడానికి చాలా ఇరుకుగా ఉన్నా, తనకుగదా అంత సౌభాగ్యమబ్బింది అంటూ గర్వంగా తలెత్తుకు చూస్తోంది ఆ గది. అందులో ఒక్కో మెమెంటో, ఒక్కో కథ చెబుతోంది. ఒక్కో పతకం వెనుక, వెండికప్పు వెనుక, ఒక గొప్ప చరిత్ర కన్పిస్తుంది, ఒక రాగం విన్పిస్తుంది. అదంతా ఓ మహాకళాకారుడి అర్ధశతాబ్దపు కళాప్రస్థాన కథ. ఏభై ఏళ్ళ అవిశ్రాంత సాధనా గాథ. వందలాది బహుమతుల్ని చూస్తూ, ఆనందపారవశ్యంలో పరిసరాల్ని మరచిపోయిన నన్నే, తదేకదీక్షతో చూస్తూ ఉండిపోయారాయన. కొద్దిసేపటికి నేనూ ఈలోకంలోకి వచ్చాను.

మహాకవి కాళిదాసు "విపులాచపృథ్వీ" అంటాడు. అంటే ఈ ప్రపంచం ఎంతో పెద్దది. ఎందరెందరో మహనీయులు ఈ లోకంలో ఉన్నారు. వారందరితో పోల్చి చూసుకొన్నప్పుడు, మనం



ఏమిటో.... మన స్థానం ఏమిటో... మనం ఇంకెంత సాధనచేయాలో అర్థమవుతుంది. ఆయన చిరునవ్వుతో పలకరించాడు. ప్రేమతో స్నేహహస్తం అందించాడు. తన జీవన ప్రయాణం గురించి క్లుప్తంగా ప్రస్తావిస్తూ, 1986లో గోస్తనీనదికి వచ్చిన వరదల్లో బహుమతులన్నీ కొట్టుకుపోయాయి అనీ. ఆ రోజుల్లో పదిహేడు రోజులు నీళ్ళు ఈ ఇంట్లో ఉండిపోయి, గతం యొక్క ఆనవాళ్ళని తుడిచేశాయి. ఇదుగో.... ఈ బహుమతులు అన్నీ తరువాత వచ్చినవేనని, ఆయన చిరునవ్వుతో నిరాడంబరంగా, నిర్మోహంగా చెబుతున్నప్పుడు; – నాకు ఇంక నోటమాట రాలేదు. ఆనాటి నుండీ ఆ పరిచయం స్నేహమయ్యింది. స్నేహం కాలక్రమంలో ప్రగాఢమైన కళాబంధుత్వంగా మారిపోయింది.

ఇంతకీ ఆయన పేరు చెప్పనేలేదుకదా నేను. ఆయనే కేశవప్రభు. నున్న కేశవప్రభు. తణుకు పట్టణానికి కరెంట్ తెలియని రోజుల్లో, సనాతన సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబీకులైన నున్న లక్ష్మీనరసింహాచార్యులు, లక్ష్మీదేవమ్మ దంపతులకు కేశవప్రభు జన్మించారు. ధార్మిక భావాలతో సంపన్నవంతమైన ఆ కుటుంబం, వైష్ణవ సంప్రదాయానికి చెందినది. అందుకే ఆయనకు కేశవుడని పేరుపెట్టుకున్నారు. బాల్యంలోనే కేశవుడిలోని కళాభిమానం మొగ్గతొడిగింది. చిన్ననాటనే ఆ పిల్లవాడి మదిలో అనుకరణశక్తి, ప్రదర్శనాసక్తి వికసించడం ఆరంభించాయి.

కేశవప్రభు బాల్యం తణుకులోనే గడిచింది. 1965లో తణుకు ఉన్నత పాఠశాలలో ఏడవ తరగతి చదువుకొంటున్నప్పుడు, పాఠశాల వార్షికోత్సవానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆ ఏర్పాట్లన్నీ ఎంతో అబ్బురంగా చూస్తున్నాడా పిల్లవాడు. ఆరోజుల్లో పాఠశాల వార్షికోత్సవమంటే ఓ నెల రోజుల పెద్ద ప్రయత్నం. మొత్తం పాఠశాల అంతా ఏదో తెలియని ఆనందంలో మునిగిపోయేది. అందునా తణుకు హైస్కూలు కథే వేరు. అది ఎప్పుడో నూరేళ్ళ క్రిందట స్థాపించబడి, వేలాదిమంది విద్యార్థినీ, విద్యార్థుల్ని తీర్చిదిద్దిన ప్రముఖ విద్యాలయం. దేశవిదేశాలలో పేరొందిన ఎందరో ఆ పాఠశాలనుండి వెలుగుచూసినవారే. ఆరోజుల్లో ఆ పాఠశాలలో నాటక నిర్వహణ చూస్తున్న " రాంపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి " స్వయంగా రచయిత, దర్శకుడు. తాను వ్రాసిన "గురుశిష్యులు" నాటికలో నాయకుడి కోసం క్లాసు క్లాసు గాలించి చూస్తున్నప్పుడు, వెలిగే ముఖంతో, అందమైన చిరునవ్వుతో ఉన్న కేశవప్రభు కన్పించాడు. సుబ్రహ్మణ్య శాస్త్రి ఆ కుర్రాడ్ని చూసి పొంగిపోయి, రెండు చేతులతోనూ దగ్గరకు తీసుకొని, తన నాటికలో నాయకుడ్ని చేశారు. పాఠశాల వార్షికోత్సవంలో కేశవుడు "దొంగ" వేషంతో అందరి మనసుల్నీ దోచుకొన్నాడు. అందుకే తన నటజీవితం గురించి ప్రస్తావిస్తున్నప్పుడు నిస్వార్థ కళాభిమానియైన తన మాస్టారుకు, కేశవప్రభు చేతులు జోడిస్తాడు.

తణుకులోనే కేశవప్రభు కళాప్రయాణం సాగుతూ వచ్చింది. ఆరోజుల్లో పిల్లలందరూ కలసి నాటకాలు వేయడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. ముఖానికి రంగులు కొనుక్కోవడానికి పిల్లల దగ్గర కూడా డబ్బులు లేని పరిస్థితి. ఒకవేళ పెద్దవాళ్ళని బ్రతిమలాడి పదో పరకో తెచ్చుకున్నా, తణుకులో రంగులు దొరికే అవకాశమే లేదు. అటువంటి స్థితిలో ఆ పిల్లలకి మేకప్‌ను, మేకప్ సామానులను అందించారు మీసాల సత్యనారాయణ. ఆయన దర్శకత్వంలో "ఆగండి కొంచెం ఆలోచించండి, ఒక దీపం వెలిగింది, షిప్ వచ్చింది, సత్యం, సాలెగూడు " వంటి ఎన్నో నాటకాల్ని ప్రదర్శించారు. రిహార్సల్స్, తెరవెనుక, మంచం మీద మనిషి, అతిథి దేవుళ్ళు వంటి నాటికలతో ప్రభులోని నటనాకౌశలం పది మందికీ తెలియవచ్చింది. రాజారాం కల్చరల్ అసోసియేషన్ నిర్వాహకుడైన ఎ.ఎస్.చిట్టూరి, తణుకు నివాసి. ఆయన స్వయంగా కొన్ని నాటకాలు, నాటికలు వ్రాశారు. ప్రభులోని కళాసక్తికి తనవంతుగా తోడ్పాటునందించారు. కేశవప్రభు తొలినాటి గురువుల్లో ఈయన మూడవవారు.

తణుకు శ్రీచిట్టూరి ఇంద్రయ్య ప్రభుత్వ కళాశాలలో బి.కాం. పాసయ్యాక కేశవప్రభుకు భారత ఆహారసంస్థలో ఉద్యోగం రావడం, భారత ఆహారసంస్థవారి కళా ప్రదర్శనల్లో ముఖ్యభూమిక పోషించడం ఒక్కసారే జరిగాయి. ఆనాటినుండీ ప్రభులోని కళాభినివేశనానికి మరింత గుర్తింపు లభించింది. ఆగండి ...

కొంచెం ఆలోచించండి నాటికతో ఉత్తమనటుడిగా ఉత్తమదర్శకుడిగా ఎన్నో బహుమతులందుకొన్నారు. ఆ నాటికలో ఆదెయ్య పాత్రలో, ఉష్‌కాకిలో లచ్చిగాడుగా, జాతిస్మరామిలో చిత్తుకాగితాలు ఏరుకునేవాడిగా, ఫర్‌సేల్‌లో ఆఫీసర్‌గా, రాజకీయనాయకుడిగా, ఫ్యాక్టరీయజమానిగా, దండమయా

విశ్వంభరలో కానిస్టేబుల్‌గా, ఫోర్త్‌మంకీలో గాంధీగా, లంకాదహనంలో విప్లవకారుడిగా, ముద్రారాక్షసంలో డాక్టరుగా ఇలా దాదాపు వంద నాటిక నాటకాలలో, ఎన్నో గొప్ప పాత్రల్ని నటించి, ప్రేక్షకుల హర్షధ్వానాల్ని అనంతంగా పొందిన అసామాన్య కళాకారుడు కేశవప్రభు.




విజయవాడ కళాపరిషత్‌లో వరుసగా మూడుసార్లు ఉత్తమనటుడి బహుమతి నందుకొని, హాట్రిక్ సాధించాడు. ప్రఖ్యాత దర్శకుడు ధవళసత్యం దర్శకత్వంలో "కాడి–జోడెడ్లు, భూపోరాటం" వంటి గొప్ప నాటకాల్ని తిరుగులేని విధంగా పోషించాడు కేశవప్రభు.

కేశవప్రభు ప్రతిభ రాష్ట్రాల ఎల్లలు దాటి విస్తరించింది. "కుక్క" నాటికలో పనివాడి వేషంతో తంజావూర్‌లో, ఆగండి కొంచెం ఆలోచించండి లో ఆదెయ్య వేషంలో ఫాల్ఘాట్‌లో, ఇంకా కోయంబత్తూర్, నీలగిరి, బెంగుళూరులలో పోటాపోటీగా నాటికల్ని ప్రదర్శించి, అనేక భాషల ప్రేక్షకుల్ని కూడా అలరించాడు.

కేశవప్రభు రచయితకూడా. ఆయనే వ్రాసుకొని, నటించిన "ఫొటో(గ్రా)లావు" అనే ఏకపాత్రకి రాష్ట్రస్థాయిలో ప్రథమబహుమతి వచ్చింది. ఆ సందర్భంలో నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు నుండి బహుమతి అందుకొన్న మధురమైన క్షణాల్ని మరచిపోలేనంటారాయన. కాలేజీలో చదివే రోజుల్లో వ్రాసుకొన్న "రోడ్డు రోమియో" ఏకపాత్ర, పెద్దవాడయ్యాక రూపొందించుకొన్న "మంత్రిని" ఏకపాత్రలు కేశవప్రభుకు ఎంతో గుర్తింపు తెచ్చాయి. భారత ఆహారసంస్థ ఉద్యోగి, మహానటుడు కీ॥శే॥ కాంతారావు కూడా కేశవప్రభు కళాయాత్రలో ఒక ముఖ్యమైన వ్యక్తి.

కేశవప్రభు నటనా ప్రతిభను ఎందరో, ఎన్నో విధాలుగా గౌరవించారు. ధవళసత్యం కళామిత్రమండలి చేత "కళాచెలికాడు" అనీ, అభ్యుదయకళానికేతన్ చేత "అభ్యుదయశ్రీ" అనీ, మానవతాసంస్థ చేత "ఆంధ్రకళారత్న" అనీ, గన్నవరం కళాసమితి వారి చేత "కళారత్న" అనీ, ఇలా ఎన్నో బిరుదులతో, సత్కారాలతో ప్రభు గౌరవించబడ్డారు. 2012వ సంవత్సరానికి తెలుగు నాటక దినోత్సవం నాడు, పశ్చిమగోదావరి జిల్లాలోని ఉత్తమ కళాకారుడిగా జిల్లా కలెక్టర్ చేత సత్కరించబడ్డారు కేశవప్రభు.

నటన, దర్శకత్వం తరువాత ప్రభు కళాజీవితంలో చెప్పుకోదగ్గది, గుణ నిర్ణేతగా వ్యవహరించడం, వందలాది కార్యక్రమాలకు ఆయన గుణనిర్ణేతగా వ్యవహరించారు. కళాప్రదర్శనల్లో కేశవప్రభు గుణ నిర్ణయం అందరి ఆమోదాన్నీ పొంది, విజేతని, పరాజితుడ్ని కూడా సమంగా తృప్తి పరుస్తుంది. రాష్ట్రప్రభుత్వ కళాశాల విద్యావిభాగం నిర్వహించిన అంతర్ విశ్వవిద్యాలయాల డిగ్రీ కళాశాల విద్యార్థినీ, విద్యార్థుల సాంస్కృతిక కార్యక్రమాలకు గుణనిర్ణేతగా వ్యవహరించి, పదుగురి చేత శభాష్ అనిపించుకొన్నారు. ఆయనకు స్థాయి బేధం లేదు, ఎక్కువ తక్కువలు లేవు. కళాప్రదర్శన ఏదైనా ఆయనకు ఒక్కటే. విశ్వవిద్యాలయ స్థాయి ఎంతో, ప్రాథమిక పాఠశాల స్థాయి కూడా ఆయనకు అంతే. ఏదైనా ఆయన దృష్టిలో గొప్పదే. ఎక్కడైనా ఒకేరీతిలో బాధ్యతా నిర్వహణ చేయాలి అనేదే ఆయన ఆశయం. కేశవప్రభు మంచి క్రీడాకారుడు కూడా. బాస్కెట్‌బాల్, బాల్ బాడ్మింటన్, కోకో, కబడ్డీలో రాష్ట్రస్థాయి పోటీలలో పాల్గొన్న ప్రతిభావంతుడు. భారత్‌స్కౌట్స్‌లో 7-11-1966వ తేదీన, ఢిల్లీలో ఆనాటి భారత రాష్ట్రపతి, మహాపండితుడు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ నుండి ప్రశంసాపత్రం అందుకొన్న అదృష్టవంతుడు.

కేశవప్రభు నిత్యకళారాధకుడు. ఆయన జీవితం ఓ కళాప్రవాహం. అలసిసొలసిపోయిన స్థితిలో కూడా, ఆరోగ్యం ఎంత మాత్రం సహకరించని స్థితిలో కూడా, నాటకం పేరు చెప్పగానే ఎనలేని శక్తి, ఎక్కడలేని ఓపిక వస్తాయి. మాట్లాడడానికి కూడా ఓపికలేని మనిషికి, రాత్రితెల్లవార్లూ మేలుకునే శక్తి వస్తుంది. నిజంగా నాటకం ఆయన ఊపిరి. అదే ఆయన అంతరంగ రహస్యం. పాణిగ్రహణం నుండీ మనసెరిగిన భార్య వరలక్ష్మీదేవి, మనసును మెచ్చిన వరపుత్రులు రవి, మధులు, మామగారి అడుగులకు మడుగులొత్తే మంచి కోడళ్ళు సుశీల, రమలు, బ్రతకడానికి బెంగలేని ఆర్థికస్థితిగతులు.... అన్నిటికీ మించి.... ఆ వేంకటేశ్వరుడి కరుణాకటాక్షం, నటరాజస్వామి ఆశీస్సులు..... అన్నీ కలసి కేశవప్రభు శతవసంతాలు జీవించాలి, నిత్యకళారాధనతో చరితార్థుడు కావాలి. స్వస్తి.

64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం
సంపుటి :2 సంచిక :9 జూలై 2012



64కళలుడాట్‌కాంలో ప్రారంభించిన 'మన కార్టూనిస్టులు' కొత్త శీర్షికకు విశేష స్పందన వచ్చింది. తెలుగు కార్టూన్ రంగాన్ని సుసంపన్నం చేసిన వారిని నెలనెలా మీ ముందుకు తీసుకువస్తాం. పద్మశ్రీ అందుకున్న తొలి కళాదర్శకుడు తోట తరణి గారిని 'సినిమా' విభాగంలో పరిచయం చేసాం.

64కళలుడాట్‌కాంకు రచనలు మేమూ చేయవచ్చా అని ఎంతో మంది మెయిల్స్ పంపిస్తున్నారు. కళలకు సంబంధించిన వ్యాసాలు (ఫొటోలతో) నిరభ్యంతరంగా పంపవచ్చు.

ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.

**కళాసాగర్**
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : **హ్యేరీ నవీన్**

**జగమెరిగిన కార్టూనిస్టు జయదేవ్**

**లలితకళల రాజు -బాపిరాజు**

ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే

# నటస్రష్టకు షష్టిపూర్తి

జీవన ప్రయాణంలో అరవై వసంతాలు పూర్తయితే, అది ఆ వ్యక్తికి షష్టిపూర్తి. ఎందరెందరో బంధుమిత్రులు విచ్చేసి, ఆ వ్యక్తికి ఘనంగా షష్టిపూర్తి ఉత్సవాన్ని నిర్వహించి, శుభాభినందనలను అందజేసి, శతాయుష్కుడివై వర్ధిల్లమని, శతవసంతాలు హర్షించమని ఆశీర్వదిస్తారు. ఇది సర్వసాధారణంగా ప్రపంచంలో జరిగే ఓ అందమైన కార్యక్రమం.మరి ఒక నటుడు తన నటజీవితంలో 60 వసంతాలుగా, రంగస్థలానికి అంకితమై జీవించినప్పుడు,6 దశాబ్దాల కాలంగా నాటకరంగంతో మమేకమై కొనసాగినప్పుడు, రంగస్థలాన్ని సత్ప్రయోజనానికి వినియోగించడానికి అహర్నిశలూ పరిశ్రమించినప్పుడు,మరి ఆ నటుడి షష్టిపూర్తిని,ఓ సాధారణ ఉత్సవం అనాలా ? ఓ మహోత్సవం అనాలా ?



పడాల

**- వాడ్రేవు సుందర్రావు**

**నంది, గరుడ అవార్డుల గ్రహీత**

కేవలం తాను నటించడమే కాదు, తనతో పాటుగా ఎందరినో మహానటుల్ని చేయడానికి ఎంతో పరిశ్రమించి, ఎందరో సంగీత, వాద్య, రంగోద్దీపన కళాకారులకు ఉన్నతమైన శిక్షణనిచ్చి, వారందరినీ అవిశ్రాంత కళాయోధులుగా తీర్చిదిద్దిన ఒక నిర్వాహకులు, ఒక నటదర్శకుడి, ఓ విశిష్ఠ ప్రయోక్త షష్టిపూర్తిని ఓ సాధారణ షష్టిపూర్తిగానే భావించవచ్చా?

అంతేకాదు కళకోసం అంకితమై బ్రతికి, బ్రతికి, జీవన చరమ సంధ్యలో నిస్సహాయంగా నిలచిపోయి, బ్రతుకు పోరులో ఓడిపోయి, రంగస్థల క్రీనీడలో, దుర్భరమైన వేదనతో బ్రతుకుతున్న వందలాది కళాకారుల బ్రతుకుల్లో వెలుగు పూలు పండించే ప్రయత్నం చేస్తూ, వృద్ధకళాకారులను ఆదుకోవడానికి ఎందరో పెద్దల సహకారంతో క్రియాశీలతతో సాగిపోతున్న ఆ నిత్య కృషీవలుడు, నాటకరంగ నిత్య సేవాప్రదుడు, అహర్నిశలూ నాటక చింతనతో బ్రతికే ఆ మహాకళాకారుడి కళాజీవిత షష్టిపూర్తి వత్సరమిది. కాలం గడిచిపోతోంది. సన్నివేశం కరిగిపోతోంది. వసంతం దాటబోతోంది. గ్రీష్మం ఆరంభమవుతోంది. కానీ ఆ మహాకళాకారుడి కళాసేవకు షష్టిపూర్తి ఉత్సవం మాత్రం ఆరంభం కాలేదు. ఇది శోచనీయం. బాధాకరం, దురదృష్టకరం.

ఆ మహాకళాకారుడు, ఆ నటదర్శకుడు, ఆ రచనాప్రయోక్త వేరెవ్వరో కాదు. ఆయనే శ్రీ పడాల సత్యనారాయణ రెడ్డి. పశ్చిమగోదావరి జిల్లా, తణుకు పట్టణంలోని "కళాంజలి" సంస్థ వ్యవస్థాపకుడు. నాటకమే సర్వస్వంగా భావించి, తరిస్తున్న మహనీయుడు.

పడాల సత్యనారాయణ రెడ్డి 1932వ సంవత్సరం జూన్ నెల ఆరవ తేదీన పడాల సుబ్బారెడ్డి, పడాల రత్నావతి దంపతులకు జన్మించారు. వారి జన్మస్థలం పెనుగొండ. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి కొలువై ఉన్న పెనుగొండ సకల ఆస్తిక మహాజనులందరికీ గొప్ప పుణ్యక్షేత్రం. సమీపంలోని మారుటేరు ఎస్.వి.జి. హైస్కూల్‌లో వారు ఆనాడు యస్.యస్.ఎల్.సి. వరకూ చదువుకున్నారు. విద్యార్థి దశనుండీ వారికి క్రీడలంటే ఎక్కువ ఇష్టం. హైజంప్‌లో ఆరోజుల్లో జాతీయ స్థాయి క్రీడల్లో రెండవ బహుమతి గెల్చిన క్రీడాకారుడు ఆయన. పడాల సత్యనారాయణ రెడ్డి నాటకరంగ ప్రవేశం కూడా పెనుగొండలోనే జరిగింది. 1950వ సంవత్సరంలో అంటే నేటికి 61 ఏళ్ళ క్రితం ఆయన " ఫ్రండ్స్ యూనియన్ కల్చరర్ & డ్రెమెటిక్ అసోసియేషన్" ను స్థాపించారు.

వారి తొలి నాటిక " అదృష్టరేఖ" అది వారి స్వీయరచన, అందులో వారుకూడా తొలిసారిగా నటించారు. అంతేకాదు ఆ నాటకానికి దర్శకత్వం వహించారు. ఈ విధంగా తొలినాటికతోనే కష్టసాధ్యమైన, రచన, నటన, దర్శకత్వపు బాధ్యతల్ని సమర్ధవంతంగా నిర్వహించిన ఘనత రెడ్డి గారికే చెందుతుంది.

ఆ తరువాత ఎన్నో నాటికలు, నాటకాలు వారి దర్శకత్వం నుండి వెలుగుచూశాయి."రైతువీరుడు, సినిమాపిచ్చి, రిహార్సల్స్ " నాటికలు వరుసగా ప్రదర్శించబడి ప్రేక్షకుల ప్రశంసలందుకొన్నాయి. "ఓ ఇంటి కథ నాటకం" గొప్ప పేరు తెచ్చింది. తదనంతర కాలంలో వారి స్వీయరచన, దర్శకత్వంలో రూపొందిన "మనశ్శాంతి నాటకం" ఎంతో

ఖ్యాతి నందుకొంది. హైదరాబాద్‌లోని ఆంధ్రనాటక కళాపరిషత్తులో ప్రదర్శించబడి, అశేష ప్రేక్షకుల ప్రశంసలందుకొంది. రచన, దర్శకత్వాలకు తోడుగా సత్యనారాయణ రెడ్డి పోషించిన "కల్నల్" పాత్ర మిలటరీ అధికారుల్ని కూడా ఎంతగానో ఆకర్షించింది. రెడ్డి గారి నటనకు ముగ్ధులైపోయిన మిలటరీ కంటోన్మెంట్ అధికారులు, ఈ బృందాన్ని ఆహ్వానించి మరొక్కమారు కంటోన్మెంట్ ప్రాంతంలో ప్రదర్శింపజేసి, ఘనంగా సత్కరించారు.

1955లో విజయలక్ష్మి గారితో వివాహం జరిగింది. ఆనాటినుండీ ఆయన నటజీవితంలో వెనకడుగు లేదు. అడుగడుగూ విజయం వైపే సాగింది. 1955 ప్రాంతంలో పంచాయత్‌రాజ్ శాఖలో VLW ఎంపిక రావడంతో ఆయన ఉద్యోగ జీవితం ఆరంభమైంది. సాధారణంగా స్థిరమైన ఉద్యోగం లభించిన తర్వాత నాటకానికి దూరంగా జరిగిపోయేవారు ఎందరో ఉంటారు, మరికొందరు ఉద్యోగం చేస్తూనే తమ ఆసక్తిని నిలబెట్టుకొంటూనే ఉంటారు. వారందరి కన్నా భిన్నమైనది సత్యనారాయణ రెడ్డి వ్యక్తిత్వం.

ఆయన తనలోని నటనాశక్తిని, తన సామర్థ్యాన్ని ఉద్యోగజీవన వికాసానికి, ఉద్యోగ ధర్మనిర్వహణకు ఉపయోగించడం ఆరంభించారు. VLW శిక్షణా కాలంలోనే ప్రభుత్వ కార్యక్రమాల అమలుకు, అభివృద్ధికి నాటకాన్ని సాధనంగా చేసుకొన్నారు. అన్నింటికన్నా ముఖ్యంగా ప్రభుత్వ పథకాలలోని మంచిని ప్రజలకు తెలియజెప్పి, తద్వారా ప్రభుత్వ కార్యక్రమాల విజయానికి దోహదపడేలా కృషిచేయడంలో సత్యనారాయణ రెడ్డి ప్రముఖమైన పాత్ర పోషించారు.

"ప్లానింగ్ పిచ్చి, చిలకమ్మ, పశ్చాత్తాపం, ప్లానింగ్ కలాపంలో మధ్యతరగతి విలాసం" వంటి ఎన్నో ప్రచార నాటికలు ప్రభుత్వ పథకాల అమలుకు ప్రోత్సాహమిచ్చాయి.

1957లో శిక్షణ పూర్తిచేసుకొని మొగల్తూరు సమితిలో VLW గా ఉద్యోగనియామకంతో పొందడంతో, ఆయన దృష్టి మరింత బలంగా నాటకరంగం వైపు నిలచింది. ఎన్నో, ఎన్నెన్నో కళాపరిషత్తులలో ఆయన నటనతో, దర్శకత్వంతో ఎన్నో నాటికలు, నాటకాలు ప్రదర్శించబడ్డాయి. ముఖ్యంగా " స్వార్థం, ఇంటిదొంగలు, ఏది న్యాయం, ఇదేమిటి ? శ్రీమంతులు, అన్నాచెల్లెలు, స్వీకారం, చావకూడదు" మొదలైన నాటికలు వందకు పైగా కళాపరిషత్తులలో ప్రదర్శించబడి, ప్రేక్షక ప్రశంసల్ని, అసంఖ్యాక బహుమతుల్ని అందుకొన్నాయి. 1974 సత్యనారాయణరెడ్డి గారి జీవితంలో ఓ మరపురాని కాలం. ఆరోజుల్లో ప్రభుత్వం ప్రవేశపెట్టినఆధునిక సేద్య పద్ధతులపై ఆనాటి కలెక్టర్ కుమారస్వామి రెడ్డి ప్రోత్సాహంతో, "మధురక్షణాలు" అనే నాటికను రచించడం, ఆనాటికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 10 జిల్లాలలో 500 ప్రదర్శనలు అందుకోవడం, నిజంగా అపూర్వం. అంతేకాదు ఆ నాటిక ఆకాశవాణి విజయవాడ ద్వారా ప్రసారం చేయబడి, అనంతరం భారతదేశస్థాయిలో ఉత్తమ ప్రదర్శన,






ఉత్తమ రచన, ఉత్తమ సంగీతానికి మూడు జాతీయ బహుమతులందుకొని తెలుగు వారి ఘనతను జాతీయస్థాయిలో నిలిపించి. ఆ తరువాత 14 భారతీయ భాషల్లోకి అనువదించబడి, ప్రసారం చేయబడింది అంటే, రెడ్డి గారి దీక్షాదక్షతలను స్పష్టంగా తెలుసుకోవచ్చు. కుటుంబ సంక్షేమం కథాంశంగా వ్రాసిన " శుభఘడియలు " 20 సూత్రాలపై వ్రాసిన "పెళ్ళి చూపులు" వ్యవసాయరంగ అభివృద్ధికి దోహదపడే " కీటకదర్బార్ " వంటి ఎన్నో ఎన్నో ప్రదర్శనలను అందుకొన్నాయి.

కేవలం సాంఘిక నాటకాలు మాత్రమే కాదు పౌరాణిక నాటక రంగంలోనూ వీరికి మంచి ప్రవేశముంది. "కళ్యాణకృష్ణ, చక్రధారి, మహాకవి కాళిదాసు వంటి వీరి పౌరాణిక నాటకాలు చిరకీర్తిని ఆర్జించాయి.

రెడ్డిగారి చేతిలో నాటకం ఓ ఆయుధం, ఓ ఆశ్రయం, ఓ నీడ, ఓగూడు గా మారింది. జాతీయ రక్షణనిధికి నాటకాల ద్వారా చందాలు ప్రోగు చేసారు. అగ్ని బాధితులకు, తీవ్ర అనారోగ్యానికి గురైన ఉద్యోగులకు, పేద కళాకారులకు నాటకాలు ఆడి ధన సహాయం చేశారు. మరీ ముఖ్యంగా బీహారు కరువు బాధితుల సహాయార్థం రెడ్డి గారు చేసిన సేవ చిరస్మరణీయం. ఏలూరు తెలుగు దర్బార్ నాటక పోటీలకు రెండు మార్లు స్క్రూటినీ జడ్జిగా దేశమంతా తిరిగి నాటకాలను ఎంపిక చేసారు. మధ్యప్రదేశ్‌లోని బిలాస్‌పూర్‌లో జరిగిన రైల్వేనాటక పోటీలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు.

1991 నవంబర్ 1న తణుకులో " కళాంజలి " స్థాపనతో సత్యనారాయణ రెడ్డి కళాసేవ మరొక గొప్ప మలుపు తిరిగింది. నాటక రంగంలో ఒకనాడు ఉజ్వలంగా వెలిగి, క్రమంగా కనుమరుగైపోయి, అనారోగ్యాలతో, ఆర్థిక బాధలతో కొట్టుమిట్టాడుతూ, దారిద్ర్యపు కోర్లల్లో చిక్కి, విలవిలలాడుతున్న ఎందరో కళాకారుల్ని ఆదుకోవడానికి కళాంజలి ద్వారా గొప్ప ప్రయత్నం చేశారు, చేస్తున్నారు. కళాంజలి క్రమం తప్పకుండా కార్యక్రమాల్ని నిర్వహిస్తూ, ఎందరో పెద్దలు సహకారంతో గత ఇరవై సంవత్సరాలుగా ఇంతవరకు ఎందరో కళాకారుల్ని సత్కరించి లక్షలాదిరూపాయల ఆర్థిక సహాయం అందించింది. ఇందులో కొందరు కళాకారులు తమ కుమార్తెలకు వివాహాలు కూడా కళాంజలి అందించిన ఆర్థిక సహాయంతోనే జరుపుకొన్నారంటే, ఒక కళాకారుడికి, ఓ కళా సంస్థకు అంతకన్నా సంతృప్తి ఏముంటుంది ? అంతేకాదు, స్వంత ఇంటికి నోచుకోని 17 మంది పేద కళాకారులకు ఇళ్ళ స్థలాలను ప్రభుత్వం నుండి అందించి, ఆ స్థలాలలో వారికి గృహనిర్మాణం కోసం, నాటకం ఆడి, 2 లక్షల 50 వేల రూపాయలు సేకరించి ఆ పేద కళాకారులకు గృహవసతి కల్పింపజేయడానికి కారణభూతుడైన ఆ మహాకళాకారుడికి, కళాస్రష్టకు సమాజం ఏమిచ్చి ఋణం తీర్చుకోగలదు?

*email: vadrevusundarrao@gmail.com*

# మన కార్టూనిస్టులు

- వెంటపల్లి సత్యనారాయణ

"అక్షరం రూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క. లక్షమెదళ్లకు కదలిక అన్నాడు, ఆనాడు మహాకవి కాళోజీ. అక్షరానికున్న శక్తి అలాంటిది. వేల అక్షరాలతో చెప్పలేని భావాన్ని ఒక్క కార్టూన్ ద్వారా చెప్పొచ్చు అంటున్నారు నేటి కార్టూనిస్టులు. నిరక్షరాస్యులను కూడా కదిలించగల శక్తి కార్టూన్‌కుంది.

వివరణ అవసరం లేకుండా సూటిగా, సంక్షిప్తంగా, విషయాన్ని పాఠకుడి హృదయానికి హత్తుకునేలా చేసే గొప్ప కళా మాధ్యమం కార్టూన్. అందుకే రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాహిత్య, కళా విషయాలతో నిమిత్తం లేకుండా అన్ని రకాల పత్రికలలోనూ నేడు కార్టూన్లు ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ఇంత శక్తివంతమైన కళాప్రక్రియకు తెలుగులో ఆద్యుడు శ్రీ తలిశెట్టి రామారావు గారైతే, ఆ తర్వాత కార్టూన్ విస్తృతంగా వ్యాప్తిలోకి రావడానికి బాపు, జయదేవ్, బాలి, మోహన్, ఏ.వి.ఎమ్, చంద్ర, మల్లిక్, సత్యమూర్తి, శ్రీధర్, కుమారి రాగతి పండరి లాంటి ఎందరో కార్టూనిస్టులు కృషి చేస్తున్నారు.

తెలుగు కార్టూన్ పితామహుడు తలిశెట్టి రామారావు గారితో 'మనకార్టూనిస్టులు' శీర్షికను ప్రారంభిస్తున్నాం. చదవండి, హాయిగా నవ్వండి, మీ అభిప్రాయాలను తెలియజేయండి...

- కళాసాగర్, ఎడిటర్

## జగమెరిగిన కార్టూనిస్టు జయదేవ్



వస్తువుల ప్రామాణికతకు కొలమానంగా ISI మార్కు కేటాయించిన రీతిగా కార్టూన్ రంగానికి కూడా ఏదైనా ప్రమాణాన్ని సూచిస్తే తెలుగు కార్టూన్ కళారంగానికి సంబంధించిన అలాంటి ప్రామాణిక చిహ్నాన్ని కేటాయించడానికి అందరి వేళ్లు సంయుక్తంగా ఒకే కార్టూనిస్ట్ వైపు చూపించడానికి ఎక్కువగా ఆరాటపడతాయి. ఎందుకంటే కార్టూన్‌లకు ఆయన గీసే గీత గానీ, రాసే వ్యాఖ్యలు గాని అంత పెర్‌ఫెక్ట్‌గా వుంటాయి. సునిశితమైన కార్టూన్ వేసినా, ఆటంబాంబు లాంటి జోక్ పేల్చినా, సమాజంపై వ్యంగ్యోక్తి విసిరినా, పురాణపాత్రలపై సెటైర్లు వేసినా ఏదైనా చాలా సూటిగా, సున్నితంగా ప్రేక్షకుడి మానసాన్ని తాకేలా చేస్తుంది అతనిశైలి. పుంఖాను పుంఖాలుగా వేసిన అతని ప్రతీ కార్టూన్‌ను కూడా ఇందుకు మనం ఉదాహరణగా తీసుకోవచ్చు. సగటు ప్రేక్షకున్నే కాదు తనతోటి కార్టూనిస్ట్‌లతో పాటు, అభ్యుదయ కార్టూనిస్టులందరికీ కూడా అంతలా నచ్చే, అందరూ మెచ్చే కార్టూనిస్ట్ అతనే జయదేవ్‌గా ప్రఖ్యాతమైన జయదేవ్‌బాబు.

పుట్టింది 1940లో రాయలసీమ జిల్లా కడపలో. కానీ పెరిగిందీ, చదివిందీ తన తాతగారి ఇంటివద్ద మద్రాస్‌లో, లైఫ్ సైన్సెస్‌లో డాక్టరేట్, పొందిన జయదేవ్ అక్కడ సర్ త్యాగరాయ కళాశాలలో ప్రొఫెసర్‌గా పనిచేశారు. కార్టూనిస్టుగా ఆయన్ను మొదట ప్రోత్సహించింది ఆనాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక ఎడిటర్ శ్రీ శివలెంక రాధాకృష్ణగారు. 19 ఏళ్ళ వయసులో ఆయన తొలి కార్టూన్ ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురితమైంది. 1959లో. నాటి నుండి నేటి వరకూ 40 వేలకుపైగా కార్టూన్లు శ్రీజయదేవ్ వేశారు. నేటి స్వాతి, స్వప్న, నది, చిత్ర లాంటి మాసపత్రికలతో పాటు తెలుగు కార్టూన్.కామ్., 64కళలుడాట్‌కామ్, ఫేస్‌బుక్ లాంటి అంతర్జాల పత్రికలలో సైతం రెట్టించిన ఉత్సాహంతో నేటికీ గీస్తూనే ఉన్నారు.

సాధారణంగా చిత్రకారుడు గీసే రేఖల మందపుస్థాయిలో హెచ్చుతగ్గులు చూపించినపుడు మాత్రమే ఆయా రేఖలు సౌందర్యవంతంగా కనిపిస్తాయి. అలా కాకుండా ఏకరీతిలో సాగే రేఖల్లో సౌందర్యం అంతగా కానరాదు. కానీ జయదేవ్‌గారి రేఖల




సొంతం చేసుకున్నారు. 1986లో ఇటలీలో జరిగే ప్రపంచ ఫుట్‌బాల్ పోటీల సందర్భంగా అక్కడ నిర్వహించిన కార్టూన్ ప్రదర్శనలే కాక, 1986 నుండి 1996 వరకూ వరుసగా ఆయన కార్టూన్‌లు బెల్జియమ్ దేశంలో ప్రదర్శించబడడం ఎంతో గొప్ప విషయమేగాక 1996లో బెల్జియమ్‌లో జరిగిన అంతర్జాతీయ కార్టూన్‌పోటీలకు జయదేవ్‌గారిని జ్యూరీమెంబర్‌గా ఎంపిక చేయడం తెలుగువాడిగా, భారతీయుడిగా మనం ఎంతో గర్వించదగిన విషయం.

1997లో ఆయన ఉద్యోగ విరమణ చేసిన నాటి నుండి 1999 వరకూ అక్కినేని హార్ట్ ఏనిమేషన్‌లో మూడేళ్ళు ప్రిన్సిపల్‌గాను, ఆ తదుపరి 1999 నుండి 2004 వరకూ కలర్ చిప్స్ ఇండియా, హైదరాబాద్‌లో ఆర్ట్ డైరెక్టర్‌గా పనిచేసి కొంతకాలం 'జయం' భక్తి మాసపత్రికకు సంపాదకులుగా కొనసాగి ప్రస్తుతం చెన్నైలో నివసిస్తున్నారు.

ఏడు పదులు దాటినా ఈ వయసులో సైతం ఆయన తన అందమైన కార్టూన్లకు కంప్యూటర్ సాయంతో వర్ణాలద్ది మరింత సౌందర్యభరితం చేస్తూ పాఠకులను ఉర్రూతలూగించడమేకాక నేటి యువ కార్టూనిస్టులకు తగు సూచనలిస్తూ నిత్య యవ్వనుడిగా కార్టూన్ కళామతల్లికి చేస్తున్న కృషి ఎంతో అభినందనీయమైనది.

స్థాయిల్లో అలాంటి వ్యత్యాసం ఏమీలేకుండా ఏకరీతిలో సాగే వారి సన్నటి గీతల్లో సైతం ఎంతో జీవం కనిపిస్తుంది. డ్రాయింగ్‌పై ఆయనకు గల మంచిపట్టు దీనికి కారణమౌతుంది. ఎలాంటి భంగిమనైనా, సన్నివేశాన్నైనా చాలా సింపుల్‌గా, చక్కని దృష్టిక్రమంతో కార్టూన్‌లకు ఆయన గీసే గీతల్లోని పరిశుభ్రతకు తోడు సూటిగా, భావయుక్తంగా రాసే వ్యాఖ్యలు చూసే ప్రేక్షకుడి మానసాన్ని హత్తుకునేలా చేస్తాయి. తెలుగు కార్టూన్‌లకు స్వర్ణయుగం అనదగిన 1980-1995 మధ్యకాలంలోని యువకార్టూనిస్టులెందరో జయదేవ్‌బాబుగారి ఏకలవ్య శిష్యులే కావడం గమనార్హం.

రాష్ట్రజాతీయ స్థాయిల్లోనే గాక అంతర్జాతీయస్థాయిలో కూడా కార్టూనిస్ట్‌గా ఆయన ఎంతో ప్రఖ్యాతి గాంచారు. Youmiri simbun (యామిరిసింబన్) Okhotsk లాంటి జపాన్ పత్రికలతో పాటు, ప్రఖ్యాతి గాంచిన Knowkkheist (నాకీహీస్ట్) లాంటి బెల్జియమ్ పత్రికలల్లో సైతం ఎన్నో కార్టూన్‌లు జయదేవ్‌గారివి ప్రచురింపబడ్డాయి. అంతేగాక ఆస్ట్రేలియా, అర్జెంటైనా, బ్రెజిల్, బల్గేరియా, ఇటలీ, ఇరాన్, సైప్రస్, కొరియా, టర్కీ లాంటి దేశాలలో జరిగే అంతర్జాతీయ కార్టూన్ పోటీల్లో జయదేవ్ గారి కార్టూన్లు ప్రదర్శింపబడడమే గాక ఎన్నో బహుమతులు



డా॥ జయదేవ్ దంపతులను విజయవాడలో సత్కరిస్తున్న కళాసాగర్ మరియు రావెళ్ళ శ్రీనివాసరావు




## జగమెరిగిన కార్టూనిస్టు జయదేవ్



# లలితకళల రాజు-బాపిరాజు



"అతడు గీసిన గీత బొమ్మయి, అతడు పలికిన పలుకు పాటయి" అంటూ అడవి బాపిరాజుగారి గురించి ఆప్యాయంగా చెబుతారు విశ్వనాథసత్యనారాయణగారు. "ఆయన ఇంటి పేరు "అడవి". కానీ ఆయన మాత్రం సాహిత్యనందన వనం" అంటూ చెబుతారు కరుణశ్రీ.

ఎల్.ఆర్. వెంకటరమణ

సాహిత్యం నిర్దిష్ట దేశకాలాలలోని ఆర్థిక, రాజకీయ, మత, నైతిక, తాత్త్విక, కళారంగాలతో అన్యోన్య సంబంధంతో సామాజిక పాత్ర నిర్వహిస్తుందన్న దృష్టి నుంచి పరిశీలించి రచనలు చేసినవాడు అడవి బాపిరాజు. ఈ పనిని సమర్థవంతంగా చేయడానికి కావలసిన నేపద్యం కలిగిన వ్యక్తి అడవిబాపిరాజు. ఈయన కవి, నవలాకారుడు, చిత్రకారుడు, గాయకుడు, గ్రామీణ ప్రాంతాలు తిరిగీ ఆ ప్రాంతాల జన జీవనాన్ని అధ్యయనం చేసినవాడు, ఇలా చెప్పుకుంటూ పోతే మరెన్నో విషయాలలో బాపిరాజు గారు సిద్ధహస్తులు.

అడవిబాపిరాజుగారు 1895 అక్టోబర్ 8న పశ్చిమగోదావరి జిల్లా భీమవరం ప్రాంతాన కల సరిపల్లెలో జన్మించారు. కూల్డ్రేగారి శిష్యరికంలో సౌందర్యశాస్త్ర పాఠాలు నేర్చుకున్నారు. కవికొండల వెంకటరావు, దామెర్ల రామారావు, అడవిబాపిరాజు ముగ్గురు సహోధ్యాయులు. కవికొండలవారు కవిగా కలం పట్టారు. దామెర్లవారు చిత్రకారునిగా కుంచెపట్టారు. బాపిరాజుగారు కవి, చిత్రకారునిగా కలం, కుంచె రెండూ పట్టారు. మరోకళ అయిన గానం కూడా బాపిరాజుగారిని వరించింది. ఇదొక అదనపు అర్హత.

రాజమండ్రి ఆర్ట్స్ కళాశాల ప్రిన్సిపాల్ కూల్డ్రే వద్ద చిత్రకళా మెళకువలు నేర్చుకున్నారు. బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో ప్రమోదకుమార ఛటోపాధ్యాయ వద్ద నాలుగేళ్ళు చిత్రలేఖనాన్ని అభ్యసించారు. అంతేకాక 1935లో ఆంధ్ర జాతీయ కళాశాలకు అడవి బాపిరాజుగారు ప్రిన్సిపాల్‌గా కూడా ఉన్నారు. గుంటూరు కళాపీఠం నెలకొల్పి ఎందరో కళాకారులుగా తయారుచేశారు.

బాపిరాజుగారి చిత్రాలన్నీ నీటి రంగులతో వాష్ టెక్నిక్‌తో చేసినవే. ఈ విధానాన్ని ప్రయోద్‌కుమార ఛటోపాధ్యాయ వద్ద అభ్యసించారు. బాపిరాజు గారి రేఖలు, రంగులు ప్రాకృతిక ప్రమాణాలు పరిధిన దాటి, ఏవో ఉన్నత భావ లోకాలలో విహరింపచేస్తాయి.

బాపిరాజు గారి చిత్రాలలో అజంతా శైలి రేఖలున్నట్లు విమర్శకుల భావన, కొండపల్లి శేషగిరిరావు గారన్నట్లు– "బాపిరాజు గారి రేఖలు అమరావతి ఛాయలున్నట్లు"గా పేర్కొంటారు. బాపిరాజుగారు ప్రమోదకుమార వద్ద శిష్యరికం చేశారు. బాపిరాజు చిత్రాలలో ఈయన ప్రభావం బాగా కనబడుతూ, బెంగాలీ శైలీ చిత్రాలుగా ఉంటాయి. రాంభట్ల



బాపిరాజు కుటుంబం (1945),
బాపిరాజు, ప్రేమకుమారి (రెండవ అమ్మాయి),
సుభద్ర (భార్య) రాధా వసంత (పెద్దమ్మాయి)

కృష్ణమూర్తిగారు తన "సొంతకథ"లో "లావణ్యం, సుకుమారత అన్నవి అడవి బాపిరాజుగారి చిత్రకళా లక్షణాలు" అంటూ వ్యాఖ్యానిస్తారు.

జపాన్ చిత్రకళలోని వాష్ టెక్నిక్‌కు ప్రత్యేక స్థానముంది. మనదేశంలో వాష్ టెక్నిక్‌ను ప్రవేశపెట్టింది శాంతినికేతన్ వారే. ఇదే విధంగా తెలుగు చిత్రకళ తొలి నాళ్లలో ఈ కళ ఒక ప్రత్యేక ప్రయోగంగా ఈ విధానాన్ని బాపిరాజుగారు ప్రయోగించారు. ఆనాటి కాలంలో వాష్ టెక్నిక్‌లో విశిష్ట స్థానమందుకున్నవారు ముగ్గురు. ప్రమోదకుమార ఛటర్జీ, నందలాల్‌బోస్, అబ్దుల్ రెహమాన్ చాగ్తాయ్. బాతిక్ చిత్రకళలో ప్రసిద్ధిగాంచినవి. నందలాల్ బోస్ చిత్రాలు సూఫీ చిత్రకారునిగా అబ్దుల్ రెహమాన్ చుగ్తాయ్ ప్రసిద్ధులు.

బాపిరాజుగారు చిత్రాలలో ప్రముఖమైనవి. శశికల, స్వయంవరం, శ్వేతతార, సముద్రగుప్తుడు, మృత్యుంజయుడు, సూర్యదేవుడు, భారతి, నాగనృత్యం, వేణీభంగం, గోధూళి, తిక్కన, రుద్రమదేవి, బృందానగీతం, నటరాజ, ఆరాధన, లేపాక్షి బసవయ్య వంటి చిత్రాలు.

బాపిరాజు గారి చిత్రాలలో "శబ్దబ్రహ్మ" చిత్రం డెన్మార్క్ మ్యూజియంలో ఉంది. "భాగవత పురుషుడు" అన్న చిత్రం తిరువార్కూరు రాజభవనంలోనూ, "సూర్యదేవుడు" చిత్రం బీహార్‌లోనూ; "సముద్రగుప్తుడు" చిత్రం అల్లాది కృష్ణస్వామి అయ్యర్ గారింట్లోనూ వారి వారి ప్రత్యేక సేకరణలలోనూ ఉన్నాయి.

శ్రీలంకదేశంలోని సిగూరియా దేవాలయంలో మూడువందల అడుగుల ఎత్తుకల ఒక ఏకశిల ఉంది. ఆ శిల. మధ్య చిన్న దోనె. అందులో దాదాపు పద్నాలుగు వందల ఏళ్లనాటి కుడ్యచిత్రాలు ఉన్నాయి. వాటిని కాపీ చేయడానికి మద్రాసు పురావస్తుశాఖవారు నడుం బిగించారు. అపుడు ఈ కార్యాన్ని అడవిబాపిరాజు, వారి సమకాలీన చిత్రకారుడు పిలకా నరసింహమూర్తి, రచయిత శ్రీనివాసచక్రవర్తి, మీజాన్ పత్రికలో సహచరవ్యక్తి రాంభట్ల కృష్ణమూర్తిలు కలిసి ఈ కార్యాన్ని దిగ్విజయంగా పూర్తి చేయగలిగారు.

బాపిరాజు గారు చిత్రకారుడే కాక సాహిత్యకారుడు. కళాత్మక రచనలు ఎన్నో చేసి సాహిత్యాన్ని సుసంపన్నం చేశాడు. చిత్రలేఖన లక్షణాలను సాహిత్యంలో ఎంత అందంగా వాడుకోవచ్చునో అంత అందంగా వాడుకున్నాడు. బాపిరాజుగారి రచనలలో పొందుపరచిన పదాల క్రమం కేవలం పాత్ర రూపచిత్రణకే కాక, పాత్రయొక్క స్వభావ, ఉద్వేగాలను కూడా చిత్రలేఖనంలోని



సముద్రగుప్తుడు



వాగ్దేవి    చిత్రకారుడు : అడివి బాపిరాజు

సాంకేతిక పదాల ప్రమాణాలతో వర్ణిస్తాడు. సాహిత్యంలో అతడు వాడిన చిత్రలేఖన సాంకేతిక పదాలు మచ్చుకు కొన్ని: తప్తకాంచన వర్ణము, రక్తచందనము, స్పష్టరేఖారహిత, కుంకుమ వర్ణము వంటివి.

పాత్రలకు దృశ్యాలకు సందర్భానుసారంగా చిత్రలేఖన పదాలు వాడి చిత్రలేఖన లక్షణాలతో కూడిన ఒక విశిష్ట ప్రక్రియంగా సాహిత్య రచనలు చేసినవాడు బాపిరాజు. ఒక పాత్ర శరీరచ్ఛాయ గురించి వర్ణిస్తూ– "మేలిమి బంగారు రంగుతో కలిసిన తామర మెరుపుచ్ఛాయ" అంటాడు.

లలిత కళలు ప్రకృతి సందర్శన స్మృతుల వలన మానవ జీవిత సందర్భ స్మృతుల వలన వచ్చినవి. కాబట్టి ఆ కళలు ప్రకృతికి, మానవునికీ సన్నిహితంగా ఉండాలంటాడు. సర్వసాధారణంగా కళల్లో మనకు కనిపించేది బాహ్య సౌందర్యమేనని, ఆ సౌందర్యం వెనుక కళాకారుని మన:సౌందర్యం, ఆత్మసౌందర్యం కూడా ఉంటాయనీ, అలా ఉండాలనీ, ఈ మూడు సౌందర్యాలు మహోన్నత స్థితిలో సంగమించడమే సంపూర్ణాత్మక కళాత్మక స్థితి అంటాడు.

కళాకారుల సౌందర్యారాధన గురించి చెబుతూ బాపిరాజుగారు "కళాత్మకు సౌందర్యారాధనే మూలశక్తి. ఆ ఆరాధన ప్రకృతి సౌందర్యారాధనగా, మానవ సౌందర్యారాధనగా, మానవ సృష్టి సౌందర్యారాధనగా, మానవ చిత్త, గుణ, ఆత్మ సౌందర్యారాధనగా, మానవచిత్త సౌందర్యారాధనగా ఉంటుందని సౌందర్య వర్గీకరణ చేసి చూపాడు. ''మనుష్యునిలోని సౌందర్యారాధనయే శృంగార రసం" అంటూ సూత్రీకరించాడు.

లలిత కళలను ప్రస్తావన చేయని రచనే లేదు. కళలన్నిటినీ సమ్యక్ దృష్టిలో, ఇంత విస్తృతితో చేసిన మరో తెలుగు కవి, రచయిత లేడు. లలిత కళలను వివిధ కోణాలలో ఆవిష్కరించిన రచయిత బాపిరాజుగారు. వీరి రచనలలో ఆయన దృష్టికి రాని రంగమే లేదు. ఆర్థిక, చారిత్రక, మానసిక, వేదాంత, భౌతిక, రాజకీయ, కళాత్మక, మొదలైన ఎన్నో రంగాల సంబంధించిన విషయాలు చోటు చేసుకున్నాయి.












కొండపర్తి శేషగిరిరావుగారు తన 'శాంతి-కాంతి' అన్న గ్రంథంలో ప్రస్తావించినట్లు- "తుఫాన్" నవల కళల ప్రాథమిక అవగాహనకు తోడ్పడుతుందంటాడు. అలాగే బాపిరాజుగారు మరి కొన్ని నవలలు- హిమబిందు, నారాయణరావు, కోనంగి వంటి నవలలో శిల్పం గురించిన వివరాలు; "నారాయణరావు" నవలలో భారతీయం, పాశ్చాత్య సంగీత సంప్రదాయాలు ప్రస్తావించబడినవని" చెబుతారు.

బాపిరాజు గారు "తుఫాన్" నవలలో ప్రకృతికి-కళలకు సంబంధాన్ని తెలియజేస్తారు. అదేవిధంగా "నారాయణరావు" నవలలో కళాకారులకు ఉత్తేజాత్మక సందేశాన్నిస్తాడు. "గోనగన్నారెడ్డి" నవల చారిత్రక విషయ సంబంధమైనా అందులో జీవితానికి పరమావధి మోక్షమని, మోక్షానికి దారి జ్ఞాన పూర్ణ భక్తి అనీ, భక్తికి ఉత్తమ రూపం- కావ్య, సంగీత, నృత్య, చిత్ర, శిల్పాదులని పేర్కొంటాడు. "నరుడు" అన్న నవలలో కూడా కళల ప్రస్తావన ఉంది. ఇందులో చెప్పినట్లు "శరీరం ఒక చక్కని యంత్రమని, కళాకారుడు దాన్ని ఒక అత్యద్భుత సౌందర్య సృష్టిగా భావిస్తాడని" చెబుతాడు.



బాపిరాజుగారు కథకులుగా కూడా మంచి పేరు సాధించారు. సరళంగా, సంక్లిష్టత లేకుండా ఉంటాయి. వీరి కథలు. కవితాత్మకంగా, వర్ణనాత్మకంగా ఉంటాయి. సంప్రదాయాన్ని, నవ్యతను సమానంగా ఆదరించడం బాపిరాజు గారి కథలలో చూస్తాము. కానీ వర్ణనలతో అపుడపుడు కొన్ని కథలు వ్యాసాన్ని పొడిగించినట్లుంటాయని కొందరి భావన.

బాపిరాజు గారి నవల "నారాయణరావు", విశ్వనాధవారి "వేయిపడగలు" సి.పుల్లయ్యగారు నిర్మించిన "సతీఅనసూయ", "ధృవవిజయం" చలనచిత్రాలకు ఆర్ట్ డైరెక్టర్‌గా ఉన్నారు. "మీరాబాయి" చిత్రంలో బాపిరాజుగారి కళాదార్శనికతకు ఒక ఉదాహరణ. మీజాన్ పత్రికలో సంపాదకునిగా కూడా పని చేశారు. బాపిరాజుగారు లలిత కళలకు సంబంధించి దాదాపు మూడు వేల ఉపన్యాసాలు వివిధ సందర్భాలలో ఇచ్చినట్లు కూడా చెప్పబడింది. ఆయన రాసిన పాటలెన్నో లోకప్రసిద్ధి చెందినవి. దేవులపల్లివారి వారి "ఊర్వశీ" వలే; విశ్వనాథ వారి "కిన్నెరసాని" వలే బాపిరాజుగారి "శశికళ" ప్రసిద్ధి గాంచినది. బాపిరాజు గారు 1952 సెప్టెంబర్ 22న మద్రాసులోని రాయపేట ఆసుపత్రిలో తుదిశ్వాస విడిచారు.

*email: venkataramana_lanka@yahoo.com*

# ఖమ్మంలో కళా దివ్వెలను వెలిగిస్తున్న హ్యారీ నవీన్



- వెంటపల్లి సత్యనారాయణ

*కుక్కపిల్ల, అగ్గిపుల్ల. సబ్బుబిళ్ల కావేవి కళకు అనర్హం అన్నాడు శ్రీశ్రీ. స్పందించే గుణం, ఆస్వాదించే లక్షణం వున్నపుడు అంతటా సౌందర్యమే. ప్రతీదీ సౌందర్య భరితంగానే కనిపిస్తుంది. అందానికి చిన్న, పెద్ద అన్న తేడాలేమి లేవు. ఓ చిన్న మిణుగురు పురుగు సైతం తన చిరుప్రకాశంతో నిశిరాత్రిని చేదిస్తూ అందరినీ ఆకర్షించడం లేదూ! అలాగే రూపంలోనూ, పరిమాణంలోనూ ఎంతో బేధం వున్న సీతాకోకచిలుక మనుషుల్ని వారి మనసుల్ని మైమరిపించడం లేదూ! అనంతమైన ఈ ప్రకృతిలో తూనీగ, సీతాకోకచిలుకల్లాంటి చిరుజీవులు సైతం వాటివాటి స్థాయిలో మనుషుల్ని, మనసులను ఆహ్లాదపరుస్తూనే ఉన్నాయి. అందుకేనేమో అలాంటి చిరుజీవులనే నేపథ్యంగా తీసుకొని చిత్రాలు వేస్తూ, ఖమ్మంలో మరెందరో చిరు కళాకారులకు పునాదులు వేస్తూ కళాదివ్వెలను వెలిగిస్తున్నాడు ఆ చిత్రకారుడు. అతడే... హ్యారీ నవీన్.*

అవి నేను ఉద్యోగరీత్యా ఖమ్మంకి కొత్తగా వచ్చిన రోజులు. కాళ్ల అనే ఓ మహా మహాచిత్రకారుని వ్యక్తిగత చిత్రకళాప్రదర్శన అప్పటికే ఒకానొక సందర్భంలో అక్కడ వీక్షించే భాగ్యం కలిగింది. అప్పటినుండి ఆయన పరిచయం కోసం నేను చేస్తున్న ప్రయత్నం మాత్రం ఫలించలేదు. కానీ ఇంతలో 2004లో అనుకుంటా ఖమ్మం రెవెన్యూ గెస్ట్‌హౌస్‌లో మూడురోజుల పాటు చిత్రకారుడు హ్యారీ నవీన్ చిత్రకళా ప్రదర్శన అని పేపర్‌లో చూడడంతో చిత్రకళపై అమితాసక్తుడునైన నేను ఆ మధ్యాహ్నామే అక్కడకి వెళ్లాను.

అంతవరకూ ఓ గొప్ప భావాన్ని, సందేశాన్నీ ఓ చిత్రం ద్వారా మనం వ్యక్తం చేయాలి అనే భావనలో వుండి అదే రీతిలో చిత్రరచన చేసుకుంటూ పోతున్న నా ప్రయత్నానికి అంతకు ముందు నేను వీక్షించిన "కాళ్ళ" చిత్రకళాప్రదర్శనలోని చిత్రాలు ఊతమిస్తే, నేడు ఈ ప్రదర్శనలో చూసిన హ్యారీ నవీన్ చిత్రాలు నాకు విభిన్న భావాలను కలుగజేసాయి. కారణం అప్పటి హ్యారీనవీన్ చిత్రాల్లో భావాలేమీ లేవు. కేవలం రూపాలు, సృష్టిలోని



సాన్నిహిత్యం ఏర్పడింది. అతను కూడా అప్పుడప్పుడు మా ఆఫీసుకు రావడం ఏ కార్యక్రమం చేపట్టినా తప్పక వచ్చి చెబుతుండడంతో మా మధ్య స్నేహం మరింత దృఢం అయ్యింది.

ఇంతకీ ఏమిటి హ్యారీ చేసింది? ఎందుకు అతని గురించి చెప్పుకోవాలి అనుకుంటే నాకనిపిస్తుంది. సహజంగా ఖమ్మంలో చాలాకాలంగా చిత్రకళా వాతావరణం బాగానే వున్నట్లు తెలుస్తుంది. ఇక్కడ వినోద, రాఘవ తదితర సినిమా హాళ్లలో సైతం హాజీ, పర్వేజ్, సయిద్ లాంటి చిత్రకారుల చిత్రాలు మరియు రాజన్ బాబు లాంటి విఖ్యాత ఫొటోగ్రాఫర్ తీసిన గిరిజన జీవన ఫొటోలను అందంగా ప్రేములు చేయించి ఆ సినిమా హాళ్లలో పెట్టడం చూసిన నాకు నిజంగానే ఆశ్చర్యం కలిగింది. అయితే అవన్నీ ఎవరో వేసిన గొప్ప చిత్రాలకు నకళ్ళ కావచ్చు. కానీ ఆ కళా వాతావరణం వుండడం అన్నది గొప్ప విషయం. పైన చెప్పబడ్డ పర్వేజ్, హాజీ లాంటి వాళ్లంతా చిత్రాలకు అద్భుతంగా నకల్లు చేసేవారే గానీ సొంతంగా వేయడంలో శాస్త్రబద్ధమైన అవగాహన లేనివారు వాళ్లు. కానీ మిత్రుడు హ్యారీ మాత్రం అందుకు కొంత విభిన్నం. చిత్రకళలో మాస్టర్ డిగ్రీ చేసిన వారు కావడంతో తరచుగా అతడు వేసిన బొమ్మలతో ఖమ్మంలో ప్రదర్శనలు నిర్వహిస్తూ అందరికీ పరిచయం చేయడం

పుష్పాలు, పండ్లు, పక్షులు, అత్యల్ప ప్రాణులయిన క్రిములు, కీటకాలు, తూనీగ, సీతాకోకచిలుకలు, చెంగు చెంగున ఎగిరే జింకలు, సరోవరంలో విహరించే హంసలు, ఆ కాశంలో గుంపులు గుంపులుగా వలసపోయే పక్షులు, పిల్లలకు ప్రేమతో ఆహారాన్ని తినిపించే పక్షులు, ఇంకా సౌందర్యవంతమైన పుష్పాల కూర్పులు, ప్రకృతి దృశ్యాలు లాంటి విషయాలను చిన్న చిన్న హేండ్‌మేడ్ షీట్స్ పైనా, పెద్ద పెద్ద కాన్వాస్‌లపైనా జల, ఏక్రిలిక్ మరియు తైలవర్ణాలతో చిత్రించి అక్కడ ప్రదర్శించిన చిత్రాలు అంతవరకూ చిత్రకళపై నేను పెట్టుకున్న ఆలోచనలను తారుమారు చేశాయి.

చిత్రంలో పెద్ద భావాన్నేమీ చెప్పనవసరం లేదు. చిత్రించే వస్తువు సూక్ష్మమైనదైనా దానిని అందంగా ప్రామాణికమైన రీతిలో చిత్రిస్తే చాలు అన్న భావన అతని చిత్రాలు చూసినపుడు నాకు కలిగింది.

ఆ తర్వాత చిత్రకారుడి గురించి నలుదిక్కులా చూసాను. బహుశా నేను వెళ్లింది మధ్యాహ్న భోజన సమయం కావడం వల్లనో ఏమో అక్కడ ఇద్దరు ముగ్గురు తప్ప ఎవరూ లేరు. నేను ఆర్టిస్ట్ గురించి ఆరా తీస్తున్నంతలో ఓ కుర్రాడు నేనేనండి ఆర్టిస్ట్ హ్యారీ నవీన్‌ని, ఇటీవలనే ఎమ్.ఎఫ్.ఏ. పూర్తిచేసానంటూ పరిచయం చేసుకున్నాడు. మూడురోజుల ఈ ప్రదర్శనలో నేను ప్రతిరోజూ మధ్యాహ్న సమయంలో అక్కడికి వెల్లడమే కాక సాయంత్రం వేళ మా కుటుంబసభ్యులకు కూడా చూపిస్తూ ఉండడంతో హ్యారీకి నాకూ మంచి



నవీన్‌తో వ్యాసరచయిత వెంటపల్లి

ద్వారా ఖమ్మంలో ఎందరో ఆశక్తిగల విద్యార్థినీ, విద్యార్థులతో పాటు ఇక్కడ పేరు పొందిన ప్రముఖ డాక్టర్లు, సంపన్న వర్గాల వారు అతని వద్ద హాబీగా చిత్రకళను అభ్యసనం చేస్తుండడంతో కొద్దికాలంలో అతడు ఒక మంచి ఆర్ట్ టీచర్‌గా గుర్తింపును పొందాడు.

ప్రతీ ఏటా అతడు నిర్వహించే సమ్మర్ కాంప్‌లకు వచ్చే చిన్నపిల్లల్లో ఒకడిగా అతను కలిసిపోయి వాళ్లకి ఓపికగా చెప్పే విధానం, పిల్లలు కూడా హ్యారీ, హ్యారి అంటూ అతని వెన్నంటే వుండడం చూస్తూ వుంటే నిజంగా ఆశ్చర్యంగా కనిపిస్తుంది. కాన్వాస్ ప్రిపేర్ చేసుకోవడం మొదలు, వాటర్, ఏక్రిలిక్, ఆయిల్ తదితర రంగులు వాడే విధానం, బొమ్మలు వేసిన తర్వాత అందంగా ప్రేములు చేయించడమే గాక వాటితో ప్రతీ ఏటా చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించడం ద్వారా ఖమ్మంలో చిత్రకళకు ఒక ఉనికిని అతడు తీసుకువచ్చాడు అని చెప్పడంలో ఏమాత్రం సందేహం లేదు.



బాల్యం ఎంత సుకుమారమో ప్రకృతిలోని పుష్పాలు, తూనీగలు, సీతాకోక చిలుకలు లాంటి అల్పజీవులు కూడా అంతే సుకుమారం. అత్యంత సుకుమారమైన ఆ పసివయసులో మనిషి తన మనసుకు దగ్గరగా వున్న వాటితో ఆడుకోవాలని ఆశపడడం సహజం. అందుకే బాల్యంలో అందరం తూణీగ, సీతాకోకచిలుకల్లాంటి ప్రాణులతో స్వేచ్ఛగా ఆడుతూ కేరింతలు కొట్టడానికి ఇష్టపడతాం. ఇదే భావాన్నీ హ్యారీ "ది జాయ్" అన్న చిత్రంలో చక్కగా చిత్రీకరించాడు. కేచింగ్ బటర్‌ఫ్లై, ప్లైవిత్ డ్రాగన్‌ఫ్లై లాంటి మరికొన్ని చిత్రాలు కూడా ఇదే కోవకు చెందుతాయి.



మారుతున్న కాలంతో పాటు రోజురోజుకు పెరుగుతున్న సాంకేతికాభివృద్ధి మనిషికి ఎన్నో సౌకర్యాలను సమకూర్చడమే గాదు అదే స్థాయిలో ప్రకృతి నాశనానికి కూడా కారణమౌతుంది. గ్రామంలోని ఒకప్పటి పూరిల్లు స్థానంలో నేడు విస్తరిస్తున్న కాంక్రీటు భవనాలు పిచ్చుకల్లాంటి చిన్న చిన్న పక్షుల ఆ నివాసాలను అంతం చేయడమే గాదు, కిచకిచ ధ్వనులు, కిలకిల రావాలుతో కనిపించే సందడికి కారణమైన ఆ పూరిల్లు సూరులకు వేలాడదీసే వరికంకుల కుచ్చిళ్ళ తొలగింపు

కూడా అలనాటి ఆ అపురూప దృశ్యాలను కనుమరగయ్యేలా చేసాయి. దైనందిన జీవనంలో భాగమైపోయిన సెల్‌ఫోన్‌ల నుండి వచ్చే తరంగాలు ఆ చిరుపక్షుల ఉనికినే ప్రశ్నార్ధకం చేస్తున్నాయి. ఇలాంటి స్థితిలో కనుమరుగౌతున్న ఆ కమనీయ దృశ్యాలను కనీసం చిత్రాల్లో అయినా బందించి మనకు చూపించాలనే చిత్రకారుడి ప్రయత్నానికి ప్రతిరూపమే ఈ "అదృశ్యమౌతున్న అందాలు" చిత్రం. వేనిషింగ్ బ్యూటీ పేరుతో వేసిన ఈ చిత్రంలో చిన్న చిన్న చిట్టి పొట్టి పక్షుల అందమైన కదలికలను చాలా పొందికగా చిత్రించిన తీరు చూసే ప్రేక్షకుడి కంటికి హాయి గొలిపేలా వుంటుంది.



ఇక వివిధ రకాల ఆటపాటలతో హాయిగా గడిపే అందమైన బాల్యాన్ని "సమ్మర్ హాలిడేస్" అనే చిత్రంలో చూపిస్తే, నిరీక్షణ అనే చిత్రం ఆలోచింపజేస్తుంది. వృత్తిపరంగా ప్రస్తుతం ఖమ్మంలో శ్రీ చైతన్య స్కూల్ నందు పార్ట్‌టైమ్ ఆర్ట్ టీచర్‌గా పనిచేస్తున్న హ్యారి ఫ్రీలాన్సర్‌గా ఖమ్మం తదితర ప్రాంతాల్లోని వ్యక్తులు, సంస్థల ఆర్డర్లపై వాళ్లకు కావలసిన చిత్రాలను వేయడంలోనే ఎక్కువ సమయం గడుపుతున్నారు. ఇక్కడ కొందరి ప్రముఖుల ఇళ్లలోనూ, "ఇష్ఠ" లాంటి ప్రముఖ రెస్టారెంట్లలోనూ అతని ఒరిజనల్స్‌తో పాటు డాలి, వాంగో, రవివర్మ, దామెర్ల రామారావు లాంటి ప్రముఖ చిత్రకారుల ఒరిజినల్‌కు హ్యారీచే రీకాపీ చేయబడ్డ బారీ చిత్రాలు ఎన్నో వున్నాయి.

శ్రీమతి మేరి, హెబినేజర్ అనే దంపతులకు 06.10.1978న ఖమ్మంలో జన్మించిన హ్యారిలో మొదట చిత్రకళా బీజాలు నాటింది అక్కడ మౌంట్‌ఫోర్డ్ స్కూల్‌లోని డ్రాయింగ్ టీచర్ శ్రీ మల్లయ్య. ఆరవతరగతిలో ఉండగా బాలల దినోత్సవంకు జిల్లా స్థాయిలో నిర్వహించిన చిత్రకళా పోటీలలో ప్రథమ బహుమతి వచ్చింది. ఆపై B.F.A చేయడానికి తగిన శిక్షణ ఇచ్చిన వ్యక్తి తనకు స్వయాన బాబాయ్, JNTUలో చిత్రకళోపాధ్యాయుడు మరియు ప్రముఖ చిత్రకారుడైన స్టాన్లీ సురేష్ 1994–2000లలో B.F.A పూర్తిచేసిన హ్యారి హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటిలో M.F.A కూడా పూర్తి చేసాడు. ఆపై తన వ్యక్తిగత చిత్రకళా



మెళకువలను నేర్చుకుంటున్న ఖమ్మంలో ప్రముఖ డాక్టర్లయిన శ్రీమతి వాసిరెడ్డి నిర్మల, బి.సరోజిని, వి. చంద్రావతి, డా॥బాబూరత్నాకర్‌లతో పాటు గృహిణులయిన శ్రీమతి జి. చంద్ర, బి.రేణుకారెడ్డి, మాధవి మరియు హేమలత లాంటి వాళ్లతోనే కాక ప్రదర్శనలకు సుముఖంగా ఉండని ప్రఖ్యాత చిత్రకారుడు కాళ్ళ మరియు ఖమ్మం జిల్లాలో అతిమారుమూల ప్రాంతమైన చర్లలో నివసించే చిత్రకారుడు బీర శ్రీనివాస్ లాంటి వాళ్లతో కూడా చిత్రకళాప్రదర్శనలు పెట్టించడం ద్వారా ఆయా చిత్రకారులతోనే గాక, ఖమ్మం పరిసర ప్రాంతాలలోనూ చిత్రకళా స్ఫూర్తిని రగిలిస్తున్న వ్యక్తి హ్యారినవీన్.

ప్రదర్శన 2000వ సం॥లో ఖమ్మం జూబ్లీక్లబ్‌నందు నిర్వహించడం జరిగింది. ఆ పిదప 2000- మరియు 2002లో కూడా తన చిత్రాల ప్రదర్శన ఏర్పాటు చేసారు. 2003లో డయారా ఆర్ట్ గేలరీ హైదరాబాద్ నందు గ్రూప్‌షోలో పాల్గొన్నాడు. 2004లో జాతీయస్థాయిలో 24మంది చిత్రకారులతో కలిసి స్టేట్‌ఆర్ట్ గ్యాలరీ హైదరాబాద్ నందు 24 గంటలు చిత్రప్రదర్శనలో చిత్రాలను ప్రదర్శించారు. 2005లో కోనసీమ చిత్రకళా పరిషత్ జాతీయ చిత్రకళాపోటీలలో గోఖలే అవార్డును అందుకున్నారు.

ఇక వయసుతో నిమిత్తం లేకుండా తన వద్ద చిత్రకళా

ఇక చిత్రాలు వేయడం అన్నది కేవలం మన ఆత్మ సంతృప్తికోసమే అంటూ అప్పటికి 16 సం॥లుగా నా భావాలను చిత్రాలుగా వేసుకుంటూ వాటిని బీరువాల్లో బద్ధంగా దాచుకున్న నా చిత్రాలను సైతం చూసి వాటిని అందంగా ప్రేములు చేయించి చిత్రకారుడు కాళ్ళ మరియు H.C.U లో ఎమ్.ఎఫ్.ఏ. చేసిన శిల్పకళా విద్యార్థి "ఆదిశేషు లాంటి వాళ్లతో తొలి సారిగా 2006 సెప్టెంబర్‌లో సీక్వెల్ రిసార్ట్స్ ఖమ్మం నందు నా చిత్రాలను అప్పటి ఖమ్మంజిల్లా కలెక్టర్ శశిభూషన్‌కుమార్ గారిచే ప్రారంభించడం ఓ మరిచిపోలేని అనుభూతి. చిత్రకారుడిగా హ్యారీ చేయవల్సిన కృషి ఇంకా ఎంతో వుంది. అయినా ఒక దివ్వె మరిన్ని దివ్వెల్ని వెలిగించిన చందాన ఖమ్మంలో మరిన్ని చిత్రకళా దీప్తులకు కారణమౌతున్న హ్యారీ నవీన్ కృషి నిజంగా అభినందనీయమైనది.





*email: snventapalli@gmail.com*

Hobby

2

# "తెలుగు పత్రికలు-తొలి సంచికలు"

## (1980-2010)

– పులిపాటి దుర్గారావు,
బి.ఎస్‌సి, బి.ఇడి.

తెలుగు సాహిత్యంలో పత్రికలకు ప్రత్యేక స్థానం ఉంది. కథ, కవిత, నవల, కార్టూన్లు, కాలక్షేపం కబుర్లు, సినిమా సంగతులు. ఇలా ఒకటేమిటి పలు అంశాలతో పలురకాల పత్రికలు వచ్చాయి. వస్తూనే ఉన్నాయి. మనలో ప్రతీ ఒక్కరు ఎన్నో పత్రికలు కొంటూంటాం కాని, ఇప్పుడు మనం చెప్పుకోబోయే వ్యక్తిలో ఒక ప్రత్యేకత ఉంది. గత మూడు దశాబ్దాలనుండి తెలుగులో వెలువడిన అనేక పత్రికల మొదటి సంచికలను సేకరించడమే కాకుండా, నేటికీ వాటిని భద్రపరచి 'లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్స్'ను సాధించారు. ఆ అనుభవాలను వారి స్వీయ రచనలో 64కళలుడాట్‌కాంకు అందిస్తున్నారు పులిపాటి దుర్గారావు గారు మీ కోసం...

–ఎడిటర్

ఈ సంచికల ప్రస్థానం చూస్తే చాలా పత్రికకలు "మఖలో పుట్టి...' అన్న రీతిలో రెండో, మూడో పత్రికలతోనే మాయమవుతుంటాయి. మరికొన్ని వ్యవస్థ మార్పుల కోసం అంటూ వస్తాయి. కానీ ఆ పత్రిక అవస్థలతో మూతపడటం, మరికొన్ని నిర్వహణా లోపం, పోటీ ఇత్యాది కారణాలతో మాయమైపోతుంటాయి. కానీ కాలక్రమంలో ఈ రంగంలో వచ్చిన మార్పు ముఖ్యంగా ముద్రణ విషయాన్ని స్పష్టంగా పరిశీలించవచ్చు. నూతన సాంకేతిక నైపుణ్యాన్ని ప్రచురణలో చూపించి రంగురంగుల్లో స్పష్టమైన ముద్రణతో వస్తున్నప్పటికి ప్రసార సాధనాల వలయంలో పుస్తకాలు నిలబడలేకపోతున్నాయి.

నా దగ్గరున్న తొలి సంచికలలో బాగా పాతదైనది 'కృష్ణాపత్రిక' తొలి సంచిక నకలు– పక్షపత్రికగా 1902లో ఫిబ్రవరి 1న ప్రారంభమైన కృష్ణాపత్రిక –1990 జనవరి 25 నుండి దినపత్రికగా మార్పు చెందిన సందర్భంగా నాటి తొలి సంచిక మొదటి పేజీను ప్రచురించారు. దీనిలో మనం పరిశీలిస్తే "ది కృష్ణాపత్రిక" అని ఆంగ్లంలో మచిలీబందరు అని, తారీఖును 1 ఫిబ్రేవరుగా పేర్కొన్నారు. అదే విధంగా డెక్కన్ క్రానికల్ పత్రిక కూడా– 1978 సెప్టెంబర్‌లో విజయవాడ నుండి 2 రూ॥ల వెలతో ఉషారాణి గారి సంపాదకత్వంలో ప్రారంభమైన "మహిళా ప్రభ" పూర్తిగా మహిళల కోసమే రూపొందించారు. పత్రికలో స్త్రీలకు అవసరమైన ఆరోగ్య సలహాలు, చైతన్యం కల్గించే వ్యాసాలతో "మహిళల తొలినేస్తం" గర్వంగా ప్రకటించారు. తెలుగు పత్రికా రంగంలో సంచలనాలను సృష్టించిన ఈనాడు పత్రిక ప్రవాస ఆంధ్రులకోసం తెలుగునాట జరిగిన వార్తావిశేషాలు, మరియు సాహిత్యం, కళలు, ఇలా అన్ని విషయాలను క్రోఢీకరించిన పక్షపత్రిక "ఈనాడు తెలుగునాడు" చక్కటి అచ్చులో తయారై ఆకట్టుకునేలా తీర్చిదిద్దారు. వెల రెండు డాలర్స్.

విజయవాడ విద్యా రంగంలో మాంటిసోరి విద్యా విధానాన్ని ప్రవేశపెట్టిన శ్రీమతి వి. కోటేశ్వరమ్మ మహిళల కోసం ప్రారంభించారు. ఇల్లు–ఇల్లాలు, గీతాగారు గీసిన రాణి రుద్రమదేవి ముఖచిత్రంలో వచ్చిన ఈ పత్రిక వెల 3రూ. 50పై॥. అభ్యుదయ పంథాలో మహిళలను నడపాలన్న తన ఆలోచనలతో ఈ పత్రిక

వుంటుందని కోటేశ్వరమ్మ సంపాదకీయంలో పేర్కొన్నారు. తొలి సంచిక కావటంతో అభినందన ప్రకటనలు ఈ సంచికలో ఎక్కువే వున్నాయి.

ఏప్రిల్ 1980లో వచ్చిన మరో ప్రత్యేక పత్రిక బాలజ్యోతి, ఆంధ్రజ్యోతి, దిన, వార జ్యోతిచిత్ర సినీ పత్రికల ప్రచురణల నుండి వచ్చిన పిల్లల పత్రిక బాలజ్యోతి, పిల్లల పత్రికలు అనగానే చందమామ, బాలమిత్ర గుర్తుకు వస్తాయి. కానీ వాటి ఆకారాలకు భిన్నంగా 1/8 డెమ్మీ సైజ్‌లో నిలువుగా, బాపు గీసిన అందమైన బొమ్మతో వచ్చింది. పిల్లల్ని ఆకట్టుకునేలా తీర్చిదిద్దారు సంపాదకులు నండూరి రామ్మోహనరావుగారు.




జనవరి 1981లో నూతన సం॥ ఆరంభంలో నూతన ప్రపంచంలోకి ప్రవేశించండి అంటూ రేపు పత్రిక ద్వారా అందరికీ పరచితులైన సి. నరసింహారావు “నూతన ప్రపంచం” అనే పేరుతో రూ. 2/–తో మాసపత్రికను ప్రారంభిస్తూ ఇలాంటి పత్రిక మన భారతీయ భాషలలో మరొకటి లేదు అని ప్రకటించారు. వాస్తవం మాత్రమే ఇందులో చదువుతారన్నారు ఆయన. వినూత్నంగా తీర్చిదిద్దారు ఆయన. తెలుగు తల్లి ముఖచిత్రంతో మారెళ్ళ సుబ్బారావుగారి సంపాదకత్వంలో సెప్టెంబరు 1981లో వచ్చిన మాసపత్రిక తెలుగు బాట. రాష్ట్రానికి జరుగుతున్న అన్యాయాలను పాఠకులకు అందించాలన్నదే ఈ పత్రిక ధ్యేయంగా సంపాదకీయంలో పేర్కొన్నారు.

డిసెంబర్ 15, 1982 నెల్లూరులో సాయంకాలం దినపత్రిక “జమీన్‌రైతు” ప్రారంభం (అంతకు ముందు వారపత్రిక) నెల్లూరు జిల్లాలో ఆదరణ బాగా వున్న వార్తా వారపత్రిక సాయంకాలం దినపత్రికగా 25 పైసలతో కేవలం నెల్లూరు జిల్లా వార్తలకే పరిమితం అన్నారు సంపాదకులు శ్రీరామమూర్తి. “ఎన్‌కౌంటర్” దశరధరామ్‌గా అందరికీ తెల్సిన పింగళి దశరధరామ్ యువతరం కోసం 3రూ॥లతో విజయవాడ నుండి ప్రారంభించిన “యువ ప్రపంచమ్” మాసపత్రిక యువతకు దిశా నిర్దేశం చేస్తాం అంటూ, ప్రపంచం మొత్తాన్ని ఎప్పటికప్పుడు కుదించి మీ చేతుల్లో పెడతాం అన్నారు. పత్రికలో శీర్షికలు కూడా కాస్త భిన్నంగా ఆలోచనాత్మకంగా రూపుదిద్దారు.




తెలుగువారి పండుగ ఉగాదికి 1983 ఏప్రిల్‌లో 1రూ॥50పై॥ ధరతో వచ్చిన సచిత్ర వారపత్రిక “తెలుగునాడి’ తెలుగువాడి వాడి రుచి చూపించిన కందుకూరి, గురజాడ, గిడుగుల చిత్రాలను “కేతా” ముఖ చిత్రంగా అలంకరించగా, హైదరాబాద్ నుండి భూపతి కోటేశ్వరరావు




సంపాదకత్వంలో వచ్చిన ప్రారంభ సంచికలో దివాకర్ల, దాశరథి, సినారె వంటి ప్రముఖుల వ్యాసాలు, కవితలు బాగున్నాయి. ఇదే సంవత్సరం కమెండో పత్రికవారు పిల్లల కోసం 2రూ 50పై॥లతో ''యంగ్ హీరో'' మాసపత్రిక తీసుకొచ్చారు. బాలల్లో సృజనాత్మకశక్తిని పెంపొందించేందుకు మా పత్రిక కృషి చేస్తుందని సంపాదకులు వినుకొండ నాగరాజు తెలిపారు.

1984వ సంవత్సరం తెలుగు పత్రికారంగంలో ప్రత్యేకంగా చెప్పుకోతగిన సంవత్సరం ఎందుకంటే దాసరి నారాయణరావు ప్రారంభించిన ఉదయం, ఈనాడు సంస్థ నుండి ఆంగ్ల దినపత్రిక "న్యూస్ టైం", స్వాతి మాసపత్రిక నుండి స్వాతి వారపత్రిక, కందనాతి చెన్నారెడ్డిగారు ప్రాంభించిన ఈతరం రాజకీయ పత్రిక, పల్లకి వారపత్రిక, ఆంధ్రపత్రిక నుండి కలువబాల పక్షపత్రిక, ఇంకా కొన్ని పత్రికలు ప్రారంభం అయ్యాయి. వాటిలో ప్రస్తుతం స్వాతి వారపత్రిక మాత్రమే నిలబడగా మిగిలినవి సంచలనం సృష్టించిన ఆగిపోయాయి. 70పైసలతో న్యూస్‌టైం ఆంగ్ల దినపత్రిక, రాజకీయ పత్రికలు వారం వారం, "సూపర్ పాలిటిక్స్, సుప్రభాతం, ఈతరం, టెర్రర్, ప్రజాధికారం, వంటి రాజకీయ పత్రికలు ఆరంభం అయ్యాయి. కారణం ఎన్నికల వాతావరణం. యివి అన్ని ఓడిపోయిన పార్టీల్లాగా తర్వాత అంతర్ధానం అయ్యాయి. ఎ.బి.కే. ప్రసాద్‌గారి సంపాదకత్వంలో వచ్చిన ఉదయం దినపత్రిక పత్రికారంగానికి శుభోదయంగా కొంతమంది భావించారు. బాపు గీసిన వినాయకుని ముఖ చిత్రంలో 2రూ ధరతో విజయవాడ నుండి వేమూరి బలరాం ప్రారంభించిన స్వాతి సపరి (సచిత్ర అన్న మూస నుండి విభిన్నంగా) వారపత్రిక ''నవరసాలున్న'' పత్రికగా రూపుదిద్దకుంది. తెలుగు పత్రికలను తీర్చిదిద్దిన కొందరు ప్రముఖులు వ్యాసం ద్వారా తెలుగు పత్రికా రంగ ప్రముఖులను స్మరించుకోగా కొసమెరుపుగా కొసపేజీలో డివి నరసరాజు గారిచే ''నవరస సమాధానం'' శీర్షిక ఆకట్టుకునేలా వుంది.

ఆంధ్రభూమి వారపత్రికకు మాస్‌క్రేజ్ తెచ్చిన కందనాతి చెన్నారెడ్డి ప్రారంభించిన 'పల్లకి సచిత్ర వారపత్రిక కూడా బాపు గీసిన ముఖచిత్రమే. ప్రముఖ రచయితల సీరియల్స్, రచనలు, వినూత్నంగా శీర్షికలు, అంతే కాక చిత్రపల్లకి పేరుతో విడిగా అనుబంధ సంచిక ప్రత్యేక ఆకర్షణ.

మరో ప్రత్యేక పత్రిక ముత్యాల సరాలు, భానుమతి, రావికొండలరావు గార్లు వ్రాసిన కథలు, చిన్ని పుస్తకం, వెల. 1రూ. మాత్రమే. బాగుంది, కానీ నిలవలేదు.

1985లో కూడా రాజకీయ పత్రికలు చాలా వచ్చాయి. వాటిలో టుడేపాలిటిక్స్, ఆంధ్రతుగ్లక్, రుద్రభూమి, విపంచి, నవయువత ఆరంభం అయినాయి. కేవలం ఎన్నికలకే పరిమితం అయ్యాయి అనిపిస్తుంది. ఈ సంవత్సరం ఇంకా సినీ మసాలా పత్రికలు చాలా ప్రారంభం అయ్యాయి. అవి సినీ డైమండ్, స్టార్ పాలిటిక్స్, సినీ టైగర్, స్టార్ సీక్రెట్, క్లిక్ వచ్చాయి. వాటిలో కొన్ని ఇంకా వస్తున్నాయి. ఈ సంవత్సరం ప్రముఖ పత్రికలైన ఆంధ్రపత్రిక సంస్థ నుండి బాలరంజని, విశాలాంధ్ర ద్వారా చిన్నారి లోకం పిల్లల పుస్తకాలు వచ్చాయి. ఇంకా ఈ సంవత్సరం




చెప్పుకోదగిన పత్రిక 'శ్రీవాణి'. మచిలీపట్నం ప్రముఖులైన కొరగిరి కృష్ణ మోహనరావు గారి ఆధ్వర్యంలో సాంస్కృతిక మాసపత్రికగా శ్రీవాణి జనవరి నుండి రూ. 2.50పై ప్రారంభమవగా దీనిలో ప్రముఖుల కథలు, వ్యాసాలున్నాయి. అలాగే బందరు నుండే సాహితి మిత్రుల ఆధ్వర్యంలో రావి రంగారావు గారి సంపాదకత్వంలో "యువ కవిత" త్రైమాసిక పత్రిక వచ్చింది. ఇంకా హైదరాబాద్ నుండి కాకతీయ పబ్లికేషన్స్, డి. భీమ్‌రెడ్డి సంపాదకత్వంలో 17.5.1985న వచ్చిన సచిత్ర వారపత్రిక 'మయూరి'. సినీనటి జయసుధ వ్రాసిన సీరియల్ ఆకర్షణ.

1986వ సంవత్సరంలో కూడా ప్రముఖ ప్రచురణ సంస్థల నుండి సినీ పత్రికలు, వార పత్రికలు వచ్చాయి. మామూలుగానే రాజకీయ పత్రికలు 'తెలుగు వెలుగు' (ఈశ్వర గీసిన ఎన్.టి.ఆర్. ముఖ చిత్రం చాలా బాగుంది). పెన్ ఫయిట్, నాసీమ, ఫిల్మ్ ఎన్‌కౌంటర్ వెలువడగా సినీ పత్రికలు దాసరి ఆధ్వర్యంలో శివరంజని, ఆంధ్రపత్రిక నుండి సినిమా రంజని, మరో పత్రిక జిగిబిగి వచ్చాయి. శివరంజనిలో విశ్వరూపం పేరుతో మెగా పోస్టర్ ఆ రోజుల్లో సినీ అభిమానులకు పెద్ద అట్రాక్షన్, చిరుమువ్వలు బాలపత్రిక, వెన్నెల మాసపత్రిక అపరంజి, కథాకళి వారపత్రికలూ వచ్చి మాయమయ్యాయి. అయితే ఈ సంవత్సరం సంచలనం ఏమంటే ప్రముఖ రచయిత మల్లాది వెంకట కృష్ణమూర్తి సంపాదకత్వంలో వచ్చిన వారపత్రిక స్రవంతి. మిగిలిన అన్ని పత్రికలు 2రూ, 3/- వుంటే ఇది కేవలం 1రూ॥ మాత్రమే కావటం, అన్ని పాఠకులకు ఆసక్తి కల్గించే, పాల్గొనే శీర్షికలు దీని ప్రత్యేకత, చాలాకాలం నడిచిన పత్రిక యిది. పల్లకి సంస్థ నుండే తరంగిణి 4,9, 1986న ఆరంభం కాగా, దాసరి ఉదయం సంస్థ నుండి ఉదయం వీక్లి 4రూ॥ ధరతో ఎక్కువ పేజీలతో రంగు, హంగులతో వెలువడింది.

1987లో "ఆంధ్రలక్ష్మీ" చిత్రాన్ని గంగాధర్ గీయగా ఆ ముఖ చిత్రంతో ఒంగోలు నుండి "ఆంధ్ర దీపిక" ఆదర్శ మాసపత్రిక, సుమనం మాసపత్రిక వెలువడ్డాయి.

1988లో దాసరి ఉదయం వీక్లి 4రూ॥ నుండి రూ1-25పై॥లకే విడుదల చేశారు. 1.8.87న సమగ్ర పక్షపత్రిక కృష్ణాఎక్స్‌ప్రెస్ గుడివాడ నుండి 4 పేజీలతో ప్రారంభమైంది.

*( రాబోయే సంచికలో మరికొన్ని విశేషాలు)*



# పద్మశ్రీ పొందిన తొలి కళాదర్శకుడు

# తోటతరణి

**ఆయన మండుటెండల్లో మంచుపర్వతాలను సృష్టిస్తాడు. స్వర్గలోకాన్ని దివినుంచి భువికి దింపుతాడు.**

**ముంబాయ్ వీధులనుచెన్నై స్టూడియోలోకి తీసుకొస్తాడు పగలే వెన్నెలను కురిపిస్తాడు. సృష్టికి ప్రతి సృష్టి చేయడంలో 'రీల్' విశ్వామిత్రుడిగా పేరొందిన ఆయనే సుప్రసిద్ధ కళాదర్శకుడు 'పద్మశ్రీ తోటతరణి. సినిమా అంటే హీరోహీరోయిన్లు, దర్శకుడి గురించి మాత్రమే మాట్లాడుకునే సగటు ప్రేక్షకుడు సైతం తోటతరణి పేరు చూసి సినిమాకు వెళ్లే స్థాయికి కళాదర్శకత్వాన్ని తీసుకెళ్లిన ఘనుడాయన. 200కు పైగా సినిమాలకు తన సహజసిద్ధమైన సెట్లతో జీవం పోసిన తరణి 'పద్మశ్రీ' పొందిన తొలి కళాదర్శకుడు.**


తోటతరణి

నా గురించి చెప్పాలంటే ముందుగా మా నాన్నగారినే తలుచుకోవాల్సి వుంటుంది. ఎందుకంటే కళాదర్శకుడిగా ఆయన వారసత్వాన్నే నేను అందిపుచ్చుకున్నాను. మాది బందరు. మా నాన్నగారైన తోట వెంకటేశ్వరరావుగారు ఎన్టీఆర్ సినిమాలకు కళాదర్శకత్వం చేశారు. నిజానికి మా నాన్నగారు సినిమాల్లో నటించాలనే కోరికతో మద్రాస్‌కు వెళ్లారట. కానీ అనుకోకుండా తన పెయింటింగ్ చదువు ఆయనను కళాదర్శకుణ్ణి చేసింది. 'మల్లీశ్వరి' సినిమాకు ఎ.కె. శేఖర్ గారి దగ్గర అసిస్టెంట్‌గా స్కెచ్‌లు వేసి ఆ తర్వాత పాండురంగ మహత్మ్యం, 'జయసింహ' లాంటి సినిమాలతో కళాదర్శకుడిగా గుర్తింపు తెచ్చుకున్నారు. గోఖలే, కళాధర్, శాంతారామ్‌లు ఆయన సమకాలీనులు. మా కుటుంబం విషయానికొస్తే మాది పెద్ద ఫ్యామిలీ. ఎనిమిదిమంది సంతానం. అక్క తర్వాత నేను రెండో వాణ్ణి. మా నాన్నగారు స్కెచ్‌లు వేసేందుకు, సెట్ డిజైనింగ్ చేసేదుకు స్టూడియోలకు వెళ్తూ తోడుగా నన్ను తీసుకెళ్లేవారు. అప్పుడు నాకు సరిగ్గా నాలుగేళ్లు. నాన్న పనిచేస్తుంటే నేను చుట్టూ చూస్తూండేవాణ్ణి. నాకు డ్రాయింగ్‌పై ఆసక్తి కలగడానికి బహుశా ఈ వాతావరణమే కారణమేమో. ఆరేడేళ్ల వయసప్పుడు ఎప్పట్లానే ఓ స్టూడియోకు వెళ్లాను. మాన నాన్నగారు షరా మామూలుగా పనిలో పడ్డారు. నా దృష్టి అక్కడే షోకేష్‌లో వున్న బుద్ధుడి బొమ్మపై పడింది. చూడగానే ఆ బొమ్మ నన్ను ఆకట్టుకుంది. నా జేబులు తడిమిచూసుకుంటే అణాబిళ్ల దొరికింది. దాన్ని తీసుకుని స్టూడియో బయట వున్న ఓ షాపులో ఇస్తే రెండు చాక్‌పీసులు వచ్చాయి. చాలా బొమ్మలు వేసుకోవచ్చు కదా అనుకున్నాను. వాటితో బుద్ధుడి బొమ్మను నేలపైనే పెద్దగా గీశాను. ఇంతలో మా న్నాగారు వచ్చి నేను వేసిన బొమ్మనే చూసి నన్ను అభినందించారు. మరుసటి రోజు మెహతా డ్రాయింగ్ బుక్స్ తీసుకొచ్చి ఇచ్చారు. సాధారణంగా ఆ డ్రాయింగ్ బుక్‌లోని బొమ్మలను నెలరోజుల పాటు నేర్చుకోవాలి. కానీ నాకు పట్టుదల కాస్త ఎక్కువగా వుండేది. సాయంత్రం అయ్యేసరికి అన్ని బుక్స్ ఫినిష్ చేశాను. కళ పట్ల నాకు ఆసక్తి కలగడానికి ఇది తొలిమలుపుగా చెప్పుకోవచ్చు.

ఆ తర్వాత సెట్ డిజైనింగ్‌లో మానాన్న గారికి సాయం చేస్తూనే చదువు కొనసాగించాను. రాత్రంతా సెట్లో పనిచేస్తూ పొద్దున్నే కాలేజీకి వెళ్లేవాణ్ణి. అప్పట్లో ఎస్.డి.లాల్, ఎస్.ఎస్.లాల్ వంటి దర్శకులు పెద్ద పెద్ద క్లబ్ సెట్స్ వేయించేవారు. నేను కుర్రాణ్ణి కాబట్టి వాటిని రూపొందించడంలో చురుగ్గా పాల్గొనేవాణ్ణి. నాన్నగారు ఆదేశాలకు అనుగుణంగా 100 అడుగుల సెట్లను వేసేవాళ్లం. దూండీ, సుందర్‌లాల్ నెహతాల సినిమాలకు కూడా సెట్లు అద్భుతంగా వేసేవాణ్ణి. అయితే సినిమా సెట్ల విషయంలో నా కన్నా తమ్ముడు తోట హేమచందర్ ఎక్కువ అనుభవం

సంపాదించుకున్నాడు. అదే సమయంలో మద్రాస్‌లోని గవర్నమెంట్ ఆర్ట్స్అండ్‌క్రాఫ్ట్స్ కాలేజీలో నా ఫైన్‌ఆర్ట్స్ కోర్సు అయిపోయింది.

అప్పట్లో అడ్వర్టయిజింగ్ ఏజెన్సీలకు బాగా డిమాండ్ వుండేది. అందుకే బొంబాయికి వెళ్లి బాబీ శిష్టా కంపెనీలో చేరాను. ఓ వైపు అడ్వర్టయిజ్‌మెంట్లకు పనిచేస్తూనే మరోవైపు బాలీవుడ్ కళాదర్శకుడు సురేంద్రగారి సినిమాలకు అసిస్టెంట్‌గా వెళ్లేవాణ్ణి. అయితే నా పెయింటింగ్‌లు అద్భుతంగా వున్నాయని, అందులోనే కృషి చేయమని ఆయన నన్ను తిరిగి మద్రాస్‌కు పంపించారు. ఆర్ట్‌పై వున్న మమకారంతో అందులో మరిన్ని మెలకువలు నేర్చుకునేందుకు పారిస్‌కు వెళ్లాను. అక్కడే ప్రింట్‌మేకింగ్, గ్రాఫిక్స్ ఆర్ట్‌లో శిక్షణ పొందాను. తిరిగి మద్రాస్‌కు చేరుకున్న తర్వాత ఎప్పటిలాగే నాన్నగారికి అసిస్టెంట్‌గా సెట్ డిజైనింగ్ చేస్తూనే పెయింటింగ్స్ వేయడం మొదలెట్టాను.

సింగీతం శ్రీనివాసరావుగారు తాళ్లూరి రామేశ్వరితో ఓ సినిమా తీస్తూ సెట్ కోసం పిలిచారు. ఆ సమయానికి నాన్నగారు, తమ్ముడు అందుబాటులో లేకపోవడంతో నేను వెళ్ళాను. నన్ను చూసిన ఆయన 'నువ్వొచ్చావేమిటయ్యా.... మీ నాన్నను గానీ, తమ్ముణ్ణిగానీ పంపించు' అంటూ నన్ను వెనక్కి పంపించేశారు. ఏం చేయను? కొంతకాలం తర్వాత నాగభూషణంగారు నటించిన 'నాటకాలరాయుడు'కు ఆర్ట్‌డైరెక్షన్ చేయాల్సిందిగా ఆఫర్ వచ్చింది. కానీ చివరి నిమిషంలో మళ్లీ మా నాన్నగారినే తీసుకున్నారు. దీంతో మరోసారి అసిస్టెంట్‌గానే సరిపుచ్చుకోవాల్సి వచ్చింది. నేను స్వంతంగా తొలి సారి ఆర్ట్‌డైరెక్షన్ చేసిన సినిమా దేవదాసు కనకాల గారి 'నాగమల్లి'. అయితే నా కెరీర్‌ను మలుపు తిప్పింది మాత్రం రెండో సినిమా 'అమావాస్య చంద్రుడు'. కమలహాసన్ హీరోగా నటించిన ఈ సినిమాకు ఆర్ట్ డైరెక్టర్‌గా నాకు చక్కని పేరు వచ్చింది. తోట వెంకటేశ్వరరావు కొడుకుగా కాకుండా తోటతరణిగా నా పేరు మారుమ్రోగింది. ఇక అక్కడి నుంచి నా కెరీర్ వేగం పుంజుకుంది. చాలా సినిమాలు చేశాను.

ఈ క్రమంలో మణిరత్నం తన తొలిచిత్రం 'మౌనరాగం'కు నన్ను ఆర్ట్‌డైరెక్షన్ చేయాల్సిందిగా కోరారు. ఆ సినిమాతో కెమెరామాన్ పి.సి.శ్రీరామ్‌కు, దర్శకుడు మణిరత్నంకు, నాకు బ్రాండ్ ఇమేజ్ వచ్చింది. ఇప్పటికీ 'అందులోని ఎద్దులబండి పాట గొప్పదనం నీదేరా' అంటాడు పి.సి.శ్రీరామ్. మణిరత్నం ఆగమనంతో ఆర్ట్‌డైరెక్టర్‌గా నా జీవితం అద్భుతమైన మలుపు తిరిగింది. ఘర్షణ, అంజలి, నాయకుడు, బొంబాయి, దొంగ



## తోటతరణి చిత్రాలు

చెన్నయ్‌కు చెందిన ఈ చిత్రకారుడు 1949 డిసెంబర్ 16న జన్మించారు. పేరుమోసిన జాతీయ, అంతర్జాతీయ చిత్రకళా సంస్థలలో శిక్షణ పొందారు. 1971లో మద్రాస్ లలితకళల కళాశాల నుండి పెయింటింగ్‌లో పోస్ట్‌డిప్లొమా పొందారు. దేశంలోను, విదేశాలలోను నిర్వహించిన పెక్కు ఆర్ట్ క్యాంప్‌లు, ఎగ్జిబిషన్లలో పాల్గొన్నారు. లలితకళా అకాడమీ, చిత్రకళా పరిషత్తు, కాగ్ సొసైటీ వంటి పెక్కు ఆర్ట్ సొసైటీల నుండి అవార్డులు పొందారు. జపాన్, అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ వంటి పెక్కుదేశాలు పర్యటించారు. దేశంలోని ప్రముఖ పారిశ్రామిక సంస్థలు, అకాడమీలు, విదేశాలకు చెందిన సంస్థలు ఆయన చిత్రకళాఖండాలు సేకరించాయి. ఆయన చిత్రకారుడే కాదు. 200కి పైగా దక్షిణాది భాషా చిత్రాలకు సెట్‌డిజైనర్‌గా, ఆర్ట్‌డైరెక్టర్‌గా పనిచేశారు. ఇందుకుగాను, జాతీయ రజితకమలం అవార్డుతోపాటు, బి.ఎన్.రెడ్డి, సినిమా ఎక్స్‌ప్రెస్ అవార్డులతో పాటు ప్రతిష్ఠాత్మకమైన తమిళనాడు ప్రభుత్వ కళైమణి అవార్డును పొందారు.



దొంగ సినిమాల్లో నేను వేసిన సెట్లకు ప్రేక్షకుల నుంచి అనూహ్య స్పందన లభించింది. ఈ సందర్భంగా ఓ విషయాన్ని గుర్తుచేసుకోవాలి. 'అంజలి'లో కాలనీ సెట్‌ను వందమంది పనివాళ్లతో కేవలం ఐదు లక్షలతో ఐదురోజుల్లో పూర్తిచేశాను. అప్పుడే ఓ లారీ డ్రైవర్ అటుగా వచ్చి 'మద్రాస్ లో అపార్ట్‌మెంట్ల గోల ఎక్కువైంది. ఎక్కడపడితే అక్కడ కట్టేస్తున్నారు' అని తిట్టుకుంటూ లారీని రివర్స్ చేసుకుని వెళ్లాడు. సెట్‌కు అవతలి వైపు వున్న మేము నవ్వుకున్నాం. నేను వేసే సెట్లు అంత సహజంగా వుంటాయి కాబట్టే చాలామంది దర్శకులు తమ తొలిచిత్రానికి నన్నే కళాదర్శకుడిగా పెట్టుకునేవారు. మణిరత్నం, శంకర్, ప్రియదర్శన్, రామ్‌గోపాల్‌వర్మ, ప్రవీణ్‌గాంధీ వంటి ఎంతోమంది దర్శకులు నాతోనే దర్శకులుగా తమ ఇన్నింగ్స్ మొదలెట్టారు.

ఒకప్పుడు 'మీ నాన్నను పంపించు' అంటూ నన్ను వెనక్కి పంపేసిన సింగీతం శ్రీనివాసరావుగారు 'పుష్పకవిమానం' సినిమాకు పనిచేయాల్సిందిగా కమలహసన్‌తో నాకు కబురు పంపారు. ఒకప్పుడు వద్దన్నారుగా, ఇప్పుడెందుకు రమ్మంటున్నారు అన్నాను. కాని కమల్ మీరే చేయాలని పట్టుపట్టడంతో 'పుష్పకవిమానం' చేశాను. ఆ సినిమా కూడా నాకు అనూహ్యమైన పేరు ప్రఖ్యాతులను తీసుకొచ్చింది. కాకపోతే నెలకు పదివేలు జీతం ఇస్తూ ఆ సినిమా షూటింగ్‌ను రెండు సంవత్సరాలు లాగారు.

రామ్‌గోపాల్ వర్మ 'శివ' కోసం నేను వేసిన క్యాంటీన్ సెట్ అప్పట్లో చర్చనీయాంశంగా మారింది. కథ ప్రకారం కాలేజీ పక్కనే క్యాంటీన్ వుండాలి. ఓ కాలేజీని ఎంపికచేసి దాని పక్కనే క్యాంటీన్ సెట్ వేశాను. రామ్‌గోపాల్ వర్మ అక్కడికి వచ్చి కాలేజీ పక్క నిజంగానే క్యాంటీన్ వుందేమో అనుకున్నారు. లోపలికి వచ్చి చూసేదాకా ఆయనకు నమ్మకం కలగలేదు. ఇలాంటి సంఘటనలు నా కెరీర్‌లో లెక్కలేనన్ని జరిగాయి.





తన చిత్రకళా ప్రదర్శనను
ప్రారంభించిన మణిరత్నంతో తోటతరణి

అదేంటోగానీ 'అమావాస్య చంద్రుడు' తర్వాత నేను వేసిన ప్రతీ అడుగు నా కెరీర్‌కు మైలురాయిగానే నిలిచిపోయింది. కమలహాసన్‌తో అనేక సినిమాలకు పనిచేశాను. 'భారతీయుడు', 'నాయకుడు' సినిమాలకు నాకు రెండుసార్లు జాతీయ అవార్డులు కూడా లభించాయి. 2001లో 'పద్మశ్రీ' రావడం నా జీవితానికి గొప్ప మలుపు. ఇప్పటిదాకా 200కు పైగా సినిమాలకు ఆర్ట్‌డైరెక్షన్ చేశాను. పనిలో పడిపోయి చాలా ఆలస్యంగా పెళ్లి చేసుకున్నాను. పదిహేనేళ్ల క్రితం నా పెళ్లైంది. నాకొక అమ్మాయి పేరు రోహిణి. తను కూడా నాలాగే పెయింటింగ్స్ వేస్తుంది.

సినిమాల్లో ఎంత పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నా పెయింటర్‌గానే నేను ఎక్కువ తృప్తిని పొందుతాను. సినిమాలకు కళాదర్శకత్వం చేస్తూ ఎంత బిజీగా వున్నా గత 28 ఏళ్లుగా క్రమం తప్పకుండా ఏదో ఒక చోట నా పెయింటింగ్ ఎగ్జిబిషన్ పెడుతూనే ఉన్నాను. ఇప్పుడు కళాదర్శకత్వం పూర్తిగా మారిపోయింది. ఇంటర్నెట్లో డౌన్‌లోడ్ చేసుకుని పని కానిస్తున్నారు. అయినప్పటికీ 'శివాజీ', 'దశావతారం', 'కుచేలుడు' వంటి సినిమాలకు నన్నే పిలవడానికి కారణం నా స్కెచ్‌లలో ఆత్మ వుంటుందని భావించడమే. పైగా అతి తక్కువ ఖర్చుతో సెట్లు వేస్తాననే నమ్మకాన్ని కూడా నేను ఆయా దర్శకుల నుంచి పొందగలిగాను. అందుకే ఇంకా ఈ రంగంలో ఉండగలిగాను.

కళాజ్యోతి

# మహానటుడు
# పందిళ్ళ శేఖర్‌బాబు

- వాడ్రేవు సుందర్రావు
నంది, గరుడ అవార్డుల గ్రహీత


శేఖర్‌బాబు

నిండైనమూర్తి...
నిలువెత్తు రూపం...
నిబద్ధతతో కూడిన జీవనం...
నిరుపమానమైన నటనానురాగం
నిర్వచించలేనంత నాటకాభిమానం
అన్నీ కలగలసిన ఓ ఉన్నత రూపం.
అందరినీ అక్కున చేర్చుకొనే ఆత్మీయ స్వరూపం.
ఆయనే శేఖర్‌బాబు. పందిళ్ళ శేఖర్‌బాబు.

జాతి చరిత్రలో చిరస్మరణీయమైనది ఓరుగల్లు. శౌర్యధనులకు, త్యాగమూర్తులకు తొలినుండీ ఆలవాలమైనది ఓరుగల్లు. రాణిరుద్రమవంటి వీరనారీమణుల శౌర్యసాహసాలకు పురిటిగడ్డ ఓరుగల్లు. అటువంటి ఓరుగల్లు ప్రాంతంలోని ధర్మసాగరంలో జన్మించిన పందిళ్ళశేఖర్‌బాబు నాటకాభిమానానికి అసలు సిసలు నిర్వచనం. నాటకమంటే ఆయనకు ప్రేమ నాటకమంటే ఆయనకు ఇష్టం. నాటకమంటే ఆయనకు ప్రాణం.

ఆయన జననంలోనే ఓ గొప్ప విచిత్రముంది. ఏ తేదీ సమస్త భారతీయులకూ ప్రీతిపాత్రమో, ఏ తేదీన బానిసత్వశృంఖలాల్ని తెగటార్చి, భరతభూమి స్వతంత్రమయ్యిందో, ఏది స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సజీవ ప్రతిబింబమో, ఆ తేదీన... ఆ ఆగస్టు 15న శేఖర్‌బాబు జన్మించడం యాదృచ్ఛికమే కావచ్చు కానీ, అది నిజంగా ఆనందించదగిన విషయం. 15.8.1961వ తేదీన నేటి వరంగల్ జిల్లా ధర్మసాగరంలో, ధర్మమూర్తులైన రాజయ్యశాస్త్రి, సుచేత దంపతులకు జన్మించిన శేఖర్‌బాబు బాల్యమంతా ధర్మసాగరంలోనే గడిచింది. ఇంటర్మీడియట్ చదువుకోసం హనుమకొండలో అడుగుపెట్టిన వేళావిశేషం ఏమిటోగానీ, ఆ దివ్యక్షేత్రం శేఖర్‌బాబుని మనసారా అక్కున చేర్చుకొని ఆదరించింది ఆ నాటినుండీ అదే ఆయన కార్యక్షేత్రమయ్యింది. ఆ తరువాత దేవాదాయ ధర్మదాయ శాఖలో ఉద్యోగం రావడం, కార్య నిర్వహణాధికారిగా ఉన్నతస్థానం సాధించడం అన్నీ వరంగల్లులోనే జరిగాయి. లభించిన ఉద్యోగంతో సంతృప్తిపడి ఆగిపోకుండా, కాకతీయ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ. చదివి, ఆ తరువాత ఎల్.ఎల్.బి. చేసి ఉన్నత విద్యావంతుడై స్వయంకృషికి నిదర్శనంగా నిలిచారు శేఖర్‌బాబు. ఇదంతా ఆయన వ్యక్తిగత జీవితంలోని ఒక కోణం.



చాట్ల శ్రీరాములు చేతుల మీదుగా అవార్డు అందుకుంటున్న శేఖర్‌బాబు

శేఖర్‌బాబులో మరో గొప్ప కోణం, మనందరం మనస్ఫూర్తిగా మెచ్చుకొనే కోణం.. ఆయన నాటకాభిమానం. శేఖర్‌బాబు నాటకప్రయాణం ఈనాటికి నాలుగు దశాబ్దాల


జ్యోతిప్రజ్వలన చేస్తున్న నేరెళ్ళ వేణుమాధవ్

సుదీర్ఘమైన అధ్యాయం. ఎప్పుడో ఎనిమిదవ తరగతి చదువుతున్నప్పుడు 1973లో "ఆత్మహత్య" సాంఘిక నాటికలో "సన్యాసి రాజు" పాత్రతో రంగప్రవేశం చేసిన శేఖర్‌బాబు, ఈ నాలుగు దశాబ్దాలుగా నాటకకృషిని కొనసాగిస్తూ, దినదిన ప్రవర్ధమానమవుతూ వచ్చేరు... వస్తున్నారు కూడా! ఈ ప్రయాణంలో కూడా ఓ విలక్షణత కన్పిస్తుంది. శేఖర్‌బాబు నాటకప్రవేశం సాంఘిక నాటిక ద్వారా జరిగింది. కానీ ఆయనకు మంచిపేరు తెచ్చినవి మాత్రం పౌరాణికాలు. అంతేకాదు... ఒక మంచి సాంఘిక నటుడు పౌరాణిక పాత్ర నటిస్తే అది మరింత సమర్థవంతంగా, ఉత్తేజకరంగా ఉంటుంది. సాంఘిక నాటికలో కన్పించే వేగం. పౌరాణిక పాత్రలకు జోడించగానే అవి మరింత ఆకర్షణీయంగా రూపొందుతాయి.

శేఖర్‌బాబు విషయంలో జరిగిందదే. అందుకే ఆయన పౌరాణిక పాత్రలు జనరంజకమయ్యాయి, ప్రేక్షకాదరణకు పాత్రమయ్యాయి. అవుతున్నాయి కూడా! 1997 సంవత్సరం మార్చి నెల ఒకటివ తేదీన, శేఖర్‌బాబు పౌరాణిక నాటక రంగంలోకి అడుగుపెట్టారు. సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన పాలకుర్తి సోమేశ్వర లక్ష్మీనరసింహస్వామి బ్రహ్మోత్సవాలలో, శ్రీకృష్ణ పాత్రతో కన్పించి ప్రేక్షకుల్ని అలరించారు. పందిళ్ళ శేఖర్‌బాబు నాటకాభిమానం త్రిముఖమైనది. అందులో మొదటిది ఆయన గొప్ప నటుడు. అందునా పౌరాణిక పాత్రల్ని మనసారా ప్రేమించి, ఆ పాత్రల్లో అందంగా ఒదిగిపోయిన మంచి నటుడు. శ్రీకృష్ణరాయబారం నాటకంలో శ్రీకృష్ణుడిగా, అర్జునుడిగా, దుర్యోధనుడిగా, శ్రీరామాంజనేయ యుద్ధంలో శ్రీరాముడిగా, హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడిగా అందరి మన్ననలందుకొన్నారు. ఇక చిలకమర్తి రచించిన గయోపాఖ్యానం నాటకం, ఆయన అభిమాన కావ్యం. గయోపాఖ్యానంలో శ్రీకృష్ణపాత్రలో, అర్జునపాత్రలో, అక్రూరుడి పాత్రలో, నారదుడి పాత్రలో శేఖర్‌బాబు ఉత్తమ నటుడిగా వాసికెక్కారు. లవకుశ నాటకంలో రాముడిగా, యయాతి నాటకంలో యయాతిగా, చింతామణిలో బిల్వ మంగళుడిగా, భవానీ శంకరుడిగా... ఇలా ఎన్నో... ఎన్నో పాత్రల్లో నటించి, నలుగురి చేతా శభాష్ అనిపించుకొన్నారు. వీటన్నిటికీ తోడుగా తిరుమల శ్రీవేంకటేశ్వరుని భక్తుడైన, వాగ్గేయకారుడు అన్నమయ్య పాత్రలో ఆయన జీవించారు. దాదాపుగా ఐదువందల నాటక ప్రదర్శనలతో... తెలుగునేల నాల్గు చెరగుల్నీ వెలిగించిన గొప్పనటుడు శేఖర్‌బాబు.

శేఖర్‌బాబు నాటకాభిమానంలో రెండవ అంశం... ఆయన నాటకసమాజ నిర్వహణా నైపుణ్యం. తెలంగాణా డ్రమెటిక్ అసోసియేషన్ అనే పేరిట, శేఖర్‌బాబు ప్రారంభించిన నాటకసమాజం అనతికాలంలోనే గొప్పస్థాయిని అందుకొంది. ఒకవైపు ప్రసిద్ధమైన నాటకాలను ప్రదర్శిస్తూ, మరొకవైపు ఎంతో సమర్థవంతంగా నాటకపోటీలను నిర్వహిస్తూ వచ్చింది. రాష్ట్రంలోని ఎన్నో పట్టణాలలో ఎన్నో ప్రదర్శనల్ని దిగ్విజయంగా ప్రదర్శించి చూపించింది. ప్రేక్షకుల్ని పరశింపజేసింది తెలంగాణా డ్రమెటిక్ అసోసియేషన్. ముఖ్యంగా



2007వ సంవత్సరంలో తిరుపతిలో శ్రీవేంకటేశ్వరా నాట్య కళాపరిషత్ నిర్వహించిన నాటకోత్సవాలలో, శ్రీకృష్ణరాయబారం నాటకాన్ని ఎంతో ప్రతిభావంతంగా ప్రదర్శించి రెండు బంగారు గరుడ అవార్డుల్ని అందుకుంది. 2011లో శ్రీకాళహస్తీశ్వర లలిత కళాపరిషత్ నుండి "యయాతి" నాటకంతో ఉత్తమ ద్వితీయ ప్రదర్శనగా నటరాజ అవార్డుని గెల్చుకోవడంతో పాటుగా అదనంగా నాలుగు జ్యూరీ అవార్డుల్ని స్వీకరించింది. దీనికంతటికి ప్రధానకారకుడు శేఖర్‌బాబు అనడం అక్షరసత్యం. అంతేకాదు... వరంగల్ జిల్లాలోని నాటక సంస్థలన్నిటినీ ఒకే వేదికమీదకు తెచ్చి జిల్లా రంగస్థల కళాకారుల ఐక్యవేదికను రూపకల్పన చేయడం వెనుక శేఖర్‌బాబు కృషి ప్రశంసనీయం.

ఇక శేఖర్‌బాబు నాటకానుబంధంలో మరొకకోణం, గుణనిర్ణయం. ఆయన గుణనిర్ణయం ఎన్నతగినది, ఎంతగానో నిష్పాక్షికమైనది. రాగద్వేషాలకు తావీయకుండా, ప్రతిభకు పట్టం కట్టడంలో ఆయనది అందెవేసిన చేయి. అందుకే రాష్ట్రంలోని ఎన్నో పరిషత్తులు నాటక పోటీలకు గుణనిర్ణేతగా ఆయనను ఆహ్వానించి గౌరవిస్తున్నాయి. గత నాలుగు సంవత్సరాలుగా అభినయ నాటక పరిషత్, తిరుపతి వారి హనుమ అవార్డుల పరిషత్తుకు ఆయన న్యాయనిర్ణేత, రవీంద్రభారతిలో జరిగిన పి.ఎం.కె.ఎం. సాంఘిక నాటికల పోటీలకు, వరంగల్‌లో జరిగిన తెలంగాణా స్థాయి, రాష్ట్రస్థాయి నాటక పోటీలకు, అంతకన్నా ముఖ్యంగా రాష్ట్రప్రభుత్వ నందినాటకోత్సవాల ప్రాథమిక పరిశీలనకు ఇలా అనేక సందర్భాలలో శేఖర్‌బాబు గుణనిర్ణయానికి ఎంతో గౌరవం లభించింది.




శేఖర్‌బాబు నిర్విరామ కృషికి, దీక్షా దక్షతలను గుర్తించిన అనేక సంస్థలు ఆయనకు ప్రతిభకు బిరుదుల సత్కారం చేశాయి. గాన గంధర్వ, పద్యనాటక విద్వన్మణి, నాటక కళాధురీణ, పద్యనాటక సార్వభౌమ, తెలంగాణా కృష్ణుడు, నాటక కళాతపస్వి పద్యనాటక శిరోమణి... ఇలా ఎన్నో... ఎన్నో... బిరుదులు ఆయనను వరించాయి. వరిస్తున్నాయి కూడా. శేఖర్‌బాబు నాటాభిమానానికి పరాకాష్ఠగా చెప్పదగ్గది, ఆయన ఘనంగా నిర్వహించిన పద్యనాటక సప్తాహం. ఏడు రోజుల పాటు నిర్వహించిన ఆ నాటకోత్సవంలో ప్రసిద్ధి పొందిన ఏడు నాటకాలను, విజయవంతంగా ప్రదర్శించి ప్రేక్షకుల్ని పరవశుల్ని చేసిన ఘనత శేఖర్‌బాబుది. అంతేకాదు, ఆ మహోత్సవానికి అయిన ఖర్చు మొత్తం రెండు లక్షల పదునాల్గు వేల రూపాయలు. అదంతా తానే భరించిన నాటకాభిమాని పందిళ్ళ శేఖర్‌బాబు. తెలుగు నాటక చరిత్రలో నిజంగా ఇదొక అపూర్వమైన ఘట్టం.

పందిళ్ళ శేఖర్‌బాబు వంటి బహుముఖ ప్రజ్ఞావంతులనే తెలుగు నాటకం ఈనాడు కోరుతోంది. అటువంటి సమర్థులవల్లనే నాటకమీనాడు నిలద్రొక్కుకోగలుగుతుంది. అంతటి నాటకారాధకుల వల్లనే పద్యనాటక వైభవం దశదిశలా విస్తరించబోతుంది. అందుకే శేఖర్‌బాబు శతవసంతాలు ఆనందంగా, ఆరోగ్యంగా జీవించాలి. చిరకీర్తినార్జించాలి. ఓరుగల్లు స్వయంభువుగా వెలసిన వేయి స్తంభాల గుడిలోని పరమేశ్వరుడు పందిళ్ల శేఖర్‌బాబును అన్ని విధాలా ఆశీర్వదించాలి. అదే నాటకాభిమానులందరి సమిష్టి ప్రార్థన.




పొన్నాల, నేరెళ్ళ చేతుల మీదుగా సత్కారం అందుకుంటూ

*email:*
*vadrevusundarrao@gmail.com*

# పత్రికారంగంలో ఇంద్రజాలికుడు !



## తెలుగు పత్రికలు - సంపాదకులు

*పుస్తకాలు, పత్రికలు లేని ప్రపంచాన్ని నేడు ఊహించుకోలేం. ఈప్రపంచంలో పుస్తకం ఓ అద్భుతం. ఎందరెందరో భాషాభిమానం, దేశాభిమానం, సమాజశ్రేయస్సు, ఉద్యమస్ఫూర్తితో పత్రికలు స్థాపించి పాఠకులకు అందుబాటులోకి తెస్తున్నారు. లెక్కకు మిక్కిలిగా వెలువడుతున్న పత్రికలలో చిరకాలం నడిచేవి-పాఠకాభిమానం పొందేవి కొన్నే. పత్రికలను పాఠకాభిమానం పొందేలా సారథ్యం వహించేవాడు సంపాదకుడు. అలాంటి సంపాదకులను 64కళలు.కామ్‌లో నెల-నెలా పరిచయం చేసే శీర్షికే తెలుగుపత్రికలు-సంపాదకులు.*

తెల్లారగానే దినపత్రిక చూడకపోతే... ప్రాణం కొట్టుకపోతుంది. టీవీల్లో వార్తలు చూసినా సరే... దినపత్రిక పేజీలన్నీ ఓ సారి తిరగేస్తే కాని తృప్తి వుండదు. చాల మందికి, కాఫీ లాగే అలవాటయిన దినపత్రికను సాయంత్రం అయ్యేసరికి.. కాలిపోయిన సిగిరెట్ పారేసినట్టు పక్కన పడేస్తారు! నెలరోజులయేసరికి కట్టకట్టి... తూకానికి అమ్మేస్తారు. అదే వారపత్రిక అయితే కనీసం వారం పదిరోజులు బల్లమీదనే వుంటుంది. ఆ తర్వాత అది కూడా కిరాణా కొట్లో పొట్లాలకు వాడేస్తారు.

కాని... స్వాతి వారపత్రిక పాతదయినా... కొత్తదయినా చాలా భద్రంగా దాచుకుంటారు. కారణం ఏమిటి? అదే స్వాతి సంపాదకుని ఇంద్రజాలం.

స్వాతి నక్షత్రం గొప్పది
నక్షత్ర బలం ఇంకా గొప్పది
స్వాతి బలరాం సంకల్ప బలం ఇంకా ఇంకా గొప్పది!

అందుకే ప్రపంచంలో తెలుగు వారు ఎక్కడ ఉన్నా... స్వాతి సపరివార పత్రిక సకుటుంబ పత్రికగా.. బంధుమిత్ర సపరివార సమేతంగా ఇష్టపడి చదివే పత్రికగా.. (కష్టపడి చదివే పత్రికలూ ఉన్నాయి లేండి) తెలుగువారి అలవాట్లలో ఓ అంతర్భాగంగా.. పత్రికా ప్రపంచంలో అగ్రస్థానంలో నిలిచి.. పాఠకుల నీరాజనాలు అందుకుంటోంది. ఎందుకందుకోదు? స్వాతి సపరివారపత్రిక-సరస్వతి మానసపుత్రిక గదా... తనకంటూ కొన్ని నిర్దిష్టమైన ప్రమాణాలతో విలువలతో.. అనితర సాధ్యమైన అకుంఠిత దీక్షతో.. ఆకాశమంత ఎత్తుకు ఎదిగింది.

భారతదేశంలో గల 301 మేగ్జయిన్లలో స్వాతి పత్రిక. మూడవ స్థానంలో వుందంటే ఆ క్రెడిట్ పూర్తిగా స్వాతి బలరామ్‌కే దక్కుతుంది! మన రాష్ట్రానికి ఈ పక్కన వున్న మహారాష్ట్రలో, ఆ పక్కన వున్న కర్నాటక, తమిళనాడు రాష్ట్రాల్లో తెలుగు పత్రిక కోసం భూతద్దం పెట్టుకొని వెత్తుక్కోవలసి వస్తోంది! అటువంటి పరిస్థితిలో అమెరికాలో ఒక్క






## స్వాతి విజయరహస్యం:

స్వాతి' ఈరోజు దేశవిదేశాలలో దేదీప్యమానంగా వెలుగుతుందంటే దాని విజయరహస్యం "ఒన్ టు టెన్-నాన్ అదర్ దెన్ 'స్వాతి' బలరాం సార్" అంటాను. కృషి, దీక్ష, పట్టుదల ఉంటే సాధించలేనిది ఏదీలేదు. లేదని నిరూపించారు. ముఖ్యంగా క్రమశిక్షణ, క్రమం తప్పకుండా పత్రికను తీసుకురావడం అందులో సర్వాంగసుందరమైన బొమ్మలు, శీర్షికలు, కొత్తవిషయాలు.. కథలు... సీరియల్స్... ఏ పేజీ తిరగేసినా అనితర సాధ్యమనిపించే విధంగా తీర్చిదిద్దడం పుస్తకం హస్తభూషణం అంటారు కదా ఆ భూషణం 'స్వాతి' అంటే అతిశయోక్తి కాదు.

న్యూజెర్సీలో స్వాతి వారపత్రిక 100 కాపీల వరకూ అమ్ముతానని ఓ హిందీవాడు (ఏజెంట్) చెప్పాడంటే దాన్ని బట్టి స్వాతి పాఠకుల సంఖ్య అంచనా వేయవచ్చు. స్వాతి మాసపత్రిక, వారపత్రిక రెండూ కలిసి పాఠకుల సంఖ్య 45 లక్షల 99వేలమంది అని నేషనల్ రీడర్షిప్ స్టడీస్ కౌన్సిల్ సర్వేలో అధికారికంగా ప్రకటించింది. అయితే ఈ గౌరవం హఠాత్తుగా రాలేదు. ఇవాల్టి వరకూ అంటే 29 సంవత్సరాల కృష్టి, శ్రమ సాధించిన గౌరవం ఇది!...

'ఈ 29 సంవత్సరాలలో ఎన్నో విజయాలు సాధించిన...




మరెన్నో ఇబ్బందులు కూడా ఎదుర్కొన్నాను' అంటారు స్వాతి బలరామ్.

భూమిని నమ్ముకున్న కుటుంబంలో పుట్టిన బలరామ్... పత్రికను నమ్ముకొని.. ఆ పత్రికను భారతదేశంలోనే 3వ స్థానంలో నిలబెట్టాడు అంటే అది పత్రికా రంగంలో 'గిన్నీస్‌బుక్ రికార్డు' లాంటిది! ఎందరో కోటీశ్వరులు పత్రికారంగంలో నిలదొక్కుకోలేక... లక్షాధికారులు... ఒకరిద్దరు భిక్షాధికారులు అయిపోయిన కథలు ఎన్నో విన్నాము. కానీ... స్వాతిబలరామ్... పాఠకుల అభిరుచి తెలుసుకోడానికి... ఆంధ్రదేశమంతటా తిరిగి 'పాఠకుల నాడి' తెలుసుకుంటూ-స్వాతి పత్రిక పబ్లిసిటీ బోర్డులను బడ్డీకొట్లకు మేకులు కొట్టి తానే పెట్టేవాడంటే ఇవాళ ఎవరైనా నమ్ముతారా?... తెల్లవారుజామున ఎవరూ చూడకుండా ఈ బోర్డులు కొట్టడానికి స్వాతి బలరామ్ తిరిగారంటే ఇవాళ ఎవరైనా నమ్ముతారా?...

స్వాతి గురించి అంత కష్టపడ్డాడు కాబట్టే... గత 29 సంవత్సరాలుగా 'స్వాతి' పత్రికా రంగంలో ఒక ప్రత్యేకస్థానంలో నిలబడింది!

స్వాతి బలరామ్‌కు పాఠకులే దేవుళ్ళు! వాళ్ళ వాళ్ళ అభిరుచిని ఆయన ఆరాధిస్తాడు! ఆయన బలమంతా పాఠకులు! అందుకే...

స్వాతికి పోటీగా ఏ పత్రిక నిలువలేదు! స్వాతి పత్రిక వెనుకనే... స్వాతిబాటలో ఎన్నో పత్రికలు నడుస్తున్నాయి నడుస్తూనే వుంటాయి!

### స్వాతి సంపాదకునిగా..

స్వాతి బలరామ్ సభలకు రారు! ప్రీవ్యూలకు రారు. కానీ విదేశాల్లో పర్యటిస్తారు. ఎవరితో... మనదేశం ప్రధానమంత్రులు అయిన స్వర్గీయ పి.వి. నరసింహారావు, వాజ్‌పేయి, దేవ్‌గౌడ,





## ముచ్చటయిన ముఖచిత్రాలు

పాఠకలోకంలో 'స్వాతి' వారపత్రిక సంచలనం. ప్రముఖ చిత్రకారుడు బాపు గారి లోగో కవర్‌పేజీకి ప్రత్యేక ఆకర్షణ అయితే వడ్డాది పాపయ్యగారి కుంచె దిద్దిన అద్భుత ముఖచిత్రాలు స్వాతికి ఓ ప్రాధాన్యతను కల్పించాయి.


బాపు


వడ్డాది పాపయ్య

### రచయితలంటే ప్రాణం!

తెలుగు పత్రికారంగంలో... రచయితను వాడుకునే పత్రికలు ఎక్కువ! గౌరవించే పత్రికలు చాలా తక్కువ! రచయితలకు పారితోషికం ఇచ్చేపత్రికలు మరీ మరీ తక్కువ! కానీ-స్వాతి బలరామ్ మాత్రం-రచయితల పారితోషికం విషయంలో, నూతన రచయితలను ప్రోత్సహించడంలో, పాఠకులను గౌరవించడంలో అందరికంటే ముందు వుంటారు.

శ్రీశ్రీ... ఆరుద్ర నుంచి ప్రముఖ రచయితలందరూ అంటేనే బాగుంటుంది. ఎందుకంటే 'స్వాతి'లో కనిపించని ప్రముఖ రచయితలు లేరు! ఒకరిపేరు చెబితే మరొకరి పేరు మర్చిపోయే ప్రమాదం వుంది. ఇక చిత్రకారుల విషయానికి వస్తే స్వాతి పత్రికకు పద్మశ్రీ బాపు గీసిన తొలి ముఖచిత్రమే స్వాతి లోగోగా మారింది. ఎంత బిజీగా వున్నా స్వాతి కోసం బాపు కార్టూన్లు, బొమ్మలు గీస్తూనే వుంటారు... ఇక స్వాతి ముఖచిత్రాల అందమంతా వడ్డాదిపాపయ్య గారి బొమ్మల్లోనే వుంది.

ఇక స్వాతి కథల్లో.. శీర్షికల్లో.. అంతా కొత్తదనమే! ఈనాడు పత్రికల్లో వస్తున్న శీర్షికలన్నీ... ఆనాటి స్వాతి పత్రికలో వచ్చినవే అంటే తప్పులేదు!

స్వాతి పత్రికలన్నీ దొరికితే ఒక్కొక్కటే చూస్తూ వుంటే... దేనికదే కొత్తగా వుంటుంది! అందుకు కారణం

స్వాతి బలరామ్... ఒక తపస్సులాగా.. నిరంతరం... తన గదిలో కూర్చొని 'స్వాతి' రూపురేఖలు తీర్చిదిద్దుతూ వుంటారు. పత్రిక ప్రింటింగ్, డిస్పాచ్, సర్కులేషన్, రాబడి... అన్నీ బలరామ్ చూసుకుంటారు. అదే ఆయన అదృష్టం.

ఐ.కె. గుజ్రాల్, మన్మోహన్‌సింగ్ లాంటి వారితో ప్రభుత్వ ఆహ్వానంతో అధికారికంగా విదేశాల్లో పర్యటించి, ఆ దేశ విశేషాలను స్వాతి పాఠకులకు అందించారు. మన రాష్ట్రపతులు కె.ఆర్.నారాయణ్‌తో, ఎ.పి.జె అబ్దుల్‌కలామ్‌తో విదేశాల్లో పర్యటించిన ఘనత తెలుగు పత్రికారంగంలో శ్రీ బలరామ్‌కి దక్కడం మనందరికీ ఆనందదాయకం!

అలాగే-తెలుగు పత్రికారంగంలో ఏ సంపాదకునికీ దక్కని గౌరవ పురస్కారాలు బలరామ్ అందుకోవడం విశేషం. దేశ విదేశాల్లో ఎన్నో అవార్డులు అందుకున్నారు. అయినా పబ్లిసిటీకి చాలా దూరం.

### 1470 సంచికలు...

*వారం-వారం ఠంచనుగా వచ్చి పాఠకులను రంజింపచేస్తున్న స్వాతి... ఇప్పటికి 1470 సంచికలతో 29 యేళ్ళుగా తెలుగు పాఠకులను అలరిస్తూనే ఉంది. గత సంవత్సరం బలరాంగారి కుటుంబ కలహాల మూలంగా ఒక్క సంచికను ప్రచురించలేకపోవడం తప్ప, ఈ 29 ఏయళ్ళుగా ప్రతి గురువారం పాఠకుల ముంగిట వాలిపోతుంది స్వాతి.*

# జగదేక దర్శకుడు కె.వి. రెడ్డి

*తెలుగు సినిమాకు ఊపును, రూపును ఇచ్చిన చిత్రం ‘పాతాళభైరవి’. దాని దర్శకుడు కె.వి.రెడ్డి. అత్యంత ప్రజారంజక చిత్రంగా పేరొందిన మాయాబజార్‌ను రూపొందించిన దర్శక శ్రేష్ఠుడాయన. ఎంతోమంది దర్శకులకు మార్గదర్శకుడిగా నిలిచిన కె.వి.రెడ్డి* ***101****వ జయంతి సందర్భంగా ప్రత్యేక వ్యాసం.*



**– కె. విమలకుమారి**

జూలై 15, 1912న తాడిపత్రిలో జన్మించిన కె.వి. రెడ్డి తన రెండవ ఏట తండ్రి కదిరి కొండారెడ్డిని కోల్పోవడంతో తల్లితో సహా మేనమామ ఇంటింటికి చేరుకున్నారు. స్కూల్‌ఫైనల్ వరకూ ఆయన తాడిపత్రిలోనే చదువుకున్నారు. స్కూల్ ఫైనల్ అయిన తర్వాత అనంతపురంలో కాలేజీ ఉన్నప్పటికీ మద్రాసులోని ప్రెసిడెన్సీ కాలేజిలో చేరారు కె.వి., అక్కడి విక్టోరియా హాస్టల్‌లో మకాం. కొత్త ప్రదేశం, ఒంటరి జీవితం కావడంతో కాలక్షేపం కోసం సినిమాలు చూసేవారు. కె.వి.కి అది ఒక వ్యసనంగా మారిందనే చెప్పాలి. ఎందుకంటే శని,ఆదివారాలు వస్తే చాలు విధిగా మూడాటలూ చూసేవారాయన. కాలక్షేపం కోసమే సినిమాలు చూస్తున్నా వాటిల్లో ప్రతి అంశాన్నీ ఆయన నిశితంగా పరిశీలించేవారు. కాలేజి చదువులో దర్శకుడు పి.పుల్లయ్య ఆయనకు ఏడాది సీనియర్. 1935లో కె.వి. బి.ఎస్.సి. ఆనర్స్ పాసయ్యేనాటికి పుల్లయ్య చిత్ర పరిశ్రమలోకి ప్రవేశించడమే కాదు ‘హరిశ్చంద్ర’ చిత్రానికి పనిచేశారు కూడా.




### ఉద్యోగ ప్రయత్నాలు

చదువు పూర్తయ్యాక కె.వి. ఉద్యోగ ప్రయత్నాలు చేశారు కానీ ఒక్కటీ ఫలించలేదు. ఒక దశలో టీచర్ ట్రెయినింగ్‌కు అప్లికేషన్ పెడితే, కనీసం ఆరునెలల అనుభవం కావాలని చెప్పి తిరస్కరించారు. ఇలా కాదనుకుని తన క్లాస్‌మేట్ కృష్ణారావుతో కలిసి 1936లో ‘ది స్టాండర్డ్ సైంటిఫిక్ ఇన్‌స్ట్రుమెంట్స్’ పేరుతో ఒక కంపెనీని ప్రారంభించారు. దీనికి పెట్టుబడి 250 రూపాయలు. కాలేజీలకు, స్కూల్స్‌కి కావాల్సిన మెషినరీని తయారు చేసి అమ్మడం వీరి పని. కొంతకాలం లాభసాటిగానే సాగింది వీరి వ్యాపారం.

### మిత్రుడి నుంచి పిలుపు

అలా రోజులు గడుస్తున్న తరుణంలో అంటే మే 1937లో తాడిపత్రి నుంచి మూలా నారాయణ స్వామి కె.వి.కి కబురుచేశారు... ‘నేను ఓ ఫిలిం కంపెనీలో పార్టనర్‌గా చేరాను. నీకింకా సినిమాలంటే ఆసక్తి వుంటే నువ్వు కూడా వచ్చి చేరవచ్చు’ అని. ఏం చెయ్యాలో తోచక తన పార్టనర్ కృష్ణారావుని సలహా అడిగారు కె.వి. ఆరునెలలు చూసి లాభం



తల్లి, భార్య, పిల్లలతో కేవీరెడ్డి

బ్రిజ్‌మోహన్‌దాస్ కలిసి వాహిని సంస్థను నెలకొల్పారు. అందరూ యువకులే కావడంతో ఎలాంటి అరమరికలు లేకుండా 'బ్రదర్... బ్రదర్' అని ఒకరినొకరు పిలుచుకుంటూ అన్యోన్యంగా ఉండేవారు. బి.ఎన్.రెడ్డి వారికి పెద్ద దిక్కు. వీరితో పాటు రామనాథ్, శేఖర్ వంటి సాంకేతిక నిపుణుల సాంగత్యం కె.వి.కి ఎన్నో తెలియని విషయాలు నేర్పింది. కె.వి.రెడ్డి పేరుకు క్యాషియర్ అయినా వాహినీ సంస్థలో ఆయన స్థానం కీలకమైందే. చిత్రనిర్మాణానికి సంబంధించిన విషయాలలో బి.ఎన్.ది తుది నిర్ణయమైనా మిగిలిన వారు ఇచ్చే సలహాలకు కూడా విలువుండేది.

లేదనిపిస్తే వెనక్కి తిరిగివచ్చేయమని చెప్పి పంపించారాయన. మిత్రుడు స్వామితో కలిసి మద్రాసు వచ్చి, రోహిణి పిక్చర్స్ సంస్థలో చేరారు కె.వి. అక్కడ బి.ఎన్.రెడ్డి, బ్రిజ్‌మోహన్‌దాస్, నాగిరెడ్డి, సముద్రాల తదితరులతో పరిచయం ఏర్పడటం, వారంతా మంచి మిత్రులుగా మారడం, సంయుక్తంగా చిత్రనిర్మాణం చేపట్టడం వంటి పరిణామాలు సంభవించి, ఇక వెనక్కి తిరిగి వెళ్లాల్సిన అవసరం కలగలేదు కె.వి.రెడ్డికి.

## వాహినీ సంస్థ ఏర్పాటు

కె.వి.రెడ్డి ఫిజిక్స్ స్టూడెంట్ కనుక సౌండ్ రికార్డింగ్ డిపార్ట్‌మెంట్‌లో చేరాలని అనుకున్నప్పటికీ, స్వామి ఆయనకు నగదు వ్యవహారాల పర్యవేక్షణ అప్పగించి, గల్లా పెట్టె దగ్గర కూర్చోబెట్టారు. మిత్రుడు మాట కాదనలేక ఒక పక్క ఆ పనిని సమర్థవంతంగా నిర్వహిస్తూనే, చిత్రనిర్మాణ కార్యక్రమాలను కూడా గమనించేవారు కె.వి. 1938లో 'గృహలక్ష్మి' చిత్రం విడుదల కాగానే మూలా నారారయణ స్వామితో పాటు రోహిణి సంస్థ నుంచి ఆయన బయటకు వచ్చేశారు. ఆ తర్వాత బి.ఎన్., నాగిరెడ్డి, మూలా నారాయణస్వామి,

## దర్శకుడిగా తొలి అవకాశం

1941లో దర్శకత్వం వహించే అవకాశం కె.వి.రెడ్డికి వచ్చింది. తొలి సినిమాగా ఒక ప్రేమకథను తెరకు ఎక్కించాలనే కోరిక ఆయనకు ఎప్పటి నుంచో ఉండేది. అయితే ఆయన తీసిన తొలి సినిమా భక్తిరసప్రధానమైన 'భక్తపోతన'. తన అభిమతానికి విరుద్ధంగా ఉన్నప్పటికీ ఈ తొలి సినిమా విజయం కోసం ఆయన మనసు పెట్టి పనిచేశారు. ఆ సినిమా ఘనవిజయం సాధించి



పాతాళభైరవిలో ఎన్టీఆర్




ఎన్‌టిఆర్‌కు మేకప్ చేస్తున్న కె.వి. రెడ్డి

మాచందీగౌరీ శంకరుల కథ' చిత్రాలను ఎన్.టి.ఆర్. హీరోగా రూపొందించారు.

వాహినీ సంస్థతో విభేదించి కొంతకాలం బయటకు వచ్చేసిన కె.వి.రెడ్డి ఈ గ్యాప్‌లో అక్కినేని హీరోగా అన్నపూర్ణ వారి తొలి చిత్రం 'దొంగరాముడు'కు దర్శకత్వం వహించారు. అలాగే జయంతీ పిక్చర్స్ పతాకంపై ఆయన మిత్రులతో కలిసి నిర్మించిన 'పెళ్లినాటి ప్రమాణాలు' చిత్రంలో ఎన్.టి.ఆర్. నటించారు. వీరిద్దరు హీరోలుగా 'శ్రీకృష్ణార్జున యుద్ధం' చిత్రాన్ని కూడా ఆయన స్వీయ దర్శకత్వంలో నిర్మించారు.

ఆయనకు మంచి పేరు తెచ్చింది. ఇక రెండవ చిత్రం 'యోగివేమన'. ఈ సినిమా కోసం కె.వి. చేసిన కృషి అపారమని చెప్పాలి. 'ఈ చిత్రనిర్మాణంలో సముద్రాల ఎంతో సాయం చేశారు. నాలోని లోపాలను ఆయన తన ప్రతిభతో సరిదిద్దారు. సముద్రాలకు తత్వం గురించి, వేదాంతం గురించి బాగా తెలుసు. కాబట్టి ఈసి నిమాతో ఎంతో నేర్చుకొన్నానని చెప్పేవారు.

## జానపదాలు

కె.వి. మూడవ చిత్రం 'గుణసుందరి కథ', 'బాలనాగమ్మ, 'గొల్లభామ' వంటి జానపద చిత్రాలకు ఆ రోజుల్లో లభించిన ఆదరణని గమనించిన తర్వాత తను కూడా ఒక జానపద చిత్రం తీయాలనే కోరికతో 'గుణసుందరి కథ' సినిమాని రూపొందించారు కె.వి. హాస్యనటుడు శివరావుకు తిరిగి పూర్వవైభవాన్ని సంతరించి పెట్టింది ఈ చిత్రం. అలాగే హీరోయిన్ జూనియర్ శ్రీరంజనికి మంచి గుర్తింపు లభించింది. ఆ సమయంలో విజయా సంస్థ చిత్రనిర్మాణం చేపట్టి 'షావుకారు' సినిమా నిర్మించింది. ఆ సంస్థ తీసిన రెండవ చిత్రం 'పాతాళభైరవి'కి కె.వి. దర్శకుడు. ఈ చిత్రం విడుదలయ్యే సమయానికి జానపద చిత్రాలకు ఆదరణ సన్నగిల్లింది. ఈ చిత్రం పనికూడా అంతేనని అందరూ భయపడుతున్న సమయంలో విడుదలయి ఘనవిజయం సాధించింది 'పాతాళభైరవి' చిత్రం. 'బాలరాజు' సినిమాతో సాహసవీరుడిగా అక్కినేని స్టార్‌డమ్ అందుకున్నారు. అలాగే 'పాతాళభైరవి' సినిమా ఎన్.టి.ఆర్.ని స్టార్‌ని చేసింది. ఆ తర్వాత 'జగదేకవీరునికథ', 'సత్యహరిశ్చంద్ర', 'మాయాబజార్', 'ఉ

## ఖచ్చితమైన ప్రణాళిక

కె.వి.రెడ్డి దర్శకత్వం వహించిన చిత్రాలను పరిశీలిస్తే... వాటిల్లో అనవసర పాత్రలు కానీ, దృశ్యాలు కానీ కనిపించవు. స్క్రిప్ట్ విషయంలో అంత శ్రద్ధ తీసుకునేవారాయన. అలాగే కథను నిర్ణయించుకున్న తర్వాత తన దృష్టిని దానిమీదే కేంద్రీకరించేవారాయన. పక్కాగా స్క్రిప్ట్ తయారయిన తర్వాత ఆయన మిగిలిన విషయాలు ఆలోచించేవారు. అంతేకాదు స్క్రిప్ట్ దశలోనే స్టాప్ వాచ్ పెట్టుకుని ఏ సన్నివేశం తీయడానికి ఎంత సమయం పడుతుందని నోట్ చేసుకొనేవారు. నిజం చెప్పాలంటే ఇలా కొలతలు నిర్దేశించుకొని దాని ప్రకారమే సినిమా తీయడం దర్శకుడికి కత్తిమీద సామే. అయినా ఎంతో సమర్థవంతంగా ఆ పనిని నిర్వహించేవారు. ఎన్.టి.ఆర్. దర్శకుడయిన తర్వాత కె.వి. విధానాన్నే అనుసరించి విజయం సాధించడం గమనార్హం. కె.వి. 'రీళ్లను కూడా పొదుపుగా వాడాలి. అనవసరంగా నిడివి పెంచితే ప్రేక్షకులకు విసుగు పుట్టే ప్రమాదం వుంది' అనేవారు.

## చివరి చిత్రం

ఫెయిల్యూర్ సినిమాతో రిటైర్ అవుతానేమో అనే భయం కె.వి.కి చివరి రోజులలో ఉండేది. ఆయన ఆర్థిక పరిస్థితి అప్పటికి అంతంత మాత్రంగానే ఉండేది. ఇది గమనించిన ఎన్.టి.ఆర్. ఆయనకు అండగా నిలిచి తన బేనరుపై 'శ్రీకృష్ణసత్య' చిత్రాన్ని కె.వి. దర్శకత్వంలో నిర్మించారు. ఆ చిత్ర విజయం చూసి, సంతృప్తితో సెప్టెంబరు ఒకటి, 1972న తుది శ్వాస విడిచారు.

కవిత

# వనాలు ధరణి ధరించిన ఆభరణాలు

బి.ఎం.పి.సింగ్

వనాలు ధరణి ధరించిన అభరణాలు
వనాలు మనకు ఆయురారోగ్య
ఐశ్వర్యానందాలకు కారణాలు.
మనజీవన ప్రమాణంలో కలుగు ప్రయాసలు
ఉద్వేగాలను నివారించు ఉపకరణాలు వనాలు.
భూతలానికి శీతలాన్నిచ్చే 'పచ్చగొడుగులు' వనాలు.
మన జీవన మందు సర్వదినాలూ 'పర్వదినాలే'!
ఈ భూగ్రహంపై నివసించే జీవులన్నిటికీ
నిజమయిన 'నిజ'నివాసాలు వనాలు
వనాలున్నప్పుడే మనకు ఋతుపవనాలు
సకాల వానలు-కాలచక్రంలో
ఎండా వాన శీతాకాలాలు
మానవులకు-పశుపక్ష్యాదులకు
మధుర భక్ష్యాలకు మూలాలు వనాలు
పచ్చని పచ్చిక బయళ్లు నేలతల్లి కట్టిన
పచ్చ-పట్టురంగు చీరలు
కాయలు-పండ్లు-ఆకులు-అలములు-వనమూలికలు
వేర్లు మానవ జీవన ప్రణాళికలు
మనం పొట్టపోసుకుంటానికి ఆధారమైన
చెట్లు నరికి-నరికి మన పొట్టన పెట్టుకుంటే... ఎట్లా?

మనిషి 'నశ్వరం' మాను 'ఈశ్వరం'
మనం మనకు దైవమిచ్చిన జీ'వన'వరం
మన ధార్మికతకు ఆనవాలు వనాలు
సుఖమయ జీవనానికి ఆలవాలాలు వనాలు
నేలపై వేల ఏండ్ల నాడే వేళ్లూనుకున్న
మన ఆత్మీయులు వనాలు
వనాలను కాల్చి-కూల్చి భవనాలను
నిలిపిన నేటి నేలలు రేపటికి ఆధునిక స్మశానాలే
వనాలు లేనినాడు జరిగేది నాశనాలే
వనాలు మన ఆనంద జీవనానికి -వన్య ప్రాణులకూ
ప్రశాంత ఆవాసాలుగా ఆ పరమాత్మ వ్రాసిన శాసనాలు
ఇతరుల నుంచి అరువుగా
పొందలేని అరుదయిన అపురూప సంపద వనాలు
మానవులందరినీ అక్కున చేర్చుకుని
ఆశీర్వదించే ఆదర్శచరితలు వనాలు.

*email: munipratapsinghb@gmail.com*

64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :2 సంచిక :10 ఆగస్ట్ 2012



తెలుగు చిత్రకళారంగానికి వన్నెతెచ్చిన కొండపల్లి శేషగిరిరావు గారు, కూచిపూడి నాట్యానికి జీవమిచ్చిన వెంపటి చిన సత్యంగారల మరణం కళారంగానికి తీరని లోటు. వారి ఆత్మకు శాంతి చేకూరాలని కోరుకుంటూ...వెంపటి గారిపై ప్రత్యేక వ్యాసం ఇస్తున్నాం. కొండపల్లి గారి గురించిన వ్యాసం అక్టోబర్ 2011 లో చూడగలరు.

64కళలుడాట్‌కాంకు రచనలు మేమూ చేయవచ్చా అని ఎంతో మంది మెయిల్స్ పంపిస్తున్నారు. కళలకు సంబంధించిన వ్యాసాలు (ఫొటోలతో) నిరభ్యంతరంగా పంపవచ్చు.

ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.

కళాసాగర్
ఎడిటర్



ముఖచిత్రం చిత్రకారుడు : కళాసాగర్



మృదంగ విద్వాంసురాలు
సుమతీ రామమోహనరావు

కూచిపూడికి జీవమిచ్చింది
వెంపటి చినసత్యం



ప్రొఫైల్

# అరుదైన కళాకారిణి శ్రీమతి దండమూడి సుమతీ


దండమూడి సుమతీ రామమోహనరావు

కేంద్రప్రభుత్వ సంగీత నాటక అకాడమీ అవార్డు గ్రహీత, మృదంగ వాద్యంలో టాప్‌గ్రేడు పొందిన ఏకైక (మృదంగ) కళాకారిణి. ఆమెను చూస్తే విజయవాడ ప్రజలే కాదు భారతదేశంలో ప్రతీ కళాకారుడు గర్వపడతారు. ఈనాడు సమాజంలో అన్నిరంగాల్లోనూ మహిళలు రాణిస్తున్నారు. 50 సంవత్సరాల క్రితమే పురుషులకు మాత్రమే పరిమితమైన మృదంగ వాద్యాన్ని నేర్చుకోవటమే కాదు ఆ రంగంలో పురుషులతో దీటుగా రాణించి రికార్డు సృష్టించారు. ఆమె ఎవరో కాదు ప్రఖ్యాత మృదంగ కళాకారిణి శ్రీమతి దండమూడి సుమతీ రామమోహనరావు(ఆమె భర్త అంతర్జాతీయ ఖ్యాతిగడించిన మృదంగం చక్రవర్తి దండమూడి రామమోహనరావు) గారితో మనోభావాలు పంచుకుందాం.

**- శ్రీమతి కోకా విమలకుమారి**

*సుమతీగారూ మృదంగ విద్వాంసురాలిగా మీరు అంతర్జాతీయ ఖ్యాతి గడించారు కదా! మీ గురించి పాఠకులకు చెప్పాలనుకుంటున్నాం. ముందుగా మీ బాల్యం గురించి చెప్పండి.*

నేను పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులో 1950వ సం॥ అక్టోబర్ 16వ తేదీన శ్రీనిడుమోలు రాఘవయ్య , వెంకటరత్నమ్మ దంపతులకు జన్మించాను. నాన్నగారికి విజయవాడ ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాలలో ఉద్యోగం రావటంతో విజయవాడకు చేరుకున్నాము. మేము ఆరుగురు అక్కచెల్లెళ్లం, ముగ్గురు అన్నదమ్ములం.

*సాధారణంగా మృదంగం, తబల, డోలు వంటి చర్మవాద్యాలను పురుషులే నేర్చుకుంటారు కదా! మీరు ఒక మహిళ అయి ఉండి మృదంగం ఎందుకు నేర్చుకున్నారు?*

మా న్నాగారు మృదంగ విద్వాంసులు కావటంతో నాకు అతి చిన్న వయస్సులోనే మృదంగం నేర్పించారు. అయితే అప్పటికి నాకు ఆడ, మగ ఈ తేడాలు తెలియని వయస్సు. బహుశా నా ఆసక్తి గమనించి నాన్నగారు నేర్పి ఉంటారని అనుకుంటున్నాను. అయినా కళలు దైవదత్తమైనవి కదా! భగవంతుడు ఎలా అనుగ్రహిస్తే అలా జరుగుతుంది.

*మీరు మృదంగం నేర్చుకోవటం మొదలు పెట్టి 50 సంవత్సరాలు దాటింది. ఆ రోజుల్లో ఆడవారు మృదంగం నేర్చుకోవటం ఒక వింతగా చూడలేదా! అలాగే ఏవైనా ఇబ్బందులు ఎదురయ్యాయా?*

నేను ముందే చెప్పినట్టు ఈ విషయాలు తెలియని వయస్సులోనే మృదంగంతో కచేరీల్లో పాల్గొన్నాను. ఆ తర్వాత నాకు దక్కవలసిన గౌరవం దక్కింది. సాధారణంగా మహిళలకు ఎదురయ్యే ఇబ్బందులు మినహా ప్రత్యేకించి నేను ఎటువంటి ఇబ్బందులు ఎదుర్కొన్నట్టు గుర్తులేదు.



దండమూడి సుమతీ రామమోహనరావు దంపతులు




ఆ తర్వాత వేల కచేరీలలో పాల్గొని అనేక మంది విద్యాంసులకు మృదంగ వాద్య సహకారం అందించాను. మద్రాసు మ్యూజిక్ అకాడమీ నుండి మూడు సార్లు ఉత్తమ మృదంగ వాద్య కళాకారిణిగా గౌరవాన్ని అందుకోవటం తొలిరోజుల్లో ఎంతో ఆనందాన్ని కలుగజేసింది. ఆకాశవాణిలో అడిషను ఇచ్చి కచేరీలు చేయటం, టాప్‌గ్రేడు కళాకారిణిగా గుర్తింపు పొందటం, అలాగే దూరదర్శన్ కార్యక్రమాలు, దేశవ్యాప్తంగా జరిగిన అనేకమైన ప్రఖ్యాత సంగీతోత్సావాలలో పాల్గొని, అభినందనలు పొందటం ఇవన్నీ నాకు దక్కిన గౌరవాలుగా నేను భావిస్తున్నాను. ఎన్ని వేల కచేరీలు చేసినా నా భర్త, గురువు దండమూడి రామమోహనరావు గారితో కలసి చేసిన కచేరీలు, జాతీయ సంగీత సమ్మేళనాలు నాకు ప్రత్యేకంగా గుర్తుండిపోతాయి. అవే నా జీవితంలో మధురజ్ఞాపకాలు. అలాగే మృదంగ వాద్యంలో టాప్‌గ్రేడు పొందిన దంపతులం మేము మాత్రమే. మరొక విషయం కేంద్ర సంగీత నాటక అకాడమీ అవార్డులందుకున్న మృదంగ దంపతులు కూడా ఈ దేశంలో మరెవ్వరూ లేరని గర్వంగా చెప్పగలను. ఇదొక రికార్డుగా కూడా పేర్కొనవచ్చు. డాక్టరు మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారికి విదేశాల్లో కూడా మృదంగ సహకారం అందించాను.

'మృదంగ శిరోమణి', 'మృదంగ లయవిద్యాసాగర', మృదంగ మహారాణి, నాదభగీరథ, సునాద సుధానిధి, ఇండియా ఇంటర్నేషనల్ ఫ్రెండ్‌షిప్ సొసైటీ వారిచే 'ఉమన్ ఎచీవర్ అవార్డు', మదర్‌థెరిస్సా పురస్కారం, ఇంటర్నేషనల్ పబ్లిషింగ్ హౌస్ వారి 'బెస్ట్ సిటిజన్ ఆఫ్ ఇండియా' వంటి అనేక బిరుదులు గౌరవాలు అందుకున్నాను.

*వృత్తిపరంగా మీ గురించి చెప్పండి.*

నేను ముందుగా మా నాన్నగారు నిడుమోలు రాఘవయ్య గారి వద్ద మృదంగ విద్య నేర్చుకున్నాను. తర్వాత విజయవాడలో ప్రభుత్వ సంగీత నృత్య కళాశాలలో సర్టిఫికెట్, డిప్లమో పరీక్షలు ఆనర్స్‌లో పాసయ్యాను. అలాగే భరతనాట్యంలో కూడా డిప్లమో చేశాను. 1969లో కేంద్రప్రభుత్వ స్కాలర్‌షిప్ అందుకున్నాను. 1970లో ఇదే కళాశాలలో ఉద్యోగం వచ్చింది.

*కళాశాలలో నేర్చుకున్న తరువాత ఇంకెక్కడైనా శిక్షణ పొందారా?*

మృదంగ శబ్దబ్రహ్మ, మృదంగ చక్రవర్తి శ్రీదండమూడి రామమోహనరావుగారి గురించి తెలియని సంగీత కళాకారులు ప్రపంచంలో ఎవరూ ఉండరు. ఆయన చిన్నతనంలోనే మహా విద్యాంసులు. ఆయన వాద్యం విని, ఆ స్ఫూర్తితో మృదంగవాదనంలో అత్యున్నత శిఖరాలను అధిరోహించాలన్న కోరిక నాలో కలిగింది. ఆ ఆశ చిగురించి, కొంత కాలానికి ఆయన దగ్గరే నేర్చుకోవటం వల్లనే నేను టాప్‌గ్రేడు కళాకారుణిగా గుర్తింపు పొందగలిగాను. ఆ తర్వాత కాలంలో దండమూడి రామమోహనరావు గారినే భర్తగా పొందటం కేవలం నా పూర్వజన్మ సుకృతం. ఆ భావాన్ని నేను మాటల్లో వర్ణించలేను.

*మీరు చేసిన కచేరాలు, మీరు పొందిన గౌరవాలు గురించి వివరిస్తారా?*

నేను 14వ ఏట నుంచే కచేరీలు చేస్తున్నాను. మొదటి కచేరీ మహాగాయని శ్రీరంగం గోపాలతర్నంగారి తో చేశాను.

*లయవేదిక సంస్థను స్థాపించారు కదా! వివరాలు చెప్పండి.*

నేను 1950లో పుట్టాను 2000 సం॥ నాకు 50 సంవత్సరాలు కదా! స్వర్ణోత్సవ సందర్భంగా లయవాద్యాలకు, లయవాద్య కళాకారులకు ఏమైనా చేయాలనిపించి, లయవేదిక అనే సంస్థను స్థాపించాను. మృదంగ వాద్య పోటీలు నిర్వహించి బహుమతులు అందచేయటం, కళాకారులను సత్కరించటం చేశాము. ప్రస్తుతం ఈ సంస్థను దండమూడి రామమోహనరావు

లయవేదిక పేరుతో నిర్వహిస్తున్నాము. నా పతిదేవులు దండమూడి రామమోహనరావు గారి వద్ద ఉన్న వందలకొద్ది ముక్తాయులను పుస్తకంగా అచ్చువేయించాము. అలాగే ఆ ముక్తాయిలను ఏవిధంగా వాయించాలో చూసే విధంగా సి.డి.లను కూడా రూపొందించటం జరిగింది.

*మీ శ్రీవారు, మీ గురువుగారు దండమూడి రామమోహనరావు గారి గురించి చెప్పండి.*

నాకు గురవుగారు, శ్రీవారు, సర్వస్వం మాత్రమే కాదు, నా దైవం కూడా రామమోహనరావు గారే. ఆయన విద్యను, వ్యక్తిత్వాన్ని వివరించాలంటే ఒక గ్రంథం వ్రాయాలి. ఎవరికీ అందని ఉన్నతమైన మనస్తత్వం, అందరినీ గౌరవించే మహోన్నతమైన మనస్సు ఆయనకే సొంతం. అందుకే సంగీత ప్రపంచంలో ఆయనకు ప్రేత్యేకమైన గుర్తింపు దక్కింది. ప్రత్యేకించి ఆయన మృదంగ వాద్యం వినాలని ఇతర రాష్ట్రాల వారు కూడా ఉవ్విళ్ళూరుతారు. విజయవాడలో కచేరీ చేసేందుకు దక్షిణాది రాష్ట్రాల కళాకారులు కానీ. మన రాష్ట్రంలో ఇతర ప్రాంతాల కళాకారులు కానీ వస్తే ముందుగా దండమూడి వారిని కలుసుకుని ఆశీస్సులు పొందేవారు ఇది అందరికీ తెలిసిన సత్యం. మృదంగాలను ఎంతో అపురూపంగా చూసుకోవటమే కాదు,


దండమూడి రామమోహనరావు


సుమతీ రామమోహనరావుగారి వారసత్వాన్ని అందిపుచ్చుకున్న కుమారి లయ

గౌరవించేవారు మృదంగాన్ని దైవంగా భావించేవారు. నిరంతరం మృదంగాల ముందు కూర్చుని నాటు, మీటు సరి చేసుకుంటూ ఉండేవారు. అంతటి అంకితభావం కొందరికే ఉంటుంది. ఆయన కచేరీకి వెళ్తుంటే రాచఠీవి ఉట్టిపడేది. సరస్వతీదేవి ఆయన ముఖంలో ప్రకాశిస్తూ ఉండేది. దర్జా, దర్పం ఆయనకు సహ లక్షణాలు. ఆయనను ఎవరితోనూ పోల్చలేము. దండమూడి వారి శైలి మరొకరికి రాదు అని ఖచ్చితంగా చెప్పగలను, నాదభగీరథ వాద్యరత్న, కళాప్రవీణ, నాదస్వరబ్రహ్మ వంటి అనేక బిరుదులు కేంద్రసంగీత నాటక అకాడమీ అవార్డు, రాష్ట్ర ప్రభుత్వం నుంచి హంస అవార్డు, రాష్ట్ర సంగీత అకాడమీ పురస్కారం, తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన విద్వాంసుడిగా గౌరవం దక్కాయి. మేము నివశించే వీధికి దండమూడి రామమోహనరావు గారి పేరు పెట్టడం ఆయన ప్రతిభకు తార్కాణం. వారి మృదంగం పట్ల ఎంతటి మమకారం ఉందంటే మా ఏకైక పుత్రికకు లయ అని పేరు పట్టారు.

*ఈ వయస్సులో కూడా కచేరీలు చేస్తున్నారా?*

జవాబు: కళాకారులకు వయస్సుతో పనిలేదు, పట్టుదల ఆసక్తి ఉండాలి. అంతేకాదు కళాకారులు నిరంత ర విద్యార్థిగానే బతకాలి. నాకు కూడా ఇంకా నా విద్యని అభివృద్ధి చేసుకుని మరిన్ని ఉత్తమమైన కచేరీలు చేయాలని కోరిక ఉంది. అందుకోసం నిరంతరం కృషి చేస్తూనే ఉంటాను. మహిళగా నేను మృదంగం

సుమతీరామమోహనరావుగారితో
రచయిత కోకా విమలకుమారి

నేర్చుకుని మహిళలకు ఆదర్శంగా నిలిచానని అందరూ అంటుంటారు. అయితే మరికొందరు మహిళలు కూడా మృదంగం నేర్చుకునేందుకు ముందుకు రావాలన్నది నా ఆకాంక్ష. నా కుమార్తె శ్రీ లయ ప్రస్తుతం బి.టెక్. చదువుకుంటున్నది. ఈ కారణంగానే ఆమెకు కూడా మృదంగం నేర్పిస్తున్నాను. యాభై సంవత్సరాల క్రితం ఆనాటి కట్టుబాట్లను త్రోసిరాజని మగవాళ్లతో సమానంగా మృదంగం వాయించేందుకు నన్ను ప్రోత్సహించిన నా తల్లిదండ్రులకు నేను ఎప్పటికీ కృతజ్ఞురాలినై ఉంటాను. ఎందుకంటే ఆ రోజుల్లో ఆడవాళ్లు బయటికి వచ్చి సాధారణ చదువు చదువుకొనేందుకే ఎన్నో ఆంక్షలు ఉండేవి.

### యువతరంపై మీ అభిప్రాయం!

జవాబు: ఈనాటి యువతరాన్ని చూసినా, పిల్లలను చూసినా జాలి కలగటమే కాదు ఆవేదన చెందుతున్నాను. వారికి మన భాష, సంస్కృతుల పట్ల ఏ మాత్రం అవగాహన ఉండటంలేదు. భాషను, సంస్కృతిని ప్రేమించిన వారు ఉత్తమ పౌరులుగా మారతారు. మీరు గమనించండి కవులు, కళాకారులకు నేరస్వభావం ఉండదు. ఈ రోజుల్లో పిల్లలకు విద్యకు విపరీతమైన ప్రాధాన్యం ఇవ్వవలసిన అగత్యం ఏర్పడింది. ఏదైనా కళను నేర్చుకుందామన్నా సమయం దొరకదు. ఒకవేళ నేర్చుకున్నా తీవ్రంగా కృషిచేయలేకపోతున్నారు. కళారంగం కనుమరుగు కాకుండా ప్రభుత్వం, సంస్థలు కృషి చేయాలి. లేదంటే మనవైన కళలను గుర్తించి పుస్తకాల్లోనే తెలుసుకోవలసి వస్తుంది.

మరొక మంచి విషయం, వారు ప్రస్తావించారు.

ది.31-1-2011లో దండమూడి రామమోహనరావుగారు పరమపదించారు. వారి కీర్తిని దశదిశలా ఇనుమడింపజేయడానికై వారి జ్ఞాపకార్థం విజయవాడ తుమ్మలపల్లి కళాక్షేత్రంలో రామమోహనరావుగారి విగ్రహాన్ని ఆవిష్కరింపజేశారు. ఇది వారి యొక్క కీర్తి పతాకకు మరో నిదర్శనం.

మృదంగ వాయిద్య విద్యను క్రొత్తదనంతో మరింత అభివృద్ధి చేయాలనుకొంటున్న శ్రీమతి దండమూడి సుమతీరామమోహనరావుగారి ఆకాంక్ష నెరవేరాలని ప్రభుత్వ పరంగా కూడా ఉత్తమకళాకారులకు ఆదరణ, ప్రోత్సాహం లభించాలని అభిలషిస్తూ ఈ పరిచయ వేదికకు చక్కని సహకార మందించిన శ్రీమతి దండమూడి సుమతీ రామమోహన్‌గారికి అభినందనలు తెలియజేస్తున్నాను.





# మన కార్టూనిస్టులు

-కళాసాగర్

"అక్షరం రూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క. లక్షమెదళ్లకు కదలిక అన్నాడు, ఆనాడు మహాకవి కాళోజీ. అక్షరానికున్న శక్తి అలాంటిది. వేల అక్షరాలతో చెప్పలేని భావాన్ని ఒక్క కార్టూన్ ద్వారా చెప్పొచ్చు అంటున్నారు నేటి కార్టూనిస్టులు. నిరక్షరాస్యులను కూడా కదిలించగల శక్తి కార్టూన్‌కుంది.

వివరణ అవసరం లేకుండా సూటిగా, సంక్షిప్తంగా, విషయాన్ని పాఠకుడి హృదయానికి హత్తుకునేలా చేసే గొప్ప కళా మాధ్యమం కార్టూన్. అందుకే రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాహిత్య, కళా విషయాలతో నిమిత్తం లేకుండా అన్ని రకాల పత్రికలలోనూ నేడు కార్టూన్లు ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ఇంత శక్తివంతమైన కళాప్రక్రియకు తెలుగులో ఆధ్యుడు శ్రీ తలిశెట్టి రామారావు గారైతే, ఆ తర్వాత కార్టూన్ విస్తృతంగా వ్యాప్తిలోకి రావడానికి బాపు, జయదేవ్, బాలి, మోహన్, ఏ.వి.ఎమ్, చంద్ర, మల్లిక్, సత్యమూర్తి, శ్రీధర్, కుమారి రాగతి పండరి లాంటి ఎందరో కార్టూనిస్టులు కృషి చేస్తున్నారు.

తెలుగు కార్టూన్ పితామహుడు తలిశెట్టి రామారావు గారితో 'మనకార్టూనిస్టులు' శీర్షికను ప్రారంభించాం. చదవండి, హాయిగా నవ్వండి, మీ అభిప్రాయాలను తెలియజేయండి...

## 'హాస్యప్రియు'డు శంకు



శ్రీ సంపర రామచంద్రరావు-ప్రభావతి దంపతులకి ప్రథమ సంతానంగా 16 డిశంబరు, 1946న పుట్టిన 'శంకు'కి తన తాతగార వూరైన తణుకులో అక్షరాభ్యాసం జరిగి, బాల్యం అక్కడే గడిచింది. స్కూలు చదువు విజయనగరం, గుంటూరు, విజయవాడ, పాలకొల్లు, నెల్లూరు ఇలా వాళ్ల నాన్నగారు ఉద్యోగరీత్యా వెల్లిన వూళ్ళలో జరిగింది. నెల్లూరు విఆర్ కాలేజీలో పియుసిని, విజయవాడ లో లయోల కాలేజీలో బి.యస్సీని చదివి, కాకినాడకి వచ్చి అక్కడ ప్రముఖ రచయిత యండమూరి వీరేంద్రనాథ్ క్లాస్‌మేట్‌గా ఇద్దరూ కలిసి సిఎ చదివారు. ఆ చదువు పూర్తయ్యాక ఇద్దరూ ఒకచోటే ఎపిఎస్ఎఫ్‌సి హైదరాబాద్‌లో పనిచేశారు.

ఇరవై ఎనిమిది సంవత్సరాల సర్వీసు పూర్తయి స్వచ్ఛందంగా పదవీ విరమణ చేసిన శంకు అప్పట్నుంచీ తనకి ఆదినుంచి ఇష్టమైన మల్టీమీడియా రంగంలోనే స్థిరపడ్డారు.

హైదరాబాద్‌లో తన స్వంత ఇంటి గ్రౌండ్‌ఫ్లోర్‌లో Animyths స్టూడియో ఏర్పాటు చేసి, అక్కణ్ణుంచే తన సృజనాత్మక కార్యకలాపాలు కొనసాగిస్తున్నారు.

తెలుగువారికి సుపరిచిత టెలివిజన్ న్యూస్ ప్రెజెంటర్ శ్రీమతి శోభాశంకర్‌తో 1976లో వివాహమైన ఈ దంపతులకు ఓ కూతురు, ఓ కొడుకు. ఆ ఇద్దరికీ వివాహాలు జరిగి జీవితాల్లో స్థిరపడ్డారు.

జీవితాన్ని లోతుగా చవిచూసిన ఓ విలక్షణ సామాజిక విశ్లేషకుడిగా భర్తగా, తండ్రిగా, తాతగా శంకు మనోభావాలు తమదైన వ్యంగ్య హాస్య పరిశీలనలను ఇప్పటికీ అనునిత్యం పత్రికలలోను, ఫేస్‌బుక్‌లోనూ ఆయన కార్టూన్లలో మనం చూస్తూనే వున్నాం.




మరపురాని అవార్డులు, రివార్డులు, అభినందనలు వగైరా...

ఏదైనా సృజనాత్మక రంగంలో లోతుగా కృషి చేసినప్పుడు అడపాదడపా కొన్ని ప్రశంసలు, అభినందనలు, అవార్డులు, రివార్డులు రావడం, మన బాధ్యతని మరింత పెంచి, ఇంకా గట్టి కృషి చేయడానికి బాగా దోహద పడతాయి. ఓ కార్టూనిస్టుగా, దర్శక రచయితగా, ప్రచురణకర్తగా, నాకు దక్కిన అభినందనలు పురస్కారాలు అనేకం. అయితే, వాటిలో మనసు పులకరిస్తుంది.

ఉదాహరణకి 1978లో విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో వారు నిర్వహించిన రాష్ట్రస్థాయి కార్టూన్ల పోటీలో ప్రథమ బహుమతి గెలిచి, శ్రీ బాపుగారి చేతిమీద దాన్నందుకోవడం నాకో మధురానుభూతి.

అలాగే, పర్యావరణ పరిరక్షణ అనే అంశం మీద గీసిన నా కార్టూన్‌కి ఇంటర్నేషనల్ కార్టూన్ ఫెస్టివల్, నాక్ హీస్ట్ బెల్జియంలో వచ్చిన గుర్తింపు సందర్భంగా, మా సంస్థ ఎపిఎస్ఎఫ్‌సి యాజమాన్యం నన్ను బెల్జియం పంపినప్పుడు... నాకు అక్కడ లభించిన సత్కారం అనూహ్యం, చిరస్మరణీయం.

నేను ప్రచురించిన క్రోక్విల్ హాస్యప్రియ పత్రికను ఉత్తమ హాస్య ప్రచురణగా గుర్తించి రేలంగి ఇంటర్నేషనల్ ఆర్ట్ అకాడమీ వారు, శ్రీరామోజీరావుగారి చేతిమీద జరిపిన సత్కారం మరువలేనిది.

ప్రసారభారతి యునిసెఫ్ వారు 'ఆడబిడ్డ' అనే అంశం మీద నిర్వహించిన రాష్ట్రస్థాయి అరవై సెకన్ల డాక్యుమెంటరీ కాంపటీషన్‌లో ప్రథమబహుమతి (రు. 50,000/-) నందుకున్నప్పుడు పొందిన థ్రిల్ మాటల్లో చెప్పలేను. నేను తీసిన 'కాంతం కథలు' సీరియల్‌ని తిరుపతిలో వున్న ఫైన్ ఆర్ట్ అకాడమీ వారు అక్కడి మహతి ఆడిటోరియం వైడ్ స్క్రీన్ మీద ప్రదర్శించి, నాకు నా శ్రీమతికి పౌరసన్మానం జరపడం మరో తీపి అనుభవం.

నా 'మిస్టర్ పెళ్ళాం' చిత్రానికి ఉత్తమ చిత్రంగా, నా 'కాంతం కథల'కు ఉత్తమ టీవీ సీరియల్‌గా బంగారు నందులు రావడం నేనెన్నటికీ పదేపదే తల్చుకుని ఆనందించే దిగ్విజయ సందర్భాలు.




అయితే, ఆ మధ్య నా మిత్రుడు, ప్రముఖ చలన చిత్ర హాస్యనటుడు బ్రహ్మానందం, తనకు పద్మశ్రీ వచ్చిన సందర్భంగా జూబ్లిహిల్స్‌లోని ఫిలింక్లబ్‌కి తెలుగు ఫిలం ఇండస్ట్రీ హాస్య కుటుంబ సభ్యులందర్నీ, ఆహ్వానించి, వారందరి ముందు కీ॥శే॥ జంధ్యాలకు గురుసత్కారం జరిపారు.

అదే సందర్భంలో మిత్రుడు జంధ్యాలకు తనను నేను పరిచయం చేసిన విషయం గుర్తుచేస్తూ నాక్కూడా సన్మానం జరపడం మరో విశేషం.

## 'క్రోక్విల్ శంకు'

"అసలు 'శంకు' అనే పేరు ఆయకెలా వచ్చింది? ఆ తర్వాత అది క్రోక్లిల్ శంకుగా ఎందుకు ప్రచారం పొందింది? అసలు ఆయనకీ క్రోక్విల్‌కీ గల కనెక్షనేంటి?" లాంటి అనేక సందేహాలకు శంకుగారు ఇచ్చిన వివరణ ఆసిక్తకరంగా వుంటుంది ఇలా...

'కార్టూన్లు వేసే ప్రారంభదినాల్లో నేను కొన్నాళ్ళు 'శంకర్' అనే పేరుతో, ఇంకొన్నాళ్లు 'కుమార్' అనేపేరుతో కార్టూన్లు వేస్తుండేవాణ్ణి.

కానీ ఇదే పేర్లతో ఇంకొంతమంది కూడా కార్టూన్లు వేస్తుంటే చిన్న గందరగోళ పరిస్థితి ఏర్పడేది.

అప్పుడు స్వర్గీయ పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారు నా పేర్లలోని రెండు అక్షరాల్ని పైకి లాగి 'శంకు'గా నామకరణం చేశారు.

ఆ పేరును నా కలంపేరుగా కొనసాగించమని దీవించారు. ఇది జరిగి నలభై సంవత్సరాలు పైబడింది.

అప్పటిణ్ణుంచీ అలాగే కొనసాగిస్తున్నాను.

ఇంక 'క్రోక్విల్' విషయానికొస్తే... నేను హైదరాబాదు కొచ్చిన కొత్తల్లో 1972 ప్రాంతాల్లో, స్థానికంగా వున్న చాలా మంది తెలుగు కార్టూనిస్టుల్ని కలిశాను. ఐతే, వాళ్లు ఎవరికి వారుగా వుండడం కనిపించింది గానీ.. అందరూ కలిసిన జాడ దొరకలేదు.

అప్పుడు ఖమ్మంలో ఏటేటా నాటక పరిషత్తులు నిర్వహించే


బాపూ గారితో శంకు

ఖమ్మం కళాపరిషత్తు కార్యదర్శి అప్పారావుగారు ముందుకొచ్చి మా వూళ్ళో మీరనుకున్న సమావేశం ఏర్పాటు చేసుకోండి! దానిక్కావాల్సిన ఏర్పాట్లు మేం చూస్తాం!' అని అభయమిచ్చారు.

అలా 1974లో ప్రప్రథమంగా తెలుగు కార్టూనిస్టులంతా ఖమ్మలో కలిశాం. ఆ సమావేశాలకి ముఖ్య అతిథిగా దాసరి నారాయణరావుగారు ప్రత్యేక అతిథులుగా, వీరారెడ్డి, తుర్లపాపటి, సినీనటి విజయలలిత వచ్చారు. అప్పట్లో తెలుగు కార్టూనిస్టులన్న ప్రతి ఒక్కరూ హాజరయ్యారు.

ఆ సందర్భంగా బాపుగారి ముఖచిత్రంతో ఓ చక్కటి సావనీర్‌ని కూడా విడుదల చేశాం.'



ప్రియా! నీ కోసం కొండమీద కోతినైనా తీసుకొస్తాను!

వద్దులే! నాకు నువ్వు చాలు!

అదేంటండీ! అన్నివేల బిల్లేసి బొత్తిగా మామూలు కుట్లే వేశారు! ఇంకా ఎంబ్రాయిడరీ చేస్తారనుకున్నానే!!

కళాప్రపంచం

# "నిశ్శబ్ద సంగీత తుఫాన్- బిథోవిన్"



యూరప్ ఖండంలో ఫ్రెంచి విప్లవం; అనంతరం నెపోలియన్ యుద్ధాలతో నిండిన కాలమది. ప్రపంచాన్ని ఈ సంఘటనలు ఎంతగానో ప్రభావితం చేశాయి. వీటి ప్రభావాలు జనజీవనంపై, కళలు, సాహిత్య రంగాలపై పడ్డాయి. సమాజస్థితి కూడా మారుతున్న కాలం. విజ్ఞాన ఆవిష్కరణలకు కూడా నాంది పలికిన కాలం. జేమ్స్ హర్‌గ్రీవ్ "స్పిన్నింగ్ జెన్నీ" కనుగొన్నాడు. జాన్ హే "ఫ్లయింగ్ షటిల్" కనుగొన్నాడు. జేమ్స్‌వాట్ "స్టీమ్ ఇంజన్"ను ఆవిష్కరించాడు.

ఎల్.ఆర్. వెంకటరమణ

జీవశాస్త్రపరంగా ఎడ్వర్డ్ జెన్నర్ "స్మాల్ ఫాక్స్" వాక్సీన్ కనుగొన్నాడు. రసాయన శాస్త్రపరంగా జోసెఫ్ ప్రీస్టీ "ఆక్సిజన్" కనుగొన్నాడు. అంతరిక్షరంగంలో విలియం హెర్షల్ "యురేనస్" గ్రహాన్ని కనుగొన్నాడు. కెప్టెన్ జేమ్స్ కుక్ తూర్పు ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ ప్రాంతాలకు మార్గం ఆవిష్కరించాడు. ఇలాంటి ఇన్ని ఆవిష్కరణల నడుమ సంగీత ప్రపంచం ఒక వజ్రాన్ని అందించింది. అతడే "లుద్విక్ వాన్ బిథోవిన్".

18వ శతాబ్దికి ముందు సంగీత లోకాన్ని చర్చి



అధిగమించేది. తరువాత భూస్వామ్య వర్గం సంగీతాన్ని ఆస్వాదించారు. మరీ ముఖ్యంగా వారు సంగీత వాయిద్యాలు నేర్చుకున్నారు. స్వరకర్తలను, సంగీతకారులను తమకు విధేయులుగానే చూసే వారు. కానీ వీటిని బిథోవిన్ సహించేవాడు కాదు. ఎంత పెద్దవారైనా తనదైన శైలిలో సూటిగా, నిక్కచ్చిగా వ్యవహరించేవాడు "బిథోవిన్".

ఒకసారి బిథోవిన్ సంగీత ప్రదర్శన ఇస్తున్నాడు. అపుడో ధనవంతుడైన పెద్దమనిషి తనదైన శైలిలో బిగ్గరగా అరుస్తూ ఇతరులతో మాట్లాడుతున్నారు. దీన్ని భరించలేని బిథోవిన్ సంగీత ప్రదర్శన ఆపుచేసి, "ఇలాంటి పందులకోసం కాదు నేను సంగీత ప్రదర్శన ఇస్తున్నది" అంటూ ఘాటుగా మాట్లాడాడు. అంతే అందరూ నిశ్శబ్దంగా సంగీతాన్ని విన్నారు.

లుద్విక్ వాన్ బిథోవిన్ డిసెంబర్ 16, 1770 సం॥లో జన్మించాడు. "జొహనాన్ వాన్ బిథోవిన్", ఏడుగురి సంతానంలో రెండవవాడు. వీరిలో కేవలం ముగ్గురు మాత్రమే బ్రతికారు. లుద్విక్ బిథోవిన్ జీవితంలో అతని తమ్ముళ్లు-కాస్పర్ ఆన్‌టన్ కార్ల్, నికోలస్ జొహనాన్‌ల ప్రభావం కూడా ఉంది.

బిథోవిన్ బాల్యమంతా కష్టాలతో గడిచింది. తండ్రి అతి తాగుడుకు బానిస. ఇతడు కొలోన్ చర్చి సంఘంలో గాయకుడు, వాద్యకారుడు. బాల బిథోవిన్ చిన్ననాడే ఇనుప కిటికీలపై



రిధమిక్‌గా శబ్దాలు చేస్తూ సంగీత సృష్టి చేశాడు. ఇది తండ్రి గమనించాడు. దీంతో బాల బిథోవిన్‌కు సంగీత పాఠాలు నేర్పాలనుకున్నాడు. ఇదంతా కొడుకుపై మమకారంతో కాదు. ఆర్థికంగా వెసులుబాటు కలుగుతుందని మాత్రమే. సంగీత ప్రపంచంలో బాల మొజార్ట్ ప్రతిభను ప్రపంచం చూసింది. అలా తన కొడుకును చూడాలనుకున్నాడు తండ్రి. దీంతో కఠినంగా సంగీత శిక్షణ ఇచ్చేవాడు. లేత చేతివేళ నొప్పిపెడుతున్నా పియానోపై రాగాలు వాయించవలసివచ్చేది. నిరంకుశంగా కొడుకును నిర్భందించి పాఠాలు నేర్పేవాడు. అర్ధరాత్రిళ్లు ఎప్పుడో తాగివచ్చి, నిద్రపోయే బాల బిథోవిన్‌ను నిద్రలేపి పియానో వాయించమనేవాడు. పొరపాట్లు చేస్తే పిడిగుద్దులు తప్పేవి కావు.

దుర్భర పరిస్థితుల మధ్య, పేదరికంలో మురికి బట్టలతో బాలబిథోవిన్ అందవికారంగా ఉండేవాడు. పైగా తన వయస్సు మిత్రులు లేరు. చిన్నతనంలో ఏదైనా ఆనందం పొందగలిగాడంటే అది తల్లి మరియా వల్ల మాత్రమే కానీ ఆమె తీవ్ర అనారోగ్యంతో బాధపడుతుండేది. బిథోవిన్ ఎనిమిదవ ఏట సంగీత ప్రదర్శన ఇచ్చాడు. బిథోవిన్ గురువు క్రిస్టియాన్ గోట్‌లాబ్ నీఫే. కొంత పరిస్థితి అర్థం చేసుకొని బిథోవిన్‌ను ప్రోత్సహించేవాడు. పద్నాలుగు ఏళ్ల వయస్సులో నీఫేకు సహాయకుడుగా నియమితుడయ్యాడు. ప్రాథమిక విద్యతోనే చదువుకు స్వస్తి చెప్పాల్సి వచ్చింది. తరువాత అన్నీ తనకు తానుగా నేర్చుకున్నవే. అందుకే పదాల స్పెల్లింగ్స్, పలకడంపై ఎన్నో ఇబ్బందులు పడేవాడు.

చిన్న నాటి బిథోవిన్ సంగీత ప్రతిభ చూసిన మొజార్ట్ ఆదరం లభించింది నీఫే బిథోవిన్ ప్రతిభ చూసి తప్పక రెండవ మొజార్ట్ అవుతాడని జోస్యం చెప్పాడు. బిథోవిన్‌కు వియన్నా వెళ్లే అవకాశం వచ్చింది. ఆ కాలంలో వియన్నా యూరప్ ఖండపు సాంస్కృతిక రాజధాని. అక్కడ సుప్రసిద్ధ ప్రపంచ సంగీతకారుడు మొజార్ట్ కూడా నివసిస్తున్నాడు. మొజార్ట్ ముందు బిథోవిన్ తన సంగీతాన్ని వినిపించాడు. అపుడు మొజార్ట్ ఆశీర్వదిస్తూ "ఏదో ఒక రోజు నువ్వు తప్పకుండా సంగీత ప్రపంచంలో తుఫాన్ సృష్టిస్తావన్నాడు".

అక్కడ ఆనందంగా ఉన్న బిథోవిన్‌కు దుర్వార్త అందింది. దాంతో వియన్నా వదిలి బాన్ చేరుకున్నాడు. కారణం క్షయవ్యాధితో తల్లి చనిపోవడం. అతనికి ప్రేమానురాగాలు అందించిన తల్లి మరణం అతనికి తీరని లోటు అయింది. దీనికి తోడు తాగుడుకి బానిసైన తండ్రి ఉద్యోగం కూడా కోల్పోయాడు. కుటుంబ భారమంతా బిథోవిన్‌పై పడింది.

1792లో తండ్రి మరణంతో మరలా వియన్నా చేరుకున్నాడు. ఇన్ని కారణాల వల్లా బిథోవిన్ ఒక కాంప్లెక్స్ వ్యక్తిగా మసలేవాడు. అనాగరికునిగా, దుందుడుకు స్వభావిగా, అదేకాలంలో దయ, సహృదయలతో మసలేవాడు. తరువాత జీవితమంతా ఈ రెండింటి కలబోతగానే సాగింది. రెండవసారి వియన్నా రావడంతో అందులోనూ మహానగరంలో జీవించడానికి కొన్ని పద్ధతులు, నాగరికునిగా ప్రవర్తించ వలసి వచ్చింది. దానికై విలువైన, ఖరీదైన ఆహార్యాన్ని ధరించాడు. ముఖ్యంగా శారీరకంగా పొట్టివాడు. ముఖంపై స్ఫోటకపు మచ్చలు ఉండేవి. కానీ అతనిలో ఒక వింతైన ఆకర్షణ కూడా ఉండేది.

బిథోవిన్ ఫ్రాంజ్ జోసెఫ్ వద్ద శిష్యరికం చేశాడు. బిథోవిన్ ప్రతిభకు మరింత రాటుదేలేలా హైడన్ శ్రమపడ్డాడు. కానీ బిథోవిన్‌లోని లోలోనున్న కాంప్లెక్స్ లక్షణాలతో హైడన్ విసుగుచెందేవాడు. బిథోవిన్ కొత్త గురువుల అన్వేషణలో పడ్డాడు. అల్బర్ట్ బెర్గర్, కాపెల్ మీస్టర్ వద్ద శిక్షణ పొందాడు.

స్వీడన్ రాజకుమారుడు లిచ్‌నోవ్‌స్కీ, బిథోవిన్‌ను తన

భవనానికి ఆహ్వానించాడు. పియానో నేర్పించాడు. ఉన్నత వర్గాలవారు తమ సంగీత అభిరుచి, అతని ఔన్నత్యాన్ని గుర్తించారు. మొజార్ట్, హైడన్‌ల మార్గంలోనే బిథోవిన్ స్వరరచన చేసినా తన ముద్రను అందులో చూపేవాడు. తన పట్ల తాను అంతులేని విశ్వాసంతో బిథోవిన్ ప్రవర్తించేవాడు. వాష్ బేసిన్‌లో ముఖం కడుగుకొనే బదులు నలుగురిలో, తలపై నీళ్ల గుమ్మరించుకునేవాడు. తను కూర్చిన సంగీత ట్యూన్స్ తన గదిలో చిందర వందరగా పడి ఉండేవి. మరెవరూ వాటిని తాకరాదని ఆంక్షలు పెట్టేవాడు.

బిథోవిన్ తన 28వ ఏట తనలో కలుగుతున్న ఒక మార్పు గమనించాడు. అది తనకు "సరిగా వినపడకపోవడం", సంగీతకారునికి చెవుడు అన్నది మరో శాపం. వైద్యులను సంప్రదించినా ఫలితం లేకపోయింది. ఇతని దుస్థితికి, ఇతని సంగీత కచేరి చూసిన ప్రేక్షకులు కంటనీరు పెట్టేవారు. బిథోవిన్ పియానో వాయిస్తున్నపుడు అతని నుండి అగ్నిపర్వతాలు బ్రద్దలై లావా వెదజల్లినట్లుండేది. అంతేకాక భావవేశంలో స్వరార్చన చేసేవాడు. తన చెవిటి తనంవల్ల, అశక్తిత వల్లా ఇతరులతో అకారణంగా తగాదాలకు దిగుతుండేవాడు.

సంగీతంలో మాత్రం ప్రకృతి పట్ల అభిరుచి, తోటి వ్యక్తుల పట్ల సోదరభావం, దేవునిపై నమ్మకం, ఇవన్నీ అతని సంగీతంలో మనకు చూపాడు. చెవిటితనం మీతిమీరడం, శారీరక అనారోగ్యం వల్లా ఉన్మాదిలా ప్రవర్తించేవాడు.

బిథోవిన్ నిరంతర ప్రయోగశీలి. వయస్సు పెరిగేకొద్దీ స్వరకల్పనలోనూ రాటుదేలాడు. సమకాలికులకు అందలేనంత


బాల్యంలో బిథోవిన్

ఎత్తుకు ఎదిగాడు. తరువాత తరాలవారికి ఆద్యుడయ్యాడు. తన జీవితకాలంలో 9సింఫనీలు; 6 నాటకాలకు స్వరకర్తగా; 5 పియానోకాన్‌సర్ట్స్, 9 పియానో ట్రయోస్, 32 పెద్ద గోనాటాలు; 166 స్ట్రింగ్ క్వార్‌టెట్స్, ఇంకా ఎన్నో పాటలకు కూర్చాడు. 200 జానపద సంగీత బాణీలు సమకూర్చాడు.

జీవితకాలంలో పెళ్లి మాత్రం చేసుకోలేదు. కానీ స్త్రీలపట్ల ప్రేమను ప్రదర్శించాడు. ఎన్నో తన సొనాటాలను వారికి అంకితమిచ్చాడు. మూడవ సింఫనీ "Eroica" నెపోలియన్‌కు అంకితమిచ్చాడు. అతని మరణానంతరం దొరికిన ఒక లేఖ ప్రేమలేఖగా గుర్తించబడింది. తన "Moonlight sonata" గులియెటా గుస్తియార్డికి అంకితమిచ్చాడు. థెరసీవాన్ బ్రన్‌స్విక్ ఈమె "Appasionats" కు ప్రేరణ. థెరసీ మల్‌ఫట్టి, బెట్టినా బ్రెంటానో ఇలా ఆడవారి పట్ల ఎంతో ప్రేమను కనబరచాడు. కానీ ఈ ఉత్తరాలు ఏవి వారికి పంపలేదు. తన ప్రేమ తనలోనే దాచుకున్నాడు. తనలోని విషాద ఆవేశంలో తనలో తాను కుమిలిపోయాడు.

వియన్నాలో ఉన్నపుడే బిథోవిన్ "ఆన్‌టోనియో సలేరీ"ని కలుసుకున్నాడు. అతడు మొజార్ట్‌కు తీవ్ర వ్యతిరేకి. ఇతనే మొజార్ట్‌ను విషప్రయోగం చేసి చంపాడనే ఒక పుకారు కూడా ఉండేది. సలేలి బిథోవిన్‌ను ఎంతగానో ఆదరించాడు. దీనికి ప్రతిగా బిథోవిన్ తన మూడు వయోలిన్ సొనాటాలను ఇతనికే అంకితమిచ్చాడు.




*email: venkataramana_lanka@yahoo.com*



చిత్రకళ

# కళలకు సన్నిధి, కళాకారుల పెన్నిధి-కళాసాగర్



***An Idea can Change your Life***
**"ఒక్క ఆలోచన జీవితాన్నే మార్చేస్తుంది" అన్న సెల్యులర్ కంపెనీ వాళ్ల ప్రకటన అప్పటికింకా వెలుగులోకి రాలేదు. కానీ, దాని ప్రాముఖ్యతను చాలా చిన్న వయసులోనే గుర్తించాడు. గోదావరి జిల్లాకి చెందిన ఓ కుర్రాడు. సృజనాత్మకమైన తన ఆలోచన కార్యరూపం దాల్చడానికి ఒక పరిశోధనాంశం కోసం పరితపించే రీసెర్చ్ స్కాలర్ కంటే ఎక్కువగా శ్రమించాడు.**

**- వెంటపల్లి సత్యనారాయణ**

రాష్ట్ర నలుమూలల పర్యటించి ఎందరో కళాకారులను కలిసాడు. ఇంటర్వ్యూలు చేసాడు, ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు. కాశ్మీర్ నుండి కన్యాకుమారి వరకు కళలకు సంబంధించిన సమాచారం సేకరించాడు. స్వతహాగా చిత్రకారుడైన ఆ కుర్రాడు తనలా ప్రతిభ వుండి వెలుగులోకి రాకుండా రాష్ట్రమంతటా వున్న చిత్రకారులు, కార్టూనిస్టులు, శిల్పులందరినీ ఒక వేదిక మీదకు తెచ్చి, వారిలో సృజనాత్మకతను మరింత మెరుగుపరచాలని ఆరాటపడ్డాడు. అందుకు తన మిత్రుల సహకారంతో 'ఆస్కా' అనే సంస్థను స్థాపించడమే కాక చిత్ర, శిల్పకారులు, కార్టూనిస్టుల వివరాలతో ఒక పుస్తకాన్ని రూపొందించాడు. అంతేకాదు ఆంధ్రుల కళాకౌశలాన్ని విశ్వవ్యాప్త తెలుగువారికి అందించే లక్ష్యంతో తనే సంపాదకుడిగా 2010సం॥లో 64కళలు డాట్‌కాం-సకల కళల సమాహారం అంతర్జాల తెలుగు మాస పత్రికను ప్రారంభించాడు. స్థాపించిన 20 నెలల కాలంలో అంతర్జాల పత్రికలలో సంచనలనాలు సృష్టించి, 25 దేశాలలో ఉన్న తెలుగువారిని అలరిస్తుంది. తన వయసు-అనుభవానికి మించిన ఆలోచనలతో దశాబ్ధం క్రితం అతడు రూపొందించిన ఆ 'పుస్తకం' కాలక్రమంలో ఆశ్చర్యకరమైన కళాసంబంధాలను సృష్టించింది.

అది 2008 ప్రాంతం. ఉద్యోగరీత్యా నేను ఖమ్మంజిల్లాలోని చర్లకు వెళ్లిన రోజులు, జిల్లా రాజదానైన ఖమ్మంకు దాదాపు 180 కి.మీ.ల దూరాన అతి మారుమూల ప్రాంతమైన చర్లలో అప్పటికే చిత్రకార ద్వయంగా ప్రసిద్ధిగాంచిన ముత్యాలరావు, బీర శ్రీనివాస్‌లకు తోడు నేను కూడా చేరడంతో చిత్రకారత్రయంగా మారాం. ముగ్గురం చిత్రకారులు కావడంతో తరచు చిత్రాల గురించి, వివిధ గేలరీల గురించి మాట్లాడుకోవడం మాకు మామూలు విషయంగా






మారింది. ఇంతలో ఒకటి రెండు రోజులు తేడాతో మా ముగ్గురికీ కూడా చిత్రకళకు సంబంధించిన ఒక పుస్తకం హైదరాబాద్ నుండి పోస్ట్‌లో రావడం ఆశ్చర్యాన్ని కలిగించింది. భారత కళాపరిషత్, తెలుగు విజ్ఞాన పీఠం కళాభవన్ సైఫాబాద్, హైదరాబాద్ వారు చిత్రకళలో 1947 నుండి 1985 వరకూ ఒక కళాకారుడు చేసిన కృషిని గుర్తించీ ప్రచురించిన పుస్తకమది. 1940లలోనే ఎంతో ఆధునికంగా వేసి మమ్మల్ని విస్మయానికి గురయ్యేలా చేసిన ఆ చిత్రాల సృష్టికర్త మరెవ్వరో కాదు. పి.ఆర్. రాజుగా ప్రాచుర్యం పొందిన డాక్టర్ పాళాల రాధాకృష్ణ రాజు. ఆయనే స్వయంగా మాకు ఆ పుస్తకాలను పోస్ట్‌లో పంపించడం జరిగింది. ఎక్కడో హైదరాబాద్‌లో 1920లో పుట్టి స్థిరపడిన ఆయన వయసులో గానీ, అనుభవంలోగాని, హస్తమసికాంతర బేధం ఉన్న ఆయన ఈ మారుమూల ఉన్న మమ్మల్ని గుర్తించడమేమిటి. ఆయన పుస్తకాలు పంపించడమేమిటి? అంతే కాదు నేడు రాష్ట్ర నలుమూలల్లో గల వివిధ చిత్రకళా సంస్థల నుండి చిత్రాలు పంపమని మాలాంటి ఎందరో చిన్న-పెద్ద కళాకారులకు ఆహ్వానాలు అందుతున్నాయి అంటే వీటన్నింటికీ కారణమైంది ఒకే ఒకపుస్తకం-అదే ఆంధ్రకళాదర్శిని. అలాంటి ఆంధ్రకళాదర్శినిని రూపొందించి పరోక్షంగా కళా వ్యాప్తికి కారణమౌతున్న ఆ కుర్రాడే కళాసాగర్‌గా ప్రసిద్ధిగాంచిన యల్లపు అప్పారావు. అనంతమైన అతని కృషే కాలక్రమంలో అతన్ని కళాసాగర్‌గా స్థిరపడేలా చేసింది.

శ్రీమతి లక్ష్మీకాంతం, నరసింహమూర్తి దంపతులకు 1971 డిశంబర్ 10న పశ్చిమ గోదావరి జిల్లా "మంచిలి" గ్రామంలో జన్మించిన కళాసాగర్‌కు చిన్నతనంలోనే చిత్రకళపై అపారమైన మమకారం ఏర్పడింది. కళలపట్ల ఏర్పరుచుకున్న ఆ మమకారం ఆయన్ని సాధారణ విద్య ఇంటర్‌తోనే సరిపెట్టేలా చేసినా ఆ తర్వాత తన కిష్టమైన లలితకళల్లో డిప్లమోను మద్రాస్ ప్రభుత్వం నుండి పూర్తిచేసారు. అంతే గాకుండా రాష్ట్రప్రభుత్వ సాంకేతిక విద్యాశాఖ వారు నిర్వహించే డ్రాయింగ్ లోయర్ హ్యాయర్‌లో TTC ని కూడా పూర్తిచేసారు. ఆ తదుపరి భీమవరం నందలి ఒక స్కూలులో డ్రాయింగ్‌టీచర్‌గా కొంతకాలం పనిచేసినప్పటికీ ముద్రణా రంగంపై గల ఆసక్తితో విజయవాడ వచ్చి, విక్రమ్‌పబ్లిషర్స్ సంస్థలో స్టాఫ్ ఆర్టిస్ట్‌గా చేరారు. వృత్తిలో భాగంగా ఆ పబ్లికేషన్ సంస్థలో పనిచేస్తూనే, ప్రవృత్తిపరంగా వాటర్, ఏక్రలిక్ వర్ణాల్లో ఆయన ఎన్నో చిత్రాలు వేసారు. దరహాసం, ఎంకి, నెలవంక సవవసంతం, సరస్వతి, రాధాగోపాలం లాంటి చిత్రాలు



వాటిలో ముఖ్యంగా చెప్పుకోవచ్చును.

'దరహాసం' అన్న చిత్రంలో తన ఎయిర్‌బ్రష్, కుంచె విన్యాసాలతో అమ్మాయి మోములో చూపించిన ఆ చిరునవ్వులు వీక్షించిన ప్రేక్షకుడి మానసంలో హాయి, ఆ నందపు విరుజల్లులు కురుపించేలా చేస్తే "ఎంకి" అనే వేరొక చిత్రంలో అందుకు విరుద్ధమైన భావాన్ని వ్యక్తం చేయడం జరిగింది. ఇందులో ఎంకి తన బావకోసం ఏదో వేదనతో కూడిన ఎదురుచూపుతో వెన్నెలరాత్రిలో తన పట్టెమంచానికానుకొని దీర్ఘాలోచనలో కూర్చుని ఉన్నట్లుగా చిత్రించారు. మొదటి చిత్రంలో ప్రసన్నత, ఆనందాలకు ప్రతీకగా లేతనీలం రంగును ప్రధానంగా వాడగా రెండో చిత్రంలో వేదన, నిరీక్షణలకు ప్రతీకగా గోదుమవర్ణమిళితమైన నలుపును ప్రధానంగా వాడుకున్నారు. ఇంకా ఆయన వేసిన చిత్రాల్లో "నెలవంక"లోని అమ్మాయి భంగిమ ప్రముఖ చిత్రకారుడు వడ్డాదిపాపయ్యగారి "అభిసారిక" చిత్రం స్ఫూర్తితో వేసినట్లుగా అనిపిస్తే "సరస్వతీదేవి" చిత్రం చాలా ప్రత్యేకంగా కనిపిస్తుంది. చేతివ్రేళ్లనే సిగరెట్లుగా మలిచి వాటిమధ్య కాలిపోతున్నట్లుగా మనిషిని చిత్రించి U.N.O. అంతర్జాతీయ అవార్డుని సాధించిన ఆయన కార్టూన్ అతని చిత్రాల్లో శిఖరాయిమానంగా చెప్పుకోవచ్చును.

ఒక ప్రక్క ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే మరోప్రక్క చినుకు, సైకాలజీ టుడే, రమ్యభారతి, భావతరంగిణి తదితరమైన




ప్రపంచ ఆరోగ్య సంస్థ అవార్డు పొందిన కార్టూన్

ఎన్నో పత్రికలకు ముఖ చిత్రాలు వేసారు. మొదట్లో కుంచెతో మాత్రమే పరిచయం కలిగిన కళాసాగర్ కాలక్రమంలో క్రోక్విల్‌పెన్ మరియు, కలంతో కూడా స్నేహం చేసారు. ఫలితంగా వందలకొద్దీ కార్టూన్లు వేసారు. 1995లో "ఆహ్వానం" మాసపత్రికలో తన తొలి కార్టూన్ ప్రచురితమైన తర్వాత ఇక వెనుదిరిగి చూడలేదు.

**'ఆస్కా' నిర్వహించిన ముఖ్యకార్యక్రమాలలో కొన్ని ..**

***2001- ఆంధ్రకళాదర్శిని-1 ప్రచురణ***

***2002- జయదేవ్ గారి ఆధ్వర్యంలో 'కార్టూన్‌మేళా'***

***2004- ఆంధ్రకళాదర్శిని-2 ప్రచురణ, వపా చిత్రాల సి.డి. ఆవిష్కరణ***

***2005- 'కారూనోత్సవం' తెలుగు కార్టూన్‌కు 75 సంవత్సరాలు పూర్తయిన సంధర్భంగా..***

***2007- ప్రపంచకార్టూనిస్టుల దినోత్సవ వేడుకలు***

***2008- తెలుగు బాష-సంస్కృతిలపై రాష్ట్రస్థాయి కార్టూన్ పోటీలు***

***2009- ఆర్టిస్టు హేండ్‌బుక్, తెలుగు చిత్రకళావైభవం డాక్యుమెంటరీ ఆవిష్కరణ***

***2010- పాటశాల పిల్లలకు పెయింటింగ్ పోటీల నిర్వహణ***

***2011- రాష్ట్రస్థాయి కార్టూన్ పోటీలు(సుమధుర సౌజన్యంతో)***

***2012- తలిశెట్టి రామారావు కార్టూన్ల పుస్తక ప్రచురణ***

తెలుగులో దాదాపు అన్ని పత్రికలలోను ఇప్పటికీ దాదాపు మూడువేలకు పైగా కార్టూన్లు వేసారు. కార్టూన్ పోటీల్లో అనేక సంస్థలనుండి బహుమతులు ఎన్నో పొందినప్పటికీ 2006 సం॥లో ప్రపంచ ఆరోగ్య సంస్థ నుండి "ధూమపానవ్యతిరేక దినోత్సవం" సందర్భంగా నిర్వహించిన అంతర్జాతీయ కార్టూన్ పోటీల్లో ప్రపంచవ్యాప్తంగా 244 దేశాల నుండి వెయ్యిమందికి పైగా కార్టూనిస్టులు పాల్గొన్న ఆ పోటీలలో ది బెస్ట్ టాప్ టెన్ కార్టూనిస్టులలో ఒకడుగా ఎంపికయ్యి ప్రపంచ ఆరోగ్య సంస్థ అవార్డు(200 డాలర్లు) గెలుచుకోవడం మనకు ఎంతో గర్వకారణమైన విషయంగా చెప్పుకోవచ్చు.

ఇక కుంచెతో చిత్రాలు, క్రోక్విల్‌పెన్‌తో కార్టూన్‌లు వేయడంతో పాటు కలం పట్టి వ్యాసాలు




పరిచయం చేయాలనే ఉద్దేశ్యంతో ఆంగ్లంలో Artist Directory ని 2009లో మరలా రూపొందించారు. కేంద్ర రాష్ట్ర లలిత కళా అకాడమీలు చేయవల్సిన ఇంతటి బృహత్తర కార్యక్రమాన్ని ఒంటి చేత్తో కళాసాగర్ చేయగలగడం అతని కార్యదక్షతను తెలియజేస్తుంది. అంతేగాక ఆంధ్రచిత్రకళా వైభవం పేరుతో ఆనాటి మన ప్రాచీన చిత్రకళ నుండి ఆధునిక దామెర్ల రామారావు మొదలు నేటి వరకూ రాష్ట్రంలో పరిడవిల్లుతున్న చిత్రకళా

కూడా ఏక కాలంలో రాయడం కళాసాగర్కే చెల్లింది. ఎన్నో దిన, వార, మాస పత్రికలు ముఖ్యంగా మిసిమి, చిత్రకళ, ఆంధ్రజ్యోతి, భావతరంగిణి, స్మైల్ప్లీజ్, కంప్యూటర్ ఫర్ యు, సైకాలజీటుడే మల్లెతీగ, ఆంధ్రకళాదర్శిని లాంటి ఎన్నో పత్రికలతో పాటు, విభిన్న ప్రత్యేక సంచికలలో కళలకు సంబంధించిన విషయాలపై ఎన్నో వ్యాసాలు రాసారు. స్మైల్ప్లీజ్ అన్న మాసపత్రికలో "కార్టూనిస్ట్ డైరీ" పేరుతో అనేక నెలల పాటు రాష్ట్రంలో ఎంతోమంది కార్టూనిస్టులను పరిచయం చేసారు. అంతేగాక "తెలుగు కార్టూనిస్టులు" పేరుతో ఒక పుస్తకం కూడా ప్రచురించారు. సమకాలీన చిత్రకారులు, శిల్పులు, మరియు కార్టూనిస్టులను పరిచయం చేస్తూ 2001లో ప్రచురించిన ఆంధ్రకళాదర్శినిని మరింతమంది కళాకారులతో మరింత సమాచారంతో 2004లో ద్వితీయ ముద్రణ వేయడంతో పాటు మన చిత్ర, శిల్ప, కార్టూనిస్టులందరినీ జాతీయ స్థాయిల్లో

పరిణామాన్ని, చిత్రకారులను, వారి చిత్రాలను, శిల్పాలను, కార్టూన్లను పరిచయం చేస్తూ దృశ్యశ్రవణ మాధ్యమంలో ఆయన రూపొందించిన "ఆంధ్రచిత్రకళావైభవం" డాక్యుమెంటరీ మన ఆంధ్రచిత్రకళా పరిణామానికి, వైభవానికి అద్దం పడుతుంది. ఇంకా తన రంగుల మాయాజాలంతో ఆంధ్రలోకాన్ని ఉ ర్రూతలూగించిన అమర చిత్రకారుడు వడ్డాది పాపయ్య గారి వందల చిత్రాలతో "రంగుల రారాజు వడ్డాది పాపయ్య" అనే సి.డి.ని కూడా రూపొందించారు. చిత్రకారులంతా సొంతం చేసుకోవాల్సిన వపా గారి అద్భుతమైన కలెక్షన్ను ఆయన దానిలో పొందుపరిచారు.

ఆంధ్రా ఆర్టిస్ట్స్, స్కల్ప్చర్స్ అండ్ కార్టూనిస్ట్ అసోసియేషన్కు వ్యవస్థాపక కార్యదర్శిగా పనిచేస్తూనే అనేక సంస్థలలో బాధ్యతలు నిర్వహిస్తూ, "ఆస్కా" తరపునే కాక ఎక్స్రే మరియు ఆస్కా



ఆస్కా సభ్యులతో...
2004 సంవత్సరం

రెండింటి సంయుక్తంగా కూడా అనేక సార్లు చిత్రకళ మరియు కార్టూన్ పోటీలను రాష్ట్రస్థాయిలో నిర్వహిస్తూ అనేక మంది ఔత్సాహిక కళాకారులను వెలుగులోకి తీసుకువస్తున్నారు. 2009లో స్వంతంగా ఆయన కార్టూన్లను "కళాసాగర్ కార్టూన్లు" అన్న పేరుతో పుస్తక రూపంలో తీసుకువచ్చారు.

నిర్విరామంగా సాగుతున్న అతని కళాకృషిని గుర్తించి రాష్ట్రంలో ప్రఖ్యాత చిత్రకళా, సాహితీ సంస్థల నుండి ఎన్నో బహుమానాలు, సత్కారాలు కూడా అందుకోవడం జరిగింది. జాతీయ స్థాయిలో చిత్రకళాపోటీలను నిర్వహించే ప్రఖ్యాత కోనసీమ చిత్రకళాపరిషత్ తన ద్విదశాబ్ది ఉత్సవాల సందర్భంగా ప్రతిష్ఠాత్మకమైన "చిత్రకళావైజయంతి పురస్కారం" కూడా కళాసాగర్ అందుకున్నారు.

ఏదైనా ఒక విషయం వెలుగులోకి రావాలి అంటే దానికి తగిన ప్రాచుర్యం అవసరం. అందుకు కళారంగం కూడా మినహాయింపేమీ కాదు. ఎంతో మంది గొప్ప కళాకారులు, కళాసంపద మనకున్నప్పటికీ ఇతర దేశాల్లో మాదిరి తగినన్ని కళాసారస్వత గ్రంథాలు మనదేశంలో లేకపోవడం చాలా బాధాకరం. అందునా సప్తవర్ణాల్లోను సచిత్ర రూపంగా ఉండాల్సిన చిత్రకళా గ్రంథాలు ముద్రించాలి అంటే అది ఎంతో వ్యయప్రయాసలతో కూడుకున్న పని. ఇలాంటి దుస్థితిలో రాష్ట్రనలుమూలల్లో గల మన కళాకారుల ప్రతిభా పాటవాలు అలా మరుగున పడిపోవల్సిందేనా? ఏ విధంగానైనా వాటిని వెలుగులోకి తీసుకువచ్చి ప్రపంచానికి చూపించలేమా? అన్న ఆలోచనకు ప్రతిరూపంగా ఆవిర్భవించినదే 64కళలు.కామ్. సకల కళల సమాహారం ఆన్‌లైన్ పత్రిక. ఒక్కపైసా ఖర్చులేకుండా కేవలం ఒకే ఒక్క మౌస్‌క్లిక్‌తో తెలుగు చిత్ర, శిల్ప, సాహిత్య, సంగీత, నృత్య, నాటక, సినిమా తదితర సర్వకళల సమాహారాన్ని


కళాసాగర్‌తో రచయిత వెంటపల్లి, ఏవిఎమ్.


ఆర్టిస్ట్ హేండ్‌బుక్ ఆవిష్కరణసభలో బుద్ధప్రసాద్, కొల్లూరి, పద్మశ్రీ పి.శ్రీపతిలతో...


చిత్రకారులు చంద్ర, కప్పరి కిషన్, దార్ల నగేశ్వరరావులతో..

అంతర్జాతీయ స్థాయిలో ప్రతి నెల ప్రపంచం ముందుకు తీసుకువస్తున్న ఈ 64కళలు.కామ్. నేడు అంతర్జాల పత్రికలలో ఎన్నో సంచలనాలను సృష్టిస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా 25 దేశదేశాలలోని తెలుగు ప్రజలు వీక్షిస్తున్న ఈ పత్రికను నెలకు సగటున 19 వేల మంది వీక్షించడం పాఠకాదరణకు నిదర్శనం. ఫొటోలతో రంగులలో ఆకర్షణీయమైన డిజైన్‌తో అంతర్జాల పత్రికలల్లో కెల్లా అగ్రగామిగా తీర్చిదిద్దుతున్న ఘణత కూడా శ్రీకళాసాగర్‌దే.

ఏదైనా ఒక దృఢ సంకల్పం, గొప్ప ఆలోచనా వీటికి నిరంతర కృషి తోడైననాడు ఒక సామాన్య మానవుడు కూడా అద్భుతాలు సృష్టించగలడు అని చెప్పడానికి గొప్ప ఉదాహరణ ఈ కళాసాగర్ అని చెప్పడంతో ఏమాత్రం సందేహం లేదు. లేకుంటే ఒక ప్రైవేట్ సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తూ జీవిస్తున్న ఓ చిన్న ఉద్యోగికి ఇవన్నీ చేయడం సాధ్యమా! కళాహితమే పరమావదిగా భావించే ఈ కళాసాగర్ లాంటి వాళ్లకి తప్ప.

అందుకే ఇలాంటి అద్భుతమైన ఆలోచనలు మరెన్నో అతనిలో రావాలి. తద్వారా మన కళారంగం మరింత ముందుకు వెళ్లాలని ఆశిద్దాం.

Hobby

3

# "తెలుగు పత్రికలు-తొలి సంచికలు"

(1980-2010)

– పులిపాటి దుర్గారావు,
బి.ఎస్‌సి, బి.ఇడి.

తెలుగు సాహిత్యంలో పత్రికలకు ప్రత్యేక స్థానం ఉంది. కథ, కవిత, నవల, కార్టూన్లు, కాలక్షేపం కబుర్లు, సినిమా సంగతులు. ఇలా ఒకటేమిటి పలు అంశాలతో పలురకాల పత్రికలు వచ్చాయి. వస్తూనే ఉన్నాయి. మనలో ప్రతీ ఒక్కరు ఎన్నో పత్రికలు కొంటూంటాం కాని, ఇప్పుడు మనం చెప్పుకోబోయే వ్యక్తిలో ఒక ప్రత్యేకత ఉంది. గత మూడు దశాబ్ధాలనుండి తెలుగులో వెలువడిన అనేక పత్రికల మొదటి సంచికలను సేకరించడమే కాకుండా, నేటికీ వాటిని బధ్రపరచి 'లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్స్'ను సాధించారు. ఆ అనుభవాలను వారి స్వీయ రచనలో 64కళలుడాట్‌కాంకు అందిస్తున్నారు పులిపాటి దుర్గారావు గారు మీ కోసం...

–ఎడిటర్

1999లో మళ్లీ రాజకీయ పత్రిక వెల్లువ సాక్షి, పొలిటికల్ ఎన్‌కౌంటర్, ప్రజా విప్లవమ్, అయోధ్య, నలుపు, నేటి రాజకీయం ప్రారంభం. వీటిలో హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ నుండి బొజ్జా తారకం సంపాదకత్వంలో వచ్చిన 'నలుపు' పక్షపత్రికలో ప్రజల పక్షాన పోరాటాలలో పాల్గొనే వారి వ్యాసాలున్నాయి. ధర రూ. 3/– 1/15/4/1989. ఈ సంవత్సరంలోనే ఉదయం వీక్లి మళ్లీ 4/– చెయ్యగా మయూరి వీక్లి 2/–లకే విడుదల చేశారు. ఆ సమయంలో వారపత్రిక మధ్య పోటీ అలా వుంది. ఆంధ్రపత్రిక సంస్థ నుండి సినీ, బాల, వార, పత్రికలతో పాటుగా తెలుగులో మొదటి కామిక్ బుక్ మాసపత్రిక. 1/1989(4/–) ప్రారంభించింది. పిల్లల కోసమే ఈ పత్రిక. "ఉద్యోగ విజయాలు' పేరుతో ఆలూరు సుభష్‌బాబు 3/1989న రూ. 6/– వెలతో విద్య, ఉద్యోగ సమాచార మాసపత్రికను ప్రారంభించగా, వీరే 5/12/1989 సిరివెన్నెల పేరుతో సంసారపక్ష పత్రికను బాపు గీసిన ముఖచిత్రంతో ప్రారంభించారు.

1990లో వచ్చిన వాటిలో ముఖ్యమైనది. "ఇండియాటుడే" ఆగస్ట్ 1990లో తెలుగులో ప్రారంభించిన ఈ పత్రిక ముఖచిత్రంగా బెనజీర్‌బుట్టో. అనువాద తెలుగు అన్నరీతిలో వున్నాయి వార్తాంశాలు. ధర 6/– ఇంకా ఈ సంవత్సరం విభిన్న తరహా పత్రికలు ప్రారంభం అయ్యాయి. విద్యార్థులు, నిరుద్యోగుల కోసం ఖాళీ ఉద్యోగాలు (12/1990), రాజకీయ పత్రిక జనసందేశ్ (11/90) తొలి సినీటెట్ బిట్స్– గోల్డ్‌స్టార్ (1రూ 50పై), వారపత్రిక హారిక (సారధి–యండమూరి వీరేంద్రనాధ్), పిల్లల వికాస పత్రిక–బాల చెలిమి (10/90–4/–) హారర్‌పత్రిక–క్రైమ్ డైరీ, ఆధ్యాత్మిక పత్రిక పత్రిక– ఆస్తికభూమి, టి.వి.కె. మాసపత్రిక– నాగభూషణం గారి "బుల్లితెర". వినియోగదారుల పత్రిక–మనకు వచ్చాయి.

1991లో వచ్చిన మంచి పుస్తకం "రచన"–శాయి సంపాదకత్వంలో విశాఖపట్నం నుండి వెలువడిన "రచన" "భారతరచన" బాపు గీసిన ముఖచిత్రం. వెల 10రూ. అన్ని పత్రికల కన్నా ధర ఎక్కువ అలాగే పేజీలూ ఎక్కువే (160). ఎన్నో శీర్షికలు, విలువైన సమాచారం, ప్రముఖ చిత్రకారులు

వెలువడిన పత్రిక వెల 6/- ఇంకా దేవీప్రియ సంపాదకత్వంలో వచ్చిన సుజన మనోహర పత్రిక - 'మనోరమ', విజయవాడ నుండి కొల్లూరి సంపాదకత్వంలో 'అంజలి' సచిత్ర వారపత్రిక- (5/-), వ్యాపార వాణిజ్య పత్రిక క్రయ విక్రయ సమాచారం, విజయవాడ నుండి యస్.యస్. లక్ష్మి సంపాదకత్వంలో ''ఆహ్వానం'' మాసపత్రిక (10/-)లతో ఒక పూర్తి నవలను కూడా అందించారు.

1994లో వచ్చిన పత్రికలలో బి.ఏ. రాజు సంపాదకత్వంలో సినీ పత్రిక 'సూపర్‌హిట్' ఫుల్‌సైజ్ పేపర్/ పూర్తి కలర్స్ 27/5/94-5/-, క్రాంతికార్ గారి మీ సైకాలజీ, మిర్రర్-రాజకీయ పత్రికలు- ఆంధ్రదర్శిని, స్రవంతి, వ్యాపార పత్రిక-మనీ బిజినెస్ వచ్చాయి.

1995లో విజయవాడ నుండి హ్యాపీలైఫ్, ఉద్యోగ పక్షపత్రిక-విద్య, క్రేజీ వరల్డ్ వచ్చాయి. ప్రత్యేకంగా చెప్పదగినవి ఏమీలేవు.

1996లో వచ్చిన వాటిలో ప్రముఖమైనది సంఘీ సంస్థల నుండే వచ్చిన 'వార్త' దినపత్రిక, సంపాదకత్వం ఎ.బి.కె. ప్రసాద్ (మళ్లీ ఆయనే ఆరంభం), పిల్లల కోసం చాలా పేజీలను సిటీ పేపర్‌లో కేటాయించడం, రంగుల్లో రావటం, దీని ప్రత్యేకత, మద్రాస్‌లో వుంటున్న తెలుగువారి కోసం వచ్చిన పక్షపత్రిక-'తెలుగువాణి' 20/4/96-2, ఆరోగ్య విజ్ఞాన పత్రికలు-అవర్ హెల్త్, యువసారిక.

1997లో ఆరోగ్య పత్రికలు మూడు వచ్చాయి. అవి హెల్త్ ట్రాక్ (హైద్రాబాద్), హెల్త్‌టుడే (విజయవాడ), మెడికల్ సైన్స్ డైరీ (గుడ్లవల్లేరు), ఇంకా విద్యా, ఉద్యోగ సమాచార పత్రికలు దిక్సూచి, ఎడ్యుకేటెట్ పీపుల్ వచ్చాయి. రాజకీయ పత్రికలు. చెన్నూరి నాగరాజు గారి సంపాదకత్వంలో హైదరాబాద్ నుండి 'తెలుగుదేశం' పక్షపత్రిక, దాసరి నారాయణరావు ఆధ్వర్యంలో బొబ్బిలిపులి విడుదల అయ్యాయి. బొబ్బిలిపులి సంపాదకులు కె.ఎన్.వై. పతంజలి, సంచలన పత్రిక అని ప్రకటించుకున్నారు. ఆంగ్లపత్రిక ఫెమిన స్థాయిలో కాకున్న అదే మాదిరిగా "నేటితరం యువతి" పూర్తిగా మహిళలకే ఒక పత్రిక ఇది. 10రూ॥లతో

గీసిన చిత్రాలు, కార్టూన్స్. ఈ సంవత్సరం వచ్చిన రాజకీయ పత్రికలు బీట్‌ది రూట్, సుప్రభాతం, వార్తకాలం వాటిలో సుప్రభాతం- విజ్ఞాన్ విద్యా సంస్థల రత్తయ్య ఆధ్వర్యంలో, ఎ.బి.కె. ప్రసాద్ సంపాదకత్వం (చాలా పత్రికలకు ఆరంభ సంపాదకులు ఈయనే) చక్కటి వ్యాసాలు, వార్తలు, వ్యాఖ్యలే కాక మోహన్ కార్టూన్స్, అదనంగా సప్లిమెంట్, ధర 8/-(4/10/1991) ఉద్యోగార్ధుల కోసం ఉద్యోగపర్వం. బుజ్జాయి పబ్లికేషన్స్ వారి జాతకజ్యోతి, వారపత్రిక మల్లెతీగ, పక్షపత్రిక అపూర్వ సత్య ఈ సంవత్సరం వచ్చిన మిగిలిన పత్రికలు.

1992లో ప్రజల్లో షేర్స్‌పై ఆసిక్త పెరగటంతో ఆ రకం పత్రికలు తెలుగులో కూడా మొదలయ్యాయి. ఆ కోవలో 27/1/92న 3/-తో వచ్చిన షేర్‌కాలం, 7/4/1992న వచ్చిన రామ్‌జీ షేర్ బజార్, టి.ఆర్. సీతారామ్ సంపాదకత్వంలో విజయవాడ నుండి వచ్చిన సాయంకాల దినపత్రిక-స్టేట్ ఈవినింగ్ 4/4/1992-రూ 1/-, భవానీ దీక్షలపై భవానీ జ్యోతి, సమాజాన్ని మార్చటానికే మా పత్రిక అంటూ "ప్రజాపక్షం" పక్షపత్రిక- 1993లో షేర్ మార్కెట్‌పై శాస్త్రీయ, సమగ్ర పక్షపత్రిక7/- వెలతో 14 మార్చిన వచ్చిన పత్రిక క్యాపిటల్ మార్కెట్, సాంఘికోద్యమ కిరణజన్య-కౌండిన్య, మేథ్స్ మరియు సైన్స్, మాస్టర్ జర్నల్, అవేర్‌నెస్ డైజెస్ట్ వంటి విద్యా సంబంధ పత్రికలు, గాంధీ సిద్ధాంతాలపై వల్లూరు జగన్నాధరావు గారి ఆధ్వర్యంలో వచ్చిన త్రైమాసిక పత్రిక 'సత్యశీలి', టి.టి.డి. వారి సప్తగిరి మాదిరిగా 'సప్తపది'-బాపు గీసిన ముఖచిత్రం పత్రిక లోపల గంగాధర్ గీతలు-ఆధ్యాత్మిక వ్యాసాలతో ఫిబ్రవరిలో హైద్రాబాద్ నుండి

98–దీని వెల 5/–) ఇంకా లైఫ్ మిర్రర్, జనప్రియ పక్షపత్రిక మనీష, ఆధ్యాత్మిక పత్రికలు–జై సద్గురు (పత్రికా రంగంలో అనుభవజ్ఞులైన తోటకూర రఘు సంపాదకుడు, హైదరాబాద్) అలాగే వి.ఎస్.పి. తెన్నేటి సంపాదకత్వంలో ఆధ్యాత్మిక మాసపత్రిక 'గీత' (హైద్రాబాద్), 'ధ్యాన విజయం' పేరుతో ద్వైమాసపత్రిక ద్వారా ధ్యానం గురించి వివరించారు (4/98–సంపాదకులు సిహెచ్.వి. సుబ్బారావు), ఈ సంవత్సరం తెలుగులో వచ్చిన కొత్త రకం పత్రికలు "ఫొటో క్రానికల్" (సికింద్రాబాద్ 10/–8/1998 ఫొటో మరియు వీడియోగ్రఫీలపై వివరణలు), వ్యక్తిత్వ వికాసంపై "ఊయల" వంద శీర్షికల పత్రిక అని వేశారు. –మెజీషియనే కాక ఎన్నో రంగాల్లో నిష్ణాతుడైన చొక్కాపు వెంకటరమణ రూపుదిద్దిన ఈ పత్రిక 3/198–6–, మహిళల కోసం తెలుగు మహిళాభ్యుదయ (చుండూరి నీలిమారాణి–ఎడిటర్, విజయవాడ–7/–10/98) ఇంకా 'సౌంద ర్యం', రాగలహరి, శ్రమజీవి ఈ సంవత్సరం వచ్చాయి.

వచ్చిన ఈ పత్రిక ముద్రణ ఫొటోలు కాస్త ఖరీదైనవే. ఈ సంవత్సరం మేలో వచ్చిన మరో వినూత్న మాసపత్రిక సృజనప్రియ. 'శివరంజని' సినీ పత్రికలో సంచలనం సృష్టించిన దాసరి మరో సినీ పత్రిక "మేఘసందేశం" 4/4/97 నుండి ఎ.బాలరెడ్డి సంపాదకత్వంలో విడుదల చేశారు. ఈ తొలి సంచిక ఫొటోను ప్రచురించారు (15/5/1997), దానిలో చూస్తే మొదటి పేజీ అంతా నిజాం, అతని కుటుంబ సభ్యుల ఫొటోలే వున్నాయి.

1998లో చాలా పుస్తకాలు ఆరంభం అయ్యాయి. రాజకీయ పత్రికలు రిపోర్టర్ (హైదరాబాద్–ఎడిటర్–బుర్రా సుబ్రహ్మణ్యం– 16/6/1998), దళిత బహుజనుల అధికార మాసపత్రిక –'పరివర్తన'–(ఎడిటర్–దుర్గం సుబ్బారావు–4/98–5/గుంటూరు), సంపూర్ణ స్వతంత్ర వారపత్రిక ''ప్రజాతంత్ర'' (ఎడిటర్: దేవులపల్లి అమర్, 10/1/




1999లో కూడా చాలా రాజకీయ పత్రికలు ప్రారంభం అయ్యాయి. వాటిలో దగ్గుబాటి వెంకటేశ్వరరావు సంపాదకత్వంలో పార్టీ సమాచార పత్రిక- "అన్న తెలుగుదేశం" (హైదరాబాద్-2/ ఎన్.టి.ఆర్ పుట్టిన రోజున ప్రారంభం). ఎ.బి.కె. ప్రసాద్ సంపాదకత్వంలో ప్రారంభమైన మరో పత్రిక "మా భూమి" జనచైతన్య వారపత్రిక- కే.వాసుదేవరావు గారి పాత్ర కూడా ఈ పత్రికలో వుంది. (8/1/1999-హైదరాబాద్). ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలతో పాటు కథలు కూడా వున్నాయిపత్రికలో. డి.వి. సుబ్బారావు సంపాదకత్వంలో మరో రాజకీయ పత్రిక "ఈ పక్షం", (10-మే 1999, పాలకొల్లు). (వి) నాయకులు చదవకూడని పత్రిక మాది అంటూ సతీష్ చందర్ "కింగ్ మేకర్-జోకర్" అనే పత్రిక విడుదల చేశారు. పేరు వినూత్నంగా వున్న ఈ పత్రికతో "తెలివి" విద్యా, ఉద్యోగ అవకాశాల పత్రిక ఉచితంగా అందించారు. "నెంబర్‌వన్" రాజకీయ సినీ పత్రిక (4/99, 7/-, హైదరాబాద్), సి. నరసింహారావు గారిచే చెలిమి సమగ్ర వారపత్రిక (5/99, 7/-)హైదరాబాద్ నుండి దేవరకొండ కాళిదాసు సంపాదకత్వంలో సంపూర్ణ కుటుంబపత్రిక -ప్రీతి (7/-, 1/8/99), విద్యార్థులు, నిరుద్యోగుల కోసం కృషి ((1/5/20011, 8/-) ఎయిడ్స్ గురించి "ఎయిడ్స్ టుడే" (5/-, హైదరాబాద్), యువసంచలనం, ''సైకాలజీ టుడే'' (8/-, హైదరాబాద్)తో పాటుగా విజయవాడలో 13/5/1999న కె.బి.జి. తిలక్ సంపాదకత్వంలో సాయంకాల దినపత్రిక "స్వర్ణాంధ్ర" ప్రారంభం- ఈ సందర్భంగా పెద్ద అనుబంధమే యిచ్చారు.

2000 సం॥లో విభిన్న పత్రికలు ప్రారంభం అయ్యాయి. జ్యోతిష్య దీపిక (7/-, 12/ 2000, విజయవాడ) దీనిలో జ్యోతిష్య, వాస్తు, ఆధ్యాత్మిక విషయాలున్నాయి. వాణిజ్య ప్రకటనల వారపత్రిక- "ఏడ్ స్పెషల్'', ఇంద్ర జాలికుడు "షాడో" ఆధ్వర్యంలో మేజిక్/ జనరల్ విషయాలపై తెలుగు, ఇంగ్లీష్ భాషలలో వచ్చిన ఒకే పత్రిక ''మా ఇంద్రజ'' (10/-1/2000), హైదరాబాద్, నిరుద్యోగుల కోసం ఉద్యోగ కిరణం (10/-10/2000. తెనాలి) యుగశక్తి-గాయత్రి (6/-, 5/2000), విజయవాడ నుండి స్వరూప-మాసపత్రిక, విజయవాడ నుండే మరో పత్రిక-"సినిమా టుడే" (8/-), విజయవాడ నుండే మరో రాజకీయ వార్తా వారపత్రిక- "ఎడిటర్" (22/11/1998, 2/-), అన్నింటికన్నా ప్రత్యేకంగా చెప్పుకోవల్సింది. "విజయ విహారం"పత్రిక, ఈ పత్రికలో లేని అంశమంటూ లేదేమో అన్పిస్తుంది. ధర ఎక్కువే 15/-,2/2000, హైదరాబాద్ ఎడిటర్ టి.వి.రమణమూర్తి దీనిని ఆయన యువతరం పత్రిక అటారు. సమాజంలోని మూఢనమ్మకాలు, వ్యక్తిత్వ వికాసం, రాజకీయాలు, ఇలా ఎన్నో విషయాలు దీనిలో వున్నాయి. భయంకర సత్యాలను దీని ద్వారా వెలుగులోకి తర్వాత సంచికల్లో తీసుకొచ్చారు. వ్యంగ్యం, వినోదం, విజ్ఞానం అన్ని సమపాళ్ళలో వున్న పత్రికా విహారం.

*(మరిన్ని విషయాలు వచ్చే సంచికలో....)*

***email: pulipati_akshara@yahoo.co.in***

# ఆగిన 'కూచిపూడి' పాదముద్రలు

కూచిపూడికి జన్మనిచ్చింది సిద్ధేంద్రయోగి...
ఆ కూచిపూడికి జీవమిచ్చింది వెంపటి చినసత్యం...

**వెంపటి చినసత్యం ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూచిపూడి కళారాధనకే పరితపించాయి. ఆయన పంచప్రాణాలు నాట్యారాధనతో పరవశించాయి. ఆయన నర్తనంతో ఎన్నో హృదయాలు పులకించిపోయాయి. ఒకప్పుడు కృష్ణాజిల్లాకే పరిమితమైన కూచిపూడి నాట్యకళను ఖండాంతరాలకు తీసుకెళ్లిన చినసత్యం... భరతనాట్యానికి పుట్టినిల్లైన తమిళనాట కూచిపూడి బావుటా ఎగురవేసిన గొప్ప కళాకారుడు.**

ఆయన 1929, అక్టోబర్ 25న కృష్ణాజిల్లా కూచిపూడిలో జన్మించారు. తల్లిదండ్రులు వెంపటి చలమయ్య, వరలక్ష్మమ్మ. తొమ్మిది తరాలుగా వాళ్ల కుటుంబ సభ్యులు నాట్యానికే తమ జీవితాన్ని అంకితం చేశారు. అదే వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న చినసత్యం... వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి వద్ద కూడిపూడిలో ఓనమాలు అభ్యసించారు. తాడేపల్లి పేరయ్యశాస్త్రి వద్ద తన కళలకు మెరుగులు దిద్దుకున్నారు. తన అన్న వెంపటి పెదసత్యం నుంచి అభివ్యక్తీకరణలో మెళకువలు ఒడిసిపట్టారు. ఇందుకోసం పాఠశాల విద్యను మధ్యలోనే ఆపేరు. 18 ఏళ్ల వయసులో తల్లి ఇచ్చిన రెండ్రూపాయలు చేతపట్టుకుని.. ఆర్థిక ఇబ్బందుల వల్ల కాలనడకనే మద్రాసుకు వెల్లారు. తాను నేర్చుకున్న విద్యకు మెరుగులు దిద్దుకున్నారు. స్వయం ప్రతిభ, నిత్య ప్రయోగాలతో కూచిపూడి కళాకారుడిగా అజరామరమైన కీర్తిని సంపాదించారు. అంతవరకూ పురుషులకే పరిమితమైన కూచిపూడిలో మహిళలకూ ప్రవేశం కల్పించి, నూతన పోకడలకు



పద్మవిభూషణ్ అవార్డు అందుకుంటూ...



నడిపిన చినసత్యం తర్వాత 1963లో కూచిపూడి ఆర్ట్ అకాడమీని చెన్నైలో స్థాపించారు. లండన్, ప్యారిస్, సిక్కిం, భూటాన్, మలేసియా, అమెరికా, లండన్, అరబ్‌దేశాలు, యూరప్, జర్మనీలలో ఎన్నో ప్రదర్శనలిచ్చారు. ప్రపంచం నలుమూలలా ప్రదర్శనలిచ్చి అసంఖ్యాక అభిమానులను సంపాదించుకున్నారు. ఆయన అకాడమీలో నృత్యాన్ని అభ్యసించిన ఎందరో నేడు గొప్ప నాట్య కళాకారులుగా రాణిస్తున్నారు. హైదరాబాద్, విశాఖపట్నంలోనూ ఆయన అకాడమీలు స్థాపించారు.

### భామాకలాపంలో సాటి.. నృత్యనాటికల్లో మేటి...

'భామాలకలాపం'లో ఆయనకు ఆయనే సాటి. ఏకపాత్రాభినయాలే గాక.. శ్రీకృష్ణపారిజాతం, ఛండాలిక, మేనకా విశ్వామిత్ర, కల్యాణ శాకుంతలం, విప్రనారాయణ చరితం, పద్మావతి శ్రీనివాస కళ్యాణం, శివధనుర్భంగం, హరవిలాపం, రుక్మిణీ కళ్యాణం, ఆర్థనారీశ్వరం వంటి నృత్య రూపకాలను రూపొందించారు. అర్థనారీశ్వరంలో చినసత్యం శివుని పాత్రకు ఎన్నో ప్రశంసలు దక్కాయి.

### సినీ నృత్య దర్శకత్వం..

వేదాంతం రాఘవయ్య, వెంపటి పెదసత్యం పర్యవేక్షణలో కొన్ని సినిమాల్లోనూ చినసత్యం నటించారు. దాదాపు వందకు

నాంది పలికారు.

1952, మార్చి 21 ఆయనకు స్వరాజ్యలక్ష్మితో వివాహమైంది. తొలుత చిన్నపాటి కూచిపూడి నృత్యశిక్షణ కేంద్రాన్ని




ఎంతోమంది ఉద్దండులు వెంపటి శిష్యులే...






పైగా చిత్రాలకు నృత్య దర్శకత్వం వహించారు. 'నర్తనశాల'లో ఎన్టీఆర్ పోషించిన బృహన్నల పాత్రకు చినసత్యం నృత్యకల్పన ప్రాణంపోసింది. ఇందుకోసం ఎన్టీఆర్ స్వయంగా చినసత్యం వద్ద కొన్ని రోజులపాటు నాట్యంలో శిక్షణ పొందడం విశేషం. తమిళనాడు ప్రస్తుత సీఎం జయలలిత కూడా ఆయన వద్ద నాట్యం నేర్చుకున్నారు. హేమమాలిని, రేఖ, వైజయంతి మాల. మంజుభార్గవి, ప్రభ, కాంచన, రాజసులోచన, రాజశ్రీ, ఎల్.విజయలక్ష్మి, శశికళ తదితరులు చినసత్యం దగ్గర నృత్యం నేర్చుకున్నవాళ్లే.



### ఎంతోమంది ఉద్దండులు వెంపటి శిష్యులే...

వెంపటి చినసత్యం వద్ద నాట్యం అభ్యసించిన వారిలో కామదేవ్, కమలారెడ్డి, పద్మశ్రీ  శోభానాయుడు, అనూరాధ నెహ్రూ, పద్మామీనన్, మాలగణపతి, రత్నపాప, కేంద్రమంత్రి దగ్గుపపాటి పురందేశ్వరి, ఎ. బాలకొండలరావు, కొత్తపల్లి పద్మ, శోభా నటరాజన్, శైలజ, చంద్రకళ, వేదాంతం రత్తయ్యశర్మ, ముక్కురాజు, వేదాంతం రాము, మాధవపెద్దిమూర్తి వంటి ఎంతోమంది ప్రముఖులు ఉన్నారు.

### ఎన్నో అవార్డులు.. రివార్డులు..

1976లో తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన నాట్యాచార్యుడిగా చినసత్యం నియమితులయ్యారు. అమెరికాలోని పిట్స్‌బర్గ్‌లోని వెంకటేశ్వరస్వామి దేవస్థానంలో ఆస్థాన నాట్యాచారులుగా నియమితులైన తొలి తెలుగుతేజం ఆయనే. అప్పటి రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ చేతుల మీదుగా ప్రతిష్టాత్మక 'పద్మభూషణ్' అవార్డును అందుకున్నారు. వీటితోపాటు కేంద్ర సంగీత నాటక అకాడమీ, కలాప్రపూర్ణ, గౌరవ డాక్టరేట్ (ఆంధ్రాయూనివర్సిటీ), కలైమామణి (తమిళనాడు), కాళిదాసు పురస్కారం (మధ్యప్రదేశ్), రాజ్యలక్ష్మి ఫౌండేషన్ అవార్డు, టీటీకే మెమోరియల్ పురస్కారం... ఇలాంటివి ఎన్నో ... అవార్డులు ఆయన్ను వరించాయి.



### గిన్నిస్ రికార్డులూ..

2008 జూన్‌లో అమెరికాలో నిర్వహించిన సిలికాన్ ఆంధ్ర ఉత్సవాల్లో ఆయన నిర్దేశకత్వంలో 300మంది కళాకారులతో ఏకకాలంలో 'జతిస్వరం' ప్రదర్శించి గిన్నిస్ బుక్ రికార్డు సాధించారు. 2010లో అవే ఉత్సవాలను హైదరాబాద్‌లో నిర్వహిచినప్పుడు.. ఒకేసారి 2వేల మంది కళాకారులతో ఆ అంశాన్ని ప్రదర్శించి రెండోసారి గిన్నిస్ రికార్డు సొంతం చేసుకున్నారు.

# మధుర గాయకుడు శ్రీరామమూర్తి

- వాడ్రేవు సుందర్రావు
నంది, గరుడ అవార్డుల గ్రహీత

ఘంటసాల కాంశ్య విగ్రహావిష్కరణ జరుగుతోంది. మధుర గాయకుడి సుమధుర స్మృతులు అందరి మనసుల్లో కదలాడుతున్నాయి. తన గానంతో తెలుగు భాషకి, తెలుగుతనానికి... ఒక్క తెలుగేమిటి... సమస్త భాషా సాహిత్యాలకు ఎనలేని మధురిమను పంచి ఇచ్చిన మహా గాయకుడ్ని మనసారా స్మరించుకొంటున్నారందరూ. అంతటి గాన గంధర్వుడు మనల్ని విడిచి వెళ్లిపోవడం, మనందరి దురదృష్టం అనుకొంటూ, దుఃఖ వివశులయ్యారు వారందరూ. ఆ కార్యక్రమానికి విచ్చేసిన సకల ప్రేక్షక సమూహ హృదయాలూ మాటల్లో చెప్పలేని బాధతో నిండిపోయాయి. వాతావరణం విషాదభరితమయ్యింది. అంతటా ఏదో అనిర్వచనీయమైన అనుభూతితో కూడిన నిశ్శబ్దం ఆవరించింది.

ఇంతలో ఘంటసాల స్వరం వినబడుతోంది. అపారమైన భక్తి ప్రపత్తులతో ఘంటసాల వెంకటేశ్వరరావు గానామృతం అందరినీ స్పర్శిస్తోంది. దేవదేవుడైన తిరుమల శ్రీ వేంకటేశ్వరుడ్ని కీర్తిస్తున్న 'నమో వెంకటేశాయ' వినబడుతోంది. యావన్మంది ప్రేక్షకులకు ఆ సన్నివేశం అర్థం కాలేదు. ఘంటసాల తిరిగి వచ్చారా.. అంటూ ఒకరివైపు మరొకరు ఆశ్చర్యంతో చూసుకొంటున్నారు. అందరి కళ్లల్లోనూ ఏదో చెప్పలేనంత ఉత్సుకత.. వర్ణించలేనంత ఆశ్చర్యం... క్షణాలలో అర్థమైంది. ఆయన ఘంటసాలని మరిపించేలా గానామృతాన్ని పంచిపెడుతున్న, ఘంటసాల ఆరాధకుడనీ, గాన గంధర్వుడనీ... శ్రోతలందరూ ఆయన గాన మాధుర్యంలో మునిగిపోయారు. ఒకపాట... రెండో పాట... పదో పాట... పద్దెనిమిదో పాట... చివరికి ముప్తై ఆరో పాట దగ్గర కార్యక్రమం ఆగింది. గాయకుడు అలసిపోయి కాదు.. శ్రోతలు అలసిపోయి.. అంతకాలం తమనితాము మరచిపోయి, ఏదో అలౌకిక ఆనందంలో మునిగిపోయిన, అశేష కళాభిమానులందరూ ఆనందంతో కరతాళ ధ్వనులు చేయడం ఆరంభించారు. కళాతపస్వి కాశీనాథుని విశ్వనాథే స్వయంగా ముందుకొచ్చి ఆ గాన గంధర్వుడ్ని మనసారా సత్కరించి అభినందించారు. ఆ చప్పట్లలో శ్రోతల ఆనందం, శ్రోతల పారవశ్యం... శ్రోతల హృదయానుభవం విస్పష్టంగా వెల్లడవుతున్నాయి.







వారందరి ప్రేమను స్వంతం చేసుకొన్న ఆ గాయకుడు మరెవరోకాదు. ఆయనే దుర్భ శ్రీరామమూర్తి. తూర్పు గోదావరి జిల్లాలోని అనపర్తి మండలంలోని పాలమూరు అనే ఓ చిన్న గ్రామం వారిది. నిజానికి చిన్న గ్రామమే అయినా పాలమూరు తెలుగు భాషా సాహిత్యాలకు ఎనలేని సంపదను అందించింది. సుప్రసిద్ధ కథా రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి పాలమూరువారే. అటువంటి పాలమూరు తెలుగు కళాజగత్తికి అందించిన మరో ఆణిముత్యం దుర్భ శ్రీరామమూర్తి.

దుర్భ వేంకటశాస్త్రిగారి పుత్రుడైన శ్రీరామమూర్తి చదివినది వాణిజ్యశాస్త్రం, చేస్తున్నది వ్యవసాయం. కానీ జీవితమంతా సంగీత సాహిత్యాల మయం.

ఆకర్షణీయమైన రూపం, అందమైన ముఖం, నిరంతరం వెల్లివిరిసే చిరునవ్వు, మాటల్లో కన్పించే గొప్ప అనురాగం, ప్రవర్తనలో అడుగడుగునా ప్రకటితమయ్యే వినమ్రభావం, శ్రీరామమూర్తిని ఉన్నత స్థానానికి చేర్చాయనడం నిస్సందేహం. అన్నిటికన్నా ముఖ్యంగా ఎదిగినకొద్దీ ఒదిగి ఉండాలన్న పెద్దలమాట, ఆయన ఎడల అక్షర సత్యం.

కొంతకాలం పాటు అంటే 1986 నుండి 1995 వరకు ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, ఈనాడు పత్రికల విలేఖరిగా సేవలందించి, సమాజంలో సమస్యల పరిష్కరణకు తన వంతుగా కృషి చేశారు. నేడు ఆయన పాత్రికేయుడు కాకపోయినా, పాత్రికేయమిత్రులందరికీ నేటికీ ఆయన మాటే శిరోధార్యం, ఆయన అడుగే అనుసరణీయమైన మార్గంగా నిలుస్తోంది. ఇది ఆయన ప్రతిభకు గొప్ప తార్కాణం.

శ్రీరామమూర్తికి చిన్ననాడే పాటల మీద ప్రేమ ఏర్పడింది. దైవ కృపతో సంగీత సాహిత్యాలపై ఆయనకు గట్టి పట్టు లభించింది. లభించిన దానిని, నిరంతర కృషితో నిత్య సాధనతో పరిపూర్ణత్వం వైపు నడిపించుకొన్నారు. అందుకే ఆయన నోట, అచ్చంగా ఘంటసాల విన్పిస్తారు. మోహనరాగం ఆయన అభిమానరాగం. కళ్యాణి అంటే ఆయనకు చెప్పలేనంత ప్రేమ. సింధుభైరవి, భాగేశ్వరి, అభేరి అంటే వారికి వల్లమాలిన అభిమానం. షణ్ముఖప్రియ, ఖరహరప్రియ, కానడ, కాఫీ, బిళ్హరి, శివరంజని, మలయమారుతం, అమృతవర్షిణి, దేశి, బృందావన సారంగి, హంసానంది, హంస ధ్వని వంటి ఇరవై ఏడు రాగాలతో ఆయన గానం మధురాతి మధురంగా విన్పిస్తుంది. పాట ఆయన ఊపిరి. పాట ఆయన ప్రాణం. అమర గాయకుడు ఘంటసాల ఆయన ఆరాధ్య దైవం. ఈ విజయం వెనుక కన్పించే అసలైన స్ఫూర్తి వారి శ్రీమతి భానుమతి. అంతేకాదు కుమారుడు కృష్ణశాస్త్రి, కోడలు మంగలక్ష్మిల పాత్ర కూడా చెప్పకోదగ్గదే సుమా.

మూడు దశాబ్దాలుగా నిరంతరాయంగా సాగుతూవస్తున్న శ్రీరామమూర్తి కళాయాత్ర తెలుగు నేలంతా పరిఢవించింది. పెద్ద పట్టణాలన్నీ వారిని సత్కరించి గౌరవించాయి. శ్రీరామమూర్తి గానం, శతాధిక సంవత్సరాలు విన్పించాలని ఆశీర్వదించారు. మనమూ అదే కోరుకొంటున్నాం. మనమూ అదే జరగాలనుకొంటున్నాం. శ్రీరామమూర్తి శతవసంతాలు జీవించాలి. శత శరత్తులు హర్షిస్తూ తెలుగు నేలను తన గానామృతంతో పరవశింపచేయాలి.

# ఈగ పార్ట్2...రానుందా?

ఈగతో ఇంటర్వ్యూ





'ధరణీరాయ్ చౌదరి'

*ఆ సినిమాలో స్టార్ హీరో లేడు... ఫారిన్ లొకేషన్‌లో పాటల్లేవ్... ఆవేశపూరిత డైలాగ్స్ లేవు...అయినా ఆ సినిమాకు ప్రేక్షకులు బ్రహ్మరథం పడుతున్నారు...ఎందుకు ? అంతా దర్శకుడి సృజనాత్మకత.. చక్కని కధనం.. టోటల్‌గా ప్రేక్షకులు కోరుకొనే కొత్తదనం...అది ఈగ సినిమాలో ఉంది, కాబట్టే ఈ విజయం... ఈ సందర్భంగా సరదాగా 'ఈగ'తో ఇంటర్వ్యూ.. మీ కోసం...*

**64 కళలు: రాజమౌళి గారివద్ద ఛాన్స్ ఎలా కొట్టేశారు?**

**ఈగ:** రాజమౌళిగారు ప్రభాస్ సిన్మా షూటింగ్‌లో వుండగా నేను కెమేరాపై వాలి బడాస్టార్‌లా స్టెప్స్ వేసి చూపించాను..అంతే! మౌళిగారు అవాక్కయి..'నా నెక్స్ట్ సినిమాలో నువ్వే హీరో!' అన్నారు...అంతేకాదు...'ఎంతో కష్టపడి ఆ హీరో చేసిన డాన్స్‌ని నువ్వు సునాయాసంగా చేసిపారేశావ్!' అంటూ తెగ మెచ్చేసుకున్నారు!

**64 కళలు: మీక్కూడా అభిమానసంఘాలు ఏర్పడ్డాయని....**

**ఈగ:** నిజమే...సినిమా రిలీజైన తొలిరోజే నేను తెరమీద నేను కనపడగానే విజిల్లూ...చప్పట్లూ...గోలోగోల...అవిచూసి నాకూ అభిమానులు తయారయ్యారన్నమాట...అనిపించింది...ఆ తరువాతనుండీ అభిమాన సంఘాలనుండి అభ్యర్థనలు మొదలయ్యాయి...ఎక్కడ ఈగలు ముసిరినా...అక్కడో అప్లికేషన్ పడేసిపోతున్నారు...

**64 కళలు: మీరు ఇండియాలో మాంచి బ్రేక్ ఇవ్వడమేకాదు...అమెరికాలో 'స్పైడర్‌మేన్'కి షేక్ ఇచ్చారట!**

**ఈగ:** ఔను..నేనిది ఊహించలేదు...ఎన్నో సినిమాలు చచ్చీచెడీ నటిస్తేగానీ బడాహీరో కాలేం...కానీ నేను నా మొదటి సినిమాతోనే అంతర్జాతీయ స్థాయిలో మెగాహిట్టిచ్చిన బడాహీరోనైపోయాను!

**64 కళలు: ఈ చిత్రం సక్సెస్ అవుతుందని మీరు ముందే ఊహించారా?**



**ఈగ:** ఊహించాను...మౌళిగారు ఈ చిత్రాన్ని మెగా సక్సెస్‌ఫుల్ మూవీగా మలుస్తారని! నిజానికి ఆయనతీసే ప్రతి చిత్రంలోనూ ఆయనేహీరో!...నిజానికి నేను చేసింది ఏమీలేదనే చెప్పాలి...ఆయన చేసిచూపించిందాంట్లో సగమే చేశాను...ఐతే పూర్తి మార్కులు కొట్టేశాను.

**64 కళలు: ఈ సక్సెస్ తర్వాత మీ ఈగలు మిమ్మల్నెలా రిసీవ్ చేసుకుంటున్నాయి?**

**ఈగ:** మా సంఘంలో నా పేరు ప్రతిష్టలు ఆకాశమంత ఎత్తుకి ఎదిగాయని వేరే చెప్పాలా! నా పేరు 'ఈగేశ్వర్' అయినా వారు నన్ను 'ఈగధీర' అంటూనే పిలుస్తున్నారు...నిజానికి కొందరు బడాహీరోలు 'ఈగనైనా కాకపోతిని 'మౌళి'హస్తము సోకగా...అంటూ లోలోపల తెగ వాపోతున్నారని విన్నాను...ఆయన చేతిలో పడితే ఈగైనా, దోమైనా మెగారేంజ్‌కెళుతుందని ఈ సినిమాతో ఋజువైంది! అసలు ఆయనగారి చేతి చలువవన్నే కదండీ నేను బడాహీరోనయ్యాను!!

**64 కళలు: ఈగ పార్ట్2...రానుందా?**

**ఈగ:** ప్రస్తుతం ఆ విషయంగురించి నేనుగానీ, మా డైరెక్టరుగానీ ఆలోచించడంలేదు...ఈ సక్సెస్‌ని ఎంజాయ్ చేస్తున్నాం...అంతే!

**64 కళలు: ఇతర బాషాచిత్రాలనుండి అవకాశాలస్తే నటిస్తారా?**

**ఈగ:** ముందు కథ నచ్చాలి...ఆపై డైరెక్టర్ నచ్చాలి...మంచి కథ, స్క్రీన్‌ప్లేతో ఎవరు సిద్ధంగా అక్కడికి నేను రెక్కలూపుకుంటూ వాలిపోతాను...

**64 కళలు: 'రోబో'లో నటించిన దోమేశ్వరితో ఈగేశ్వర్ ప్రేమా, పెళ్లీ...'అంటూ వచ్చిన వార్తల పట్ల మీ స్పందన?**

**ఈగ:** హీరోగా ఓ రేంజ్ వచ్చాక ఇవన్నీ మామూలే...అలాంటివి విన్నప్పుడు నవ్విపోతానంతే...!

**64 కళలు: మీ అభిమానులకి మీరిచ్చే సలహా...**



**ఈగ:** మీ రేంజ్ చిన్నదైనా...మీ లక్ష్యం గొప్పదైతే...అందుకు మీకృషీ, పట్టుదలాతోడైతే ఖచ్చితంగా సక్సెస్ మాదే!

**64 కళలు: చివరిగా మీడియా గురించి...**

**ఈగ:** నా సినిమా గురించి రివ్యూలు బాగానే రాసాయి...'బడాహీరోల థియేటర్లో ఈగలు ముసిరితే...'ఈగ' సినిమా థియేటర్లముందు ప్రేక్షకులు మూగార'ంటూ ప్రశంసించాయి...అలాగే '64కళలు డాట్ కాం' కూడా నన్ను మొదట్నుండీ ప్రోత్సహిస్తూనే వుంది...ఈ సందర్భంగా ఎడిటర్ 'కళాసాగర్'గారికీ...నాపై ఫొటోకార్టూన్లు గీసిన 'ధరణీరాయ్ చౌదరి', శంకర్ గారికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను....!

# వనాలు ధరణి ధరించిన ఆభరణాలు

బి.ఎం.పి.సింగ్

వనాలు ధరణి ధరించిన ఆభరణాలు
వనాలు మనకు ఆయురారోగ్య
ఐశ్వర్యానందాలకు కారణాలు.
మనజీవన ప్రమాణంలో కలుగు ప్రయాసలు
ఉద్వేగాలను నివారించు ఉపకరణాలు వనాలు.
భూతలానికి శీతలాన్నిచ్చే 'పచ్చగొడుగులు' వనాలు.
మన జీవన మందు సర్వదినాలూ 'పర్వదినాలే'!
ఈ భూగ్రహంపై నివసించే జీవులన్నిటికీ
నిజమయిన 'నిజ'నివాసాలు వనాలు
వనాలున్నప్పుడే మనకు ఋతుపవనాలు
సకాల వానలు-కాలచక్రంలో
ఎండా వాన శీతాకాలాలు
మానవులకు-పశుపక్ష్యాదులకు
మధుర భక్ష్యాలకు మూలాలు వనాలు
పచ్చని పచ్చిక బయళ్లు నేలతల్లి కట్టిన
పచ్చ-పట్టురంగు చీరలు
కాయలు-పండ్లు-ఆకులు-అలములు-వనమూలికలు
వేర్లు మానవ జీవన ప్రణాళికలు
మనం పొట్టపోసుకుంటానికి ఆధారమైన
చెట్లు నరికి-నరికి మన పొట్టన పెట్టుకుంటే... ఎట్లా?

మనిషి 'నశ్వరం' మాను 'ఈశ్వరం'
మనం మనకు దైవమిచ్చిన జీ'వన'వరం
మన ధార్మికతకు ఆనవాలు వనాలు
సుఖమయ జీవనానికి ఆలవాలాలు వనాలు
నేలపై వేల ఏండ్ల నాడే వేళ్లూనుకున్న
మన ఆత్మీయులు వనాలు
వనాలను కాల్చి-కూల్చి భవనాలను
నిలిపిన నేటి నేలలు రేపటికి ఆధునిక స్మశానాలే
వనాలు లేనినాడు జరిగేది నాశనాలే
వనాలు మన ఆనంద జీవనానికి -వన్య ప్రాణులకూ
ప్రశాంత ఆవాసాలుగా ఆ పరమాత్మ వ్రాసిన శాసనాలు
ఇతరుల నుంచి అరువుగా
పొందలేని అరుదయిన అపురూప సంపద వనాలు
మానవులందరినీ అక్కున చేర్చుకుని
ఆశీర్వదించే ఆదర్శచరితలు వనాలు.

*email: munipratapsinghb@gmail.com*

# "కరుణ రసాన్ని కవిత్వీకరించిన కరుణశ్రీ"

"నేనొక పూల మొక్క కడ నిల్చి,
చివాలున కొమ్మ వంచి,
గోరానెడు నంతలోన విరులన్నియు
జాలిగ నోళ్లు విప్పి, మా ప్రాణము
తీతువాయనుచు బావురు మన్నవి",



జంధ్యాల

ఎల్.ఆర్. వెంకటరమణ

ఇలా సాగిపోయే పద్యం ఒకరి కలం నుండి, మరొకరి గళం నుండి వచ్చి మన హృదయంలో పదిలమవుతాయి. కరుణశ్రీ గారి రచన "పుష్ప విలాపం"లోని పంక్తులివి. ఘంటసాల గారి గళంలో మరింత పదునై తెలుగువారి గుండెలలో సుస్థిర స్థానాన్ని సంపాదించగలిగాయి.

సున్నిత మనస్సుగల వారి మనస్సులను తాకగలిగే శక్తి ఒక్క కరుణ రసానికే ఉంది. నవరాసాలలో "కరుణ" రసం పాత్ర అపారమైనది. ఈ రసంపై మిక్కిలి మక్కువ చూపి, రచనలు చేయడమే కాక, తన పేరును కూడా "కరుణశ్రీ"గా మార్చుకున్న వారు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు.

పాపయ్యశాస్త్రిగారు 1921 ఆగస్టు 4న గుంటూరు జిల్లా పెదనందిపాడు మండలం కొప్పరు గ్రామంలో జన్మించారు. తండ్రిపేరు పరదేశయ్య, తల్లిపేరు మహాలక్ష్మి, ప్రాథమిక విద్య గుంటూరులోనే చదువుకున్నారు. తరువాత అమరావతి రామకృష్ణ విద్యాలయంలో చదువుకున్నారు. ఆంధ్రోపన్యాసకునిగా పనిచేసినవారు.

వీరి రచనలలో పుష్పవిలాపం, కుంతీవిలాపం దాదాపుగా ప్రతి తెలుగు వాడికి కంఠతా వచ్చినవిగా చెప్పవచ్చు. ఉదయశ్రీ, కరుణశ్రీ, విజయశ్రీ రచనలు చేశారు. ఇంకా పోతన భాగవతాన్ని సరళంగా రచించారు. మరో రచన "ఉమర్‌ఖయ్యాం" ఈ రచన తెలుగు విశ్వ విద్యాలయం వారి ప్రశంసలందుకున్నది. దాదాపుగా వీరు 76 రచనలు చేశారు. ఇందులో సింహభాగం "పద్యాలకే" దక్కింది.

వీరి మరో రచన "తెలుగు బాల శతకం", ఇందులో "లలిత సుగుణ జాల!" మకుటంతో వందపద్యాల శతకరచన చేశారు. ఇందులో పిల్లలకు మనసంస్కృతీ, సంప్రదాయాలను సరళంగా చెబుతూనే ఎలా మసలుకోవాలో తెలియచేస్తారు.

"కష్టపెట్టబోకు కన్నతల్లి మనస్సు;
నష్టపెట్టబోకు నాన్న పనులు;
తల్లిదండ్రులన్న దైవసన్నిభులురా
లలిత సుగుణ జాల! తెలుగు బాలి!

కరుణశ్రీ గారి గురించి చెప్పుకుంటున్నపుడు తెలుగువారి ఇంటింటా మారు మ్రోగిన పద్యరూపం– "కుంతీకుమారీ విలాపం" గుర్తుకువస్తుంది.

*'అది రమణీయ పుష్పవనము, వనమందొక మేడ, మేడపై*
*నది యొక మారుమూల గది, ఆ గది తలుపులు తీసి మెల్లగా*
*పదునయిదేండ్ల యీడు గల బాలిక, పోలిక రాచపిల్ల, జం*
*కొదవెడి కాళ్లతో దిగుచున్నది క్రిందికి మెట్లమీదగన్".*

ఘంటసాల వారి కంఠంలో ఈ పద్య కావ్యం కరుణ రసాలను పలికించింది. "బుద్ధచరిత్ర" గ్రంథం రచించారు. 1992 జూన్ 22వ తేదీన సాహితీ చర్చలు ముగించుకొని రాత్రి నిదురించారు. అదే రాత్రి మనలను కరుణసంద్రంలో ముంచి శాశ్వతంగా మనకు దూరమయ్యారు. అచ్చ తెలుగు కావ్యాలను మనకు అందించారు.

64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం
సంపుటి :2 సంచిక :11 సెప్టెంబర్ 2012



తెలుగు జానపద చిత్రకళారంగానికి వన్నెతెచ్చిన కాపు రాజయ్య గారి మరణం కళారంగానికి తీరని లోటు. వారి ఆత్మకు శాంతి చేకూరాలని కోరుకుంటూ... కాపు రాజయ్య గారి గురించిన వ్యాసం మే 2012 లో చూడగలరు.

గురజాడ 150 వ జయంతి సందర్భంగా నీరాజనంలో వ్యాసం చదవగలరు.

పాఠకులకు వినాయకచవితి శుభాకాంక్షలు...

*ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.*

కళాసాగర్
ఎడిటర్



ముఖచిత్రం చిత్రకారుడు : కొరసాల



లండన్‌లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల విశేషాలు

గళ మాయావి కళా మేధావి నేరెళ్ళ



*ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే*

# గళ మాయావి కళా మేధావి నేరెళ్ళ



*మిమిక్రీ అనగానే స్ఫురించే పేరు డాక్టర్ నేరెళ్ళ వేణుమాధవ్. అనితర సాధ్యమైన రీతిలో ఈ కళకు కొంగొత్త తళుకులద్ది మెరిపించిన కృషీవలుడాయన. ఎన్నో గొంతులను, ఎన్నెన్నో ముఖాలను ఒక్కటిగా చూపెట్టగల స్వర గాంధారం ఆయన సొత్తు. హాస్యం, లాస్యం బీభత్సం... ఏ రసమైనా, ఏ రాగమైనా, ఏకదలికైనా, ఏ వాచికమైనా, ఏ భాషైనా, ఏ యాసైనా ఆయన గొంతులో ఒదిగిపోవలసిందే. ఆయన అదుపాజ్ఞ నర్తించవలసిందే. జాన్. ఎఫ్‌కెనడీ, మహాత్ముడు, నెహ్రూజీ, నేతాజీ, ఇందిరమ్మ, రాజీవుడు, రఫీ, అన్నాదురై, రామారావు, భానుమతి ఎవరైనా సరే ఆయన పలువరించగానే ప్రత్యేకమైన ఈ స్వర మాంత్రికుడిని ఆవహించవలసిందే.*

**- పి.వి. రామ్మోహన్ నాయుడు**

చిన్నతనంలో చిత్తూరు వి. నాగయ్య నటించిన భక్తపోతన చిత్రం చూసిన వేణుమాధవ్ కదిలిపోయారు. నాగయ్య గొంతులో పోతన పద్యాలు పాటలు వల్లె వేయడం మొదలెట్టారు. పోతన చిత్రం ఆయనపై బలమైన ముద్ర వేసింది. నిజమే మరి పోతన పుట్టిన ఓరుగల్లు వేణుమాధవ్ స్వంతగడ్డ కూడా, నాగయ్య పునాడా అన్నంతగా సమ్మోహనానికి గురయ్యారు.

అప్పటి నుంచి చింతతోపుల్లో, పొలాల గట్లమీద, హనుమంతుడి బండ దగ్గర తోటి పిల్లలను పోగేసుకొని సినిమా నటులను, గాయకులను, మాస్టార్లును అనుకరించి చూపేవారు. ఏదో సరదాకి మొదలెట్టిన ఆట, తనను ఆకట్టుకొన్న కళ. తనను ఎన్నోవేల మైళ్ళు నడిపిస్తుందనీ, ఎన్నో ఎత్తయిన కీర్తి శిఖరాలు ఎక్కిస్తుందనీ ఆ రోజుల్లో ఆయనకు తెలియదు. ఈ రోజు ఆ స్వరగాంధర్వానికి ఆయనే చిరునామా అయ్యారు. ముందు వెనుకలు ఆయనే వుండి సరిహద్దుగా నిలబడ్డారు.

ప్రతిగొప్ప కళాకారుడి గతంలాగే వేణుమధవ్‌కూ కష్టాలు, ఆటుపోట్లు తప్పలేదు. అవమానాలను బహుమానాలుగా భావించారు. ఛీత్కారాలను సత్కారాలుగా స్వాగతించారు. అయినవాళ్ళే ఇబ్బందులకు గురిచేసినా మౌనంగా ముద్రవేసిన మునిలా నవ్వుతూ స్వీకరించారు. అయితే తను నమ్ముకొన్న కళ కోసం అహరహం తపస్సులా సాధన చేసారు. అందులో కొత్త తీరాలు శోధించారు. ధ్వన్యనుకరణలో ఏకఛత్రాధిపతిగా కొనసాగుతున్నారు. మిగతా వాళ్ళంతా ఆయన శిష్యగణం, లేదా ఏకలవ్యులే.

అరవై నాలుగు కళలో స్వరవంచన (మిమిక్రీ) కూడా వుందనీ, అయితే వంచన కాకుండా నలుగురినీ వినోదింపచేయడానికీ, ప్రయోజనం కలిగించేలా మాత్రమే వాడుకోవాలని ఆయన అంటూంటారు.

డాక్టర్ గరికపాటి రాజారావు ఆధ్వర్యంలో రాజమండ్రిలో



## డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ గురించి...

| | | |
|---|---|---|
| పుట్టింది | : | 28 డిశంబరు 1932 వరంగల్‌లో. |
| తల్లిదండ్రులు | : | నేరెళ్ళ శ్రీహరి, శ్రీలక్ష్మి |
| విద్య | : | బి.ఏ., బి.కాం., బి.ఇడి. |
| అవార్డులు | : | కళాప్రపూర్ణ (ఆంధ్రాయూనివర్శిటీ) పద్మశ్రీ, మిమిక్రీ సామ్రాట్, రాజ్యలక్ష్మి పురస్కారం |
| డాక్టరేట్‌లు | : | కాకతీయ యూనివర్శిటీ, మరియు జె.ఎన్.టి.యు. హైదరాబాద్ |
| పదవులు | : | ఎమ్.ఎల్.సి. (ఆం.ప్ర.), 1972 నుండి 78 వరకు |
| మెంబరు | : | సంగీత నాటక అకాడెమీ (1974-78) |
| మొదటి ప్రదర్శన: | | 1947లో |

జరిగిన థియేటర్స్ ఫెడరేషన్ కాన్‌ఫ్రెన్స్ డిల్లీ సమావేశాలలో వేణుమాధవ్ మిమిక్రీ కార్యక్రమంతో ఆయన పేరు జాతీయ స్థాయిలో జిగేల్‌మంది. తెలుగుదేశంలో పుట్టిన ఈ జాతి రత్నంపేరూ... ఆయన యశస్సు జాతీయ అంతర్జాతీయ వేదికల్లో మార్మోగింది. ఐక్యరాజ్యసమితిలో తన మిమిక్రీతో దేశవిదేశాల ప్రముఖుల హృదయాలను చూరగొన్నారు. ఎందరో దేశాధినేతల అభిమానాన్ని గెలుచుకొన్నారు. రాష్ట్రపతులు, ఉపరాష్ట్రపతులు, ముఖ్యమంత్రులు ఎందరెందరో జాతీయ ప్రముఖుల సమక్షంలో ప్రదర్శనలు ఇచ్చి మెప్పు పొందారు. అప్పటి రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ మద్రాసు నివాసంలో ప్రదర్శన ఇచ్చారు. ఆ సందర్భంగా సర్వేపల్లి నాగయ్యనూ, భానుమతినీ అనుకరించమని కోరారుట. ముమ్మూర్తులా ఆనాడాయన నటరత్నాల అభినయాన్ని దించేశారు. వేణుమాధవ్ దానికి రాధాకృష్ణ ముగ్ధుడైపోయారు. ఘంటసాల అనారోగ్యంతో ఆసుపత్రిలో వున్న చివరి రోజుల్లో కలవడానికి వేణుమాధవ్ వెళ్ళగా శ్రీమతి ఘంటసాల ఆయనను భానుమతిలా పాడమని అడిగి మరీ పాడించుకొన్నారట.

మరో సందర్భంలో టోలెన్ హెమ్‌కోర్ట్ నుంచి బెల్‌సైజ్‌గ్రోవ్‌కు వెళుతున్నారు. అక్కడ బ్రిటీష్ డ్రామా లీగ్‌లో వాచిక సంస్కారంపై నిష్ణాతురాలైన కాథరిన్ లేంబర్ట్ నివాసంలో వేణుమాధవ్ కార్యక్రమం ఇవ్వవలసి వుంది. దారిలో టాక్సీలో చిక్కుకుపోయారాయన. చేసేది లేక టాక్సీవాడికి ఆంగ్ల నాటకాల్లోని సన్నివేశాలు అనుకరించి చూపారు. అంతే అతను అచ్చెరువొంది ఆయన ప్రయాణానికి సహకరించాడట. పైగా టాక్సీ డబ్బులు తీసుకోలేదుట. అదేమంటే మీరు నాకిచ్చిన కార్యక్రమానికి నేనెంత ఇవ్వవలసి వుంటుందీ? అన్నాడట. అతగాడి కళా హృదయానికి సంస్కారానికి వేణుమాధవ్ ఇప్పటికీ తలచుకొంటూంటారు.

జాతిరత్నాలైన ఎందరో కళాకారులు రచయితలు, మేధావులు, కోవిదులతో ఆయనకు సహనం. హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ, ముల్క్‌రాజ్ ఆనంద్, పృధ్వీరాజ్ కపూర్, రాజ్‌కపూర్, అశోక్‌కుమార్, బలరాజ్‌సహానీ, నర్గీస్, ఎన్.టి.ఆర్, డాక్టర్ సి. నారాయణరెడ్డి ఇలా ఎందరో ఆయన సన్నిహితులు, స్నేహితులు.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, డాక్టర్ సి.నారాయణరెడ్డి వంటి ఎందరో తమ రచనలను ఆయనకు అంకితమిచ్చారు. మూడు విశ్వవిద్యాలయాలు ఆయనకు డాక్టరేట్లు



ఇచ్చి గౌరవించుకొన్నాయి. సత్కారాలు, సన్మానాలకు లెక్కలేదు. దాదాపు ప్రపంచమంతా ఆయన తిరిగారు. 1972 నుండి ఆరేళ్ళ ఎమ్మెల్సీగా నామినేట్ చేసి రాష్ట్రప్రభుత్వం ఈ కళా విరాట్స్వరూపానికి తమ గౌరవాలు తెలుపుకుంది.

ఎంతమంది అనుకరించినా ఎంతమంది అభిమానులను పోగేసుకున్నా ఎం.ఎస్. సుబ్బలక్ష్మి, డాక్టర్ సర్వేపల్లి, చిత్తూరు నాగయ్యలను అనుకరించినప్పుడు మాత్రమే ఆయన స్వయంగా ఆర్ద్రతకు లోనవుతారు. రసానుభూతిని అనుభవిస్తాడు. భగవదర్శనం వంటి దివ్యానుభాన్ని పొందుతారు. ఎక్కడో కుగ్రామంలో పుట్టిన వేణుమాధవ్ ప్రపంచంలోని అందరు హేమాహేమీల గొంతులను వారి భాషలో, వారి యాసలో అనుకరించి ప్రశంసలు పొందారు. మిమిక్రీ లొల్లాయి ఆటకాదంటూ దానికి సశాస్త్రీయతను ఆపాదిస్తూ సిలబస్ తయారుచేశారు. పాతతరం నాయకులు, తారలు, సంగీతకారుల గొంతులను భద్రపరిచి నేటికీ వినిపించే సజీవ స్వర బాండాగారం నేరెళ్ల వేణుమాధవ్. మిమిక్రీని సజీవ కళగా ప్రపంచానికి చాటిన ఈయన కళామతల్లి ముద్దుబిడ్డల్లో అగ్రగణ్యుడు.

# మన కార్టూనిస్టులు

-కళాసాగర్

*"అక్షరం రూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క. లక్షమెదళ్లకు కదలిక అన్నాడు, ఆనాడు మహాకవి కాళోజీ. అక్షరానికున్న శక్తి అలాంటిది. వేల అక్షరాలతో చెప్పలేని భావాన్ని ఒక్క కార్టూన్ ద్వారా చెప్పొచ్చు అంటున్నారు నేటి కార్టూనిస్టులు. నిరక్షరాస్యులను కూడా కదిలించగల శక్తి కార్టూన్‌కుంది.*

*వివరణ అవసరం లేకుండా సూటిగా, సంక్షిప్తంగా, విషయాన్ని పాఠకుడి హృదయానికి హత్తుకునేలా చేసే గొప్ప కళా మాధ్యమం కార్టూన్. అందుకే రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాహిత్య, కళా విషయాలతో నిమిత్తం లేకుండా అన్ని రకాల పత్రికలలోనూ నేడు కార్టూన్లు ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ఇంత శక్తివంతమైన కళాప్రక్రియకు తెలుగులో ఆద్యుడు శ్రీ తలిశెట్టి రామారావు గారైతే, ఆ తర్వాత కార్టూన్ విస్తృతంగా వ్యాప్తిలోకి రావడానికి బాపు, జయదేవ్, బాలి, మోహన్, ఏ.వి.ఎమ్, చంద్ర, మల్లిక్, సత్యమూర్తి, శ్రీధర్, కుమారి రాగతి పండరి లాంటి ఎందరో కార్టూనిస్టులు కృషి చేస్తున్నారు.*

*తెలుగు కార్టూన్ పితామహుడు తలిశెట్టి రామారావు గారితో 'మనకార్టూనిస్టులు' శీర్షికను ప్రారంభించాం. చదవండి, హాయిగా నవ్వండి, మీ అభిప్రాయాలను తెలియజేయండి...*

## హ్యూమర్ ద్వారా విప్లవం



కళాధర్ బాపు తెలుగు కార్టూన్ రంగం నుంచి వచ్చి, అంతర్జాతీయంగా గుర్తింపు పొందిన అతి కొద్ది వ్యంగ చిత్రకళాకారులలో ఒకరు. బహుముఖ ప్రజ్ఞాశాలిగా విజువల్ డిజైన్, సాఫ్ట్‌వేర్ యుజబిలిటి, ఆర్కిటెక్చర్, ఫోటోగ్రఫి, ఫిలింసెట్ డిజైన్, యానిమేషన్, పెయింటింగ్, మల్టీమీడియా వంటి వివిధ రంగాలలో అత్యంత ప్రతిభ కనపబరుస్తోన్నప్పటికీ కార్టూన్, కారికేచర్ రంగాలలో తనకంటూ ఒక ప్రత్యేక శైలితో జాతీయ అంతర్జాతీయ స్థాయిలో తనదయిన ముద్రను వేయగలిగారు కళాధర్ బాపు ఈ మధ్య అమెరికా ప్రెసిడెంట్ ఒబామా నోబెల్ పీస్ ప్రైజ్ గెలిచిన సందర్భంగా గీసిన ఒబామా కారికేచర్ అంతర్జాతీయంగా పలువురి ప్రశంసలు పొందటమే కాకుండా అమెరికా హయర్ ఎడ్యుకేషన్ టెక్స్ట్‌బుక్‌లో పాఠ్యాంశంగా కూడా ప్రచురితమయింది.

ప్రముఖ చిత్రకారులు, కోనసీమ చిత్రకళాపరిషత్ వ్యవస్థాపకులు కొరసాల సీతారామస్వామి మరియు శ్రీమతి పద్మావతి దంపతుల ప్రథమ సంతతిగా కళాధర్ బాపు అమలాపురంలో జన్మించారు. బాపుగారి పైన వున్న గురుభక్తితో తన కుమారుడు బాపు గారి అంత గొప్పవాడు కావాలని కళాధర్ బాపు అని నామకరణం చేసారు. కానీ అప్పుడు కొరసాల సీతారామస్వామి గారు ఊహించి వుండరు, కళాధర్ బాపు రాబోయే కాలంలో బాపుగారు మెచ్చే చిత్రకారుడు అవుతారని, బాపుగార్కి




చేసారు. ప్రముఖ సంస్థలయిన మైక్రోసాఫ్ట్, కార్గిస్, వానంబర్ట్, బాన్ వంటి సంస్థలలో డిజైనింగ్ హెడ్‌గా పనిచేశారు. కళాధర్‌బాపు కోల్గేట్ కొరకు తయారుచేసిన ఇన్నోవేషన్ Strategy for chances market ,న్యూయార్క్‌లో కోల్గేట్ అధికారుల ప్రశంసలు పొందింది. అంతేకాకుండా బాపు రాబోయే భవిష్యతు టెక్నాలజీ మానవులకు ఎలా ఉపయోగపడాలో వివరిస్తూ రూపొందించిన Ebimba కాన్సెప్ట్, న్యూయార్క్‌లో Tunder Dome అవార్డు గెలుచుకుంది. కళాధర్ బాపు స్థాపించిన Usability Matters. org అంతర్జాతీయంగా ఖ్యాతిని

అత్యంత ఆప్తుడు కాబోతున్నారని. బాల్యం నుండి తండ్రిగారి ప్రోత్సాహంతో చిత్రకళ, కార్టూన్ రంగాలలో విశేష కృషి చేసారు. తన మొదటి కార్టూన్ తన పదవ ఏటనే ఆంధ్రప్రభలో అచ్చుయ్యింది. ఆ తరువాత హిందూస్థాన్ టైమ్స్, స్వాతి, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, విపుల, ఉదయం, బాలమిత్ర, బొమ్మరిల్లు వంటి పత్రికలలో కార్టూన్స్ ప్రచురితమవటమే కాకుండా, జాతీయ అంతర్జాతీయ కార్టూన్ పోటీలలో అనేక ప్రథమ మరియు ద్వితీయ బహుమతులు గెలుచుకున్నారు. కళాధర్ బాపు వేసిన వాటర్ మరియు పర్యావరణం సంరక్షణ పైన స్పందించి వేసిన కార్టూన్లు అంతర్జాతీయంగా ఎన్నో ప్రదర్శనలలో చోటు చేసుకున్నాయి. అంతే కాకుండా UMO అంతర్జాతీయ కార్టూన్ కాంటెస్ట్ పేరుతో గత 7సం॥లుగా అంతర్జాతీయ కార్టూన్ పోటీలను నిర్వహిస్తూ రూ. 25000/– రూపాయలు ప్రథమ బహుమతిని అందిస్తూ అంతర్జాతీయ కార్టూన్ రంగంలో భారతదేశానికి ఒక ప్రాముఖ్యత తీసుకువచ్చారు.

కళాధర్‌బాపు చిత్రకళలోనే కాకుండా బాల్యం నుండి చదువులోనూ తన ప్రతిభను కనబరిచారు. ఐఐటి డిజైన్ ఎంట్రన్స్‌లో జాతీయస్థాయిలో 99.7% తో ప్రథమస్థానాన్ని పొంది IIT mumbai నుండి డిజైన్‌కోర్సు చేసారు. అత్యంత ప్రతిష్టాత్మకమయిన Pratt ఇన్స్టిట్యూట్ న్యూయార్క్ నుండి ప్రముఖ డిజైనర్స్ మాత్రమే చేయగలిగిన డిజైన్ మేనేజ్‌మెంట్ కోర్సు

గడించింది. ఈ నాన్–ప్రాఫిట్ ఆర్గనైజేషన్ ద్వారా రాబోయే తరానికి ఇన్నోవేషన్, యూజర్ ఫ్రెండ్లీ ప్రొడక్ట్స్ సరిఅయిన అవగాహన కలిగించాలనే వుద్దేశ్యంతో ఎన్నో వర్క్‌షాప్స్ మరియు అవగాహనా సదస్సులు నిర్వహించారు. ప్రస్తుతంUXINDIA 2012 (www.ux-india.org) పేరిట ISB హైదరాబాద్‌లో అంతర్జాతీయ కాన్ఫరెన్సును సెప్టెంబరులో ఏర్పాటు చేస్తున్నారు.

ప్రజలలో అవగాహన, విప్లవం హ్యూమర్ ద్వారా తీసకురావచ్చనే తాను ఈ ఆర్గనైజేసన్‌ని స్థాపించానని సరైన విద్య భావితరాలకు అందచేస్తే సమాజంలో మార్పును ఆశించవచ్చని అభిప్రాయపడ్డారు.



# సాహితీ కైలాస శిఖరం- విశ్వనాథ దర్శనం

*"మాటలాడే వెన్నెముక*
*పాటలాడే సుషమ్న*
*నిన్నటి నన్నయభట్టు*
*ఈనాటి కవిసమ్రాట్టూ*
*గోదావరి పలకరింత*
*కృష్ణానది పులకరింత*
*తెలుగు వాళ్ల గోల్డునిబ్బు*
*అకారాది క్షకారాంతం*
*ఆసేతు మిహికావంతం*
*అతగాడు తెలుగువాడి ఆస్థి*
*అనవరతం తెలుగునాటి ప్రకాస్తి*
*ఛందస్సులేని ఈ ద్విపద*
*సత్యానికి నా ఉపద"*



**ఎల్.ఆర్. వెంకటరమణ**

"విశ్వనాథ" వారిని గురించి బెబుతూ అంటాడు శ్రీశ్రీ. "స్పష్టత ఆయనలోని రచనలోని తొలి గుణం. వ్యక్తిగా, రచయితగా ముక్కుసూటిగా చెప్పగల వ్యక్తి. మిత్రులను మందలించడమే కాక, శత్రువులను సైతం ప్రేమించగల సహృదయతకల వ్యక్తి. ఆయనను కొందరు ఛాందసుడు అన్నారు. కొందరు ఉదారుడు అన్నారు. మరికొందరు ''పాషాణ పాకప్రభువు'' అన్నారు. వీరగ్రాంధికవాదిగా పేరుబడిన వ్యక్తి". ఆయనే కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ.

వెలుగు చీకట్లు రెంటిలో "అందుసగము ఇందు సగము వంటి వాడను " అని చెప్పుకున్న విశ్వనాధ వారే" నే నేర్చినన్నీ మాటలు నేర్వరెవ్వరును" అని కూడా అని విమర్శకుల దృష్టిలో అహంకారి అయ్యాడు. నన్నయ, తిక్కన్నలు నన్నాదేశించారని చెప్పుకున్నవాడు.

ఆధునికాంధ్రసాహిత్య నిర్మాతలలో విశ్వనాధవారి స్థానం మాత్రం కైలాశ శిఖరం వంటిదే. విశ్వనాధ వారు 1895 సెప్టెంబర్ 10న కృష్ణాజిల్లా నందమూరులో పార్వతమ్మ, శోభనాద్రి దంపతులకు జన్మించాడు. తిరుపతి వేంకటకవులలో ఒకరు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి శిష్యుడు. ఇంకా విశ్వనాధ వారి వ్యక్తిత్వాన్ని మలచిన ఆధ్యాత్మిక గురువుల విమలానంద భారతిగారు.

విశ్వనాథవారు బందరులో హైస్కూలు విద్య చదివారు తరువాత కళాశాలలో ప్రవేశించారు. సహాయ నిరాకరణ పిలుపుతో కళాశాల వదలి వచ్చేశాడు. తరువాత బందరు జాతీయ కళాశాల, హిందూ కళాశాలలో పనిచేస్తూ, పట్టభద్రుడయ్యాడు. 1932లో గుంటూరు ఏ.సి. కాలేజీలో అధ్యాపకులుగా ఉన్నారు. అక్కడా ఇమడలేక 1938లో పి.జి. స్థాయిలో సంస్కృతం చదివారు. తరువాత విజయవాడ కాలేజీలో పనిచేశారు. పదవీ విరమణ అనంతరం కరీంనగర్‌లో ప్రిన్సిపాల్‌గా కళాశాలలో పనిచేశారు.

విశ్వనాథవారు విద్యార్థి దశనుండే కవితలు చెప్పేవారు. కొడాలి ఆంజనేయులు గారితో కలిసి జంటకవిత్వం కూడా పందించాడు. ఆధునిక సాహిత్యప్రక్రియలలో ఆయన చేపట్టని



ప్రక్రియలేదు. నవ్యకవిత్వ శాఖలన్నిటా ప్రవేశించి శిఖర సమానుడయ్యాడు. 1932లో భార్య వరలక్ష్మిగారు మరణించారు. భార్యావియోగంతో 'వరలక్ష్మి త్రిశతి" అన్న స్మృతి కావ్యం రచించారు. నవలా సాహిత్యంలో కాలుపెట్టిన విశ్వనాథవారు 1917లో "అంతరాత్మ" అన్న తొలి నవల రాశారు. 1976లో చివరిదైన "నందిగ్రామరాజ్యం" రచించారు. మొత్తంగా 59 నవలలు రచించారు. వీటిలో మంచిపేరు తెచ్చినది "ఏకవీర"(1930). వ్యక్తి ధర్మానికీ, వ్యవస్థా ధర్మానికీ మధ్య చెలరేగిన సంఘర్షణను హృద్యంగా ఈ నవల చర్చిస్తుంది. ఆ రోజులలోనే ఈ నవల మనో విశ్లేషణకు దారులు తీసినది.

ఏకవీరలోని త్రికాత్మకత వేయి ముఖాలుగా విస్తరించి "వేయిపడగలు" (1934) అన్న నవలగా రూపుదిద్దుకుంది. ఈ నవల మూడు తరాల జీవితాలకు అద్దం పడుతుంది. ఈ నవలను విశ్వనాథవారు చెబుతుంటే వారి తమ్ముడు రాసేవారట. ఈ పని 29 రోజుల్లోనే పూర్తయింది. 1968లో పి.వి. నరసింహారావుగారు "సహస్రఫణ్" పేర హిందీలోకి అనువదించాడు. 1976లో గుజరాతీ అనువాదం కూడా వచ్చింది. ఈ నవలలో సాహిత్యం, సంగీతం, నాట్యం, నాటకం, వైద్యం, ధ్యానయోగం వంటి ఎన్నో విషయాలు చర్చకు వస్తాయి. కథా కథనంలో, పాత్రచలనంలో విశ్వనాథవారు తనదైన శైలిని చూపారు. విశ్వనాథవారు ఇంకా అనేక నవలలు రచించారు.

కథలు రాసింది కొన్నయినా, విలువలో ఉన్నతమైనవి. మానవీయ సంబంధాలు, వివిధ చిత్తవృత్తులు అపూర్వంగా, కరణరసంలో చిత్రితమయ్యాయి. విశ్వనాథవారికి విశేష ఖ్యాతిని తెచ్చిపెట్టిన గ్రంథం "రామాయణ కల్పవృక్షం" ఈ రచనకు జ్ఞానపీఠ్ బహుమతి లభించింది.

విశ్వనాథవారు 1913లో తన తండ్రికి ఒక ప్రతిజ్ఞ చేశారు. అదేమంటే కవిగా తను ఎదిగితే రామాయణాన్ని తెలుగులో రచిస్తానని, ఇలా 1934నుండి "రామాయణ కల్పవృక్షం" రాయడం మొదలుపెట్టారు. ఈ రచనకై ఎంతో అధ్యయనం చేయవలసివచ్చింది. సృష్టిక్రమాన్ని, ప్రకృతి గురించి, చరిత్ర, అర్థశాస్త్ర, పౌరశాస్త్రాలు, సమాజ శాస్త్రాలు, జ్యోతిష్యశాస్త్రాలు చదవవలిసి వచ్చింది. ప్రాచ్య, పాశ్చాత్య తత్వశాస్త్రాన్ని, డార్విన్ సిద్ధాంతాన్ని చదవడం జరిగింది. 1955-63 మధ్య భారతీయ భాషలలో వెలుబడిన సృజనాత్మక సాహిత్యరచనలలో సర్వోత్కృష్టరచనగా ఎంపికైనది. 1970సం॥ ప్రధానం చేయబడింది. ఈ సభ 1971 నవంబర్ 16 మంగళవారంనాడు ఢిల్లీలోని విజ్ఞాన్ భవన్‌లో రాష్ట్రపతి చేతులమీదుగా జ్ఞాన్‌పీఠ్ పురస్కారం జరిగింది.





విశ్వనాథవారి అధ్యయనం ఎంత విస్తృతమో, ఆలోచన అన్నది ఎంత సునిశితమో, ఎంతటి వినూత్న కోణాల నుండి ఆ వెలుగు ప్రసరిస్తుంటుందో ఆయన రచనలన్నిటా అది పరచుకొని ఉంటుంది. తెలుగు సాహిత్యం మీదనే కాక, తెలుగు సాహిత్య విమర్శపై కూడా మంచి పట్టు సాధించినవారు సంస్కృత సాహితీ విమర్శకు కొత్తదారులు తెరిచారు. సంస్కృత రూపకాల గురించీ, కాళిదాసు, భవభూతి సాహిత్యం గురించి విలువైన వ్యాసాలు అందించారు.

1923లో విశ్వనాథవారు తన తండ్రి వెంట భద్రాచల ప్రాంతానికి వచ్చినపుడు గోదావరి ఉపనది కిన్నెరసాని వాగు చూసి ఆయనలో కవితా హృదయం పొంగి పొరలింది. దీంతో రసమయ కావ్యంగా "కిన్నెరసాని పాటలు" రూపుదాల్చాయి.

"ముద్దు ముద్దుగా నడిచి
ప్రోడవోలిక నాది
మురిపెమ్ముగా పాది
ముగుద కిన్నెర సాని
ఎడదలో ఎదురైన కలగాంచెనో
కన్నీటి కడవలై ప్రవహించెనో"

అంటూ కిన్నెర కావ్య ప్రవంతిని ఎనిమిది కండాలుగా కిన్నెర పుట్టుక; కిన్నెర నడకలు; కిన్నెర నృత్యం, కిన్నెర సంగీతం; కడలిపొంగు; కిన్నెర దు:ఖం; గోదావరి సంగమం; కిన్నెర వైభవం పేర్లలో కావ్య ప్రవంతిని ముందుకు నడిపాడు.

ఇంకా ఎన్నో నాటికలు, నాటకాలు రచించారు విమర్శ గ్రంథాలు రచించారు. సంస్కృత రూపకాలు దిద్దారు. వీరిపై, వీరి రచనలపై పాషిల్, పిహెచ్.డి డిగ్రీలు ప్రధానం చేయబడినాయి.

విశ్వనాథవారు అందుకున్న పురస్కారాలకు కొదవేలేదు, కవిసమ్రాట్ బిరుదు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారి బహుమతి, కళాప్రపూర్ణ బిరుదు, పద్మభూషణ్, జ్ఞానపీఠ పురస్కారం ఇలా ఎన్నో అందుకున్నారు విశ్వనాథవారు.

విశ్వనాథవారు పొరుగు రాష్ట్రాలలో కూడా ఘన సన్మానాలు అందుకన్నారు. కలకత్తాలో వంగీయ సాహిత్యపరిషత్ సన్మానాన్ని 1967లో అందుకున్నారు. నాగపూర్ 1975లో పొందిన సన్మానం, వారణాసిలో జరిగిన సన్మానాలు ప్రముఖంగా చెప్పుకోవచ్చు.

రాష్ట్ర సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షపదవిని 1957లోనూ; రాష్ట్రశాసన మండలి సభ్యత్వం 1958లో ఆయన పొందారు. 1971లో విశ్వనాథవారు ఆంధ్ర ప్రదేశ్ ఆస్థానకవి పదవిని అలంకరించారు. గుడివాడ ప్రజలు 1942లో "గజారోహణం"లో ఊరేగించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం "కళాప్రపూర్ణ" బిరుదుతో 1965లో సత్కరించారు, 1936లో "కవిసమ్రాట్" బిరుదు అందుకున్నారు.

1976 అక్టోబర్ 18వ తేదీన సాహితీ వినీలాకాశానికి ఏగుచుక్కయై తరలివెళ్ళాడు. దూషణ, భూషణాలు రెంటిని పొందాడు. పురస్కారాలు, తిరస్కారాలను చవిచూశాడు. ఆయనను కరడుకట్టిన సంప్రదాయవాదిగా లోకం చూసింది. కానీ ఆయన ఆధ్యాత్మికతతో కలగలసిన సామ్యవాదాన్ని కోరుకున్నాడు. తెలుగు సాహిత్యమున్నంత వరకూ ఒక చెరగని చిరునామా విశ్వనాథ సత్యనారాయణ.

*email: venkataramana_lanka@yahoo.com*

# కోనసీమను కీర్తిశిఖరంపై నిలిపిన కొరసాల

- వెంటపల్లి సత్యనారాయణ

*ఉప్పొంగి ఎగసిపడే అలల ప్రవాహ గమనానికి దూరం తక్కువ. కానీ నెమ్మదిగా ప్రవహిస్తూ ముందుకు సాగే గోదావరి అలల గమనానికి దూరం ఎక్కువ"*

*అతని గమనం ఉప్పొంగే ప్రవాహం కాదు. నెమ్మదిగా మునుముందుకు సాగుతూ అనంత దూరం ప్రవహించే జీవనది. అందుకే అతని విజయాలన్నీ హోరెత్తించే ప్రచారానికి నోచుకోవు. కావల్సిన కార్యం నిర్మలమైన ప్రవాహంలా సాగుతూ మునుముందుకు సాగిపోవడమే అతని పని. ఇక విజయాలు వాటంతట అవే అతన్ని దరిచేరడం వాటి పని.*

తన మాయాజాల వర్ణాలతో దశాబ్దాలుగా ఆంధ్రావనిని ఉర్రూతలూగించిన రంగుల రారాజు వడ్డాది పాపయ్యను మెప్పించినా, వేన వేల శైలుల్లో ఒకే ఒక్క రూపాన్ని చిత్రించి యావత్ భారతదేశ ముఖ్య గేలరీలలో తన విశ్వరూప ప్రదర్శన గావించినా కేవలం కె.సి.పి. అన్న మూడక్షరాలలో తన కలల సంస్థనే కాదు, కోనసీమ విశిష్ఠతనూ సాక్షాత్కరింపజేసినా, ఒకటి రెండు కాదు 22 ఏళ్ళుగా తన సంస్థ ద్వారా ఏ ఏడాదికాఏడాది రెట్టించిన ఉత్సాహంతో జాతీయస్థాయిలో పిల్లల నుండి పేరుమోపిన చిత్రకారుల వరకూ పోటీలు నిర్వహించినా, ప్రపంచ దేశాలలో ఒక్క భారతీయ మహిళలకే సొంతమైన విశిష్ఠ కళాప్రక్రియ రంగవల్లుల పోటీలు కూడా సుందరంగా ప్రతి ఏటా నిర్వహిస్తూ మన తెలుగు, భారతీయ సాంప్రదాయ కళల విశిష్ఠతను, తన ప్రాంత గొప్పతనాన్ని జాతీయ స్థాయిలో చాటుతుండడమే గాక ఒకే వేదికపై శత చిత్రకారుల సన్మాన కార్యక్రమం నిర్వహించి అందరికి "చిత్రకళా వైజయంతి"





పురస్కారాలను కూడా అందజేసి తన సంస్థకు లిమ్కాబుక్, ఇండియన్ బుక్ మరియు గ్లోబల్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డులను కూడా సాధించిపెట్టి కోనసీమను కీర్తి శిఖరాలపై కెక్కించిన ఆ వ్యక్తి విశిష్ఠ చిత్రకారుడు మాత్రమే కాదు. గొప్ప కార్యశీలనా దక్షుడు కూడా. అతనే కోనసీమ చిత్రకళాపరిషత్ వ్యవస్థాపక కార్యదర్శి, ప్రముఖ చిత్రకారుడు కొరసాల సీతారామస్వామి.

ఆలోచనలు మాత్రమే అద్భుతాలను సృష్టించలేవు. ఆలోచనకు ఆచరణ తోడైతేనే అద్భుతమో, ఆశ్చర్యమో ఏదో దాన్ని సృష్టిస్తుంది. సభ్య సమాజం నిర్వహించే సభలు, సమావేశాలు, సన్మానాల కతీతంగా, అసలు తోటి సమాజంలో బొత్తిగా కలవకుండా ఒక ఋషిలా ఏకాంతంగా కళాసాధన చేస్తూ సృష్టించిన తన మాయోజనిత వర్ణ సమ్మేళన చిత్రాలు ఆనాడు ఆంధ్రదేశంలో గొప్ప చిత్రకారులతో పాటు అభ్యుదయ చిత్రకారులందరినీ వెర్రెక్కిస్తున్న తరుణంలో తన కళల చిత్రకారున్ని ఏ విధంగానైనా కలుసుకోవాలన్న ఓ చిరు చిత్రకారుడి మొండి వైఖరి సహజంగానే ఆ మహా చిత్రకారుడి కోపాగ్నికి గురయ్యేలా చేసింది. దానికి కారణం పూజలో వున్న ఆ చిత్రకారునికి తన ఉద్విగ్నతలో భంగం కలిగించడమే, కానీ తమాయించుకున్న చిరు చిత్రకారుడు సర్ మీరు పూజచేస్తున్న ఆ ఆంజనేయుడి చిత్రాన్ని సృష్టించింది నేనే అని చెప్పిన సంఘటన ఆ మహా చిత్రకారుడిని షాక్‌కి గురిచేస్తే, ఈ చిరు చిత్రకారుడికి ఆ మహా చిత్రకారుడి ప్రాపకం పొందేలా చేసింది. తన సౌందర్య వంతమైన రేఖలు, అద్భుత వర్ణ సమ్మేళనంతో ఆనాడు అప్సరసలను సైతం అసూయకు గురిచేసిన ఆ మహా చిత్రకారుడు వడ్డాదిపాపయ్య అయితే ఈ చిరు చిత్రకారుడు మాత్రం కొరసాల సీతారామస్వామిగారే.

వంశానుగతంగా చిత్రకళా నేపధ్యం గల కుటుంబంలో కొరసాల సత్యనారాయణ మూర్తి శ్రీమతి సత్యవతి దంపతులకు తూర్పుగోదావరి జిల్లా కోనసీమ ప్రాంతానికి చెందిన మామిడికుదురు అనే గ్రామంలో 26.4.1948లో కొరసాల జన్మించారు. వంశపరంపరగా తనకు అబ్బిన చిత్రకళను కొరసాల తన నలుగురు సోదరులకు కూడా నేర్పి వారిని కూడా చిత్రకారులుగా తీర్చిదిద్దారు. కొరసాల బ్రదర్స్ పేరుతో వీరు ఆ రోజుల్లో వేసిన చిత్రాలు బాగా ప్రాచుర్యం పొందాయి. అయితే వీరిలో అగ్రగణ్యుడు మాత్రం కొరసాలే. సహజంగా తనలో ఉన్న కళకు మొదట్లో చిరంజీవి అన్నంరాజు అనే గురువు సాయపడితే ఆ పిదప దామెర్ల రామారావు స్మారక కళాశాల ప్రిన్సిపల్ స్వర్గీయ మాదేటి రాజాజీ గారి శిష్యరికంలో అతని కళ మరింత దేదీప్యమైంది. బహువిధ కళాప్రక్రియల్లో నిష్ణాతులైన



మాదేటి రాజాజీగారి శిష్యరికంలో తన కళకు మరింత మెరుగులు దిద్దుకున్న కొరసాల రాష్ట్రప్రభుత్వం నిర్వహించే డ్రాయింగ్ లోయర్, హయ్యర్ పరీక్షలతో పాటు చిత్రకళలో T.T.C. కూడా చేసి 25.7.1969న డ్రాయింగ్ టీచర్‌గా రాష్ట్రప్రభుత్వ ఉద్యోగంలో స్థిరపడ్డారు. 1970 ఆ ప్రాంతంలోనే ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, భూమి లాంటి పత్రికలలో ఎన్నో చిత్రాలు వేయడమే గాక కొన్ని సంచికలకు ముఖచిత్రాలను కూడా అందించారు. ఒక ప్రక్క ఉ ద్యోగబాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తూనే తన నలుగురు సోదరులతో కలిసి కొరసాల బ్రదర్స్ పేరుతో ఆ రోజుల్లో ఎన్నో చిత్రాలు, గ్లాస్‌పెయింటింగ్స్ వేయడమే గాక వాటితో మంచి మార్కెట్ కూడా చేశారు.

ఓ చిత్రకారుడి గొప్పతనానికి ప్రతీకగా అతని చిత్రాల సేలబిటీనే ప్రమాణంగా తీసుకున్నట్లయితే కొరసాల చాలా మందికంటే ముందు వరుసలో వుంటారు. కొరసాల బ్రదర్స్ "ఆరాధనా చిత్రావళి" పేరుతో యాభై వైరైటీలలో ఆయన వేసిన చిత్రాలు దాదాపు 35 ఏళ్ళక్రితమే ఆంధ్రా, కర్ణాటక, ఒరిస్సా, తమిళనాడు రాష్ట్రాల్లో లక్షలాది చిత్రాలు అమ్ముడు పోయాయి. అంటే విన్నవారికి వింతగా ఉండవచ్చేమో గానీ, అది నమ్మలేని నిజం. అష్టోత్తర, సహస్రనామావళి, పేర్లతో హిందూ దేవుళ్ళ, దేవతలనే గాక క్రైస్తవ, ముస్లిం, బౌద్ధ మతాలకు సంబంధించి కూడా ఆయా మతాలకు సంబంధించిన అక్షర స్తోత్రాలతో ఆనాడు ఆయన వేసిన చిత్రాలపై నాలుగు రాష్ట్రాల్లో ఎందరో ఆస్థికుల పూజామందిరాలలో కొలువు దీరాయి. "ఇంటింటా కొరసాల" పేరుతో ఈ విషయాన్ని ఆనాటి పత్రికలు ఎంతగానో శ్లాఘించాయి.

ఒక వ్యక్తికి ఒక ఆలోచన రావడం ఒక ఎత్తైతే దాన్ని ఆచరణలోకి తేవడం దాన్ని నిరాటంకంగా విజవంతంగా నడిపించడం అనేది మరో ఎత్తు. కొరసాల కేవలం చిత్రకారుడే కాదు, గొప్ప కార్యదక్షుడు కూడా అని చెప్పడానికి రెండు దశాబ్దాలకు పైగా జాతీయస్థాయిలో ఏ ఏడాదికా ఏడు రెట్టించిన ఉత్సాహంతో చిత్రకళాపోటీలు నిర్వహిస్తూ మునుముందుకు నడిపిసున్న ఆయన సంస్థ కోనసీమ చిత్రకళాపరిషత్ గొప్ప ఉ దాహరణ. ప్రతీ ఏడాది జనవరి మూడవ ఆదివారం కోనసీమ నడిబొడ్డు అమలాపురంలో ఆయన నిర్వహించే చిత్రకళా పోటీలు అక్కడ ఒక పండుగ వాతావరణాన్ని జాతీయ సమైక్యతను, ప్రతిబింబించేలా ఉంటాయి. దేశ నలుమూలల నుండి వచ్చే వివిధ రాష్ట్రాల చిత్రకారులు, బాలచిత్రకారులు, వారి వెంబడి వచ్చే వారి తల్లిదండ్రులు చిత్రకళా ఆచార్యులు, చిత్రశిల్ప, నిశ్చల చిత్రాలలో నిష్ణాతులయిన గొప్ప గొప్ప కళాకారులు వారి వారి ప్రదర్శనలు, ఉపన్యాసాలు, వర్క్‌షాపులు, సన్మానాలు ఆరోజు వేలాది కళాకారులతో కోనసీమ అంతా కళామయం అవుతుంది. చాలా ముందస్తు ప్రణాళికతో రూపొందించుకున్న కార్యక్రమం ప్రకారం చిన్న పెద్ద అనే బేధం లేకుండా అందరిని వారి వారి స్థాయిల్లో సన్మానించి ఆయా కళాకారులందరికీ ఓ తీపి గుర్తులా ఉండేలా చేయడం ఆయన అభిమతం. అందుకే ఒక్కసారి ప్రణాళిక రూపొందిన తర్వాత దానిని ఎంతో క్రమశిక్షణా బద్ధంగా చేయడం








చంద్రబాబునాయుడు నుండి మెమెంటో అందుకుంటున్న కొరసాల

ఆవిర్భావానికి అంకురార్పణ పడేలా చేసింది. అదే ఏడాది అనగా 1989లో ఆయన వ్యవస్థాపక కార్యదర్శిగా రాష్ట్ర మాజీ వైద్య ఆరోగ్యశాఖ మంత్రి డాక్టర్ మెట్ల సత్యనారాయణ అధ్యక్షునిగా కోనసీమ చిత్రకళాపరిషత్ ఆవిర్భవించింది. నాటి నుండి నేటి వరకూ ఆ సంస్థను రోజు రోజుకూ నూతనుత్తేజంతో ముందుకు నడిపిస్తున్న ఘణత కొరసాల గారిదే.

కోనసీమ చిత్రకళాపరిషత్ కార్యదర్శిగా వుంటూనే కొరసాల ఆర్ట్ సర్కిల్ అన్న సంస్థను హైదరాబద్‌లోనూ Wonder Art world and Art village అనే సంస్థను కూడా స్థాపించి నిరంతరం చిత్రకళా దీప్తికి కొరసాల చేస్తున్న కృషి నిజంగా ఎంతో శ్లాఘనీయమైనది.

వలననే ఎంతమంది కళాకారులున్నా సమర్థవంతంగా అనుకున్న సమయంలోనే పరిషత్ కార్యక్రమాలను సమర్థవంతంగా నిర్వహిస్తూ తన సంస్థను మూడవ దశాబ్ధం వైపుకు నడిపించగలుగుతున్నారు.

కొరసాలకూ, కోనసీమకూ ఇంతటి ఖ్యాతి రావడానికి కారణమైన కోనసీమ చిత్రకళాపరిషత్ ఆలోచనకు అంకురార్పన మాత్రం ఆంధ్రదేశంలో జరగలేదు, మన దేశ రాజదాని నగరం న్యూఢిల్లీలో జరిగింది. 1989లో న్యూఢిల్లీ లలితకళా అకాడమీ వారు అక్కడ నిర్వహించిన (70) రోజుల "పపెట్రీ ట్రైనింగ్"కు కొరసాల హాజరయినపుడు అక్కడ లలితకళా అకాడమీలో దేశ నలుమూలల నుండి వచ్చిన ప్రసిద్ధ చిత్రకారులతో ఏర్పాటు చేసిన చిత్రకళా ప్రదర్శన ఆయనలో కోనసీమ చిత్రకళాపరిషత్




హిందూమతంలో దేవుని పేరుతో ఎన్నో రూపాలున్నాయి. ఒక్కొక్కరూ ఒక్కోపేరుతో ఒక్కో రూపానికి పూజలు, వ్రతాలు తదితరమైనవి చేయవచ్చు. కానీ ఏ గుడికి వెళ్లినా ఏ పూజలు



లేదా వ్రతాలు చేసినా అక్కడ అందరూ సాధారణంగా ముందు పూజించేది మాత్రం విఘ్నేశ్వరుణ్నే. అదీ గాక తరతరాలుగా మన బుద్ధికి, జ్ఞానానికి ప్రతిరూపంగా, విఘ్నాలకు అధిపతిగా యావత్ హిందువుల మదిలో ఓ ప్రత్యేక ప్రాముఖ్యత గల రూపం వినాయకుడిది. అతని దర్శనం శుభసూచకం అని అందరి ప్రగాఢ నమ్మకం. ఇంతటి ప్రాముఖ్యత, శుభసూచకమైన రూపాన్ని మరిన్ని విధాలుగా మరింత మందికి ఏకకాలంలో చూపించి భక్తిభావంతో పాటు శుభకరమైన ఆ అనుభూతిని కూడా అందరికీ కలిగేలా చేస్తే ఎలా వుంటుందీ? అన్న ఆయన ఆలోచనకు ప్రతిరూపమే తన సహస్రగణపతుల చిత్రాల రూపకల్పన. గణపతిపై అచంచల భక్తివిశ్వాసం కల ఆయన ఒక్క గణపతి అంశాన్నే తీసుకుని వేలకు వేలు వేస్తున్నారు. ఇలా ఒకే రూపాన్ని పదేపదే వేస్తున్నప్పుడు తప్పక పునరుక్తి దోషం జరిగేందుకు ఆస్కారముండొచ్చు. అందుకనే ఏమో అలాంటి పునరుక్తి కాకుండా మరియు లెక్క తేడా రాకుండా ఆయన ఒక్కో శైలిలో వేసిన గణపతికి ఒక్కో కోడ్ నెంబర్‌ను కేటాయించి పక్కా ప్రణాళికా బద్ధంగా ఆయన ఈ వినాయకుడి చిత్రాలను రూపొందిస్తున్నారు. సాధారణంగా ఎవరైనా మాట వరకు వేలాది చిత్రాలు అని అంటుండొచ్చు కానీ అలా మాటవరుసకు అన్న చిత్రకారుల జాబితాలో కొరసాలను చేర్చలేము. ఆయన వేసే ప్రతి చిత్రానికి ఓలెక్క, ఆధారాలున్నాయి. అందుచేతనే ఈ


అక్కినేనితో కొరసాల మరియు కుటుంబ సభ్యులు



కొరసాలతో రచయిత వెంటపల్లి

విషయంపై ఆయన చాలెంజ్ చేస్తారు. వాటర్, ఏక్రలిక్, ఆయిల్ తదితర మాధ్యమాలతో పాటు నేడు వుడ్ కార్వింగ్‌తో కూడా గణనాదులను రూపొందిడమే గాక వాటిల్లో సైతం రంగుల్లో చూపించే ఓవర్ లాఫింగ్ ఎఫెక్ట్ తీసుకురావడం ఆశ్చర్యమనిపిస్తుంది.

చిత్రకారుడిగా తన తొలి ప్రదర్శనను 1988లో CCRT న్యూఢిల్లీలోనూ, 1992లో అమలాపురం 1998లో CCRT ఆర్ట్ గేలరీ హైదరాబాద్ 2007, 2008 మరలా 2010లలో కర్ణాటక చిత్రకళాపరిషత్ బెంగుళూర్ మరియు CCRT గేలరీ హైదరాబాద్‌ల నందు వ్యక్తగత చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించగా సామూహికంగా 1988లో CCRT న్యూఢిల్లీలో మొదలు ఆనం కళాకేంద్రం రాజమండ్రి సరస్వతీ గానసభ కాకినాడ, అమలాపురం, స్టేట్ ఆర్ట్ గేలరీ హైదరాబాద్, కర్ణాటక చిత్రకళా పరిషత్ బెంగుళూర్ మొదలగు చోట్ల 1988 నుండి 2011 వరకూ అనేక సార్లు పాల్గొని తన చిత్రాలను ప్రదర్శించారు.

చిత్రకళే తన జీవన లక్ష్యంగా భావించే కొరసాల తన తనయుడు కళాధర్ బాపు, కృష్ణ కళాధర్ మరియు కుమార్తె లక్ష్మీరేఖ ముగ్గురూ M.F.A. చేయడమే గాక కుమారులిద్దరూ డిజైన్ మేనేజ్‌మెంట్‌లో కూడా మాస్టర్ డిగ్రీలు చేసి ఒకరు న్యూయార్క్‌లోని ప్రఖ్యాత సేపియంట్ సాఫ్ట్‌వేర్ కంపెనీలోనూ, ఇంకొకరు హైదరాబాద్‌లోనూ మాస్టర్ ఇన్ డిజైనర్స్‌గా పనిచేస్తూ మంచి స్థితిలో ఉండగా అమ్మాయి మాత్రం ప్రస్తుతం ఎమ్.ఎఫ్.ఏ. చేస్తున్నారు. కొరసాల కళావారసత్వం కేవలం తన తనయులకే గాక తన మనుమలకు కూడా వ్యాప్తి చేయడం గొప్ప విషయం. అయితే ఆ ప్రదర్శన ప్రారంభానికి ప్రఖ్యాత చిత్రకారుడు బాపు వచ్చి మాస్టర్ దృవ్‌కు ఆశీస్సులు అందించడమే కాక దృవ్ వేసిన

ఒక డణేష్ చిత్రాన్ని తీసుకువెళ్ళడం మరింత గొప్ప విషయం. 2007లో స్టేట్ ఆర్ట్ గేలరీ హైదరాబాద్ నందు కొరసాల గారి పెద్దబ్బాయి కళాధర్ బాపు తనయుడైన "ధృవ్‌బాపు"తో కలిసి 'పరంపర' అనే పేరుతో చిత్రకళా ప్రదర్శన చేయడమే గొప్ప విషయం. చిత్రకారుడు బాపు గారిపై కొరసాలకు గల వీరాభిమానమే తన తనయుడికి, మనమడికి కూడా ఆ పేరు వచ్చే విధంగా (కళాధర్‌బాపు, ధృవ్‌బాపు) పెట్టామని ఆయన చెప్తారు.

నిరంతరం చిత్రకళే ఊపిరిగా జీవిస్తున్న కొరసాల రాష్ట్రంలోని ప్రముఖ చిత్రకళా, సాంస్కృతిక సంస్థలన్నింటి నుండి సన్మానాలు అందుకున్నారు. 1988లో ఆంధ్రాభవన్ న్యూఢిల్లీలో సత్కరింపబడ్డ కొరసాల 2000సం॥లో రాష్ట్రప్రభుత్వ ఉత్తమ చిత్రకళోపాధ్యాయ అవార్డ్‌ను అప్పటి రాష్ట్రముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు చేతులమీదుగా అందుకున్నారు. అప్పటి ఆర్ధికమంత్రి యనమల రామకృష్ణుడుచే కూడా కొరసాల సన్మానింపబడ్డారు. కోనసీమకు ఆయన తెచ్చిన గుర్తింపునకు ప్రతిగా ఆయన శిష్యులు 300 మంది మరియు పురజనులు ఆయనకు రజిత కిరీటం, బంగారు కంకణంతో పాటు కనకాభిషేకం కూడా చేసి సత్కరించడం లాంటివి వాటిలో కొన్ని ముఖ్యమైనవి.

ఒక చిత్రకారుడిగా నాకు 1994 నుండి కొరసాల మరియు కోనసీమ చిత్రకళాపరిషత్‌తో పరిచయం వుంది. ఇన్నేళ్ళ కళా ప్రస్థానంలో వ్యక్తిగత వయసు పరంగా ఆయన 65వ పడిలోకి, కళాసంస్థ పరంగా రజతోత్సవం వైపు సాగిపోతున్నప్పటికీ నేటికీ చిత్రకళా కార్యక్రమాలపై ఆయన అభిలాష రోజురోజుకీ పెరుగుతూనే ఉండడం ఆశ్చర్యం కలుగుతుంది. నేడు రాష్ట్రంలో ప్రఖ్యాత చిత్రకారులుగా వెలుగొందుతున్న ఏ ఒక్క చిత్రకారుడి



న్యూయార్క్‌లోని మ్యూజియమ్ ఆఫ్ మోడరన్ ఆర్ట్ గ్యాలరీలో కొరసాల

బయోడేటా పరిశీలించినా దానిలో కోనసీమ చిత్రకళాపరిషత్ ప్రస్థావన లేని చరిత్ర ఏ ఒక్కరిదీ ఉండదని చెప్పడం ఎంతమాత్రం అతిశయోక్తి కాదని చెప్పవచ్చు.

ఇటీవలనే అమెరికా వెళ్లిన కొరసాల అక్కడ న్యూయార్క్‌లోని ప్రఖ్యాత చిత్ర ప్రదర్శనశాల (MoMA) మ్యూజియమ్ ఆఫ్ మోడరన్ ఆర్ట్‌ను మరియు ఇతర గేలరీలను దర్శించడమే గాక అక్కడ కూడా ఒక ప్రదర్శన చేసే యోచనలో ఉన్నారు. ఇప్పటికే సహస్ర గణపతులను అధిగమించిన కొరసాల భవిష్యత్‌లో 3,333 గణపతులను అన్ని శైలులలోనూ చిత్రించి ప్రదర్శించాలనే సంకల్పంలో ఉన్నారు. అంతేగాక 2015లో రాబోయే కోనసీమ చిత్రకళాపరిషత్ రజతోత్సవ వేడుకలలో 25వేల రూపాయల మెగాఅవార్డుతో పాటు కలిపి మొత్తం లక్షరూపాయల కేష్ అవార్డ్స్‌ను మరియు 25 మంది ప్రఖ్యాత చిత్రకారులతో వర్క్‌షాపును నిర్వహించడమే గాక వెయ్యిమంది చిత్రకారులతో చిత్రకళా సదస్సు కూడా నిర్వహించి చిత్రకళా చరిత్రలో నభూతో నభవిష్యత్‌గా ఆ రజతోత్సవ వేడుకను నిర్వహించేందుకు సన్నాహాలు చేస్తున్నారు.

ఒక నిర్ధిష్ఠమైన లక్ష్యం, దానికి తగిన కృషి, పట్టుదల తోడైతే మనిషికి అసాధ్యమైనదేది వుండదు. ఆ దిశలో అమలాపురం నుండి అమెరికాకు సాగుతున్న కొరసాల కళల కళాయానం కోనసీమలో ఫైన్‌ఆర్ట్స్ కళాశాల స్థాపించడమనే ఆయన మరో లక్ష్యాన్ని కూడా అధిగమించి విజయవంతం కావాలని ఆశిద్దాం.





*email: snventapalli@gmail.com*

Hobby

Last Part

# "తెలుగు పత్రికలు-తొలి సంచికలు"

**(1980-2010)**

- పులిపాటి దుర్గారావు,
బి.ఎస్‌సి, బి.ఇడి.

**తెలుగు సాహిత్యంలో పత్రికలకు ప్రత్యేక స్థానం ఉంది. కథ, కవిత, నవల, కార్టూన్లు, కాలక్షేపం కబుర్లు, సినిమా సంగతులు. ఇలా ఒకటేమిటి పలు అంశాలతో పలురకాల పత్రికలు వచ్చాయి. వస్తూనే ఉన్నాయి. మనలో ప్రతీ ఒక్కరు ఎన్నో పత్రికలు కొంటూంటాం కాని, ఇప్పుడు మనం చెప్పుకోబోయే వ్యక్తిలో ఒక ప్రత్యేకత ఉంది. గత మూడు దశాబ్ధాలనుండి తెలుగులో వెలువడిన అనేక పత్రికల మొదటి సంచికలను సేకరించడమే కాకుండా, నేటికీ వాటిని భద్రపరచి 'లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్స్'ను సాధించారు. ఆ అనుభవాలను వారి స్వీయ రచనలో 64కళలుడాట్‌కాంకు అందిస్తున్నారు పులిపాటి దుర్గారావు గారు మీ కోసం...**

-ఎడిటర్

2001లో వచ్చిన పత్రికల్లో చెప్పుకోవాల్సింది. "హాసం" హాస్యం, సంగీత పత్రిక-(హైదరాబాద్-10/-1/10/2001) ఎమ్.బి.ఎస్. ప్రసాద్, రాజా సంయుక్తంగా తీసుకొచ్చిన ఈ పత్రికలో చక్కటి సకుటుంబ హాస్యం, సంగీతం జుగల్‌బందీ, తరహాలో కలిసి అందించారు. చక్కటి కాలక్షేపం, విజ్ఞానం కలబోసిన పత్రిక- జంధ్యాలను తల్చుకుంటూ ప్రారంభించారు. సినిమా పాటల పుస్తకాలను కూడా దీనిలో అనుబంధించారు. ఇంకో విశిష్ట పత్రిక-"పత్రిక" "లీలా జనర్ధనం"లో బాపు గీసిన ఒక బొమ్మను ముఖచిత్రంగా (రూ.10/-లో 11/2001న హైదరాబాద్ నుండి శ్రీరమణ, పోనుగోటి కృష్ణారెడ్డి గార్ల గౌరవ సంపాదకత్వంలో అందమైన ముద్రణతో తీసుకొచ్చారా పత్రికను, కథలు, కవితలు, వ్యాసాలు, హాస్యనాటిక అన్ని వున్న ఈ పత్రిక పేరే "పత్రిక" మన మాసపత్రిక అని వారు అన్నట్లుగానే వుంది-పత్రిక, సినిమా పత్రికలనగానే పెద్ద సైజు పత్రికలే గుర్తుకు వస్తాయి. కానీ నాటి విజయ చిత్ర సైజులో వచ్చింది "చిత్రం" సంపూర్ణ సినీపత్రిక (10/-12/7/2001-హైదరాబాద్) అన్ని ఆరంభ సంచికలకు, బాపుగారికి సంబంధం ఉంటుంది- ఈ పత్రిక టైటిల్ డిజైన్‌ను బాపు తీర్చిదిద్దారు. సినీ సీరియల్స్ ప్రత్యేకం. అలాగే ఈ సంవత్సరం ఆధ్యాత్మిక పత్రికలూ బాగా వచ్చాయి. మళ్ళీ బాపు గీసిన చిత్రం ఆంజనేయస్వామి చిత్రంతో మరో పత్రిక భక్తిరంజని- (10/-8/2001-హైదరాబాద్ -ఎడిటర్-పురాణ పండ శ్రీనివాస్) తమిళనాడుకు చెందిన 'కుముదం' వారపత్రిక వారిచే 'కుముదం భక్తి' ప్రత్యేక పత్రికది. ప్రారంభ సంచికతో కుబేర యంత్రం, కుంకుమభరిణె ఉచితంగా అందించారు. (10/-7/2001-ఎడిటర్-భాస్కరమ్, చెన్నై),ఇంకా అష్టైశ్వర్యాలు, న్యాయశాస్త్రంలో తొలి పక్షపత్రిక- ధర్మఘంట, కంప్యూటర్ విజ్ఞానంతో కంప్యూటర్ ఎరా, కంప్యూటర్ ప్రపంచం, వండర్ విజన్, వండర్ న్యూస్, రాజకీయ పత్రికలు- డార్క్ న్యూస్, దుందుభి. వీవర్స్ టుడే, కుటుంబపత్రికలు-ఉష, బంగారు చిలక, వైష్ణవి, అభిలాష, ప్రియురాలు, చిత్రాంజలి- సినీ పత్రికలతో పాటుగా మరికొన్ని వచ్చాయి.

2002లో ప్రత్యేకంగా చెప్పాలంటే చాలా వున్నాయి. సకుటుంబ పత్రికలు, ఆధ్యాత్మిక, సినీ పత్రికలు, చాలా వచ్చాయి. ప్రజాశక్తి ప్రచురణల నుండి 'ప్రస్థానం' సమగ్ర సాహిత్య త్రైమాసిక పత్రిక- (10/-10/2002, హైదరాబాద్, ఎడిటర్: తెలకపల్లి రవి), ప్రముఖ చిత్రకారులు గీసిన చిత్రాలతో, అందమైన ముద్రణలతో, కథలు, కవితలు, సాహిత్య వ్యాసాలతో, సాహిత్య అభిమానులకు అభిమాన పత్రికగా తీర్చిదిద్దారు. ఆగిపోయిన ఆంధ్రజ్యోతి దినపత్రిక మళ్లీ రంగుల్లో 15/10/2002న కె.రామచంద్రమూర్తి సంపాదకత్వంలో ఆరంభం అయింది. ఆధ్యాత్మిక పత్రికలు దైవమ్, దీవెన, జ్యోతిస్యంపై మహర్షి కాలజ్ఞానం, హస్తరేఖలు, క్రైస్తవ భక్తి పత్రిక- ప్రేమ సాక్షి, యోగాపై 'యోగా, సౌరభం,' డాక్టర్స్ డైరీ-ఆరోగ్యపత్రిక, లైఫ్, నిరుద్యోగులకు-సక్సెస్, మేనేజ్‌మెంట్,విజయస్ఫూర్తి, రాజకీయ పత్రికలు-చంద్రప్రదేశ్, ఒరాకిల్ న్యూస్ పత్రికలు వచ్చాయి. చిత్ర, శిల్ప, కార్టూన్ సమాచార మాసపత్రిక 'చిత్రకళ, చిన్నారుల కోసం "చిన్నారులు" (9/,-5/2002-చెన్నై-ఎడిటర్-1, గాయత్రి)తో పాటుగా కుటుంబ పత్రికలు స్నేహ, వాసంతి, మనోహరం (సంపాదకుడు-చలపాక ప్రకాష్, 5/- విజయవాడ), చిరుజల్లుతో పాటుగా ప్రముఖ వాణిజ్య సంస్థ అగ్రిగోల్ నుండి 'నది' సామాజిక, రాజకీయ మాసపత్రిక (6/-, 11/2002, హైదరాబాద్, ఎడిటర్: వి.ఆర్. అన్వాస్) తర్వాత రోజుల్లో చక్కటి పత్రికగా తయారైంది.

ప్రముఖ కార్టూనిస్ట్ సంపాదకత్వంలో బి.ఎన్. పబ్లికేషన్స్ నుండి అక్టోబర్‌లో ప్రారంభం అయ్యాయి. మళ్లీ ఇంకోసారి బాపుగారు ఈ రెండు పత్రికలకు టైటిల్ డిజైన్ గీసారు. 'జయం'లో కథలు, సీరియల్స్, ప్రత్యేక వ్యాసాలతో ఆంగ్లంలో కూడా 4 పేజీలు యిచ్చారు. సినీ అభిమానులకు ఈ సంవత్సరం పండుగే అన్నట్లు భారీ సినీ పత్రికలు- సినీస్టార్, స్టూడియో రౌండప్, విజయం, సంతోషం వచ్చాయి. తొలి సంచిక 100పేజీలలో 10/-, హైదరాబాద్ అన్ని రంగుల పేజీలే.

2003లో 25 పత్రికలకు పైగా విడుదలైనప్పటికి ప్రత్యేకంగా చెప్పవలసినవి చాలా తక్కువ. హిందీ, గుజరాతీ, తమిళం మొదలైన భాషలతో ప్రజాదరణ పొందిన 'గృహశోభ' (ఢిల్లీప్రెస్-15/-1/2003-ఎడిటర్-పరేష్‌నాథ్)పూర్తి రంగుల్లో, హంగులతో తయారుచేసింది. అన్ని రంగాల్లో స్త్రీలను ముందుంచాలని, తాము ఈ పత్రిక తెస్తున్నామని తెలిపారు. జెమినీ స్టూడియో వారి 'ఆనంద వికటన్' గ్రూప్ నుండి చిన్నారులకోసం 'చిట్టి వికటన్' (15/-1/-2003, చెన్నై, సంపాదకుడు శ్రీనివాస్) పిల్లల స్థాయిలో ధర ఎక్కువైనా, ఆ స్థాయిలో ముద్రణ, సమాచారం వున్నాయి. అంతేకాక ప్రతి సంచికతో పాటుగా ఒక బొమ్మ తయారు చేసుకునే కార్డుబోర్డ్ కూడా యిస్తున్నారు. మరో వినూత్న పత్రిక నాన్‌స్టాప్- (అపరాధ పరిశోధక మాసపత్రిక) (6/- 6/2003, విజయవాడ), రంగస్థల కార్యక్రమాలపై అభినయ మాసపత్రిక- (10/-2003) దీని ప్రారంభ సంచికపై నవయుగ వైతాళికుడు కందుకూరి వీరేశలింగం గారి చక్కటి చిత్రం వేశారు. విజయవాడ నుండి పి, రాముగారు ప్రారంభించిన సంపూర్ణ హాస్య మాసపత్రిక 'హాస్యానందం' (10/-4/2003), మంచి కాలక్షేపాన్నిచ్చే పత్రిక, అంతేకాక ప్రముఖ కార్టూనిస్టులు, చిత్రకారులు దీనిలో కన్పిస్తారు. 'నేటి కార్మికుడు' పేరుతో ఇన్‌టక్ (11/2003 ,హైదరాబాద్),సినిమా పత్రికలు-సుమాంజలి, కెమేరా, మూవీ మార్కెట్ విడుదలవగా, రాజకీయ పత్రికలు-ఒక్కడు, యునిక్, విజయ, ఆంధ్ర, ప్రతిబింబం, మీడియా వాచ్, కోస్తా టుడే ఆరంభం అయ్యాయి. బెజవాడ ఇంద్రకీలాద్రి కనకదుర్గ దేవస్థానం వారి అధికార మాసపత్రిక- శ్రీ కనకదుర్గ ప్రభ- (10/-4/2003, జయంతి చక్రవర్తి




రచయిత కొమ్మూరి సాంబశివరావు పూర్వం, ఎప్పుడో వ్రాసిన ప్రాక్టికల్ జోకర్ డిటెక్టివ్ నవలను నేటి ప్రముఖ రచయిత మల్లాది వెంకటకృష్ణమూర్తి నవీకరించి సీరియల్‌గా ప్రచురించారు. రాజకీయ పత్రికలు–తెలుగు తోరణం, షా వచ్చాయి (మామూలే), విజయవాడకు చెందిన కార్టూనిస్ట్ చలపాక ప్రకాష్ సంపాదకత్వంలో సాహిత్య త్రైమాసపత్రిక "రమ్యభారతి"–(6/–2/2004) కవితలు, సాహిత్య వ్యాసాలు చిన్న పత్రిక అయినా చాలా యిచ్చారు. జ్యోతిష్యం, వాస్తు, రత్న, తంత్ర, మంత్ర, యంత్ర రహస్యాల పత్రిక–మణిద్వీపమ్ (10/–5/2004, విజయవాడ), రెడ్డి జ్యోతి (విజయవాడ–5/–5ఉ2004)క్రైం రిపోర్టర్ (9/ –31/7/2004–హైదరాబాద్–నీలం రాంబాబు నాయుడు) అమ్మ–పరిపూర్ణ మహిళా మాసపత్రిక (10/–2/ 2004–విజయవాడ–కృత్తివెంటి గంగాదేవి), మానవ సంబంధాల మనోజ్ఞ మాసపత్రిక – పెళ్లి పత్రిక–10/7/2004–హైదరాబాద్–సింగం వెంకట కృష్ణ మోహన్)– దీనిలో పెళ్లి–జీవితం వంటి అంశాలతో పాటు అనుబంధంగా వివాహ ప్రకటనలు కూడా యిచ్చారు. సినీ విలేకరిగా సుదీర్ఘ అనుభవం వున్న వినాయకరావు సంపాదకత్వంలో "స్టూడియో రౌండప్" సమగ్ర సినీ వారపత్రిక (10/–5/8/2004, హైదరాబాద్), ఇంగ్లీష్ భాషపై తెలుగు, ఇంగ్లీష్, భాషా పత్రిక– ఇంగ్లీష్ మేగజైన్ –(10/–,4/2004–పి. శరత్‌కుమార్, హైదరాబాద్).

2005లో నాకు తెల్సినంతలో వచ్చిన వాటిలో సాహిత్య మాసపత్రిక–'చినుకు' (నండూరి రాజగోపాల్, 10/– 4/–2005, విజయవాడ) చక్కటి విశ్లేషణలు, కథలు, కవితలు, సమీక్షలు, మినీ కవితలతో పాటు శ్రీశ్రీ క్విజ్ ప్రత్యేక ఆకర్షణ. 'బాల' ది కిడ్ నూరుశాతం బాలల పత్రిక ధర ఎక్కువే (15/–4/2005, సికింద్రాబాద్) విసు కమ్యూనికేషన్స్ సి.సి.రెడ్డిగారు కేతు విశ్వనాథరెడ్డి సంపాదకత్వంలో మన భూమి (రాజకీయ సామాజిక పత్రిక) (10/–హైదరాబాద్, నెల్లూరు డోలేంద్ర ప్రసాద్ (జమీన్ రైతు) "తేజ" పేరుతో న్యూస్ వీక్లి తెచ్చారు. 5/–న్యూస్ వీక్లి అయినప్పటికి విభిన్న శీర్షికలతో విభిన్నంగా వుంది. మరో రాజకీయ పత్రిక ఉగ్రరూపం (10/–హైదరాబాద్, 11/2005),

సంపాదకత్వం) ఎన్నో ఆధ్యాత్మిక విషయాలను అందించారీ పత్రికలో. ప్రముఖ రచయిత మైథిలీ వెంకటేశ్వరరావు గారు తెచ్చిన భక్తి శక్తి– ముక్తిప్రదాయిని మాసపత్రిక–'అక్షరమైథిలీ, హిందూ దర్మప్రచార మాసపత్రిక 'హరిఓమ్' (10/–9/2003, విజయవాడ) తమ ప్రచురణ ప్రారంభించారు. 7భాషలలో 19 పత్రికల ద్వారా ఢిల్లీ ప్రెస్ తెలుగులో 'గృహశోభ'తో పాటుగా మరో పత్రిక 'సరససలిల' ధర చాలా తక్కువ, ఎన్నో శీర్షికలున్నాయి. అదే మాదిరిగా చెన్నై నుండి 'సురభి' పక్షపత్రిక– (5/–2/2003, నగేష్‌కుమార్) ఇంకా 'గీతిక' (ఖమ్మం,5/–,2/2003) రోజా(7/ –,1/2003 విజయవాడ), సుమధుర కుసుమాల సమాహార మాసపత్రిక– 'ఆహ్లాదం' ఇది రొటీన్ కాదు–వెరైటీ' అంటూ (10/ –12/2003, సికింద్రాబాద్) టైటిల్‌లో చెప్పినంత వెరైటీ కాకపోయినా బాగుంది. 'కాంతిపుంజం' (పెర్‌ఫెక్ట్ లైఫ్ స్టైల్ మేగజైన్) (10/–, 1/2003).

2004లో వచ్చిన వాటిలో ముఖ్యమైనది ఆంధ్రజ్యోతి దినపత్రిక వారి వారపత్రిక 'నవ్య'– (8/–21/3/ 2004–హైదరాబాద్–సంపాదకుడు–శ్రీరమణ)– ప్రముఖుల లేఖలు శీర్షికలో స్వామి వివేకానందుడు 23/6/1/–894న చికాగో నుండి మైసూరు మహారాజా వారికి వ్రాసిన లేఖను ప్రచురించారు. సీరియల్స్, మిగిలిన శీర్షికలతో పాటుగా మరో ప్రత్యేకత–డిటెక్టివ్

విజయవాడ నుండి తుర్లపాటి రాజేష్ సంపాదకత్వంలో రంగుల్లో సాయంత్రం దినపత్రిక 'రక్షణ' (24/11/2005, 2/-) ఇంకా విజయవాడ నుండే 'పాతబస్తీ' పేరుతో న్యూస్ వీక్లి వచ్చాయి.


కంప్యూటర్‌లో పత్రికల వివరాలు స్టోర్ చేస్తున్న పులిపాటి దుర్గారావు

2006లో వచ్చిన వాటిలో మంచి పత్రిక-విజయవాడ నుండి యం. నాగ కుమారి సంపాదకత్వంలో వచ్చిన తెలుగు కథల సమాహారం "కథాకేళి", అన్ని కథలతో చక్కటి పత్రికగా రూపుదిద్దారు. ప్రింటింగ్‌లో చిన్న మార్పు-తెల్లకాగితం మీద కాకుండా కొద్దిగా కలర్ పేపర్ మీద ముద్రించారు. రాంషా పబ్లికేషన్స్ నుండి అంబరీష దర్భా సంపాదకత్వంలో "ఆరుద్ర" మాసపత్రిక (10/-4/2006, హైదరాబాద్), రాజకీయ పత్రికలు-చిరంజీవి ప్రభంజనం (10/-హైదరాబాద్, అక్షర చైతన్య పబ్లికేషన్స్) ప్రజావారధి (సామాజిక, రాజకీయ, ఆరోగ్య, ఆధ్యాత్మిక, సినీ మాసపత్రి- ఇందులో వుండే శీర్షికల్ని టైటిల్‌లో పెట్టినట్లున్నారు-(10/6/2006, హైదరాబాద్-.జి. శ్రీనివాస్‌జీ), అల్ప సంఖ్యాక వర్గాల సమాచార మాసపత్రిక -సారే జహాసే అచ్చా ఇండియా- (5/- 5/6/2006, గుంటూరు), ఆధ్యాత్మిక పత్రిక ధర్మో ధర్మోరక్షతి రక్షిత:, సంపూర్ణ వ్యాయామ ఆరోగ్య మాసపత్రిక, బాడీ బిల్డింగ్, బాలల బాలకిరణం వచ్చాయి. మరో పత్రిక-కుటుంబ ఆరోగ్య సంక్షేమ మాసపత్రిక-మన ఆరోగ్యం (10/-విజయవాడ, 8/06, సంపాదకత్వం ఆయుర్వేదం వైద్యులు, రచయిత అయిన జి.వి. పూర్ణచంద్) దీనిలో ప్రముఖ వైద్యుల వ్యాసాలు, సమాచారంలో వున్నాయి.




2007లో కొన్ని వినూత్న రంగాల పత్రికలు ఆరంభం అయ్యాయి- పెళ్లి సంబంధాలు, గృహ ప్రవేశాలు, వాస్తు సుముహూర్తాల మాసపత్రిక -శుభలగ్నం (10/-9/2007-విజయవాడ-అద్దేపల్లి జగదీష్), నిరుద్యోగుల, విద్యార్థుల కోసం భవిత మాసపత్రిక- (13/-, 5/2007- విజయవాడ, దర్శి మధుసూధనరావు) భక్తి భావ మానవ పత్రిక-గురుప్రియ-(15/-9/2007-హైదరాబాద్, యల్లాప్రగడ విద్యాశంకర్) విజయవాడకు చెందిన కలిమిశ్రీ ఈ సంవత్సరం రెండు పత్రికలు తెచ్చారు. మల్లె తీగ-సకుటుంబ మాసపత్రిక (8/- 8/2007-విజయవాడ) దీనితో బోనస్‌గా ప్రముఖ కార్టూనిస్ట్ ఎ.వి.ఎమ్.గారి కార్టూన్ బుక్ యిచ్చారు. మరొకటి ఆధ్యాత్మిక మాసపత్రిక-'సహస్రార' (1/2007-8/-). చెన్నై నుండి సాయికుమార్ సంపాదకత్వంలో 'నవ్వండో నవ్వండి' హాస్యసంచిక (7/2007, 10/-), వారి నుండే బాలల కోసం చిన్నారి (8/2007, 12/-) వచ్చాయి. మన రాష్ట్ర అధికార భాషా సంఘం ఎ.బి.కె. ప్రసాద్ గారిచే పాల'నా'భాష' సమాచార నేత్రం (2(2007, హైదరాబాద్) తెలుగు ప్రాధాన్యత, అధికారభాషగా తెలుగు అమలు వంటి విషయాలు దీనిలో వున్నాయి. విజయవాడకు చెదిన సింగంపల్లి అశోక్‌కుమార్ శ్రీశ్రీ అభిమానిగా శ్రీశ్రీ శతజయంతి సందర్భంగా విడుదల చేస్తున్న



తను సేకరించిన పత్రికలతో
పులిపాటి దుర్గారావు

'నందమూరి నటరత్న (15/-, 5/2008, విజయవాడ), మహేష్‌బాబు అభిమానులకోసం ప్రిన్స్‌స్టార్ (15/-5-2008, విజయవాడ), మా నాయకుడు (15/-6/2008, హైదరాబాద్) సినీతార (15/-, ఒంగోలు), ఇంకా సినీనటి భూమిక భర్త భరత్‌ఠాకూర్ ప్రారంభించిన 'డైలీ చదవాలనిపించే వీక్లీ' అంటూ 'మాయానగర్' (11/12/2008, 10/-, హైదరాబాద్, 9/2008, టి.హెచ్.వి. ప్రసాదరావు) జయంమనదే (28/5/2008, 10/-,హైదరాబాద్, ఎన్. విష్ణు) న్యూస్- 9 (రాజకీయ, సామాజిక మెగా వార పత్రిక, అన్ని గ్లేజింగ్ కాగితాలే, 10/-15/6/2008, హైదరాబాద్, టి. కిశోర్‌బాబు). గతంలో 'విజయ' అనే మాసపత్రిక-కథలు, నవల, హాస్య పత్రిక, సినీ పత్రికలను ఒకే పత్రికలో విడివిడి పుస్తకాలుగా యిచ్చేవారు. అదే మాదిరిగా ఈ సంవత్సరం విడుదలైన స్వప్న మాసపత్రిక (30/-, 8/2008, చెన్నై, స్టెర్లింగ్ పబ్లిషర్స్) విడివిడిగా సినిమా, సంస్కృతి, నవలలను అందిస్తూ ప్రారంభ కానుకగా గుడ్‌విల్ వారి అగరువత్తులు యిచ్చింది. ఇంకా సాంస్కృతిక మాసపత్రిక-కళాజ్యోతి (6/2008, హైదరాబాద్, ఆర్. రవివర్మ), ఇస్లామిక్ వాయిస్ (5/-,1/10/2008, హైదరాబాద్, అసిఫుద్దీన్), అధునాతన గృహాలంకారంపై 'గృహకల్ప (15/-, 15/12/2008, విజయవాడ, కటకం శ్రీనివాసరావు) శాంతి లేఖాస్త్రం(10/-, విశాఖపట్నం, 10/2008, యాదు శ్రీనివాసరావు) ఈ సంవత్సరం వచ్చాయి. మరో ప్రత్యేక పత్రిక-కవిత (విజయవాడ, సాహితిమిత్రులు, 12/2008, శ్రీశ్రీ విశ్వేశ్వరరావు) ప్రతినెలా ఒక గౌరవ సంపాదకులు-ఈ నెల 'మో', సమకాలీన కవితల కాల నాళిక అంటూ ఈ పత్రిక గురించి ఒక్కమాటలో చెప్పారు. పూర్తి నలుపు తెలుపు ముద్రణ, సావిత్రి ముఖచిత్రం ముచ్చట గొల్పుతున్నాయి.

2009లో చాలా చాలా తక్కువ పత్రికలు వచ్చాయి. సకుటుంబ సచిత్ర మాసపత్రిక "చిత్ర"- (విజయవాడ-15/-, 5/2009, ఎ.హెచ్.యస్.వి. ప్రసాద్) ఈ పత్రికలో మధురస్మృతుల పేరుతో వచ్చిన శీర్షికలో సావిత్రి గురించి వచ్చిన వ్యాసం

బులెటినల్- శ్రీశ్రీ- దీనిలో శ్రీశ్రీ సంగతులు, క్విజ్, సాహిత్యం వగైరాలున్నాయి. రాజకీయ పత్రికల్లో పార్లమెంట్ సభ్యుడు ఉండవల్లి అరుణ్ కుమార్ ఆధ్వర్యంలో 'ఈవారం' (8/2007, 5,హైదరాబాద్) రూపుమారిన ఈ భూమితో పాటుగా 'సూర్య' దినపత్రిక-నూకారపు సూర్యప్రకాశరావు, (3/- 22/10/07) సాక్ష్యం, అంజనీపుత్రుడు సినీపత్రిక, బ్లాక్ అండ్ వైట్ దినపత్రిక మరో ప్రముఖ సంస్థ నుండి 'ద సండే ఇండియన్' దేశీయ అతిగొప్ప సమాచార వారపత్రిక (10/- 18/6/2007, ఆరిందమ్‌చౌదరి) తొలి సంచికలో 100 మంది అత్యంత వివాదస్పద భారతీయుల గురించి వ్యాసం యిచ్చారు. తక్కువ ధరలో మంచి ఖరీదైన ముద్రణ, కాగితం అందించారు అలాగే సమాచారం కూడా.

2008లో చాలా పత్రికలు వచ్చాయి. వాటిలో ముఖ్యమైనది 'సాక్షి' దినపత్రిక -పత్రికారంగంలో, రాజకీయ రంగంలో తీవ్రసంచలనం రేపుతూ వచ్చిన పత్రిక సాక్షి- అన్ని పేజీలు రంగులతో వచ్చిన తొలి దినపత్రిక ఇదే. ముఖ్యంగా 'ఫ్యామిలీ' అనుబంధంలో మహిళ, పిల్లలు, సినిమాలు, ఆరోగ్యం, వాణిజ్యం, ఆధ్యాత్మికం ఇలా ఎన్నో విషయాలతో ప్రత్యేకత నిలుపుకుంది. కానీ ఈ పత్రిక వ్యక్తిగత పత్రిక అన్పిస్తుంది. సినీ పత్రికలు ఈ సంవత్సరం చాలా వచ్చాయి. సినీ వినోదం (5/2008, విజయవాడ. ఎ. శ్రీనివాసరావు) నందూరి అభిమానుల కోసం

ఇంకా గంగశ్రీ (10/-, 12/2/2010, హైదరాబాద్, కాకర్ల పురుషోత్తం నాయుడు), చల్లపల్లి సన్‌ఫ్లవర్ విద్యా సంస్థల నుండి పున్నంరాజు సంపాదకత్వంలో "సన్‌ఫ్లవర్" వారపత్రిక వెలువడగా ఈ సంవత్సరం వచ్చిన మరో మంచి పత్రిక "సురభి" సమాహారం-టైమ్స్ సంస్థ నుండి వచ్చిన ఈ పత్రికను సంపాదకుడు గొల్లపూడి మారుతీరావు (వారి గురించి పరిచయం అక్కరలేదు). తెలుగువారు పత్రికారంగంలో చేరుకున్న స్థానాల గురించి ఆయన సంపాదకీయంలో చక్కగా వివరించారు. చక్కటి శీర్షికలు, ప్రముఖుల రచనలు వున్నాయి. దీనిలో శ్రీశ్రీ కుమారుడు శ్రీరంగం వెంకరమణగారి వ్యాసం, నా తొలి చిత్రం కె.విశ్వనాథ్ గారి వ్యాసం, సినిమాలపై రావి కొండలరావు గారు ఇలా ప్రముఖుల రచనలతో ఆకట్టుకునే ఈ పత్రిక ముఖచిత్రం రంగుల్లో, పుస్తకం పూర్తి రంగుల్లో (10/-,6/2010-హైదరాబాద్) నవ నవ్యతకు దర్పణం అని వారన్నట్లుగానే వుందీ పత్రిక. 2011లో "హోమియోటుడే" హోమియో వైద్యంపై మాస పత్రిక, ( 4/-2011, 12/-హైదరాబాద్), అభినయ మాసపత్రిక- ఆశ (11/-2/2011, హైదరాబాద్, కె. వేణుగోపాల్), వెలువడగా, తెలుగులో మొట్టమొదటి హారర్ పత్రిక-'అమావాస్య' భయానక మాసపత్రిక (10/-4/-4/2011, హైదరాబాద్) ఎమ్. లక్ష్మణరావు సంపాదకత్వం చిన్న పిల్లలు చూస్తేనే దడుచుకొనే విధంగా వున్న ఈ పత్రిక ఈ తరహా కథలంటే యిష్టం వున్నవారికి మంచి కాలక్షేపం.

బాగుంది. పిల్లల పత్రిక "చంద్రబాల" (20/-,8/2009, హైదరాబాద్) శక్తిదాస్ పేరుతో బాగా ప్రాచుర్యం పొందిన చిత్రకారుడు సంపాదకునిగా ప్రారంభమైన ఈ పత్రిక తొలి సంచికలో వడ్డాది పాపయ్యగారిని తల్చుకోవటం అభినందనీయం, ముద్రణ కూడా బాగుంది. విశాఖపట్నం నుండి పూర్తి హాస్యపత్రిక. "స్మైల్‌ప్లీజ్ నవ్వండి" (1/2009-10/- కూడా ఈ సంవత్సరం వచ్చింది.

2010లో చాలా పత్రికలు వచ్చాయి. ముఖ్యంగా ఆయుర్వేదం పట్ల ప్రజలలో పెరుగుతున్న ఆదరణ కారణంగా ఆ పత్రికలు రెండు వచ్చాయి. గత సంవత్సరం వచ్చిన 'చంద్రబాల' పత్రిక వారికే "ఆయుర్వేదంసంజీవిని' (12/-, 7/2010) అరచేతిలో ఆయుర్వేదం (12/2010, 10/-, విజయవాడ) వెలువడగా, రాజకీయ పత్రికలు రత్నప్రభ, సత్య, అస్త్రం (15/12/2010, 15/-, హైదరాబాద్) సినీపత్రిక-వెండితెర సంగతులు (15/-విజయవాడ), ఇంకా పత్రికా రంగంలో అనుభవజ్ఞులైన గుడిపాటి వెంకటేశ్వర్లు 'పాలపిట్ట' (30/-2/2010, హైదరాబాద్) పత్రికను తీసుకొచ్చారు. బాగున్న ఈ పత్రికలో సాహిత్య వ్యాసాలు, కథలు, అనువాద కథలు, కవితలు, బాల సాహిత్యం, సమీక్షలు, ఇంటర్వ్యూ, సినీ, చిత్రకళలు వున్నాయి. ముద్రణ బాగుంది. "తెలంగాణా పత్రికలు-సాహిత్యసృజన" వ్యాసంలో చాలా పాత పత్రికల ముఖ చిత్రాల ఫొటోలు ప్రచురించారు. ఈ సంవత్సరం

1980 నుండి తెలుగులో నేను చూసిన ప్రతి తొలి సంచికను దాదాపుగా కొన్నాను. ఇంకా చాలా వచ్చి వుంటాయి. అయితే ఈ పత్రికలను చూస్తుంటే మన సాంకేతిక అభివృద్ధి కారణంగా ఈ పత్రికా రంగంలో కూడా చాలా మార్పులు వచ్చాయని తెలుస్తుంది. ముద్రణలో మార్పులు-నలుపుతుపు నుండి రంగులు, ధర కూడా అలాగే మారింది. ఇలా ఎన్నో మార్పులను గమనించటానికి నా ఈ అభిరుచి దోహదపడింది. నన్ను జాతీయ రికార్డుస్థాయికి ఎదిగేలా చేసింది.

*email: pulipati_akshara@yahoo.co.in*

# అభ్యుదయ సూత్రాలు గూడవల్లి రామబ్రహ్మం చిత్రాలు




సుంకర చలపతిరావు

**సినిమా శక్తివంతమైన మీడియా అని ఆనాడే గుర్తించి ఒక మాలపిల్ల-బ్రాహ్మణ యువకుణ్ణి వివాహం చేసుకోవడం అనే సంస్కృతికి నాంది పలికి, సామాజిక సమానత్వం ప్రబోధించే సినిమాగా 'మాలపిల్ల'ను రూపొందించిన దర్శకుడు గూడవల్లి రామబ్రహ్మం. సెప్టెంబరు 25 కు 'మాలపిల్ల' సినిమా విడుదలయి 74 యేళ్ళు పూర్తయిన సందర్భంగా ప్రత్యేకవ్యాసం...**

1931లో మద్రాసు వచ్చి సమదర్శిని పత్రికలో సహాయ సంపాదకుడిగా, సంపాదకుడిగా చేశారు. ఆ సమయంలోనే వేల్ పిక్చర్స్ నిర్మించిన సీతా కళ్యాణం, కృష్ణ లీలలు, శశిరేఖా పరిణయం మొదలైన చిత్రాలకు పబ్లిసిటీలో సలహాలు ఇవ్వడంతో గూడవల్లికి సినిమా రంగంతో సాన్నిహిత్యం ఏర్పడింది. సినిమా సాన్నిహిత్యం ఏర్పడింది.

జాతిని మేల్కొలిపే చిత్రాలు తీయాలనే కాంక్ష అప్పుడే ఆయనకు కలిగింది. అందుకే ఆంధ్ర స్టూడియోస్ ఫిల్మ్ కంపెనీ సంస్థను ఏర్పాటు చేశారు. అయితే సరస్వతీ టాకీస్ వారి అభ్యర్థన మేరకు గూడవల్లి రామబ్రహ్మానికి ఆ సంస్థ నిర్వహణ బాధ్యతను స్వీకరించాల్సి వచ్చింది. సరస్వతీ టాకీస్ వారు కొల్హాపూర్‌లో నిర్మించిన ద్రౌపదీ వస్త్రాపహరణము చిత్రానికి ప్రొడక్షన్ కంట్రోలర్‌గా వ్యవహరించారు. తర్వాత కనకతార చిత్రానికి పనిచేశారు.




1937 డిసెంబరులో తన మిత్ర బృందంతో కలిసి సారధి ఫిలింస్ ప్రైవేట్ లిమిటెడ్‌లో ఏర్పాటు చేసి సొంతంగా చిత్ర నిర్మాణానికి పూనుకున్నారు. ఈ సంస్థకు చైర్మన్ చల్లపల్లి రాజా యార్లగడ్డ శివరామ కృష్ణప్రసాద్, మేనేజింగ్ డైరెక్టర్ గూడవల్లి రామబ్రహ్మం కాగా, తుమ్మల సీతారామ బ్రహ్మం, లింగం, సత్యనారాయణ తదితరులు ఇతర డైరెక్టర్లు, మద్రాసులోని రాయపేటలో ప్రజామిత్ర కార్యాలయానికి దగ్గరగా ఒక భవంతిని తీసుకుని (ప్రస్తుతం అన్నా డి.ఎం.కె. పార్టీ కార్యాలయం ఉన్నచోటు) సారథి ఆఫీసు ఏర్పాటు చేశారు. చాలా కథలు పరిశీలించారు. ప్రతీది ఒకరికి నచ్చితే మరొకరికి నచ్చేది కాదు. చివరకు గుడిపాటి వెంకటాచలం రాసిన అముద్రిత నవల మాలపిల్ల ఆధారంగా సినిమా చేయాలని ఏకగ్రీవంగా నిశ్చయించారు. పాత్రికేయ వృత్తిలో తనకు గురువైన తాపీ ధర్మారావు నాయుడితో స్క్రిప్టుకు బాగా మెరుగులు దిద్దించారు. నవలలో చలం రాసిన కొన్ని సంభాషణలను యథాతథంగా వాడుకున్నారు. సంగీత దర్శకునిగా భీమవరపు నరసింహారావును తీసుకున్నారు. 17 పాటలు, 5 పద్యాలు సిద్ధంచేశారు. అప్పటికే ప్రాచుర్యం పొందిన బసవరాజు అప్పారావు విరచిత కొల్లాయి గట్టితేనేమి..., నల్లవాడే గొల్లపిల్లవాడే..., ఆ మబ్బు ఈ మబ్బు... గీతాలు తీసుకున్నారు. జయదేవుని అష్టపది సావిరహే

తవదీనా...ను కూడా ఉపయోగించుకున్నారు. మిగతా పాటలను, పద్యాలను తాపీ ధర్మారావు రాశారు. అప్పట్లో ఏ సినిమాకైనా పాటలూ, మాటలూ, పద్యాలూ అన్నింటికీ ఒక్కరే రచయిత. మాలపిల్లతోనే ఇద్దరు, ముగ్గురు రచయితలు పనిచేయడం ఆరంభమైందని చెబుతారు.

అప్పట్లో సినిమా పాటలు స్టేజి నాటకాల ధోరణిలోనే ఉండేవి. భీమవరపు నరసింహారావు లలిత సంగీత ఫక్కీలో బాణీలు చేశారు. అలాగే అంతవరకూ రాగమయంగానూ, లలిత సంగీతంతోనూ, శాస్త్రీయ సంగీతంతోనూ ఉండే సినిమా పాటల్లో జానపదరీతుల్ని ప్రవేశపెట్టి తెలుగు సినిమా సంగీతాన్ని ఓ మలుపు తిప్పారాయన.

భీమవరపు నరసింహారావు ఈ చిత్రానికి సంగీత దర్శకుని బాధ్యతలతో పాటు ప్రొడక్షన్ వ్యవహారాలు కూడా చూశారు. కథలో కీలకమైన సుందరరామశాస్త్రి పాత్రకు తెనాలిలో డాక్టరుగా ప్రాక్టీసు చేస్తూ రంగస్థలం మీద పేర్గాంచిన డాక్టర్ గోవింద రాజుల సుబ్బారావును ఎంపిక చేశారు. మీసాలు తీసేసి గుండు చేయించుకోమన్నారని ఆ పాత్ర వేయడానికి ఒప్పుకోలేదాయన. రామబ్రహ్మం, మరికొంతమంది పెద్దలు ఈ పాత్ర గురించి చెప్పి బలవంతంగా ఒప్పిస్తే తన తల్లి దగ్గర అనుమతి తీసుకుని, కేశఖండనానికి ఒప్పుకున్నారు. ప్రముఖ సంగీత దర్శకుడు గాలి పెంచల నరసింహారావు తమ్ముడైన వెంకటేశ్వరరావును నాగరాజు పాత్రకు తీసుకున్నారు. నాయిక శంపాలతగా కాంచనమాలను తీసుకున్నారు. అంతకు ముందు ఆమె శ్రీకృష్ణ తులాభారం (1935), వీరాభిమన్యు (1936), విప్రనారాయణ (1937) గృహలక్ష్మి (1938) చిత్రాలు చేశారు. గ్లామర్ పాత్రలు వేస్తున్న కాంచనమాలను మాలపిల్లగా ప్రేక్షకులు అంగీకరిస్తారో లేదోనన్న సందేహంతో ఒక దశలో పుష్పవల్లి పేరుని పరిశీలించారు. చివరకు కాంచనమాలతో పాత్ర చేయించారు.

వేల్ పిక్చర్స్, సరస్వతీ టాకీస్ వారికి రామబ్రహ్మ ప్రొడక్షన్ వ్యవహారాలు చూసే రోజుల్లో ఒకసారి వేషం కోసం కాంచనమాల ఆయన దగ్గరకు వెలితే తీసుకోలేదు. ఆ విషయమే మాలపిల్ల మొదటి రోజు షూటింగ్‌లో గుర్తుచేస్తే "ఏదో పొరపాటుని అని అంటానులే. అప్పుడేమో చిన్నదానివి. ఇప్పుడు అందంగా తయారవయ్యావుకదా"

అంటూ నవ్వేశారు. అనేక చిత్రాల్లో నటించిన పువ్వుల సూరిబాబును చౌదరి పాత్రకు ఎంపిక చేశారు. కళాకారులందరికీ



గూడవల్లి రామబ్రహ్మం

సారథి ఆఫీసులోనే బస ఏర్పాటు చేశారు. 1938 మే 1న మద్రాసులోని మోషన్ పిక్చర్స్ ప్రొడ్యూసర్స్ కంబైన్స్ స్టూడియోలో 'మాలపిల్ల' షూటింగ్ మొదలైంది. జూన్ 15 నాటికి చిత్రీకరణ పూర్తయింది. 40 కాల్షీట్లతో చిత్రనిర్మాణం పూర్తయింది. జూలైలో బొంబాయిలో రీ-రికార్డింగ్ చేశారు. ఆగస్టులో ఫస్ట్ కాపీ వచ్చింది. అప్పట్లో చిత్రనిర్మాణానికి లక్షరూపాయలు ఖర్చయ్యేది. కానీ రామబ్రహ్మం క్వాలిటీ విషయంలో ఏమాత్రం రాజీపడలేక పోవడంతో ఓ పదివేలు అదనంగా ఖర్చయింది.

సినిమా విడుదలకు చాలా ముందుగానే సెప్టెంబరు 15న మద్రాసులోని మినర్వా థియేటర్‌లో 'ప్రెస్ షో' వేశారు. రామబ్రహ్మం ధైర్యానికి అందరూ విస్తుపోయారు. ఈ చిత్రాన్ని దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుకు అంకితమిచ్చారు. పంతులుగారంటే రామబ్రహ్మానికి ఎనలేని గౌరవం, అందుకే ఆయన మరణించాక అంతిమ యాత్రను 'కడపటి యాత్ర' పేరుతో చిత్రీకరించారు, 'మాలపిల్ల' చిత్రంతో కలిపి విడుదల చేశారు. మాలపిల్ల చిత్రం ఒకేసారి 12 కేంద్రాలలో విజయదశమి కానుకగా 25 సెప్టెంబరు 1938న విడుదలైంది. ఇన్ని కేంద్రాలలో ఒక సినిమా విడుదల కావడం కూడా అప్పట్లో రికార్డ్.

మాలపిల్ల ఒక్క తెలుగు జిల్లాలోనే గాక, దక్షిణాదినున్న అన్ని భాషా ప్రాంతాల్లోనూ ఘనవిజయం సాధించింది. అలాగే ఇతర నిర్మాతల దృష్టిని సాంఘిక చిత్రాలవైపు మళ్లించింది. తెలుగులో తొలి సాంఘిక చిత్రమైన ప్రేమ విజయం, తరువాత వచ్చిన సాంఘికం ఇది. ఇందులో అంటరానితనం, హరిజనులకి దేవాలయ ప్రవేశం లేకపోవడం మీద కథ అల్లినా, ఇంకోవైపు గాంధేయ సిద్ధాంతాల్నీ, జాతీయవాదాన్నీ స్పృశించారు. 1931లో


శ్రీ గూడవల్లి రామబ్రహ్మం, శ్రీమతి శారదమ్మ

భక్తప్రహ్లాదతో ప్రారంభమైన తెలుగు సినిమా రంగంలో మాలపిల్ల 50వ చిత్రం కావడం గమనార్హం. ఈ చిత్రాన్ని నిషేధించాలని చాలా మంది సనాతనులు విపరీతంగా ప్రయత్నించినా, జాతీయ వాదులు కూడదని పట్టుపట్టారు. బెజవాడలోని సనాతన వాదులంతా మాలపిల్ల చిత్రాన్ని చూడకూడదని సభ ఏర్పాటు చేసి తీర్మానం చేశారు. ఇది తెలిసి "శ్రోత్రీయ బ్రాహ్మణులందరికీ మాలపిల్ల సినిమా చూడటానికి ఉచిత పాసులు ఇవ్వబడును" అని కరపత్రాలు వేయించి పంచారు రామబ్రహ్మం. కొందరు ఛాందసబ్రాహ్మణులైతే సినిమా చూసిన తర్వాత ఇళ్లకు వెళ్లి ప్రాయశ్చిత్తంగా స్నానాలు చేసేవారని ప్రచారం జరిగింది.

భారతదేశంలో ప్రప్రథమంగా హరిజనులకు తమ సంస్థానంలో ఉన్న దేవాలయ ద్వారాలను తెరచిన తిరువాన్కూరు మహారాజాను రామబ్రహ్మం ఈ చిత్రంలో అభినందించారు.

మాలపిల్ల చిత్రకథలో భూసంస్కరణ, సామాజిక సమానత్వం, భూస్వామ్య వ్యవస్థ మీద తిరుగుబాటు మాత్రమే గాక, అంటరానితనం నిర్మూలన గురించి కూడా వివరంగా ఉంది. ఆనాటి ప్రేక్షకులు ఈ చిత్రాన్ని హృదయపూర్వకంగా ఆహ్వానించి, నూతన శకానికి నాంది పలికారు. అస్పృశ్యత మీదా, సనాతన ఛాందసాల మీదా, వర్ణ విభేదాల మీదా మాలపిల్లలో విరుచుకు పడ్డారాయన. మాలలు మాత్రము మనుషులు కాదా? అంటూ ప్రబోధించి, హరిజనోద్ధరణ, హరిజనులకు దేవాలయ ప్రవేశాలు సాగించాలని ఉద్బోధించారు.

అప్పటిదాకా గ్రాంథిక భాషలో సాగిన సినిమా రచన మాలపిల్లతో వ్యావహారిక భాషతో కొనసాగి కొత్త మలుపునకు దారి తీసింది.

అప్పటి తెలుగు సినిమాల్లో బ్రాహ్మణ పాత్రలు రుషిపుంగవులుగానో, విధూషకులుగానో ఉండేవి. కానీ ఇందులో 'సుందరరామశాస్త్రి' పాత్ర సనాతనవాదిగా, సాంఘిక పురోగమనానికి అడ్డంకిగా నిలబడే ఛాందసుడిలాగా వుంటుంది. ఈ పాత్రలో నూటికి నూరు మార్కులు సంపాదించుకున్నారు గోవిందరాజుల సుబ్బారావు.

అలాగే మాలపిల్లగా కాంచనమాల సహజమైన అభినయాన్ని కనబరచారు. తెలుగు తెరపై తొలి గ్లామర్ తారగా కాంచనమాలనే చెప్పుకోవాలి. ఇందులో ఆమె మొదట పల్లెటూరి పిల్లలా ఉన్నా, తర్వాత ఒక బ్రాహ్మణ యువకుణ్ణి వివాహం చేసుకుని కలకత్తా పారిపోయి మోడరన్‌గా తయారౌతుంది. స్లీవ్‌లెస్ జాకెట్టు, భుజం మీద వాలుజడ, చెవులకి రింగులు, పెద్ద కళ్ళతో, నవ్వుతున్న పెదవులతో మనోహరంగా కనిపిస్తుంది కాంచనమాల. మాలపిల్ల విడుదల తర్వాత ఈ స్టిల్‌తో రాష్ట్రమంతా అనేకమంది ఇళ్లల్లో క్యాలెండర్‌లు వెలిశాయి. మాలపిల్లతో కాంచనమాల అందరి అభిమాన కథానాయిక అయిపోయారు. బాల్యంలో తెనాలిలో సంగీతం నేర్చుకున్న అనుభవంతో ఈ చిత్రంలో ఆమె కొన్ని పాటలు కూడా పాడుకున్నారు.

మాలపిల్ల, రైతుబిడ్డ తర్వాత గూడవల్లి రామబ్రహ్మం అపవాదు, ఇల్లాలు, పత్ని, పంతులమ్మ, మాయాలోకం మొదలైన చిత్రాలు రూపొందించారు. తన 44వ ఏట తానెంతో ఇష్టపడ్డ పల్నాటి యుద్ధం చిత్రం పూర్తి చేయకుండానే కేన్సర్ వ్యాధికి గురై కన్నుమూశారు.

గూడవల్లి రామబ్రహ్మం చనిపోయాక జైహింద్ (స్టిల్స్) సత్యం మద్రాసులో సంస్మరణ దినం జరిపి, మాలపిల్ల ప్రదర్శించారు. ఈ సందర్భంలో హీరో వెంకటేశ్వరరావు, హీరోయిన్ కాంచనమాలను సత్కరించారు.

విషాదకరమైన విషయమేమిటంటే-అప్పటికి కాంచనమాల మతి చలించిన దుస్థితిలో ఉన్నారు. ముద్దులొలికే రూపంతో మాలపిల్ల చిత్రంలో కనిపించిన కాంచనమాల-నిస్తేజంగా ఆ సన్మానాన్ని అందుకోవడం విధి ఆడిన నాటకం!

దాదాపు ఏడు దశాబ్దాల క్రితం గూడవల్లి రామబ్రహ్మంలో కనిపించిన సామాజిక చైతన్యం ప్రస్తుతకాలంలోని దర్శక నిర్మాతల్లో ఎవరికైనా ఉందా?

నిత్య నాటక కళారాధకుడు

# డా॥ పి. బాలకోటయ్య

- వాడ్రేవు సుందర్రావు

నంది, గరుడ అవార్డుల గ్రహీత

*ఆయన శ్వాస నాటకం - ఆయన ధ్యాస నాటకం*

*ఆయన లక్ష్యం నాటకం - ఆయన లక్షణం నాటకం*

*ఆయన తపన నాటకం - ఆయన తపస్సు నాటకం*

*ఆయన గమనం నాటకం - ఆయన గమ్యం నాటకం*

*ఆయన జ్ఞానం నాటకం - ఆయన విజ్ఞానం నాటకం*

*ఆయన మేధస్సు నాటకం - తుదకు ఆయన ప్రాణమే నాటకం.*



నాటకాన్ని ప్రేమిస్తూ, నాటకం కోసం తపిస్తూ, నాటకం కోసం జీవిస్తూ, ఆ ప్రయాణంలో తన బ్రతుకుబాటను పండించుకొంటూ, అందరి అభిమానాన్ని చూరగొంటూ, అరవై సంవత్సరాల నిరంతర కళాసేవలో ధన్యత పొంది, డెబ్బై ఐదు వసంతాలు నింపుకొన్న నవ యువకుడు, నిత్య మందస్మిత వదనారవిందుడు డా॥ పి. బాలకోటయ్య.

ఎందరెందరో మహానుభావుల్ని జాతికి అందించిన గొప్ప ప్రాంతం నెల్లూరు సీమ. అటువంటి నెల్లూరు జిల్లా కోవూరులో 1937వ సంవత్సరం జులై 1వ తేదిన బాలకోటయ్య జన్మించారు. కీర్తిశేషులు పడాల వెంకటసుబ్బయ్య, శ్రీమతి ఆదిలక్ష్మి దంపతుల నోముల పంటగా జన్మించిన బాలకోటయ్య బాల్యం అంతా కోవూరులోనే గడిచింది. ఆ దంపతుల ఏకైక సంతానం ఆయన. దురదృష్టవశాత్తు మూడవ ఏటనే వారి తల్లి మరణించారు. తల్లి లేని ఆ బాలుడ్ని నాయనమ్మ ప్రేమతో పెంచి పెద్ద చేసింది. దెబ్బమీద దెబ్బ తగిలినట్లు వారి తండ్రి కూడా చిన్న నాటే పరమపదించారు.

తెలుగు నాటక రంగంలో సుప్రసిద్ధులైన అందరివలే బాలకోటయ్య నటప్రస్థానానికి ఆరంభం కూడా స్వగ్రామంలోనే జరిగింది. ఆ చిన్న గ్రామంలో జరిగే ఉత్సవాలలో గ్రామంలోని యువకులు అందరూ నాటకాలు వేస్తుంటే బాలకోటయ్య ఎంతో ఇష్టంగా చూస్తుండేవాడు. పడాల మల్లిఖార్జునరావు ఆ గ్రామంలో నాటకాలకు దర్శకుడు. నాటకం మీద ఇష్టం ఉన్న అందర్నీ కూడాగట్టుకొని, పౌరాణిక నాటకాలు ఆయన వేయించేవారు. ఒక రోజు 'సతీసావిత్రి' నాటకం వేస్తున్నారు. సావిత్రికి ఒక చెలికత్తె కావలసి వచ్చింది. ఎలా... ఎలా... అని ఆలోచిస్తున్నప్పుడు మల్లిఖార్జునరావు దృష్టి బాలకోటయ్యపై పడింది. బాలకోటయ్యకి ఆయన బంధువు. చెలికత్తె వేషంలో బాలకోటయ్య రంగస్థలంపై అడుగుపెట్టి, ఎంతో అందంగా కన్పించారు. బాలకోటయ్య ముఖంలో ఓ చిత్రమైన లాలిత్యం ఉంది. అందువల్ల స్త్రీ వేషంలో అందర్నీ ఇట్టే ఆకర్షించారు. దానితో ప్రత్యేకంగా బాలకోటయ్యనే కథానాయికచేసి, 'సుశీల' నాటకాన్ని రూపొందించారు మల్లిఖార్జునరావు. ఆరోజు బాలకోటయ్య జీవితంలో చిరస్మరణీయమైన రోజు. సుశీల పాత్రలో గొప్పగా రాణించి, తెలుగు నాటకరంగంపై బాలకోటయ్య తన కళాయాత్రను విజయవంతంగా ప్రారంభించిన అదృష్టపురోజు. ఆరోజే 20-5-1952. బాలకోటయ్య ఆకారం, అందమైన ముఖం, ఆముఖంలో అనవరతం కన్పించే చిరుమందహాసం... వెరశి సుశీల పాత్రలో అద్భుతమైన విజయం లభించింది. ఆ తరువాత ఇదా ప్రపంచం నాటకంలో రామి పాత్రలో కన్పించి, ప్రేక్షకుల్ని మంత్ర ముగ్ధుల్ని చేశారు. బాలకోటయ్య నట జీవితంలో చెప్పుకోదగ్గ సంఘటనలు అనేకం ఉన్నాయి. తిరిగి వాటిలో... బాగా బాగా... గుర్తుపెట్టుకోదగినది



ఒకటుంది. సుప్రసిద్ధ రచయిత గుడిపాటి వేంకటాచలంగారు వ్రాసిన 'త్యాగం' నాటకం ప్రదర్శన జరుగుతోంది. అందులో బాలకోటయ్య చేసిన పాత్ర 'వనకుమారి' అనే వేశ్యపాత్ర. నటనని ప్రాణంగా భావించే బాలకోటయ్య ఆ వేశ్య పాత్రను ఎంతో గొప్పగా, మరెంతో సమర్థవంతంగా ప్రదర్శించారు. రంగస్థలం మీద ఆయనని చూసి చాలా... చాలా... ఆశ్చర్యపోయారందరూ. కొందరైతే అచ్చం ఆమే అనుకొని కొంటె చూపులు చూశారుట కూడా! నిజానికి ఇదంతా బాలకోటయ్య ప్రతిభకు పట్టాభిషేకమే. కానీ ఇంటి దగ్గర మాత్రం, వేరే విధంగా అనుకొని, అటువంటి పాత్ర చేసినందుకు బాలకోటయ్యను గట్టిగా మందలించారట. ఓ రెండు దెబ్బలు కూడా పడ్డాయట. మరోసారి ఆ పాత్రలో కన్పించకూడదని గట్టిగా హెచ్చరించారుట. ఫలితంగా ఆ నాటకం ఒక్క ప్రదర్శనతోనే ఆగిపోయింది.

ఆ తరువాత వైకుంఠభవనంలో సుజాత, వర విక్రయంలో కమల, కళకోసంలో రాధ, ఛస్తేనేంలో సరస్వతి, ఆనాడులో రాణీ సంయుక్త, నాలుగు రైళ్ళులో విద్యాధరి, రామాంజనేయ యుద్ధంలో శాంతిమతి ఇలా ఎన్నో... ఎన్నెన్నో స్త్రీ పాత్రల్లో ఎంతో రాణించారు బాలకోటయ్య. ఇలా రెండేళ్ళపాటు వరుసగా స్త్రీ పాత్రలు పోషించిన బాలకోటయ్య, తొలిసారిగా పురుష పాత్రను పోషించవలసి వచ్చినపుడు, నిజంగా అది అతనికి కత్తిమీద సామే అయ్యింది. స్త్రీ పాత్రల్ని పోషించడంలో ఆయన నడకలో కన్పించిన పద్ధతి, మాటల్లో విన్పించిన మార్దవం, ఆయన గొంతులో పలికిన సౌకుమార్యం, పురుషపాత్రల్లోకి మార్చవలసి రావడం నిజంగా చాలా కష్టమయ్యింది. 1954 అక్టోబరు 16న నెల్లూరు టౌను హాలులో ప్రదర్శించిన 'ఆనాడు' నాటకంలో 'వరదాయి' పురుష పాత్రను పోషించడానికి చాలా శ్రమపడాల్సి వచ్చింది. ఆనాటి నాటక దర్శకుడు జానకిరాం ఎంతో కృషిచేసి, ఎంతగానో శ్రమించి, పురుష పాత్రలో బాలకోటయ్యని తీర్చిదిద్దారు. అందరూ నిద్రపోతున్నప్పుడు, అర్ధరాత్రివేళ బాలకోటయ్యను పొలాల్లోకి తీసుకువెళ్ళి, వరదాయి పాత్రలో సంభాషణల్ని గట్టి గట్టిగా పలికించేవారుట. తన దర్శకుడి సూచనల్ని అడుగడుగునా పాటించిన బాలకోటయ్య ఆ పాత్రలో గొప్ప విజయాన్ని సాధించారు. అంతేకాక ఆనాడు ఏదైతే నేర్చుకొన్నారో భవిష్యత్తులో అదే ఆయనకు ఎంతగానో ఉపకరించి, బాలకోటయ్యని చక్కని నటుడిగా తీర్చిదిద్దింది.

ఆ తరువాత ఎన్నో పాత్రల్లో బాలకోటయ్య ప్రతిభ పదిమందికీ తెలియవచ్చింది. మూగజీవులు నాటకంలో చక్రవర్తిగా, విజయపురి వికాసంలో ఆచార్య నాగార్జునుడిగా, రాగరాగిణిలో రఘుపాత్రలో, చిల్లరకొట్టు చిట్టెమ్మలో పువ్వుల పున్నయ్యగా, పునర్జన్మలో డాక్టర్‌గా, పల్లెపడుచులో చంద్రం, గోపి, కామేశం, కీర్తిశేషులులో వాణీనాథం, మురారి, ఇదేమిటిలో రామారావు... ఇలా ఎన్నో పాత్రల్లో ఎంతో రాణించారు బాలకోటయ్య.

బాలకోటయ్య నట జీవితంలో ప్రముఖులుగా చెప్పుకోదగ్గ వ్యక్తుల్లో తొలి స్థానం ఆయన బంధువు మల్లిఖార్జునరావుదైతే, ఆ తరువాత స్థానం ఆయన్ని పురుష పాత్రల్లో తీర్చిదిద్దిన జానకీరామ్‌దేననడంలో అతిశయోక్తి లేదు. బాలకోటయ్య ఉద్యోగరీత్యా నాగార్జునసాగర్ వెళ్ళినపుడు ప్రముఖ నాటక దర్శకుడు పేలూరి దాసుతో స్నేహం ఏర్పడటం, ఆ స్నేహంతో ఎన్నో పాత్రల్లో బాలకోటయ్యని మరింత తీర్చిదిద్దడం జరిగింది. బాలకోటయ్యకి సహ దర్శకుడిగా రాణిస్తూ, బాలకోటయ్యలో పోటీతత్వాన్ని పెంపొందించిన మరొక గొప్ప వ్యక్తి టి.జె. రామనాథం. ఇలా ఈ నలుగురూ బాలకోటయ్య నటనా యాత్రలో నాలుగుస్తంభాలు.

అరవై సంవత్సరాల నట ప్రయాణంలో బాలకోటయ్య ఎన్నో...



ఎన్నో... గొప్ప పాత్రల్ని.. ఎంతో సమర్థవంతంగా పోషించారు. ఎన్నో గొప్ప నాటకాలకు దర్శకత్వం వహించారు. బాలకోటయ్య నటించిన పాత్రల్లో ఎన్నో పాత్రలు ఆయనకెంతో గుర్తింపుని, గౌరవాన్ని తెచ్చిపెట్టడమేకాక, ఆయన మనసుని కూడా ఎంతో సంతోషపెట్టాయి. వాటిలోకెల్లా చెప్పుకోదగ్గవి ఆణిముత్యాల్లాంటి ఆరు పాత్రలు. ఆనాడులో 'వరదాయి' పాత్ర, పల్లె పడుచులో 'కామేశం', విజయపురి వికాసంలో 'ఆచార్య నాగార్జునుడు', మూగజీవులులో 'చక్రవర్తి' కీర్తిశేషులులో 'వాణీనాథం', మనసున్న మనిషిలో 'మన్మథరావు'.

బాలకోటయ్య నాటకయాత్ర సుదీర్ఘమైనది. తన అరవైఏళ్ల రంగస్థల ప్రస్థానంలో ఎందరో, బాలకోటయ్యని ఎన్నో విధాలుగా గౌరవించారు. బిరుదులతో సత్కరించారు. సన్మానాలతో ఆదరించారు. శారదా కళామందిర్ – నాగార్జునసాగర్ వారిచే 'కళాతపస్వి' బిరుదు, కళాంజలి – తణుకు వారిచేత 'కళాభూషణ్' కళావాణి ఉభయ గోదావరులచేత 'కళాసారథి', సంఘమిత్ర సాంస్కృతికమండలి – హైదరాబాద్ వారిచే – విశిష్టసేవా పురస్కారం, నల్గొండ జిల్లా కలెక్టర్‌చేత ప్రతిభా పురస్కారం, కళావాణివారి 'అభిజ్ఞ' అవార్డ్, అభినయ ఆర్ట్స్ – తిరుపతి వారిచే విశిష్ట కళాసేవా పురస్కారం, నల్గొండ జిల్లా కలెక్టర్‌చే కందుకూరి వీరేశలింగం ప్రతిభా పురస్కారం ఇలా... ఎన్నో... ఎన్నెన్నో ప్రతిభా పురస్కారాలు, గౌరవ సన్మాన సత్కారాలు బాలకోటయ్యని కోరి... కోరి... ప్రేమతో వరించాయి. ఆయన కళాభిమానానికి, కళాకుశలతకి, నిరంతర కళాసేవకి కైమోడ్పులర్పించాయి.

గత దశాబ్దంలో తెలుగు నాటకరంగం బాలకోటయ్య ప్రతిభను, అనుభవాన్ని మరో రకంగా వినియోగించుకొంది. నంది నాటకోత్సవాలకు బాలకోటయ్యని గుణ నిర్ణేతగా, ప్రాథమిక పరిశీలకుడిగా ఎంపిక చేసింది.

కోన ప్రభాకరరావు నాటక కళాపరిషత్ – బాపట్ల పాలకొల్లు నాటక పరిషత్, వీరవాసరం నాటక పరిషత్, ద్రాక్షారామ నాటక పరిషత్, దొడ్ల రామచంద్రారెడ్డి నాటక పరిషత్ – కావలి, జిల్లా రంగస్థల కళాకారుల ఐక్యవేదిక, వరంగల్లు... ఇలా ఎన్నో నాటక పరిషత్‌లువారు, ప్రతి ఏటా నిర్వహించే అనేక నాటక పరిషత్‌లకు, బాలకోటయ్యని గుణ నిర్ణేతగా పిలిచి, ఆయన సేవల్ని వినియోగించుకోవడం జరుగుతోంది.

ఏ మనిషైనా దీర్ఘకాలం జీవించడంలోనే ఓ గొప్ప అద్భుతముంది. మానవ సమాజ ప్రస్థానాన్ని అనేక సందర్భాలలో దర్శించగలిగే అద్భుతమైన అవకాశం కలుగుతుంది. తొంభై ఏడు సంవత్సరాల కాలం జీవించిన బెర్ట్రాండ్ రస్సెల్ అనే మహనీయుడ్ని, నీ జీవితంలో ఏం సాధించావని అడిగేరుట ఒకరు. ఆయన నవ్వి, తొంభై ఏడేళ్ళపాటు మానవ సమాజాన్ని దర్శిస్తూ వచ్చేను. ఇంతకన్నా ఇంక సాధించవలసింది ఏముంది అన్నాట్ట. అందుకే దీర్ఘకాలం జీవించడం ఓ అదృష్టం. దేవాలయంలో తీర్థమిస్తూ, పురోహితులు 'దీర్ఘాయుష్మాన్ భవ!' అంటూ ఆశీర్వదిస్తారు. అది మన సనాతన భారతీయ ధర్మం యొక్క విశిష్ట లక్షణం. కేవలం జీవించడమే కాదు... ఆరోగ్యంగా... సంతోషంగా జీవించడం. ఇంకా గొప్ప విషయం. అందునా బ్రతికినంతకాలం ప్రయోజనాత్మకంగా పదిమందికి ఉపయోగపడుతూ బ్రతకగలగడం మరెంతో గొప్ప విషయం. నది తాను ప్రవహించినంతదూరం లోకాన్ని సస్యశ్యామలం చేస్తుంది. అలాగే ఏ మనిషైతే తాను జీవించినంతకాలం తన సమాజానికి సహాయపడుతూ సాగుతాడో అతడి జీవితమే ధన్యం. అటువంటి మనిషి బ్రతుకే లోకానికి ఆదర్శనీయం. బాలకోటయ్య అటువంటి వ్యక్తి. డెబ్భై అయిదో ఏట కూడా అర్ధరాత్రి పన్నెండుగంటలవరకూ, నాటక ప్రదర్శన గుణ నిర్ణయాన్నిచేసి, చిరునవ్వుతో మిత్రుల్ని పలకరించి, వారి భోజన వసతులకు శ్రద్ధ వహించడాన్ని, వరంగల్లు కళాకారుల ఐక్యవేదిక నిర్వహించిన కళాపరిషత్‌లో కళ్ళారా చూశాను. అంతకన్నా అదృష్టం ఇంకేమీలేదు. ఉండబోదుకూడా!

భగవంతుడు బాలకోటయ్యకి శతాధిక సంవత్సరాలు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించి, అంతకాలం తెలుగు నాటక సేవలో తరించే అదృష్టం ప్రసాదించాలని ఆశిస్తూ, సకల కళాస్వరూపుడైన ఆ నటరాజును వినమ్రంగా ప్రార్థిస్తున్నాను. స్వస్తి.

*email:vadrevusundarrao@gmail.com*

సింగిల్ పేజీ కథ

# వరం... వరం !!

## ఏవిఎమ్

రాయల సీమ, తెలంగాణ, కోస్తా అని తేడా లేకుండా రైతులంతా కలిసి అసెంబ్లీని చుట్టుముట్టారు!

ముఖ్యమంత్రి... డౌన్ డౌన్!! నిరసనలు వ్యక్తం చేస్తున్నారు!

సెక్రటీ!.. విషయం కనుక్కో! ఆదేశించారు ముఖ్యమంతి.

రైతులు ఒక్కటే చెబుతున్నారు సార్!!

ఏమని!? వాళ్ల విషయం పట్టించుకోవద్దని!!

మీరొకమారు సెలవిచ్చార్ట!!

ఓహో!!

దానివల్ల కరెంటు కోతలు పెరిగాయి!

పాలరేట్లు పెరిగాయి!

విత్తనాలు బ్లాకులో కూడా దొరకట్లేదు!

బస్సు చార్జీలు, చిల్లర సరుకులు, ఆకుకూరలూ, పళ్లూ పెరిగాయి!

అవన్నీ నే పెంచలేదు, పైగా ఆ రైతులందరికీ ఇంకా ఏదైనా మేలు చేద్దామని ఆలోచిస్తున్నా... ఇంతకీ నేను ఏదో అన్నానన్నావే!?... ఏంటదీ!?

రైతులకు ఎంత చేసినా తక్కువే!

అందులో తప్పేంటీ!?

వాళ్ళు...దాన్ని రివర్సులో...

అర్థం చేసుకున్నారు!

ఆం....!!



# కాలాన్ని బంధించిన కాన్వాస్

లలితకోమలమైన కాపు రాజయ్య కళా నైపుణ్యాన్ని 1956 నుంచి ఆరాధిస్తున్నాను. ఆ చిత్రరచన లలిత కోమలం మాత్రమే కాదు, అది స్వచ్ఛమైన సరళత, అప్రయత్నంగా వచ్చిన ప్రసన్నతలతో కూడుకున్నది. మన యువ చిత్రకారుల గురించి నేను రాసిన వ్యాసాన్ని ఆయా చిత్రకారుల ప్రతిభను వెల్లడించే చిత్రాలతో కలిపి 'లండన్ స్టూడియో మేగ్జయిన్' మార్చి (1956) సంచికలో ప్రచురించింది. అందులో చోటు కల్పించిన చిత్రాలకి తలమానికంగా రాజయ్య 'బోనాలు' చిత్రాన్ని రంగులలో ఆ మేగ్జయిన్ పునర్ముద్రించింది కూడా.




కాపు రాజయ్య

'బోనాలు' చిత్రం నన్ను కట్టిపడెయ్యడానికి కారణం అందులో ముమ్మూర్తులా ప్రతిఫలించిన భారతీయతే. ఆ చిత్రానికి అసమాన నవ్యతను అద్దినవి తెలుగునేల, తెలుగు ప్రజలు, తెలుగుగడ్డ కమ్మని మట్టివాసన, ఆ తెలుగు ప్రాంతానికీ, తెలుగు ప్రజలకీ సంబంధించిన భావన నన్ను పరవశుడిని చేశాయి.

ఆయన రచనలో గతకాలపు గతత్వం వర్తమానపు సజీవ యథార్థత రూపంలో ఆవిష్కృతమవుతున్నది. సొంతమని చెప్పదగిన కాల్పనిక దృష్టి, సాంకేతిక ప్రక్రియ ఆయనలో కుదురుకున్నాయి, ఏ ప్రాచీనుడో, ఆధునికుడో, భారతీయుడో, విదేశీయుడో–అలాంటి గురువుల దగ్గర నుంచి రాజయ్య విద్య నేర్చుకున్నవాడు కాదు. తాను పుట్టిన సిద్ధిపేటలో తన చుట్టూ కనిపించే కంసాలి పనివారు, కుమ్మర్లు, కమ్మర్లు, నకాషీ బొమ్మల నిపుణులే రాజయ్యకు గురువులు.



పండుగ పబ్బాలు చిత్రించడంలో ఆయన అభిరుచి హద్దులు లేనిది. రథాలపైన, గోడలమీద కనిపించే నకాషీ చిత్రాల రాజయ్యను గాఢంగా ప్రభావితం చేశాయి. కుంచె భాషలో స్వచ్ఛమైన జానపద నుడికారాన్ని నింపుకోవడంలో సాయపడ్డాయి. రాజయ్య చిత్రరచన మొదటి దశ అజంతా చిత్రాలతో ప్రభావితమైంది. నకాషీ కళాకారుల ద్వారా దక్కనీ లఘు చిత్రకళా ప్రభావం రెండవ దశ అంతటా కనిపిస్తుంది. రాజయ్య కళాదృష్టికి మూలాలు ఆయన పుట్టినగడ్డలో ఉన్నాయి. తన భారతదేశం ఎలాంటిదో ఆయనకు తెలుసు. ఇంతకన్నా ముఖ్య విషయం, తన తెలంగాణ గురించి ఆయన బాగా తెలుసుకోగలిగాడు. హృదయం నుంచి పెల్లుబికి వచ్చే దానిని ఆయన చిత్రిస్తాడు.

*– ఎ.ఎస్. రామన్*

లండన్ మహానగరంలో వైభవంగా జరిగిన

# ప్రపంచ తెలుగు చరిత్ర మహాసభలు

- వాడేవ్రు సుందరావ్రు, నంది, గరుడ అవార్డుల గ్రహీత

*లండన్ మహానగరంలోని సుప్రసిద్ధ బ్రిటీష్ లైబ్రరీలో ప్రపంచ చరిత్ర మహాసభలు తొలిసారిగా వైభవంగా జరిగాయి. మన తెలుగు చరిత్ర, సంస్కృతిని పరిరక్షించుకోవడంతో బాటుగా, మరింతగా వికసింప చేసుకోవాలనే సంకల్పంతో జూలై 13,14,15వ తేదీలలో ఈ మహాసభలు నిర్వహించబడ్డాయి.*

ముఖ్యంగా బ్రిటీష్ లైబ్రరీలో, పూర్వులు ఎంతో శ్రద్ధతో భద్రపరిచిన అమూల్యమైన సాహితీ సంపదను మనం చూసుకొని, అందులో ముఖ్యమైన వాటిని మన రాష్ట్రానికి తెచ్చుకోవాలనేది కూడా ఈ ప్రయత్నంలో భాగమే.

యునైటెడ్ కింగ్డం తెలుగు సంఘం ఆధ్వర్యంలో జరిగిన ఈ మహాసభలలో ఇంగ్లాండ్‌లోని అనేకమంది తెలుగు ప్రముఖులు ఎంతో ఆసక్తితో పాల్గొన్నారు. ఈ మహాసభలకు ప్రధానకారకులైన శ్రీ మండలి బుద్ధప్రసాద్ అధ్యక్షత వహిస్తూ తెలుగు చరిత్ర పునర్నిర్మాణంలో ఇదో మైలురాయి అభివర్ణించారు. బ్రిటన్ విదేశాంగ మంత్రి శ్రీ అలిస్టర్ జేమ్స్ బర్ట్ ఈ సభలను ప్రారంభం చేసారు.

బ్రిటన్ పార్లమెంట్ సభ్యుడు లార్డ్‌బిల్ మోరియా కూడా ఈ సభలకు విచ్చేసారు. ఈ సభల సందర్భంగా తణుకు కళాశాల లెక్చరర్ వాడ్రేవు సుందరావు తరతరాల తెలుగుజాతి చరిత్ర అనే ఒక డిజటల్ ఫొటో ప్రదర్శన ఏర్పాటు చేసారు. ఈ ప్రదర్శనలో మన తెలుగు ప్రముఖుల ఎన్నో చిత్రపటాలు ఉంచడం జరిగింది. రాజ్యసభ సభ్యులు, ప్రముఖ చలనచిత్ర నటులు శ్రీ చిరంజీవి ఈ ప్రదర్శనను ప్రారంభం చేసి, చిత్రాలను తిలకించి వాడ్రేవు సుందరావును ఎంతగానో అభినందించారు. తెలుగు వారికి ప్రాత:స్మరణీయుడైన ఆర్థర్ కాటన్ మునిమనుమడు రాబర్ట్ కాటన్ తన సతీమణితో కలిసి విచ్చేసి ఈ ప్రదర్శన తిలకించారు. అనంతరం కాటన్ దంపతులను సభలో ఘనంగా సత్కరించారు. ఈ సభలలో ఆంధ్రప్రదేశ్ శాసనమండలి అధ్యక్షులైన డా॥ శ్రీ ఎ. చక్రపాణి రచించిన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ చరిత్ర గ్రంథాన్ని బ్రిటన్ మంత్రి బర్ట్ ఆవిష్కరించారు. ముగింపు సభకు బ్రిటన్ పార్లమెంటు సభ్యులు సైమన్ హ్యూడ్స్ ముఖ్యఅతిధిగా విచ్చేసి, యునైటెడ్ కింగ్డం తెలుగు సంఘం చేసిన ఈ కృషిని






చిరంజీవితో వ్యాసరచయిత వాడ్రేవు సుందర్రావు



అభినందించారు.

ఈ సదస్సులో తెలుగు చరిత్ర సంస్కృతిపై కొందరు ప్రముఖులు పత్ర సమర్పణ చేసారు.

ప్రొ. శ్రీపాద సుబ్రహ్మణ్యం, డా॥ జి.వి.పూర్ణచంద్, ప్రొ.యల్లాప్రగడ సుదర్శనరావు, ప్రొ.ననుమాస స్వామి, డా॥నందూరి శ్రీరామచంద్రమూర్తి, డా॥ బి. సుబ్రహ్మణ్యం, ప్రొ.ఎం.ఎల్.కె.మూర్తి, డా॥ రాజారెడ్డి, డా॥ ఈమని శివనాగిరెడ్డి, అట్లూరి మురళి, ప్రొ, అడపా సత్యనారాయణ మొదలైన ప్రముఖుల ఉపన్యాసాలతో పాత్ర సమర్పణలతో చరిత్ర మహాసభలు ఎంతగానో ప్రయోజనాత్మకంగా ముగిసాయి. మనదేశం నుండి ఈ సభలలో పాల్గోవడానికి వెళ్లిన పరిశోధకులు, పెద్దలు ఈ సందర్భంలో లండన్‌లోని బ్రిటీష్ మ్యూజియాన్ని సందర్శించారు. ఈ సభలలో వాడ్రేవు సుందర్రావు చేసిన శిఖండి ఏకపాత్ర అందర్ని ఎంతగానో అలరించింది. ఈ సభల విజయం వెనుక యుక్తా సంస్థ కార్యవర్గం మరీ ముఖ్యంగా వ్యవస్థాపకుడు కిల్లి సత్యప్రసాద్ గారి కృషి ఎంతగానో ప్రశంసనీయమని చెప్పుకోవచ్చు.

శాసనమండలి సభ్యులు శ్రీయాదగిరి రెడ్డి, శ్రీ ఇంద్రసేనా రెడ్డి, శ్రీ జగదీశ్వర్ రెడ్డి, మరియు శ్రీ ఐలాపురం వెంకయ్య, మారిషస్ తెలుగు ప్రముఖులు శ్రీసంజీవ అప్పడు, యానాం శాసనసభ్యులు శ్రీ మల్లాడి కృష్ణారావు, శిల్పారామం స్పెషల్ అధికారి జి.ఎన్.రావు వంటి వారెందరో ఈ మహాసభలలో ఎంతో ఉత్సాహంతో పాల్గొని తొలి ప్రపంచ తెలుగు చరిత్ర మహాసభలు నిజంగా తెలుగు వారి అభివృద్ధి వికాసాల పరిణామ క్రమంలో ఒక మైలురాయి అన్న మండలి బుద్ధప్రసాద్ గారి మాట నిస్సందేహం.

email:vadrevusundarrao@gmail.com




తరతరాల తెలుగుజాతి చరిత్ర డిజటల్ ఫొటో ప్రదర్శన




సంపుటి :2 సంచిక :12 అక్టోబర్ 2012




64కళలుడాట్‌కాం కు ఈనెలతో రెండు సంవత్సరములు పూర్తయినవి. 3వ జన్మదిన సంచిక నవంబరు 2012 సరికొత్త మార్పులతో మీ ముందుకు రానుంది.

అక్టోబర్ 20 నవ్వుల రాజు 'రాజబాబు' జయంతి సందర్భంగా నీరాజనంలో వ్యాసం చదవగలరు.

పాఠకులకు విజయదశమి శుభాకాంక్షలు...

*ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.*

**కళాసాగర్**

ఎడిటర్



*ముఖచిత్రం చిత్రకారుడు :* **మంచెం**



**జాతీయ అవార్డే నా లక్ష్యం**
**అంటున్న గాయని సునీత**

**నవ్వించి ఏడ్పించిన**
**రాజబాబు**



*ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే*

# క్యారికేచర్ డ్రాయింగ్

- కార్టూనిస్ట్ జయదేవ్



**క్యారికేచర్‌కీ పోర్ట్రైటుకీ తేడాలున్నాయి. పోర్ట్రైటులో వ్యక్తి మొహం, అవయవాలు సహజంగా చిత్రీకరించి వుంటాయి. క్యారికేచర్‌లో మొహమూ, అవయవాలూ వ్యంగ్యంగా కనిపిస్తాయి. క్యారికేచర్ డ్రాయింగ్ ఒక ప్రత్యేక కళ, ఆ కళలో నేర్చుకోవలసిన ఎన్నో మెళకువలున్నాయి.**



క్యారికేచర్‌కీ పోర్ట్రైటుకీ తేడాలున్నాయి. పోర్ట్రైటులో వ్యక్తి మొహం, అవయవాలు సహజంగా చిత్రీకరించి వుంటాయి. క్యారికేచర్‌లో మొహమూ, అవయవాలూ వ్యంగ్యంగా కనిపిస్తాయి. క్యారికేచర్ డ్రాయింగ్ ఒక ప్రత్యేక కళ, ఆ కళలో నేర్చుకోవలసిన ఎన్నో మెళకువలున్నాయి.

క్యారికేచర్‌ని ఎలా గీస్తార్ సార్ అని అడిగాను శ్రీ ఆర్.కె. లక్ష్మణ్ గారిని (నేను హార్ట్‌యానిమేషన్ ఎకాడమీలో పనిచేసేటప్పుడు వారక్కడకి వచ్చేవారు). "నీ మొహం కాస్త వంకరగా పెట్టు... ఒక కనుబొమ్మని పైకెత్తి నన్ను విచిత్రంగా చూడు... కదలకుండా నుంచో..." అని చెప్పి రెండు నిమిషాల్లో నా క్యారికేచర్‌ని బోర్డు మీద గీశారు. అక్కడ గుమికూడిన యానిమేసన్ విద్యార్థులు ఆ క్యారికేచర్‌ని చూసి చప్పట్లు కొట్టారు... పగలబడి నవ్వారు. ఆర్.కె. లక్ష్మణ్ గారికి దణ్ణం పెడుతూ నేనూ నా బొమ్మ చూసి నవ్వాపుకోలేకపోయాను. క్యారికేచర్‌లో వ్యంగ్యం ప్రధానాంశం.

ఆర్.కె.లక్ష్మణ్ గారు ఎంత గొప్ప కార్టూనిస్టో అంత గొప్ప క్యారికేచరిస్టు కూడా. ఆయనగారు గీసిన క్యారికేచర్ల కలెక్షను ఒక గొప్ప రెఫరెన్సు గ్రంథం. పేజీలు తిరగేస్తూ, ఆ బొమ్మల్లో మునిగిపోతాం. లాల్‌బహదూర్ శాస్త్రి ప్రధానమంత్రి కాగానే, ఆర్.కె.లక్ష్మణ్ "ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా" పత్రికలో గీసిన క్యారికేచర్‌ను చూసి మెచ్చుకోని వాళ్లులేరు. లాల్‌బహదూర్ శాస్త్రి పొట్టిమనిషి. ఆయన్ని పెద్ద సింహాసనం మీద కూర్చోపెట్టి కాళు నేలమీద ఆన్చలేక ఇబ్బంది పడ్తున్నట్లుగా చూపించారు.

ఆర్.కె.లక్ష్మణ్. ఆ క్యారికేచర్‌లో ఎంతో భావాన్ని గుప్పించి పాఠకుల మెప్పును పొందారు. ఎప్పటికీ మరిచిపోలేని క్యారికేచర్లలో ఇదొకటి.

ఆర్.కె. లక్ష్మణ్‌కి తీసిపోని చిత్రకారుడు, కార్టూనిస్టు



ఆర్.కె. లక్ష్మణ్ గీసిన టాటా, బిర్లాల క్యారికేచర్లు




రంగా గారి గాంధీజీ



విక్టోరియా మహారాణి

మారియో మిరాండా గారు. విచిత్రం ఏమిటంటే మారియోగారు క్యారికేచర్లని చాలా తక్కువగా గీశారు. నిజానికి మారియోకి క్యారికేచర్లు గీయడం నచ్చదు. ఒక సందర్భంలో వారినడిగాను. క్యారికేచర్లు ఎందుకు గీయరు సార్ అని, ఆయన గారిచ్చిన నిక్కచ్చి సమాధానం. "ముక్కూ, పెదాలూ, చెవుల్ని సాగదీసి గీయడమేగా క్యారికేచర్! నేను వ్యవస్థ మీద వ్యంగ్యం విసరడంగానీ, వ్యక్తులను వికారంగా చిత్రించి వాళ్లని నవ్వుల పాలు చేయడం నాకిష్టంలేదు!" అది కేవలం మారియోగారి అభిప్రాయం.

క్యారికేచర్ చిత్రీకరణలో చిత్రకారుడి చేతి వరుస మారియోగారన్నట్లు, ముక్కూ, పెదాలూ, చెవులూ, పళ్ళ మీదే వుంటుంది. అందుచేతే బొమ్మలో హాస్యం పలుకుతుంది. క్యారికేచర్ ఉద్ధేశ్యమే హాస్యం. కనుక క్యారికేచర్‌ని లైట్‌గానే తీసుకోవాలి. అజిత్ నైనన్ గీసే క్యారికేచర్లలో హాస్యం సున్నితంగా కనిపిస్తుంది. అబు అబ్రహమ్ గారి బొమ్మల్లో గీతలు క్లుప్తంగా వుంటాయి. ఒక్కొక్క చిత్రకారుడిదీ ఒక్కొక్క ప్రత్యేకత.

క్యారికేచర్‌లో కేవలం హాస్యమూ, వ్యంగ్యమే కాకుండా ఇతర విషయాలు చాలా చెప్పవచ్చు. క్యారికేచరిస్టు ప్రావీణ్యతను బట్టి, క్యారికేచర్ గొప్పతనాన్ని మనం అంచనా కట్టవచ్చు (ఉదా. లాల్‌బహదూర్ శాస్త్రి క్యారికేచర్).

పది, పదిహేనేళ్ళ క్రితం హిందూస్థాన్‌టైమ్స్ వారు ప్రతి ఏటా, కార్టూన్, క్యారికేచర్ పోటీ నిర్వహించేది. బహుమతి పొందిన ఎంట్రీలను నగరాల్లో ప్రదర్శించారు కూడా ఎంతోమంది చిత్రకారులు, కార్టూనిస్టులు పోటీల్లో పాల్గొని తమ సత్తాను చాటి చూపించారు. ప్రపంచ ప్రముఖుల క్యారికేచర్లు వివిధ రకాలుగా దర్శనమిచ్చాయి. కొన్ని క్యారికేచర్లు మామూలు చిట్టి పొట్టి గీతలతో వుంటే, మరికొన్ని అద్భుతమైన పెయింటింగులను తలపించి చూపరులను దిగ్భ్రాంతులు గావించాయి.

ప్రపంచంలో చాలా చోట్ల క్యారికేచర్ ప్రదర్శనలు నిర్వహిస్తున్నారు. పోటీలు జరుగుతున్నాయి. మనదేశం నుంచి చాలా మంది ఆ పోటీల్లో పాల్గొని బహుమతులందుకున్నారు. వాళ్ళల్లో అతి ముఖ్యుడు శంకర్ పామర్తి. హైదరాబాద్‌కు ప్రపంచ మ్యాపులో ప్రత్యేక స్థానాన్ని కల్పించిన గొప్ప తెలుగు ఆర్టిస్టు,



కళాసాగర్ గీసిన బాపు క్యారికేచర్



కళాధర్‌బాపు గీసిన లత క్యారికేచర్



మోహన్ గీసిన జయదేవ్ క్యారికేచర్



శంకర్ గీసిన ధర్మవరపు క్యారికేచర్






జయదేవ్ ఇటీవల గీసిన సుధామ, ఓనావ, చక్రవర్తిల క్యారికేచర్లు

కార్టూనిస్టు, క్యారికేచరిస్టు. శంకర్ క్యారికేచర్ల వ్యంగాన్ని, ఆ చిత్రానికి సంబంధించిన వ్యక్తి గుణగణాలనీ, ఇతర అంశాలని అద్భుతంగా చాటి చూపిస్తాయి. ఇంత పనితనం ఒక క్యారికేచర్లో యిమడ్చాలంటే అది సామాన్యమైన విషయం కాదు. పరిశీలన, పరిశోధన అంతకుమించి కృషి అన్నీ పటిష్టంగా చెయ్యాలి. శంకర్ ఇవన్నీ చేసి క్యారికేచరింగ్‌కు పూనుకుంటాడు. ఈ మధ్య తలిశెట్టి రామారావు గారి క్యారికేచర్ గీశాడు. సూపర్ అన్నారు కార్టూనిస్టులు, తెలుగు పాఠకులు.

శంకర్‌కు ప్రపంచఖ్యాతి తెచ్చిపెట్టింది దలైలామా చిత్రం. అంత గొప్పగా, అంతకు ముందెవరూ అలాంటి క్యారికేచర్ చిత్రించలేదు. శంకర్‌ది మరో గొప్ప సృష్టి. మదర్‌థెరీసాది.



శంకర్‌కి ఇంతటి శిల్పం ఎలా వంటబట్టిందనడిగితే అందుకు కారకుడు ఆయన గురువు ప్రముఖ చిత్రకారుడు, కార్టూనిస్టు యానిమేటర్ మోహన్. శంకర్ ఆరాధించే చిత్రకారుల్లో మోహన్ గారిదే అగ్రస్థానం. మోహన్ ఒక ఆసాధారణ చిత్రకారుడు. ఎనాటమీని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన వ్యక్తి. మోహన్ శిష్యబృందంలోని అన్వర్, పాండు, మృత్యుంజయ్, శంకర్, రాజు లాంటి వాళ్లు అగ్రశ్రేణి చిత్రకారులు. అందరూ ఆరితేరిన పోర్‌ట్రైటు ఆర్టిస్టులు. క్యారికేచరిస్టులు, పెయింటర్లు, కార్టూనిస్టులు.

క్యారికేచర్ ఆర్టుకి ముఖ్యంగా ముఖం, తల,,, అంశాలమీద గట్టి పట్టు అవసరం. ఆర్టుస్కూళ్లలో ఫేస్, హెడ్ డ్రాయింగుకు సంబంధించిన పాఠాలు దాదాపు ఏడాది పాటు జరుపుతారు.

ముఖ చిత్రీకరణలో క్యారికేచరిస్టుల దృష్టి, తల, క్రాపు, నుదురు, నుదిటి మీది చారలు, కనుబొమ్మలు, కనురెప్పలు, కంటి పాప, ముక్కు, పెదాలు, నోరు, పళ్లు, పంటి చిగుల్లు, బుగ్గలు, గడ్డం, చెవులు, గొంతు, గుండు మీది చారలు, వీటి మీద కేంద్రీకరించి వుంటుంది. కొందరు వ్యక్తులు ముఖాలు, క్యారికేచర్లకు సరిపడా చెక్కినట్లు వుంటాయి. అలాంటి వ్యక్తుల క్యారికేచర్లు చిత్రీకరణ కొంత సులభంగా చేయవచ్చు. ముఖ్యంగా రాజకీయ రంగాల్లో ప్రముఖులైన వ్యక్తుల క్యారికేచర్లు పాఠకుల దృష్టిని వెంటనే ఆకట్టుకుంటాయి.

కార్టూనిస్టు రంగగారు, గాంధీ క్యారికేచర్‌ని కళ్ళజోడు, గుండు, చెవి ముద్రం రెండే రెండు గీతల్లో యిమిడ్చి ప్రపంచఖ్యాతి పొందారు. రంగగారు నేర్పిన పాఠం చిత్రకారుల్ని ముగ్ధుల్ని చేసింది. అర్ధమైన విషయం ఏమిటంటే గీతలెన్ని తక్కువుంటే,

క్యారికేచర్ అంత గొప్పగా వుంటుందని తెలిపోయింది.

ఈ సూత్రాన్ని అనుసరించి, స్వాతి వారపత్రికలో "ఫోటోలకి క్యారికేచర్లు" అనే ఫీచర్ని కొంతకాలం నడిపాను. తర్వాత తెలిసింది అదేమంత సులభసాధ్యమైన పనికాదని, ఫీచర్ని ఆపేశాను. నేను నేర్చుకోవల్సింది చాలా చాలా వుందని తెలిసింది. ముఖం ఎనాటమీని ఎంతో స్టడీ చేస్తేగాని క్యారికేచర్ జోలికి పోకూడదని తెలిసింది.

లైన్‌డ్రాయింగులో ఆరితేరిన చంద్ర లాంటి ఆర్టిస్టు పక్కన కూర్చొని గమనించే అరుదైన అవకాశం ఒకసారి లభించింది. ఫొటో మీద రబ్బర్ సొల్యూషన్ రాసి, కాగితం అంటించి, ఫోటోని ట్రేస్ చేసి, ఫినిషింగ్ టచ్‌చేసి ఇవ్వడం నేర్చుకున్నాను. ఐనా, నాకు క్యారికేచరింగ్ అబ్బలేదు. మరికొంత మరింత సాధన చేయాల్సి వుంది.

ఇప్పుడు కంప్యూటర్‌లో, కాపీయింగ్, పెయింటింగ్ ఫొటోషాప్‌లో యువ చిత్రకారులు విన్యాసాలు చేస్తుంటారు. దీనికి శిక్షణ అవసరం. ఓపికతో నేర్చుకుంటే, ఆర్టుమీద కొంత అవగాహన వున్న యువతకి, మంచి ఆదాయాన్ని కల్పించే అవకాశాలు మెండుగా కనిపిస్తున్నాయి. ప్రస్తుతం ఆన్‌లైన్‌లో క్యారికేచర్ గీచే వెబ్‌సైట్లు కూడా వచ్చాయంటే క్యారికేచరిస్టులకు మంచిపని దొరికినట్లే కదా!



బిజినెస్ కార్డులు, విజిటింగ్ కార్డులు ప్రింట్ చేసే కంపెనీలకి యువ ఆర్టిస్టుల అవసరం ఎంతయినా వుంది. డిజిటల్ ఆర్టులోని అవకాశాలన్నిటిని అన్వేషిస్తే వాటివల్ల ఎంతో ప్రయోజనం వుంది.

*email: jayadevcartoon@gmail.com*




*సెప్టెంబర్ 28న, విజయవాడలో జరిగిన సరస్వతి గోరా 100వ జన్మదిన వేడుకలలో కళాసాగర్‌ను సత్కరిస్తున్న డా॥ జి. సమరం*

# మన కార్టూనిస్టులు

-కళాసాగర్

"అక్షరం రూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క లక్షమెదళ్లకు కదలిక అన్నాడు, ఆనాడు మహాకవి కాళోజీ. అక్షరానికున్న శక్తి అలాంటిది. వేల అక్షరాలతో చెప్పలేని భావాన్ని ఒక్క కార్టూన్ ద్వారా చెప్పొచ్చు అంటున్నారు నేటి కార్టూనిస్టులు. నిరక్షరాస్యులను కూడా కదిలించగల శక్తి కార్టూన్‌కుంది.

వివరణ అవసరం లేకుండా సూటిగా, సంక్షిప్తంగా, విషయాన్ని పాఠకుడి హృదయానికి హత్తుకునేలా చేసే గొప్ప కళా మాధ్యమం కార్టూన్. అందుకే రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాహిత్య, కళా విషయాలతో నిమిత్తం లేకుండా అన్ని రకాల పత్రికలలోనూ నేడు కార్టూన్లు ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ఇంత శక్తివంతమైన కళాప్రక్రియకు తెలుగులో ఆద్యుడు శ్రీ తలిశెట్టి రామారావు గారైతే, ఆ తర్వాత కార్టూన్ విస్తృతంగా వ్యాప్తిలోకి రావడానికి బాపు, జయదేవ్, బాలి, మోహన్, ఏ.వి.ఎమ్, చంద్ర, మల్లిక్, సత్యమూర్తి, శ్రీధర్, కుమారి రాగతి పండరి లాంటి ఎందరో కార్టూనిస్టులు కృషి చేస్తున్నారు.

తెలుగు కార్టూన్ పితామహుడు తలిశెట్టి రామారావు గారితో 'మనకార్టూనిస్టులు' శీర్షికను ప్రారంభించాం. చదవండి, హాయిగా నవ్వండి, మీ అభిప్రాయాలను తెలియజేయండి...

## కార్టూన్లు సమాజాన్ని జాగృతం చేయాలి



కార్టూను కేవలం హాస్యానికే కాదు, సమాజాన్ని ప్రభావితం చేసేవిగా వుండాలి. సమాజంలోని రకరకాల రుగ్మతలను, వింత పోకడలను వ్యంగ్యంగా చిత్రిస్తూ, సమాజాన్ని జాగృతం చేసేదిగా కారూన్ కళ వుండాలి' అంటున్నారు ప్రముఖ వ్యంగ్య చిత్రకారుడు టి.వి.ఎస్ రామ్‌ప్రసాద్. నవ్వడం సులభమే కానీ, నవ్వించడమే చాలా కష్టం. అది అందరికి అలవడే విద్యకాదు. అందులోనూ రేఖా చిత్రాల ద్వారా నవ్వించాలంటే అందుకు తగ్గ ప్రతిభ వుండాలి.

కార్టూన్ గీయడమంటే కత్తిమీద సాము లాంటిది. కార్టూనిస్ట్‌కు ఎంతో నిబద్ధత, సంయమనం వుండాలి కార్టూన్ గీస్తే వెగటుగానో, ఎబ్బెట్టుగానో అన్పించకూడదు. సరదాగా వున్నట్లు అన్పించాలి. కాస్త చురుక్కుమన్పించాలి కూడా. కార్టూన్‌ను పండించాలంటే, కార్టూనిస్ట్‌కు అధ్యయనం ఉండాలి... సమాజాన్ని సునిశితంగా అర్థం చేసుకునే తత్వం వుండాలి. రామ్‌ప్రసాద్ కార్టూన్లలో చైతన్యం కనిపిస్తుంది. సమాజంలో వేదనా రోదనలే కాక, చిత్రవిచిత్రాలైన బాధల బాదరబందీలన్నిటినీ కూడా ఆయన కుంచె అద్దం పడుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన కార్టూన్లు నవ్వుతాయి, నవ్విస్తాయి... ఆలోచిస్తే మొదడుకూ మేత వేస్తాయి. భావానికి తగ్గట్టుగా బొమ్మలు వేయడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. కార్టూన్‌లు చూసి నవ్వుకోవడం వల్లే, తనకూ కార్టూన్లు వేసి అందర్నీ నవ్వించాలని, కార్టూన్ల ద్వారా సమాజాన్ని చైతన్యవంతం చేయాలని అన్పించిందని, ఆ ఆసక్తే తనను కార్టూనిస్ట్‌గా చేసిందనీ ఆయన అంటుంటారు. 1983లో ఆంధ్రసచిత్ర వార పత్రిక ద్వారా కార్టూనిస్టుగా పరిచయమైన వీరు దాదాపు అన్ని తెలుగు పత్రికలలోనూ కార్టూన్లు గీసారు. 1953లో నెల్లూరులో జన్మించిన రామ్‌ప్రసాద్, స్థానికంగా ప్రాథమిక విద్య పూర్తిచేసి, తిరుపతిలో బిఎస్సీ (అగ్రికల్చరల్) చదివి, ఆంధ్రాబ్యాంకులో ఉద్యోగంలో చేరారు. బ్యాంకు ఉద్యోగిగా అనేక జిల్లాల్లో పనిచేసి, 2003 సం॥లో వాలెంటరీ రిటైర్మెంట్ తీసుకున్నారు. చిన్నతనం నుంచి చిత్రలేఖనంపై ప్రత్యేకించి కార్టూన్లపై ఆసక్తి వుండడంతో కార్టూన్ల కళకు సంబంధించి ఎన్నో




పుస్తకాలు తెప్పించుకుని, పుస్తకాలే గురువులుగా భావించి ఈ కళను సాధన చేశారు. ప్రముఖ కార్టూనిస్ట్ జయదేవ్ కార్టూన్లు చూసి ప్రభావితులై, జయదేవ్‌తో లేఖలు రాసి స్నేహం పెంచుకుని, ఆయన సలహాలు సూచనలతో మరెన్నో కార్టూన్‌లు వేశారు. జయదేవ్‌తో పాటు కలిసి వేసిన కార్టూన్లు పలుపత్రికల్లో ప్రముఖంగా ప్రచురితమయ్యాయి కూడా. 1986లో నెల్లూరులో సింహపురి వ్యంగ్యచిత్రకారుల సమాఖ్యలో వుంటూ, సమాఖ్య ఆధ్వర్యంలో, జయదేవ్ సారధ్యంలో పెద్దఎత్తున కార్టూన్ల ప్రదర్శన నిర్వహించి, రాష్ట్రస్థాయి కార్టూన్ల పోటీలు జరిపారు. దాదాపు పాతికేళ్లుగా కార్టూన్ల రంగంలో వున్న రామ్‌ప్రసాద్ ఇప్పటిదాకా సుమారు రెండువేలకు పైగా కార్టూన్లు వేశారు. ఆయన వేసిన ఎన్నో కార్టూన్లు పలు పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 1987లో స్వాతి పత్రిక నిర్వహించిన రాష్ట్రస్థాయి కార్టూన్ల పోటీలోనూ బహుమతి పొందారు. 2002 సంవత్సరం విజయవాడలో నిర్వహించిన కార్టూన్ మేళాలో పాల్గొని కార్టూన్‌కళకు మరింత పదును పెట్టుకున్నారు. ఆడపిల్లలను చూసి చూసి కళ్ళు లవ్ సింబల్స్‌గా అయిపోవడం, టీవిల్లో సీరియల్స్ చూసి ధారలుగా కన్నీరు కార్చడం, నీళ్ళ బాధలు-పడతుల వెతలు వంటి కార్టూన్లు రామ్‌ప్రసాద్ సునిశిత పరిశీలనాసక్తికి నిదర్శనంగా నిలుస్థాయి. వృద్ధుల ఆశ్రమంలో మమ్మీ-డాడీ కూడా చేరుతారనే భావనతో పిల్లలు మాట్లాడుకోవడం నేటి బంధాలు-అనుబంధాల తీరును సవాల్ చేస్తూ కనిపిస్తాయి. లంకా దహనం చేసిన మారుతికి టపాసులు కాల్చడమంటే భయం అన్నట్లుగా సరదాగా వేసిన కార్టూన్ అందరికీ నవ్వు పుట్టిస్తుంది. ఇలాంటి ఎన్నో కార్టూన్‌లు రామ్‌ప్రసాద్ ప్రతిభకు నిదర్శనంగా వున్నాయి. 2012 సం॥లో మళ్ళ జగన్నాధం స్మారక బెస్ట్ కార్టూనిస్టు అవార్డు విశాఖపట్టణంలో అందుకున్నారు. కార్టూన్‌లో సంభాషణ లేకపోయినా, కార్టూన్‌ను రక్తికట్టించవచ్చని, అలాంటి క్యాప్షన్ లెస్ కార్టూన్లు మరెంతో ప్రభావితం చేసే విధంగా వుండాలంటారాయన. ప్రస్తుతం వీరి కార్టూన్లతో కార్టూన్ సంకలనాన్ని ప్రచురించే ప్రయత్నంలో వున్నారు.














## రామ్‌ప్రసాద్ కార్టూన్లు









# అచంచల కళాస్ఫూర్తి
# సుంకర చలపతిరావు

-కళాసాగర్

**ఆయన చిత్రాలు గీస్తారు....రచనలు చేస్తారు... పుస్తకాలు ప్రచురిస్తారు... కళాసంస్థలను స్థాపిస్తారు... ప్రోత్సాహకర్తగా వ్యవహరిస్తారు... ఇవన్నీ ఆయన బహుముఖ ప్రతిభకు నిదర్శనం. కళాభిరుచికి కారణముండదు... కళాకారునికి తృష్ణకు అంతుండదు... ఇంకా ఏదో చేయాలనే తపన.... ఆరాటం వారిని ఒక్కచోట నిలువనీయదు... నిరంతర కృషి.. అన్వేషణ... కొత్త ఆలోచనలను రేకెత్తిస్తాయి... కళాసంస్థల ఆవిర్భావానికి కారణమవుతాయి. ... ఆయన చేతిలో ఊపిరిపోసుకున్న సంస్థలు ఇంతింతై ఎదుగుతుంటే చూస్తూ ఆనందిస్తారు సుంకర చలపతిరావు.**


సుంకర చలపతిరావు

ఆంధ్రప్రదేశ్‌లో శిల్పులు, చిత్రకారులు, కార్టూనిస్టులు, చిత్రకళాసంస్థలు... వేటిగురించైనా అనర్గళంగా చెప్తారాయన. చిత్రకారుడుగా, చిత్రకళా విమర్శకుడుగా, సమీక్షకుడుగా, రచయితగా, కళాభిమానిగా ఆయన పేరు తెలియనివారుండరు. పుట్టింది గుంటూరు జిల్లాలో అయినా, మూడున్నర దశాబ్దాల విశాఖ అనుబంధం ఆయనను స్థానికుడిగా మార్చేసిది. ఒకవైపు షిప్‌యార్డులో ఉద్యోగ బాధ్యతలను సమర్థంగా నిర్వహిస్తూనే తనకున్న బహుముఖ ప్రజ్ఞతో ఎంతోమంది కళాకారులను ప్రోత్సహిస్తూ... కళాసంస్థలకు సహాయపడుతూ.. కళాసేవలో తరిస్తున్నారు ఆయనే సుంకర చలపతిరావు. గుంటూరు జిల్లా వెల్లటూరు గ్రామానికి చెందిన చలపతిరావు 35 ఏళ్ల క్రితం విశాఖలో స్థిరపడ్డారు. ఎస్ఎస్ఎల్‌సీ చదివి షిప్‌యార్డులోని హల్‌షాప్ విభాగంలో విధులు నిర్వహిస్తున్నారు. ఆయన సేవను గుర్తించిన ఎన్నో సంస్థలు ఉచిత రీతిన సత్కరించాయి. 2010లో అమలాపురానికి చెందిన కోనసీమ చిత్రకళాపరిషత్ చలపతిరావును 'చిత్రకళావైజయంతి' పురస్కారంతో సత్కరించింది.



సుంకర చలపతిరావు గారు ప్రచురించిన రాగతి పండరి గారి పుస్తకావిష్కరణ సభలో

### *చిత్రకారుడుగా... రచయితగా...*

1969లో తన ప్రస్థానాన్ని ప్రారంభించిన చలపతిరావు ఇప్పటివరకు వందకు పైగా చిత్రాలను గీశారు. వివిధ ప్రాంతాల్లో ప్రదర్శించిన ఈ చిత్రాలకు అనేక బహుమతులు, ప్రశంసలు లభించాయి. చిత్రకారుల గురించి, ప్రదర్శనల గురించి, చిత్రకళా గురించి వివిధ పత్రికల్లో 400కు పైగా వ్యాసాలు ప్రచురితమయ్యాయి. చిత్రశిల్పులు, చిత్రకళారత్నాలు, వడ్డాదిపాపయ్య, దామెర్ల రామారావు, సంజీవ్‌దేవ్ లేఖలు గ్రంథాలను కేంద్ర లలితకళా అకాడమీ, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురించారు. సమ్మెలు వర్ధిల్లాలి. ఈ లోకమింతే అనే రెండు కథలతో పాటు అనేక గేయాలను రచించారు. ఈ లోకమింతే కథను కన్నడంలోకి అనువదించి ప్రజామాత అనే కన్నడ


సుంకర చలపతిరావు గారు ప్రచురించిన పుస్తకాలు

పత్రికలో ప్రచురించారు.

### *వ్యవస్థాపకునిగా, ప్రోత్సాహకునిగా...*

నవరంగ్ చిత్రకళానికేతన్ (వెల్లటూరు). ఆస్కా (విజయవాడ) షిప్‌యార్డు రచయితల సంఘం (శిరసం–విశాఖ), లలితకళాపరిషత్ (విశాఖపట్నం), ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ (గుంటూరు), చిత్రకళాపరిషత్ (విశాఖపట్నం) ఏర్పాటులో ఆయన విశేష కృషి చేశారు. ప్రస్తుతం చిత్రకళా పరిషత్, శిరసం సంఘాలకు కార్యదర్శిగా, ఆస్కాకు గౌరవ సలహాసభ్యునిగా వ్యవహరిస్తున్నారు. చిత్రకళా విమర్శకునిగా తనకున్న అనుభవంతో 'విశ్వచిత్రకళ' మాసపత్రికను స్వీయ సంపాదకత్వంలో రెండేళ్లకు పైగా ప్రచురించి తెలుగులో చిత్రకళాసాహిత్యానికి ఊపిరిలూదారు. ప్రస్తుతం 64కళలుడాట్‌కాం వెబ్‌పత్రికకు సంపాదకమండలి సభ్యులుగా వ్యవహరిస్తున్నారు.

### *నిర్వాహకునిగా...*

శిరసం, చిత్రకళా పరిషత్ నిర్వాహకునిగా... సభ్యుల సహకారంతో అనేక కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. శ్రీశ్రీ మాతృభాషా దినోత్సవం, రాజారవివర్మ, దేవులపల్లి, గురజాడ, బాపిరాజు, వివేకానంద, వాల్‌చంద్, హీరాచంద్, సంజీవదేవ్, వడ్డాదిపాపయ్య, ఘంటసాల తదితరులు జయంతి, వర్ధంతి వేడుకల్లో చిత్రకళా పోటీలను, ప్రదర్శనలను నిర్వహిస్తున్నారు.

### *సత్కారాలు, ప్రసంగాలూ...*

అనకాపల్లి, విజయువాడ, పార్వతీపురం, విశాఖ, అమలాపురంలో ఆయా సంస్థలచే సత్కారాలు పొందిన చలపతిరావు రాష్ట్రవ్యాప్తంగా అనేక కార్యక్రమాల్లో చిత్రకళపై ప్రసంగించారు. అకాశవాణి–విశాఖపట్నం కేంద్రం ద్వారా అనేక ప్రసంగాలు చేశారు. ఆయన రచించిన అనేక వ్యాసాలు దిన, వార, మాసపత్రికల్లో విరివిగా ప్రచురితమయ్యాయి.

### కుటుంబం...

భార్య ఝాన్సీలక్ష్మితో 1975లో వివాహం, ఇద్దరు కుమార్తెలు సంతానం.


సుంకర చలపతిరావు గారు ప్రచురించిన పుస్తకాలు

కళాప్రపంచం

# "ఆబ్జెక్టివిజం" సిద్ధాంతకర్త - అయాన్‌ర్యాండ్



"My philosophy, in essence, is the concept of man as a heroic being, with his own happiness as the moral purpose of his life, with productive achievement as his noblest activity, and reason his absolute" -

అన్నది అయాన్ ర్యాండ్ సిద్ధాంతం.

ఎల్.ఆర్. వెంకటరమణ

మనిషి తన కోసం జన్మిస్తాడు. అతడు ఎవరి కోసము త్యాగం చేయనవసరంలేదు. ప్రపంచంలో సృజనాత్మకత ఉంది ఏదైనా సృష్టింగగలిగిన వారు కొద్ది మందే ఉంటారు. ఈ సృష్టి ఫలాలు అందుకునేవారే అధికంగా ఉంటారు. మనిషి తనకు నచ్చిన రీతిలో, తనకు నచ్చినట్లు జీవించగలగాలి అన్న తత్వాన్ని అయాన్ ర్యాండ్ ప్రచారం చేసింది. తన సిద్ధాంతానికి "ఆబ్జెక్టివిజం" అనే పేరు పెట్టింది. తను అలాగే జీవించింది.

అలైస్ జినోవినా రోసెన్‌బాస్ అనే పేరుగల అమ్మాయి 1905 ఫిబ్రవరి 2వ తేదీన రష్యాలోని పీటర్స్‌బర్గ్‌లో జన్మించింది. తండ్రి జినోవి జకారోవిచ్ రోసెన్‌బాయ్ తల్లి



అన్నాబొరిసోవినా రోసెన్ బాయ్. వీరికి కలిగిన ముగ్గురు కూతుళ్లలో అలైస్ పెద్ద అమ్మాయి. రష్యా విప్లవం 1917లో జరిగింది. అప్పుడు అలైస్ పన్నెండేళ్ళ అమ్మాయి. విప్లవ అనంతరం జరిగిన కొన్ని కారణాల వలన అలైస్ కుటుంబం క్రిమియాకు శరణార్థులుగా వెళ్లడం జరిగింది. అక్కడే విద్యాభ్యాసం కొనసాగింది. పీటర్స్‌బర్గ్‌లో ఉన్నత విద్య చదివింది. అక్కడే అరిస్టాటిల్, ప్లాటో గురించి చదువుకుంది. ఫ్రెడ్రిక్ నీషేను అమితంగా ఇష్టపడి చదివింది. అంతేకాక ఫ్రెంచ్, జర్మన్, రష్యన్ సాహిత్యాన్ని మదించింది.

1924లో అలైస్ డిగ్రీ పూర్తిచేసింది. చలనచిత్ర సంబంధిత విద్య పూర్తిచేసింది. తన పేరున "అయాన్"గా మార్చుకుంది. తనకిష్టమైన ఫినిష్ రచయిత పేరది. హిబ్రూ భాషలో అయాన్ అంటే "కన్ను" అని అర్థం. తన ముందున్న టైప్‌రైటర్ 'రెమింగ్‌టన్ ర్యాండ్' నుండి ర్యాండ్ పదాన్ని కలిపి "అయాన్ ర్యాండ్"గా పేరు మార్చుకుంది.

వ్యక్తి స్వేచ్ఛ ముందు మిగితావన్నీ దిగదుడుపే అని నమ్మే అయాన్‌కు రష్యా పరిస్థితులలో ఇమడలేకపోయింది. 1925లో







అమెరికా పయనమైనది. అక్కడ కాలిఫోర్నియాలోని హాలీవుడ్‌లో కాలుమోపింది. సిసిల్ బి. డియెల్లీ దర్శకుని చలువతో ఒక మూకీ చిత్రంలో ఎక్స్‌ట్రా పాత్ర పోషించింది. 1929లో ఫ్రాంక్ ఓ'కానర్ అనే నటునితో పరిచయం, ప్రేమ, పెళ్లి జరిగిపోయాయి. 1931 నుండి అమెరికన్ పౌరసత్వం పొంది అమెరికన్ వలే జీవించింది.

అయాన్ 1932లో యూనివర్సల్ స్టూడియోస్ వారి చిత్రం "రెడ్‌పాన్"కు స్క్రీన్‌ప్లే సమకూర్చింది. అయాన్ ర్యాండ్ పేరు తననీ ప్రపంచంలో రానురాను బాగా ఆమోదించబడింది. 1936లో తన జీవిత కథ అని చెప్పుకునే "వుయ్‌ది లివింగ్" ప్రచురించింది. రష్యాలో సిద్ధాంతాల పట్ల వ్యతిరేకత, ఆ సిద్ధాంతాల అమలు వల్లా అణగిపోతున్న వ్యక్తి స్వేచ్ఛను ప్రత్యక్షంగా అనుభవించిన ఆమె తన అభిప్రాయాలు, అనుభవాలను కాల్పనిక రూపంలో ఈ నవలలో అందించారు.

1940లో జరిగిన అమెరికన్ అధ్యక్ష ఎన్నికలలో రిపబ్లికన్ పార్టీ తరపున వెండెల్ విల్కీకి మద్దతునిచ్చాడు అయాన్ భర్త ఓకానర్. ఇదే కాలంలో అయాన్ కూడా బహిరంగ ప్రదేశాలలో చేసిన ప్రసంగాలు ప్రజలను ఆకట్టుకున్నాయి. ఈ కాలంలో ఆమె ఎందరో ప్రముఖులతో పరిచయాలు కలిగాయి.

1943లో ఆమె రాసిన రొమాంటిక్, తాత్త్విక నవల "ఫౌంటెన్‌హెడ్" ప్రచురితమైంది. ఈ రచనకు ఏడు సంవత్సరాలు పట్టింది. దాదాపు పదహారు మంది పబ్లిషర్స్ తిరస్కరించిన నవల ఇది. ఇదే నవల సినిమాగా కూడా వచ్చింది.

"ఫౌంటెన్‌హెడ్' పేరు కన్నా ముందు "సెకండ్ హాండ్ లైవ్స్" అన్నపేరు పెట్టింది. కానీ ఈ పేరే నచ్చలేదు. ఈ నవలకు ప్రేరణగా "స్కైస్క్రాపర్" అన్న సినిమాకు రాసిన స్క్రీన్‌ప్లే. దానిని దర్శకుడు తిరస్కరించాడు. దాన్ని కొంత మార్చి రాసినదే ఈ నవల. ఇందులో ఆమె "ఆర్కిటెక్ట్" విద్య గురించి క్షుణ్ణంగా తెలుసుకొని ఈ రచన చేసింది. ఈ నవలలో ప్రధాన నాయకుడు హొవార్డ్ రోర్క్ ఒక ఆర్కిటెక్ట్. తను అనుకున్న రీతిలో నిర్మాణాలు చేస్తుంటారు కానీ సమాజం తాను కోరిన రీతిలో నిర్మాణం జరగాలని కోరుకుంటుంది. ఒత్తిళ్లకు లొంగకుండా తనకు నచ్చిన రీతిలో పనిచేసి మెప్పిస్తాడు. పీటర్ కీటింగ్, డొమెనెక్, ఫ్రాంకన్, గెయిల్‌వైండ్, ఎల్స్‌వర్త్‌టూహే వంటి పాత్రలున్న నవల ఇది.

ఇందులో ఎల్స్‌వర్త్‌టూహేను హెరల్డ్‌లాస్కీని ఆదర్శంగా తీసుకుని మలచింది. టూహే కళావిమర్శ వ్యాసాలు రాస్తుంటాడు. ఈనవల ప్రపంచాన్ని ఉర్రూతలూపింది. ఈ నవల విజయంతో అమెరికాలో ఆబ్జెక్టివిజం స్కూళ్లు ప్రారంభమయ్యాయి. "ఫౌంటెన్ హెడ్" నవల దాదాపు ఆరున్నరమిలియన్ కాపీలు అమ్ముడయ్యాయి






ఇంగ్లీషులోనే కాక, అనేక భాషల్లోకి అనువదించబడింది.

అయాన్ ర్యాండ్ "ఫౌంటెన్ హెడ్" ఇచ్చిన ఉత్సాహంతో, మరింత ఆత్మవిశ్వాసంతో తన మరో పుస్తకం "అట్లాస్ ష్రగ్డ్"ను 1957లో విడుదల చేసింది. తన సిద్ధాంతాలను మరింత ప్రోది చేస్తూ ఈ నవల రచించింది.

ఈ నవలలో తన తాత్వికతను చెప్పదలచుకున్నంతా చెప్పింది. కాల్పానికతతో రచించింది. ఇందులో ప్రధాన ఇతివృత్తం "మనిషిలోనున్న మస్తిష్కం యొక్క పాత్ర గురించి చర్చించింది. ఈ నవల మూడు భాగాలుగా పది అధ్యాయాలుగా విభజించబడింది. రాబర్ట్ జేమ్స్ బెందినిట్టో విమర్శచేస్తూ మూడు భాగాలు, మూడు అరిస్టాటిల్ తార్కిక సూత్రాలుగా పేర్కొంటాడు. జస్టిన్ రైమండ్ "అట్లాస్‌ష్రగ్డ్" నవలను 1922 లోనే విడుదలయిన "ది డ్రైవర్" అన్న గారట్ గ్యారట్ నవలతో పోలిక చెబుతాడు.

ఈ నవలకు తొలుత "దిస్ట్రైక్" అని పేరు పెట్టాలనుకుంది . కానీ తరువాత ఒక తాత్విక భూమికతో "అట్లాస్‌ష్రగ్డ్" అని పేరు పెట్టింది. ఇందులో జాన్‌గాల్ట్ అనే పాత్ర ద్వారా తన సిద్ధాంతాలను, తన తత్వాన్ని ప్రపంచానికి చాటి చెప్పింది. ఇందులో డాగ్నిటగెట్ నాయిక పాత్ర. హంక్ రేర్‌డన్, ఫ్రాన్సిస్కో ది' అనకోనియా, రాగ్నర్ డానిజోల్, జేమ్స్‌టగెట్ ఇతర పాత్రలు.

అయాన్ ర్యాండ్ 1936లో "వుయ్‌దిలివింగ్; 1938 "ఆంథమ్" 1943 ఫౌంటెన్‌హెడ్"; 1957లో "అట్లాస్‌ష్రగ్డ్" రచించింది. నాలుగవది చివరి నవల "అట్లాస్‌ష్రగ్డ్"తో ఆమె జీవితంలో శూన్య భావన ఏర్పడింది. ఇక రాసేందుకు మిగిలిఏమీలేదు, ఇంతకాలం తనలో అనగిఉన్న అసంతృప్తులు అన్నీ బయటకు వచ్చాయి. ఫలితంగా లైంగిక అసంతృప్తులు చోటు చేసుకున్నాయి. తన కంటే ముప్పై సంవత్సరాలు చిన్నవాడైన నాథానియల్ బ్రాండెన్‌తో కలిసి జీవించింది. అతను పెళ్లయినవాడు. ఇరువైపులా ఇటు అయాన్ భర్త, నాథానియల్ భార్య యొక్క అనుమతితో అయాన్, నాథానియల్‌తో సంబంధం ఏర్పరచుకుంది.

1958లో 'నాథానియల్ బ్రాండెన్ సంస్థ ఏర్పాటుచేసి అయాన్ ర్యాండ్ సిద్ధాంతాలు ప్రచారం చేయబడినాయి. 1964లో నాథానియల్, సినీ నాయిక పెట్రీషియా స్కాట్‌తో సంబంధం ఏర్పరచుకొని వివాహం కూడా చేసుకున్నాడు. అయాన్ ర్యాండ్ మరింత కృంగిపోయింది. 1968 నుండి నాథానియల్‌తో సంబంధాలు పూర్తిరద్దు చేసుకుంది. ఏర్పాటు చేసిన అబ్జెక్టివిజం స్కూళ్లు రద్దయ్యాయి. 1970 నుండి మొత్తం కార్యకలాపాలు తగ్గిపోయాయి. అధికంగా పొగత్రాగటం వల్లా అయాన్ ర్యాండ్ ఊపిరితిత్తుల క్యాన్సర్‌తో బాధపడేది.

అయాన్ ఇల్లు వదిలి బయటకు ఎక్కువ వచ్చేది కాదు. ఎప్పుడైనా ప్రసంగాలు చేస్తుండేది. 1979లో అయాన్ భర్త ఓకానర్ మరణించాడు. తను పూర్తిగా ఒంటరి వ్యక్తి అయిపోయింది. 1982 మార్చి 6వ తేదీన గుండెపోటుతో న్యూయార్క్‌లోని తన ఇంటనే కన్నుమూసింది.

నాలుగు నవలలు, నాలుగు సినిమా స్క్రీన్‌ప్లేలు, ఆరు వ్యాస సంపుటాలు, ఆరు తన తాత్విక చెప్పు గ్రంథాలు, ఇంకా ఎన్నో ప్రసంగాలు చేసిన ర్యాండ్ తనదైన రీతిలో జీవించింది. ఏవిషయంలోనూ రాజీపడలేదు. ఆమె నవలలు ఆమె ఆలోచనలనే కాదు, ఆమె జీవితాన్ని ప్రతిబింబించాయి. ఆమె వల్ల వ్యక్తి గతంగా నష్టపోయిన వారు కూడా ఆమెను ద్వేషించలేదు. ఆదే ఆయాన్ ర్యాండ్ గొప్పతనం. ఆమె ఆలోచనలను గౌరవించారు. ఆమె ఆశయాలు అభిమానించారు. దీపం వెలుగునిస్తుంది కానీ దీపం క్రిందనే నీడ ఉంటుందన్నది అయాన్ జీవితానికి చక్కని ఉ దాహరణ.

*email: venkataramana_lanka@yahoo.com*

# మెలిమి ముత్యాలు-మంచెం చిత్రాలు

- వెంటపల్లి సత్యనారాయణ


మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావు

"ఉప్పొంగే ఉత్సాహం నీదైనప్పుడు ఉవ్వెత్తున ఎదురయ్యే అవరోధాలెన్నైనా నీకు దాసోహాలే" కారణం...

ఆ ఉత్సాహం అతని బాధ్యతను విస్మరించేది కాదు. ఆ బాధ్యతను మరింత పెంచేదే గాక తన వృత్తికీ, పనిచేసే సంస్థకూ మరెంతో వన్నె తెచ్చేది. ఎంతో మంది వృత్తి కళాకారులు సైతం సాధించలేని ఆ ఘణతను అతని ఉత్సాహం సాధించింది. ఎన్నో అవార్డులు, మరెన్నో రివార్డులు సాధించి పెట్టింది. సమర్ధమైన, సృజనాత్మకమైన అధికారిగా జాతీయ స్థాయిలోనే తన సంస్థకు అత్యుత్తమ అవార్డును సాధించేలా చేసింది. అంతేకాదు సున్నితము, సౌహార్ధంతో నిండిన అతని హృదయకుంచె గీసిన సన్నని సౌకుమార్యమైన రేఖలు ఆహ్లాదకర వర్ణాలతో నిండిన అతని చిత్రాలను చూసిన ఎవరికైనా హృదయం తేలికపడుతుంది. ఆనందపడుతుంది. ఆహ్లాదభరితమౌతుంది. కారణం అతని చిత్రాల్లో ఆధునికత పేరుతో నేడు చూస్తున్న గజిబిజి రేఖలు, అర్ధరహిత ఆడంబర వర్ణాలు లేవు. సునిశితమైన రేఖలు, వాటితో రూపొందించిన అర్ధవంతమైన చిత్రాలు, వాటి మధ్య నింపిన ఆహ్లాదకర వర్ణాలు వెరసి అంతరిస్తున్న మన ప్రాచీన సంస్కృతి సాంప్రదాయాలు, వృత్తులు, జానపదాలు, గ్రామీణ జనజీవన సౌందర్యానికి అద్దంపట్టే అందమైన చిత్రాలు... వీటిని సృష్టించింది చిత్రకళనే వృత్తిగా భావించిన ప్రొఫెషనల్ చిత్రకారుడు కాదు. చిత్రకళను ప్రవృత్తిగా మాత్రమే తీసుకుంటూ ఎల్లవేళలా ఆర్ధిక లావాదేవీలతో తీరిక లేకుండా గడిపే ఓ బ్యాంక్ ఉద్యోగి. అతనే తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్రవరం ఆంధ్రాబ్యాంక్ గ్రామీణాభివృద్ధి శాఖ సంచాలకుడుగా పనిచేస్తున్న మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావు గారు.





అది 2008వ సంవత్సరం, జనవరి నెల, విశాఖజిల్లా అడపా చిత్రకళా పరిషత్ నర్సీపట్నం వారు నిర్వహిస్తున్న రాష్ట్రస్థాయి చిత్రకళాపోటీలు, కేవలం ప్రదర్శనా బహుమతి మాత్రమే దక్కిన నేను, మూడవ బహుమతిని సాధించిన నా మిత్రుడు బీర శ్రీనివాస్ ఇరువురం నర్సీపట్నం వెళ్లాం. ప్రదర్శనలో ఉంచిన రాష్ట్ర నలుమూలల నుండి వచ్చిన వివిధ చిత్రకారుల చిత్రాలను ఒక్కొక్కటే చూసుకుంటూ వస్తున్నాం. ఒక్కొక్కటి ఒక్కోశైలి. ఆయిల్, ఏక్రలిక్, జల మరియు పేస్టల్ వర్ణాలతో రియలిస్టిక్, సర్రియలిస్టిక్, ప్రకృతి చిత్రాలు, పురాణ చిత్రాలు, ఆలోచింపజేసే చిత్రాలు, గ్రామీణ జీవన నేపథ్య చిత్రాలు రకరకాల విషయాలు, రకరకాల మాధ్యమాలతో వేసిన చిత్రాలు వేటికవే ప్రత్యేకంగా కనిస్తున్నాయి. కానీ వాటన్నింటితోనూ మరింత ప్రత్యేకంగా ఓ రెండు చిత్రాలు అక్కడ అందరి దృష్టినీ ఆకర్షిస్తున్నాయి. ప్రత్యేకమైన గొప్ప విషయం ఏమీ ఆ చిత్రాల్లో లేదు, ఒకటి పురాణ సంబంధమైతే రెండోది సాంప్రదాయ బద్ధమైంది. కానీ వాటిల్లో మరేదో ప్రత్యేకత చూసిన ప్రతీ ఒక్కరినీ ఆకర్షించేలా చేస్తున్నాయి. కేవలం కలంతో మాత్రమే సాధ్యమయ్యే సన్నటి రేఖలు, అతను కుంచెతో గీయడం ఒక ఎత్తైతే, ఆ చిత్రాల్లోని రేఖలమధ్య పారదర్శకంగా పూసిన ఆ రంగులు మిగిలిన వాటికంటే చాలా ప్రకాశవంతంగా కనిపించడం మరో ఎత్తు. తరచి తరచి చూస్తుంటే ఆ చిత్రాల్లో కనిపిస్తున్న ఆ ప్రత్యేకతకు కారణం ఆయన రంగులు వాడే విధానంలోనే కనిపిస్తుంది. అదే వాష్ టెక్నిక్.

ఒక వర్ణం పూసిన తదుపరి దాన్ని కడిగి వేరొక వర్ణం పదే పదే పూసి వాష్ చేయడం ద్వారా చివరిగా పూసిన వర్ణాలకు తోడు అక్కడ పూర్వపు వర్ణాల తాలూకు ఛాయలు కూడా సూచాయగా కనిపించడం ద్వారా ఒక ప్రత్యేక శోభ ఆ చిత్రాల్లో కనిపిస్తుంది. అది కూడా బ్రష్‌తో రంగులు అద్దే మాదిరిగా కాకుండా అత్యంత సహజంగా ఉండే ఆ వర్ణ మాధుర్యం చూసే కంటికి చాలా హాయిగా అనిపిస్తుంది. రాష్ట్ర వ్యాప్తంగా ఆ పోటీకి వచ్చిన వందల చిత్రాల్లో ప్రథమ బహుమతిని సొంతం చేసుకున్న ఆ చిత్రాల తాలూకు చిత్రకారుడిని అభినందించి పరిచయం చేసుకున్నాం. అప్పటికే ఆయన ఆంధ్రాబ్యాంక్ హైదరాబాద్ ప్రధాన కార్యాలయంలో సీనియర్ మేనేజర్‌గా పనిచేస్తున్నారు కానీ ఆ హెూదా తాలూకు డాబు, దర్పం ఏమీ అతనిలో కనిపించకుండా అతి సామాన్యంగా గంటల తరబడి ఆయన మాతో మాట్లాడిన తీరు మాకు చాలా సంతోషమనిపించింది. అంతే అప్పటి నుండి మాకు పరిచయం రోజు రోజుకూ పెరుగుతూ వచ్చింది.

ఒకప్పుడు చైనా, జపాన్ చిత్రకారులు వాడే వాష్ టెక్నిక్‌ను బెంగాల్ చిత్రకారులు నందలాల్‌బోస్ తదితరులు బాగా వ్యాప్తిలోకి తీసుకురాగా మనరాష్ట్రంలో దామెర్ల, రాజాజీ, భగీరధి, వరదా వెంకటరత్నంతో పాటు ఇటీవలనే మరణించిన కొండపల్లి శేషగిరిరావు ఆయన మరో శిష్యుడు "ఉల్చి"గా ప్రాచూర్యం పొందిన రెడ్డిబోయిన కృష్ణమూర్తిలు విరివిగా ఉపయోగించగా పూర్తిగా ఈ విశిష్ఠ కళా ప్రక్రియలోనే నేడు ఎక్కువగా చిత్రాలు వేస్తున్న విశిష్ఠ చిత్రకారుడు మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావు గారు. నేడు చిత్రకళాపాఠశాలల్లో విద్య నేరుస్తున్న విద్యార్థులకు సైతం తెలియని ఈ విశిష్ఠ కళాప్రక్రియనుపయోగించి విరివిగా చిత్రాలను వేస్తున్నది నేడు రాష్ట్రంలో మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావుగారే అన్నా ఆశ్చర్యపోనక్కరలేదు.

ఎంతో క్వాలిటీతో కూడుకున్న వాట్‌మన్ డ్రాయింగ్ షీట్స్‌పై ఖరీదైన విన్సర్ అండ్ న్యూటన్ కంపెనీ రంగు బిల్లలను మాత్రమే ఉపయోగించి చిత్రాలను వేయడం ఈయన ప్రత్యేకత. వృత్తి రీత్యా తీరిక లేకున్నప్పటికీ, ప్రవృత్తి పరమైన దాహార్తిని తీర్చుకునే క్రమంలో వీలుచిక్కినప్పుడల్లా తాను ఊహించిన బొమ్మల తాలూకు చిత్రాల్ని గీసుకోవడం, రోజుల తరబడి నిదానంగా సంతృప్తి అనిపించే వరకూ వేరొక చిత్రం వైపు పోకుండా ఏకాగ్రతతో చిత్రాల్ని వేయడం వలన ఆయన చిత్రాలు అంతప్రామాణికంగా కనిపిస్తాయి. మంచెంగారి చిత్రాల్లో ప్రధానంగా మనకు మూడు రకాల వస్తువు కనిపిస్తుంది. తరతారలుగా మన సంస్కృతిలో ఇమిడిపోయిన ఆచారాలకు సంబంధించిన దేవుళ్ళ ఊరేగింపులు, సమర్పణలు, మొక్కుబడులు, గరగాటలు, మామిడితోరణ అలంకరణలు, పేరంటాల్లు లాంటి చిత్రాలు ఒకరమైనవైతే గ్రామీణ జీవన సౌందర్యాన్ని ప్రతిబింబించే గొర్రెల కాపరులు, విజటబుల్ సెల్లర్స్, జాలరస్త్రీలు, బేంగిల్ సెల్లర్స్, గ్రామీణ కళారూపాలను తయారీ కళాకారులు, పాట్ పెయింటర్స్ లాంటివి ఇంకోరకం. ఇక చారిత్రక, మతపరమైనవి మూడోరకం. వీటిలో చరకుడు, దన్వంతరి, బౌద్ధజాతక కథలకు సంబంధించిన చిత్రాలు కొన్నైతే పురాణాలకు సంబంధించిన గణపతి, సరస్వతి, శివపార్వతి సమేత గణనాదులు లాంటి చిత్రాలు ఈ కోవలోకి వస్తాయి. చిత్రించే కళారూపం ఏదైనా ఆయన అందుకు ఉపయోగించే విధానం మాత్రం ఒక్కటే. అదే వాష్ టెక్నిక్. ప్రతిచిత్రం సన్నటి రేఖలతో చిత్రించిన తదుపరి ఆయా రేఖల మధ్య పారదర్శకంగా పొరలు పొరలుగా రంగులు పూసి చిత్రాన్ని ప్రకాశవంతంగా తీర్చిదిద్దడం ఆయన శైలి.

మంచెం గారితో వ్యాసరచయిత వెంటపల్లి



“దిష్టిబొమ్మలు” అన్న చిత్రంలో దంపతులిరువురు ఇంట్లో కూర్చుని ఆ కళారూపాలను రూపొందిస్తున్న ఆ సన్నివేశంలో వారు కూర్చున్న శైలి చూడచక్కగా వుంటే వారి గృహానికి వేలాడివున్న బూడిద గుమ్మడి ఉట్లు మన పాతకాలం నాటి గ్రామాలను గుర్తుకు తెస్తాయి. అలాగే అవిరేణి అనే చిత్రంలో ఒకప్పటి పెళ్ళిళ్ళ తంతులో ప్రముఖ స్థానాన్ని కలిగియుండే అవిరేణి కుండల తయారీ చిత్రం చూస్తున్నప్పుడు మన గ్రామీణ కళాసౌందర్యం గుర్తుకొస్తుంది. మిత్రులు అన్న వేరొక చిత్రంలో నేటి తనరానికి అసలు ఏమాత్రం తెలియని గుబ్బగొడుగులను చిత్రించి మరలా మన గత కాలాన్ని గుర్తుకుతెస్తారు.

శ్రీమతి మంచెం అమ్మాజీ, ధర్మా గణపతిరావు దంపతులకు 26.మే,1957న తూర్పుగోదావరి జిల్లా కాకినాడ సముద్రతీర ప్రాంతమైన ‘‘నేమాం’’ అనే గ్రామంలో జన్మించిన సుబ్రమ్మణ్యేశ్వరరావుకి బడిలో బలపం పట్టిన నాడే ఏర్పడ్డ చిత్రకళా ఆసక్తిని వరహాలమ్మ అనే ఆయన పెద్దమ్మ మెచ్చుకునేది.

హైస్కూల్‌లో ఉండగా చిత్రకళలో పద్మశ్రీ అవార్డు గ్రహీత తాడేపల్లి వెంకన్న అనే డ్రాయింగ్ టీచర్ చిత్రకళలో మెళకువలు నేర్పిస్తే, అంటార్కిటికా యాత్రలు లాంటి సాహసకార్యాలు చేసిన తన అన్న వెంకటరాయుడు మరియు అతని మిత్రులు విదేశాలు వెళ్ళినప్పుడల్లా అక్కడి రంగులు తెచ్చిఇచ్చి మంచెంను ప్రోత్సహించారు. ఇంటర్‌మీడియట్‌లో వుండగా నీటిరంగుల్లో శివాజీ గెటప్‌లో ఉన్న శివాజీ గణేషన్‌ను వేసిన చిత్రాన్ని అప్పటి ఆయన కెమిస్ట్రీ లెక్చరర్ శ్రీ శాస్త్రిగారు ప్రేమ్ చేయించుకుని ఇంట్లో పెట్టుకోవడం, అలాగే తన బైపీసీ రికార్డులను కళాశాలలో స్పెసిమన్స్‌గా ఉపయోగించడం మరచిపోలేని అనుభూతులుగా ఆయన పేర్కొంటారు. చిన్నతనంలో అతని బొమ్మల పిచ్చి వలన చదువు నిర్లక్ష్యం అవుతుందనే ఉద్దేశ్యంతో తన తండ్రి ప్రత్యక్షంగా ప్రోత్సహించకపోయినప్పటికీ పరోక్షంగా మెచ్చుకోవడం గమినించిన మంచెం గారు అటు చదువు, ఇటు చిత్రకళ వేటినీ నిర్లక్ష్యం చేయకుండా రెండింటినీ సమతూకం చేసుకుంటూ ముందుకు వెళ్ళారు. గోదావరి జిల్లాకి చెందిన వ్యక్తి కావడంతో రాజమండ్రిలోని దామెర్ల రామారావు స్మారక చిత్రకళాశాలలోని దామెర్ల రామారావు చిత్రాలు, అడవి బాపిరాజు, అంట్యాకుల పైడిరాజు తదితరుల చిత్రాలలోని శైలి ఆయనను మొదట్లో బాగా ప్రభావితం చేసాయి. 1974లో అగ్రికల్చరల్ బి.యస్సీ చదివేందుకు బాపట్ల వ్యవసాయ కళాశాలలో చేరడంతో చిత్రకళలో ఆయనకు గొప్ప మలుపు తిరిగిందని చెప్పవచ్చు. కారణం అక్కడే ఆయనలో వాష్ టెక్నిక్ అనే కళాప్రక్రియకు బీజం పడింది. చిత్రకళకు సంబంధించి బహుళ ప్రయోగాలతో ఎన్నో అద్భుతాలు సృష్టించడంతో పాటు వాస్ టెక్నిక్‌లో అప్పటికే ఎన్నో గొప్ప చిత్రాలను సృజించిన ప్రఖ్యాత చిత్రకారుడు స్వర్గీయ ఉల్పి అక్కడ చిత్రకళాచార్యులుగా ఉండడంతో ఆయనతో ఏర్పడ్డ సాహచర్యంతో వాష్ టెక్కిక్‌లో చిత్రాలు వేయడం నేర్చుకున్నారు. ఆ శైలి ఆయనకు నచ్చడం, దానిపై మంచి పట్టు సాధించిన మంచెం నిరంతరంగా ఆ తరహాలో వందల చిత్రాలను వేస్తూనే వున్నారు.

ఇప్పటికే 2010లో రవీంద్ర భారతి ఐ.సి.సి.ఆర్. ఆర్ట్‌గ్యాలరీ హైదరాబాద్, 2011లో స్టేట్ ఆర్ట్‌గేలరీ హైదరాబాద్‌తో పాటు అనేక చోట్ల వ్యక్తిగత చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించిన ఆయన చిత్రాల్లో అనేకం రాష్ట్రంలోనూ, రాష్ట్రేతర ప్రాంతాలలోనూ అనేక ఉత్తమ బహుమతులందుకోవడం విశేషం.

2007లో ప్రఖ్యాత హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ ప్రవేశపెట్టిన తొలి గోల్డ్‌మెడల్ సాధించిన ఘణతను దక్కించుకున్న మంచెం 1997 మరియు 2006లో లలికళాపరిషత్ విశాఖపట్నం వారి పోటీల్లో బెస్ట్ అవార్డ్‌ను అందుకున్నారు. ఇక 1996వ సం॥లో లలితకళా కేంద్రం బాపట్ల, హరివిల్లు ఆర్ట్ అకాడమీ పాలకొల్లు 1999లో కోనసీమ చిత్రకళాపరిషత్ అమలాపురం మరియు వి.ఎన్.ఎన్. ఆర్ట్ గేలరీ విశాఖపట్నం వారి జాతీయ చిత్రకళాపోటీలలోనూ 2002లో అంకాలా ఆర్ట్స్ అకాడమీ భీమవరం, 2003 మరియు 2005, 2008లో అడపా చిత్రకళాపరిషత్ నర్సీపట్నంల నుండి మొదటి బహుమతులను కైవశం చేసుకున్నారు. 2005లో ఉగాది సందర్భంగా రాష్ట్ర











సాంస్కృతిక శాఖ ఆంధ్రప్రదేశ్ నిర్వహించిన రాష్ట్ర స్థాయి చిత్రకళా పోటీల్లో కూడా ప్రథమ బహుమతిగా ప్రకటించిన 5వేల రూపాలయ కేష్ అవార్డ్‌ను మంచెం వేసిన చిత్రమే సొంతం చేసుకోవడం, ఆ తదుపరి అదే చిత్రం ఆంధ్రప్రదేశ్ పత్రిక ముఖచిత్రంగా రావడం విశేషం. అంతేగాక రాష్ట్రప్రభుత్వం చిత్రకళలో ప్రతీయేట ఇచ్చే 10వేల రూపాయలు కేష్ అవార్డును కూడా 2010లో మంచెం గారు అందుకున్నారు. ఇంకా వీరి చిత్రాలు కాళిదాస్ సాంస్కృతిక అకాడమీ ఉజ్జయిని, (2010) సౌత్‌సెంట్రల్ జోన్ కల్చరల్ అకాడమీ నాగపూర్, తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ తదితరమైన చోట్ల ప్రదర్శించబడి వున్నాయి.

ఇక వ్యర్థాలనుండి అర్థాలను తీయాలనే సంకల్పంతో మాడేడుమిల్లి, అడ్డతీగల, వైరామవరం లాంటి మన్యప్రాంతాల్లో విరివిగా లభించెడి వెదురు డొప్పలతో కళాత్మకమైన "బాంబూ బౌల్స్" తయారుచేయించి అక్కడ గిరిజనానికి ఉపాధి కల్పించడం, బధిరులు తదితర నిరుద్యోగులకు కంప్యూటర్, హార్డ్‌వేర్ మరియు వివిధరకాల వృత్తివిద్యా శిక్షణలు ఇప్పించి వారికి స్వయం ఉపాధి మార్గాలను చూపించడం లాంటి పలు కార్యకళాపాల ద్వారా తన సృజనాత్మకతను కేవలం తన ప్రవృత్తిలోనే గాక, వృత్తిపరమైన అంశాలకు కూడా జోడిస్తూ అద్భుతాలు సృష్టించడం ద్వారా తాను పనిచేస్తున్న ఆంధ్రాబ్యాంకు గ్రామీణాభివృద్ధి సంస్థ రాజమండ్రి యావత్ భారతదేశంలోనే అత్యుత్తమమైన సంస్థగా ఎంపికయ్యేలా చేసిన ఘణతను మంచెం సొంతం చేసుకున్నారు. ఇటీవలనే జాతీయ స్థాయిలో సాధించిన ఆ అత్యుత్తమ అవార్డును కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులు జైరాం రమేష్ చేతులమీదుగా ఆయన న్యూఢిల్లీలో గత ఆగస్టు నెలలో అందుకోవడం జరిగింది.




జైరాం రమేష్ చేతుల మీదుగా అవార్డు అందుకుంటున్న మంచెం గారు

ఇటు వృత్తి, అటు ప్రవృత్తి రెండింటా సృజనాత్మకంగా ముందుకు సాగుతున్న మంచెం గారి కళా ప్రస్థానంలో తన భార్య శ్రీమతి సత్యాదేవి పిల్లలు రశ్మి, మరియు తేజల ప్రోత్సాహం మరువలేనిదని, వారే తన చిత్రాలకు మొదటి విమర్శకులని ఆయన చెప్తారు. పిల్లలు ఇరువురు సంగీతంలో, చిత్రకళల్లో రాణించడం విశేషం.

ఇక తన కళాజీవన యానంలో సాధించిన ఎన్నో విజయాలకు సైతం ఎలాంటి ఆడంబర ప్రచారాలకు తావివ్వక, ప్రశాంత జీవనదిలా ముందుకు సాగుతున్న మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావుగారి జీవన నడవడి ఒరవడి ఎందరికో ఆదర్శనీయం.

email: snventapalli@gmail.com

# విలక్షణమైన కలెక్షన్

- వెంటపల్లి సత్యనారాయణ


గంగావతారం

***కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల కాదేది కవితకు అనర్హం అన్నారు శ్రీశ్రీ దాదాపు 80 ఏళ్ళక్రితం, స్పందించే గుణం, ఆస్వాదించే లక్షణం, ప్రాముఖ్యతను గుర్తించే మనసు ఉన్నప్పుడు ప్రతీదీ ముఖ్యమైనదే. అలా తాను చూసిన, చదివిన అన్ని విషయాల ప్రాధాన్యతను గుర్తించి వాటి ప్రాముఖ్యతను భావితరాలకు అందించాలనే సంకల్పంతో ప్రతీ అంశాన్ని విషయాల వారీగా 60 ఏళ్ళుగా చక్కని ఫైళ్లలో భద్రపరచి అందరినీ ఆశ్చర్యపరుస్తున్న రాజమండ్రికి చెందిన ఆ విశిష్ఠ వ్యక్తే 78 ఏళ్ళ నేలకంటి గంగావతారం గారు.***

అబ్రహం లింకన్ హత్య ఎప్పుడు ఎలా జరిగింది? మనకు స్వాతంత్ర్యం వచ్చిన ఆ ఉద్విగ్న క్షణాలు ఎలా గడిచాయి? 'మహాత్మాగాంధీజీ ఎలా హత్య చేయబడ్డాడు' సొంత అంగరక్షకుల చేతిలోనే హత్యకు గురైన ప్రధాని ఇందిర, ఆతరువాత మతఛాంధసవాదుల విధ్వంసానికి బలైన చారిత్రక నిర్మాణాలు-ఉద్రిక్త పరిస్థితులు, జాన్ ఎఫ్ కెనడీ హత్యోదంతం ఇలాంటి సంచలన సంఘటనలపై ఆనాటి పత్రికల కథనాలేమిటి? అప్పటి చిత్రాల లాంటి విషయాలతో పాటు ప్రపంచ ప్రసిద్ధి చెందిన నాయకులు, నాయకురాళ్లు, భవనాలు, చారిత్రక కట్టడాలు, పుణ్యక్షేత్రాలు, ఆచారాలు, సాంప్రదాయాలు, కవులు, కళాకారులు, చిత్రకారులు, శిల్పులు, వృత్తులు, వృత్తికళాకారులు, బాల మేధావులు, గాయకులు, సంగీతం, వంటలు, పాడి-పంట ఒకటేమిటి సకల సమాచారంతో ఆయన సేకరించిన విషయాలన్నింటిని అంశాల వారిగా చక్కని బౌండులుగా భద్రపరచి భావితరాలకు అందిస్తున్న ఓ అరుదైన వ్యక్తి నేలకంటి గంగావతారంగారు.



నిత్యం మనం దినపత్రికుల తిరగేస్తూ ఉంటాం. చదివి పారేస్తూ వుంటాం కొన్ని పేజీలు అలమరల్లోకి, కొన్ని పేజీలు పొట్లాలుగా ఇలా న్యూస్‌పేపర్‌ని అనేక రకాలుగా ఉపయోగిస్తూ వుంటాం. న్యూస్‌పేపర్‌లో ఏముందోనని మనమంతా ఆసక్తిగా చదువుతుంటే దానిలోని వార్తలే ఆసక్తిగా గంగావతారం గారి కంటిలో పడాలని ఎదురుచూస్తూ వుంటాయి. తమను గుర్తించమని వేడుకుంటాయి. ఆయన వాటిని గుర్తించడమే కాక



రూపొందించిన వాటిల్లో వివిధ శాస్త్రజ్ఞులు, ఇన్ఫోసిస్ ఫౌండేషన్ అధ్యక్షులు, 3వ సాలార్‌జంగ్, గాయకులలో ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి, రావు బాల సరస్వతి, ఘంటశాల, జేసుదాస్ వంటి 15మంది గాయకుల గురించి, అన్నమయ్య, చిలకమర్తి, శ్రీశ్రీ, తిరుపతి వేంకటకవులు, వాసిరెడ్డి, అబ్బూరి చాయాదేవి లాంటి పలు రచయితల గురించి, వివిధ కళారీతుల్లో పుల్కారీ ఎంబ్రాయిడరీ, పంజాబ్ మిథిలా పోక్ పెయింటింగ్, బీహార్ వారి వర్లి పెయింటింగ్, ఆంధ్రా వారి కొండపల్లి బొమ్మలు, చిత్రాలు మొదలగు సకల రాష్ట్రాల కళారీతులు వివిధ చిత్రకారుల, పరిచయ కథనాలు, నృత్యకారులు, సైకత శిల్పులు ఇంకా వివిధ దేశాల కరెన్సీ, నాణేలు, రకరకాల కెమేరాలు, ఫొటోగ్రాఫులు ఒకటేమిటి సకల విషయాలూ ఆయన సేకరణలో భద్రపరచి వున్నాయి.

మన భారతీయ ముఖ్య స్థలాల్లో మహాత్మా గాంధీ భవన్ గురించి, రాజమండ్రి పాల్ చౌక్, తంజావూర్ సరస్వతీ మహల్‌ల గురించిన వార్తలతో పాటు పెద్ద పెద్ద కాలెండర్‌లతో ప్రచురించబడ్డ జహంగీర్ పోర్ట్, రాయల్ పేలస్, కొల్హాపూర్ మదన్ మోహన్ టెంపుల్, జైన్‌టెంపుల్, జై సెల్మేర్ రంజిత్ విలాస్, గుజరాత్‌లోని జహంగీర్ మహల్, ఓర్చాలోని పాట్నా సాహెబ్, బీహార్ ముక్తేశ్వర్ టెంపుల్, వేలంగిణీ చర్చి వంటి చారిత్రక కట్టడాల చిత్రాలను పెద్ద ఫైల్‌గా మరికొన్ని చారిత్రక ప్రదేశాలతో మరో చిన్న ఫైల్ కూడా ఆయన రూపొందించారు.

సాధారణంగా ఒక జాతీయ అంతర్జాతీయ ప్రాముఖ్యతగల బధ్రంగా చేరదీసి అలంకరించి ఆ వార్తకి తగిన స్థానమిచ్చి శాశ్వతత్వాన్ని కల్పిస్తారు. సాధారణంగా కనిపించిన వార్త కూడా ఈయన సేకరణ లోకి చేరాక మళ్ళా మనకే అపురూపంగా కనిపిస్తుంది. అందుకు కారణం ఆయన దానికి ఇచ్చిన స్థానం, అందంగా అమర్చిన విధానం.

సేకరించడం, వివిధ రకాలు విభజించడం చక్కగా పుస్తకాల్లో అతికించడం లేదా పాలిథీన్ లీవ్స్‌లోకి చేర్చి తయారు చేయడం ఇదంతా చిన్ననాడే ఉన్నప్పటికీ తన కరణీకం పదవీ విరమణానంతరం ఓ మంచి వ్యాపకంలా మారింది. ఇలా కాలాన్ని సద్వినియోగపరుస్తూ మంచి మనసుతో అందరికీ నచ్చే వ్యక్తిగా మన్ననలందుకుంటున్న వీరు ప్రస్తుతం రాజమండ్రిలో వారి తనయుల ఇంట్లో వుంటూ ఇలాంటి ముఖ్యమైన వార్తలు సేకరించి భద్రపరుస్తున్నారు.

అలనాడు ఆకాశవాణి కళాకారుల ఫొటోల సేకరణతో 1963లో మొదలయిన ఈ అభిరుచి అమెరికా అధ్యక్షుడు జాన్‌ఎఫ్ కెన్నడీ హత్యోదంత వార్త నుండి మొదలుకొని నేటి హాయ్ బుజ్జీలోని కథల వరకూ సాగుతుంది. వీరి సేకరణలలోని రాజకీయ వార్తలను పరిశీలిస్తే మండలాధ్యక్షులు, జడ్పీటీసీలు, నియోజక వర్గాల-వాటి వివరాలు జిల్లాల వారీ ఎమ్.ఎల్.ఏలు స్వాతంత్ర్య ఉద్యమం నాటి ప్రముఖులు, దేశభక్తులు, అల్లూరి, టంగుటూరి, పుచ్చలపల్లి, నీలం, సత్యనారాయణ, గాంధీ, నెహ్రూ వంటి వివరాలు ఇందిర, రాజీవ్, పి.వి. నరసింహారావు లాంటి వ్యక్తుల గూర్చి ప్రత్యేక ఆల్బమ్స్, రాష్ట్రాల వారీ ముఖ్యమంత్రులు, గాంధీ, నెహ్రూ ఇందిర, సంజయ్,రాజీవ్, లాల్‌బహుదూర్ శాస్త్రిల మరణోదంతాలు అంతిమ యాత్రలు వీరి సేకరణలో మనం చూడవచ్చు.

ఇంకా మిలీనియం మహానుభావుల పేరుతో ప్రత్యేక ఫైల్స్‌గా






విషయాల గురించి ఆలోచించే వ్యక్తి, అమృతవాణి సూక్తులు, సామెతలు, తేనెటీగల పెంపకం, చిట్టిపొట్టి పిల్లల కథల సమాచారం గురించి ఆలోచించడం విచిత్ర మనిపిస్తుంది. ఆయన దృష్టిలో ప్రాముఖ్యం అనేది వ్యక్తి అవసరాల మీద ఆధారపడి ఉంటుందని, ఆ అవసరం అనుకున్న వ్యక్తికి కావల్సిన సమాచారం లభ్యంకానపుడు దాని విలువ ఏమిటో తెలుస్తుందని. అందుకే ప్రతీ విషయమూ దాని పరిధిలో ప్రాముఖ్యమైనదేనని అందుకే జాతీయ, అంతర్జాతీయ విషయాలకు ఎలాంటి ప్రాముఖ్యతతో భద్రపరుస్తారో హాస్యోక్తులు, ఉల్లి, అరటి, పుదీనా వంటివి ఆరోగ్యానికి ఎంతమేలు చేస్తాయో లాంటి కథనాలకు కూడా అంతే ప్రాముఖ్యతతో భద్రపరుస్తానంటారు.

శ్రీమతి సుబ్బాయమ్మ, చిన భద్రిరాజు దంపతులకు 08.3,1934న తూర్పుగోదావరి మురముళ్ళ అనే గ్రామంలో


*గంగావతారం గారితో రచయిత వెంటపల్లి, కుమార్తె పద్మ*

జన్మించిన గంగావతారంగారు జగ్గంపేట, పెద్దాపురాలలో విద్యాభ్యాసం చేసి, మర్రిపాక గ్రామకరణంగా ఉద్యోగం చేసారు. ఆయన ఉద్యోగంలో సైతం ప్రతిభావంతమైన ఉత్తమ కరణంగా పేరు పొందిన వీరి ఉత్తమసేవకు ప్రతిగా "రెడ్ ఎంట్రీ" అనే అవార్డును పొందియున్నారు. 1972లో కరణికం బాధ్యతలనుండి స్వచ్ఛంద పదవీ విరమణ చేసారు. ప్రఖ్యాత ప్రకృతి చిత్రకారుడు, ఆంధ్రాటర్నర్‌గా పేరు గాంచిన స్వర్గీయ వి.వి. భగీరథి గారికి స్వయానా వీరు సొంత అల్లుడు కాగా నేడు రాజమహేంద్రంలో చిత్రకళా పద్మాలను పూయిస్తున్న శ్రీమతి ఎన్.వి.పి.ఎస్.ఎస్. లక్ష్మి వీరి స్వంత కూతురు కావడం గమనార్హం.

ఇంకా వీరి సేకరణలో తెనాలి రామలింగ కవి శశ్వవిజయం, కవి చౌడప్ప శతకం లాంటి ప్రసిద్ధ శతకములు కూడా వుండగా మనకు చూడగానే ఆనందాన్ని ఆహ్లాదాన్ని కలిగించే అసంఖ్యాకమైన వివిధ రంగురంగుల వింత వింత పుష్పాలు మనోహర ప్రకృతి దృశ్యాలు, దేవతా చిత్రాలు, చిన్న పిల్లల వింత వింత బొమ్మలు గ్రీటింగ్ కార్డ్స్, ప్రఖ్యాత సంస్థలు కేలండర్‌ల రూపంలో ప్రచురించిన రాజారవివర్మ, బింద్రే, తారానగేష్ లాంటి చిత్రకారుల చిత్రాలు ఇలా ప్రతీదీ పెద్ద సైజు కేలండర్ స్థాయి నుండి చిన్న గ్రీటింగ్ కార్డు సైజు వరకూ ఆయన ఎన్నో ఫైల్సుగా ఆయన భద్రపరిచారు.

నేను వివిధ చిత్రకారులపై ఆర్టికల్స్ రాసే క్రమంలో రాజమండ్రిలోని ప్రముఖ చిత్రకారిణి శ్రీమతి లక్ష్మి గారి ఇంటిని సందర్శించినపుడు అక్కడ చిన్న పెద్ద రకరకాల సైజులలో బౌండులుగా పేర్చి ఉన్న ఫైల్సు చూసి అడిగినపుడు గంగావతారంగారి ఈ అపురూపమైన సేకరణ వెలుగులోకి వచ్చింది. శ్రీమతి లక్ష్మి గంగావతారం గారికి స్వయాన కుమార్తె. ఎంతో శ్రమకోర్చి వ్యయ ప్రయాసలతో ప్రతి చిన్న విషయాన్ని ఆయన అంశాల వారీగా అందమైన బౌండులుగా చేయించి పదిలపరిచిన తీరు చూసిన వారికెవ్వరికైనా ఆశ్చర్యాన్ని కలిగించకమానదు.

విజ్ఞానం వినోదంతో పాటు భావితరాలకు ఉపయోగపడాలి అన్న లక్ష్యంతో అందమైన హాబీగా చేస్తున్న గంగావతారం గారి ఈ అపురూపసేకరణ నిజంగా ఎంతో ఆదర్శవంతమైనది మరియు అభినందనీయమైనది.

*email: snventapalli@gmail.com*

# సంప్రదాయ కళకి సరికొత్త అందం టెర్రకోట

మట్టినే బొమ్మగా మలచి... బ్రహ్మ ప్రాణ ప్రతిష్ట చేసి మనిషిగా మలచాడన్నది మన భారతీయ సమాజ విశ్వాసం.

ఆ మట్టినే నమ్ముకుని... రైతుగా, కర్షకుడిలా... కుమ్మరిగా...జన బాహుళ్యానికి సర్వం అందిస్తూ అపరబ్రహ్మగా పేరు సంపాదించేసుకున్నాడు ఏనాడో... తొలకరితో పులకరించిన వేల మట్టిని రైతు హత్తుకుని మురిసి... కొత్త పంటలకు సిద్ధమైతే... ఆ మట్టినే మురిపెంగా లాలించి తన చేతుల కదలికలతో రూపాలనిచ్చి... మట్టి బొమ్మలతో యావత్ మానవాళినీ సమ్మోహితుల్ని చేసి... పరవశించిపోతాడు కుమ్మరి.

అతను సృష్టించిన రూపాలు మరుగునపడుతున్న క్రమంలో సంప్రదాయ కళకు కొత్తవన్నెలద్ది... ఆధునికతను రంగరించి పుట్టిన మరో అద్భుత కళ టెర్రకోట అందాలనటంలో సందేహం లేదెవ్వరికీ...

ప్లాస్టిక్ ప్రపంచాన్ని శాసించే స్థాయికి చేరుకున్న ఈ క్రమంలో తనని తాను బతికించుకునే క్రమంలో సాంప్రదాయ కళలు ఆధునికతని మేళవించుకుని కొత్త అందాలను సంతరించుకునేందుకు సిద్ధమయ్యాయన్నది వాస్తవం. లోహపాత్రల స్థానంలో మట్టిపాత్రలు వాడే అవకాశాలున్నా మక్కువ చూపని జనంని తమ వైపు తిప్పుకుని సంస్కృతిని ప్రతిబింబచేస్తూ... ఏదో తెలియని కొత్తదనం అనుభూతిని కలిపించేలా చేస్తూ...తమని నెట్టేస్తున్న ఫ్యాషన్ ప్రపంచాన్ని ధీటుగా ఎదుర్కొని, తాత ముత్తాతల నుండి వచ్చిన సాంప్రదాయంగా వస్తున్న కళను కాపాడుకునేందుకు యువతరం చేసిన కృషి ఫలితమే ఈ 'టెర్రకోట' అందాలు. రాజస్థాన్‌లో టెర్రకోట పేరుతో ఏకంగా ఓ ఊరే ఉందని... ఆ ఊరిలోనే ఈ బొమ్మల తయారీ ఎక్కువగా జరుగుతోందని.. దానివల్ల ఆ ఊరిపేరుతోనే ఈ బొమ్మల్ని పిలుస్తారని కొందరు చెప్తుంటారు. అయితే అది వాస్తవం కాదు. టెర్రకోట అనేపదం లాటిన్ భాషనుండి పుట్టిందని కొందరు. ఇటాలియన్ నుండి పుట్టిందన్న వాదనలు ఉన్నా, ఎందరికో ఉపాధి మాత్రం కలిపిస్తోందన్నది మాత్రం నిజం. టెర్రకోట అంటే కాల్చిన మట్టి అని అర్థం. ముదురుమట్టి రంగులో ఎరుపు, పసుపు వర్ణాలు జోడిస్తే... వచ్చే రంగులో ఉంటాయి. అయితే ఆయా ప్రాంతాలలో మట్టి ప్రభావం బట్టి కూడా కొత్తరంగులు సంతరించుకునే అవకాశాలున్నాయి. ఒకప్పుడు మనం ఎర్రపెంకులంటూ తెగ సందడిచేసే వాళ్లం కదా దాదాపు అదే తరహాలో రూపొందే ఈ టెర్రకోట మట్టి బొమ్మలు కుమ్మరి తిప్పి సారె చక్రంపై కాక పూర్తిగా చేతిపైనే ఆధారపడి చేస్తారు.



ప్రపంచానికి నాగరికత నేర్పిన మన భారతావనిలో ఈ టెర్రకోట మట్టి పాత్రలో సింధూనాగరికతలోనే కనిపించిందంటే



ఆశ్చర్యం కలగకమానదు. ఇప్పటికే పురావస్తుశాఖ జరిపిన అనేక తవ్వకాలలో ఈ తరహా పాత్రలు బైట పడటం చెప్పుకోదగ్గ విషయం. ముఖ్యంగా మనదేశ ఉత్తరప్రాంతంలో ఎక్కువగా టెర్రోట వస్తువుల తయారీ నిపుణులు ఉన్నారు. ఉత్తరప్రదేశ్, గుజరాత్, పశ్చిమబెంగాల్, మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లతో కుటీరపరిశ్రమైన కుమ్మరి వృత్తికి బాసటగా నిలిచిన ఈ టెర్రకోట నేడు తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌తో సహా మిగిలిన ప్రాంతాలకూ విస్తరించింది.

ఈ టెర్రకోట బొమ్మల్నే జీవనాధారం చేసుకుని రాజస్థాన్, ఉత్తరప్రదేశ్‌లకి చెందిన ఎందరో ఉపాధికి డోకాలేకుండా పోయిందని చెప్పారు.

### టెర్రకోట సైన్యం...

ఇప్పుడు మన కొత్తతరహా అందాలంటూ ఆనందిస్తున్న ఈ టెర్రకోట ప్రక్రియని క్రీస్తు పూర్వమే చైనాలోని మన పూర్వీకులు ప్రారంభించారంటే ఆశ్చర్యం కలగకమానదు. మీరు చదివింది నిజమే. చైనాలో పురావస్తుశాఖ జరిపిన తవ్వకాలలో ఈ టెర్రకోట సైన్యం బైటపడింది. క్రీస్తుపూర్వం చైనాను పాలించిన కిన్‌షి యుమాంగ్ తన మరణానంతరం కూడా జీవితం ఉంటుందని. తను చనిపోవటానికి ముందే ఏడు లక్షల మంది నిపుణులతో దాదాపు 38 ఏళ్ల పాటు శ్రమించి సమాధిని నిర్మింపచేసుకున్నాడు. టెర్రకోట ప్రక్రియలో రూపొందించిన గజతురగపదాతి దళాలు తమ ఆయుధాలతో సహా వెంట రాగా తన మరణం తరువాత కూడా ఆ పరివారంతో జీవిస్తారన్న విశ్వాసంతో ఆయన ఈ సమాధిని రూపొందించుకున్నట్లు చరిత్ర చెపుతోంది.

ఈ క్రమంలోనే రిమోట్ సెన్సింగ్ టెక్నాలజీ ఉపయోగించి ఈ సమాధిపై 90 అడుగుభవంతి నిర్మించారు. దీనిలో రాజుగారి ఆత్మ నిత్యం తిరుగుతూ ప్రజల బాగోగులు చూస్తుందని వారి విశ్వాసం. ఈ తవ్వకాలలో బైటపడ్డ రక్షకదళాలలో 8వేలకు పైగా సైనికుల బొమ్మలున్నాయి. వీటిలో ఏ ఇద్దరు సైనికులు ఒకే రూపంలో లేరంటే... నాటి సైనిక వ్యవస్థ ఎలా ఉండేదో అర్థం చేసుకోవచ్చని నిపుణులు చెప్తారు. ఇటీవల జరిగిన తవ్వకాలలో బైటపడ్డ ఈ సమాధి ఎన్నో కొత్త విషయాలను, నాటి రాజరిక వ్యవస్థపై ఎన్నో సమాధానాలను చెపుతోంది.

### టెర్రకోట బొమ్మలు చేసేదిలా...

చెరువు నుండి, కుంటల నుండి సేకరించిన మెత్తని బంకమట్టిని మరింత మెత్తబరిచి... దానికి తగు పాళ్లలో సన్నని ఇసుకని కలిపి కాళ్లతో బాగా తొక్కి బొమ్మలు తయారీకి అనువుగా తయారు చేసుకొంటారు. పూర్వం కుమ్మర్లు వాడే పారెలాంటి చక్రాలుపై ఈ మట్టిని ఉంచి అది తరుగుతుండగా... కావాల్సిన రీతులలో బొమ్మలని రూపొందించుకుని వారంరోజుల పాటు ఎండలో ఆరబెడతారు. ఆపై వాటిని కుమ్మరి బట్టీలలో కాల్చేందుకు తీసుకువెళ్తారు. ఇలా కాల్చేందుకు సాధారణంగా ఉపయోగించే కలప, ఊకస్థానంలో కొబ్బరిమట్టలు, ఎండు కలప, యూకలిప్టస్ ఆకులు తదితరాలు వాడతారు. బొమ్మ గట్టిదనం, కావాల్సిన రంగుల ఆధారంగా ఈ కాల్పు ఉంటుంది. మట్టిలోని ఐరన్ ఆక్సైడ్‌శాతం అనుసరించి ఆరెంజ్, ఎరుపు, గోధుమ వర్ణాలలో ఈ బొమ్మలు తయారవుతాయి. మరీ నలుపుదనంగా బొమ్మలు కావాలనుకుంటే బొమ్మల్ని మరోరోజు అదనంగా ఈ బట్టీలలో ఉంచుతారు. అయితే కొన్ని ప్రాంతాలలో లభ్యమయ్యే మట్టి కారణంగా పసుపు, గులాబీ, బూడిద వర్ణాలుగా కూడా బొమ్మలు తయారై కొత్త అందాలను సంతరించుకుంటాయి. ఇలా బట్టీల నుండి తీసుకువచ్చిన బొమ్మల ఆకారాలకు కాసిన్ని రంగులు, ఇతర నగిషీలు చేసి అమ్మకానికి సిద్ధం చేస్తారు.



నేడు చిన్న చిన్న గ్రామాలలోని ఇళ్లలో సైతం టెర్రకోట బొమ్మలు దర్శనమిస్తున్నాయంటే...జనం వీటిపై ఎంతలా మక్కువ ప్రదర్శిస్తున్నారో అర్థంచేసుకోవచ్చు. తొలినాళ్లలో కేవలం పూల మొక్కల పెంపకానికి వాడే కుండీలను మాత్రమే టెర్రకోటలో తయారు కాగా నేడు అనేక రూపాలు సంతరించుకుని కనువిందు చేస్తున్నాయి.

టెర్రకోట మట్టితో తయారైన బొమ్మల్లో పులులు, సింహాలు, ఏనుగులు, గుర్రాలు, కోతులు, లాంటి బొమ్మలనే కాదు అనేక దేవతామూర్తులను, గృహాలంకరణ వస్తువులతో అలరిస్తున్నాయి. చిన్న పట్టణాలలో జరిగే హస్తకళా ప్రదర్శనలలో నేడు టెర్రకోట అందాలు ఆకర్షిస్తూ... అధిక శాతం అమ్ముడు పోతున్నాయి.

**టెర్రకోటకు కేరాఫ్‌లు...**

టెర్రకోట అందాలకి ముందుగా గుర్తొచ్చేది రాజస్థాన్‌లోని మొయెలానే... ఇక్కడి వారి ద్వారానే ప్రపంచానికి ఈ కళ పరిచయమైందని చెప్తారు. మట్టి పాత్రలకు నగిషీలు చెక్కి, రంగులు వేసి ఆకర్షణీయంగా తయారు చేయటంలో వీరు సిద్ధహస్తులు. ఇక టెర్రకోట అశ్వాలంటే ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్‌దే పేరు. అలాగే ఆరు మీటర్ల ఎత్తున్న టెర్రకోట గుర్రాలను రూపొందించడంలో తంజావూరు కళాకారులు పెట్టింది పేరంటే ఆశ్చర్యం కలగకమానదు.

**బొమ్మలకే పరిమితం కాదు...**

ఏనుగులు, గుర్రాలు, మట్టి పాత్రలకే టెర్రకోట అందాలు పరిమితం కాలేదు. నేటి ఆధునికి యువతని దృష్టిలో ఉంచుకొని కొత్తపుంతలు తొక్కుతోంది. మట్టితో రూపొందించిన అనేక రకాల నగలు నేడు యువతరాన్ని ఆకర్షిస్తూ.. ధరించేందుకు మక్కువ ప్రదర్శించేలా ఉన్నాయి. జ్యూయలరీని తయారుచేసేందుకు టెర్రకోట



కళాకారులు ప్రత్యేక శ్రద్ధ కనిపిస్తున్నారు. మట్టిలో గొలుసులు, లోలాకులు తయారుచేయాటమే కాకుండా వాటికి బంగారపు పూతలా కనిపించే రంగుల్ని అద్దుతూ తక్కువ రకం రత్నాలని పొందుగుతూ... కొత్త తరహా ఆభరణాలకు శ్రీకారం చుట్టారు. సాంప్రదాయ పద్ధతలుకు అనుగుణంగా రూపొందుతున్న ఈ నగలు పార్టీ జ్యూయలరీలంటూ ప్రత్యేక సందర్భాలలో వీటిని ధరించేందుకు ఎక్కువగా ఇష్టపడుతున్నారు జనం.

**కుటీరపరిశ్రమని దాటి...**

కుటీరపరిశ్రమని దాటి పారిశ్రామిక స్థాయిలో అభివృద్ధి చెందుతున్న టెర్రకోటపై ప్రభుత్వాలు కూడా దృష్టి పెట్టాయి. ఇందుకు అనుగుణంగా అనేక చోట్ల మట్టిని కలిపేందుకు చేసిన బొమ్మలు కాల్చేందుకు అనేక యూనిట్లు వెలిశాలి. కోల్‌కత్తాలోని గంగానదీతీరంలో టెర్రకోట బొమ్మల కోసం ఏకంగా పెద్దయూనిట్ ఏర్పాటైంది. ఇది మనదేశంలోనే అతి పెద్దది కావటం విశేషం.

**లాభాలూ బోలెడు...**

టెర్రకోట వస్తువులు సాధారణ మట్టిపాత్రల కన్నా భిన్నంగా ఉంటాయి. పర్యావరణకు ఎలాంటి విఘాతం కలిగించిన ఈ వస్తువులు పింగాణీపాత్రల్లా కనిపించడమే కాకుండా గీతలుపడే ఆస్కారం తక్కువ. తేలికగా శుభ్రపరుచుకునే అవకాశాలున్నాయి. పూలకుండీల నుంచి ,,,, వరకూ సాంప్రదాయ రీతులు ఉట్టిపడేలా రూపొందుతున్న ఈ టెర్రకోట పాత్రలు మైక్రోఓవెన్‌లలోనూ వాడుకునేందుకు ఇబ్బంది లేకపోవటం, పగిలిపోవటం తదితరాలు తక్కువగా ఉండటం వల్ల అనేకమంది వీటిని నిత్యజీవితంలో వినియోగించేందుకు మక్కువ చూపుతున్నారు.

**అందాలొలికిస్తూ...**

మన ప్రాచీన నాగరికతలో విస్తరించిన ఈ టెర్రకోట ఆధునిక ఐరోపాదేశాలలోనూ కనిపిస్తుంది. ఇక మన కోల్‌కత్తా సమీపంలో ఉన్న విష్ణుపురి ఆలయం పైభాగంలో నెలవైన టెర్రకోట టైల్స్ సందర్శకులను కట్టి పడేస్తుంటాయి. వందల సంవత్సరాలు గడుస్తున్నా... ఇవి ఏమాత్రం చెక్కుచెదరలేదంటే వాటి నాణ్యత ఏపాటిదో అర్థంచేసుకోవచ్చు. అలాగే లండన్‌లోని బర్నింగ్ హెూం భవంతిలోనూ టెర్రకట టైల్స్ కనిపిస్థాయి మనకి. ఏది ఏమైనా మన ప్రాచీన కళానంపద నేడు దినదిన ప్రవర్ధమానంగా వెలుగొందుతుండటంలో మనం కూడా అండదండగా నిలవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.



# జాతీయ అవార్డే లక్ష్యం - సునీత

*సునీత సినీపాటల తోటలో సుస్వరాల విందు చేస్తున్న వసంతకోకిల. 16 ఏళ్ళక్రితం 'ఈ వేళలో నీవు ఏంచేస్తుంటావో? పాటతో తెలుగు పాఠకులను మంత్ర ముగ్దుల్ని చేసిన ఈ 'గులాబి' బాల ఈనాటికి అదే మెలోడి మెయిన్‌టైన్ చేస్తున్నారు. గాయనిగానే కాకుండా డబ్బింగ్ ఆర్టిస్టుగా, యాంకర్‌గా త్రిపాత్రాభినయం చేసి మెప్పించిన బహుముఖ ప్రజ్ఞాశాలి. తన పాటంత అందంగా ఉండే బ్యూటీఫుల్ గాయని సునీత 64కళలుడాట్‌కాంతో పంచుకున్న విశేషాలు...*

– భార్గవీరెడ్డి

మాది గుంటూరు. చిన్నప్పటి నుంచి పాటలు పాడటమంటే, సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనడమంటే ఎంతో ఇష్టం. పాల్గొన్న ప్రతీదానిలో మొదటి బహుమతి నాకు వచ్చేది. క్లాసికల్, లైట్ మ్యూజిక్ నేర్చుకున్నాను. ఓసారి ఆల్ ఇండియా రేడియో వారు నిర్వహించిన పోటీలో జాతీయ స్థాయిలో మొదటి బహుమతి వచ్చింది. గాయనిగా మంచి పేరు తెచ్చుకోవాలన్న నా లక్ష్యానికి ఆ బహుమతి స్ఫూర్తిగా నిలిచింది. ఇక అప్పటి నుంచి బాగా పాడాలన్న తలంపుతో సాధన చేయడం ప్రారంభించాను. ఆ పోటీ తర్వాత సెలవులకు హైదరాబాద్‌లో వున్న మా మామయ్యగారింటికి వచ్చాను. జాతీయ స్థాయిలో బహుమతి సొంతం చేసుకున్న అమ్మాయిని అందరికి పరిచయం చేయాలన్న ఉద్దేశంతో ఎం.సి.వి. శశిధర్ గారు నాతో ఓ లైవ్ ప్రోగ్రామ్‌ను దూరదర్శన్‌లో చేసేందుకు వచ్చారు.

విషయం తెలిసి ఎంతో భయపడ్డాను. మొదటిసారి అలా కెమెరా ముందుకు రావడంతో పాటు ప్రేక్షకులకు పరిచయమయ్యాను. తర్వాత నేను 1995లో రఘు కుంచే ద్వారా జెమిని కిరణ్‌గారికి పరిచయమయ్యాను. ఆయన నాకు 'నవరాగం' కార్యక్రమ బాధ్యతను అప్పగించారు. దాదాపు 60 ఎపిసోడ్స్ చేశాను. అది బాగా క్లిక్ అయింది. దాంతో గాయనిగా పేరు కూడ వచ్చింది. అదే టైమ్‌లో ఈటీవీలో 'మీమాట- మీ పాట' ప్రోగ్రామ్ కూడా చేశాను. వీటితో యాంకర్‌గా, గాయనిగా బుల్లి తెర ప్రేక్షకులకు మరింత సుపరిచితురాలినయ్యాను. అంతేకుండా










ప్రతిరోజూ ఉదయం జెమినీలో 'యువర్స్ లవింగ్లీ' కార్యక్రమానికి యాంకర్‌గా చేశాను. దీనికి మంచి స్పందన లభించింది. నాకంటూ ఓ గుర్తింపు నిచ్చి, నా లక్ష్యాన్ని సాధించేందుకు ఉత్తేజాన్ని అందించే నన్నీ స్థాయికి తీసుకువచ్చేందుకు జెమినీ టీవీ ఎంతో దోహదపడింది. అలా నేను పలు రకాలు కార్యక్రమాలు చేసి అందరికీ దగ్గరయ్యాను.

'అనగనగా ఓ రోజు' చిత్రంలో ఊర్మిళకు డబ్బింగ్ చెప్పేందుకు కొత్త వాయిస్ కోసం ప్రయత్నం చేసిన రామ్‌గోపాల్‌వర్మ గారు నాతో డబ్బింగ్ చెప్పించారు. అప్పుడు అసలు డబ్బింగ్ ఎలా చెప్పాలో తెలియదు. పైగా మొదటిసారి పెద్ద డైరెక్టర్ దగ్గర చేస్తున్నాను. డబ్బింగ్ చెప్పటానికి అన్నీ రెడీ చేశారు. డబ్బింగ్ స్టార్ట్ అనగానే టెన్షన్ మొదలైంది. మొత్తానికి ఆయనను ఎన్నో అవస్థలు పెట్టి డబ్బింగ్ చెప్పాను అది పూర్తయ్యాక 'సునీత, ఈ వాయిస్‌ను మా సినిమాలో ఉపయోగించుకోవడంలేదు' అని రామ్‌గోపాల్‌వర్మగారు చాలా ఎంతో సున్నితంగా చెప్పారు అప్పుడు నాకర్థమైంది నా వాయిస్‌తో ఆ క్యారెక్టర్‌కి సరైన న్యాయం చేయలేకపోయానని. ఆ తర్వాత ఎస్వీ కృష్ణారెడిగారు దర్శకత్వం వహించిన 'ఎగిరేపావురామా' చిత్రంలో లైలాకి నా వాయిస్ సూట్ అవుతుందని నాతో డబ్బింగ్ చెప్పించారు. తీరా డబ్బింగ్ పూర్తయ్యాక "సునీత, నీ వాయిస్‌ని ఇంకొంచెం ఇంప్రూవ్ చేసుకోవటానికి ప్రయత్నించు" అని కృష్ణారెడ్డిగారు చెప్పారు. దాంతో డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా నా తొలి రెండు చిత్రాల్లో ఫెయిల్ అయ్యాను. అయితే అప్పటి నుంచి డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా రాణించాలనే కసి నాలో పెరిగింది. 'పెళ్ళిపందిరి' చిత్రంలో రాశికి వాయిస్‌ను అందించి డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా తెలుగు తెరకు పరిచయమయ్యాను. ఆ తర్వాత పెద్ద పెద్ద బ్యానర్లలో నిర్మించిన చిత్రాలకు, పలువురు పేరుపొందిన హీరోయిన్స్‌కి డబ్బింగ్‌ను చెప్పాను. చిరంజీవి హీరోగా నటించిన 'చూడాలని వుంది' చిత్రంలో సౌందర్యగారికి డబ్బింగ్ చెప్పాను. అది నా కెరీర్‌కు టర్నింగ్ పాయింట్ అయింది. దాంతో అవకాశాలు పుష్కలంగా వచ్చాయి. అలా డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా నా కెరీర్ మరో మలుపు తిరిగింది. దాదాపు 150 చిత్రాలకు డబ్బింగ్ చెప్పాను. ఈ సమయంలో ఎన్నో అనుభవాలతో పాఠాలు నేర్చుకున్నాను. ఎందుకంటే ప్రతి సినిమాకు క్యారెక్టర్స్ మారుతుంటాయి. వాటికి తగ్గట్టుగా మనలను మనం ముందుగా మలచుకోవాలి. అందుకోసం ఎంతో శ్రమించాల్సి వుంటుంది. దీనికోసం ప్రత్యేకంగా సాధన చేయాల్సిన





## సునీత గురించి...

**పుట్టింది** – మే 10, 1978 గుంటూరులో

**చదువు** – ఇంటర్మీడియట్

**పాటలు పాడిన చిత్రాలు** – 200

**డబ్బింగ్ చెప్పిన చిత్రాలు** – 500

**పాడిన భాషలు** – తెలుగు, కన్నడ, తమిళం మరియు మళయాళం

**అవార్డులు** – నంది అవార్డులు 7, ఫిలింఫేర్ 4

అవసరం కూడా వుంటుంది. డబ్బింగ్‌లో సరిత గారి వాయిస్ అంటే ఎంతో ఇష్టం. అమెను బాగా అబ్జర్వ్ చేసేదాన్ని.

ప్రేకమథలో అంత్రామాలికి, నిన్నే ప్రేమించాలో సిమ్రాన్‌కి, నువ్వు నేనులో అనితకి నేను అందించిన వాయిస్ ఓ డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా బాగా సంతృప్తినిచ్చాయి. 'జయం' చిత్రంలో 'వెళ్ళవయ్యా వెళ్ళు...' అని సధాఫ్ చెప్పిన డైలాగ్‌కి మంచి రెస్పాన్స్ రావడం మరింత సంతోషాన్నిచ్చింది. ఇటీవల శ్రీరామరాజ్యంలో సీతకు నేను చెప్పిన డబ్బింగ్‌ను బాపు గారే కాకుండా ఎంతో మంది మెచ్చుకున్నారు. డబ్బింగ్ చెబుతున్న సమయంలోనే సినిమాల్లో పాటలు పాడే అవకావం కూడా వచ్చింది. జె.డి.చక్రవర్తి, మహేశ్వరి జంటగా నటించిన 'గులాబి' చిత్రంలో 'ఈవేళలో నీవు ఏంచేస్తూ వుంటావో...' పాటను పాడే అవకాశాన్ని కృష్ణవంశీగారు ఇచ్చారు. ఆ పాటతో గాయినిగా మంచి గుర్తింపువచ్చింది. ఆ తర్వాత ఎస్వీ కృష్ణారెడ్డిగారి 'ఎగిరేపావురామా' చిత్రంలో 'మాఘమాసం ఎప్పుడొస్తుందో...' పాట పాడాను. ఈపాట గాయనిగా నున్ను మరింత బిజీ చేసింది. గాయనిగా 'గులాబి చిత్రం గుర్తింపునిస్తే, 'ఎగిరేపావురమా' చిత్రం ఆ గుర్తింపుని నిలబెట్టుకునేలా చేసింది. 'ఈ వేళలో... పాట విన్న చిత్రగారు చాలా బాగా పాడావని మెచ్చుకోవడం నా జీవితంలో మరచిపోలేని అనుభూతి. పాటలు పాడే విషయంలో సుశీల, జానకీ, చిత్రగార్లను ఆదర్శంగా తీసుకుంటాను. కోకిల కంఠం సుశీలగారి సొంతమైతే, భావం ఉట్టిపడేలా పాడటంలో జానకిగారు దిట్ట. వీరిద్దరినీ ఒకటిగా చేస్తే చిత్రగారి కంఠం ఎంతో అద్భుతంగా పాడగల శక్తి వుంది. వీరు పాడిన పాటలు వింటుంటే నాలో తెలియకుండానే చైతన్యం వస్తుంది. అలా గాయినిగా తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో కలిపి ఇప్పటికి దాదాపు 80 సినిమాల్లో 225 పాటలు పాడాను. అంతే కాకుండా దాదాపు 20 సీరియల్స్‌కి టైటిల్‌సాంగ్స్ పాడాను. దూరదర్శన్‌లో ప్రసారమైన 'ఋతురాగాలు' సీరియల్‌కి పాడిన టైటిల్‌సాంగ్ ఊహించని రీతిలో పేరుని తెచ్చింది. అలా గాయినిగా నా కెరీర్ మరో మలుపు తిరిగింది. గాయనిగా పరిశ్రమలో నిలబడేందుకు ఎంతో మంది దర్శకులు, సంగీత దర్శకులు తమ వంతు సహకారాన్ని అందించారు. ఇప్పుడు చిత్రపరిశ్రమలో పోటీ బాగా పెరిగింది. పోటీ కూడా చాలా ఆరోగ్యకరమైన వాతావరణంలోనే సాగుతోంది. మనలో ఏమాత్రం టాలెంట్ వున్నా అవకావం తప్పకుండా వస్తుంది. అయితే దీనకి తోడు అదృష్టం కూడా కలిసి వస్తు అనుకున్న లక్ష్యంలో రాణించగలమన్నది నా అభిప్రాయం. అయితే కొంతకాలం వరకు యాంకర్ సునీత, డబ్బింగ్ సునీత, సింగర్ సునీత ఈ ముగ్గురు వేర్వేరని చాలా మంది అనుకున్నారు. కాని ఈ మధ్యకాలంలో నేను చేసిన ప్రోగ్రామ్స్, డబ్బింగ్ చెప్పిన క్యారెక్టర్స్, పాడిన పాటలు ఆ ముగ్గురు వేర్వేరు కాదని ఆ ముగ్గురూ ఒక్కరే 'సునీత' అని తెలిసేలా చేసినందుకు చాలా ఆనందంగా వుంది. మూడు బాధ్యతలను నిర్వర్తిస్తున్నా గాయనిగా అంతర్జాతీయ స్థాయిలో మంచి గుర్తింపు సాధించాలన్నది నా లక్ష్యం. నా లక్ష్యసాధనలో మా అమ్మ, నాన్నలతో పాటు మా అత్త, మామలు, మావారు ఎంతో సహకారాన్ని అందిస్తున్నారు. రోజువారి బిజీ షెడ్యూల్‌తో వున్న నాకు వారందిస్తున్న ప్రోత్సాహాన్ని మాటల్లో చెప్పలేను, ఒక్కమాటలో చెప్పాలంటే వాళ్లు లేకపోతే నేను లేనని గర్వంగా చెప్పుకోగలనని సునీత అంటుంది.

# నవ్వించి ఏడ్పించిన రాజబాబు



కామెడీ ఆర్టిస్టుల్లో రాజబాబు స్థానం ప్రత్యేకమైంది పాతతరం హాస్యనటుల్లో కస్తూరి శివరావు, రేలంగి వెంకట్రామయ్య తరువాత అంత వైభవాన్ని కళ్ల చూసింది ఆయనే. రాజబాబు తీసుకున్నంత పారితోషికం మరే ఇతర హాస్యనటుడు తీసుకోలేదేమో! ఆ రోజుల్లో కొంతమంది హీరోల పారితోషికానికి సమానంగా ఆ మొత్తం ఉండేది. ఒకచోట కుదరుగా ఉండకుండా వంకర్లు తిరిగిపోతూ వెరయిటీ మాడ్యులేషన్‌తో రాజబాబు డైలాగులు చెబుతుంటే ప్రేక్షకులు నవ్వు ఆపుకోలేకపోయేవారు. ఆ నవ్వుల రాజు రాజబాబు అక్టోబరు 20 పుట్టిన రోజు సందర్భంగా ప్రత్యేక వ్యాసం...

'నేను కోట్ల రూపాయలు సంపాదించాను' అని సగర్వంగా ప్రకటించుకున్న ఏకైక హాస్యనటుడు కూడా బహుశా రాజబాబు ఒక్కరేనేమో! హాస్య నటులు చరిత్ర రాస్తే అందులో మొదటి పేజీల్లోనే ఉండే పేరు ఆయనదని చెప్పవచ్చు.

అయితే హాస్యనటుడిగా రాజబాబు ప్రస్థానం అంత తేలికగా మొదలవలేదు. పావలాతో మద్రాసుకు చేరుకున్న ఈ పున్యమూర్తుల అప్పలరాజు చాలాకాలం అన్నం లేక, సరైన




బట్టలేక కార్పొరేషన్ నీళ్లతో ఏ రోజయినా కడుపునిండా అన్నం పెడితే దాంతో రెండు మూడు రోజులు బతికేవారు. 'అలా అప్పుడప్పుడు అన్నం పెట్టిన మహానుభావుడు ఆనాటి హీరోయిన్ రాజసులోచన ఇంటితోటమాలి. అవకాశాలు దొరక్క ట్యూషన్లు కూడా చెప్పేవాణ్ణి. నేను టూషన్ చెప్పే ఇంట్లో ఏదో మూల కుక్కపిల్లలా పడుకుని ఉంటే ఎవరో లేపి కాఫీయో, రెండు ఇడ్లీలో ఇచ్చేవారు' అని ఆ రోజుల్లో రాజబాబు చెప్పిన మాటలు ఇప్పుడు మళ్లీ విన్నా 'అయ్యో పాపం' అనిపించకమానదు. చివరికి ఆయన నిరీక్షణ ఫలించి 'సమాజం' చిత్రంతో పరిశ్రమకు పరిచయమయ్యారు.

అతి తక్కువ కాలంలోనే మంచి గుర్తింపు తెచ్చుకున్న రాజబాబు తన నటజీవితాన్ని కామెడీతో ప్రారంభించినా విలనీతో పాటు విభిన్న పాత్రలను పోషించి మెప్పించారు.

హీరోగా కూడా కొన్ని చిత్రాల్లో నటించారు. డా.దాసరి నారాయణరావు తొలి సినిమా 'తాత-మనవడు' చిత్రంలో ఆయనే హీరో, ముందు ఆ వేషం వేయడానికి వెనుకంజ వేసినా దాసరి ప్రోత్సాహంతో ఆ పాత్ర పోషించారు రాజబాబు. ఆ సినిమాకి



తన బతుకు పుస్తకంలో పేజీలు తరిగిపోతుండడంతో , ఆఖరి పేజీ దగ్గర పడిపోతోందేమోనన్న భయం ఆవరించి ఆ లోపు కొన్ని మంచి పనులు చేయాలన్న తపనతో రాజబాబు పబ్లిక్ ట్రస్ట్ ఏర్పాటు చేసి తన శక్తి మేరకు ఇతరులకు ఆర్థికంగా సహాయంచేసేవారు. ముఖ్యంగా తన పుట్టినరోజు ఏ ప్రయోజనం లేకుండా జరగడం అసంతృప్తికరంగా అనిపించి ఆ రోజుని సీనియర్స్‌ని సన్మానించేవారు రాజబాబు. నాటక ప్రదర్శనలు ఏర్పాటు చేసి కొత్త నటీనటులు పరిశ్రమకి పరిచయం కావడానికి దోహదపడ్డారు. ముఖ్యమైన

ఆయనకి ఎంతో పేరు తెచ్చింది. ఆ తరువాత దాసరి దర్శకత్వంలో రూపొందిన 'తిరుపతి'లో కూడా ఆయనే హీరో. ఆసక్తికరమైన విషయం ఏమిటంటే రాజబాబు నిర్మించిన తొలి సినిమా 'ఎవరికి వారే యమునా తీరే' కు దర్శకుడు దాసరి కావడం. 'బావా...బావ' అనుకుంటూ ఎంతో ఆప్యాయంగా మెలిగే వారిద్దరు. దాసరి రూపొందించిన చిత్రాల్లో మంచి పాత్రలు చేశారు రాజబాబు.

### పుట్టినరోజున మంచి కార్యక్రమాలు




విషయం ఏమిటంటే ఆ రోజుల్లో 'పాతాళభైరవి' చిత్రంలో బాలకృష్ణ (అంజిగాడు) నటన రాజబాబుని ఎంతో ప్రభావితం చేసింది. ఆ సినిమాని ఓ తొంభైసార్లు చూశారాయన. చూసిన ప్రతిసారీ హాస్యనటుడు కావాలనే కోరిక బలపడేది. అందుకే తను హాస్య నటుడిగా స్థిరపడిన తరువాత ఓ పుట్టిన రోజున బాలకృష్ణను సన్మానించి తన కృతజ్ఞతలు వెల్లడించారు రాజబాబు.

నిర్మాతగా.. భవిష్యత్‌లో ఎప్పుడైనా కథ రాసుకుని స్వీయ దర్శకత్వంలో సినిమా తీయాలనే కోరిక రాజబాబుకి ఉండేది. ఆ ప్రయత్నంలో భాగంగా బాబ్ అండ్ బాబ్ క్రియేషన్స్ బేనరుపై



'మనిషి రోడ్డున పడ్డాడు' చిత్రాన్ని నిర్మించారు రాజబాబు. దీనికి కథకుడు ఆయనే. ఈ సినిమాలో ట్రాజెడీ వేషం వేశారు. ఎప్పుడు తమని నవ్వించే రాజబాబు తెరపై ఏడుస్తూ కనిపించే సరికి ప్రేక్షకులు కూడా కంటతడి పెట్టారు. తనని చూసిన జనం మనసారా నవ్వుకోవాలి కానీ అలా ఏడవకూడదనుకున్న రాజబాబు ఇకపై ట్రాజెడీ వేషాలు వేయకూడదని నిర్ణయం తీసుకున్నారు. ఈ కారణంగానే ఆయన తీయాలనుకున్న 'సరస్వతి లక్ష్మి బ్రహ్మ', 'సంఘం చేసి బొమ్మలు' చిత్రాలు తీయలేకపోయారు.



### మాటల్లో వేదాంతం, వైరాగ్యం

ప్రేక్షకులకు నవ్వులు పంచే రాజబాబు జీవితం వెనుక బలమైన విషాదం ఏదైనా దాగి ఉందా అనిపించేది ఒక్కోసారి. ఆయన తాగిన మత్తులో ఉన్నా, లేకపోయినా వేదాంత వైరాగ్యాల గురించి సుదీర్ఘంగా మాట్లాడేవారు. అలాగే ఇంటర్వ్యూల సారాంశం వేదాంతపరంగానే ఉండేది. తెరపై అంతగా నవ్వించే రాజబాబు ఎంతో భావగర్భితంగా, వేదాంత ధోరణిలో మాట్లాడటం అందరినీ ఆశ్చర్యపరిచేది.

### కెరీర్‌ని దెబ్బతీసిన అలవాటు

అలవాట్లు ఎప్పుడు ఎలా ప్రారంభమవుతాయో చెప్పలేం కానీ అంత బిజీగా ఉన్న రాజబాబు కెరీర్ కుదేలవడానికి ప్రధాన కారణం మద్యపానమే కారణమని చెబుతారు విపరీతంగా తాగి షూటింగ్‌లకు గైరు హాజరయ్యేవారని అంటారు. రాజబాబుని పెట్టుకుంటే సినిమాకి హెల్ప్ అవుతుందనుకునే రోజులు పోయి ఆయనతో సినిమా చేయడం రిస్క్ అని భావించే పరిస్థితి ఏర్పడటానికి కారణం ఇదేనంటారు. అయితే తను తాగి షూటింగ్‌కి వచ్చేవాణ్ణనే అంటే రాజబాబు ఒప్పుకునేవారు కాదు. 'నేను తాగుతాను. పనిలేని రోజున మాత్రమే తాగుతాను. మేకప్ వేసుకున్న తరువాత తాగను. కానీ పరిశ్రమ నన్ను దూరం చేసింది. విష ప్రచారం చేసి పక్కన పెట్టింది. నిర్జీవమైన వస్తువులతో ఆడుకోండి. కానీ మనుషుల జీవితాలతో ఆడుకోవద్దు' అనేవారాయన ఆ రోజుల్లో నేను ఏ నిర్మాతకి, దర్శకుడికి అన్యాయం చేయలేదు. 'అప్పలరాజుని రాజబాబుగా మార్చి మంచి పొజిషన్‌లో నిలబెట్టి చివరికి ముంచెయ్యడం పరిశ్రమకి భావ్యమా' అని ఆయన ఆవేదనతో ప్రశ్నించినా దానికి చివరి రోజుల్లో స్పందన కరువైంది.



### ఆయనకే దక్కిన గౌరవం

తన పుట్టిన ఊరికి, కన్నవారికి ఎంతో ప్రతిష్ఠలు తెచ్చిన రాజబాబు శిలా విగ్రహాన్ని ఈ ఏడాది ఏప్రిల్ నెలలో రాజమండ్రిలో ఏర్పాటుచేశారు. ఈ సందర్భంగా ప్రపంచ చరిత్రలోనే తొలిసారిగా 70 మంది హాస్యనటీనటుల కలయికలో 'హాస్యకుంభమేళ' పేరుతో ఓ నవ్వుల కార్యక్రమాన్ని నిర్వహించింది తెలుగు చిత్రపరిశ్రమ. ఇదే రాజబాబుకి మాత్రమే దక్కిన గౌరవం.

64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :3 సంచిక :1 నవంబర్ 2012



## 3వ వసంతంలోకి....

64కళలుడాట్‌కాం రెండు సంవత్సరములు పూర్తిచేసుకొని, 3వ వసంతంలోకి అడుగుపెడుతుంది. గత రెండేళ్ళుగా పత్రికను ఆదరిస్తున్న పాఠకులకు, మంచి రచనలు చేస్తున్న రచయితలకు, సహాయ సహకారాలు అందిస్తున్న కళాభిమానులకు, కార్టూనిస్టులకు కృతజ్ఞతాభివందనాలు.

తెలుగు భాషాసంఘం అధ్యక్షులుగా శ్రీ మండలి బుద్ధప్రసాద్ నియమితులయిన సందర్భంగా వారి జీవిత విశేషాలతో ప్రత్యేక వ్యాసంతో వారికి అభినందనలు.

పాఠకులకు ఆంధ్రప్రదేశ్ అవతరణ శుభాకాంక్షలు...

*ఈ సంచికపై మీ అభిప్రాయాలను తెలుపగలరు.*

**కళాసాగర్**
ఎడిటర్



ముఖచిత్రం చిత్రకారుడు : బి.ఏ. రెడ్డి



పద్మశ్రీ యెల్లా వెంకటేశ్వరరావు

**తెలుగు వీరుడు బుద్ధప్రసాద్**



*ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే*

7

# మన కార్టూనిస్టులు

-కళాసాగర్

*"అక్షరం రూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క లక్షమెదళ్లకు కదలిక అన్నాడు, ఆనాడు మహాకవి కాళోజీ. అక్షరానికున్న శక్తి అలాంటిది. వేల అక్షరాలతో చెప్పలేని భావాన్ని ఒక్క కార్టూన్ ద్వారా చెప్పొచ్చు అంటున్నారు నేటి కార్టూనిస్టులు. నిరక్షరాస్యులను కూడా కదిలించగల శక్తి కార్టూన్‌కుంది.*

*వివరణ అవసరం లేకుండా సూటిగా, సంక్షిప్తంగా, విషయాన్ని పాఠకుడి హృదయానికి హత్తుకునేలా చేసే గొప్ప కళా మాధ్యమం కార్టూన్. అందుకే రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాహిత్య, కళా విషయాలతో నిమిత్తం లేకుండా అన్ని రకాల పత్రికలలోనూ నేడు కార్టూన్లు ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ఇంత శక్తివంతమైన కళాప్రక్రియకు తెలుగులో ఆద్యుడు శ్రీ తలిశెట్టి రామారావు గారైతే, ఆ తర్వాత కార్టూన్ విస్తృతంగా వ్యాప్తిలోకి రావడానికి బాపు, జయదేవ్, బాలి, మోహన్, ఏ.వి.ఎమ్, చంద్ర, మల్లిక్, సత్యమూర్తి, శ్రీధర్, కుమారి రాగతి పండరి లాంటి ఎందరో కార్టూనిస్టులు కృషి చేస్తున్నారు.*

*తెలుగు కార్టూన్ పితామహుడు తలిశెట్టి రామారావు గారితో 'మనకార్టూనిస్టులు' శీర్షికను ప్రారంభించాం. చదవండి, హాయిగా నవ్వండి, మీ అభిప్రాయాలను తెలియజేయండి...*

## కార్టూన్ కళ విశిష్టమైంది




*"ఏడవటం కంటే నవ్వటం గొప్ప విషయం. మనం నవ్వటం కంటే పదిమందినీ నవ్వించటం మరీ గొప్ప విషయం. అలా పదిమందినీ నవ్వించి, ఆనందింపజేసే వివిధ ప్రక్రియల్లో కార్టూన్ కళ విశిష్టమైంది. అయితే, అప్పుడప్పుడు కార్టూనిస్టు సమాజంలోని అన్యాయాల్ని ఎత్తిచూపుతూ తన కార్టూన్ ద్వారా నవ్వుతోపాటు, నవ్వేమనిషి గుండెల్లో నిప్పురవ్వ రగిలించగలగాలి. " అంటారు కార్టూనిస్ట్ ఎమ్.ఎస్.రామకృష్ణ.*

ప్రముఖకవి శ్రీమునగపాటి విశ్వనాథశాస్త్రి-విశాలక్ష్మి దంపతులకు ప్రథమ సంతానంగా జన్మించిన 'రామకృష్ణ' పూర్తి పేరు మునగపాటి శివరామకృష్ణ, స్వస్థలం తెనాలి తాలూకా ప్యాపర్రు. విద్యాభ్యాసం ఇంటూరు, బాపట్ల హైస్కూళ్ళలో, గుంటూరు హిందూ కాలేజి హైస్కూలు, బాపట్ల కాలేజి ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్, ఉస్మానియా యూనివర్సిటీల్లో. తదుపరి స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో (హైదరాబాదు) ఉద్యోగంలో చేరారు. నాన్నగారి వద్ద నేర్చుకున్న పద్యకవిత్వం వంటపట్టించుకుని, స్కూలు-కాలేజీ రోజుల్లో వున్న నాటకాల అనుభవానికి పదునుపెట్టుకుంటున్న తనకు సడెన్‌గా 'బాపు కార్టూన్' అనే బగ్ కుట్టింది. అప్పట్లో యువ, జ్యోతి మాసపత్రికలు, ఆంధ్రపత్రిక వగైరాలలో బాపు గారు వేసే బాణసంచాల్లాంటి కార్టూన్లు, ఆ బొమ్మల్లోని హావభావాలు, నవ్వించి కవ్వించే డైలాగులు తను కార్టూన్‌రంగంలో అడుగుపెట్టడానికి పెద్ద స్ఫూర్తిగా నిలిచాయంటారు రామకృష్ణ.

దేశంలో చాలామంది చదువురానివారు. వచ్చినవాళ్ళల్లో చాలామందికి చదవటానికి బద్ధకం. ఈ రెండు వర్గాలకీ పనికొచ్చేది కార్టూన్! ఈ కార్టూన్ అనే సాధనం ద్వారా, ఒక విషయంమీద లేదా వ్యవస్థమీద మనకుండే అసహనాన్నీ, ఏవగింపునీ పాఠకుడికి ఇఫెక్టివ్‌గా చెప్పొచ్చు! అయితే, కార్టూనింగ్ చాలా క్లిష్టమైన కళ!




హైదరాబాద్‌లో జరిగిన కార్టూన్ ఉత్సవ్-2012 లో సత్కారం అందుకున్న రామకృష్ణ గారు

కార్టూనిస్టు ఎందరో కళాకారుల సమ్మేళనం. ఓ విమర్శకుడు, రచయిత, ఫోటోగ్రాఫర్, నటుడు, మేకప్‌మాన్, చిత్రకారుడు, ... ఇందరి కలయికే కార్టూనిస్ట్! ఈ ఆలోచనలతో కార్టూన్‌రంగంలో అడుగుపెట్టిన రామకృష్ణకు, **1968**లో ఆంధ్రప్రభ వీక్లీ 'లోకోక్తి చిత్రిక' కార్టూన్ పోటీకి గీసిన తన మొట్టమొదటి కార్టూన్ తెచ్చిపెట్టిన ప్రథమ బహుమతి ప్రోత్సాహం, ఉత్సాహంగా మారి నాటినుంచి దాదాపు అన్ని తెలుగు పత్రికల్లోను, ఇంగ్లీషు, కన్నడ, తమిళ, హిందీ భాషల్లోని ప్రముఖ పత్రికల్లోను కార్టూన్లు వేశారు. ముఖ్యంగా, ఇంగ్లీష్ పత్రికలు 'కారవాన్', 'విమెన్స్ ఎరా'లలో తను ఓ దశాబ్దం పైగా గీసిన 'హబీ', 'రజిత' ఫుల్‌పేజి కలర్ కార్టూన్ ఫీచర్లు, శంకర్స్ వీక్లీ కార్టూన్లు తనకు దేశవ్యాప్తంగా మంచి గుర్తింపుని తెచ్చిపెట్టాయి. అలా ఇంగ్లీషులో శంకర్స్ వీక్లీ, కారవాన్, విమెన్స్ ఎరా, వైజ్‌క్రాక్, సన్, సన్‌డే, భవన్స్ జర్నల్, యూత్‌టైమ్స్, న్యూస్‌టైమ్, సైబర్‌హుడ్, వగైరా ప్రముఖ పత్రికలకు గీసే అవకాశం కలిగింది. ప్రఖ్యాత కార్టూనిస్ట్ అబూ అబ్రహామ్ ఎడిట్‌చేసి, ప్రపంచవ్యాప్తంగా సర్కులేట్ అయిన పెంగ్విన్ బుక్ 'ది ఇండియన్ కార్టూన్స్'లో దేశంలోని ప్రముఖ కార్టూనిస్టుల సరసన ఆంధ్రప్రదేశ్ నుంచి రామకృష్ణకు ఒకింత చోటు దొరికింది. నేటి సామాజిక స్థితిగతులకు వేమన పద్యాలను జోడిస్తూ నాగార్జున ఫైనాన్స్‌వారి సౌజన్యంతో స్వాతి, ఆంధ్రజ్యోతి వారపత్రికల్లో ఏడాదిపైగా వేసిన 'మీకోసం' కార్టూన్లు ఎంతో పాపులర్ అయ్యాయప్పట్లో! తరువాత ఎన్.ఎఫ్.వారే ఆ కార్టూన్లను పుస్తకరూపంలో ప్రచురించారు. తెలుగు వారపత్రికల్లో 'మిసెస్ అవతారం', 'గొడుగు', 'సింగినాదం', వగైరా కామిక్‌స్ట్రిప్స్, కొన్ని బొమ్మలకథలూ, ఆంధ్రభూమి దినపత్రిక్కి ఫ్రంట్‌పేజ్‌లో రెగ్యులర్ పాకెట్ కార్టూన్లు వేశారు. కేవలం నవ్వించే కార్టూన్లేకాక, సమాజంలోని అన్యాయాల్నీ, అక్రమాల్నీ, అవకతవకల్నీ వ్యంగ్యంగా ఎత్తిచూపుతూ ఛెళ్ళుమనిపించే కార్టూన్లన్నా, అలాగే సైలెంట్ (క్యాప్షన్‌లెస్) కార్టూన్లన్నా రామకృష్ణగారికి చాలా ఇష్టం. అలా




గీసిన తన మూకీ కార్టూన్లు కన్నడ, తమిళ భాషాపత్రికలలో ఎన్నో అలరించాయి.

జనరల్‌గా పత్రికల్లో ఏదైనా ఒక అంశంమీద విమర్శిస్తూ వ్యంగ్యంగా వేసే నెగెటివ్ కార్టూన్లకంటే, ఒక కంపెనీ ప్రోడక్ట్ లేదా సర్వీస్‌ని కన్స్యూమర్‌కి అర్థమయ్యేలా చెప్పి, కన్విన్స్ చేసే పాజిటివ్ యాడ్‌కార్టూన్లు వేయటం కొంతవరకు కత్తిమీద సామే! ఈ ఒరవడిలోనే, నాగార్జున సిమెంట్స్‌కు, విష్ణు సిమెంట్స్‌కు

పబ్లిసిటీ కార్టూన్లు, 'మిడాస్' మెన్స్‌వేర్ కంపెనీకి దక్కన్ క్రానికల్‌లో యాడ్ కార్టూన్లు, హెచ్ఎల్ఎస్పిపిటీ వారికి కండోమ్-ఎయిడ్స్ మీద కలర్ కార్టూన్లు వేశారు. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, హైదరాబాద్ సర్కిల్ వారి హౌజ్-జర్నల్, తెలుగు పంచాంగం క్యాలెండర్ డిజైన్ చేసి అందులో ఓ పదేళ్ళపాటు బ్యాంక్‌వారి వివిధ పథకాలమీద పబ్లిసిటీ-ఓరియెంటెడ్ కార్టూన్లు వేశారు. టెలీకమ్యూనికేషన్స్ వారికి (తెలుగు-హిందీ-ఇంగ్లీష్‌లలో) టెలిఫోన్ 'డూస్ అండ్ డోన్ట్స్', నేషనల్ సేవింగ్స్ వారికి చిన్నమొత్తాల పొదుపు మీద కలర్ కార్టూన్ బుక్స్ చేశారు. ఎ.పి.ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌కి సోషల్ ఫారెస్ట్రీ మీద పబ్లిసిటీ కార్టూన్లేకాక లోగోలు, లీఫ్‌లెట్లు, పోస్టర్లు డిజైన్ చేశారు. శాటిలైట్-బేస్డ్ ఇంటరాక్టివ్ నెట్‌వర్క్ లెక్చర్స్ కోసం 'స్ట్రెస్‌మేనేజ్‌మెంట్' మీద గీసిన కలర్ కార్టూన్లు అహ్మదాబాద్ ఇస్రో స్టూడియోస్ నుంచి ప్రసారమయ్యాయి. హైదరాబాద్ దూరదర్శన్, జెమినీ టీవీలు ఆయనతో ఇంటర్వ్యూలు ప్రసారంచేశాయి.



'కోతికొమ్మచ్చి' మొదటిభాగం విడుదల సందర్భంగా కీ॥శే॥ ముళ్ళపూడి వెంకటరమణ, శ్రీయుతులు బాపు, చంద్ర, స్వాతి బలరాం, పట్టాభిరామ్‌లతో రామకృష్ణ

Eleventh International Biennial of Humour and Satire in the Arts - Gabrovo '93 (Bulgaria)




1986లో ప్రొఫెసర్ మధుదండావతే నేతృత్వంలోని పార్లమెంట్ సభ్యుల బృందం, తను బ్యాంకింగ్‌మీద వేసిన కార్టూన్‌షోని తిలకించి ప్రత్యేకంగా ప్రశంసించింది. లేటెస్ట్‌గా ప్రొఫెసర్ సుఖ్‌బీర్ సింగ్ రచించగా, ప్రముఖ ఢిల్లీ సంస్థ రూపా పబ్లిషర్స్ ప్రచురించిన 'హ్యూమర్ ఫ్రమ్ హైదరాబాద్' ఇంగ్లీష్ బుక్‌కి రామకృష్ణ వేసిన కార్టూన్లు ప్రముఖుల మన్ననలు పొందాయి.

కార్టూనిస్ట్‌గా పలువురి అభినందనలు అందుకుంటున్న రామకృష్ణలోని మరో పార్శ్వం - కవిత్వం. వారి నాన్నగారి నుంచి వారసత్వంగా అందిన పద్యకవిత్వం, గేయాలు, రచనల ప్రభావంతో, నేటి సమకాలీన సమాజ స్థితిగతులపై కవిగా తాను రచించిన హాస్య, వ్యంగ్య పద్యసంకలనాలు హైదరాబాద్‌లో తరచూ నిర్వహించబడే వివిధ కవిసమ్మేళనాల్లో ప్రముఖకవులనుంచి ప్రశంసలు పొందుతూనే ఉన్నాయి. వారి కార్టూన్-కవిత్వ విన్యాసాలు మనం తరచూ ఫేస్‌బుక్‌లోనూ చూస్తూనే ఉన్నాం.

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి స్వచ్ఛందంగా పదవీవిరమణ చేసిన రామకృష్ణ, తనకు ఇష్టమైన కార్టూన్లు, కవిత్వం, మల్టీమీడియాలో కృషి చేస్తున్నారు. శ్రీమతి సుగుణ-రామకృష్ణ దంపతులకు ఒక కుమార్తె. వివాహమై కూతురు, అల్లుడు ఇద్దరూ బెంగళూరులో ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. వారికి ఇద్దరు కుమారులు - ప్రణవ్, ప్రణీత్.

బాపు గారి చిత్రకళావిన్యాసమన్నా, అలనాటి క్లాసిక్ సినిమాలన్నా, ఆ పాటలన్నా ఎంతో ఇష్టపడతారు రామకృష్ణ!

TOON
FET-2012

# హైదరాబాద్‌లో కార్టూన్ ఉత్సవ్-2012

(సమైఖ్యభారతి 16వ వార్షికోత్సవ సందర్భంగా)




*కార్టూన్లు-నవ్విస్తాయి...*

*కార్టూన్లు-కవ్విస్తాయి...*

*కార్టూన్లు-ఆలోచింపజేస్తాయి...*

*కార్టూన్లు ఆయుష్షును పెంచుతాయి.*

అందుకే కార్టూన్లంటే అందరికీ ఇష్టమే. మనల్ని నిత్యం నవ్వించే కార్టూనిస్టులందరూ ఒకచోట చేరితే ఇక నవ్వుల పండగే. అలాంటి పండుగ ఒకటి 'కార్టూన్ ఉత్సవ్-2012 పేరుతో అక్టోబరు 28,29,30 తేదీలలో సమైఖ్యభారతి ఆధ్వర్యంలో హైదరాబాద్, పబ్లిక్ గార్డెన్స్‌లో మూడు రోజులపాటు ఘనంగా జరిగింది. పండుగ వాతావరణాన్ని తలపింపజేస్తూ.. మన తెలుగు కార్టూనిస్టులందరూ (సుమారు 75 మంది) ఒక చోట చేరి చేసిన సందడి పబ్లిక్ గార్డెన్ సందర్శకులకు కనువిందు చేసింది, కడుపుబ్బ నవ్వించింది.



## కార్టూన్ ఉత్సవ్ ప్రారంభం...

మొదటి రోజు (28-10-12) ఆదివారం 5 గంటలకు ప్రముఖ కార్టూనిస్టు జయదేవ్‌గారు ఈ ఉత్సవాన్ని 'తెలుగు కార్టూనిస్టులు జయహో' ... అంటూ ఒక స్కెచ్ వేసి ప్రారంభించారు. రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక సలహాదారులు డా॥ కె.వి రమణాచారి గారి అధ్యక్షతన జరిగిన ఈ సభలో సీనియర్ పాత్రికేయులు ఎ.బి.కె.ప్రసాద్, వీరాజి, కార్టూనిస్టు జయదేవ్, మోహన్, ఏ.జిస్ ఫౌండేషన్ సి.ఎం.డి. ఎమ్.శ్రీనివాస్‌లు పాల్గొన్నారు. ప్రముఖ కార్టూనిస్టు రాంపా కార్యక్రమాన్ని నవ్వుల పువ్వులు రువ్వుతూ... ఆ సాంతం ఆహ్లాదంగా నిర్వహించారు. ఈ సభలో డెక్కన్ క్రానికల్ కార్టూనిస్టు సుభాని"ఆదాబ్ హైదరాబాద్" (డ్రాయింగ్స్, స్కెచ్‌లు) పుస్తకం, సీనియర్ కార్టూనిస్టు గీతాసుబ్బారావుగారి "గీతా జగత్" కార్టూన్ల పుస్తకం ఆవిష్కరించారు. అనంతరం ప్యాట్నీ హోటల్‌లో కార్టూనిస్టులకు విందు ఏర్పాటు చేశారు.

ఇక రెండవ రోజు (29-10-12) సోమవారం ఉదయం 11 గంటలకు సాక్షి కార్టూనిస్టు శంకర్ కార్టూనిస్టుల, కార్టూన్‌ఇష్టుల సమక్షంలో కారికేచర్ గీయటంలో మెలకువలను తెలియజేస్తూ తన అనుభవాలను తోటి కార్టూనిస్టులతో పంచుకున్నారు. తర్వాత కార్టూనిస్టు సుభాని కార్టూన్లు గీయటంలో మెళకువలు,


గీతా సుబ్బారావు గారి గీతా జగత్ కార్టూన్ పుస్తకం ఆవిష్కరణ




అనేక ప్రాంతాల నుంచి వచ్చిన కార్టూనిస్టులు ఒకచోట చేరినపుడు....

పొలిటికల్-సోషల్ కార్టూన్లకు మధ్య తేడాలను చక్కని స్కెచ్‌లతో వివరించారు. అనంతరం సత్యతిరునగరి తన కాలిగ్రఫీ నైపుణ్యాన్ని ప్రదర్శించారు. కరీంనగర్‌కు చెందిన వీరు చేతిని పైకెత్త కుండా ఏ పేరునైనా డ్యూయల్ లైన్‌లో రాయడంలో సిద్ధహస్తులు. ఎంతో మంది కార్టూన్ మిత్రులకు తమ పేర్లను రాయడమే కాకుండా కార్టూనిస్టులందరికీ సర్టిఫికెట్స్ కూడా ప్రముఖ కార్టూనిస్టు కళాసాగర్ ఆధ్వర్యంలో రాసారు.

## వెన్నెల రాత్రిలో జలవిహారం...

సాయంత్రం 6 గంటలకు మోహన్‌గారి యానిమేషన్ షార్ట్ ఫిలింస్ ప్రదర్శన, తర్వాత ఆంధ్రజ్యోతి కార్టూనిస్టు శేఖర్ తన అమెరికా పర్యటన అనుభవాలను మిత్రులతో పంచుకున్నారు. అనంతరం కార్టూనిస్టు మిత్రులందరూ కలిసి హుస్సేన్‌సాగర్‌లో రెండంతస్థుల బోట్‌లో జలవిహార కార్యక్రమం రెండున్నర గంటలపాటు రాంపా నిర్వహణలో సురభి కళాకారుల ఆటపాటలతో, కార్టూనిస్టుల జోక్‌లతో, హుసారైన సంగీతంతో సరదాగా సాగిపోయింది. బోట్‌లోనే డిన్నర్ తీసుకొని, ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసిన రమణాచారి గార్కి కృతజ్ఞతలు తెలుపుకున్నారు. పౌర్ణమిరాత్రిలో ఇది ఓ మరపురాని అనుభూతిని కలిగించింది కార్టూనిస్టులకు.

## ముగింపు ముచ్చట్లు-సత్కారాల సందడి...

చివరి రోజైన (30-10-12) మంగళవారం ఉదయం 11 గంటలకు పబ్లిక్ గార్డెన్‌లో వేసిన టెంట్ కిందకు చేరి సమకాలీన కార్టూన్ రంగంపై తమ తమ అనుభవాలను తోటి కార్టూనిస్టులతో పంచుకున్నారు. డిజిటల్ కెమెరాలు అందరికీ అందుబాటులో ఉండడంతో కలిసిన ప్రతీ ఒక్కరు తోటి వారితో ఫొటోలు తీయించుకొని, తీయని జ్ఞాపకాలను పదిలపరచుకున్నారు. చక్రవర్తిగారి లాంటి కొందరు ఫేస్‌బుక్‌లో ఏరోజు కారోజు ఫొటోలను అప్‌లోడ్ చేసి, ఇంటర్నెట్‌లోనూ తెలుగు కార్టూనిస్టుల పండగను ప్రపంచానికి తెలియజేసారు. కార్టూన్లను బహిరంగప్రదేశంలో బోర్డులకు గుచ్చి ప్రదర్శించడం వలన కొంత ఇబ్బంది కలిగింది.

సాయంత్రం 6గంటలకు పబ్లిక్‌గార్డెన్‌లోని ఎనిమిది స్థంబాల గోపురంలో విద్యుత్‌దీపాల కాంతిలో ముగింపు సభ జరిగింది. దీనికి ముఖ్య అతిథిగా నరేంద్ర లూథర్, ఐ.ఏ.ఎస్, మాజీ ఆం॥ప్ర॥ ప్రధాన కార్యదర్శి, అధ్యక్షులుగా పొత్తూరి వెంకటేశ్వరరావు, ప్రెస్ అకాడెమీ మాజీ అధ్యక్షులు రమణాచారి, ఆత్మీయ అతిథిగా


కార్టూన్ ఉత్సవ్ -2012 ప్రారంభసభ వేదిక


హుస్సేన్‌సాగర్‌పై బోటులో డిన్నర్ తీసుకుంటున్న రాంపాతో కళాసాగర్, ఉష

## కార్టూన్ల ఉత్సవ్‌లో తమ కార్టూన్లను ప్రదర్శించిన కార్టూనిస్టులు

| | | | |
|---|---|---|---|
| బాపు | మృత్యుంజయ | కళాసాగర్ | శేఖర్ (రాజమండ్రి) |
| బాలి | అన్వర్ | కృష్ణ కిషోర్ | నాగరాజు |
| సత్యమూర్తి | రాగతిపండరి | తిరునగరి | కొండా రవిప్రసాద్ |
| చంద్ర | భీమారావ్ | రాంపప్రసాద్ | రాంమోహన్ |
| యం.యస్.రామకృష్ణ | వర్చస్వీ | బి.వి.యస్.ప్రసాద్ | శరత్‌బాబు |
| జయదేవ్ | బన్ను | బి.యస్.రాజు | మాధవ్ |
| ఏ.వి.యం. | డి.చక్రవర్తి | పుక్కళ్ళ | శ్రీవల్లి |
| శంకు | రవీంద్ర | శర్మ | వెంటపల్లి |
| టీవీ | అర్జున్ | కామేష్ | వెంకట్ |
| సుభాని | బాచి | భార్గవి | విజయ్ |
| రాంపా | జి.శ్రీనివాస్ | వాగ్దేవి | పొన్నాడమూర్తి |
| గీతాసుబ్బారావు | పర్వత్ | ఉష | ఓనాన |
| మోహన్ | సాయికృష్ణ | హరికృష్ణ | రావెళ్ళ |
| శ్యాంమోహన్ | బ్నిం | రవినాగ్ | మౌంట్‌క్రిస్టో |
| సుధామ | రాజు | రామశేషు | నందు |
| సరసి | వెంకటేష్ | దేవులపల్లి | లేపాక్షి |
| గోపాలకృష్ణ | నాగిశెట్టి | అరుణ్ | కృష్ణ(పామర్రు) |
| శంకర్ | ఆకుండిసాయిరాం | చంటిబాబు | రాజమౌళి |
| శేఖర్ (ఆంధ్రజ్యోతి) | వి.రామకృష్ణ | వడ్డేపల్లి | శ్రీరామ్ |

జి.వి.ఎన్. రాజు, చైర్మన్ ఏ.జిస్ ఫౌండేషన్ పాల్గొన్నారు. మరొక ముఖ్య అతిథి సినీ హాస్య నటుడు ఎం.ఎస్. నారాయణ కూడా వచ్చి వుంటే బావుండేది. ముఖ్య అతిధి నరేంద్ర మాట్లాడుతూ దినపత్రికలో కార్టూనిస్ట ప్రాముఖ్యతను, మాజీ ముఖ్య మంత్రి శ్రీ టి. అంజయ్యగారిపై ఆ రోజుల్లో వచ్చిన కార్టూన్లతో ఆయన బాగా పాపులర్ అయ్యారన్నారు. పొత్తూరి వెంకటేశ్వరరావు మాట్లాడుతూ కార్టూనిస్టులు జనంలో పాపులర్ అని, మీడియాలో వారికి తగిన ప్రాముఖ్యతనివ్వాలన్నారు.

తర్వాత శంకుగారి "ఈ కార్టూన్లు మీవే", బాలిగారి "ఫినిక్స్ కార్టూన్స్" పుస్తకావిష్కరణలు జరిగాయి. వెంటనే కార్టూన్ కళలో విశిష్ట సేవలందించిన జయదేవ్. టీవీ. సత్యమూర్తి, శంకు, ఎం.ఎస్. రామకృష్ణ, బాలి, బ్నిం. రాంపా, బి.ఎస్.రాజు, సుధామ, ఎం.వి. అప్పారావు, కరుణాకర్‌లను, కార్టూన్ రంగానికి సేవలందించిన పుక్కళ్ళ, రాములను కూడా సత్కరించారు. సన్మానాలు ప్రకటించిన కొందరు సభకు హాజరుకాలేకపోయారు. వారిలో ఏ.వి.యం, చంద్ర, గోపి, రాగతిపండరి, గీతాసుబ్బారావులున్నారు. ఈ సన్మానాల ఎంపిక సంతృప్తి కరంగా లేదని వేదిక వద్ద పలువురు చెవులు కొరుక్కున్నారు.

చివరిగా విశ్రాంత ఇంజనీరు, నటులు, సమైఖ్యభారతి వ్యవస్థాపకులు అయినటువంటి సత్యనారాయణగారిని కార్టూనిస్టులందరూ సత్కరించి కార్టూన్ ఉత్సవాన్ని విజయవంతంగా



నిర్వహించినందుకు కృతజ్ఞతలు తెలియజేసారు. అలానే శ్యాంమోహన్ గారిని కూడా అభినందించారు.

ఉత్సవంలో పాల్గొన్న కార్టూనిస్టులందరికీ 64కళలు ఎడిటర్ కళాసాగర్ నిర్వహణలో ప్రశంసాపత్రాలు అందజేసారు. మూడురోజులపాటు అనేక అనుభవాలను మూటకట్టుకొని కార్టూనిస్టులు తమ తమ ఊళ్ళకు పయనమయ్యారు.

– ఆర్కే...

*See next page for more photos*


శంకర్ కారికేచర్ డెమో


సుభాని కార్టూన్ పాఠాలు


వేదిక



కార్టూనిస్టు గ్రూప్


సత్కారం అందుకుంటున్న శంకు

***See Photo Gallery for more photos***


శ్యాంమోహన్, సుభాని, రాంపా


కార్టూన్ బుక్స్ స్టాల్ నిర్వహిస్తున్న రమణారెడ్డి


బోటులో డిన్నర్ తీసుకుంటున్న సమైక్యభారతి సత్యనారాయణ

కళాప్రపంచం

# "సాహితీ స్రష్ట, క్రాంతి దర్శి - పద్మరాజు



*"నా జీవితం వృథా కాలేదు. లోకానికెంతో నేనిచ్చాను. నా హృదయాన్ని ముక్కలు, ముక్కలుగా కోసి, వాటినన్నింటినీ రచనలుగా మలచి లోకానికిచ్చాను" అంటుంది ఒక పాత్ర "ఫలశ్రుతి" అన్నకథలో ఈ కథను పాలగుమ్మి పద్మరాజు గారి విషయంలో కూడా అలాగే అనిపిస్తాయి.*

**ఎల్.ఆర్. వెంకటరమణ**

"తనని గురించి పద్మరాజు" అన్న వ్యాసాన్ని రాసుకున్నాడు. తన వివరాలు స్వీయ చరిత్రగా చెప్పుకున్నాడు. తను 1915 జూన్ 24న పుట్టిన వాడని రాసుకున్నాడు. ఈ వ్యాసంలో రాస్తూ "ప్రతి మనిషీ ఏదో ఒక రోజున పుడతాడు. ఏదో ఒక రోజున పోతాడు. ప్రతివ్యక్తి జీవితంలోనూ ఈ రెండు తేదీలే ముఖ్యమైనవి. బతికి ఉన్న మనిషికి విలువ కట్టేటపుడు అంతవరకు అతను సాధించినదే కాక, భవిష్యత్తులో అతను ఇంకా సాధించగల సామర్థ్యాన్ని కూడా అంచనా వేస్తాం. ఒకసారి ప్రాణం పోయాక మిగిలిదల్లా అతని గతమే.

పద్మరాజు గారికి "మృత్యువు" అన్నది మంచి ఆకర్షణగా చెప్పారు. అదే విషయాన్ని తన రచనలలో చూపారు. ఎక్కువ మరణాలు చూశానని కాదు కాని, మృత్యువుతో నా మొదటి అనుభవం కారణం కావచ్చు. అంటుంటాడు. 1927లో పద్మరాజు గారి తాతగారి మరణం అతని జీవితంపై ఒక ముద్ర వేసింది. "బాల్యం"; "వియ్యన్నతాతమరణం"; "గాలివాన" కథలలో మరణం గురించి కళ్ళకు కట్టినట్లు చూపారు.

పద్మరాజు గారి చదువు కొవ్వూరు హైస్కూలుతో ఉన్నత విద్య చదివారు. అప్పటి మిత్రుడు చాగంటి కామేశ్వరరావు ఇరువురు కలిసి "రాజేశ్వరులు" అను జంట కవుల పేర పద్యాలు రాశారు. తరువాత కాశీవిశ్వవిద్యాలయంలో రసాయన శాస్త్రంలో ఎమ్మెస్సీ చదివారు. ఆ రోజుల్లో సైన్సు, ఆధునిక, పాశ్చాత్య సాహిత్యం, పాశ్చాత్య తత్వశాస్త్రం ఎంతో చదువుకున్నారు.

పద్మరాజు గారి మొదటి కథ "సుబ్బి" త్రివేణీ ఆంగ్ల త్రైమాసిక పత్రికలో 1939లో ప్రచురించబడినది. పెళ్లి చేసుకోకుండా పిల్లను గన్న ఒక పనిపిల్ల పట్ల ఆ ఇంటి యజమానుల ప్రవర్తన ఇతివృత్తంగా ఈ కథ రచించారు. త్రివేణీ పత్రిక సంపాదకులు బుర్రా సుబ్రహ్మణ్యంగారి ప్రోత్సాహంతో తెలుగులో అదే కథ రచించారు. అలా తెలుగులో కథా రచనలు ప్రారంభించారు.

పద్మరాజుగారు కవిత, కథ, నాటకం, వ్యాసం, నవల ఇలా అన్ని ప్రక్రియలలోనూ సమర్థవంతంగా చేపట్టారు. ఇవి ఎన్ని చేపట్టినా కథకుడుగానే మంచి పేరు వచ్చింది. పద్మరాజుగారి కథ "గాలివాన" కథకు అంతర్జాతీయక బహుమతి లభించింది. "న్యూయార్క్ హెరాల్డ్‌ట్రిబ్యూన్ వారు నిర్వహించిన అంతర్జాతీయ కథల పోటీలలో (1952) ఈ కథకు ద్వితీయ బహుమతి లభించింది. "భయంకర తుఫాన్‌లో చిక్కుకున్న ఒక వ్యక్తి క్షోభను

కథలో చిత్రించారు. ఒక పరిస్థితిలో పరస్పర విరుద్ధమైన రెండు పాత్రల ప్రవర్తన చూపించారు. సాఫీగా స్థిరమైన జీవితం గడుపుతున్న రావు, మరుక్షణం ఎలా గడుస్తుందో తెలియని ఒక బిచ్చుగత్తె ఈ కథలోని ప్రధాన పాత్రలు".

1948లో అర్ధరాత్రి సంభవించిన తుఫాన్‌లో గాలివాన కథలోని రావు అనుభవించిన క్షోభ అంతా అనుభవించాను అంటారు రచయిత. పద్మరాజు గారు ఇతర కథలలో "పడవ ప్రయాణం; "ఎదురు చూస్తున్న ముహూర్తం" అన్నవి కూడా మంచికథలు. పద్మరాజు గారి కథలలోని విశేషాలను వివరిస్తూ డి.రామలింగంగారు– "వీరి భాష, భావం, మార్గం, కథావస్తువు, శిల్పం అన్నీ వేరుగా ఉంటాయి. అపురూప కవిత్వాన్నీ, అతిలోకమైన భావాన్నీ, తాత్త్వికసూత్రాలను, మనశ్శాస్త్ర సూత్రాలను చిన్న కథలలో నేర్పుగా చెప్పగలరు. కథా వస్తువు ఏది అయిన తను ప్రత్యేకంగా మంచి పట్టుతో, శిల్పంతో దాన్ని చక్కని కథగా మలచగలరు. సామాన్యులు, మేధావులను కదిలించగలడు. ఆలోచింపచేయగలడు" అంటారు.

పద్మరాజుగారి "పురిటిపాట"; "చీకటి" మంచి అనుభూతి




ప్రధానమైన వచన గేయాలు. "పురిటిపాట"లో మొదటిసారి ప్రసవించే ఇల్లాలి అనుభూతిలోని ముగ్ధత్వం, ఆ సమయంలో పురిటగది వాతావరణ సహజత్వం పాఠకుని హృదయాన్ని ఆకట్టుకుంటాయి.

పద్మరాజు గారి నాటకాలలో "రక్తకన్నీరు" విశేష ప్రచారాన్ని పొందింది. "మా ఇంటికి తలుపులు లేవు"; "విశ్రాంతి"; "మగమూర్ఖులు"; "కలియని దారులు" వంటి నాటకాలు రాశారు. భీమవరం కాలేజీలో పనిచేసినపుడు ఎన్నో నాటకాలు రాసి, విద్యార్థులచేత ప్రదర్శింపచేసినవారు. "శాంతినిలయం"; "ఆత్మహననం" అన్నవి రేడియోకు రాసిన నాటకాలు. ఆకాశవాణిలో కూడా అనేక నాటకాలు, కథలు, వ్యాసాలు ఎన్నో ప్రసంగాలు చేసినవారు.

పద్మరాజుగారు రాసిన నవలలో ముఖ్యమైనవి– "సరదాగా నవ్వు పుట్టించే కథగా "బ్రతికిన కాలేజీ" నవల రచించారు. ఇది వుడ్‌హౌస్ తరహాలో రచించాలన్న తపనలో రచించిన నవల ఇది. ఇందులో హాస్యం ప్రధానమైన విషయం. రాజకీయ పరిస్థితులను వ్యంగ్యంగా అధిక్షేపించే "రెండవ అశోకుడి మూణ్ణాళ్ళ పాలన"; పల్లె జీవితంలోకి యంత్రాలు ప్రవేశం, వాటి ప్రభావాన్ని చిత్రించిన నవల "నల్లరేగడి", ఈ నవలకు రాష్ట్ర సాహిత్య అకాడమీ ఉత్తమ నవలగా అవార్డు లభించింది. అన్ని భారతీయ భాషలలోకి అనువదించబడిన నవల ఇది.

జాతీయోద్యమ కాలంలో సాంఘిక, రాజకీయ పరిస్థితులకు అద్దంపట్టిన "రామరాజ్యానికి రహదారి" అన్న నవల. ఇంకా ఆంగ్ల నవలలు కొన్ని తెలుగులోకి అనువదించారు. ది.హెచ్. లారెన్స్ రచన "The Man who died" అన్న నవల; టర్గనీవ్ రాసిన "Fathers and sons" అన్న నవలను అనువదించారు.

చిన్ననాటి నుండి పద్మరాజు గారిలో రెండు రకాల ఆసక్తులు ఉండేవి. ఒక వంక సంప్రదాయానికీ, ఆచార వ్యవహారాలకు గొప్ప విలువ ఇచ్చేవారు. మత సంబంధ గ్రంథాలు, పురాణాలు, ఉపనిషత్తులు. వాటి వ్యాఖ్యానాలు సమర్ధించేవారు. ఇలా మంచి వాడన్న పేరు ఉండేవి. అదే విధంగా మరొక వంక చపల చిత్తులు, అవిధేయుల పట్ల ఆకర్షితులయ్యేవారు. వీరితో తన స్నేహం బయపడకుండా జాగ్రత్త పడేవారు. పెద్దవాళ్ళు రహస్యంగా చెప్పుకునే మాటలు తలుపుచాటున వినడం, ఇలాంటి అలవాటు ఉండేవి. ఈ అనుభవం తను కథారచయితగా తనకు ఎంతో ఉ పయోగపడిందని పద్మరాజుగారు రాసుకున్నారు.

కాకినాడ పి.ఆర్. కాలేజీలో అధ్యాపకునిగా ఉన్న కాలంలో

నాటి ప్రముఖ వ్యక్తులు ఎందరో పరిచయం కలిగిందంటారు. ఎమ్.ఎన్.రాయ్ రచనల అధ్యయనం వల్లా శాస్త్రీయ దృక్పథం అలవడిందంటారు. భీమవరం W.G.B. కాలేజీలో రసాయనశాస్త్ర శాఖ అధ్యక్షునిగా 1945-52 మధ్య పనిచేశారు. ఈ కాలంలో ఎన్నో రచనలు చేశారు.

1952 తరువాత పద్మరాజుగారు సినీ కథా రచయితగా స్థిరపడ్డారు. చిత్రపరిశ్రమలో కథా రచయితగా, మాటలు, పాటలు రచయితగా పేరు తెచ్చుకున్నారు. "బంగారు పాప"; "భాగ్యరేఖ" సినిమాలు రాష్ట్రపతి అవార్డు అందుకున్నాయి. వీటికి కథ, సంభాషణలు రచించారు. "రంగుల రాట్నం" సినిమాకి రాష్ట్ర అవార్డు లభించింది. "బహుదూరపు బాటసారి " సినిమా కథకుగాను రాష్ట్రప్రభుత్వ నంది అవార్డు లభించింది. సాహిత్య విలువల పరంగా సినిమా రంగం పద్మరాజుకు సంతృప్తి పరచలేకపోయింది. హీరోకు తగ్గట్లు కథ యాంత్రికంగా ఒక మూసలో రాయాల్సివస్తుందని పద్మరాజు గారు ఆవేదన చెందేవారు.

పద్మరాజుగారు గుండెపోటుతో హఠాత్తుగా 1983 ఫిబ్రవరి, 17న మరణించారు. ఉత్తమ సాహితీ స్రష్ట, క్రాంతి దర్శి, త్రికరణశుద్ధిగా తాను నమ్మినదాన్ని రచించాడు. సిద్ధాంతాలు, తీర్మానాల కొరకు తన రచనలను ఎక్కువ ఉపయోగించుకోలేదు. ఆయన సృష్టించిన పాత్ర ఏ సిద్ధాంతాలకు గానీ, ఏ వర్గానికి చెందినవి కావు. అసలు సిసలు చిక్కని మానవరూపాలు.




*email: venkataramana_lanka@yahoo.com*



# చిత్రకళారత్న బి.ఏ. రెడ్డి

*కళ కళకోసం, కళ సమాజం కోసం అన్న ఒకప్పటి వాదనల స్థానంలో నేడు కళ తనకోసం...కాదు "కళ తనకోసమే" అన్న వాదన నేడు వ్యాప్తిలోకొచ్చిందని చెప్పవచ్చు... మారుతున్న కాలమాన పరిస్థితులు ఈ పరిణామానికి కారణం అని వేరే చెప్పనవసరంలేదు.*



బి.ఏ. రెడ్డి

**- వెంటపల్లి సత్యనారాయణ**

కళ కళకోసమే అనడంలో నిస్వార్ధానికి తోడు ఒకింత నిర్లక్ష్యం కనిపిస్తుంటే, కళ సమాజం కోసం అనడంలో నిస్వార్ధంతో పాటు సామాజిక బాధ్యత కూడా కనిపిస్తుంది. ఇక కళ తనకోసం అనడంలో అవసరం, "కళ తనకోసమే" అన్నదాంట్లో పూర్తిగా స్వార్ధమే కనిపిస్తుంది.

మారుతున్న కాలమానపరిస్థితులను బట్టి నేడు కళ కళకోసం లేదా సమాజం కోసం అని అనడం ఎంత అసమంజసమో కళ పూర్తిగా తన కోసమే అని అనడం కూడా అంతే అసమంజసం అవుతుంది. అందుకే కళ ముందు తనకోసం, తర్వాత జమాజం కోసం అని అనడం నేటి పరిస్థితులలో సమంజసం. అదే నేడు ఉత్తమమైంది కూడా. ఈ సిద్ధాంతంతోనే కళా ప్రయాణంలో తను ముందుకు నడుస్తూ తన సంస్థనే గాక, తన వేలాదిమంది శిష్యులను కూడా కళా ప్రపంచంలో జాతీయ అంతర్జాతీయ స్థాయిలో ముందుకు నడిపించి, నేటికీ నడిపిస్తూ ఆదర్శ చిత్రకళాకారునిగా రాష్ట్ర జాతీయ స్థాయిల్లోనే గాక, ప్రపంచంలో అనేక దేశాలయిన పోలెండ్, పిన్‌లాండ్, స్లావేనియా, పోర్చుగల్, హంగేరి, చైనా, మాస్కో, రుమేనియా లాంటి ఎన్నో దేశాలనుండి కూడా "టీచర్ ఆఫ్ గ్రేట్‌సక్సెస్ పురస్కారాలను అందుకున్న ఆదర్శ చిత్రకారుడు చిత్రకళా ఉపాధ్యాయులు బాలబందుగా పేరు గాంచిన కళారత్నం డాక్టర్ బి.ఏ. రెడ్డి.

ప్రకృతిలోని రంగురంగుల సీతాకోక చిలుకలను చూసినపుడు మనం ఎంత ఆనంద ఆనందపడతామో, బి.ఏ. రెడ్డిగారి చిత్రాలను చూసినపుడు కూడా అంతే ఆనంద పరవశు లమౌతాము. కారణం ఆయన చిత్రాల్లో ని గీతలు, వర్ణాలలోని స్వచ్ఛత. అందమైన ఈ ప్రకృతిలో ఎన్నో వర్ణాలు, వర్ణసమ్మేళనాలు, అన్ని రకాలు ఆయన చిత్రాల్లో వుంటాయి. నిజానికి మనం వూహించుకున్నట్టు ఉష్ణశీతల వర్ణ బేధాలనేవి ఈ నిజ ప్రకృతిలో ఏమీలేవు. ఏ వర్ణం ఎక్కడ ఎలా వున్నా ప్రకృతి సమతుల్యత కోల్పోదు. తీవ్ర ఉష్ణ వర్ణాల మధ్య మనం భావించుకున్న ఏ అసంబద్ధ వర్ణం ఈ ప్రకృతిలో వున్నా అది వికృతంగా కనిపించదు. కారణం ఎంత విభిన్న వైరుద్య వర్ణాలను ఎక్కడెక్కడ పేర్చినా దాన్ని కమనీయ, రమనీయ వర్ణ చిత్రంలా మైమరపించగల సృష్టికర్త కుంచెతో రూపుదిద్దుకున్న విచిత్ర చిత్రం ఈ విశాల విశ్వం. అందుకే సాధారణంగా వివిధ వైరుద్యమైన అసంబద్ధ




చిత్రకారుల చిత్రాలలో మాదిరి పరిమిత వర్ణాలు కాకుండా విపరీత వర్ణవైచిత్రి మనకు కనిపిస్తుంది. ఇలాంటి వైరుధ్య వర్ణాల కలబోత కంటి దృష్టికి ఇబ్బందికరంగా ఉండాలి. కానీ రెడ్డిగారి చిత్రాలలో అది నయనానందకరమే గాక ప్రకృతిని వీక్షించినపుడు ఎంతటి ఆహ్లాదకరమైన భావన కలుగుతుందో అలాంటి ఆహ్లాదకరమైన భావన ఆయన చిత్రాల్లో మనకు కనిపిస్తుంది.

బి.ఏ. రెడ్డిగారు జన్మత: గ్రామీణ ప్రాంతం నుండి వచ్చిన వ్యక్తి. కృష్ణాజిల్లాలోని అచ్చమైన పల్లె వాతావరణం గల పామర్రు గ్రామంలో శ్రీమతి బొమ్మారెడ్డి రామానుజమ్మ, కోటిరెడ్డి దంపతులకు 01.03.1940లలో జన్మించారు. బాల్యమంతా చెట్లు, పుట్టలు, గట్టులేకాకుండా వాగు, వంకల మధ్య, లేగలు, ఆవుదూడలు, చెఱకుతోటలు, పూలతోటల మధ్య వివిధ ఆటపాలతో గడిచింది. అంతేగాక ఆ రోజుల్లోని గ్రామాల్లో ఎంతో సంభరంగా చేసుకునే దసరా, దీపావళి, చవితి, నాగపంచమి, గంగానమ్మ జాతర, తదితర పర్వదినాలలో ఎంతో ఉత్సాహంగా పాల్గొనేవారు. ఇలాంటి బాల్యస్మృతులన్నీ తర్వాత కాలంలో ఆయన చిత్రాలలో రంగుల హరివిల్లులుగా రూపాంతరం చెందాయి.

చిన్నతనంలో తన తండ్రి కోటిరెడ్డి ఫొటోలకు వేస్తున్న రంగుల కళ ఆకర్షించింది. హైస్కూల్‌లో వుండగా చిత్రకళోపాధ్యాయులు శ్రీరామాచార్యులు గారి వద్ద ఓనమాలు నేర్చుకున్నారు. నిరంతరం బొమ్మల లోకంలో విహరించే రెడ్డిగారిని పదకొండవ తరగతి తర్వాత సాధారణ విద్య ఆకర్షించలేకపోయింది. తన కిష్టమైన రంగుల కళనే అభ్యసించాలన్న

వర్ణాలను చిత్రరచనలో కూర్చినపుడు దానిని వీక్షించిన వీక్షకుడి కంటికి కలిగే అసౌకర్యమైన భావం సహజ ప్రకృతి వీక్షణలో మనకు కనిపించదు కారణం అది విశ్వకర్మసృష్టి కనుక. మరి మనిషి పూసే సకల వర్ణాలలో కూడా అలాంటి సౌందర్యం వీక్షకుడి కంటికి కనిపించాలంటే దానికి ఎంతో నేర్పు, పరిణతి, రంగుల సమతుల్యత అవసరం. లేకుంటే అది చూసేవారి కంటికి విసుగు, గందరగోళ భావాలను కలిగిస్తుంది. కానీ అలాంటి అసౌకర్య భావాలేమీ కలగకుండా ఎన్ని రంగులు ఎలా వుపయోగించినా చిత్రాన్ని కమనీయ రమణీయంగా తీర్చిదిద్దగల నేర్పు గల చిత్రకారులు బి.ఏ. రెడ్డిగారు.

ఆయన చిత్రాల్లోని రేఖలు అందం కోసం అర్రులు చాచవు. తీర్చిదిద్దినట్లుండే రేఖల జోలికి పోకుండా చిత్రకారుడికి ఒక ప్రాథమిక ఆలోచన జనించిన పిదప తొలి ప్రయత్నంలో వేసిన గీతల మాదిరే ఆయన చిత్రాల్లోని రేఖలుంటాయి. అందుకే ఆ రేఖల్లో ప్రాథమిక భావనలుంటాయి. అవి హృదయ స్పందనతో గీసిన రేఖలు గనుక వాటిల్లో జీవం వుంటుంది. కాలక్రమంలో తీర్చిదిద్దినట్లుండే అందం కోసం ప్రయత్నించే కృత్రిమత్వం లేకుండా స్వచ్ఛమైన సహజబద్ధమైన అందం ఆయన రేఖల ద్వారా సృష్టించిన రూపాలలో వుంటుంది. ఇక కృత్రిమత్వం లేని స్వచ్ఛమైన ఆ రూపాలకు తన అద్భుత వర్ణ విన్యాసం ద్వారా రంగుల హరివిల్లుగా, సుందర చిత్రంగా తీర్చిదిద్దడం బి.ఏ. రెడ్డిగారి శైలి. అందుకే ఆయన చిత్రాల్లో ఇతర


బి.ఏ. రెడ్డి

తన కోరికకు తండ్రి కోటిరెడ్డి ప్రోత్సాహం తోడవ్వడంతో గుడివాడ, పామర్రు మొదలగు చోట్ల తిరిగి ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ కొప్పాడ వేణుగోపాలరావుగారి ఉత్తమ శిక్షణలో ప్రభుత్వ సాంకేతిక పరీక్షల శిక్షణలో డిప్లొమో పొందారు. అదే సమయంలో రాజమండ్రిలోని ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ వరదా వెంకటరత్నంగారి శిష్యులుగా ఎంతో పేరుగాంచిన శ్రీ హరిశ్చంద్రశర్మ, శ్రీ మరుగంటి సీతారామాచార్యులు గారి శిక్షణలో చిత్రకళలో టి.టి.సి చేయడమే గాక వారు చేసే వాష్ టెక్నిక్ పద్ధతులు రెడ్డిగారిని బాగా ప్రభావితం చేసాయి. ఆపై రాజమండ్రిలోని ప్రఖ్యాత దామెర్ల రామారావు స్మారక చిత్రకళాశాలలోని చిత్రాలు బి.ఏ.రెడ్డి గారికి బాగా స్ఫూర్తిగా నిలిచేవి.

1958లో తొలిసారిగా గుంటూరు జిల్లా పరిషత్ హైస్కూలు నందు చిత్రకళా అధ్యాపకుడిగా ప్రారంభమైన వీరి ఉద్యోగ ప్రస్థానం, మురికిపూడి, పెనుమాకలలో 1963 వరకూ సాగింది. 1963లో కేంద్రీయ విద్యాలయ సంఘటన్‌లో జరిగిన చిత్రకళా అధ్యాపకుల పోటీకి హాజరై ప్రదర్శించిన తన చిత్రాలు అక్కడ బోర్డ్ మెంబర్స్‌ని అలరించి, మహారాష్ట్రలోని నాసిక్ సెంట్రల్ స్కూలులో ఆర్ట్‌మాస్టర్ ఉద్యోగం పొందేలా చేసాయి. అంతవరకూ కేవలం బొమ్మల మీదనే దృష్టి నిలిపిన రెడ్డిగారు ఉత్తరాదిన ఆంగ్ల. హిందీ భాషలను నేర్చుకోవడమే గాక ఆంగ్లంలో డిగ్రీ చేసే స్థాయికి






ఎదిగారు. అప్పుడే నాసిక్‌లోని ప్రఖ్యాత చిత్రకారులు వి.జి. కులకర్ణి గారితో పరిచయం కలగడంతో మహారాష్ట్రీయ చిత్రకళా రీతుల పరిచయం రెడ్డిగారికి కలిగింది.

1966లో నాసిక్ నుండి మన హైదరాబాద్‌కి బదిలీ కావడంతో నగరంలోని విభిన్న సంస్కృతి సమ్మేళనం, చారిత్రక పురాతన నవాబుల కట్టడాలు, సాలార్‌జంగ్ మ్యూజియం, స్టేట్ మ్యూజియం, కళాభవన్, లలిత కళా అకాడమీ, బాలభవన్ లాంటి సంస్థలు రెడ్డిగారిలోని కళాభిరుచిని విపరీతంగా పెంచాయి. దీనికి వయసుపరంగా, మానసికంగా పెరిగిన పరిణతి, సామాజిక అవగాహనలు తోడవ్వడంతో ఆయన చిత్రాల్లో అవన్నీ ప్రతిఫలించడానికి కారణమయ్యాయి. ఆయన చిత్రాలు చూసినట్లయితే ఈ పరిణామం మనం గమనించవచ్చును.

ఒక బాధ్యత గల చిత్రకారుడిగా ఆయన సమాజంలోని ఆనంద ఘడియలనే కాదు, సమాజంలోని ఆశ్చర్యం, మరియు ఆందోళన కలిగించే అంశాలకు కూడా ఆయన చిత్రరూపమిచ్చారు. రెడ్డిగారి చిత్రాలను ప్రధానంగా రెండు రకాలుగా విభజించవచ్చు. అవి ఒకటి జానపద గ్రామిణ సంస్కృతి సంబంధమైనవి. రెండు సామాజిక స్పృహతో సమాజంలోని ఆందోళనకర సంఘటనలకు స్పందించి వేసినివి. వీటిలో ఒక్కొక్క తరహాకి చెందిన చిత్రాల రచనకు ఒక్కో పద్ధతిని వుపయోగించిన విషయం మనం గమనించవచ్చు. వీటిలో గ్రామీణ జానపద








సంస్కృతీ సంబంధ చిత్రాలయిన గోపూజ, నాగపూజ, గొబ్బిళ్ళు, గోపాలుడు, గోవర్ధనగిరి, కుశలవులు, ముగ్ధ, వామనడు, సంధ్యారాగం, జటాయు, ఆమ్రపాలి, జాతర, లయవిన్యాసం, కుళాయి వద్ద తదితర చిత్రాలు రేఖాసౌందర్యంతో చిత్రాన్ని నిర్మించిన తదుపరి వాటిమద్య అద్భుత వర్ణ విన్యాసంతో నయనానందకరంగా తీర్చిదిద్దితే సామజాక అసమానతలు, రుగ్మతులకు అద్దంపట్టే చిత్రాలయిన దోపిడీ, పీడితులు, ఆక్రమణ, శ్రామికులు, వృధ, కసాయి, అత్యాచారం లాంటి చిత్రాల్లో రేఖలుండవు. పూర్తిగా వర్ణాలే. అదీ జానపద గ్రామీణ సౌందర్య చిత్రాల్లో ఉపయోగించిన సప్తవర్ణ సమ్మేళనాలను ఈ తరహా చిత్రాల్లో చూడం. కేవలం ఒకటి రెండు వర్ణాలే. ముఖ్యంగా అరుణ వర్ణం. ఇది ఆయన అభిమాన వర్ణం. విభిన్న భావాల వ్యక్తీకరణను సైతం ఏకవర్ణంతో చూపించగల నేర్పు ఆయన సొంతం.

తన్మయత్వం చిత్రంలో సంగీత కళాసాధనతో తాదాత్మ్యం చెందుతున్న స్త్రీకి ఆ కళాసాధనతో ఆమె హృదయంలోని అపురూపమైన భావమేదో ఆమె చుట్టూ ఒక అగరుపొగలా అల్లుకుపోయినట్లు చూపడానికి ఎరుపు పసుపు వర్ణాలే వాడారు. ఇందలి వర్ణాలు వెచ్చనివే, కానీ వాటితో తయారయిన చిత్రం మాత్రం ఆహ్లాదకరమైనది. ఇంకా వీరు తుఫాన్ చిత్రంలో బీభత్సంగా "దోపిడి" అన్న చిత్రంలో క్రౌర్యంగా "కసాయి" చిత్రంలో చుట్టూ ఆవరించిన దైన్యంగా, అత్యాచారం అన్న చిత్రంలో దౌర్జన్యంగా ఇలా ఎరుపు వర్ణాన్ని విభిన్న భావాల వ్యక్తీకరణకు ఉపయోగించడం జరిగింది. ఇంకా గ్రాఫిక్స్ పద్దతిలోను కూడా సమాజస్థితిగతులకు అద్దంపట్టే ఎన్నో చిత్రాలను సృజించారు. ఋతువులను చిత్రాల రూపంలో ఆవిష్కరించారు.

బి.ఏ.రెడ్డిగారు చిత్రకళను ఎంతగా అభిమానించేవారోఅంతకు మరింతగాచిత్రకళా అధ్యాపకత్వాన్ని అభిమానించేవారు. 1958 నుండి 2000వ సంవత్సరం ఆయన పదవీ విరమణ అయ్యేంతవరకూ సాగిన ఆయన ఉపాధ్యాయ వృత్తిలో నిరంతరం పిల్లలతోనే సహవాసం. వారి భవితవ్యకోసమే పరితపించేవారు. ముఖ్యంగా 1966లో నాసిక్‌నుండి హైదరాబాద్‌లోని గోల్‌కొండ సెంట్రల్‌స్కూల్‌కి బదిలీ అయిన తర్వాత నుండి చిత్రకళను పిల్లలకు ఓ ప్రణాళికా బద్దంగా నేర్పి వారిని నిరంతరం జాతీయ అంతర్జాతీయ పోటీలకు పంపి విజయాలు సాధించడం ద్వారా తన పిల్లలకు, మరియు వారి పాఠశాలకు ఓ ప్రత్యేక స్థానాన్ని పొందేలా చేసారు. 1974లో తొలిసారిగా సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు వీరి స్కూలు విద్యార్ధిని, స్వయానా వీరి కుమార్తె మరియు నేటి ప్రముఖ చిత్రకారిణి శ్రీమతి బి. పద్మారెడ్డిని వరించిన పిదప ఏదో ఒకటి రెండు సార్లు మినహా ప్రతిష్ఠాత్మకమైన ఆ అవార్డు వరుసగా 16 సం॥లుగా వీరి స్కూలు విద్యార్థులే గెల్చుకోవడం విశేషం. ఇంకా వీరి శిక్షణలోని చిన్నారులు జపాన్, కొరియా, ఫిన్‌లాండ్, ఇంగ్లాండ్, హంగేరి, ఈజిప్ట్, అర్జెంటైనా, ఇటలీ, ఫిలిఫ్ఫిన్స్ తదితర దేశాలలో ఎన్నో అవార్డులతో పాటు మాసిడోనియా నుండి ప్రతిస్థాత్మక "గోల్డెన్ పేలట్" మరియు "గ్రాండ్ పిక్స్, చెక్ రిపబ్లిక్ నుండి "రోజ్‌ఆఫ్ లిడిస్" మెడల్, స్లోవేనియా నుండి "గోల్డెన్ హార్స్" మరియు "గోల్డెన్‌ఫిష్" లాంటి ప్రపంచ ప్రఖ్యాత అవార్డులు లను సొంతం చేసుకోవడం రెడ్డిగారి కృషికి అద్దం పడుతుంది.

ఇంకా వీరు చేపట్టిన మరో ప్రతిష్ఠాత్మకమైన ప్రాజెక్ట్ 'బాపుదర్శన్'. సత్యాగ్రహం, అహింస సిద్దాంతాల ద్వారా ప్రపంచానికి భారతదేశ ఖ్యాతిని చాటిన పూజ్య బాపూజీ జీవిత ఘట్టాలను పిల్లలచే రూపకల్పన చేయించి న్యూఢిల్లీ లలితకళా


బి.ఏ. రెడ్డి గారితో రచయిత వెంటపల్లి




అకాడమీతో పాటు రాష్ట్రంలోని సాలార్‌జంగ్‌మ్యూజియం, కళాభవన్, స్టేట్‌ఆర్ట్ గ్యాలరీతో పాటు రాష్ట్రంలోని అన్ని జిల్లాలతో కలిపి "బాపు దర్శన్" పేరుతో ఇప్పటి వరకూ 102 ప్రదర్శనలు చేయించడం ఒక ఎత్తయితే, ప్రతిష్ఠాత్మక ఈ ప్రాజెక్ట్‌ను కేంద్ర ప్రభుత్వం విలువలతో కూడిన విద్యగా గుర్తించి ఆర్థికసహాయం అందించడం మరింత గొప్ప విషయం. ఇంకా వీరు ఆర్ట్‌డ్రైవ్ అనే త్రైమాసిక పత్రికను ఆంగ్లంలో ఎంతో ఉన్నత స్థాయిలో ప్రచురించడమే గాక ఇప్పటికే 92 సంచికలు తీసుకురావడం వీరి ఉన్నత కళాసేవకు గొప్ప నిదర్శనం. అంతే గాక సమాజశ్రేయస్సుకై ఓ బాధ్యత గల పౌరునిగా అనుక్షణం స్పందించే రెడ్డిగారు అక్షర జ్ఞానం లేక మట్టిలో మగ్గుతున్న చిన్నారి బాలబాలికలను చేరదీసి వారికోసం 1994లో సంస్కృతి రూరల్ ఆర్ట్ సెంటర్ ప్రారంభించి ఇప్పటికీ నిరంతరంగా దాన్ని నడిపిస్తూ ఆ బాలబాలకలకు రంగులు, కాగితాలిచ్చి కళాపరిచయం చేసి, పరిశుభ్రత నేర్పి వారిని సంస్కరిస్తూ ఉండడం ద్వారా కళ సమాజం కోసం అన్న భావాన్ని అక్షరాలా ఆచరిస్తుండడం వీరి నిబద్ధతకు తార్కాణం.

చిత్రకళలో 50 ఏళ్ళ నిర్విరామ కృషి ఫలితంగా వీరు సృజించిన చిత్రాలకు, వీరి కళాసేవకు మెచ్చి వీరిని వరించిన అవార్డుల గురించి రాయాలి అంటే ఒక పెద్ద గ్రంథం అవుతుందని చెప్పాలి. అందుకే వీటిలో కొన్ని 1980లో జాతీయ ఉత్తమ చిత్రకళా ఉపాధ్యాయునిగా రాష్ట్రపతి డా॥నీలం సంజీవరెడ్డి గారితో అందుకుంటే 1984లో రష్యా దేశపు ప్రతిష్ఠాత్మక సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు 1989లో సి.సి.ఆర్.టి జాతీయ అధ్యాపక పురస్కారం ఉపరాష్ట్రపతి డా॥ శంకర్ దయాళాశర్మగారి చేతుల మీదుగా, 1989లోనే కేంద్రీయ విద్యాలయ సంఘటన్ ద్వారా "ఎమినెంట్ ఆర్టిస్ట్ అవార్డు, పోలెండ్ ప్రభుత్వం నుండి ప్రత్యేక స్వర్ణఫలకం, గౌరవ డిప్లమో, ఆల్ ఇండియా ఫైన్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్‌సొసైటి ద్వారాout standing veteran Award, రాష్ట్రప్రభుత్వం నుండి ఉగాది పురస్కారం మరియు "బాలబంధు" అనే ప్రతిభా పురస్కారం, లలితకళా అకాడమీ విశాఖపట్నం ద్వారా చిత్రకళా శిరోమణి అవార్డు, తెలుగు విశ్వవిద్యాయిలయం గౌరవ డాక్టరేట్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి 2000 లో కళారత్న అవార్డు పిన్‌లాండ్, పోలెండ్, స్లావేనియా, పోర్చుగల్, హంగేరీ, చైనా, మాస్కో రుమేనియా లాంటి అనేక దేశాలనుండి The teacher of great success పురస్కారాలు వంటివి వీరి ప్రతిభకు తార్కాణాలు.

ప్రఖ్యాతి గాంచిన వీరి చిత్రాలు న్యూఢిల్లీ లలిత కళా అకాడమీ, కాలేజ్ ఆఫ్ ఫైనార్ట్స్ న్యూఢిల్లీ, హైదరాబాద్ సాలార్ జంగ్ మ్యూజయం, స్టేట్ మ్యూజయం, తెలుగు విశ్వవిద్యాలయం, బెంగుళూర్ స్టేట్ మ్యూజయం, ఇండియన్ అకాడమీ ఆఫ్ ఫైనార్ట్స్, అమృతసర్, టైడల్ వేవ్ మ్యూజయం లాంటి చోట్ల మాత్రమే గాక కెంటకీ యూనివర్శిటీలోనూ, స్లావేనియాలోనూ, రష్యా, పిన్‌లాండ్ దేశాలలోని అంతర్జాతీయ కళాభిమానుల సేకరణలలో వీరి చిత్రాలు బధ్రపరచబడి వున్నాయి.

కేవలం తను మాత్రమే గాక తన కుటుంబం అంతా కళారంగంలో ఉండడం యాదృచ్ఛికం. వీరి కుమార్తెలైన బి.పద్మారెడ్డి ప్రఖ్యాత చిత్రకారిణి, చిత్రకళా రచయితగా సుపరిచితురాలు కాగా మరొక కుమార్తె శ్రీమతి సుధారెడ్డి కూడా కల్చరల్ హిస్టరీలో పిహెచ్.డి. చేసి అధ్యాపకురాలుగా పనిచేయడమే గాక తన తండ్రి నిర్వహిస్తున్న చిత్రకళా కార్యక్రమాలు నిర్వహణలో ముఖ్య పాత్ర పోసిస్తున్నారు. ఇక వీరి అల్లుడు ప్రఖ్యాత జానపద చిత్రకారుడు అంట్యాకుల పైడిరాజుగారి కుమారుడైన ఎ. రాజేశ్వరరావు కూడా ప్రముఖ చిత్రకారుడిగా పేరు గాంచితే వేరొక అల్లుడు కూడా రీసెర్చ్ స్కాలర్‌గా పనిచేస్తున్నారు.

కళ కళకోసం, తన కోసమే గాక, సమాజంకోసం కూడా అన్న సత్యాన్ని అక్షరాలా ఆచరిస్తూ బి.ఏ. రెడ్డిగారు చేస్తున్న కళాసేవ, కృషి ఎంతో అభినందనీయమైనదే గాక ఎందరో చిత్రకారులకు, చిత్రకళా అధ్యాపకులకు ఆదర్శనీయమైనది.

*email: snventapalli@gmail.com*



# తెలుగు వీరుడు బుద్ధప్రసాద్


బుద్ధప్రసాద్

*విజయయాత్రకు మంచి ముహూర్తమైన విజయదశమినాడు అధికారభాషాసంఘం అధ్యక్షుడిగా పదవీప్రమాణం చేశారు మండలి బుద్ధప్రసాద్. సరైన వ్యక్తిని, సరైన పదవి వరించింది. తన గౌరవాన్ని కాపాడి, తన అస్తిత్వాన్ని నిలబెట్టే సరైన వ్యక్తిని, సరైన సమయంలో, సరైన సన్నివేశంలో భాషామతల్లి కోరి... కోరి... ఎంపిక చేసుకొంది. అనురాగంతో అక్కున జేర్చుకొంది, ప్రేమతో తన ఒడిలో కూర్చోబెట్టుకొంది, వాత్సల్యంతో తలనిమిరి ఆశీర్వదించింది. సమస్త తెలుగు ప్రజానీకం, తెలుగు భాషాభిమానులు హృదయపూర్వకంగా ఆనందిస్తున్న శుభ ఘడియ ఇది. భాషాప్రస్థాన చరిత్రలో ఇదొక సువర్ణ అధ్యాయానికి నాందీ ప్రస్తావన.*

**- వాడ్రేవు సుందర్రావు**
**నంది, గరుడ అవార్డుల గ్రహీత**

భావ ప్రకటనకు రెండు సాధనాలు ఒకటి ఆంగికం, రెండోది మౌఖికం. ఆంగికం అందంగా కన్పించినా అది అసమగ్రం, అసంపూర్ణం. అందువల్లే అనాదిలోనే మనిషి, తన భావాల్ని, ఆవిష్కరించడానికి మౌఖికాన్ని అన్వేషించాడు. అదిగో... అప్పుడే భాష పుట్టింది. ఆది మానవుడి ఆకలి నుండి, ఆక్రోషం దాకా, దు:ఖం నుండి, ఆనందం దాకా ...భాష అతడికి తోడు నీడై నిలబడింది. అతడి గుండెల చప్పుడై నినదించింది. తన జీవనానికి, తన జీవితానికి, తన నడకకు, తన నడతకు, తన ఊహకు, తన ఊసుకు, తను సంస్కృతికి, తన సభ్యతకు, తన ఆలోచనకు, తన ఆశయానికి భాషనే సాధనంగా చేసుకున్నాడు మనిషి. దానినే తోటి మనుషులకు పంచాడు. తోటి వారందరితోనూ పంచుకున్నాడు. తన భాష ద్వారానే తనకు గుర్తింపు తెచ్చుకొన్నాడు. మరి కొన్నాళ్ళకు భాష, జాతి వాచకంగా మారిపోయింది. జాతుల ఆధిక్యతా పోరాటంలో కొందరు విజయాల్ని సాధించి ప్రపంచాన్ని ఆక్రమించుకొన్నారు వారితో





జీవన ప్రస్థానం నిండా కీర్తిగౌరవాల్ని నింపుకొంటూ, భాషా సేవలో తరిస్తున్న నిత్యకృషీవలుడు మండలి బుద్ధప్రసాద్.

మండలి వారిది దివిసీమ. ఆ కుటుంబం తొలినుండీ క్రమశిక్షణకు, నిరాడంబరతకు పెట్టిందిపేరు. వారి తాతగారైన కీర్తిశేషులు మండలి వెంకట్రామయ్య (1890–1969) ఉత్తమ ఉపాధ్యాయుడు. 1947లో ఆయన పదవీ విరమణ చేసినప్పుడు ప్రజానీకమంతా ఒక్కటై, వారిని ''ఉపాధ్యాయ పితామహ'' అని ప్రశంసించింది. బుద్ధప్రసాద్‌గారి తండ్రి వెంకటకృష్ణారావు (1926–1997), తల్లి శ్రీమతి ప్రభావతి. వెంకటకృష్ణారావుగారి మీద బాల్యంనుండి మహాత్మాగాంధీ ప్రభావం పడింది. విద్యార్థిగా ఉన్నప్పుడే వారు ఖద్దరు ధరించేవారు. ఆజీవపర్యంతం గాంధేయ విధానంలో నడచిన గొప్ప వ్యక్తిత్వం ఆయనది. భాషా సంస్కృతుల వికాసం కోసం పరితపించిన హృదయం ఆయనది. ప్రపంచంలోని అనేక దేశాలలో జీవిస్తున్న తెలుగువారిని, హైదరాబాద్‌కు ఆహ్వానించి, ఈ దేశ ప్రజలందరితో కలిసి, ఘనంగా, గర్వంగా తొలిసారిగా ప్రపంచ తెలుగు మహాసభల్ని నిర్వహించి, అందరిచేత ఔరా అనిపించుకొన్న నాయకోత్తముడు మండలి వెంకటకృష్ణారావు.

**దివ్య నదీమతల్లి కృష్ణవేణి...** ఎన్నెన్నో దేవాలయాలు... ఎందరెందరో దేవతామూర్తులు... మరెన్నో కథారూపాలు ఇంకెన్నో కావ్యగీతాలు, కృష్ణమ్మ చుట్టూ అల్లుకుపోయాయి. పడమటి కొండల్లోని మహాబలేశ్వరంలో పుట్టిన కృష్ణమ్మ ఎంతో దూరం ప్రయాణించి, ఎన్నో ఒడిదుడుకుల్ని అతిక్రమించి, చివరకు

పాటుగా, వారి భాషలు ప్రపంచమంతా ఆవరించాయి. బలవంతుడు, బలహీనుడ్ని ఆక్రమించుకొన్నట్టే, పాలకుల భాష, పాలితుల భాషలమీద బండపెత్తనం చెలాయించింది. ఆ పెత్తనానికి అణగిపోయిన మనుషులు, తమ భాష ఇదీ అని చెప్పుకోవడానికి కూడా సిగ్గుపడే స్థితికి, తమ భాషతో మాట్లాడేందుకు భయపడే పరిస్థితికి చేరుకొన్నారు. అటువంటి వారిలో మనమూ ఉన్నాము. ఆ మాట కొస్తే మొదటి వరుసలోనే మన తెలుగు వాళ్లున్నాము. కనీసం సంతకం చెయ్యడానికి కూడా మన తెలుగు పనికి రాదని, పిల్లల చేత నోరారా "అమ్మా" అని పిలిపించుకోవడానికి కూడా మన తెలుగుకు అర్హతలేదని భావిస్తూ, అనుక్షణం ఆత్మన్యూనతాభావంతో కృంగిపోతున్న దీనస్థితి మన తెలుగు వాళ్ళది. అరవై అయిదేళ్ళ స్వరాజ్యంలో, రోజు రోజుకీ భాషాపరంగా వెనకడుగు వేస్తూ మన వ్యక్తిత్వాన్ని క్రమంగా కోల్పోతున్న విషాదసన్నివేశం మనది.

దీనమైన ఈ స్థితిలో, హీనమైన ఈ పరిస్థితిలో ఈ రోజు భాషా సంస్కృతుల పరిరక్షణకు ఒక నాయకుడు కావలసివచ్చాడు. కొడిగట్టిపోతున్న భాషాభిమానాన్ని నిలబెట్టే ఓ సమర్థుడు అవసరమయ్యాడు. భాషాప్రేమికుల వెన్నుతట్టి ముందుకు నడిపించే ఓ ఆత్మీయుడు అవసరమయ్యాడు అదిగో... ఆయనే బుద్ధప్రసాద్. మండలి బుద్ధప్రసాద్ కన్నతండ్రి నుండి వారసత్వంగా లభించిన సేవా ధర్మాన్ని, కన్నతల్లి నుండి నేర్చుకొన్న అక్షర రూపాన్ని, తనదైన రీతిలో స్వంతం చేసుకొని, అడుగులో అడుగువేస్తూ స్థిమితంగా, స్థిరంగా, ప్రశాంతంగా సాగుతూ, సాగి వచ్చిన


*తండ్రి మండలి వెంకట కృష్ణారావు గారితో బుద్ధప్రసాద్*

దివిసీమలోని హంసలదీవి దగ్గర సముద్రుడ్ని కలిసిపోతుంది. నడిచినంత మేరకూ నాగరికతను పండిస్తూ, మానవ జీవనాన్ని సస్యశ్యామలం చేస్తూ సాగిపోతుంది కృష్ణమ్మ.

బాల్యంలోనే బుద్ధప్రసాద్‌కి ఈ నదీమతల్లి అసలు రహస్యం అర్ధమైంది. తన జీవితమంతా నదిలా బ్రతకాలని, లోకానికి ఇవ్వగలిగినంతా ఇవ్వాలని, అసలు ఇవ్వడంలోనే అసలైన తృప్తి, ఆనందం ఉన్నాయని, చిన్ననాడే ఆయనకు దృఢమైన నమ్మకం, విశ్వాసం ఏర్పడ్డాయి.

దివిసీమలోని వారిల్లు గాంధీక్షేత్రం. మహాత్ముడి ఆలోచనలతో, ఆశయాలతో ప్రభావితమైన తాత, తండ్రులు, సహనానికి ప్రతిరూపంగా నిలిచిన కన్నతల్లి దానికి తోడుగా ఇంటికి వచ్చి పోయే ప్రసిద్ధ నాయకులు, స్వాతంత్ర్య సమరయోధులు... ఇలా ఎన్నో విషయాలు బాల్యం నుండే ఆయనపై ఎంతో ప్రభావాన్ని చూపించాయి.

అవనిగడ్డలో జరిగిన అఖిల భారత నిర్మాణ కార్యకర్తల మహాసభ, ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సేవకుల మహాసభలు ఆనాడే బుద్ధప్రసాద్‌లోని నిర్వహణాసామర్థ్యాన్ని లోకానికి వెల్లడిచేశాయి. సరిగ్గా ఇప్పుడే.. ఇక్కడే... ఆయనకు తన జీవన సూత్రం పరిచయం అయ్యింది. గాంధీ మహాత్ముడి పద్దెనిమిది సూత్రాల నిర్వహణా కార్యక్రమం ఆయనకు ఎంతగానో తెలియవచ్చింది. ఆ నిర్మాణా కార్యక్రమంలోని ఓ ప్రధాన సూత్రం–మాతృభాష. మనసారా మాతృభాషను ప్రేమించాలనే మహాత్ముడి మాటలు... ఆ వయసులోనే ఆయన మనసును ఆక్రమించాయి. ఆ మాటలే ఆయనకు తారకమంత్రమయ్యాయి. నాటినుండీ తెలుగు భాషా




వికాసమే ఆయన జీవనక్షేత్రమయ్యింది. అదే ఆయన జీవన ధర్మమయ్యింది. దాదాపుగా నాలుగు దశాబ్దాలుగా, నిరంతరంగా సాగుతున్న కృషి ఆయనది. సాగిస్తున్న తెలుగు భాషా ఉద్యమస్ఫూర్తి ఆయనది.

ముఖ్యంగా గత దశాబ్దమంతా తెలుగుభాషాభివృద్ధే ఆయన కార్యక్షేత్రం. ఈ మధ్యకాలంలో ఆయన శాసనసభ్యుడిగా పనిచేసినా, రాష్ట్రమంత్రివర్గంలో పశుసంవర్ధక, మత్స్యశాఖామంత్రిగా సేవలందించినా అవి కేవలం ఆయనకు వృత్తి లాంటివే. ప్రవృత్తి మాత్రం భాషా సేవే. అందులో ఎన్నో .. ఎన్నెన్నో సంఘటనలు.. మరెన్నో ఉద్యమాలు. 2002 నవంబర్ 1,2 తేదీలలో కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళం క్షేత్రంలో బుద్ధప్రసాద్‌గారి ఆధ్వర్యంలో "తెలుగు భాషోద్యమ సమాలోచన శిబిరం" జరిగింది. దాని ఫలితంగా "తెలుగుభాషోద్యమ సమాఖ్య" అవతరించింది. నిజానికి ఇది రెండవ తెలుగు భాషోద్యమం అని చెప్పుకోవచ్చు. 21–3–2003న కాంగ్రెస్ శాసనసభ్యుడిగా ఆయన ప్రాధమిక విద్యాపరంగా తెలుగు భాషకు జరుగుతున్న అన్యాయాన్ని ఎలుగెత్తి చాటారు. అంతేకాక కనీసం నర్సరీనుండి 5వ తరగతి వరకైనా అన్ని పాఠశాలల్లో తప్పనిసరిగా, తెలుగు బోధించాలని కోరుతూ, ఓ అనధికార తీర్మానాన్ని ప్రవేశపెట్టారు బుద్ధప్రసాద్. ఎందరో పెద్దలు ఆ తీర్మానాన్ని గట్టిగా బలపరిచారు. ఆనాటి



విద్యాశాఖామంత్రి మండవ వెంకటేశ్వరరావు హామీ ఇచ్చారు కూడా! నిజానికి మనరాష్ట్రంలో చాలా పాఠశాలల్లో తెలుగు చదవకుండానే, చదువు పూర్తయిపోయే పరిస్థితి ఉంది అంటే, నమ్మశక్యం కాదు. కానీ అది నిజం బుద్ధప్రసాద్ పోరాటఫలమే గవర్నమెంట్ ఆర్డర్ 86. పదవతరగతి వరకూ తెలుగు తప్పనిసరి చేస్తూ, ప్రభుత్వం ఇచ్చిన ఉత్తర్వు ఇది. ఒక రకంగా ఇది బుద్ధప్రసాద్ కృషికి లభించిన ఫలం.



**విషయం చిన్నదే కానీ, అందరి గౌరవానికీ సంబంధించినది అది....**

కోట్లాది తెలుగు ప్రజల పాలనా కేంద్రమైన, హైదరాబాద్ సచివాలయానికి సెక్రటేరియట్ అనే ఇంగ్లీషు బోర్డు ఉండేది.



బోర్డులో ఏముందిలే అంటే సరే. కానీ ఆ బోర్డు తెలుగులో లేకపోవడం, మనందరికీ అవమానం అనుకొంటేనే. అదెంత ఘోరమో, అపరాధమో తెలుస్తుంది. బుద్ధప్రసాద్ ఈ విషయం మీద ఒక పెద్ద ఉద్యమం చెయ్యడం, అరెస్ట్ అవ్వడం.. చాలా... చాలా... జరిగాక, ఈనాడు తెలుగులో సచివాలయం అని కన్పిస్తోంది.

ఫిబ్రవరి 21-2006. ఆరోజు చరిత్రలో ఎంతో ప్రాముఖ్యమైన రోజు. అవిభక్త పాకిస్తాన్‌లో భాగంగా ఉన్న, ఆనాటి బంగ్లాదేశ్‌లోని ఢాకా విశ్వవిద్యాలయ విద్యార్థులు భాషకోసం పాకిస్తాన్ పోలీసుల తుపాకీ గుళ్ళకు ప్రాణాలర్పించిన రోజు. అందుకే ఆ రోజున దేశదేశాలలో మంత్రులనుండీ, ప్రతిపక్ష నాయకుల వరకూ, శాసనసభ్యుల నుండీ, పార్లమెంట్ మెంబర్స్ వరకూ, అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం జరుపుకొంటున్నారు. ఆ పవిత్ర సందర్భంగా, సాక్షిగా ఇందిరా పార్క్ దగ్గరగా ఉన్న సత్యాగ్రహచౌక్‌లో సాహితీవేత్తలతో సామూహిక సత్యాగ్రహం నిర్వహించి తెలుగు భాషకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రపంచం ముందుంచారు.

తమిళభాషకు ప్రాచీన భాషా హోదాను ఇచ్చి, తెలుగుకు మొండిచెయ్యి చూపించినప్పుడు చాలా బాధపడ్డారు బుద్ధప్రసాద్. రాష్ట్రంలోని ఎందరెందరో ప్రముఖుల్ని కలుసుకొని, కలుపుకొని, అందరితో చర్చించి, తెలుగుకు ప్రాచీన భాషగా గుర్తింపు పొందడానికి ఓ మహా ప్రయత్నమే చేశారు. బుద్ధప్రసాద్ ప్రయత్నం



వెనుక శ్రీ బుద్ధప్రసాద్ కృషి. ఎంతో ఉంది. 2008లో చిన్నయ సూరి ద్విశతాబ్ది ఉత్సవాలు, తెలుగు భాషా ప్రాచీనత-విశిష్టతలపై జాతీయసదస్సు. ఇవన్నీ శ్రీ బుద్ధప్రసాద్ నిర్వహణలోని అంశాలే. ఆగస్టు 2008లో మచిలీపట్నం నుండి నెల్లూరు వరకూ 300 మంది సాహితీవేత్తలతో, తెలుగు భాషా చైతన్య యాత్రలో పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ కలిసి చేసిన నిర్వహణ భాషాభిమానుల మెప్పు పొందింది.

ఓ ఉద్యమమయ్యింది.

అందరూ ఒక్కటై నిలిచారు. అందరి ఆశలూ ఫలించాయి. తెలుగు ప్రాచీన భాషా హోదాని సాధించుకొంది. ఆనాటి ముఖ్యమంత్రి మొదలు, అతి సామాన్య ఉద్యోగి వరకూ, గ్రామాలలోని ఓ ఉపాధ్యాయుడి నుండీ, విశ్వవిద్యాలయ ఉపకులపతి వరకూ, దిన, వార, పక్ష పత్రికల నుండీ, టెలివిజన్ ఛానళ్లవరకూ... ఇలా ఎందరో ఆ ఉద్యమంలో భాగస్వాములయ్యారు. వారందరి వెనుకా కన్పించే అసలు స్ఫూర్తి మాత్రం నిస్సందేహంగా శ్రీమండలి బుద్ధప్రసాద్‌దే. ఆయన భాషోద్యమంలో పతాక సన్నివేశం ఇది.

మండలి బుద్ధప్రసాద్ భాషా ప్రస్థానంలో ఎన్నెన్నో మధుర ఘట్టాలు దర్శనమిస్తాయి.

2006లో జాతీయ తెలుగు రచయితల మహాసభలు నిర్వహించి, తెలుగు భాషోద్యమానికి మరింత శక్తినిచ్చారు. మారుతున్న కాలానికి అనుగుణంగా యూనికోడ్‌ఫాంట్ తెలుగు అనే అంశంపై 2007లోనే విజయవాడలో ఒక జాతీయ సదస్సుకు రూపకల్పన చేయడం, 2011లో హైదరాబాద్‌లో అంతర్జాతీయ సదస్సును నిర్వహించి సిలికానాంధ్ర సహకారంతో, కొత్తగా మూడు తెలుగు ఫాంట్స్‌ని అందరికీ అందుబాటులోకి తేవడం, అతి త్వరలో మరిన్ని ఫాంట్స్‌ని అందించబోవడం దీని

2011 ఆగస్టులో ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు విజయవాడలో వైభవంగా నిర్వహించిన ఘనత బుద్ధప్రసాద్ గారికే చెందుతుంది. మారిషస్‌లో తెలుగు మహాసభల్ని నిర్వహించినా, లండన్‌లో ప్రతిష్ఠాత్మకంగా తెలుగు చరిత్ర మహాసభల్ని విజయవంతం చేసినా అదంతా ఆయన కృషే.

ఇలా చెప్పాలంటే.. ఎంతో...ఎంతో...

ఒక్కమాటలో చెప్పాలంటే తెలుగు భాషాభివృద్ధి అనే మాట, ఎక్కడ వినబడుతుందో అక్కడ బుద్ధప్రసాద్ గారుంటారు. అది సత్యం. ఆయనలోని కన్పించే మరొక గొప్ప లక్షణం ఆయన సేవానిరతి. 1977వ సంవత్సరం నవంబర్ 19వ తేదీన దివిసీమ




*వెంపటి చిన సత్యంను సత్కరిస్తున్న బుద్ధప్రసాద్*

ఘోరప్రమాదానికి గురయింది. ప్రకృతి సృష్టించిన విలయంలో వందలాది గ్రామాలు విలవిలలాడాయి. వేలాదిమంది మరణించారు. లక్షలాది మంది నిరాశ్రయులయ్యారు. మానవజీవితమంతా అతలాకుతలమైపోయింది. ఆ స్థితిలో ఆపన్నులను ఆదుకోవడానికి ముందడుగు వేసిన, తనతండ్రితో కలిసి, బుద్ధప్రసాద్ అవిశ్రాంతంగా శ్రమించారు.


తెలుగు చిత్రకళావైభవం డాక్యుమెంటరీని ఆవిష్కరిస్తున్న బుద్ధప్రసాద్‌తో కొల్లూరి, కళాసాగర్

ప్రభుత్వమూ, అధికారులు అడుగుపెట్టకముందే, ఆయన పునర్నిర్మాణ కార్యక్రమాలకు ఉద్యమించారు. బాధితుల్ని పరామర్శించారు. వారికి అవసరమైన అన్ని రకాల సహాయాన్ని అందించారు. జాతీయ, అంతర్జాతీయ సహాయసంస్థలకు తోడు నిలిచారు. ప్రకృతి సృష్టించిన ప్రళయాన్ని, అధిగమించి ప్రజాజీవనాన్ని యథాస్థాయికి తీసుకు వచ్చేంతవరకూ బుద్ధప్రసాద్ నిద్రపోలేదు. అదీ ఆయన నిబద్ధత.

దివిసీమలో-తుఫాను భీభత్సం సృష్టించిన విధ్వంసానికి మరొక పీడకలగా చెప్పవలసినది **అనాధలుగా మిగిలిపోయిన పిల్లలు.** తల్లితండ్రుల్ని కోల్పోయి అనాధలుగా మిగిలిపోయిన ఎందరో బాలబాలికల్ని తనతో తెచ్చి, వారి కోసం ఓ అనాధశరణాలయాన్ని నెలకొల్పి, వారి బాగోగులు చూసిన మానవతామూర్తి బుద్ధప్రసాద్.

దివిసీమ వాసుల చిరకాల కోరికైన పెనుమూడి వారధికోసం, తన శాసనసభా సభ్యత్వాన్నే వదులుకోవడానికి సిద్ధమైన ప్రజాభిమాని బుద్ధప్రసాద్. హంసలదీవిని యాత్రాస్థలిగా తీర్చిదిద్దినా, కృష్ణాడెల్టా ఆధునికీకరణ కార్యక్రమానికి అనుమతి సాధించినా, పశుసంవర్ధక మత్స్యశాఖామంత్రిగా పశుక్రాంతి, జీవక్రాంతి పథకాలు ప్రవేశపెట్టినా, ఆర్థర్ కాటన్ మునిమనుమడైన రాబర్ట్ కాటన్‌ను మన రాష్ట్రానికి ఆహ్వానించి గౌరవించినా, మైసూరులోనూ, బ్రహ్మపురంలోనూ, చెన్నైలోనూ, మంబయిలోనూ, బెంగుళూరులోనూ తెలుగు ఉత్సవాలు, తెలుగు సభలు నిర్వహించినా... అదంతా ఆయన సమర్థతే, ఆయన నిర్విరామకృషే.

ఇంత సమర్థుడ్ని, ఇంత శక్తిపరుడ్ని, ఇంతటి సౌజన్యశీలిని, ఇంతటి మానవతామూర్తిని ఇంతటి భాషాప్రేమికుడ్ని ఇంతటి ప్రజాసేవానురక్తుడ్ని, ఈరోజు తెలుగు అధికార భాషా సంఘ అధ్యక్షుడిగా ఎంపిక చేసుకొన్నందుకు ఈ ప్రభుత్వాన్ని అభినందించాలి. నిజానికి ఈ పదవి వల్ల శ్రీ బుద్ధప్రసాద్‌కు కొత్తగా లభించిన గౌరవం ఏదీ లేదు. బుద్ధప్రసాద్ గారి వల్ల ఈ పదవికే కొండంత గౌరవం లభించింది. అది శాశ్వతం కావాలనేదే మా అందరి ఆశ... ఆకాంక్ష...

సకల విద్యాధిదేవతయైన సరస్వతీదేవి, ఆయనకు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించి, తెలుగు భాషా సేవలో చరితార్థుడ్ని చేయాలి. శుభం.

*email: vadrevusundarrao@gmail.com*

*Cell: 91 9396473287*

సంగీతం

# పద్మశ్రీ యెల్లా వెంకటేశ్వరరావు



సప్త సముద్రాలు ఏకమైన ఘోషను మీరు ఎప్పుడైనా విన్నారా..?
పోనీ... మనసుతాకే ఆ మధుర తుషారాలను ఆస్వాదించారా?

మృదంగ వాయిజ్యం అంటే ప్రక్క వాయిజ్యంగా పడిఉన్న రోజుల్లో... ఓ విద్వాంసుడు నేనున్నానంటూ వచ్చి చెలరేగాడు... వేలికొసలతో వేవేలనాదాలు సృష్టించి ప్రేక్షకులను ఆనంద తాండవమాడించాడు.

మృదంగంపై ప్రయోగాలే ప్రాణప్రదంగా, సంగీత సునామీలు సృష్టించిన ఆ లయరాజు, మన సంగీత వైభవాన్ని విశ్వమంతా చాటిన విద్వణ్మణి పద్మశ్రీ యెల్లా వెంకటేశ్వరరావుగారు.

తమ జీవిత విశేషాలను '64కళలు'కి వివరించారు.

యెల్లా వెంకటేశ్వరరావుకి సంగీతం మూడు తరాల వారసత్వం. మృదంగం వారి వంశానికే పట్టుగొమ్మ. వారి తాతగారు యెల్లా వెంకట లింగం, చినతాత వీరాస్వామి మార్దంగికులు. ఇద్దరూ స్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైలుకెళ్లారు. నాయనమ్మ మల్లమ్మ గాయకురాలు. లేచినప్పటి నుంచి మేలుకొలుపుతో మొదలు పెట్టి, ఊర్మిళ నిద్రని ఆలపించి, స్వామికి పవళింపు దాకా పాటలు పాడేవారు. పసితనంలోనే నాయనమ్మకి యెల్లా మృదంగంతో సహకరించేవారు. ఇక తల్లి మహాలక్ష్మి గాయకురాలు. తండ్రి రామ్మూర్తిగారు ద్వారం వెంకటస్వామి నాయుడుగారి దగ్గర వయొలిన్ నేర్చుకున్నారు. తంజావూరు వెళ్లి పాపా వెంకట్రామయ్యర్ దగ్గర ఆ సంగీతానికి పదును పెట్టుకున్నారు. అయితే ఆయన సంగీతం వ్యక్తిగతం. మనోగతం. ఎన్నడూ కచ్చేరీలు చేసేవారు కాదు. పిలిచి ఆలిండియా రేడియోలో ఉద్యోగం ఇస్తానన్నా వద్దన్నారు. పెదనాన్న యెల్లా సోమన్నగారు స్వయానా పాల్ఘాట్ మణికి ప్రథమశిష్యులు. ఆయన రేడియోలో ఆస్థాన విద్వాంసునిగా పనిచేశారు. ఆయనకి వందమందికి పైగా శిష్యులు. ఆయనకి పిల్లలు లేరు. అందుకని తమ్ముడి కొడుకైన యెల్లా వెంకటేశ్వరరావును పెంచుకున్నారు. భగవంతుని లీల! ఆ తరవాత ఆయనకి అయిదుగురు సంతానం కలిగారు వెంకటేశ్వరరావుకి పెదనాన్నంటే భయం. ఆయన ఇంట్లో లేనప్పుడు మృదంగం వాయించేవాడు.

ఇంతలో ఓ సంఘటన జరిగింది. ఓ తొమ్మిదేళ్ల కుర్రాడిని సైకిలు మీద కూర్చోబెట్టుకుని ఒకాయన సోమన్న దగ్గరకి వచ్చారు. విజయవాడలో కన్నడ సేవా సంఘం వినాయక చవితినాడు నిర్వహించే కచ్చేరీకి మృదంగ సహకారం కావాలన్నారు. ఆయన కొడుకు వేణువు వాయిస్తాడు. సోమన్న తన శిష్యవర్గాన్ని చూశారు. ఈ తొమ్మిదేళ్ల కుర్రాడికి ఎవరు మృదంగ సహకారం చేస్తారు? ఆయనకు ఓ ఆరేళ్ల కుర్రాడు కనిపించాడు అతనే యెల్లా వెంకటేశ్వరరావు. 'నువ్వు వాయించరా' అన్నాడాయన ప్రపంచం కృష్ణమూర్తి. పారుపల్లి రామకృష్ణయ్యగారి శిష్యుడు. ఆయన కుమారుడు, ఆనాటి బాల వేణు విద్వాంసుడు, ఇప్పటి ప్రముఖ వేణు విద్వాంసులు ప్రపంచం సీతారాం. చిన్న నిక్కరు, ఖద్దరు చొక్కాతో మృదంగం ముందు కూర్చున్నాడు ఆరేళ్ల కుర్రాడు. తొమ్మిదేళ్ల కుర్రాడు వేణువు పలికించాడు. రెండు ప్రభంజనాలు సంగీత ప్రపంచాన్ని చుట్టుముట్టాయి.

విజయవాడ రేడియోలో పిల్లల కార్యక్రమాన్ని ఏడిద కామేశ్వరరావుగారు నిర్వహించేవారు. అందులో మృదంగం, ఘటం కాకుండా 'వాద్యబృందం' నిర్వహించేవాడు వెంకటేశ్వరరావు. ఓసారి అప్పటి కేంద్రసమాచార శాఖమంత్రి డాక్టర్ బి.వి. కేల్కర్ విజయవాడ వచ్చారు. పిల్లలతో యెల్లా వాద్యబృందాన్ని నిర్వహించారు. పదేళ్ల యెల్లాని మంత్రి ఆనందంతో దగ్గరకు తీసుకుని నూరు రూపాయల బహుమతినిచ్చారు.

అప్పట్లో విజయవాడ రేడియో కేంద్రం ప్రముఖ విద్వాంసుల నిలయం. దండమూడి రామమోహనరావు, సింహాద్రి శాస్త్రి, క్రొవ్విడి హనుమంతరావు గార్లు ఉండేవారు. ఆ రోజుల్లోనే అంటే పదీ పదకొండేళ్ల వయసులోనే క్రోవి సత్యనారాయణ శర్మ, బాల మురళీకృష్ణ, శ్రీరంగం గోపాలరత్నం, వోలేటి వెంకటేశ్వర్లు కచ్చేరీలకు యెల్లా మృదంగ సహకారం చేశారు. 1961లో ఆలిండియా రేడియో జాతీయ స్థాయిలో సంగీత పోటీలను నిర్వహించింది. 16 ఏళ్ల యెల్లా మృదంగ వాద్యంలో ప్రథమ స్థానంలో నిలిచారు. అంతే, 1962లో ఆలిండియా రేడియోలో ఉద్యోగంలో చేరారు. ఆ తర్వాత రాజమండ్రి, బందరు, విశాఖ వంటి పట్టణాలలో కచ్చేరీలు చేస్తూ, బంగారు పతాకలు, సత్కారాలు పొందుతూ జైత్రయాత్రచేశారు. యెల్లా వెంకటేశ్వరరావు వివాహం మేనత్త కూతురైన త్రిమూర్తులమ్మతో జరిగింది. ఆనాటి కచ్చేరాలకు ఆయన పారితోషికం అర్ధనూటపదహార్లు, దెబ్బయి అయిదు, నూట పదహార్లు ఇలా ఉండేది. ఆ విధంగా ప్రారంభమైన యెల్లా జీవితంలో న్యూయార్క్, చికాగోలతో జరిపిన సోలో కచ్చేరీల్లో 5 లక్షల పారితోషికం తీసుకున్నారు.

1969లో ఒక విచిత్రం జరిగింది. నాగార్జున సాగర్ డ్యామ్ నిర్మాణం జరిగే రోజుల్లో అక్కడి ఇంజనీర్లు, ఆఫీసర్లు, సిబ్బంది మంచాల జగన్నాథరావుగారి వీణ కచ్చేరీని ఏర్పాటు చేశారు. యెల్లా వెంకటేశ్వరరావు మృదంగ సహకారం. యెల్ల ముందుగా నాగార్జునసాగర్‌కి చేరుకున్నారు. మంచాల జగన్నాధరావుగారు హైద్రాబాద్ నుంచి రావాలి. కచ్చేరీ టైము దగ్గర పడుతున్నా మన జాడలేదు. కారణాన్ని కనుక్కునే అవకాశంలేదు. నిర్వాహకులకు ఏం చేయాలో తోచక యెల్లా దగ్గరకి పరిగెత్తారు. "మీరేమైనా ఆపద్ధర్మంగా కాపాడగలరా" అనడిగారు. ఒక్క క్షణం ఆలోచించి "సరే సోలో వాయిస్తాను" అన్నారు యెల్లా ఏం వాయించాలి? మొదట ఆది తాళంలో వాద్యాన్ని ప్రారంభించారు. గంట గడిచిపోయింది. ప్రేక్షకులకి ఈ తరహా కచ్చరీ కొత్తే. మెల్లగా మృదంగం మీద విన్యాసాలు ప్రారంభించారు యెల్లా. ప్రేక్షకులు వెర్రెత్తిపోతున్నారు. వర్షపు చినుకు పడే శబ్దం, పిడుగులు, సముద్ర ఘోష, రైలు నడక, అలా తెలియకుండానే మూడున్నర గంటల కచ్చేరీ సాగిపోయింది. మర్నాడు పేపర్లన్నీ యెల్లా కచ్చేరీని ఆకాశానికెత్తేశాయి. యెల్లా జీవితంలో మరో కొత్త గొప్ప ప్రక్రియకి యాదృచ్ఛికంగా తెరలేచింది.

తర్వాత జీవితంలో ఎన్ని ఫ్యూజన్ కచ్చేరీలు! సితార్, వేణువు, వయొలిన్, తబలా, కీబోర్డ్‌లతో రకరకాల ప్రయోగాలు చేశారు. ఒకసారి కర్ణాటకలో 100 వాద్యాలతో తనే స్వయంగా రూపకల్పన చేసిన వాద్య బృందాన్ని నిర్వహించారు. కేవలం వినికిడి ద్వారానే జాజ్, ఆఫ్రికన్ డ్రమ్స్, చైనా సంగీతాన్ని సాధన చేశారు. 25 ఏళ్ల వయసులోనే రవిశంకర్ సితార్ కచ్చేరీకి కిషన్ మహరాజ్ తబలా వాయించగా, యెల్లా మృదంగం వాయించారు.

మహారాష్ట్రకి కోన ప్రభాకరరావు గవర్నరుగా ఉన్న రోజుల్లో ప్రపంచ ప్రఖ్యాత తబలా విద్వాంసులు ఉస్తాద్ అల్లారఖా, పద్మశ్రీ విక్కు వినాయక్ రామ్ ఘటం, యెల్లా మృదంగం కలిసి జాతీయ సమైక్యతా కార్యక్రమంగా కచ్చేరీ చేశారు. దేశానికే గర్వకారణమైన విజయాన్ని 1979లో యెల్లా సాధించారు. ఇండోనేషియాలో 79 దేశాలు అంతర్జాతీయ రేడియో సంగీత పోటీలలో పాల్గొన్నాయి. యెల్లా వెంకటేశ్వరరావు పరమశివుని అవతార తత్వం మీద ఒక





సంగీత రూపకాన్ని తనే సృష్టించి, దర్శకత్వం వహించి, ప్రయోక్తగా తయారు చేశారు. ఆ రూపకానికి ఆయన భారతదేశానికి ఉత్తమ బహుమతిని అందుకున్నారు.

జీవితంలో మరిచిపోలేని సంఘటనలన్ని చెప్పమంటే ఈమని శంకరశాస్త్రిగారితో యూరప్ దేశాల పర్యటన, ప్రముఖ వేణువు విద్వాంసులు టి.ఆర్. మహాలింగం గారితో యూరప్ పర్యటన గుర్తుచేసుకున్నారు. ఒకసారి చెంబై వైద్యనాథ అయ్యర్ కచ్చేరీకి యెల్లా మృదంగం వాయించారు. శంకరాభరణంలో 'ఎందుకు పెద్దల వలె' అద్భుతంగా గానం చేశారు చెంబై. యెల్లా తినయా వృత్తం వాయించారు. తన్మయులైన చెంబై ఒక మాలని యెల్లా మెడలో వేసి ఆశీర్వదించారు. "పాల్ఘాట్ మణియ అయ్యర్ చిన్నప్పుడు ఇలా వాయించేవాడు"అని సబికులకు చెప్పారు చెంబై. ఎంత గొప్ప కితాబు! ''అప్పటి నుంచీ నా జాతకం మారిపోయింది'' అంటారు యెల్లా ఆనాటి చెంబై ఆశీర్వాదాన్ని గుర్తుచేసుకుంటూ.

ఇక హైదరాబాదు 'సుర్ శృంగార్' నిర్వహించిన సభలో హరిప్రసాద్ చైరసియా, ఎన్.రమణి వేణువు వాయించగా జకీర్ హుసేన్ తబలా, యెల్లా వెంకటేశ్వరరావు మృదంగం వాయించారు. కచ్చేరీ ఆరున్నర గంటలు సాగింది! ప్రేక్షకులు రాత్రి ఒంటి గంట దాకా ఒళ్లు మరిచిపోయి విన్నారు.

మైసూరులో మధురై సోమసుందరం కచ్చేరీలో ఎమ్.ఎస్. గోపాలకృష్ణన్ వయొలిన్, యెల్లా మృదంగం. కచ్చేరీ ఏడు గంటలు సాగింది. గోపాలకృష్ణనం వేల్లు కొంకర్లుపోయి వయొలిన్ కిందపెట్టేశారు. జపాన్‌లో ఒక సోలో కచ్చేరీలో ప్రేక్షకులలో ఒకరిద్దరు పరవశులై ఏడ్చేశారు.

యెల్లా సంగీతాన్ని మరొక మలుపు తిప్పిన సంఘటన హైదరాబాద్‌లో జరిగింది. హెచ్.ఎమ్.టి కాలనీలో ఆఫీసర్స్ క్లబ్బులో ఒక సోలో కచ్చేరీ జరిగింది. ప్రేక్షకుల్లో ఓ మూగఅమ్మాయి ఉంది. సంగీతం వింటూ ఆమె తనను తాను మరచి పోయింది. కళ్ల నీళ్లు తిరిగాయి. నోటి వెంట ఏదో చెప్పాలన్న శబ్దం వచ్చింది. జీవిలో సుప్త చైతన్యాన్ని మేలుకొలిసే కీలక సాధనంగా సంగీతం ఉపయోగపడవచ్చని, సంగీతం కేవలం ఆనంద హేతువే కాక చికిత్సగా కూడా పనికి వస్తుందని అర్థమైంది. అప్పటి నుంచి ఆయన మృదంగం థెరపీని ప్రారంభించారు. మానసిక వైకల్యాలకు చికిత్స చేసే ఠాకూర్ హరిప్రసాద్ ఇన్‌స్టిట్యూట్‌లో ఈ వైద్యానికి ఒక విభాగాన్ని ప్రారంభించారు. ఇదొక కొత్త ప్రయోగం. ఆశ్చర్యకరమైన స్థాయిలో సత్ఫలితాలు కనిపించాయి.

యెల్లా జీవితంలో మరొక మలుపు ఉంది. అది 1983. ఎన్.టి.రామారావు ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. తెలుగు భాష,





ఈ దశలోనే అంతర్జాతీయంగా గుర్తింపునిచ్చే మరో గొప్ప విజయాన్ని యెల్లా సాధించారు. రాష్ట్రసాంస్కృతిక శాఖ తరపున జరిగిన మృదంగ మహా యజ్ఞంలో హైదరాబాద్ శంకర మఠంలో 1981 ఆగస్టు సాయంకాలం 5 గంటలకు ప్రారంభించి 36 గంటల సేపు మృదంగం వాయించి గిన్నిస్ బుక్‌లోకి ఎక్కారు. 2008 మే10న యెల్లా వెంకటేశ్వరరావుకి పద్మశ్రీ పురస్కారాన్నిచ్చింది.

యెల్లా అభిమాన గాయకులు– టి.ఆర్. మహాలింగం, ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి, డి.కె. పట్టమ్మాళ్ తీరిక

సాహిత్య, లలితకళల కోసం అకాడమీలకు బదులుగా ఒక సంస్థను ఏర్పాటు చేయాలని నార్ల వెంకటేశ్వరరావు, సి.నారాయణ రెడ్డి రిపోర్టు ఇచ్చారు. ఈ కృషికి ఓ విశ్వవిద్యాలయాన్ని ఏర్పరిస్తే బాగుంటుందని సిఫారసు చేశారు. ఆ విధంగా తూమాటి దొణప్ప స్పెషలాఫీసరుగా తెలుగు కళాపీఠం ఏర్పడి క్రమంగా తెలుగు విశ్వ వాద్యాలయంగా మారింది. అప్పుడు హైదరాబాద్ సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్న శ్రీరంగం గోపాలరత్నంను గాత్ర సంగీత విభాగానికి ప్రొఫెసర్‌గా ఆహ్వానించారు. యెల్లాను వాద్య సంగీతం ప్రొఫెసర్‌గా ఆహ్వానించారు. అప్పుడే యెల్లా అన్ని సంగీత శాఖలకీ సిలబస్‌ని తయారుచేశారు. నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు, అన్నవరపు రామస్వామి, ద్వారం దుర్గాప్రసాదరావు, దండమూడి రామమమోహనరావు, కమలాకర రావు... ఇలా 60 మందిని సభ్యుల కమిటీని ఏర్పాటు చేశారు. సంగీతం డిప్లొమా కోర్సు, డిగ్రీ కోర్సులు ఏర్పాటు చేసి సంగీత పాఠశాలల విద్యార్థులకు సాధికారిక డిగ్రీలు ఇచ్చేటట్టు ఏర్పాటు చేశారు.

శ్రీ రంగం గోపాలరత్నం తరువాత విశ్వవిద్యాలయానికి యెల్లా డీన్ అయ్యారు. అన్ని వాద్యాలకు బి.ఏ, ఎం.ఏ కోర్సులు ప్రారంభించారు. కూచిపూడి, భరతనాట్యం, ఆంధ్రనాట్యాలకు ఎం.ఏ కోర్సులు ప్రవేశపెట్టారు. కేవలం ప్రతిభ ప్రాతిపదికనే చలామణి అయ్యే పాండిత్యానికి గుర్తింపు, కొలబద్దలు ఏర్పడ్డాయి. యెల్లా డీన్‌గా పన్నెండేళ్లు పనిచేశారు.

వేళల్లో యెల్లా సంగీతంలో కొత్త పుంతలు వెతికే పరిశ్రమ చేస్తుంటారు. ఇంతవరకూ 1500 మంది శిష్యుల్ని తీర్చిదిద్దారు. యెల్లా వెంకటేశ్వరరావు జీవితంలో మరపురాని సంఘటన... కాశీలో కార్తీకపౌర్ణమి రోజున కాశీ విశ్వనాథుని సమక్షంలో ప్రదోష కాలంలో కచ్చేరీ చెయ్యడం. యెల్లా వెంకటేశ్వరరావు వారసత్వం వారి మనుమలకు దక్కింది. అమ్మాయి కొడుకు అభిషేక్, అబ్బాయి కొడుకు సోమశేఖర్ మృదంగం వాయిస్తారు. తాతగారి దగ్గర నేర్చుకుంటున్నారు. అమెరికాలో ఉన్న ఆరునెలల మనుమడు తాతతో మాట్లాడుతూ 'లయ'తో వేళ్లు కదపడం ఇప్పుడిప్పుడే ప్రారంభించాడు.

ఆరుగురు రాష్ట్రపతులు, నలుగురు ప్రధానులు, ఎనిమిది మంది ముఖ్యమంత్రుల చేతుల మీదుగా ఘన సన్మానాలు పొంది, ప్రాక్పశ్చిమ దేశాలలో విజయ ఢంకా మ్రోగించి, తనదైన బాణీని కేవలం ఆనందానికి మాత్రమే కాక ఆరోగ్యానికి కూడా అన్వయింపజేసిన ప్రజ్ఞాశాలి యెల్లా వెంకటేశ్వరరావు. అయిదో తరానికి సంగీతాన్ని పారంపర్య విద్యగా అందిస్తున్నానని ఆయన చెప్తున్నప్పుడు ఆయన గొంతులో ఆత్మతృప్తి, కాస్తంత గర్వమూ తొణికిసలాడాయి. అవి ఆయన నిరంతర అన్వేషిగా ఒక జీవిత కాలం శ్రమించి సాధించుకున్నవి.

*- యస్. రామకృష్ణారావు*

# స్వర్ణోత్సవ నటుడు జానకీనాథ్

- వాడ్రేవు సుందరరావు
నంది, గరుడ అవార్డుల గ్రహీత

**నిజం.....**

**ఇది నిజం.....**

**గొప్పనటుడు జానకీనాథ్**

**మద్దాలి జానకీనాథ్ నిజంగా... నిస్సందేహంగా గొప్పనటుడు**

కేవలం గొప్పనటుడు మాత్రమే కాదు. మనసా, వాచా, కర్మణా నటనకు అంకితమైన నటుడు. నాటకాన్ని హృదయంతో ప్రేమించిన నటుడు, రంగస్థలాన్ని అనురాగంతో జీవనవేదిక చేసుకొన్న మహానటుడు. తన ఏభై సంవత్సరాల నటనాప్రస్థానంలో వందలాది పాత్రలకు ప్రాణం పోసిన మహాకళాకారుడు జానకీనాథ్. మహారాజుగా దర్శనమిచ్చినా, నిరుపేదగా కన్పించినా, ఆంగ్లేయ అధికారిగా నటించినా, అశోకచక్రవర్తిగా కన్పించినా, నిత్యాగ్నిహోత్రుడైన సద్బ్రాహ్మణుడి పాత్రలో జీవించినా, క్రీస్తు నామాన్ని ప్రచురపరిచే మతపెద్దగా మనందరినీ మంత్రముగ్ధుల్ని చేసినా... అదంతా జానకీనాథ్‌కే చెల్లింది. నవరసాలు నిండిన ఎన్నో పాత్రల్ని, జానకీనాథ్ అభినయించి చూపించినా, ప్రధానంగా కరుణరసపాత్రల్లో ఆయన నటన నిరుపమానం. సాత్వికాభినయంలో ఆయన ప్రతిభ ప్రశంసనీయం. అందుకే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్వహించే నంది నాటకోత్సవాలలో, అత్యుత్తమ నటనకు లభించే నంది పురస్కారం రెండుమార్లు ఆయనను వరించి, ముచ్చటగా మూడోసారి ఆయనింట ప్రవేశించడానికి ఆతృతగా ఎదురుచూస్తోంది.

1950వ సంవత్సరం ఏప్రిల్ 23వ తేదీన గుంటూరు జిల్లాలోని సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన మంగళగిరిలో, జానకీనాథ్ జన్మించారు. వెంకటనరసింహారావు, సరస్వతీదేవిల ప్రియపుత్రుడు ఆయన. తండ్రిలోని క్రమశిక్షణ, తల్లి నుండి ప్రేమాభిమానాలు, ఆయనకు జన్మతః అబ్బిన సుగుణాలు. అందుకే ఎంత ఎత్తుకెదిగినా, అందరితోనూ అంత ఇష్టంగానూ, ఆప్యాయంగానూ మాట్లాడుతారు. జానకీనాథ్‌లోని కళాభిరుచి విద్యార్థిదశలోనే మొగ్గ తొడిగింది. తెనాలి దగ్గరున్న మున్నంగి గ్రామంలో, జానకీనాథ్ బాల్యం గడిచింది. అక్కడే వల్లభాపురం ప్రభుత్వ ఉన్నత పాఠశాల వార్షికోత్సవంలో కావ్యశ్రీ రచించిన నిరుద్యోగి నాటకంతో, రంగస్థల ప్రవేశం జరగడం, తొలిప్రదర్శనలోనే బహుమతిని అందుకోవడం జరిగింది. అది జరిగింది 1962. అప్పటికి ఆయనకు పన్నెండేళ్ళ వయసు. సరిగ్గా



ఇప్పటికి యాభై ఏళ్ళక్రిందటి సంఘటన అది. అంటే ఈ 2012 జానకీనాథ్‌కి నట స్వర్ణోత్సవ సంవత్సరం. గుంటూరులోని హిందూ కళాశాలలో బి.ఎ చదువుతున్న రోజుల్లో, ఎన్నో నాటికల్లో మంచి పాత్రలు పోషించే అవకాశం ఆయనకు లభించింది. ఈనాడు నటుడిగా, దర్శకుడిగా గొప్ప కీర్తిప్రతిష్టలు పొందిన ఎందరికో, ఆరంభం వారి వారి పాఠశాలలు, కళాశాలలే. వారి నటజీవితానికి అవే అసలైన పునాదులు. హిందూకళాశాలలో "మానవుడు, మారీమారని మనుషులు, దేవుడూ... నిద్రలే" వంటి ఎన్నో నాటికలలో నటించి, ఉత్తమనటనకు బహుమతులందుకొన్నారు కూడా!

హిందూకళాశాల అనుభవంతో ఆతరువాత తెనాలిలోని అభ్యుదయకళాసమితి, గుంటూరు వసంతవనీ థియేటర్‌లలో సభ్యుడై, ఆసంస్థల తరపున ఎన్నో నాటికలలో నాటకాలలో, చెప్పుకోదగ్గ పాత్రల్ని పోషించారు. కాలక్రమంలో జానకీనాథ్ జీవనప్రయాణం గోదావరీ తీరాన్ని చేరింది. ఒక గూటి పక్షులన్నీ ఒక్కచోటే చేరినట్లు, నాటకాభిమానులు, నటులు, దర్శకులలో ఎందరో రాజమండ్రి చేరడం, గోదావరీతీరంలో తమ ప్రతిభకు పట్టంకట్టుకోవడం అనూచానంగా

వస్తున్నదే. జానకీనాథ్ జీవితంలోనూ అదే జరిగింది.

రాజమండ్రి వచ్చీరాగానే, ఆయనను రైల్వే ఇన్‌స్టిట్యూట్ నాటక సమాజం ఆహ్వానించింది. భీశెట్టి లక్ష్మణరావు రచించిన "దేవుడూ నిద్రలే" నాటకంతో, రాజమండ్రిలో ఆయన నటప్రస్థానం ఆరంభమైంది. అప్పుడే, జానకీనాథ్‌కు కీర్తిశేషులు తమ్మారెడ్డి జానకీరామనాథం పరిచయభాగ్యం కలిగింది. ఇనుపముక్క అయస్కాంతక్షేత్రంలోకి చేరగానే అయస్కాంతమైనట్లు, ఎలాంటివాడైనా, రామనాథం స్పర్శతగిలితే మహానటుడు అవుతాడని పెద్దలంటారు. సహజంగానే జానకీనాథ్ మంచినటుడు. మరింక చెప్పేదేముంది? రామనాథం నిర్వహణలో మొదటిగా "నాగులు తిరిగే కోనలో" నటించాడు జానకీనాథ్. ఆ తరువాత రామనాథం ఆలోచనల్లో రూపుదిద్దుకొన్న అద్భుతదృశ్యకావ్యం "నన్నయభారతరచన"లో, జానకీనాథ్‌కు ద్రోణాచార్యుడి వేషం లభించడం ఒక ఎత్తైతే, ఆ నాటకానికి వ్యాఖ్యాతగా వ్యవహరించే అదృష్టం కలగడం మరొక ఎత్తు. మద్రాసు (నేటి చెన్నై) మహానగరంలో, నటసార్వభౌముడైన ఎన్టీఆర్ ఎదుట నన్నయభారతరచన ప్రదర్శించి, ఆ మహానుభావుడి ప్రశంసలందుకోవడం నిజంగా జానకీనాథ్ అదృష్టమేననాలి. తిరుపతిలోని శ్రీవేంకటేశ్వరా విశ్వవిద్యాలయంలో, శ్రీహరికోట అంతరిక్ష పరిశోధనా కేంద్రంలోనూ ఆనాటకం ప్రదర్శించడం, జానకీనాథ్ వ్యాఖ్యానానికి అందరి ప్రశంసలూ లభించడం, ఆయన జీవితంలో ఒక మధురఘట్టం. ఆయన ఆకాశవాణిలో "ఎ" గ్రేడ్ కళాకారుడు. దూరదర్శన్‌లో గుర్తింపు తెచ్చుకొన్న ప్రతిభావంతుడు.



తిరుమల తిరుపతి దేవస్థానం వారి శ్రీవేంకటేశ్వర భక్తి ఛానల్‌లో ప్రసారమైన తిక్కనసోమయాజి కథలో, తిక్కన తండ్రిగా నటించి పదిగురి చేత శభాష్ అనిపించుకున్న బుల్లితెర కళాకారుడు.

ఆధునిక నాటకరంగానికి ఒక అదృష్టదీపకుడు కీ॥శే॥ ప్రసాదమూర్తి. రామనాథం శిష్యరికంలో ఎంతో నేర్చుకొని, తన స్వయంకృషితో, సమర్థతతో, నిరంతర దీక్షాదక్షతలతో తెలుగు నాటకరంగాన్ని ఒక దశాబ్దకాలం శాసించిన మహనీయుడు ప్రసాదమూర్తి. ఆయన స్థాపించిన నాటకసంస్థే "కళావాణి". తెలుగు

నంది అవార్డు అందుకుంటూ...



నాటకరంగంలో ఒక సంచలనాత్మకమైన చరిత్రను సృష్టించిన మహానాటకసంస్థ ఈ కళావాణి. జానకీనాథ్, ప్రసాదమూర్తిల సంబంధం మాటలకందనిది. ఒకసారి వారిద్దరూ గురుశిష్యులు, మరోవేళ వారిద్దరూ మహారాజు, మహామంత్రి, ఇంకొక సందర్భంలో వారిద్దరూ ఆత్మీయసహచరులు. జానకీనాథ్ నటప్రయాణంలో ప్రసాదమూర్తితో అనుబంధం ఓ దివ్యానుభావం. ఓ అద్భుత సన్నివేశం. కళావాణితోనే జానకీనాథ్‌లోని ప్రజ్ఞ, బహుముఖీనంగా విస్తరించింది. ఎన్నో గొప్ప పాత్రలు అందుకోగలిగారు ఆయన. వీరపాండ్యకట్టబ్రహ్మనలో, ఆంగ్లేయ అధికారి బానర్‌మెన్ పాత్రతో జీవించినా, అలరాస పుట్టిల్లులో వృద్ధుడిగా కన్పించినా, అమరజీవిలో బులుసు సాంబమూర్తిగా రాణించినా, అదంతా ప్రసాదమూర్తి కృషికి ఫలితమే. కళావాణి ప్రతిష్టాత్మక నాటకాలు, "అప్పాజీ, తెలుగువెలుగు, ముద్రారాక్షసం, నరకం మరెక్కడో లేదు" అన్నిటికీ మించి, "మహాత్మా జ్యోతీరావు పూలే" ఇలా ఎన్నో నాటకాలలో జానకీనాథ్ గొప్పనటనను చూపించాడు. అమరజీవి నాటకానికి ఎంతో హృద్యంగా వ్యాఖ్యానం అందించాడు.

మద్దాలి జానకీనాథ్‌కు వందలాది పురస్కారాలు లభించాయి. ఎన్నో పరిషత్తులలో ఉత్తమనటుడిగా, సహాయనటుడిగా... ఎన్నో బహుమతులందుకొన్నారు. రాష్ట్రప్రభుత్వ నంది అవార్డు రెండుమార్లు లభించింది. 2008లో "శాంతియాత్ర" నాటకంలో "షేర్‌ఖాన్" పాత్రకు ఉత్తమసహాయనటుడిగా, 2010లో "మహాత్మా జ్యోతిరావు పూలే" నాటకంలో "జ్యోతిరావు పూలే" పాత్రకు ఉత్తమనటుడిగా, రెండునందులందుకొన్న జానకీనాథ్, మరోమారు నంది అవార్డ్ అందుకోవడానికి తగిన అవకాశం కోసం ఎదురుచూస్తున్నారు.

నాటకం ఓ గొప్పప్రక్రియ. మహాకవి కాళిదాసు నాటకాన్ని "చాక్షుషమైన యజ్ఞం" అని గౌరవించాడు. యజ్ఞం చేసే ఋత్విక్కుల వంటివాడు నటుడు. అందరూ సుఖంగా భార్యాపిల్లలతో నిద్రపోయే ఎన్నోరాత్రులు, నటీనటులు నాటకనిర్మాణంలో, వ్యయపరచి, తమ సుఖాన్ని సంతోషాన్ని వదలుకొని, చెప్పలేనంత కష్టాన్ని, చెప్పుకోలేనంత శ్రమను ధారపోస్తారు. అప్పుడే ఓ నాటకం పుడుతుంది. పుట్టినబిడ్డను పదిమందికీ చూపించడానికి, పది ఊళ్ళూ తిరుగుతారు. చివరికి జనులా ప్రదర్శన చూసి, చప్పట్లుకొడితే ఆనందంతో ఉబ్బితబ్బిబైపోతారు నటీనటులు. ఎందుకోసం ఇదంతా? ఎవరికోసం ఇదంతా? ఈ జనం కోసమే. ఈ జనానందం కోసమే.

అలా తమని తాము కొవ్వొత్తిలా కరిగించుకొంటూ, లోకానికి వెలుగునిచ్చే, నాటక కళాకారుల్లో, నిస్వార్థ నాటకకళాకారుల్లో అగ్రశ్రేణి కళాకారుడు మద్దాలి జానకీనాథ్. ఇంతకన్నా తపస్సు ఇంకేముంది ? ఇంతకన్నా దేశ సేవ మరేముంది ?

జానకీనాథ్ నిండు నూరేళ్ళూ బ్రతకాలి. బ్రతికినంత కాలం లోకానికి నాటకాన్ని చూపిస్తూ, ఆనందంగా ఆత్మసంతృప్తితో సాగిపోవాలి. స్వస్తి.

*email: vadrevusundarrao@gmail.com*

జీవన సంజీవని

1

# సంజీవదేవ్

- మాకినీడి సూర్య భాస్కర్

*"కొండలూ, కొండల క్రింది లోయలూ, లోయల కావల కొండలూ, సూర్యుడుదయించాడు. లోయలన్నీ పొగ మంచుతో నిండి ఉన్నాయి. సూర్యకాంతి పడని మంచు తెరల్లోగుండా దూరపు కొండలు లేత ధూసరవర్ణంలో స్వప్న లోకంలోని ఛాయారూపాలుగా గోచరిస్తున్నాయి. సూర్యకాంతి పడిన మంచుతెరలు లేత ధూమ్ర వర్ణాన్ని తాల్చినాయి."*

"చెరువు గట్టున ముసలి మర్రిచెట్టు. చెట్టు మొదలు పెద్ద పుట్ట. పుట్టకు పసుపు కుంకుమ బొట్లు. చెరువు లోని నీళ్ళు పసరుతో పరిపూర్ణం. చెరువుకు కట్టిన మెట్లు చాల చోట్ల ఊడిపోయి వున్నాయి. చెట్టు కొమ్మలు చాల విరిగిపోయి వున్నాయి. కొమ్మల ఆకులు చాల పగిలిపోయి వున్నాయి. చెట్టు క్రిందకు చెవులు రిక్కించుకుని అతి దీన ముఖంతో ఒక ముసలి కుంటి గాడిద వచ్చి నిలుచుంది. చెట్టునుంచి పండిన మర్రి ఆకు పసరు నీళ్ళలోకి రాలింది"

చక్కని వర్ణాలతో అలరారుతున్న ఈ 'పదచిత్రాలు' డా॥ సంజీవదేవ్ గారివి. ఆయన పదచిత్రకారుడే కాదు; మంచి వర్ణ చిత్రకారుడు కూడా. ఆయన వర్ణ చిత్రాలూ, పదచిత్రాల్లా ఎంతో లలితంగా ఉంటాయి. ఆయన ఎక్కువగా చిత్రించింది ప్రకృతి చిత్రాలనే. ప్రారంభంలో కార్డు సైజు చిత్రాలతో మొదలుపెట్టి చివరకు పెద్ద పెద్ద చిత్రాలు కూడ ఆయన రచించారు. కొంత విలక్షణంగా ఉంటాయి వీరి చిత్రాలు. ప్రకృతిని నీటి రంగుల్లో చిత్రించడమే ప్రత్యేకత అనుకుంటే, ఈ చిత్రాల్లో కంటికి కనిపించే బాహ్య రూపాలకంటె, మనసుకు గోచరించిన ఆయా దృశ్యాల ఆంత రంగిక రూపాలు గొప్ప రస రూపాలుగా వెలుగొందుతాయి. చూసే కంటికి కాంతినీ, మనసుకు శాంతినీ, హృదయా నికి క్రాంతినీ కూరుస్తాయీ అపురూప చిత్రాలు.

బహుముఖ ప్రజ్ఞాశాలి సంజీవదేవ్ – ఆయనొక్క చిత్రకారుడు, కవి మాత్రమే కాదు. గొప్ప కళావిమర్శకులు. సాహిత్యాన్ని సైతం



విశ్లేషించగల ఉత్తమ సమీక్షకులు, విమర్శకులు. పైగా తత్త్వవేత్త, మనోవైజ్ఞానిక వేత్త; వెరసి, మేధావి యైన స్వేచ్ఛా చింతకుడు. సౌందర్యోపాసకుడే కాదు, మంచి రస పిపాసి. విస్తృత పర్యాటకుడు, ఛాయా చిత్రకారుడు, బహు భాషా పండితుడు, వక్త; అన్నిటినీ మించి మహామానవతావాది. ఇన్ని ప్రజ్ఞలున్న ఒక వ్యక్తిని అధ్యయనం చేసి మూడు పేజీల చిన్న వ్యాసంలో చూపడం కష్టసాధ్యమైన విషయం. శ్రీ సూర్యదేవర సంజీవదేవ్, 1914 జూలై 3వ తేదీన శ్రీమతి వెంకాయమ్మ, రామదేవ రాయల దంపతులక గుంటూరు జిల్లా తుమ్మపూడిలో జన్మించారు. మూడవ యేటనే తల్లిని కోల్పోయిన సంజీవదేవ్, ఆ కొరతను తనకు తానుగా తీర్చుకున్నారు. తల్లిని ప్రకృతిలోనే చూసుకున్నారాయన. ప్రకృతి ఒడిలో పసిపాపడైన బాల సంజీవుడు, గొప్ప భావుకుడుగా, సున్నిత మనస్కుడుగా ఎదగకుండా ఉండగలడా? పాఠశాలకు వెళ్ళి, పద్ధతిగా కూర్చుని, అఆలు దిద్దడం అస్సలు గిట్టలేదు. బడి బంధనాలను వదిలించుకుని, స్వేచ్ఛగా తనకు

తానుగా పరిశీలనతో తెలుసుకున్నదే ఆయననో స్వేచ్ఛా చింతకునిగా, మేధావిగా,సౌందర్య రసపిపాసిగా మలచిందనడం అతిశయోక్తి ఎంత మాత్రమూ కాదు.

ప్రముఖ వంగ కవి, చిత్రకారుడు ఐన అసిత్ కుమార్ హల్దార్ వద్ద తాను చిత్రలేఖనాన్ని నేర్చుకున్నానని చెబుతారు, సంజీవ దేవ్. ఆయనపట్ల గౌరవంతో చెప్పిందే కాని, అది పూర్తిగా నిజం కాదు. కౌమార దశలో కొన్ని రోజులు హల్దార్ ఇంట బసచేసి, ఆయన చిత్రించేటపుడు పరిశీలించడమే సంజీవ్ చేసింది. ఆ తరువాత తన సొంత ప్రతిపత్తితో చిత్రలేఖనాన్ని అభ్యసిస్తూ, ఎన్నో చిత్రాలు రచించారు, సంజీవదేవ్. అలాగే కొన్ని రోజులు ప్రసిద్ధ రష్యా చిత్రకారుడు నికోలస్ రోరిక్ ఇంట కూడా ఉండి, ఆయన చిత్రించే విధానాన్ని పరికించారు. అలా కలిగిన అవగాహనతో గొప్ప ప్రకృతి చిత్రాలను చిత్రించగలిగారు.

ఇక్కడొక విషయం చెప్పుకోవాలి. సహజంగానే చిన్ననాటనే సంజీవదేవ్‌కు లోకజ్ఞానం బాగా అబ్బింది. అయితే, ఆ జ్ఞానాన్ని గడుసుగా ఉప యోగించకుండా, తన సహజ మనోధర్మానికి అనుగుణంగా ఉపయోగించు కున్నారు, సున్నిత స్వభావి, భావుకుడు అయిన సంజీవ్.




కనుకనే మీసాలైనా పూర్తిగా రాని కౌమారుడైన సంజీవ దేవ్‌ని తమతో సమంగా కుమారునిలా ఆదరించారు, హల్దార్ రోరిక్‌లు. తదనంతరం, హల్దార్ తన కవితా సంపు టిని సంజీవదేవ్‌కు అంకితమిచ్చినా, రోరిక్ తాను సంజీవదేవ్ ఎదుట తాను చిత్రించిన **'గంగానది మూలం'** అన్న చిత్రాన్ని, ఆయనే చెప్పినట్లుగా, సంజీవదేవ్ వివాహమైనప్పుడు దాన్ని కానుకగా పంపినా అది వారి కేవల ఔదార్యం మాత్రమే కాదు; సంజీవదేవ్ గొప్పతనం కూడా.

కళావిమర్శకుడిగా ఎందరో చిత్రకారులు గీసిన చిత్రాలను పేరుపేరునా వివరిస్తూ, వారి చిత్రరచనలోని మౌలిక లక్షణాలను, కళామర్మాలను చక్కగా ఎత్తి చూపారు. ప్రాచ్య, పాశ్చాత్య చిత్రకారులెందరినో తెలుగు వాళ్ళకు పరిచయం చేసింది సంజీవదేవేనంటే కాదనలేని సత్యం. తన గురువులైన అసిత్ కుమార్ హల్దార్, నికోలస్ రోరిక్‌లతో పాటు అమృతా షేర్‌గిల్, జార్జి కీట్, నందలాల్ బోస్, రహమన్ చుగ్‌తాయ్, పికాసో, సాన్ బ్రన్నర్, ఎలిజబెత్ బ్రన్నర్, బ్రూస్టర్ దంపతులు, స్టానిస్లావస్కీ, ప్రొఫెసర్ బీరేశ్వరసేన్, గగనేంద్రనాథ్ టాగూర్, రవీంద్రనాథ్ టాగూర్, భగీదథి, మొక్కపాటి, శ్యామా కౌండిన్య, రావు దంపతులు, యస్.వి.రామారావు, జపాన్ చిత్రకారుడు ఒకాకురా కకూజో, ఆనందకుమార స్వామి వంటి విశిష్టులెందరినో పరామర్శించి దర్శింపజేసారు.

సౌందర్యం అంటే ఏమిటో, అది వస్తుగతంగా ఉంటుందా, వ్యక్తినిష్ఠంగా ఉంటుందా... రసమంటే ఏమిటి, దాని తత్త్వమేమిటి, రంగుల స్వభావాలు, మనిషి జీవితంపై వాటి ప్రభావాలు, రంగుకీ రూపానికీ ఉండే సంబంధం ఏమిటి, రూపం లేని రూపాలు ఎలా ఉంటాయి, ఉత్తమ కళ అనేది ఎలా ఉంటుంది, కళామర్మజ్ఞత స్వరూపమేమిటి వంటి క్లిష్ట కళాభావాల్ని, భావనల్ని అరటిపండు ఒలిచి పెట్టినంత తేలికగా చెప్పడం బహుశా సంజీవదేవ్‌కే చెల్లింది.

చిత్రకారుల్నే కాకుండా, తత్త్వవేత్తలను, సాహిత్య వేత్తలను...అందరినీ అధ్యయనం చేశారు సంజీవదేవ్. రాహుల్



నికోలస్ రోరిక్
- అతని చిత్రం



సాంకృత్యాయన్ తానెందుకు కమ్యూనిస్టుననీ, భౌతికవాదిననీ చెప్పుకోవడంలో సంతృప్తి పొందేవారో మనోవైజ్ఞానిక కోణంలో వివరించారు. గోపీచంద్ గురించి చెబుతూ, మిస్టిసిజం భావనని ఎంత లోతుగానో చర్చించారు. "నాకు భౌతిక వాదం ఇష్టమే కాని భౌతికవాదం అంతటితోనే ఆగిపోదు. మెటీరియలిజం ముదిరి మిస్టిసిజంలోకి మారతుం" దంటూ, అసలు రెంటికీ భేదమే లేదన్నారు సంజీవదేవ్. "జీవ పరిణామంలో ఒక దశలో భౌతికవాదం, మరొక దశలో ఆత్మికవాదమౌతుంది. జడానికీ, చేతనానికీ వున్న భేదం అభివ్యక్తిలోనే తప్ప అస్తిత్వంలో లేదని కూడ అన్నారు. బెర్ట్రాండ్ రస్సెల్, అరవిందుడు, ఆచార్య సచ్చిదానందమూర్తి వంటి వారి గురించి చెప్పేటప్పుడు సంజీవదేవ్‌లోని తత్త్వవేత్త పాఠకుడితో కరచాలనం చేస్తాడు.

ఎంతో వైవిధ్యంగల వ్యక్తులమీద, వారి వ్యక్తిత్వాలమీద, కళలమీద, కళారంగాలు, వాదాలమీద సంజీవ దేవ్ నిశితమైన, సహేతుక బద్ధమైన అభిప్రాయాలను వెలువరించారు. కారణం, ఆయనకు ఆయా వ్యక్తులు, వ్యక్తిత్వాలతోను, కళలు, కళారంగాలతోను ప్రత్యక్షమైన, పరోక్షమైన పరిచయాలు ఉ ండడమే. ఇరవై సంవత్స రాలు రాకుండానే ఆయన ఉ త్తరభారతంలో ఎన్నో ప్రాంతాలను చూశారు. కళాకారునిగా హిమాలయాలను సం దర్శించారు. ఈ పర్యటనలో అనేకులను కలిశారు. ఆయనకోసం వారి స్వగృహానికి ఎందరో ప్రముఖులు, దేశ విదేశాల కళాకారులు, సాహితీపరులు వస్తుండేవారు. ఇటువంటి నేపథ్యం ఆయన్ను "సంజీవదేవ్"గా రూపు దిద్దింది. ఆయన ఖాళీగా ఉన్నప్పుడు "ఏం చేస్తున్నా?"రని ఎవరైనా అడిగితే, సంజీవదేవ్‌తో మాట్లాడుతున్నా నన్నది ఆయన సమాధానం. ఎప్పుడూ అంతర్ముఖీనంగా ఉండి, తర్కించుకుంటూ, ఆత్మవిమర్శ చేసుకుంటూ తనను తాను దిద్ది తీర్చుకున్నారు... తీర్చి దిద్దుకున్నారు, సంజీవదేవ్.

సరళమైన జీవనవిధానం, నియమబద్ధమైన జీవన సరళి ... ఎదుటివాళ్ళ లోతును పసిగట్టగల విశాల నేత్రాలతో, పొడవూ పొట్టీ కాని రూపంతో, పంచె పైన పొడవు చేతుల చొక్కాతో పల్లెటూరి పెద్దమనిషిలా అతి సరళంగా కనిపించే సంజీవదేవ్, ఎంతో ఉన్నతస్థితికి చేరాకా కూడ తమ పల్లెను వదలి పట్నంలో మకాం పెట్ట లేదు. వారి కళాసృష్టికి, విమర్శకదృష్టికి, రచనాకృషికి వారి స్వగ్రామం తుమ్మపూడి గ్రామమే కేంద్రమైంది. ఐతే, వారి ఔన్నత్యానికి కారణం జీవితాన్ని విమర్శాత్మకంగా, విచక్షణాజ్ఞానంతో అనుభవించడం. జీవించడాన్ని కళగా మలచుకోవడం. మానవుని గురించి, అతని ఉన్నతి గురించి కలగనడం...కళగనడం. అదే ఆయన జీవనసర్వ స్వంగా భావించి జీవించారు, సంజీవదేవ్.అందుకే అంత కళాతాత్త్విక ద్రష్ట, స్రష్ట కాగలిగారు, సంజీవదేవ్!

email: makineedi.writer@gmail.com

94915 04045

# 64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :3 సంచిక :2 డిసెంబర్ 2012


## 3వ వసంతంలోకి....

64కళలుడాట్‌కాం రెండు సంవత్సరములు పూర్తిచేసుకొని, 3వ వసంతంలోకి అడుగుపెడుతుంది. గత రెండేళ్ళుగా పత్రికను ఆదరిస్తున్న పాఠకులకు, మంచి రచనలు చేస్తున్న రచయితలకు, సహాయ సహకారాలు అందిస్తున్న కళాభిమానులకు, కార్టూనిస్టులకు కృతజ్ఞతాభివందనాలు.

తిరుపతిలో జరిగే ప్రపంచ తెలుగు మహాసభలు-2012 లలో కళలకు సముచిత స్థానం కల్పించాలని మనవిచేస్తూ...సదాశయంతో నిర్వహిస్తున్న ఈ సభలు విజయవంతం కావాలని కోరుకుంటూ...

**కళాసాగర్**
ఎడిటర్



ముఖచిత్రం చిత్రకారుడు : **అల్లు రాంబాబు**



**భామనే..**
**సత్యభామనే...**

**పౌరాణిక నాటకరారాజు**



*ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే*

# నూటొక్క జిల్లాల అందగాడు

## డిశంబర్ 12న నిత్య 'నూతన' నటవర 'ప్రసాద్' జన్మదిన సందర్భంగా...

-ఎస్.వి. రామారావు

**నూతనప్రసాద్‌కు భూమ్మీద నూరేళ్ళు నిండేనాటికి వయసు అరవై ఆరు సంవత్సరాలు. సినీ నటుడిగా వయసు ముప్పై ఎనిమిది. నటించిన చిత్రాల స్కోరు యాక్సిడెంట్‌కు ముందు 365, తరువాత 112 వెరసి 477. యావత్ ప్రపంచ చలనచిత్ర చరిత్రను పరిశీలిస్తే యాక్సిడెంట్ జరిగి, నడవలేని పరిస్థితుల్లో అన్ని సినిమాల్లో నటించటం నూతన్‌ప్రసాద్ ఆత్మవిశ్వాసంతో దక్కించుకొన్న రికార్డు.**



డిసెంబర్ 12, 1945న కృష్ణాజిల్లా కైకలూరులో జన్మించిన తాడినాడ దుర్గావరప్రసాద్ బందరులో ఐ.టి.ఐ పాసయ్యి, హైదరాబాద్‌లోని హిందూస్థాన్ ఏరోనాటిక్స్‌లో ఉద్యోగపర్వం ప్రారంభించారు. ప్రముఖ రంగస్థల నటులు భానుప్రకాష్ ప్రోత్సాహంతో సుడిగాలి, గాలివాన, గాలిపటం, వలయం, కెరటాలు వంటి నాటకాల్లో నటించారు. ప్రముఖ రంగస్థల ప్రయోక్త ఎ.ఆర్. కృష్ణగారి రంగస్థల అద్భుతం 'నూలపల్లి' నటకాన్ని 101 సార్లు ప్రదర్శించటం మరో రికార్డు.

రచయిత పినిశెట్టి శ్రీరామమూర్తిగారి ప్రోత్సాహంతో తొలిసారి కెమెరా ముందు నిలబడింది 'నీడలేని ఆడది' చిత్రం. అయితే ముందుగా విడుదలైంది బాపు-రమణల 'అందాలరాముడు'. వారే తీసిన 'ముత్యాలముగ్గు'లో నిత్య పెళ్ళికొడుకుని చేశారు కాంట్రాక్టర్ రావుగోపాలరావు.

ప్రసాద్ నటజీవితానికి బ్రేక్ యిచ్చిన చిత్రం 'చలిచీమలు'. టెలిఫోన్‌లో "అటు కలుపు, నేను నూటొక్క జిల్లాలకు అందగాణ్ణి" అంటూ అదరగొట్టేశాడు. అన్నట్టు యీ చిత్రం నుంచే పాత వరప్రసాద్ పేరుకు గుడ్‌బై చెప్పి కొత్తగా "నూతన్‌ప్రసాద్"గా నామాంతరం చెందారు. ఇహ అక్కడ్నుంచి అవిశ్రాంతంగా 365 చిత్రాల్లో విలక్షణ భూమికల్ని సలక్షణంగా తనదైన శైలిలో నటించి ఇది 'నూతన్‌ప్రసాద్ బ్రాండ్' అనిపించుకున్నారు. ఎన్నెన్ని పాత్రలు, ఎన్నెన్ని విన్యాసాలు. రచయిత సృష్టించిన పాత్రను తన భావాలతో, భాషణతో, నటనలో కొత్త సొబగులు దిద్దటం నూతన్ స్పెషాలిటీ!

'పట్నం వచ్చిన పతివ్రతలు చిత్రంలో పోలీసాఫీసరుగా ప్రతిదానికి టెన్షన్ పడిపోతూ 'దేశం చాలా క్లిష్ట పరిస్థితుల్లో వుంది' అన్న డైలాగ్ పాపులర్ కావటంతో దాన్నే మరెన్నో చిత్రాల్లో రిపీట్ చేసినా ప్రేక్షకులకు బోర్ కొట్టలేదు.



ఈ నూటొక్క జిల్లాల అందగాడు వెరైటీగా 'రాజాధిరాజు' చారిత్రక చిత్రంలో 'సైతాను' పాత్ర పోషించగా, అతనిపై చిత్రీకరించిన 'కొత్తా దేవుడండీ, కొంగ్రొత్తా దేవుండడీ' పాట హిట్ అయింది.

ఫ్యామిలీ హిస్టరీ చెప్పి కనపడ్డ వాళ్ళని అదరగొట్టే పాత్ర పోషించిన చిత్రం జంధ్యాల సృష్టించిన 'అహ నా పెళ్ళంట'.. ఇక హాస్యాన్ని విలనీతో మేళవించిన అగ్నిపర్వతం. ఆఖరిపోరాటం, పూజకు పనికిరాని పువ్వు, తిరుగుబాటు, అబ్బాయిగారు వంటి చిత్రాలు ఎన్నో!






సుందరి–సుబ్బారావు. ప్రజాస్వామ్యం, నవభారతం. వసుంధర చిత్రాల్లోని నటనకుగాను రాష్ట్రప్రభుత్వం నుంచి నంది పురస్కారాలను అందుకున్నారు. అట్లాగే ఎన్.టి.ఆర్. పురస్కారాన్ని కూడా అందుకొన్నారు. సుమారు 20 చిత్రాల్లో జడ్జి పాత్ర పోషించటం ఒక రికార్డు.

1989లో 'బామ్మమాట–బంగారుబాట'లో మహానటి భానుమతితో కలసి నటించటం ఓ అదృష్టమైతే. అదే చిత్ర షూటింగ్ సమయంలో యాక్సిడెంట్ జరిగి వెన్నుముక దెబ్బతినటం దురదృష్టం. అయితే విధికి ఎదురు నిలిచి చక్రాల కుర్చీలో వుంటూ సినిమాల్లో నటించిన ధీరోదాత్తుడు నూతన్‌ప్రసాద్.

నటనకే జీవితాన్ని అంకితం చేసుకొన్న నూతన్‌ప్రసాద్ కొంతకాలం సాంస్కృతిక కేంద్రమైన 'రవీంద్రభారతి'కి కార్యదర్శిగా పనిచేశారు.

ఉత్తమ అభిరుచితో నవరసాల అభినయాన్ని సూచించే పెయింటింగ్స్‌ను బాపూ చేత వేయించి, వాటికి రాష్ట్రవ్యాప్తంగా ప్రాచుర్యం తెచ్చిన ఘనత నూతన్‌ప్రసాద్‌దే!

బుల్లితెరకు కూడా తన ప్రతిభను అందించి 'నేరాలు–ఘోరాలు', 'హాట్సాఫ్' వంటి కార్యక్రమాల్లో పాల్గొని దేవుడిచ్చిన జీవితాన్ని సద్వినియోగం చేసుకొన్నారు.

కొద్దిరోజులు అనారోగ్యంతో పొరాడి మార్చి30న విధి చేతిలో ఓడిపోయిన నూతన్‌ప్రసాద్ నటనను వరంగా పొంది నిత్యం నూతనత్వం కోసం తపించేవారు నిత్యనూతన నటవర ప్రసాదు!

*ఆంధ్రప్రదేశ్ పత్రిక సౌజన్యంతో...*





-సుధామ

# హాస్యరస సరసి



***కార్టూనిస్టుల సంగతి ఎలా వున్నా, కార్టూన్ ఇష్టుల విషయంలో నేడు సరసి జనాభాయే ఎక్కువ. కార్టూనిస్టుల కులగురువు అనదగిన 'బాపు' గారే పధ్నాలుగేళ్ళ క్రితమే ఆంధ్రప్రభ వీక్లీలో 'సరసి' కార్టూన్లు చూసి ఉండబట్టలేక 16.12.98 న ఓ ఉత్తరం రాసారు. "మీ పత్రికలో సరసి అన్నతను (లేక ఆమె) వేస్తున్న కార్టూన్లు చాలా బావుంటున్నాయి. తెలుగు కార్టూనిస్టులలో ఆ మాత్రం తెలివైనవానిని ఇంతవరకూ చూడలేదు" అని. ఆ తెలివితేటలు ఇప్పటికీ తేటతేటగా అందరినీ అలరిస్తూనే వున్నాయి. 'మనమీదేనర్రోయ్' అంటూ తన ధారావాహిక గత 8 యేళ్ళుగా అతి 'నవ్య'మై అలరారుతూనే వుంది.***

మనలో సెన్సాఫ్‌హ్యూమర్ వున్నవాళ్లు బోలెడుమంది వున్నారు. వాళ్లకి బొమ్మలు వేయడం రాదుగానీ లేకపోతే కార్టూనిస్టుగా వాళ్ల ముందు మనమేమీ ఆనము అనే సరసి అసలు పేరు సరస్వతుల రామనరసింహం. బ్రహ్మరాతలు చూసిన సరస్వతికి, కార్టూన్లు వేయాలని బుద్ధి పుట్టి బహుశా సరసిగా మగజన్మ ఎత్తి వుంటుంది. పశ్చిమగోదావరి జిల్లా పెంటపాడు మండలం బోడపాడు స్వగ్రామమైన సరస్వతుల రామనరసింహం 1956 జూలై 5న శ్రీమతి వెంకటరమణమ్మ, వెంకటేశ్వర్లు దంపతులకు రెండో అబ్బాయిగా పుట్టాడు. తల్లి కాసమ్మ కారణంగానే ఆ ఇంట సాహిత్య సంగీత కళలు కాసాయి. తండ్రి హాస్యచతురత, సృజనాత్మక అభిరుచిని చిగురింపజేసే ప్రోత్సాహం వెన్నుదన్నయ్యాయి. చిన్నప్పుడు బొమ్మలు వేయడానికి కారణం అన్నయ్యే. ఆ తరువాత స్కూలు డ్రాయింగ్‌మాస్టారు శ్రీ తమ్మా సత్యనారాయణగారు తతిమ్మా వాళ్లల్లో కంటే సరసిలోని చిత్రకళా రసికతను గుర్తించి స్వంత తమ్ముడి కంటే ఎక్కువగా ఆదరించి మాటలకందని ఆప్యాయతనీ, అనురాగాన్ని పంచి అందమైన బొమ్మలు వేసే విద్యతో పాటు విలువైన జీవితధర్మాలను బోధించారు. అందుకే సరసి కార్టూన్లలో ఎక్కడా వెర్రితనం, వెకిలితనం గోచరించవు. సమాజాన్నీ, చుట్టూ మనుషులనీ, సంఘటనల్నీ నిశితంగా గమనించి ముఖ్యంగా మధ్యతరగతి జీవితాలపై ఆయా తీరుతెన్నులపై సున్నితంగా అత్యంత వైవిధ్య భరితంగా




స్వర్గీయ ఎన్టీఆర్‌తో అభినందనలు అందుకుంటూ...



బాపూ, రమణ గార్లతో సరసి

కార్టూన్లను సంతరించిన ప్రజ్ఞ సరసిదే. కార్టూన్లే కాదు సరసి ప్రకృతి దృశ్యాలు, మహనీయుల తైలవర్ణ చిత్రాలు చిత్రించడంలో కూడా సిద్ధహస్తుడు. డ్రాయింగుమాష్టారు ర్యాలి, సింహాచలం వంటి క్షేత్రాలకు తీసుకు వెళ్ళి అక్కడి శిల్పకళా విన్యాసాలను అలాగే విశాఖ, భీమిలీ సుందరదృశ్యాలను కౌమార దశలోనే స్కెచ్‌లు గీయించి, డ్రాయింగు పరీక్షలకు కట్టించి సరసిని అనేక పోటీలలో గెలిపించారు.

ఎం.ఏ ఫిలాసఫీ, ఎల్.ఎల్.బి. విద్యనభ్యసించిన సరసికి మానవ మనస్తత్వాలనూ, అందులోని వివిధ పార్శ్వాలనూ అందిపుచ్చుకోవడం, అన్యాయంగా కాక ఎంతో న్యాయంగా వారిలోని నైజాలను వారికే హాస్యంగా ఎత్తిచూపి వ్యంగ్యచిత్రాలతో అలరించడం అలవోక అయిన విద్య. ఇప్పటిదాకా సుమారు అయిదువేల కార్టూన్లు, నాలుగువందలకి పైగా కథలు, పెయింటింగ్‌లు అనేకం సంతరించిన సరసి గొప్ప సంగీత హృదయుడు కూడా. వేణువు మీద రాగాలను పలికించగల దిట్ట.

వృత్తిరీత్యా రాష్ట్రప్రభుత్వ శాసనసభా కార్యాలయంలో అసిస్టెంట్ సెక్రటరీగా పనిచేసున్న సరసి వేసిన పొట్టిశ్రీరాములు, అంబేద్కర్, కాసుబ్రహ్మానందరెడ్డిల నిలువెత్తు తైలవర్ణ చిత్రాలు శాసనసభా కమిటీ హాలులో శాశ్వతంగా అలంకృతమై చూపరులను కట్టిపడేస్తుంటాయి. శాసనసభాపతి, ముఖ్యమంత్రి చేతుల మీదగా సన్మానాలు అందుకున్న ఆ'స్థాన' చిత్రకారుడు తనే! సరసి కార్టూన్లు ఇప్పటిదాకా మూడు సంపుటాలుగా వెలువడ్డాయి. ఒకదానిని మించి ఒకటి తెలుగులోగిళ్ళలో నవ్వుల పువ్వులు పంచాయి. సరసి కార్టూన్లు-3 తన వ్యంగ్య చిత్రవైభవాన్నే కాక వైశంపాయనుడు కథలతో తన హాస్య రచనా విన్నాణాన్ని కూడా ఆవిష్కరించేదిగా భావిస్తోంది.




1993లో జపాను ఆంగ్లదినపత్రిక 'యుమియోలీ షింబున్' నిర్వహించిన అంతర్జాతీయ కార్టూన్ల పోటీలో, 1993, 1994ల్లో కొరియాలో తేజాన్ అంతర్జాతీయ కార్టూన్లపోటీలో ఆనరబుల్ మెన్షన్ అవార్డులు, కొన్ని కార్టూన్లకు జపాన్, కొరియా, ఇరాన్, టోలెంటినోలలో జరిగిన అంతర్జాతీయ కార్టూన్ ప్రదర్శనల్లో చోటు; రాష్ట్రంలో వివిధ సందర్భాల్లో వివిధ పత్రికలు, సంస్థలు నిర్వహించిన పోటీల్లో కార్టూన్లకు, కథలకు పలు బహుమతులు, తను పొందిన మంచి గుర్తింపులు, ఇటీవలే ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక నిర్వహించిన బొమ్మల




కథల పోటీలో ప్రథమబహుమతిని సరసి పంచుకున్నాడు.

తన కార్టూన్లలో సరసి మధ్యతరగతిని నిలువుటద్దంలో చూపుతాడు. ఊహలోగానీ, గీతలోగానీ ఎవరినీ అనుకరించడు, అనుసరించడు. తనదైన శైలి కార్టూన్ క్యాప్షన్‌లోనూ, గీతలోనూ కూడా చూపుతాడు. ఇన్ని 'అయిడియా'లు ఇలా ఇతనికి ఎలా తడతాయా అని కుళ్లుకునేలా సాటి కార్టూనిస్టులను కూడా అలరిస్తాడు. గొప్ప స్నేహశీలి. ఆంధ్ర బాలానంద సంఘంలో హైదరాబాద్‌లో పిల్లలకు వీలయినప్పుడల్లా చిత్రకళలో శిక్షణ గరుపుతున్న మంచి గురువు. అద్భుతమైన, తెలివైన కార్టూన్లు వేసే సరసి కార్టూన్‌గీతల్లో అందం కన్నా ఆనందం పండించడానికే ప్రాముఖ్యత ఇస్తాడు. కార్టూన్స్‌లోని రాత, గీత రెండూ కూడా ఒకదాన్ని విడిచి ఒకటి మనలేని చందాన బాపు రమణ జంటలాగా నిలపడం సరసి ప్రతిభ. అతని పాటవం అన్యులకు అందడం కష్టం. సరసి కార్టూన్లు పదిమందితో పంచుకు మరీ ఆనందించేవి. ఏ రంగంలో వారయినా సరసి కార్టూన్ల ప్రపంచంలో మమేకం కాగలరు కనుక అంతా సరసి 'జనాభా'యే అనడం కుదుర్తోంది. 'గానకళ'లో ఒక్క శాస్త్రీయ సంగీతం అన్న విషయం మీదే ఆయన వేసిన కార్టూన్లు చూస్తే ఆ ప్రతిభకు 'ఔరా!' అని అబ్బురపడక తప్పదు. ఆయన సోదరుడు హనుమంతరావు గారు గొప్ప మృదంగ, ఘటవిద్వాంసులుకావడం కూడా ఆ విషయం మీద కార్టూన్లు సంధించడానికీ అందునా సంగీతజ్ఞులే అందుకోగల మర్మాలతో హాస్య, వ్యంగ్యాలు ఉత్పత్తి చేయడానికీ ఉపకరించి వుండవచ్చు. అసెంబ్లీలో ఉద్యోగం కనుక రాజకీయ అంశాలపై సంగతి సరేసరి. మరో విశేషం ఏమిటంటే 'నడుస్తున్న చరిత్ర' మాసపత్రికలో గత దశాబ్దంపైగా కేవలం 'తెలుగుభాషమీద అనేక కార్టూన్లు వేస్తున్నారు.

తెలుగు భాష, శాస్త్రీయ సంగీతం, అపార్టుమెంట్స్, రైల్వేకంపార్టుమెంట్స్ అంశాలమీద సరసి వేసినన్ని కార్టూన్లు మరెవరూ వేయలేదంటే అది అతిశయోక్తి కాదేమో!

రైళ్లు, విమానాలు, హోటళ్లు, అపార్ట్‌మెంట్‌లు, గుళ్లు, పెళ్లిళ్లు, క్రీడలు, సినిమాలు వంటి విషయాలే కాదు శవాలు, శ్మశానాలు, దయ్యాలు ఒక ప్రక్క, మునులు, దేవతలు, అప్సరసలు మరో ప్రక్క అసలు ఆయన కార్టూన్లకు ఆలవాలం కాని విషయం లేదంటే విడ్డూరపడనక్కర్లేదు. మూడు సంపుటాల త్రిపుటితో హాస్యాన్ని కార్టూన్ల సంకలనాలుగా తెలుగు నాట తేజరిల్లుతున్న సరసి 'మనమీదేనర్రోయ్' విలక్షణ సంపుటి అతి త్వరలో అందివస్తుందని ఆకాంక్షిద్దాం. తన హాస్యంతో ఆరోగ్యదాయకమైన తెలుగులోగిళ్లను వ్యవస్థీకృతం చేస్తూ, సరసి జనావళి హృదయవాసి కావాలని కోరుకుందాం.

*email: sarasicartoonist@gmail.com*




















సరసి చిత్రించిన
బ్రహ్మానందరెడ్డి గారి చిత్రం



నృత్యం

# భామనే.. సత్యభామనే...

**కూచిపూడి నాట్య దిగ్గజం నేలకొరిగింది. స్త్రీ పాత్రల ద్వారా నూతన ఒరవడిని సృష్టించిన వేదాంతం అందెల రవళి ఆగిపోయింది. ఆరు దశాబ్దాలపాటు 'భామనే' సత్యభామనే' అంటూ ఆయన ఒలికించిన వయ్యారాలు... పలికించిన హావభావాలు కనుమరుగయ్యాయి. తొమ్మిదో యేటనే కూచిపూడి నాట్యరంగ ప్రవేశం చేసి ఖండాంతర ఖ్యాతినార్జించిన నృత్య కళాకారుడు పద్మశ్రీ డాక్టర్ వేదాంతం సత్యనారాయణశర్మ ఇక లేరన్న వార్త విని కూచిపూడి గుండె పగిలింది. ఆయన ఎందరినో కళాకారులుగా తీర్చిదిద్దిన నర్తనశాల నివ్వెరబోయింది. దేశ విదేశాల్లోని శర్మ శిష్యగణం శోకసంద్రంలో మునిగింది.**


వేదాంతం సత్యనారాయణశర్మ

కూచిపూడి ఘనకీర్తిని దశదిశలా చాటేందుకు కృషి చేసిన ఎందరో మహానుభావుల్లో వేదాంతం సత్యనారాయణశర్మ ఒకరు. కూచిపూడి నాట్యపితామహులైన వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, తాడేపల్లి పేరయ్య శాస్త్రి, వేదాంతం రాఘవయ్య, వెంపటి పెదసత్యం, చింతా కృష్ణమూర్తిల వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్నారు. 1934 సెప్టెంబరు 9న వేదాంతం వెంకటరత్నం, సుబ్బమ్మ దంపతులకు నాలుగో సంతానంగా జన్మించిన శర్మ తొమ్మిదేళ్ళ వయస్సులోనే నాట్యరంగ ప్రవేశం చేశారు. గురువులు వేదాంతం ప్రహ్లాదశర్మ, చింతా కృష్ణమూర్తి లవకుశలు, ప్రహ్లాదుడు, లోహితాసుడు తదితర పాత్రలిచ్చి ప్రోత్సహించగా, వెంపటి చినసత్యం తన బృందం ప్రదర్శించే నృత్య రూపకాల్లో ప్రధాన పాత్రలు ఇచ్చారు. ఆయన నటనా వైదుష్యాన్ని చూసి సత్యభామ పాత్రను వేయించారు. భామాకలాపంలో సత్యభామ పాత్రకు ప్రాణంపోశారు. అసలు సత్యభామ అంటే ఇలాగే ఉంటుందేమో అనిపించేంతటి బలమైన ముద్ర వేశారు. ఆ తర్వాత ఉష, దేవదేవి, శశిరేఖ, మోహిని... ఇలా ఏ నృత్య రూపకంలో అయినా ప్రధాన స్త్రీ పాత్రను వేదాంతం వారే పోషించారు. నాటకర్త హృదయాన్ని అర్థంచేసుకుని నర్తకుడిగా ప్రేక్షక హృదయాలను రంజింప చేయడంలో కృతకృత్యులయ్యారు. అభినయ యజ్ఞానికి ఉండవలసిన శారీరక, మానసికశక్తుల్ని కూడ దీసుకుని తాను ధరించిన పాత్రకు తగ్గట్టు ఔచిత్య పోషణ చేసి పేరు గడించారు.







### శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం నిర్మాణానికి అవిరళ కృషి...

కూచిపూడిలో శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం నిర్మాణానికి వెంపటి చినసత్యం, బందా కనక లింగేశ్వరరావు, చింతా కృష్ణమూర్తితో కలసి వేదాంతం పాటుపడ్డారు. కళాక్షేత్రంలో కొంతకాలం ప్రధానాచార్యుడుగా సేవలందించారు. గ్రామంలో అన్నమాచార్యకళాపీఠాన్ని నెలకొల్పి వందలాది మంది శిష్యులను తీర్చిదిద్దారు. కేవలం నాట్యానికే పరిమితం కాకుండా 'రహస్యం' చిత్రంలో మన్మథుడిగా నటించి తన ప్రత్యేకతను చాటుకున్నారు. చెరగని చిరునవ్వు, మృదుమధురమైన సంభాషణ, ఆత్మీయతతో కూడిన పలకరింపు, శాంత స్వభావం కలిగిన సత్యనారాయణశర్మ మరణం కూచిపూడి కళాకారులకు తీరని లోటని చెప్పవచ్చు.



### అవార్డులు... రివార్డులు...

కూచిపూడి నాట్యంలో వేదాంతం సత్యనారాయణశర్మ ప్రతిభను గుర్తించిన కేంద్రప్రభుత్వం 1961లో కేంద్ర సంగీత నాటక అకాడమీ పురస్కారం అందజేసింది. 1970లో పద్మశ్రీ పురస్కారం, 1983లో ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ భరతకళాప్రపూర్ణ, 1987లో మధ్యప్రదేశ్ ప్రభుత్వం కాళిదాస్ సమ్మాన్ పురస్కారం, 1995లో తెలుగు విశ్వవిద్యాలయం డాక్టరేట్ అందజేసాయి. నాటి రాష్ట్రపతులు డాక్టర్ బాబూరాజేంద్రప్రసాద్, వి.వి. గిరి, నీలం సంజీవరెడ్డి, జాకీర్‌హుస్సేన్, డాక్టర్ శంకర్‌దయాళ్‌శర్మల నుంచి సత్కారాలు అందుకున్నారు.

### బెజవాడతో అనుబంధం...

వేదాంతం సత్యనారాయణశర్మకు విజయవాడ నగరంతో చక్కని అనుబంధం ఉంది. సింగారమణి అజయ్‌కుమార్ నేతృత్వంలో నగరంలోని ప్రభుత్వ సంగీత కళాశాల ఆవరణలో వెంపటి చినసత్యానికి జరిగిన గురుపూజా మహోత్సవంలో వేదాంతం పాల్గొన్నారు. ఆయన నగరంలో పాల్గొన్న చివరి సభ, ఆఖరి ప్రసంగం ఇదే. అస్వస్థులుగా ఉన్న శర్మ ఆస్పత్రిలో చేరిన వార్త తెలిసిన వెంటనే ఎందరో శిష్యప్రశిష్యులు, నాట్యాచార్యులు, అభిమానులు వచ్చి చివరి చూపు దక్కించుకున్నారు. భౌతికంగా మనకు దూరమైనా, కూచిపూడి నాట్యరీతులు వర్ధిల్లినంత కాలం వేదాంతం సత్యనారాయణశర్మ చిరంజీవే.

కళాప్రపంచం

# "శాస్త్ర సంకేత చిత్రకారుడు-మోర్స్"

"My ambition is to be among those who shall revive the splendor of the 15th century; to rival the genius of a Raphael, a Michelangelo, or a Titian; my amibition is to be entisted in the constellation of genius now rising in this country. I wish to shine, not by a light borrowed from them, but to strive to shine the brightest". ఒక అమెరికన్ యువకుడు వారి తల్లిదండ్రులకు రాసుకున్న లేఖలోని సారాంశం. ఆ యువకుడు మొదలు చిత్రకారునిగా అనంతరం టెలిగ్రాఫ్ ఆవిష్కర్తగా పేరు గాంచాడు. అతడే ఎఫ్.బి. మోర్స్.



ఎల్.ఆర్. వెంకటరమణ

శామ్యూల్ ఫిన్లే బ్రీజ్‌మోర్స్ 1791 ఏప్రిల్ 27న మసాచుసెట్స్‌లోని చార్ల్స్‌టన్‌లో జన్మించాడు. తండ్రి జూడీ మోర్స్; తల్లి ఎలిజబెత్ అన్ ఫిన్లే బ్రీజ్‌మోర్స్. మోర్స్ యువకుడుగా ఉన్నప్పుడు కళలకే అధిక ప్రాధాన్యత నిచ్చాడు. మరీ ముఖ్యంగా "మూర్తీచిత్రణ"లకే మక్కువ చూపాడు. ఒకరకంగా తన జీవికకు ఇది ఎంతో తోడ్పడింది. తరువాత ప్రకృతి దృశ్యాల పట్ల, చారిత్రక దృశ్యాల చిత్రణకు ఎక్కువ మక్కువ చూపాడు.

మోర్స్ యేల్ విశ్వవిద్యాలయంలో చదువుకున్నాడు. మోర్స్‌ను చిత్రకళ వైపు పంపడం తండ్రికి ఏమాత్రం ఇష్టంలేదు. కానీ అల్‌స్టన్ వంటి వారి వద్ద శిష్యరికం అంటే చిత్రకళ వచ్చినా, రాకున్న జీవితంలో మంచి మార్గాన పడగలడని సమ్మతించాడు. ఆల్‌స్టన్‌తో కలిసి మోర్స్ లండన్ సందర్శించాడు. ఆర్థిక ఇబ్బందుల వలన అమెరికా వెళ్లిపోవాల్సి వచ్చింది. "హెర్క్యులన్ మరణం" వంటి చిత్రాలు గీచాడు. వీటిని కొనడానికి ఎవరూ ముందుకు రాలేదు.

1818లో లుక్రీషియా పెకరింగ్ వాకర్‌ను పెళ్లి చేసుకున్నాడు. 1825లో చిత్రకారుల శిక్షణా సంస్థగా ఒక అకాడమీ స్థాపించాడు. దీనికి తొలి అధ్యక్షునిగా కూడా ఎన్నిక అయ్యాడు.మరో చిత్రకారుడు ట్రంబుల్‌తో వచ్చిన గొడవ వల్ల ఈ సంస్థ నుండి, తన అనునాయులతో సహా వేరు సంస్థ స్థాపించుకున్నాడు. ఇదే కాలంలో "The House of Representatives" అనే చిత్రం కూడా చిత్రించాడు. ఈ చిత్రానికి రావలసినంత పేరు రాకపోవడంతో నిరాశకు గురయ్యాడు.

తను స్థాపించుకున్న అకాడమీ ఆదర్శయుతంగా, ప్రజాస్వామ్య పద్ధతిలో ఉండాలని అందరూ స్వేచ్ఛతో చిత్రరచన చేయాలని సూచించాడు. కళాభిమానంతో కళను ముందుకు తీసుకెళ్లాలి గానీ కుటిల నీతితో గాదు అంటూ ఎన్నో నీతులు చెప్పాడు. కానీ ఈ స్వేచ్ఛ వల్ల అపవాదు వచ్చే ప్రమాదముందని కొంతకాలానికి గుర్తించాడు. సభ్యులు తనను అనామకునిగా చూస్తున్నారన్న మోర్స్ వాపోయాడు. పైకి ఏమనకున్నా లోలోన నిర్లిప్తతతో ఉండేవాడు. యూరప్‌లో తనకంటే దిగువస్థాయి వారికి ఎంతో పేరు వస్తుంటే, తనకు కనీసం గౌరవం కూడా దక్కటం లేదని మనస్తాపానికి గురయ్యేవాడు. దీంతో చిత్రకళ పట్ల ఆసక్తి క్రమంగా తగ్గసాగింది.

1830లో పారిస్‌లోని ప్రసిద్ధ లౌరీ మ్యూజియం దర్శించాడు. ముగ్ధుడై 1831–33 మధ్యకాలంలో "గ్యాలరీ ఆఫ్




లౌరీ" అన్న చిత్రాన్ని చిత్రించాడు. ఈ చిత్రానికి రావలసినంత పేరు రాలేదని బాధపడ్డాడు. 1834లో ఈ చిత్రాన్ని బ్లార్జ్‌క్లార్క్ అనే వ్యక్తికి పదమూడు వందల డాలర్లకు అమ్మివేశాడు. ఇదే కాలంలో న్యూయార్క్ యూనివర్శిటీలో "ఆర్టిహిస్టరీ" బోధించే ప్రొఫెసర్‌గా కొత్త రూపు దాల్చాడు.

ఇలా తనలో తాను మదనపడుతూ, చిత్రకళను తిరస్కరించే స్థితికీ వచ్చేవాడు. సమకాలీన చిత్రకారులతో వాదోపవాదాలకు దిగేవాడు. అద్భుత చిత్రాన్ని గీయాలనే ఆరాటంతో కుంచెలు తీసుకునేవాడు. కానీ అంతలోనే నిర్వేధంతో కుంచెలు ప్రక్కన పెట్టేసేవాడు. ఇలా నిర్వేద భరితంగా చిత్రరచననే త్యజించాలనే అనుకున్నాడు.

"చిత్రకళ అన్నది అనేకుల దృష్టిలో క్రూరప్రేయసి, కానీ నా విషయంలో క్రూర వేశ్యగా పరిణమించింది. నేను ఆమెను త్యజించలేదు. ఆమే నన్ను వదలి వెళ్లిపోయిందని" బాధపడేవాడు. తన ఆదర్శాలు ఉన్నతమైనవి కనుకనే తాను చిత్రకళలో పనికి రానని, ఆనాటి కాలపు వారికంటే తానెంతో గొప్పవాడనే భావనతోను ఉండేవాడు. 1837లో చివరి చిత్రం గీచాడు.

మోర్స్ 1825లో వాషింగ్టన్ నగరంలో తన చిత్రకళాభ్యాసంలో నిమగ్నమై ఉన్నకాలంలో ఇంటి వద్ద నుండి ఒక ఉత్తరం వచ్చింది. విషయం అతని భార్యకు జబ్బు చేసిందని. మోర్స్ వెంటనే బయలుదేరి న్యూహెవన్‌కు చేరుకోగలిగాడు. కానీ దురదృష్టం అతని భార్య చనిపోయింది. తన భార్యను ఆఖరి చూపు కూడా చూసుకోలేకపోయానని బాధపడ్డాడు. తనకు వచ్చిన ఉత్తరం చాలా ఆలశ్యంగా అందినట్లు గుర్తించాడు. సమాచారాన్ని మరింత వేగంగా చేరవేయడం గురించి అధ్యయనాలు మొదలు పెట్టాడు. ఇలా అతనిలో ఒక ఆవిష్కర్త బయలు దేరాడు. 1832లో ప్రాథమిక స్థాయి పరికరాలు తయారు చేశాడు.

ఈ పరికరాన్ని మరింత వృద్ధి చేశాడు. తన సహాధ్యాయి అయిన ఆల్ఫ్రెడ్ వెయిల్ సహకారంతో టెలిగ్రాఫ్ రూపకల్పన చేశాడు. 1837లో వీరి పరికరం ప్రదర్శించబడింది. చిన్న సంకేతాలు డాట్ అనీ; కొంచెం పెద్దవి, ఎక్కువ వ్యవధి కల సంకేతాలు డాష్ అనీ పేరుతో ఆంగ్ల అక్షరాలు, సంఖ్యలకు కోడ్‌లను తయారుచేశాడు. దీంతో మోర్స్‌కు మంచి పేరు వచ్చింది.

వార్తలను దూరప్రాంతాల ప్రసారానికి, రిలే విధానం ఉండాలి. దీనికి జోసఫ్ హెన్రీ అనే వ్యక్తి మోర్స్‌కు సాయం చేశాడు. ఎన్నో ఒడిదుడుకులతో, ఛీత్కారాలు, సత్కారాలు నడుమ 1844 మే 24న" భగవంతుడు ఏంచేశాడు" (What hath God wrought) అన్న సందేశం బాల్టిమోర్ నుండి వాషింగ్టన్‌కు పంపబడింది. దీంతో మోర్స్ శ్రమకు తగ్గ ఫలితం లభించింది.

సంఘర్షణాయుత జీవితంలో మధుర క్షణాలకు, ఉద్వేగ



స్థితి నుండి ఉల్లాస జీవితానికి మరల్చబడ్డాడు. నిరంతర కృషితో నిరాశ, నిస్పృహలకు తెరపడింది. అతడు ఎంతో కాలంగా ఎదురు చూస్తున్న క్షణాలను ఆనందంగా అనుభవించగలిగాడు.

1848లో సారా ఎలిజబెత్ అనే ఆమెను వివాహమాడాడు. అనేక యూరప్ దేశాలవారు మోర్స్ కోడ్‌ను ఆమోదించాయి. హాంబర్గ్ కాక్స్‌హానన్ మీదుగా 1848లో తొలిసారి టెలిగ్రాఫ్ సౌకర్యం కల్పించబడింది. 1858లో లార్డ్‌కెల్విన్ అనే శాస్త్రవేత్త ఆధ్వర్యంలో బ్రిటన్, అమెరికాల మధ్య టెలిగ్రాఫ్ సౌకర్యం కల్పించబడింది. 1872 ఏప్రిల్ 2న మోర్స్ మరణించాడు. మోర్స్ మరణించేనాటికి ప్రపంచమంతా టెలిగ్రాఫ్ సౌకర్యం కల్పించబడింది.




తాను నమ్మిన సిద్ధాంతాలను వదులుకోలేక, నివసిస్తున్న సమాజ పరిసరాలలో ఇమడలేక, సర్దుబాటు ధోరణితో జీవితాన్ని గడిపిన శాస్త్రవేత్త మోర్స్. టెలిగ్రాఫ్ కోడ్ కనుగొన్న శాస్త్రవేత్తగా మనందరికీ సుపరిచితుడు కళ నుండి శాస్త్రానికి మారినవాడు. ఎన్నో ఆదర్శభావాలతో చిత్రకళ చేపట్టినవాడు. "కళను వ్యాపారం చేసేంత నీచుణ్ణికాదు. గౌరవయుతంగా జీవించలేకున్నా ఆహారం లేక మరణించనైనా మరణిస్తాను గానీ కళను నీచానికి గురిచేయను" అన్న గొప్ప భావనతో చిత్రకళలోకి వచ్చినవాడు. శాస్త్రవేత్తగా ప్రఖ్యాతిగాంచాడు.

# స్ఫూర్తినిచ్చే స్థూపం

భారతీయుల దాస్యానికి విముక్తి కల్పించిన మహనీయుడు మహాత్మాగాంధీ. ఆయన జీవితంలోని ప్రతి ఘట్టం నేటి తరానికి మార్గదర్శకం. నగరంలోని గాంధీ పర్వతంపై మనకు దర్శనమిచ్చే 'గాంధీ స్థూపం' మహాత్ముడి జీవితాన్ని ఆవిష్కరిస్తుంది. అంతే కాదు ఆ మహనీయుడి స్ఫూర్తిని నేటితరానికి అందించే వారధిగా నిలుస్తుంది. అహింసవాదానికి మరో రూపంగా పేర్కొనే జాతిపిత జీవితాన్ని నేటితరానికి చేరువచేసే స్ఫూర్తిప్రదాయినిగా పేర్కొనబడుతోంది.

### గాంధీజీ స్మారక కేంద్రం గాంధీహిల్

మహాత్మాగాంధీ స్మారకార్థం దేశంలోని ఆరు పట్టణాల్లో స్మారకకేంద్రాలు నిర్మించారు. అందులో విజయవాడలోని రైల్వేస్టేషన్ సమీపంలోని గాంధీ హిల్ ఒకటి. పర్వతం మీద 18 ఎకరాల సువిశాల ప్రాంగణంలో స్మారక కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. ఈ హిల్‌పై శిఖరంలా కనిపించేది గాంధీస్థూపం. దీని ఎత్తు సుమారు 52 అడుగులు. 1962 నవంబర్ రెండో తేదీన అప్పటి ప్రధాని లాల్‌బహాదూర్‌శాస్త్రి ఈ స్థూపానికి శంకుస్థాపన చేయగా, 1968, అక్టోబర్ ఆరో తేదీన అప్పటి రాష్ట్రపతి జాకీర్ హుస్సేన్ దీనిని ఆవిష్కరించారు. 52 అడుగుల ఎత్తైన ఆ స్థూపాన్ని గుంటూరు జిల్లా రెంటచింతల నుంచి తెప్పించిన రెడ్‌మార్బుల్ స్టోన్‌తో నిర్మించారు. ఎత్తైన పీఠంపై దీనిని ఏర్పాటు చేశారు. గాంధీజీ ప్రభోదించిన పలు సూత్రాలు స్థూపంపై మనకు కనిపించిన పలు చిత్రాలూ దర్శనమిస్తాయి. అంతే కాదు స్థూపంపై నడుస్తున్న గాంధీ బొమ్మ చూపరులను విశేషంగా ఆకట్టుకుంటుంది. ఇక్కడి నుంచి నగరం మొత్తాన్ని వీక్షించవచ్చు. దీనిని ప్రముఖ చిత్రకారుడు నందలాల్‌బోస్ రూపొందించారు.


నందలాల్‌బోస్



# నిత్యకృషీవలుడు -అల్లు రాంబాబు

**హృదయంలో జనిస్తుంది ఓ భావం. ఆ భావానికి స్పందిస్తే వస్తుంది ఓ రూపం. ఆ రూపానికి మరలా ఓ స్పందన, దానికి తిరిగి ఓ భావన, ఆ భావానికి మరలా వేరొక రూపం...**


అల్లు రాంబాబు

**- వెంటపల్లి సత్యనారాయణ**

భావం, రూపం, స్పందన పరస్పర అవినాభావం, నిరంతరం ఇవి ఏర్పడుతూనే వుంటాయి. పుట్టిన ప్రతిమనిషిలో పై మూడు అంశాలూ ఉంటూనే వుంటాయి. కాకుంటే భిన్న రూపాల్లో , విభిన్న మోతాదుల్లో , స్పందించే గుణం, ఆస్వాదించే లక్షణం, ప్రత్యేకత కోరుకునే తత్వం, గల వ్యక్తులు సాధారణంగా కళాకారులుగా మారతారు. అలాంటి సున్నిత స్వభావం, ఆస్వాదించే గుణం, చూసిన, తనకు తోచిన ప్రతీ అంశాన్నీ రంగుల భాషలో వ్యక్తం చేయడమే గాక, పలు అంశాలపై నిరంతరంగా చిత్రాలను సృజియిస్తూ తనదైన ఓ కళాప్రపంచాన్ని సృష్టించుకుంటున్న వర్ధమాన చిత్రకారుడు అల్లు రాంబాబు.

తను చేసిన పనికి ఏమాత్రం గొప్పలు పోకుండా వినమ్రంగా చాల సాధారణంగా ముందుకు సాగుతున్న చిత్రకారుడు అల్లురాంబాబు. 2006 సెప్టెంబరు మాసంలో అనుకుంటాను, ప్రఖ్యాత కళాసాంస్కృతిక మాసపత్రిక భావతరంగిణి ముఖచిత్రంపై చూశాను రాంబాబు చిత్రాన్ని. లయకారకుడైన శివున్ని ఓ నర్తకి తన నాట్యంతో ఆరాధిస్తున్నట్లుగా వేసిన ఆ చిత్రం ఏ మాత్రం ప్రత్యేకత లేకుండా ఒక సాధారణ కేలండర్ కంటే ఏమీ గొప్పగా అనిపించలేదు. ఆ తర్వాత దాదాపు ఆరేళ్ళ తర్వాత గత నవంబరులో అజంతా కళారామం, తెనాలి వారి తొలి జాతీయ శిల్ప, చిత్రకళాప్రదర్శన పోటీల ప్రారంభ సభా వేదికపై రిప్లికా ఆర్టిస్ట్ దార్ల నాగేశ్వరరావు రూపచిత్రాన్ని కొద్ది సమయంలో అందరి సమక్షంలో ఆయిల్ కలర్స్‌తో వేసిన విధానం చూచిన ప్రేక్షకులందర్ని అబ్బురపరిచింది. అతి కొద్ది సమయంలో అందరి సమక్షంలో పరిపూర్ణ స్థాయిలో ఒక రూపచిత్రాన్ని చిత్రించి అందరినీ మెప్పించాలి అంటే దానికి ఎంతో పరిణతి, పరిశీలన రంగులపై సాధికారత కావాలి. లేకుంటే ఓ వ్యక్తి రూపచిత్రాన్ని చిత్రించి మెప్పించడమన్నది సాధ్యమయ్యే పనికాదు. అభిరుచి అనే లక్షణానికి పట్టుదల పరిశ్రమలు తోడైతే సాధించలేనిది ఏమీ వుండదు అని చెప్పడానికి గొప్ప ఉదాహరణగా రూప చిత్రరచనపై అతను సాధించిన సాధికారతను మనం పేర్కొనవచ్చు.

హృదయంలో జనించే స్పందనతో వ్యక్తి చేసే ప్రయత్నానికి ప్రతిరూపంగా ఉద్భవించేది కళగా మనం పేర్కొనవచ్చు. ఈ కళా ప్రారంభం అనేది ఎవరికైనా తన చుట్టూ వున్న పరిస్థితులు, అందుబాటులో గల వనరుల ఆధారంగానే సాగుతుంది. ఓ



సాధారణ కుటుంబంలో, పల్లె వాతావరణంలో జన్మించిన రాంబాబు మదిలో జనించిన కళాస్పృహకు ఆలంబనగా ముందు అతనికి కనిపించిన రూపాలు కూడా తన చుట్టూ వున్న తోటి పిల్లలు, సినిమా బొమ్మలు, ఆ తర్వాత వడ్డాది పాపయ్య, రవివర్మ, బాపు లాంటి చిత్రకారుల చిత్రాలు. పదే పదే గీయడం, గీసినవి పోల్చుకోవడం, తిరిగి మరలా గీయడం, రంగులు వేయడం, ఇలా పలుసార్లు సంతృప్తి అనిపించే వరకూ రూపచిత్రాలను చిన్న తనం నుండే గీయడం ద్వారా ఈ తరహా చిత్రరచనపై అతనికి పట్టు వచ్చేలా చేసింది. చిత్రకళా సాధనకు సంబంధించి అవకాశాలు అంతగా అందుబాటులో లేని పరిస్థితులలో అందుబాటులో వున్న పరిమిత వనరులు, చుట్టూ వున్న తన తోటి పిల్లల యొక్క రూపచిత్ర రచనతో సంతృప్తి పొందిన విధం అతనికి భవిష్యత్‌లో ఎందరో గొప్ప వ్యక్తుల రూపచిత్రాలు వేయడమే గాక పలుదేశాలలోని ఎందరో గొప్ప వ్యక్తుల ఇళ్లల్లో అలంకరణకు నోచుకుంటాయి అన్న విషయం అప్పటికి అతను ఊహించలేదు.

"నిశ్చలమైన మనస్సుతో నిశ్శబ్ధంగా నీ పనిని నువ్ చేసుకుపోతే కాగల కార్యాన్ని కాలం తప్పక నీకు సుగమం చేస్తుంది"

శ్రీమతి అల్లు మహాలక్ష్మి, సూర్యారావు దంపతులకు జూలై 7, 1970న తూర్పు గోదావరి జిల్లా తుని గ్రామంలో జన్మించిన రాంబాబుకు నాల్గవ తరగతి నుండే చిత్రకళపై ఆసక్తి ఏర్పడింది. తాను 2వ తరగతిలో వుండగా తన తండ్రి ఉద్యోగం రీత్యా కుటుంబం తుని నుండి విజయవాడకు తరలివచ్చింది. హైస్కూలులో ఉండగా గురువు గోవిందరాజులు గారి వద్ద చిత్రకళలో ఓనమాలు దిద్దిన రాంబాబు, ఆ తర్వాత వేరొక గురువు పినపాక సత్యనారాయణ మూర్తి గారి శిక్షణలో చిత్రకళలో డ్రాయింగ్ లోయర్, హయ్యర్ పరీక్షలతో పాటు టి.టి.సి. కూడా పూర్తి చేశారు. 20 ఏళ్ళ వయస్సులో విజయవాడలో విజ్ఞాన విహార్ స్కూలు నందు ఆర్ట్ టీచర్‌గా ఉద్యోగంలో చేరిన తర్వాత రాంబాబుకు తన ప్రవృత్తే వృత్తిగా మారడంతో విరివిగా చిత్రాలు వేయడం ప్రారంభించారు. రాజారవివర్మ, వడ్డాదిపాపయ్య, బాపు తదితర చిత్రకారుల చిత్రాలను ఆదర్శంగా తీసుకునే రాంబాబు మొదటికాలంలో మన హిందూ దేవతలకు చిత్రరూపాన్నిచ్చిన రాజారవివర్మ చిత్రాల ప్రేరణతో ఆరాధన పేరుతో దేవుళ్ళకు సంబంధించి అనేక చిత్రాలను వేశారు. ఈ కోవలో ఇతను వేసిన చిత్రాల్లో రవివర్మలా కేవలం దేవుళ్ళ రూపాలనే కాకుండా ఆ దేవుళ్ళను పలు విధాలుగా ఆరాదించి చరిత్ర కెక్కిన భక్తులను కూడా ప్రధానంగా చూపిస్తూ



ఆయన వేసిన శివపార్వతులు, బాలాజీ, అన్నమయ్య, రాధాకృష్ణులు, శ్రీకృష్ణమీరాబాయి, శబరి, శ్రీరాముడు ఇలా ఒక ప్రత్యేక రీతిలో చిత్రాలు వేయడమే గాక 2003, సెప్టెంబర్‌లో "ఎక్స్‌ప్రెషన్స్" పేరుతో మరికొందరు చిత్రకారులు పద్మశ్రీ శ్రీపతి, టి.వి., కొచ్చెర్ల. వి.ఆర్., పడవల నారాయణరావు, గాంధీ, వెంపటాపు, శాస్త్రి, జి.నరసింహారావు తదితర చిత్రకారులతో కలసి సామూహిక చిత్రకళాప్రదర్శనగా సృష్టి ఆర్ట్‌గ్యాలరీ హైదరాబాద్‌నందు ప్రదర్శించడం జరిగింది.

విజ్ఞాన విహార్ స్కూలు నందు ఆర్ట్‌టీచర్‌గా పనిచేయడంతో అక్కడ పిల్లలలో ప్రధానంగా రేకెత్తించే జాతీయ భావాల స్ఫూర్తిగా అతను వేసిన వివిధ స్వాతంత్ర్య సమరయోధుల చిత్రాలను కేవలం రూపచిత్రాలుగా మాత్రమే గాకుండా వాటికి ఆయా నాయకుల భావజాలాన్ని కూడా జోడిస్తూ వేసిన దాదాపు ముప్పై జాతీయ నాయకుల చిత్రాలు ఒక ప్రయోగంగా చెప్పుకోవచ్చు. పిల్లలకు, యువతకు స్ఫూర్తిగా ఉండే ఈ చిత్రాలను జాతీయ పర్వదిన సమయాలలో విజయవాడ తను పనిచేసే స్కూలుతో పాటు అనేక ఇతర స్కూల్లలోనూ మరియు ముఖ్యమైన ప్రదేశాలలో నూ కలిపి





ఇప్పటికి పదిసార్లకు పైగా ప్రదర్శలను చేయడం జరిగింది. ఇటీవలనే ఈ ఆర్టికల్‌ని రాయడంలో భాగంగా 64కళలు.కామ్ ఎడిటర్ కళాసాగర్‌గారు నేనూ రాంబాబు ఇంటికి వెళ్ళినప్పుడు అక్కడ ఈ దేశభక్తి మరియు జాతీయ వాద స్ఫూర్తితో వేసిన చిత్రాలను చూసినపుడు చాల ఆశ్చర్యం ఆనందం కలిగాయి. బహుశా బెంగాల్ ప్రాంతంలో తప్ప మన ప్రాంతంలో ఈ విధమైన అంశాన్ని ప్రధానంగా తీసుకుని అన్ని చిత్రాలను వేసిన వారు ఎవరూ లేరనిపిస్తుంది.

అందుకే సంస్కారభారతి (అఖిలభారత స్థాయి సంస్థ) లలితకళల ద్వారా మన సంస్కృతి, సాంప్రదాయాల విశిష్ఠతను తెలియజేస్తూ నాగపూర్ (మహారాష్ట్ర)లో 2012, నవంబరు 23-25 వరకు నిర్వహించిన ప్రతినిధుల సమావేశంలో దేశభక్తిని ప్రేరేపిస్తూ రాంబాబు చిత్రించిన ఈ చిత్రాల ప్రదర్శన ఏర్పాటు చేయడం జరిగింది.

పరిణామం అనేది ఒక విధంగా ప్రగతికి చిహ్నం. మార్పు లేని ప్రయత్నం, కృషి కొంత కాలానికి విసుగును కలిగిస్తాయి. అందుకే వేగవంతంగా మారుతున్న కాలంతో పాటు, వ్యక్తి చేసే కృషిలో కూడా ఆ మార్పు కనిపిస్తేనే చూసే ప్రేక్షకుడి కంటికి నవ్యత కనిపిస్తుంది. మొదట్లో రూపచిత్రాల మాదిరిగా ఆరాధన

పేరుతో వేసిన వివిధ భక్తుల, దేవుళ్ళ చిత్రాల తర్వాత దేశభక్తి జాతీయ భావజాల చిత్రాలను సృష్టించిన అతని కుంచె ప్రస్తుతం పూర్తిగా జానపదం వైపుకు మళ్ళింది. అంతేగాక అనుభవం మీద వచ్చిన వ్యక్తీకరణతో కూడిన ఒక ప్రత్యేక శైలితో నూతన ఒరవడిలో సృష్టిస్తున్న ఈ జానపద చిత్రాలు రాంబాబుకు ఒక ప్రత్యేక గుర్తింపును తెస్తాయని చెప్పవచ్చు.

గ్రామీణ వాసుల జీవనం, వారి మనుగడకు సంబంధించిన వివిధ సంఘటనలు అనగా పొలంకేసి, ప్రకృతి స్త్రీ, పండగముందు, సువ్విసువ్వి సందేళ, తొలిరాత్రి, ఎదురుచూపు లాంటి చిత్రాలతో పాటు పల్లెసంస్కృతికి ప్రతిరూపాలైన కోలాటం, తప్పెటగుళ్ళు, డోలు వాయిధ్యాలు, సన్నాయిమేళాలు, జానపద నృత్యాలు లాంటి గ్రామీణ కళారూపాలను కూడా ఒక ప్రత్యేకమైనశైలిలో ఆయన చిత్రించారు.

మెడకు చిన్న డప్పుల్లాంటి వాయిద్యాలు తగిలించి చాతిన పెట్టుకుని ఉత్సాహంతో మైమరచి వాయిస్తున్న వాద్యబృందంలోని కళాకారుల వేగం, ఉద్వేగం, తదాత్మ్యంతో అక్కడ ఆవరించిన ఒక ఉద్విగ్న వాతావరణాన్ని చిత్రాన్ని వీక్షించే ప్రేక్షకుడి మదిలో కూడా రేకెత్తించే విధంగా చిత్రకారుడు అద్భుతంగా ఆవిష్కరించాడు. ''తప్పెటగుళ్ళు'' చిత్రంలో, అలాగే గ్రామీణప్రాంతాల్లో పెళ్ళిల్లకు ముందు శుభసూచకంగా అక్కడ ముత్తయిదువులందరూ లయబద్ధంగా రోకల్లతో పసుపుకొట్టే దృశ్యానికి ప్రతిరూపంగా చిత్రించిన 'సువ్వి సువ్వి" చిత్రాన్ని చూస్తున్నప్పుడు ప్రేక్షకుడి మదిలో ఒక లయబద్ధమైన దృశ్య సంగీతం వినిపిస్తుంది. గోపిక అన్న వేరొక చిత్రంలో గోవులను కాసే స్త్రీ యొక్క నిల్చున్న భంగిమకు తోడు ఆమె వెంటున్న గోవులను అందమైన వివిధ భంగిమలలో చిత్రించిన తీరు, శైలి



చూపరుల మానసానికి హత్తుకునేలా చేస్తుంది. వరుడు తనకోసం వేచియున్న గదికి తొలిసారిగా పాల గ్లాసుతో వెళ్తున్న నవవధువు హృదయంలో ఏర్పడే ఒకింత భయం, సిగ్గు, ఆందోళన లాంటి భావాలను చక్కగా వ్యక్తీకరించాడు "తొలిరాత్రి" చిత్రంలో సహజంగా వడ్డాది పాపయ్యకు అభిమానియైన రాంబాబు వేస్తున్న ఈ తరహా చిత్రాల్లో ఒకింత అతని ప్రభావం కనిపిస్తున్న ప్రత్యేకంగా ఈ తొలిరాత్రి చిత్రంలో వపా ఛాయలు మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.



వ్యాసరచయిత వెంటపల్లితో అల్లు రాంబాబు

చిత్రకళనే తన జీవన లక్ష్యంగా చేసుకున్న రాంబాబు ఒకవైపు విజయవాడలో ఎన్.ఎస్.ఎమ్ పబ్లిక్ స్కూలు నందు ఆర్ట్ టీచర్‌గా పనిచేస్తూనే తన ఈ కళకు ఉన్నత విద్యాపరమైన అర్హత సంపాదించాలనే లక్ష్యంతో పట్టుదలగా శ్రీ అల్లంప్రభు లలితకళా అకాడెమీ, మైసూర్ ద్వారా సార్వత్రిక పద్ధతిలో M.F.A కూడా చేసి మొదటిశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. తన ప్రతిభకు విద్యాపర అర్హతలు కూడా తోడవ్వడంతో విజయవాడ నందు B.F.A చేసే విద్యార్థులకు ప్రతివారం చిత్రకళా పాఠాలు బోధించే స్థాయికి ఎదిగారు.

కేవలం చిత్రకారుడిగానే గాక నటుడుగా, చిన్న కథల

రచయితగా స్టేజ్‌డెకరేటర్‌గా పలువిధాలుగా అతని ప్రతిభ విరాజిల్లుతుందని చెప్పడానికి ప్రస్తుతం అతను పనిచేస్తున్న విజయవాడ N.S.M పబ్లిక్ స్కూలునందు నిర్వహిస్తున్న పలు సాంస్కృతిక కార్యక్రమాలు తార్కాణంగా నిలుస్తాయి. తాను పనిచేస్తున్నది ఒక క్రైస్తవ మిషనరీకి చెందినది కావడంతో ఆ మిషనరీకి సంబంధించిన విదేశాలనుండి వచ్చిన పలు క్రైస్తవ పెద్దలు రాంబాబు చిత్రాలకు ముచ్చటపడి అతనిచే వారి వారి రూప చిత్రాలు వేయించుకోవడం వలన రాంబాబు వేసిన అనేక చిత్రాలు పలు విదేశీయుల ఇళ్లల్లో కూడా కొలువుదీరి ఉండడానికి కారణమయ్యింది.

జాతీయ వాద స్ఫూర్తితో వేసిన చిత్రాలలో ఇప్పటికి విజయవాడ తదితతర ప్రాంతాల్లో 10 సార్లుకు పైగా వ్యక్తిగత ఒక కళాప్రదర్శనలు చేసిన రాంబాబు 2003లో ఎక్స్‌ప్రెషన్స్ పేరుతో హైదరాబాద్ సృష్టి ఆర్ట్ గేలరీనందు తన మిత్రులతో కలిసి సామూహిక చిత్రప్రదర్శనను చేశారు. 2009లో స్నేహ గ్రూప్ ఆఫ్ ఆర్టిస్ట్స్ పేరుతో మరొక సామూహిక ప్రదర్శనను స్టేట్ ఆర్ట్ గేలరీలో నిర్వహించారు.



*పద్మశ్రీ ఎస్వీ రామారావు గారి చేతుల మీదుగా అజంతా కళారామం, తెనాలి అవార్డు అందుకుంటున్న అల్లు రాంబాబు*

ఇక చిత్రకళాపోటీలలో విరివిగా పాల్గొన్న రాంబాబు సింహపురి ఫైన్‌ఆర్ట్స్ అకాడమీ, నెల్లూరు వారి పోటీలలో ద్వితీయ బహుమతి, అడపా చిత్రకళాపరిషత్ నర్సీపట్నం నుండి ప్రత్యేక బహుమతిని, అజంతా కళారామం, తెనాలి వారి జాతీయ చిత్రకళాపోటీలలో నగదు బహుమతిని అందుకోవడంతో పాటు హైదరాబాద్, గుంటూరు, ఏలూరు, విజయవాడ తదితర చోట్ల అనేక గ్రూప్‌షోల్లో ను, వర్క్ షాపుల్లోనూ పాల్గొన్నారు. తన కళాకృషికి గుర్తింపుగా జవహర్ ఆర్ట్‌క్లబ్, విజయవాడ, N.S.M పబ్లిక్‌స్కూల్, ఆంధ్రాలయోలా కాలేజ్ విజయవాడ, జిల్లా గ్రంథాలయం, ఏలూరు కళాదర్శి ఫైనార్ట్స్ కాలేజ్ JMJ కాంగ్రిగేషన్ మంగళగిరి లాంటి ఎన్నో సంస్థల నుండి సత్కారాలందుకున్నారు.

ఆంధ్రా అకాడమీ ఆఫ్‌ఆర్ట్స్ విజయవాడ వారు చిత్రకళా ఉపాధ్యాయులకు నిర్వహించిన పోటీలలో ప్రథమబహుమతిని దక్కించుకున్న రాంబాబు స్ఫూర్తి క్రియేటివ్ ఆర్ట్ స్కూలు విజయవాడ నుండి 'కళారత్న' అవార్డు అందుకున్నారు.

నిశ్శబ్ద సంగీత ఝరిలా, నిరంతరం ప్రవహించే జీవనదిలా రాంబాబు కళాయానం మరింత ముందుకు సాగుతూ మరెన్నో లోతులను, మరిన్ని కళాతీరాలను చేరాలని ఆశిద్దాం.









email: snventapalli@gmail.com

సమ్‘థింక్’ స్పెషల్

# ‘గోటి’తో పోయే చిత్రాలకు కుంచెందుకు...


పరిశినాయుడు
9652889643

**ఈయనో చిత్రకారుడు. చేతిలో కాగితం ఉంటే చాలు నిముషాల్లో చిత్రాలు సిద్ధమవుతాయి. చిత్రాలు రూపొందించేందుకు వీరికి కలాలు, పెన్సిళ్లు, రంగులు, కుంచెలేమీ అసరంలేదు. కుడిచేతి బొటనవేలే ఆయనకు కుంచె, సిరా, రంగు అన్నీ. నఖాలతో డ్రాయింగ్ కాగితంపై బొమ్మలను అచ్చుగుద్దినట్లు రూపొందించే ఆయన పేరు పల్లా పరిశినాయుడు.**

విజయనగరం జిల్లా నాగూరుకు చెందిన పరిశినాయుడు ప్రపంచ తెలుగు సమాఖ్య సహకారంతో వైట్‌ఫీల్డ్ శాంతినికేతనంలోని ఒకస్టాల్‌లో తన చిత్రాలను ప్రదర్శించారు. సందర్శకుల్లో కోరిన వారికి వారి చిత్రాలను గోళ్లతో చెక్కి ఇచ్చారు. మిగిలిన చిత్రకారులకు ఉన్న విధంగా ముందుగా కాగితంపై


నఖచిత్రం

ఔట్‌లైన్ వేసుకొని బొమ్మలను వేసే అవకాశం లేకపోవటంతో ఈ చిత్రాలను రూపొందించటం కష్టంతో కూడుకున్న పని. ఎదుట ఉన్న వ్యక్తి చిత్రాన్ని , లేదా ఏదైనా ఛాయాచిత్రాన్ని చూసుకుంటూ నఖచిత్రాలను రూపొందించటం కష్టంతో కూడుకున్న పని అని పరిశినాయుడు తెలిపారు. ‘తాపీ పనిచేసే మానాన్న సిమెంట్‌పై బొమ్మలు చేస్తున్నప్పుడు, భవంతులపై దేవతామూర్తుల బొమ్మలు కడుతన్నప్పటి నుంచే తనకు చిత్రలేఖనంపై ఆసక్తి ప్రారంభమైందని చెప్పారు. ప్రభుత్వ పాఠశాలలో ప్రధానోపాద్యాయునిగా పనిచేసి


నఖచిత్రం

నఖచిత్రం

## పరిశినాయుడు అందుకున్న అవార్డులు

- 1988లో నఖచిత్రకళా విశారద బిరుదు
- 1989లో బెస్ట్‌నెయిల్ ఆర్టిస్ట్ అవార్డు ఎన్టీరామారావు చేతులమీదుగా
- 1890లో ఉత్తమచిత్రకళోపాధ్యాయుడిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురస్కారం.
- 1992లో ఢిల్లీ తెలుగు అకాడెమీ పురస్కారం.
- 1996లో ఉత్తమటీచర్‌గా రాష్ట్రపతి అవార్డు శంకర్ దయాళ్‌శర్మ చేతులమీదుగా
- నఖచిత్రకళాప్రదర్శనలు
- హైదరాబాద్, చెన్నై, బెంగుళూర్, బరంపూర్, విశాఖపట్టణం, విజయనగరం, ఒంగోలు తదితర చోట్ల ప్రదర్శించారు.

సమ్‌'థింక్' స్పెషల్

పదవీ విరమణ చేశారు. గత మూడు దశాబ్దాలుగా నఖచిత్రాలను వేస్తున్నట్లు తెలిపారు.

రాజీవ్‌గాంధి, ఇందిరాగాంధి, ఎన్.టి.ఆర్, బొమ్మలరేడు బాపు, జమున, నాగేశ్వరావు, శంకరదయాళ్‌శర్మ, చంద్రబాబునాయుడు, పోప్‌జాన్‌పాల్ ఇలా చెప్పుకుంటూ పోతే పరిశినాయుడు చిత్రాల్లో ఒదిగిన నాయకులు ఎందరో ఆయా వ్యక్తుల చిత్రాలను చిత్రించి వారికే ఇచ్చిన పరిశినాయుడు ఇప్పటి వరకు ఎన్నో అవార్డులు, సత్కారాలు పొందారు. ఇప్పటివరకు ఏడు వేల చిత్రాలను డ్రాయింగ్ షీట్‌లపై వేసారు. ఈ చిత్రాలను ప్రదర్శించాలంటే వీటిని ఫొటో తీసి ప్రదర్శించాల్సి ఉంటుంది. వరంగల్‌కు చెందిన కార్టూనిస్టు సంగి వద్ద మొదట ఈ చిత్రాలను రూపొందించే విధానాన్ని నేర్చుకొని తదుపరి స్వయంగా మెరుగులు దిద్దుకున్నట్లు వివరించారు. ఎం.ఎస్.రెడ్డి (మల్లెమాల) సహకారంతో పలుచోట్ల ప్రదర్శనలు ఇచ్చేందుకు అవకాశం కలిగిందని చెప్పారు. గోళ్లతో చిత్రాలను రూపొందించే ఆయన కేవలం మనుషుల చిత్రాలే కాకుండా పురుణ పురుషుల, దేవుళ్ల చిత్రాలను వేసేటప్పుడు చుట్టుపక్కల ఉండే ప్రకృతిని చిత్రించటం, ఆభరణాలు, చిన్న చిన్న వస్తువులు యధాతథంగా ఉండే విధంగా చూడాల్సిన బాధ్యత చిత్రకారునిపై ఉంటుందని చెప్పారు. దేశం మొత్తం మీద 30 మంది వరకు ఇటువంటి నఖచిత్రాలు వేసే కళాకారులు ఉండగా వారిలో పదిమంది వరకు ఆంధ్రప్రదేశ్‌లోనే ఉన్నట్లు చెప్పారు. ఈ కళకు ఎక్కువ ఆదరణ లేనందున ఎక్కువమంది దీనిని నేర్చుకునేందుకు ఆసక్తి చూపించటం లేదని అన్నారు. నిరంతరం బొమ్మలను చెక్కుతూ పోతూ ఉంటే గోరు, గోటి చివరి చిగురు నొప్పి పుడుతుందని తెలిపారు. ఈ కళపై ఆసక్తి ఎలా పుట్టిందని ప్రశ్నిస్తే 'గోటితో పోయే బొమ్మకు కుంచె అవసరమా' అని ప్రశ్నించారు.

వీరు నఖచిత్రకారులు మాత్రమే కాదు. మంచి కార్టూనిస్టు, చిత్రకారుడు కూడా. వీరి కార్టూన్లు అనేక పత్రికలలో ప్రచురించబడ్డాయి. వీరి నఖచిత్రాలను 'పుస్తకరూపంలో ప్రచురించారు కూడా.



# పౌరాణిక నాటకరంగ రారాజు-ఆచంట

అద్భుత, సహజ హావభావాలు, వాక్పటిమ, సంభాషణా సంవిధానం, ఠీవి ఆయన సొంతం. సుయోధనుడిగా రాజసం ఉట్టిపడే నడక, గంభీరమైన సంభాషణలు, నిండైన రూపం ఆ పాత్రకు పెట్టిన ఆభరణాలు. వికటాట్టహాసం చేస్తూ 'మానుటయా... మనుగడ సాగించుటయా' అంటూ అభిమాన ధనుడైన దుర్యోధనుడు అంతర్మధనం చెందే విధానాన్ని తన నటనా వైదుష్యంతో సుస్పష్టంగా చూపించ గల ప్రతిభాశాలి. ఆయనే అపర 'దుర్యోధనుడు' అచంట. 78 ఏళ్ల వయసులోనూ విజయవాడలో శ్రీషణ్ముఖ నాట్యమండలి బాలల సాంస్కృతిక శిక్షణా కేంద్రాన్ని స్థాపించి నటనకు విశేష సేవ చేస్తున్నారు.



డా॥ డి. విజయభాస్కర్

ఆంధ్రనాటక రంగస్థలంపై తనదైన బాణి, వాణీతో తెలుగు పద్యనాటకానికి వెలుగు బావుటగా నిలిచారు నటరత్నం అచంట వెంకటరత్నం నాయుడు. సామాన్య కుటుంబీకులైన వెంకటేశ్వర్లు నాయుడు, నరసమ్మకు 1935లో కృష్ణాజిల్లా జుజ్జవరంలో అచంట జన్మించారు. స్వస్థలం కొండపల్లి. 1945లో కొండపల్లిలో ప్లేగువ్యాధి విజృంభించటంతో స్థానికులంతా దగ్గరలోని వీటీపీఎస్ స్థలంలో తలదాచుకున్నారు. ఆ సమయంలో బాధితులకు ఆహ్లాదాన్ని పంచేందుకు వెంకటేశ్వర్లు నాయుడు రాత్రివేళల్లో నాటకాలు వేసేవారు. ఆ సమయంలోనే 'ధవోపాఖ్యానం' నాటకంలో సునీత, నారద పాత్రలను అచంటతో వేయించారు. అలా పదేళ్ల వయసులో ప్రారంభమైన ఆయన నటనా వ్యాసంగం అర్ధశతాబ్దానికి పైగా కొనసాగింది.

టీవీ 1 లో ఆచంటతో ముచ్చటిస్తున్న విజయభాస్కర్



### కళాతృష్ణ ముందు ఉద్యోగాలు బలాదూర్

విద్యాభ్యాసం కోసం గుంటూరు వెళ్లిన అచంట అక్కడి టౌన్ స్కూల్లో ఎస్ఎస్ఎల్సీ చదివారు. ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా గుంటూరు కొరిటపాడులోని అన్నదాన సమాజంలో గుమస్తాగా చేరారు. విధి నిర్వహణలో ఉండగానే నాటకం రిహార్సల్స్ వేయటంతో ఉద్యోగం ఊడింది. అయినా నిరుత్సాహపడకుండా, చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకుంటూ నటనను తపస్సుగా స్వీకరించారు ఆయన. సీనియర్ పాత్రికేయుడు నార్ల వెంకటేశ్వరరావు రచించిన 'జీవనజ్వాల' సాంఘిక నాటకంలో వేసిన తాత పాత్రకు ఆయనకు మొదటి బహుమతి లభించింది.





ఆంధ్రనాటక కళాపరిషత్ ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో జరిగిన 'అపరాధి' నాటకం ఆయనను అత్యుత్తమ స్థాయికి తీసుకెళ్లింది. 'బాలనాగమ్మ', బొబ్బిలి' తదితర నాటకాలు మంచి పేరు తెచ్చాయి.

### సాంఘికం నుంచి పౌరాణికంలోకి...

1957లోనే గుంటూరులో 'నటరాజ కళామండలి'ని స్థాపించిన అచంట పౌరాణిక పద్యనాటకాల ప్రదర్శనలకు ప్రయత్నాలు ప్రారంభించారు. హుళక్కి భాస్కరరావు, ఎక్కిరాల కృష్ణమాచార్యుల వద్ద శిష్యరికం చేశారు. 1970లో తణుకులో మాదాసు నరసింహారావు రూపకల్పన చేసిన 'తులసీ జలంధర' నాటకంలో జలంధరుడిగా పాత్రవేసి విశేష జనాదరణ పొందారు. ఆ నాటకాన్ని దేశవ్యాప్తంగా వివిధ పట్టనాల్లో ప్రదర్శించటంతో దూరదర్శన్, ఆకాశవాణి కేంద్రాలు అచంట ప్రదర్శనలను ప్రసారం చేశాయి.

### పౌరాణిక నట జీవిత స్వర్ణోత్సవం

1995లో అచంట అభిమానులు హైదరాబాద్‌లో 'అచంట పౌరాణిక నటజీవిత స్వర్ణోత్సవం' జరిపారు. వారంరోజులు జరిగిన ఆ ఉత్సవాల్లో విభిన్నమైన పాత్రలు ధరించి, తన నటనా విశ్వరూపాన్ని ప్రదర్శించారాయన. ఏడుభిన్నమై పాత్రలు పోషించి ప్రేక్షక స్పందనలు, ప్రముఖుల గౌరవ పురస్కారాలు అందుకున్నారు. ఈ నాటకాలను ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం దూరదర్శన్ 21 ఎపిసోడ్లుగా ప్రసారం చేశాయి.

### కీర్తి కిరీటాలు

1972లో భీమవరంలో 'నటసార్వభౌమ', 1976లో కోరుకొండలో 'రంగస్థల రారాజు', అనంతపురంలో 'నట విద్యా విశారద', 1986లో కర్ణాటకలో 2 నటచైతన్య', 1988లో స్వగ్రామంలో 'నటబ్రహ్మ' బిరుదులు, లెక్కకు మించిన సన్మానాలు, సత్కారాలు పొందారు అచంట. 1990లో మారిషస్‌లో జరిగిన తెలుగు మహాసభల్లో ఆయన అభినయానికి ముగ్ధుడైన సినీ నటుడు అక్కినేని నాగేశ్వరరావు అచంటను ఆలింగనం చేసుకొని సత్కరించారు. 1992లో తానా సభలకు హాజరై, వాషింగ్టన్, న్యూజెర్సీ, ఫిలడెల్ఫియాలలో ప్రదర్శనలిచ్చారు. ఆయన కళాసేవను గుర్తించిన రాష్ట్రప్రభుత్వం 'హంస' అవార్డుతో సత్కరించింది. భూమికోసం, కొల్లేటి కాపురం, శ్రీకృష్ణార్జున విజయం, పండంటి జీవితం, శ్రీదత్త దర్శనం, బతుకే ఒక పండుక వంటి సినిమాల్లోనూ అచంట నటించారు. 'దుర్యోధన మయసభ', 'తులసీ జలంధర' ఏకాపాత్రభినయాలను ఎల్‌పీ రికార్డ్, క్యాసెట్‌గా ఏవీఎం విడుదల చేసింది.

### నటదిగ్గజాలు కలిసిన వేళ

నాటకరంగంలో లబ్ధప్రతిష్టుడైన అచంట, విశ్వవిఖ్యాత నందమూరి తారక రామారావు జీవనశైలిలో సారూప్యత ఉంది.





### అభినవదుర్యోధనుడి గురించి...

- 5వ తరగతి నుంచి నాటకాలపై ఆశక్తి.
- పాఠశాల స్థాయిలోనే నటనకు గాను బహుమతి అందుకున్నారు.
- చిన్నప్పుడు చేసిన నటనకు గాను 5రూపాయలు అందుకున్న తొలిపారితోషకం
- రవీంద్ర భారతిలో ప్రదర్శించిన వీరి నాటకాన్ని అప్పటి ముఖ్యమంత్రి ఎన్టీఆర్ రెండుగంటలు తిలకించి ఆచంటను అభినందించారు.
- వీరి కుమారుడు ఆచంట బాలాజీనాయుడు కూడా ప్రముఖ రంగస్థల నటులే.
- వీరి ఆధ్వర్యంలో 'పద్యనాటకానికి' వందేళ్ళు కార్యక్రమాన్ని గత నెలలో విజయవాడలో నిర్వహించారు.

ఇద్దరూ మే 28వ తేదీనే (సంవత్సరం వేరు) కృష్ణాజిల్లాలో జన్మించారు. ఎన్టీఆర్‌ది నిమ్మకూరు అయితే, అచంటది ఆ పక్కనే ఉన్న జుజ్జవరం. నాటకరంగంలో దుర్యోధనుడి పాత్రకు ఆయన ప్రాణ ప్రతిష్ఠ చేయగా, సినీరంగంలో ఎన్టీఆర్ జీవించారు. హైదరాబాద్‌లో జరిగిన నటజీవిత స్వర్ణోత్సవ సభలో పాల్గొన్న ఎన్టీఆర్ 'అచంట వారిని చూస్తే ఎప్పుడో నేను ధరించిన నా పాత్రలు, ఆ మీసాలు, ఆ కిరీటాలు... ఈ గొడవంతా ఏమోగానీ వారిని చూసి నేను నేర్చుకున్నానా? నన్ను చూసి వారు నేర్చుకున్నారా అనిపిస్తోంది' అని వ్యాఖ్యానించారు. 1983లో విజయవాడలో జరిగిన మహానాడులో అచంట ప్రదర్శించిన దుర్యోధన ఏకపాత్రను తిలకించిన ఎన్టీఆర్ ఆయనతో కరచాలనం చేసి అభినందించారు.



తెలుగు-వెలుగు

# నూ'తన' తెలుగు శకానికి శంఖారావం...

- బి.యం.పి. సింగ్
సెల్ : 93955 94114

ఆంగ్లభాషా అమావాస్య చీకట్లను చీల్చుకుని పునః ప్రకాశించనున్న పూర్ణ చంద్రబింబం ఆంధ్రాక్షరం. సుమధుర మధురాక్షరం మన తెలుగు అక్షరం, గోక్షీరం సుగంధ సమీరం గోదావరి, కృష్ణ సుధాసమ నీరం రాణి రుద్రమ్మ, అల్లూరి, బాలచంద్రుల వీరం, రామప్ప శిల్పం, బొబ్బిలి పౌరుషం, బెజవాడ దుర్గమ్మ దీప - ధూపం తెలుగు అక్షరం.

ఈ నాలగవ తెలుగు ప్రపంచ మహాసభల పుణ్యమా అని నేడు తెలుగు భాషకు మరలా మంచిరోజులు వచ్చాయి. తెలుగుతల్లి బిడ్డలైన మనవారందరు తమతప్పు తాము తెలుసుకున్నారు. ఇన్నాళ్లూ తెలుగుభాషను తృణీకరించి, ఆంగ్లభాషను అక్కున చేర్చుకున్నందుకు ఏమి పోగొట్టుకున్నారో, గ్రహించారు. ఇలా నివాసాంధ్రులు అవమానిస్తుంటే మన తెలుగుతల్లి ప్రవాసాంధ్రుల ఇంట నేడు తలదాచుకుంటున్నది. తనను ఆదరించేవారి పంచలోనే ఆనందం పంచుకుంటున్నది. తెలుగుభాష ఆంధ్రాలో మునిగి, తానాలో తేలింది. దీనికి కారణం ముమ్మాటికీ మనమే.

**మమకారమా? వ్యాపారమా?**

మాతృభాషను మమకారంతో అభ్యసించాలి గానీ, ఉద్యోగాలొస్తున్నాయని పరభాషను మన భాషగా మార్చుకోవడం, మాతృభాషను పూర్తిగా మరుగునపడేసి, ఉద్యోగాల కోసం కంప్యూటర్ లాంగ్వేజస్ 'సి', 'జావా' 'ఒరాకిల్' లాగా తెలుగును వదిలేసి, ఇంగ్లీషు వెంటపడటం ఎంతమాత్రం మంచిది కాదు. మాతృభాషను మాత్రం మమకారంతోనే నేర్చుకోవాలి. ఉద్యోగం రావడంలేదని తెలుగుభాషను వదులుకోవటం సంస్కారం కాదు. నేటితరం ఆంగ్ల మోజులోపడి, పూర్తిగా తమను తామే మరచిపోతున్నారు. వీరు మారిపోతున్నారా? లేక తమనుండి తామే పారిపోతున్నారా? అని అనిపిస్తున్నది ఈ వేలంవెర్రి.

శాసించినంతవరకే మనిషి బ్రతుకు. భాషించినంతవరకే భాషబ్రతుకు అని ఎరిగి కూడా ఎరగనట్లు వుండటం మన భాషకు పెనుముప్పుగా మారింది. నానాటికి మన పాతకాలం తెలుగుపదాలు, **ఆత్మీయ 'పలక'రింపులు** వాడుకలో లేక (ఆంగ్ల) కాలగర్భంలో కలిసిపోయి కనుమరుగైపోయాయి. భారతావనిలోనే గాక అఖండ భూమండలంలో మన తెలుగుతనానికి ఎనలేని ఖ్యాతి వున్నది. మన పల్లె జీవనం, మన కట్టూ - బొట్టూ మన పంటలు, మన వంటలు, మన మాటామంతీ, మనం జరుపుకునే పండుగలు, పబ్బాల వంటివి తెలుగుజాతి ఖ్యాతికి దోహదపడినవే. ఈ లక్షణాలన్నీ తెలుగుభాష మాట్లాడినంతవరకే మన వెన్నంటి వుంటాయి. ఏనాడైతే పాశ్చాత్య నాగరికత, పాశ్చాత్య భాషలు, పాశ్చాత్య పోకడలవైపు మొగ్గుచూపుతున్నామో ఆనాటినుంచే మనం మన తెలుగుదనానికి దూరమైపోయాము. ఇదంతా చూస్తూ భరించలేని తెలుగుభాషా ప్రేమికులు, తెలుగుభాషా శ్రామికులు నడుం బిగించి మళ్ళీ మన తెలుగువాళ్ళతో తెలుగులో మాట్లాడించాలని తెలుగు చదివించాలని, వారికి వారి పిల్లలకు తెలుగు నేర్పించాలని సంకల్పించి, ఇటువంటి మహాసభలు,

సమావేశాలు, సదస్సులు ఏర్పాటుచేసి తెలుగుభాషా పరిరక్షణకు తోడ్పాటు చేస్తున్నారు. ఓ తెలుగు ఆధునిక ప్రభం'జనాన్ని' ప్రపంచానికి చూపించే ప్రయత్నంలో అంతర్భాగంగా త్రికరణశుద్ధిగా ప్రపంచ మహాసభలు మన పంచలో జరిపిస్తున్నారు.

**మనకు మాతృభాష ఎందుకు....**

మనిషికి ఒంట్లో తల్లిపాల పాలు లేనినాడు ఆ మనిషి జీవితం అనారోగ్యం పాలు.

మనిషి నోట్లో తల్లిభాష లేనినాడు ఆ మనిషి జీవితం అప్రతిష్ఠ పాలు.

అమ్మను, అమ్మభాషను మరచిన జాతి అబాసుపాలు.

ఈ విషయం చర్చించేందుకే నేటి ఈ సభలు, సమావేశాలు.

అమ్మభాష మనిషి కడ అమ్మ... భాషరూపంలో కడవరకూ వుండే తోడు.



**అడుసు త్రొక్కనేల కాలు కడగనేల....**

గత చాలాకాలంగా అస్తమానం ఆంధ్రనేలలో ఆంగ్లగోల.

నేటి ఆంగ్ల మాధ్యమం చదువుల ప్రభావంతో పిల్లలకు మన వావివరసలన్నీ తెలియకుండా పోయాయి. అన్ని వరసలు పిన్ని, అత్త, మామ, బాబాయి, పెద్దమ్మ, పెద్దనాన్న వంటివన్నీ సింపుల్‌గా **ఆంటీ, అంకుల్** పరిధిలోకి వచ్చేశాయి. **నేటి మన ఆంగ్ల పిచ్చి ఏ స్థాయికి చేరిందంటే ఆఖరికి అమ్మను కూడా ఆంటీ అనే పరిస్థితి ఏర్పడనున్నది!** పొరపాటున పిల్లలకి మన పెద్దవాళ్ళను పరిచయం చేసేటప్పుడు మేనమామ, మేనత్త, బావ... ఇలా చెపుతుంటే వాళ్ళకేమి అర్థం కాకుండా బిక్కమొహం పెట్టి వెర్రిచూపులు చూస్తున్నారు. ఇదిచూసిన మన పెద్దలు ముక్కున వేలు వేసుకుంటున్నారు. తొలినుంచి మన ఉమ్మడి కుటుంబాలలో వుండే పిల్లలకు ఈ వరసలన్నీ వాటంతట అవే తెలిసేవి. **దాహం వేసినప్పుడు నుయ్యి తవ్వినట్లు...** ఇప్పుడు ప్రత్యేకంగా వారికి నేర్పుతుంటే **మొక్కై వంగనిది మ్రానై వంగునా** అన్న చందాన నేటి తరానికి ఇప్పటికి ఇప్పుడు తెలుగు నేర్పటం మన తరం కాకున్నది. చిన్నతనం నుంచే పిల్లలను తెలుగు వాతావరణానికి దూరంగా వుంచి, వారి జీవితాన్ని ఆంగ్లమయం చేయటం వల్లనే ఈ అనర్థాలన్నీ వచ్చిపడుతున్నాయి. ఆఖరికి వారు తినే తాయిలాలు కూడా రంగులు, రసాయనాలమయం చేసి వారి మానసిక ఆరోగ్యంతోపాటు శారీరక ఆరోగ్యాన్నీ పాడుచేసి, నేడు పశ్చాత్తాప పడుతున్నాం.








**లక్ష్యం మారిన అక్షరమాల :**

లక్షలు ఆర్జించే లక్ష్యంతో నేడు మన తెలుగు పిల్లలకు అక్షరాభ్యాసం నుండే అమెరికా మోజు. అక్షరాభ్యాసం నాడే ఆంగ్ల అక్షరాలు నేర్పే దురభ్యాసం మొదలైంది. గతంలో విద్యనేర్పేటప్పుడు వ్యక్తి యొక్క సర్వతోముఖాభివృద్ధిని దృష్టిలో పెట్టుకుని సామాజిక సాంస్కృతిక కుటుంబ గౌరవాలను కాపాడటం కోసం మనదైన విద్య మనదైన రీతిలో నేర్పించేవారు. **పాతకాలపు రచనల్లో పిల్లలకు "విద్యాబుద్ధులు నేర్పించారు"** అన్నవాక్యం కానవస్తుంది. **నేటి సమాజంలో 'విద్య'నేర్పిస్తున్నారే తప్ప, బుద్ధులు నేర్పించటం మానేశారు.** మన శతకాలు వల్లె వేస్తుంటే అవి పిల్లల జీవితాల్లో ప్రతీ పద్యం అడుగడుగునా అన్వయించుకోవటానికి ఉపయోగపడుతుండేవి. నేటి చదువుల్లో ఈ పద్యాలకు తావే లేదు. అన్నీ విజ్ఞానశాస్త్ర గద్యాలే. నేటి తరానికి కావలసింది ఇంగ్లీషు, మ్యాథ్స్, సైన్స్. వారు అసలు కోరుకోవటం లేదు **కన్‌సైన్స్**. అంతా భౌతిక ప్రపంచమే కానీ, నైతికతకు తావులేకుండా పోయింది. ఈరోజు ఏది నేర్చుకున్నా మమకారంతో నేర్చుకోవడం లేదు. కేవలం వ్యాపారం కోసమే. చదువు నేర్చుకునేవాళ్లు, ఆ చదువు నేర్పేవాళ్లు అంతా **ఆ నాలుగురాళ్ల** కోసమే. ఏదో కొద్దిమంది తప్ప, నేటి అధ్యయనం అధ్యాపనం గతానికి భిన్నంగానే వున్నాయి. అధ్వాన్నంగానే వున్నాయి. **మనవాళ్లు రసమయ తెలుగుభాషను వదిలి, రసాయనమయ భాషలను ఒళ్ళంతా పులుముకుంటున్నారు.** మనం మాట్లాడేభాషలు, మన హావభావాలను, మన శరీరతత్వాలను ప్రభావితం చేస్తాయి. ఈ భాషలే మన కుటుంబ గౌరవాన్ని నలుగురికీ తెలియజేస్తుంటాయి. మన తెలుగుభాష మర్యాదమన్నన గల భాష. ఆప్యాయతలకు, గౌరవ మర్యాదలకు, ఆటపాటలకు అనువైన భాష అన్న విషయం మనం ఏనాటికీ మరువరాదు.

ఇక నేడు జరుగుతున్న ప్రపంచ మహాసభలు మన తెలుగు, సంస్కృతి సంప్రదాయాలు, అవధానాలు, సాహిత్య నృత్య ప్రాచీన, నవీన పద్ధతులు గత కాలపు తెలుగుభాష ప్రాభవ వైభవాలు తెలుగువారికే కాక, యావత్ ప్రపంచానికి చూపించాలన్న ఉద్దేశ్యంతో జరుగుతున్నవి. ఈ సభలు తిరుమలగిరిపై కొలువైన తెలుగువారి ఇలవేల్పు అయి అన్నమయ్య పదకవితల కొలనులో స్నానమాడిన కోనేటిరాయుని కొలువులో జరగడం ఎంతో విశేషం. ఏడుకొండలలో నేడు తెలుగుతల్లి పిలుపు ప్రతిధ్వనిస్తుంది.

ఈ ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగుభాషా పరిరక్షణోద్యమానికి, ఓ నూతన తెలుగు శకానికి శంఖారావం. ఇది తెలుగుభాషకు నూ'తన' సంక్రాంతి. ఈసారి మనం తెలుగుప్ర'పంచ' మహాసభలు మహోన్నతంగా జరుపుకోవాలి. మన తెలుగుభాషా వెలుగు అఖండ భూమండలమంతా దశదిశలా వ్యాపించాలి.

**వెలుగు సూర్యుడికి గుర్తింపు. తెలుగు ఆంధ్రుడికి గుర్తింపు అన్న విషయం మనకూ, ప్రపంచానికి తెలియాలి.**

జై తెలుగుతల్లి

జీవన సంజీవని 2

# చిత్రకారుడిగా సంజీవదేవ్

- మాకినీడి సూర్య భాస్కర్



మాయావతి!

గిరిజనుల ఆవాసాల ప్రదేశంలో నిజంగా మాయకు అతీతంగా నిలచి ఉన్న ఒక జ్యోతిర్ఖండం!!

కుమావూ హిమాలయాల్లో మాయావతి వద్దనున్న రామకృష్ణ మిషన్ ఆశ్రమంలో చాల కాలం గడి పారు సంజీవదేవ్. ఆశ్రమం అధ్యక్షులు స్వామి వీరేశ్వరానంద. మిషన్ ఆంగ్ల పత్రిక 'ప్రబుద్ధ భారత్' ఇక్కడి నుంచే స్వామి పవిత్రానంద సంపాదకత్వంలో వచ్చేది. ఆ సంచికలన్నీ ఆపోసన పట్టారు. వీరిరువురూ కాక, ఏడెనిమిది మంది స్వామీజీలుండేవారింకా. వీరందరి సాహచర్యంతో పాటు ఎందరెందరో విదేశీయుల పరిచయాలయ్యాయి సంజీవదేవ్‌కు. ఆయన మాయావతి వచ్చేసరికే ఇద్దరు ఫ్రెంచి విద్వాంసు లున్నారు.

మిషన్‌కు చెందిన స్వామీజీలకు ఇక్కడే ప్రత్యేక శిక్షణనిచ్చి, ఆ తరువాత ఐరోపా, అమెరికాలకు వేదాంత ప్రచారానికి పంపేవారు. ఇక్కడ ఉన్న గ్రంథాలయానికి దేశ విదేశాల పత్రిక లెన్నెన్నో వస్తూండేవి. ఈ ఆధ్యాత్మిక గ్రంథాలయమే సంజీవదేవ్‌ని 'సంజీవదేవ్'గా మార్చిందనడం అతిశయోక్తి కాదు.





అయితే చదవడమేగాని, ఇక్కడ రాయడమేమీ ప్రారంభించలేదు, ఏవో అడపాతడపా చిన్న కవితో, బాల్యమిత్రులకో లేఖో తప్ప. చదివిన కొత్త విషయాన్ని మనసులోనే చర్చించుకుని స్మృతిఫలకం మీద ఎవరికీ కనిపించని లిపిలో నిక్షిప్తం చేసుకునేవారు.

టాగూర్ 70వ జన్మదినోత్సవం సందర్భంగా 1930లో ప్రచురింపబడిన 'టాగూర్ స్వర్ణ గ్రంథం' కంటబడింది. ఈ బృహద్గ్రంథంలో గంభీరమైన వ్యాసాలతోపాటు ఉన్న మనో జ్ఞమైన వర్ణచిత్రాలు సంజీవుని అమితంగా ఆకర్షించాయి. బంగాలీ చిత్రకారుల ఆల్బమ్‌లు కొన్ని, ఒక రోజు చూస్తుంటే, అసిత్ కుమార్ హాల్దార్ చిత్రించిన 'దుర్దినాలలో' అనే చిత్రానికి ఆకర్షితులయ్యారు సంజీవ్. గాలివాన రోజున ఓ చెట్టుకింద లోకంలోని దు:ఖాన్నంతా తానే మోస్తున్నట్లు కూర్చున్న దీనురాలి చిత్రమది, మదిని దోచింది. "కట్ట బట్టలేక, ఉండ ఇల్లు లేక" ఉన్న ఆ దీనురాలు కూర్చున్నా, నిల్చున్నా, నడుస్తున్నా, కనులు తెరచినా మూసినా, ప్రత్యక్షమౌతూ ఉండేది సంజీవదేవ్‌కు. అంతగా కదిలించింది. తరువాత హాల్దార్ రచనలు కూడా చదివారు. హాల్దార్‌తో పరోక్ష సంబంధమేదో







ఏర్పడినట్లనిపించింది. ఒక చిత్రం చూసినా, కవిత చదివినా ఇదే తీరులో తనలో తాను తర్కించుకునే నైజమే సంజీవదేవ్.

బెంగాలీలో హల్దారుకో ఉత్త రం రాస్తే, అటునుంచి చక్కని కాగితంమీద, ప్రేమను కురిపిస్తూ ప్రత్యుత్తరం! దాన్ని చూసి పవిత్రానంద సంతోషిస్తూ, హల్దార్ రవీంద్ర కవీంద్రుని మేనకోడలి కుమారుడని తెలియజేసారు. ఎప్పట్నించో రవీంద్రుని చూడాలనుకుంటున్న కాంక్షకు అసిత్ కూడ తోడయ్యారు.

తన తాతగారైన రవీంద్రుడు ఓ వారం రోజుల్లో తన దగ్గరకు లక్నో రాబోతు న్నారని, తాను తప్పకుండా రావాలనీ, కొంత కాలానికి అసితాహ్వానం అందుకున్నారు, సంజీవదేవ్. చిత్రకారుడు,కవి, వక్త, కళాసమీక్షకుడు అయిన హల్దార్ ఉన్నత మానవత్వం సంజీవ్‌ను కొద్దికాలం అక్కడే కట్టి పడవేసింది. భావ కవితల వంటి ఆయన చిత్రాల్లో కవితలనేకం సంజీవదేవ్ విన్నారు; చిత్రాల్లో కవితలను చూశారు.

ఒకరోజు రవీంద్రుడు బస చేసిన బంగళాకు సంజీవ్‌ని తోడ్కొని వెళ్లారు అసిత్. ఎంతో చక్కగా ముచ్చటించారు టాగూర్. హల్దార్ ఆయన్ను భోజనానికి ఆహ్వానిస్తే, కొన్ని ప్రత్యేక పదార్థాలతో పథ్యంతో జీవిస్తున్నానంటూ, తానిక ఎంతో కాలం బ్రతకనని చెప్పారు టాగూర్. విచార మనస్కులైన అసిత్, ఆ రాత్రి పొద్దుపోయేవరకు బెంగాలీలో కొన్ని తాత్విక సంబంధ రసాత్మక కవితలు– దృశ్యాదృశ్య జగత్తు, వాటి పరస్పర సంబంధ నేపథ్యంతో రాశారు. ముగిస్తూ,

"రేపు పగలు ఈ కవితలకు రేఖల్లో, రంగుల్లో రూప కల్పన చేయా"లన్నారు, హల్దార్.

"ఇటువంటి నైరూప్య విషయాన్ని ఏ విధంగా చిత్రించగలరు?", దేవ్ ప్రశ్న.

"కష్టమేకాని, ఒక ప్రత్యేక పంథాను అనుసరించాలి. అపరిచిత విషయాన్ని పరిచిత రూపాల్లోకి అనువదించి చిత్రించాలి", చెప్పారాయన.

ఇంకా చాలా చెప్పారు. సంజీవదేవ్‌కు ఇవే తొలి పాఠాలు. చిత్రించడం వేరు, చిత్రాన్ని గురించి చెప్పడం వేరన్న విషయాన్ని తెలుసుకున్నారు. ఇవే, సంజీవదేవ్‌ని కవిగా, చిత్రకారునిగా, కళాసమీక్షకునిగా మలచిన బీజాంకురాలు.

'చెప్పడం తెలిసున్నవారు చిత్రించే చిత్రాలు, చెప్పజాలని వారి చిత్రాలకంటె ఎక్కువ బాగుంటాయా?' –విచికిత్స! లక్నో విశ్వవిద్యాలయంలోని కళాసమితి నిర్వహించి అసిత్‌కుమార్ హల్దార్ ప్రసంగాన్ని విన్న సంజీవదేవ్ మరిన్ని కళాంశాలను సుబోధకం చేసుకున్నారు. తుమ్మపూడి వచ్చాకా కూడా, అసిత్ సంజీవుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు సాగుతుండేవి; సంజీవ్ రసజగత్తుకు చైతన్యం ప్రసాదిస్తుండేవి. అలాగే, రష్యన్ చిత్రకారుడు నికొలస్ రోరిక్‌తో ఏర్పడిన 'శాంతి పతాక' స్నేహం కూడా సంజీవదేవ్ కళాభి జ్ఞత పెంపుకు కొంత దోహదపడింది. చంద్రుని పరీమళం, ఈస్టర్ లిలీ పూల వెన్నెల సంజీవదేవ్ సొంత మయ్యాయి.

కలకత్తాలోని ప్రొఫెసర్ ఒ.సి. గంగూలీ గారొకరు, సంజీవదేవ్‌లోని కళామర్మజ్ఞతను చైతన్యపరచారు.

ఈ నేపథ్యమంతా సంజీవదేవ్‌ని ఒక మంచి కళామర్మజ్ఞుడిగా (వివిధ కళల అవగాహనాపరునిగా, సమన్వయకర్తగా–ఈ విషయాలను సందర్భవశాత్తూ వివరిస్తాను)



రూపొందించింది, కాని, రవీంద్రునిలా, చిత్రకళకు ఆలస్య ప్రావేశికులు సంజీవదేవ్. ఆచంట జానకిరామ్‌గారి ప్రోత్సాహంతో సంజీవదేవ్ చిత్ర రచన సాగించే సృజనాత్మక ఘడియ ఒక ఏప్రిల్ మాసంలో వచ్చింది. చిత్రరచనను ప్రారంభిస్తూ, కార్డు సైజులో మినియేచర్ ప్రకృతి దృశ్యాలను, అదీ నీటి రంగుల్లో చిత్రించడం మొదలుపెట్టారు. ముందుభాగం లో సెలయేరు, వెనుక చెట్లు–ఇదీ మొదటి చిత్రం. బండలూ, కొండలూ వస్తువుగా రెండో చిత్రం, సంధ్యా రుణ గగనం, దూరంగా నల్లని చెట్ల పంక్తితో మూడో చిత్రం. ఆ విధంగా అప్పటికి కళాసమీక్షకుడు మాత్రమే అయిన సంజీవదేవ్, అకస్మాత్తుగా ఓ రాత్రి చీకటిని కరిగిస్తూ, తెల్లారేసరికి కళాస్రష్టగా మారారు.

ఇలా మినియేచర్లను చిత్రించడం రోజు రోజుకూ ఒక నిషా అయింది. కన్ను తెరిస్తే దృశ్యం, కన్ను మూస్తే దృశ్యంగా, పది రోజుల్లో అరవై చిత్రాలు గీశారు. ఈ అరవై చిత్రాల్లోనూ దేవ్‌కు నచ్చిన చిత్రం– బంగారు రంగు ఇసుకమీద, పైభాగంలో మొదళ్ళు మాత్రమే కనిపించే తాడి చెట్లూ, మూలగా సాగిన వాటి పొడవాటి నీడలూ! వెలుగు నీడల దోబూచులాట– వర్ణభేద, ఛాయాభేదాలతో సంజీవదేవ్ చిత్రాల్లో బాగా కుదురుకొంది.

1961 ఏప్రిల్‌లో నార్ల అధ్యక్షుడిగా 'ఆంధ్ర అకాడమీ ఆఫ్ ఆర్ట్స్' విజయవాడలో ఏర్పడింది. సమా వేశానంతరం, హాజరైన ఎం.ఎస్. మూర్తి, వేణుగోపాల్,అమంచర్ల గోపాలరావు, శ్రీవాత్సవ, బి.వి.నరసిం హారావు తదితరులెందరో దేవ్ చిత్రాలను చూశారు. మినీయేచర్లు కావడంవల్ల, వాటిని ఒకచోటికి తీసుకు వెళ్లి ప్రదర్శించడం అనే కార్యక్రమం సంజీవదేవ్‌కు ఎంతో తేలికైంది. ఎవరి దగ్గరా అభ్యసించకుండా వేస్తు న్నందుకు ఆశ్చర్యం, అన్ని ప్రకృతి దృశ్యాలు–అవి ఎక్కడివన్న విస్మయం సర్వత్రా వెల్లడయేది. అవి నిజానికి ఎక్కడో ఉన్నవి కావు. అలాగని లేకుండా ఉన్నవీ కావు. ఎప్పుడో, ఎక్కడో చూసిన ఒక దృశ్యం ఆకర్షిం చగా, మనసు కాన్వాసుపై చిత్రింపబడిన చిత్రింపబడని చిత్రం. వాటినే జ్ఞాపకాల్లోంచి వెతికి పట్టి కాగితం మీద బంధించేవారు. తాను చిన్నప్పుడెప్పుడో చూసిన హిమాలయాలను ఆ విధంగానే, నీటిరంగుల్లో ఒక పరంపరగా చిత్రించారు. అప్పటికింకా చిత్రకారుడు కాని పదహారేళ్ళ సంజీవదేవ్, కేవలం చూసి ఆనందిం చటానికి హిమాలయాలకు వెళ్ళారు. చిత్రకారుడైన తర్వాత, కలిగిన ఆ ఆనందం పదిలపరచిన స్మృతిబిం బాల్ని, కొన్ని దశాబ్దాల తర్వాత కాగితంమీద చిత్రాలుగా తిరిగి పదిలపరచారు.

క్రమేపీ, సైజు పెంచుకుంటూ, ప్రకృతి చిత్రణనే, అస్పష్టమైన మానవమూర్తుల ఆకృతులతో నింపనా రంభించారు. ఆకుపచ్చని పచ్చికబయుల్లో ఒక ఎర్ర చీరతో ఉన్న స్త్రీమూర్తి...సాంధ్యరాగంలోని అరుణవర్ణాల మధ్య ఆకుపచ్చని వస్త్రం ధరించిన ఒక వ్యక్తి...ఇలా ఉండేవా చిత్రాలు. ఇక్కడ ఒక విషయం తప్పక ప్రస్తా వించాలి. చిత్రకారుడు కావటానికి ముందే ఉత్తమ కళావిశ్లేషకుడు, అత్యుత్తమ వర్ణవిజ్ఞానవేత్త సంజీవదేవ్. అందుకే, ఆ ఎరుకతోనే తన చిత్రాలను నిర్మించేవారు. ఎరుపు,





ఆకుపచ్చ రంగులు ఒకదాని కొకటి పూర కాలు. పూరకవర్ణాలతో చిత్రరచన చేస్తే ఎలా ఉంటుందో (బావుంటుందని తనకెటూ తెలుసు) చూపడానికే పై రెండు చిత్రాలను రచించి ఉంటారాయన. ఈ విధంగా సంజీవదేవ్ చిత్రరచనలో కొంత ప్రాయోగిక కోణం కూడ కనబడుతుంటుంది. ఎడారి అవతల నీల పర్వతం–ముందుభాగమంతా గోధుమరంగు ఇసుక, మిట్ట పల్లాలతో. దూరాన నీల పర్వతం. ఎండుటెడారిని చూసి విసిగిన కంటికి కొంచెం పైకి వెళ్ళే సరికి చల్లగా తట్టే నీల పర్వతం; ఒక విసర్గ సౌందర్యం. గోధుమరంగు ఉష్ణవర్ణాల మిశ్రమమైతే, దానికి విరుద్ధంగా, నీలం పూర్తి శీతల వర్ణం కావడమే ఈ దృశ్య వైచిత్రికి కారణం.



*1960లలో అద్దేపల్లికి ఉత్తరం రాస్తూ సంజీవ్‌దేవ్ పంపిన చిత్రం*

మోడు చెట్లను చిత్రించడమే సంజీవదేవ్‌కు అధికమైన ఇష్టం. ఆకులున్న చెట్లు ఆకాశ శోభను మూసివేస్తాయనేవారు. నిండుగా ఆకులున్న చెట్టెంత సుందరంగా ఉంటుందో, పూర్తిగా ఆకులు రాల్చిన చెట్టూ అంతే సుందరంగా ఉంటుందనేవారు. తన చిత్రాల్లో ప్రకృతిని నిసర్గంగా చూపుతూనే, దాన్ని కొంత విసర్గంగానూ చూపడాన్ని ఇష్టపడేవారు సంజీవదేవ్. ఎత్తైన పర్వతం, కింద మైదానంలో చిన్న మానవ మూర్తి...పర్వతం ఎత్తు ద్విగుణీకృతమై కనిపిస్తుంది; అంతే కాదు, ఆ పర్వతంతో పోలిస్తే మనిషి అస్తిత్వం ఎంత స్వల్పమైందో కూడా బాగా స్ఫురిస్తుంది. ప్రకృతి ముందు మనిషి అల్పుడేనన్న వాస్తవం ఈ చిత్రం.

లేఖారచనతో సమాంతరంగా చిత్రరచన సాగించేవారు సంజీవదేవ్. నిత్యం రాసే ఉత్తరాల్లో, ఒక చిత్రాన్ని పెట్టి పంపడం అలవాటయింది. చిత్రకళ మంచిచెడులేమీ తెలియనివారిని సైతం ముగ్ధులను చేసిన ముచ్చటైన బుల్లిబుల్లి చిత్రాలవి. చిత్రాన్ని చూసి ఆనందించేవారు అధికంగానే ఉంటారు. అయితే, అది ఎందుకు ఆనందాన్నిస్తుందో వారికి తెలియకపోవచ్చు. చిత్రకళ గురించి ఏమీ తెలియని వారు కూడా, లేఖతో పాటు రేఖనో, వర్ణ చిత్రాన్నో అందుకున్నాకా, అంతకు ముందు అందుకున్న వాటికంటె ప్రస్తుతం అందుకున్నది బాగుందా, అవే బాగున్నాయా, కారణమేమిటి అనే మీమాంసలో పడి, కొన్ని సమాధానాలను కనుగొన్న సందర్భాలనేకం ఉన్నాయి. చిత్రకళ గురించి, దాని నిర్మాణ మర్మాల గురించి ఎందరినో ఆలో చింపజేశారు, తన రేఖా, వర్ణచిత్ర సహిత లేఖలతో సంజీవదేవ్. ఎప్పుడైనా, ఎవరికైనా చిత్రం ఉంచకుండా వట్టి లేఖ పంపితే, వెంటనే అటునుంచి విచారం వ్యక్తం చేస్తూ సంజీవదేవ్‌కు ప్రతిలేఖ వచ్చేది. అంతగా చిత్రకళా చైతన్యంతులుగా మార్చారు తన సమకాలీన కవి, రచయితలను, స్నేహితులను సంజీవదేవ్.

కార్డు సైజునుంచి చిత్రాలు పెద్దపెద్దవయ్యాయి. నీటిరంగుల స్థానే రంగుల ప్యాస్టళ్ళు, నూనె రంగులు చోటు చేసుకున్నాయి. కుంచె స్థానాన్ని అప్పుడప్పుడూ ప్యాలెట్ నైఫ్ భ్రంశం చేస్తాండేది. తర్వాత్తర్వాత రూపం విరూపం అయింది కొంతవరకు. ఏ రంగుల్లో, ఏ మాధ్యమాల్లో, ఏ సంవిధానంలో చిత్రించినా, సంజీవదేవ్ చిత్రాల మౌలిక లక్షణం ఒకటే. చూసే కంటికి కాంతినీ, మనసుకు శాంతినీ, హృద యానికి క్రాంతినీ కలిగిస్తాయి, సంజీవదేవ్ చిత్రాలు.

*email: makineedi.writer@gmail.com*

**94915 04045**